# దాశరథి రంగాచార్య రచనలు

## మూడవ సంపుటం

# జ న ప ద ం




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం. : 2003

ప్రథమ ముద్రణ : 1976

ప్రతులు : 1000

వి.పి.హెచ్. ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1997



టైటిల్ డిజైను : చంద్ర

వెల : రూ. 120-00

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

విశాలాంధ్ర బుక్ హౌస్

హైదరాబాద్, విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం,
అనంతపురం, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.

---

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ - 520 004

ఉద్యమం ఊపిరిగా
రచనలు చేసిన
ప్రజల మనిషి
వట్టికోట ఆళ్వార్‌స్వామికి

రానున్నాయి ! త్వరలో !!

# దాశరథి రంగాచార్యగారి సృజనాత్మక సాహిత్యం

**5** సంపుటాల్లో

★ మొదటి సంపుటం : చిల్లర దేవుళ్ళు,
పావని, దేవదాసు.

★ రెండవ సంపుటం : మోదుగుపూలు,
మానవత + శరతల్పం

★ నాల్గవ సంపుటం : మాయ జలతారు,
రానున్నది ఏది నిజం,
నల్లనాగు.

★ ఐదవ సంపుటం : జీవనయానం.

సీతారాంపురం
విజయవాడ-4
1-3-1974

మిత్రులు రంగాచారి గారికి,

అభివందనాలు. ఈ రోజు "ఆంధ్రజ్యోతి" వారపత్రిక సంచికలో మీ సీరియల్ నవల "జనపదం" చదివాను. పూర్వ స్మృతులన్నీ ఒకేసారి Flash Back ఐనట్లుగా ఉత్తేజితుడనయ్యాను. "చిల్లర దేవుళ్ళు", "మోదుగుపూలు" లాంటి ఉత్తమ రచన ప్రబంధాలకు ఉన్నత శిఖరంగా వెలుగొందబోతున్న కళాఖండంగా నాకు ద్యోతకమయింది. మీ రచనలో నేను చదివింది స్వల్ప భాగమే. ఐనప్పటికీ మిమ్ము లను మనస్ఫూర్తిగా అభినందించడానికి కారణాలివి:—

స్వగ్రామంలోని గడీకి తిరిగివస్తున్న దేశముఖ్ బలరామయ్య దొర ఆలోచన లను, మొరిగే కుక్కలను కాల్చిన పోలీసులను చక్కగా చిత్రించారు. పాడుపడిన గడీలోకి ప్రవేశించగానే ఎదురైన కబోదు గబ్బిలం, పడకటింటిలో మూల పిల్లలు కన్న పిల్లి ఆత్మరక్షణ పోరాటం—సింబాలిక్‌గానూ, సహజత్వం వుట్టిపడేలాగానూ వున్నాయ్. గోడప్రక్కన గుడిశెలో కుక్కి మంచంపై శల్యావశిష్టమై దగ్గుతో బాధ పడుతున్న అమృతవాణి, ఫ్యూడల్ వ్యవస్థకు బలియైపోయినప్పటికీ ఆమెలో మిగిలి వున్న మానవత్వం - బలరామయ్యలో గూడుకట్టుకున్న క్రూరత్వం - రెండూ కూడ నాటి సమాజానికి చిహ్నాలే. జగ్గయ్యను కొట్టి, తన్ని—వెట్టి చేయించడం, గడీని శుభ్రం చేయించడం, జగ్గయ్య ఆలోచనలు గొప్పగా చిత్రీకరించారు.

మరొకసారి ధన్యవాదాలర్పించుతున్నాను. సీరియల్ పూర్తిగా చదివాక మీకు మరల సింహావలోకనం చేస్తూ జాబు వ్రాయగలనని ఆశించుతాను.

శుభాశీస్సులతో

మద్దుకూరి చంద్రశేఖరరావు

1-3-74

# దాశరథి రంగాచార్య నవలలు ఒక విహంగ దృష్టి

—వేమూరి వెంకట్రామయ్య.

మన నవలారచనను నేడు ఒక కొత్త మలుపుతిప్పి, కొత్త వెలుగును చూపిస్తున్న రచయిత శ్రీ దాశరథి రంగాచార్య.

ఇంతవరకు ఈయన ప్రకటించిన నవలలు "చిల్లర దేవుళ్ళు", "మోదుగుపూలు". ఇందలి మొదటి నవల సాహిత్య అకాడమీ వారి వేయినూటపదహారు రూపాయల బహుమతి పొందింది. ఈయన రెండవ నవల "మోదుగుపూలు" వాసిలోను రాశిలోను మొదటిదానికి ఏమాత్రం తీసిపోదు.

"జనపదం" మూడవ నవల. దీనితో మూడు నవలలు తెలంగాణ ప్రజాజీవిత వాస్తవములకు అద్దం పట్టినవి.

నిజాం ఆసఫ్జాహి పాలకులు, వారి ఏజంట్లయిన జాగీర్దారులు, నిరంకుశులైన వారి చిల్లర ఉద్యోగులు - వారి పాలనలో తెలంగాణా ప్రజలు అనుభవించిన బాధల గాథల బృహత్ రూపదర్శనమే వారి నవలలకు ఇతివృత్తములు.

వారి మూడో నవల "జనపదం" తెలంగాణా విముక్తికి తరువాత పాత సారాయాన్ని కొత్త సీసాల్లో అందిస్తున్న మన దేశవాళీ రాజకీయాల ప్రభావాన్ని వివరిస్తున్న గాథ.

గత శతాబ్దాంతమున మహాకవి గురజాడ తన "కన్యాశుల్కం"లో సమగ్రాంధ్ర ప్రజాజీవితాన్ని దర్శింప జేసినట్లుగానే ఇప్పుడు ఆచార్యులవారు తమ రచనల్లో సమగ్ర తెలంగాణమును దర్శింపచేశారు.

గ్రామవెట్టి లగాయతు రాష్ట్ర పాలనలో భాగస్వాములైన అమాత్యుల వరకు వివిధ విభిన్న మనస్తత్వాల ప్రతినిధులు ఆయన రచనల్లో మనకు దర్శన మిస్తారు.

వారి రచనల్లోని ఇతివృత్తము ఒక వ్యక్తికిగాని, ఒక కుటుంబానికి గాని, ఒక సాంఘిక దోషానికిగాని సంబంధించింది కాదు. తెలంగాణా విరాట్‌రూప దర్శనమే వారి రచనలకు మూలం.

శతలక్ష తెలంగాణా పౌరుల బాధల గాథలే ఈ నవలారచనకు రూపకల్పన-చరిత్రహీనులకు చరిత్ర. రచయిత రంగాచార్య మూగవాళ్ళను పలికిస్తున్నాడు. వారి కలం బలిమిచేత పునరుజ్జీవనం పొందినవారు ముక్కోటి ఆంధ్రులకు తమ

దీనగాధలను వివరిస్తున్నారు. అయితే తరతమ భేదమేగాని ఈ పరిస్థితుల బయట ఉన్నవారెవరు?

పాఠకులను ప్రభావితులను చేయడంలో "గోర్కీ" రచనలు ఎంత బలవత్తరములైనవో ఆచార్యుల రచనలు కూడా అంత శక్తివంతములైనవి.

ఈయన రచనలు చదువుతూ ఉంటే "ప్రేమచంద్" "గోర్కీ" "షేవడే" నవలలు చదువుతూ ఉంటే కలిగే అనుభూతులన్నీ సమష్టిగా కలుగుతాయి.

ప్రతాపరెడ్డిగారు "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" వ్రాశారు. మరి ఎంతోమంది చరిత్రను నవలల పేరుతో వ్రాశారు. నిజమే. అది గత చరిత్ర. చరిత్ర కది భూతకాల రూపము కావచ్చును. రంగాచార్య రచనలు నేటి జనజీవిత దుఃఖపరిణామముల ప్రతిరూపములు.

ఈయన నవల లన్నింటిలోను తెలంగాణములోని పాత్రోచిత భాషనే ప్రయోగించడం జరిగింది. అందుచేత ఎంతో సహజ సుందరంగా ఉంటుంది ఆయన శైలి.

స్వభావ చిత్రణలో, కథాకథనంలో, రచనా శిల్పంలో ఆ దేశసూత్రాలకు అనుగుణమైన విధంగా పాఠకుని ఔత్సుక్యమును పట్టి నిలుపుటలో ఆయన కృతకృత్యుడైన రీతి సామాన్యమైనది కాదు.

అరచాటుగా చెట్టుమాటున దాగిన ఒక ఆకారమువలె, కాలజ్ఞాన తత్త్వంతో కూడిన ఒక కర్తవ్య నిష్ఠ, ఒక సందేశం, ఒక ప్రబోధము ఆయన రచనాశిల్పం మాటున ఉండి తొంగిచూస్తూంది.

"ఆచరణోన్ముఖ ఆదర్శవాదం" ఆయన రచనల్లో ప్రతిబింబించింది- అని ఒక విమర్శకుడు "ప్రేమచంద్" ను గురించి వ్రాశాడు. ఈ మాటలు ఆచార్యులకు వర్తించగలవేమో పాఠకులు ఆలోచించాలి.

ప్రజలకోసం భిన్నమార్గాలలో కలం పట్టిన వేమన్న, వీరేశలింగం, గురజాడ, శ్రీశ్రీల కోవలో నిలుస్తాడు రంగాచార్య.

తాము తమ కంటియెదుట నగ్నరూపంలో చూస్తున్న కష్ట నిష్ఠురాలను, మానావమానాలను, విభిన్న వైరుధ్యాలను మనోయోగంలో అద్వితీయ రూపముగ దర్శించి, కళారూపములనిచ్చిన ద్రష్టతా స్రష్టలు వారంతా. రంగాచార్య ఆ కోవకే చెందుతాడు.

ఎన్నోరకాల వ్యక్తులను, పరిస్థితులను, ఒకే వ్యక్తిలోని విభిన్న దృక్కోణాలను, పరిస్థితుల ప్రాబల్యాలను, ఆ పరిస్థితుల ప్రాబల్యంలో గాలితాకిడికి ఆకులవలె కొట్టుకొనిపోయే అల్పబుద్ధులను హేతుజ్ఞానంతో, తాత్త్విక దృష్టితో, నిబ్బరంగా పరిస్థితుల ప్రాబల్యానికి తలవొగ్గక, ప్రతిఘటించి, న్యాయంకోసం కర్తవ్యనిష్ఠతో పోరాడే మహితశక్తులను రంగాచార్య సృష్టించినాడు.

మంచివారుగాని చెడ్డవారుగాని మానవులందరిని గురించి ఆయన ఒక తాత్త్విక దృష్టితో ఆలోచిస్తాడు. ఆయన చిత్రించిన పాత్రలను గురించి మనం ఆలోచించి

నప్పుడు ఈ విషయము మనకు బోధపడుతుంది. మానవులెవ్వరూ జన్మతో మంచి వారూకారు. చెడ్డవారూ కారు. వారెట్టివారైనా వారివారి పరిస్థితుల వల్లనే వారివారి వ్యక్తిత్వ నిర్మాణములు జరుగుతూ ఉండును. వివిధ మత, సాంఘిక కౌటుంబిక పరిస్థితులే మన వ్యక్తిత్వ నిర్మాణమునకు ప్రబల సాధనములు. గనుక మానవునిలోని మానవత్వం నిండుగా ప్రకాశించడానికి, దానవత్వం నశించటానికి అవసరమైన స్థితిగతులను గుర్తించి సంఘంలో ఎరగవలసిన సమూల సంస్కారమునకు ప్రజలందరూ తమకు తామే సంసిద్ధులు కావలసి యున్నది. అట్లు కానినాడు ధనాధికారుల చేతులలో ప్రజలు తమ కనీస హక్కులను, తమ శరీరములను, ఆత్మలను ఆ శక్తులకు బలిచేయక తప్పదు. ఇదే ఆయన రచనల సందేశం.

ప్రఖ్యాతినొందిన నవలా రచయితలైనవారు గూడ కొందరు వర్ణనలలోను, సంభాషణలలోను సంయమనం లేకుండా విశృంఖలంగా పేజీలకు పేజీలు పెంచి వ్రాయడం నవలలు చదివేవారందరికి తెలిసినదే.

సంక్షిప్తత, సంయమనం ఆచార్యుల రచనలలోని విశిష్టత. అందుచేత ఆయన నవలలు వాసిలో గొప్పవైనా రాశిలో చిన్నవి. ఆయన రచనలు సత్యదర్శనం కావించి మార్గనిర్దేశము చేయును.

శరత్ నవలలను గురించి ఒక పాఠకుడు "ఆయన రచన యనే వీణకు ఒకటే తీగ. దానిపైననే ఆయన అన్ని రాగాలు వాయిస్తాడు" అన్నాడు. ఆచార్యుల రచనలకు కూడా ఈ మాటలు వర్తించవచ్చుననుకుంటాను.

శరత్, కరుణాకాతర కథాశిల్పి. సంఘ వంచితులపట్ల పాఠకుల మనసులో ఒక ఆర్ద్రత, సంవేదనా కలిగిస్తాడు. ఈ ప్రత్యేకత ఆచార్యుల రచనల్లోనూ వున్నది. అతిగకుల గొంతుల్ని ఆయన ప్రతిధ్వనిస్తున్నాడు. అది చాలా బలమైన ధ్వని.

గాంధీయుగంలోని సంపూర్ణ సాంఘిక జీవనమును ప్రేమచంద్ రచనలు ప్రతిబింబించినట్లు తెలంగాణా జనజీవితమును, నేటి పాలనలోని లోగుట్టును ఆచార్యుల రచనలు చాటుతున్నవి.

ప్రసిద్ధ మరాఠీ నవలా రచయిత శ్రీ అనంత గోపాల షేవడే రచనల శ్రేణికి చెందినవే శ్రీ రంగాచార్య నవలలు. అవి కాల పురుషుడు ప్రజలకు చేస్తున్న మేల్కొలుపులు.

శరత్ 'బడదీది' మొట్టమొదటి వంగభాషలో ప్రకటింపబడినప్పుడు రవీంద్రుడిలా అన్నాడట :—

"నన్ను మించిన నవలా రచయిత ఎవరో వంగ వాఙ్మయంలో ప్రవేశిస్తున్నాడు" అని.

అలాగే ఆచార్యుల నవలలున్నూ పాఠకులకు నూతన ద్వారాలు తెరచి క్రొత్తవెలుగును చూపించ గలవు.

(13-7-75 నాటి "ఆంధ్రజ్యోతి" సచిత్ర వార పత్రిక నుండి.)

# మనసు మాట

తెలంగాణా ప్రజాజీవితం విచిత్రం అయింది. విశిష్టం అయింది. విప్లవాత్మకం అయింది. 'బానిసను కాళ్ళు మొక్కుతా' అని శతాబ్దాలపాటు బానిసగా జీవించిన బక్కరైతు నిజాం నవాబుకు ఎదురు తిరిగాడు. "గోలకొండ కిల్లకింద గోరి కడ్తా" నని ప్రతిన బూనాడు. 'ముసలి నక్క'ను గద్దెదించాడు.

అలాంటి తెలంగాణ ప్రజాజీవితాన్ని వస్తువుగా నవలా రచనకు పూనుకున్న ఆద్యుడు "ప్రజల మనిషి" వట్టికోట అళ్వార్‌స్వామి. వారు "ప్రజల మనిషి" నవల రాశారు. "గంగు" అసంపూర్ణంగా వదిలి 1961 లో పరమపదించారు. అది తెలుగు వారి దురదృష్టం. ఆళ్వార్‌స్వామిగారు అసంపూర్ణంగా వదలిపోయిన ఉద్యమాన్ని ఎవరైనా కొనసాగిస్తారని ఆశించాను. ఎవరూ ముందుకు వచ్చినట్లు కనిపించలేదు.

ఎవరూ ముందుకు రాలేదు. అలాంటి నవలలు వస్తున్నట్లు కనిపించలేదు. ఆళ్వార్‌స్వామి ఉద్యమాన్ని కొనసాగించటానికి సంకల్పించాను. చాల భయపడుతూ నవలారచనకు పూనుకున్నాను. "చిల్లర దేవుళ్ళు" రాశాను. కీర్తిశేషులు నార్ల చిరంజీవి, పూజ్యులు దేవులపల్లి రామానుజరావుగారి ప్రోత్సాహంతో "చిల్లర దేవుళ్ళు" ప్రచురించాను. తెలుగు ప్రజానీకం దాన్ని ఎంతో ఆదరించింది.

1938 కి పూర్వపు ప్రజా జీవితాన్ని చిత్రించాను 'చిల్లర దేవుళ్ళ'లో. "ప్రజల మనిషి" "చిల్లర దేవుళ్ళు" సుమారు ఒకే కాలాన్ని చిత్రిస్తాయి. 1938కి పూర్వపు కాలాన్ని ఎన్నుకోవడానికి కారణం అప్పటివరకూ తెలంగాణంలో రాజకీయోద్యమం లేదు. నిజాం నవాబు రాజకీయ పార్టీలను అనుమతించలేదు. 1938 లో హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెసు ఏర్పడింది. నిజాం ప్రభుత్వం వెంటనే నిషేధించింది.

ఆ తరువాత ప్రజాజీవిత చిత్రణకుగాను "మోదుగుపూలు" నవల వ్రాశాను. "మోదుగుపూలు" నవలా కాలం సుమారు 1942 నుంచి 1948 వరకు. "ఆంధ్ర మహాసభ" ఉజ్వలమైన ఉద్యమం నిర్మించిన కాలం ఇది. పత్రిక తెచ్చినందుకు దెబ్బలు కొట్టిన ప్రభుత్వ దౌర్జన్యంతో మొదలవుతుంది నవల. ప్రజలు తుపాకులు అందుకొని ప్రభుత్వాన్ని కూలదోయటంతో అంతం అవుతుంది.

"చీకటి తెరలు ఎక్కడికక్కడ విచ్చిపోతుంటే, ప్రాభాతమందానిలంతో కలిసి ఉషాదేవి అవతరించింది." అనేది "చిల్లర దేవుళ్ళు" లో చివరివాక్యం. ఆ ఉషోదయమే "మోదుగుపూలు"లోని ఉద్యమం.

"కులశేఖరరావు, రంగారెడ్డి ఖద్దరుధారులై దిగారు.

సాగిపోతున్నాడు రఘు

మార్గం సుదీర్ఘం

భూమి గుండ్రం"

ఇది "మోదుగుపూలు" ముగింపు.

"మోదుగుపూలు" ముగింపు "జనపదం" ప్రారంభం అవుతుంది. "జనపదం"లో దిగినవారి పేర్లు వేరు. అవే పాత్రలు, అదే కథాసంవిధానం కొన సాగించకపోవడానికి కారణాలు అనేకం ఉన్నాయి. వాటన్నింటిని పేర్కొని విసిగించడం నా లక్ష్యం కాదు.

1948 నుంచి సుమారు 1967 వరకు కాలాన్ని చిత్రించడానికి చేసిన ప్రయత్నం "జనపదం". భూమి గుండ్రం. అలాగే ఉద్యమాలు గుండ్రంగా తిరిగి ప్రారంభం అయిన బిందువు దగ్గరికే చేరుకున్నాయి. ఇది ఇరవై సంవత్సరాల కాలం. ఈ వ్యవధిలో అనేక పరిణామాలు వచ్చాయి. అవన్నీ మనకు తెలిసినవే. అందరికీ తెలిసిన వాటికి కళారూపం కల్పించడం కత్తిమీద సాము లాంటిది.

ఈ రెండు దశాబ్దాల్లో అనేక ఉద్యమాలు వచ్చాయి— అన్ని రంగాల్లోనూ కొత్త నమ్మకాలూ, కొత్త విశ్వాసాలూ ప్రబలాయి. అలాంటి విశ్వాసాలకు ప్రతీకలుగా పాత్రల్ని సృష్టించడం నా సంకల్పం. ఎంతవరకు చేయగలిగానో నిర్ణయించాల్సింది మీరు. ఎన్ని ఉద్యమాలు వచ్చినా, విపత్తులు వ్యాపించినా తామరాకుమీది నీటి బొట్టువలె అంటక ముట్టక ఉన్న పాత్ర ఒకటుంది. ఆమె సుమతి—మన సాంప్రదాయక జీవితానికి ప్రతీక.

"జనపదం" ముగింపు "రానున్నది ఏది నిజం"కు నాంది.

"రానున్నది ఏది నిజం"లో భారతదేశ భవిష్యత్తును గురించి మనం కంటున్న బంగారు కలల్ని చిత్రించాను. నేను ఆశావాదిని. అది ఒక ఊహాత్మక చిత్రం. ఒక కల. కల నిజం అవుతుందనే విశ్వాసం.

1938కి పూర్వం నుంచి భవిష్యద్భారత దర్శనం దాకా సాగిన, సాగుతున్న, సాగనున్న ప్రజాజీవన ప్రవాహాన్ని నవలలకు ఎక్కించడానికి ప్రయత్నించాను. ఈ వరసలో మరో రెండు నవలలు రాయాలనే సంకల్పం ఉంది. ఒకటి "దశాబ్దం" 1938 నుంచి పదేళ్ళ ప్రజాపోరాట చిత్రం. రెండోది "అగ్గిదుమారం" తెలంగాణ సాయుధ సమర చరిత్ర. సరియైన ప్రోత్సాహం లభిస్తే ఆ రెండు నవలలూ రాయగలననే ఆశ ఉంది.

"జనపదం" రచన 30-5-1970న ప్రారంభించి, 20-8-1974 న ముగించాను. నాలుగు సంవత్సరాల నిరంతర కృషిఫలితం "జనపదం".

"జనపదం" మూడు భాగాలు 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వార పత్రికలో సీరియల్‌గా వచ్చాయి. మిత్రులు శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు అందుకు బాధ్యులు. వారికి నా మీద అభిమానం ఉంది. "జనపదం" విషయంలో శ్రద్ధ ఉంది. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

"జనపదం" ప్రచురిస్తామని ముందుకు వచ్చారు మిత్రులు సాంబశివరావుగారు. వారి ఉత్సాహం నన్ను ప్రోత్సహించింది. ఇది నవయుగ ప్రచురణ. వారికి నేను కృతజ్ఞుణ్ణి.

"జనపదం" మీ ముందుంది. బాగోగులు నిర్ణయించవలసిన వారు మీరు.

మీ సహకార సద్భావాలు ఆశించే

సికింద్రాబాదు — మీ

27–5–1976 — దాశరథి రంగాచార్య

# దశాబ్దాలు దాటిపోతున్నాయి

"జనపదం" తొలిముద్రణ జరిగి రెండు దశాబ్దాలయినాయి. ఈ రెండు దశాబ్దాల్లో రాష్ట్రంలో, దేశంలో, ప్రపంచంలో అనేక మార్పులు వచ్చాయి. వాటిలో కొన్ని ముందడుగులు - కొన్ని వెనకడుగులు.

24-8-76 నాడు హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో 'జనపదం' ఆవిష్కరణసభ జరిగింది. దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించారు. ఆవిష్కరించారు. అడపా రామకృష్ణారావుగారు, వాసిరెడ్డి సీతాదేవిగారు ప్రసంగించారు.

ఆ సభలో మా అన్నయ్య కీర్తిశేషులు దాశరథి ఉండడం నా అదృష్టం. ఆ రోజు నా జన్మదినం అని ప్రకటించి అన్నయ్య సభను ఆశ్చర్యపరచారు. అన్నయ్య "జనపదం"కు అర్థాలు వివరించారు.

జనపదం అంటే పల్లె. జనపదం అంటే జనవాక్యం. జనపదం అంటే ప్రజల అడుగు. జనపదం అంటే జనులు చేరుకోవలసిన లక్ష్యం లేక స్థానం.

'జనపదం,' ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో సీరియల్ మొదలు కాగానే పూజ్యులు మద్దుకూరి చంద్రశేఖరరావుగారు నన్ను అభినందిస్తూ లేఖ వ్రాశారు. దాని ప్రతిని గ్రంథంలో చేరుస్తున్నాను. తరువాతవారు పరమపదించారు. వారు జనపదం పూర్తిగా చదవలేకపోవడం నా దురదృష్టం.

డాక్టర్ **D. M.** ప్రేమావతి 'దాశరథి రంగాచార్య రచనల్లో జనపదం' అనే పరిశోధక వ్యాసానికి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టా తీసుకున్నారు. అది పుస్తకంగా ప్రచురించబడింది. 24-8-88 న నా షష్టిపూర్తి అభినందన సభలో ఆవిష్కరించబడింది.

విశాలాంధ్ర ప్రచురణాలయం వారు "జనపదం" రెండవ ముద్రణ వెలువరిస్తున్నారు. వారికి కృతజ్ఞుణ్ణి.

సికింద్రాబాదు
13—9—1996

దాశరథి రంగాచార్య

# జనపదం

..................................................

ఇరుకు దారి, బండ్లబాట, మిట్టపల్లాలు, బాటకు ఇరువైపులా పచ్చని పంట పొలాలు ఏపుగా పెరిగి వున్నాయి. బండ్లు సాగిపోతున్నాయి. మొదటి బండిలో సాయుధ పోలీసులు, రెండవ బండిలో బలరామయ్య. వారి వెనుక మళ్ళీ కొన్ని బండ్లున్నాయి. వాటినిండా సాయుధ పోలీసులున్నారు. బండ్లు మెల్లగా సాగుతున్నాయి. ఎడ్లు మందమందంగా నడుస్తున్నాయి. అప్పుడే సూర్యుడు నెత్తిమీదికి వచ్చాడు. త్వరగా ఊరికి చేరాలని ఆతురతపడుతున్నారు బలరామయ్య. వారు రెండు సంవత్సరాల తరువాత వస్తున్నారు తమ ఊరికి - తమ రాజ్యానికి.

బండి ఒక రాతిని ఎక్కింది. పడింది. కుదిపింది. బలరామయ్య చాలా బాధపడ్డాడు. తాను రెండు జతల ఎడ్లను ఎప్పుడూ మేపుతుండేవాడు తన కచ్చడానికి. బండికి కడ్తే వాటిని ఆపడం ఎవరితరమూ అయ్యేది కాదు. తాను బయలుదేరాడంటే ఊరంతా హడలిపోయి తప్పుకునేది. బండి ముందు ఒక చాకలి పరుగెత్తాలి. వెనుక సామాను నెత్తిన పెట్టుకొని మరొకరు పరుగెత్తాలి. పరిగెత్తలేకుంటే చచ్చాడన్నమాటే. ఒకసారి అమీనూ, తానూ కచ్చడంలో పోతున్నారు. ముందు నడిచే చాకలికి ఏమైందో తెలియదు. ఎందుకు మెల్లగా నడిచాడో తెలియదు. ఎడ్లు పరుగెత్తాయి. వాణ్ణి తొక్కేశాయి. బండి చక్రం వాడిమీదనుంచి పోయింది. వాడు చచ్చాడని చెప్పాడు బండివాడు. బండి ఆపొద్దన్నాడు తాను. వాడి శవం అక్కడే పడిపోయింది. అలా ప్రభుత్వం చేశాడు తాను. అయినా ఒక్కసారి ఇగిరిపోయింది ప్రభుత్వం. ఎగిరిపోయింది. తాను ఊరే వదలిపోవాల్సి వచ్చింది. ఇప్పుడైనా పోలీసు చర్య జరిగింది కాబట్టి పోలీసులు తనవెంట ఉన్నారు కాబట్టి రాగలుగుతున్నాడు. నైజాం నవాబు వట్టి బలహీనుడు. తనకు రక్షణ కల్పించలేకపోయాడు. భారత ప్రభుత్వం మంచిది. అందుకే తనకు పోలీసులనిచ్చి పంపుతూంది. తాను ఖద్దరు కట్టలేదూ మరి.

బలరామయ్య బండిలోంచి తొంగి చూశాడు. ఏపుగా పెరిగి ఉన్నాయి పొలాలు. పొట్టకు వచ్చాయి. ఈ పొలాలన్నీ తనవే. అయినా రెండు సంవత్సరాల నుంచి తనకు గింజ రాలేదు. తుపాకులవాళ్ళు వచ్చారు. భూములన్నీ పంచిపెట్టారు. ఇక తనకు దక్కవనుకున్నాడు. వాళ్ళు పొలాలువేసి సిద్ధంగా పెట్టారు. ఖర్చు

లేకుండా శ్రమ లేకుండా ఈ సంవత్సరం పంట వస్తుంది. పంటంతా తనది. భూములన్నీ తనవి. పంచినవారిమీద పగ తీర్చుకోవాలి. దున్నినవాని దుంప తెంచాలి. మళ్ళీ తన ప్రభుత్వం సాగించాలి.

"సాగుతుందా?"

మనసులోనిమాట బయటకే వచ్చేసింది. బండ్లో ఎవరూ లేరు - వినలేదు. ఎందుకా అనుమానం వచ్చింది తనకు! పోలీసులను బాగా మేపాలి! బండ్లో రెండు సారాయి జాడీలు కనిపించాయి. చాల్తాయా? మరో బండిలో మేకలు "మేమే" అన్నాయి. తాను కావాలంటే వంద మేకలు గడీముందు తెగేవి. ఇప్పు డెవడిస్తాడు? అవసరం అవుతే తెప్పించా లనుకున్నాడు.

బండ్లు సాగుతున్నాయి, ఊరిముందుకు వచ్చేశాయి. పోలీసులు తుపాకులు సర్దుకున్నారు. లక్ష్యం తెలియని గురిపెట్టారు. నడిచారు. ఊళ్ళోకి ప్రవేశించారు. బిక్కుబిక్కు మంటూంది. పిట్టలులేని గూళ్ళలా ఉన్నాయి ఇళ్ళు. చడీ చప్పుడు లేదు. ఒక్క మనిషి కనిపించటంలేదు. ఆవురుమంటూంది. అంతా నిశ్శబ్దం. ఊళ్ళోంచి సాగుతున్నాయి బండ్లు. ఒక కుక్క ఏడ్చింది. ఒకటి మొరిగింది. గుండెలు దడల్లుమన్నాయి. తుపాకులు పేలాయి. రెండు కుక్కల రక్తం సొద సొద కారింది. చూశాడు బలరామయ్య. చూశారు పోలీసులు. నవ్వుకున్నారు. ఎందుకంత భయం? ఏమిటో వారికీ అర్థంకాలేదు. గుండెలు పీచుపీచుమంటు న్నాయి. ఏమాత్రం చప్పుడైనా అదిరిపడుతున్నారు.

పొద్దు వాలింది. మూడుజాములైంది. దొరవారి గడీముందు ఆగాయి బండ్లు. బలరామయ్య దిగాడు. తాము కట్టుకున్న మహా సౌధాన్ని చూశారు. అది మొండిగా వుంది. విరిగి వుంది. కూలి వుంది. కాలి వుంది. బలరామయ్య గుండె ఏడ్చింది. కన్నీటి చుక్కలు అతనికి తెలియకుండానే రాలేయి. విరిగి ముక్కలై పడివున్న గేట్లో అడుగు పెట్టాడు. ఎడమచేతివైపు గుర్రాల కొట్టానికి కప్పులేదు. దూలాలూ, వాసాలూ లేవు. మొండిగోడలున్నాయి. గుర్రాలు వారి రాజలాంఛ నాలు. అవి జవనాశ్వాలు. అడుగు పెట్టగానే అందరికీ కనిపించాలని అక్కడ ఏర్పాటు చేశారు. గుర్రాలుకాదు, గూళ్ళుకూడా మిగల్లేదు. గుండె చెరువైంది. కొట్టంలోకి యంత్రవతుగా నడిచాడు. ఒకసారి చుట్టూ తిరిగి చూశాడు. పైకి తల ఎత్తాడు - కప్పుచూడాలని. ఆకాశం కనిపించింది. మెల్లగా కదిలాడు. మెట్ల ముందుకు వెళ్ళి నుంచున్నాడు, దర్వాజాలు లేవు. కిటికీలు లేవు. కంతలున్నాయి. ఇటుకలు రాలిపడి ఉన్నాయి. మెట్లెక్కాడు. అది వారి బంకులు. అక్కడే కూర్చొని సకల వ్యవహారాలు నడిపించేవాడు. రెండు పెద్ద నిలువుటద్దాలు పెట్టిం చాడక్కడ, గేట్లో అడుగుపెట్టినవాడల్లా తమకు కనుపించాలని. ఏవి ఆ అద్దాలు? ఆసలా కుర్చీలు, బల్లలు వైభవం ఏది? అంతా పోయింది! అంతా నశించింది. ఏదో ప్రళయ మొచ్చింది! అన్నింటినీ కూల్చి, కాల్చిపోయింది!

"విప్లవం వర్థిల్లాలె"
"దున్నేవానిదే భూమి"
"ప్రజారాజ్యం వర్థిల్లాలె"

అదిరిపోయాడు బలరామయ్య. అవి బొగ్గుతో గోడమీద రాసిన నినాదాలు. ఒకటి, రెండు, మూడు - గోడనిండా అవే ఉన్నాయి. చెరిపేయాలనుకున్నాడు. ఎన్నని చెరుపుతాడు! ఇంతలో ఆ నినాదాలు దిక్కులు పిక్కటిల్లాయి. వేలమంది తనను చుట్టుముట్టుతున్నట్లనిపించింది. కేక పెట్టినంత పనిచేశాడు. వెనక్కు తిరిగి చూశాడు. తళతళా మెరిసే బాయినెట్లు పట్టుకున్న పోలీసులు కనిపించారు. అంతా ఒక భ్రమనుకున్నాడు. గడిచిపోయిన పీడ అనుకున్నాడు. ఇంతమంది పోలీసు లున్నారు తనకేం భయం! ఇద్దరు పోలీసులను వెంట పెట్టుకొని లోన అడుగు పెట్టాడు. ఒక గబ్బిలం రయ్యిమని వచ్చి ముఖానికి కొట్టి ఎగిరిపోయింది. అదిరి పడ్డాడు బలరామయ్య. ఇదీ తనను ఎదిరిస్తూందా? అది కాపురమున్న ఇంట్లోకి తనను రావద్దంటూందా? తనను ఎదిరిస్తూందా? తాను ఇంత ఆస్తిని వదులు కున్నాడు. ఎదిరించలేకపోయాడు. పారిపోయాడు. అంత ప్రభుత్వం, పోలీస్, సైన్యంవున్న నవాబు ఏమీ చేయలేకపోయాడు! రాజ్యం ఊడింది. మంచిదైంది. ఇప్పుడు మహాసైన్యం వచ్చేసింది. తన సంపద తనకు వచ్చేస్తుంది. తన అధికారం?- అవును తన అధికారం? ఎంత దుర్బలుడైనాడు తాను? తన తండ్రి తనముందే ఒకణ్ణి తుపాకితో కాల్చి చంపాడు. అదీ వెట్టికి రానందుకు. వెనక్కు తిరిగి గేటు పక్కన ఉండవలసిన కట్టుగొయ్యవైపు చూశాడు. అది అక్కడ లేదు. అయినా ఎన్నో స్మృతులు అతని మెదడును తొలిచాయి. అందమైన పిచ్చి కనిపించింది. పిచ్చి ఆ ఊరికి కోడలుగా వచ్చింది. ఆమెను చూచాడు. అనుభవించాలనుకొన్నాడు. ఎదిరించాడు భర్త - పట్టి తెప్పించాడు. కట్టుకొయ్యకు కట్టించాడు. గొలుసులతో బంధించాడు. రక్తపు ముద్దను చేశాడు. అయినా అతను లొంగలేదు. అయితేనేం పిచ్చి తనదైంది ఆ రాత్రి. తెల్లవారి ఉరిపోసుకుంది. అయినా అడిగినవాడేడి? ఎన్ని గుండెలు కావాలి? మళ్ళీ అధికారం వస్తుందా? దొరతనం నిలుస్తుందా? చూడాలి. సాధించాలి.

హాలునిండా దుమ్ము పేరి ఉంది. గోడల నిండా మసి, పగిలిన కుండల పెంకులు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. అడుగు పెడ్తే గుర్తులు పడ్తున్నాయి. ముఖానికి సాలెగూళ్ళు తాకుతున్నాయి. కర్రతో వాటి నన్నిటినీ తీసేస్తూ గదిలో అడుగు పెట్టాడు. అడుగు పెట్టగానే ఘుర్రుమంది. చూశాడు మూలకు. పిల్లి— పిల్లల్ను పెట్టింది. తనవైపే చూస్తోంది. గుర్రుమంటూంది. పులి కళ్ళలా ఉన్నాయి దాని కళ్ళు. పిల్లి! పిల్లికి జంకుతాడా తాను! కర్రతో అదిలించాడు. రెండడుగులు ముందుకు వేశాడు. గుర్రుమని ఉరికివచ్చింది. పిల్లి ఎగిరింది. యుద్ధం ప్రకటించింది.

రక్కుతూంది. పారిపోతూంది. మళ్ళీ వస్తూంది. కర్రతో బాది చూస్తున్నాడు బల రామయ్య. తప్పుకుంటూంది. మళ్ళీ మీద పడుతూంది. అతని ఎత్తు ఎగిరింది. నొసట రక్కింది. కేక పెట్టాడు బలరామయ్య, పోలీసుల బూట్ల చప్పుడైంది. వచ్చే శారు. ఏమీలేదు. పిల్లి! కాని భయంకరంగా ఉంది. గర్జిస్తూంది. మెరిసే కళ్ళతో అందరిమీదా యుద్ధం ప్రకటిస్తూంది. తుపాకులెత్తారు పోలీసులు, కాని పిల్లిని చంప రాదు. అంతా కలసి సతమతం అయినారు. అది అక్కణ్ణుంచి కదల్లేదు. పిల్లుల్ని వదల్లేదు. అంతా విసిగిపోయి బయటికి వచ్చారు. బలరామయ్యా వచ్చేశాడు- ఓడిపోయి!

అది అతని పడకగది. నున్నటి, తెల్లని గోడలు, కప్పుకు వ్రేలాడుతూ వుండిన గాజు బుగ్గలు, గోడలకు జపాను బొమ్మలు, ఎత్తైన పందిరిమంచం ఉండా ల్సిన చోట పిల్లి కాపురం పెట్టింది. ఆ గది బలరామయ్యకు అనేక అమృతపు గడియలను గుర్తుకు తెచ్చింది. ఎందరు సొగసుగత్తెలు ఆ గదిలోకి వచ్చినా అసలు దొరసాని ఊర్మిళమ్మే. నిజంగా ఆమెలో అందం వుంది. వయ్యారం వుంది. సొగ సుంది. అన్నిటికీ మించిన ఠీవి వున్నది. కాని ఆమె ఏది? ఇక్కణ్ణుంచి వెళ్ళేప్పుడు బాగానే వుంది. బెజవాడలో వ్యాధి పట్టుకుంది. డబ్బు గుమ్మరించాడు బలరామయ్య. అయినా దక్కలేదు. కృష్ణ ఒడ్డుకు చేరింది. జంటగా వెళ్ళి ఒంటరిగా వచ్చాడు బలరామయ్య. అది తల్చుకుంటే అతని కన్నీరు టపటప రాలింది. తల పట్టుకు న్నాడు. కూలబడాలనుకున్నాడు. అంతటా దుమ్ము. ఒక కుర్చీలేదు. కూర్చోలేదు. సాగాడు. ఒకటి రెండు మూడు విశాలములైన గదులు. అన్నీ పాడుబడి ఉన్నాయి. దేనికీ తలుపులు లేవు. ద్వారబంధాలు లేవు. గునపాలతో తవ్విన గుర్తులున్నాయి. అక్కడక్కడా సున్నం కూలి పడివుంది. సున్నం లాగే బలరామయ్య గుండెలు పెచ్చెలు లేస్తూంది.

వంట ఇంటి మెట్లు దిగాడు బలరామయ్య. దొడ్లో దూరంగా ప్రహరీని అంటుకొని గుడిసె కనిపించింది. అందులో ఏదో ప్రాణి ఉన్న జాడ కనిపించింది. ప్రాణి! ఏదో దగ్గరి సంబంధం పురికొల్పింది. ఏదో ఆత్మీయత గోచరించింది. ఏదో ఆకర్షణ లాగింది. చరచరా నడిచాడు బలరామయ్య. జర్రున జారిపోతున్న పాము కనిపించింది. ఉలిక్కిపడి నుంచున్నాడు. అది గడీలో చాలాకాలంగా ఉంటూంది. ఆ విషయం తెలుసు. తన తాత చూశాడు. తన తండ్రి చూశాడు. తానూ చూశాడు. అదే పాము. తెల్లగా, బారుగా పాము సాగిపోయింది. కలుగులో దూరింది. తోక సైతం లోనికిపోయేదాకా చూశాడు. సాగాడు— గుడిసెలో దూరాడు. గుడిసెలో కుక్కిమంచం. మంచంలో అతివ- కళ్ళలో ప్రాణాలున్నాయి. మంచం పక్కన నుంచొని పరీక్షగా చూశాడు, గుర్తించాడు. అతని గుండె చెరు వైంది. "అమృతవాణీ!" పిలిచాడు.

అమృతవాణి– ఒకనాటి అందాలరాణి. సౌందర్యరాశి–దొర బాహుబంధంతో నలిగినా పాదాలవద్ద పడి ఉండిన కుసుమం. నేడు నలిగిపోయింది. వాడిపోయింది. ఎండి రాలిపోనున్నది. అమృతవాణి ఎక్కణ్ణుంచి వచ్చిందో ఎవరికీ తెలీదు. కాని తెచ్చింది ఊర్వశి - ఆ వూరి వేశ్య. నేటి కాఫీహోటళ్ళలా నాడు వేశ్యాగృహాలు పల్లెలకు తప్పనిసరి. వేశ్యలూ గ్రామ జీవితంలో ముఖ్యాంశంగానే పరిగణించ బడేవారు.

ఆనాడు దీపావళి. తెల్లవారుజామున లేచి స్నానాలు చేసి, మంగళహారతులు పట్టుకొని బయలుదేరారు అమృతవాణి, ఊర్వశి. ఇంటింటికీ వెళ్ళి చలిలో మంగళ హారతులు పాడి డబ్బు తెచ్చుకుంటారు. ముందు గడీకి వెళ్ళాలి. వెళ్ళారు. బల రామయ్య అప్పుడు ఉరుకులు పెడుతున్న వయసులో ఉన్నాడు. వయసు సొగసులు తీర్చుకున్న అమృతవాణిని చూశాడు. అతనిలో ఏదో చెప్పరాని ఉద్రేకం పొంగింది. అమృతవాణి చేయి పట్టుకున్నాడు. కాదంటుందా? కాదనగలదా? వృత్తిలో దించ వద్దన్నాడు. గడీలోనే వుండిపొమ్మన్నాడు. తన భాగ్యం పండిందనుకున్నది ఊర్వశి. వాస్తవంగానే పండించాడు బలరామయ్య. అమృతవాణి అతనికి ప్రాణం అయింది కొంతకాలం. తరువాత పురుగులా దులిపేశాడు బలరామయ్య. అయినా అతణ్ణి తప్ప మరొకణ్ణి కోరలేదామె. దాసీగా - ఆడబాపగా - జీవితం వెళ్ళబుచ్చింది. ఒక బిడ్డను కన్నది. అతడు రాముడు. ఊరు వదిలిపోయేప్పుడు ఆవిడను తీసికెళ్ళాలని పించలేదు దొరకు. ఇక్కడే వదలిపోయాడు. ఈనాటికి ఈ దశకు వచ్చింది.

అమృతవాణి కళ్ళు తెరిచింది. బలరామయ్య కనిపించాడు. ఒక దేవత కనిపించినట్లయింది. "దొరా!" అని లేచింది— లేవలేక లేచింది. దొర వారిస్తున్నా లేచింది. మంచం దిగింది. ఎముకలగూడు. నేలమీద కూలబడింది. దొరను మంచం మీద కూర్చోమన్నది.

"దొరా! దొర్సాని వచ్చినాది!" ధ్వని నీరసంగా ఉంది. అయినా ఏదో ఆశ గోచరించింది.

"ఇంకాడి దొర్సానే? పోయింది" దుఃఖం పొంగింది దొరకు. గొంతు పూడి పోయింది.

"ఏంది! దొర్సాని పోయినాది?" ఊపిరితో వచ్చిన ప్రశ్న అది. "పోయినాది దొర్సాని" అని పెద్దగా ఏడ్పు సాగించింది— ఉన్న బలాన్నంతా పుంజుకొని.

ఆ ఏడుపు చూచి బలరామయ్యకూ ఏడుపు వచ్చింది. హోదా, అధికారం, సంపద అన్నీ మరిచి అమృతవాణిమీదపడి భోరుమన్నాడు. "వాణీ పోయిందే. దొర్సాని పోయిందే"— "పోయింది దొరా పోయింది" ఇద్దరూ ఏడ్చారు. ఎంతో సేపు ఏడ్చారు. తుదకు బలరామయ్యే అమృతవాణి కన్నీరుతుడిచి ఓదార్చాల్సి వచ్చింది.

వాణి పొంగిపోయింది.

ఆ క్షణం కోసమే బ్రతుకుతూందా అన్నట్లు చూసింది.

"అమతా ఎట్లయినవు! ఊరు పాడు పడ్డది. గడీ పాడుపడ్డది. గడీ ఇడిచి ఎందుకు పోలేదు వాణీ! ఎందు కిట్లయిపోయినవు?" ఆవేదన కురిసింది. ఆమెలో మిణుకుమిణుకుమనే దీపం వెలిగింది.

"దొరా! బాంచను! నీ ఉప్పు తిన్న. నీ సొమ్మెట్ల దోచుకుందును దొరా! మీరు పోయిన్రా రావణ్ణి గడీకి కాపల పెట్టిన- గడీల పడున్న. దొరా ఏం చెప్పుదు! ఉప్పె నొచ్చిందనుకోరి, మాలోడు, మాదిగోడు, మంగలోడు, చాకలోడు కూడా తుపాకులు పట్టిన్రు. ఇరుచుక పడ్డరనుకోరి వేలకు వేలజనం. ఆల్ల కాల్లమీద పడ్డ. బతిమలాడిన. ఎవడన్న ఇన్నాడా బాంచను! నన్ను గుంజి అవతల పారేసిన్రు. గడ్డపారలతో తవ్విన్రు. అరిచిన్రు—మొత్తుకున్నరు. దొరలనే దొంగలన్నరుండి! దర్వాజలు, తలుపులు, మంచాలు, నిలువుటద్దాలు ఒక్కటానుండి అన్ని దోచుక పోయిన్రు. ఇగో గడీ నిట్ల చేసిపోయిన్రు. రావడు కూడ వాండ్లల్లనే కలిసిపాయె. ఏం చేద్దును దొరా! ఏం చేయలేకపోతిని" అని మళ్ళీ ఏడ్చింది. తానేమీ చేయలేక పోయినందుకు ఏడ్చింది. తుదకు "ఎట్లొచ్చిన్రు దొరా! వాండ్లొస్తరు. తుపాకు లెత్తరు, పో దొరా జల్ది పో" అని అతన్ని పక్కకు నెట్టింది.

"వాణీ! నువ్వెంత మంచిదానివి!" డగ్గుత్తుకతో అన్నాడు దొర. "ఇంత ఊర్ల నువొక్కదానివి లేకుంటే నేను గుండెపగిలి చచ్చెటోణ్ణి. పోలీసులను తెచ్చినలే భయపడకు" అని ఆమె ముందు కూర్చున్నాడు.

నూతన వైభవాన్ని గురించి ఇద్దరూ ఎన్నో ముచ్చట్లు మాట్లాడుకున్నారు.

వాణికి దగ్గుతెర వచ్చింది. ఖంగు ఖంగుమని దగ్గింది. దగ్గు ఆగలేదు. ఊపిరి ఆడడంలేదు. విలవిలలాడుతూంది. చుట్టుకొనిపోతూంది. కళ్ళు తేలవేస్తూంది. అయినా దగ్గు తెరిపి ఇవ్వడంలేదు.

దొర చూస్తూ కూర్చున్నాడు. వాణి మృత్యువు కౌగిలిలో విలవిలలాడుతున్న ట్లనిపించింది. లేచి నుంచున్నాడు. చూస్తున్నాడు. ఏమిటో అర్థం కావడంలేదు. చావు! చావు!! చావు!!! అమాంతంగా వెనక్కు జరిగాడు.

దగ్గు తెరిపి ఇచ్చింది. వాణి రక్తం ఉమిసింది. తోటకూరకాడలా పడి పోయింది. తనుస్తూంది. కళ్ళు తేలవేసింది. మళ్ళీ రక్తం ఉమిసింది. కళ్ళు మూసు కుంది. ముడుచుకుని పడుకుంది.

దొర దూరంగా నుంచున్నాడు. అది క్షయ అని తేలిపోయింది. అంటువ్యాధి అని అతనికి తెలుసు. మెల్లగా అడుగులు వేశాడు. అడుగుల చప్పుడు విన్నది వాణి. అంత యాతనల్లోనూ అన్నది "దొరా, మంచం పట్టించుకపో! కిందెట్ల పండు కుంటవ్" దొర మనస్సు కలుక్కుమన్నది. అయినా సాగిపోయాడు.

పోలీసుల శిబిరంలో వంటలు జరుగుతున్నాయి. పెట్రోమాక్సులు వెలుగు తున్నాయి. సంరంభంగా ఉంది. మెట్లమీద కూర్చొని చూస్తున్నాడు బలరామయ్య. తనకు పడక ఎట్లా? పట్టుపాన్పులు, పందిరిమంచాలు లేవు. ఈ దుమ్ములో పడుకో లేడు. వాణి మంచానికి క్షయ. ఏ ఇంట్లోంచైనా మంచం తెప్పించాలి. ఎవడు తెస్తాడు? పోలీసులు తెస్తారా? తెమ్మనడం బాగుంటుందా?

పోలీసుల వంటలైనాయి. తాగుడు సాగుతూంది. ఆటలు, పాటలు, భోజనా లైనాయి. వారితోనే భోజనం చేశాడు బలరామయ్య. క్యాంపులోనే పడుకున్నారు. నిద్రపట్టలేదు. అయినా తెల్లవారింది. ఆకాశంలో కారుమబ్బులు కమ్ముకున్నాయి. పంటపొలాల మీదినుంచి చల్లని గాలి వీస్తూంది. బలరామయ్యకు ఏదో హాయి అని పించింది. ఊళ్ళోకి బయలుదేరాడు. పోలీసులు వెంటవచ్చారు. సాగిపోతున్నాడు దొర. దొర వస్తున్నాడని తప్పుకునే వాడు లేడు. వంగి దండాలు పెట్టేవారు, చెప్పులు విడిచి చేతపట్టుకొని గోడకంటుకొని నుంచునేవాళ్ళు లేరు. అంతా నిరా మయం నిశ్శబ్దంలోంచి వెళుతున్నాడు దొర— పూర్వపు ఠీవీతో నడవాలని ప్రయత్నిస్తూ.

మొండిగోడలు కనిపించాయి. కప్పు పూర్తిగా కూలిపోయింది. గోడలుకూడా కొంత కూలాయి. శిధిలాలు, ఇటుకకుప్పలు కూలినవి. అది పోలీసు ఔట్‌పోస్టు. అందులో ఇద్దరే పోలీసు లుండేవారు. అయినా వారంటే హడలి చచ్చేవారు జనం. ఆ ఇద్దరు నైజాం నవాబు ప్రతినిధులు. వారు కావాలనుకుంటే ఎవరినైనా చీల్చి చెండాడేవారు. వారూ దొరల కనుసన్నలలో నడిచేవారు. ఆ కూలిన గోడలమీద కూడా నినాదాలున్నాయి.

"విప్లవం వర్ధిల్లాలె."

నినాదం చూసి బలరామయ్య వళ్ళు మండింది. దానికి వ్యతిరేక నినాదం ఏదో అందామని గొణిగాడు. రాలేదు. ఒక పెంకుముక్క అందుకొని నినాదాన్ని గీకివేశాడు. కొంత సంతృప్తి కలిగింది. కదిలాడు. కొంతదూరం నడుస్తే చావిడి కనిపించింది. అది కూలిపోయింది. గోడలున్న గుర్తులు సైతం లేవు. లిప్తపాటు పూర్వవైభవం తలచుకున్నాడు. కళ్ళు చెమ్మగిల్లాయి. వెంటనే కోపం పొంగింది. గుండె మండింది. ఊరంతా తగలపెడదామనుకున్నాడు. అందుకు అడ్డేవారు ఎవరూ లేరు. అయినా ఎందుకో ఆ పని చేయలేదు. పొలాల కోతలకూ, నూర్పి ళ్ళకూ మనుషులు కావాలిమరి! వారు రావాలి. ఈ గుడిసెల్లోనే వుండాలి. తన పనులు చేయాలి.

బలరామయ్య సాగిపోతున్నాడు. తుపాకులు పట్టుకొని ముందూ, వెనుకా పోలీసులు నడుస్తున్నారు. ఒక ఇంట్లో - గుడిసెలో - ప్రాణం ఉన్న జాడ వినిపిం చింది. ఊపిరి పీల్చుకుంటున్న సవ్వడి వినిపించింది. తరువాత దగ్గు వినిపించింది.

గుడిసెలోకి దూరాడు బలరామయ్య. గొంగళి చుట్టుకొని పడుకున్న ఆకారం కనిపించింది.

"ఎవర్డా వాడు?" గర్జించాడు దొర.

ముఖంమీదనుంచి కప్పు తీసి చూశాడు - మనిషి.

"మాట్లాడవేందిరా?" మరొక గర్జన.

చూస్తూ ఉండిపోయాడా మనిషి.

కాలితో తన్నాడు దొర.

డొక్కలో తగిలింది.

మూలిగాడు మనిషి. లేచి కూర్చున్నాడు.

"ఎవడవురా?"

"జగ్గయ్యను"

"జగ్గయ్య....జగ్గయ్యట జగ్గయ్య. జగ్గిగాణ్ణి దొరా అను భంచత్. పుండాకోరు ముండాకొడక. మస్తీ ఎక్కింది. లే, అమ్డీకొడక. చూసి పోయేందుక్క వచ్చినవులె. ఏరిరా మీవోండ్లు? తోళ్ళొలుస్త. తడాఖా చూపిస్త. యాడున్నరో చూపిస్తవా లేదా?"

"రోగంతోని నేనీడ పంటిని." లేచి నుంచుంటూ "నా కేమెర్క ఎవ్వడేడ చచ్చిండో" అన్నాడు.

"ఓరి మీ అమ్మల....దొరా, దాత మరచిపోయినారు. కాల్మొక్త, బాంచను, అను. నడువ్. లంజకొడక. భూములు పంచుకొంటర్లె. ఊఁ నడువ్ జే" అని బలంగా తన్నాడు బలరామయ్య.

జగ్గయ్య బోర్లపడ్డాడు. పోలీసులు రెక్కలుపట్టి లేపారు. తంతూ, గుద్దుతూ గడీకి తీసికెళ్ళారు.

దొర మండిపడుతున్నాడు. కళ్ళు రక్తం కక్కుతున్నాయి. వళ్ళు మండిపోతూంది. ఇన్నాళ్ళనుండి మండుతున్న ద్వేషం జగ్గయ్యమీద తీర్చుకోవాలనుకున్నాడు.

గడీకి వచ్చింతరువాత కర్ర అందుకొని బాదసాగాడు. "చెప్పు గాడ్దికొడక వాళ్ళెక్కడున్నరో" ఇదే ప్రశ్న. "తెల్వదుండ్రి, కొట్టుండ్రి, చీల్చుండ్రి, తెల్వంది యాడ్నుంచి చెప్పుత" ఇదే జవాబు.

"బాంచేను, అనవేమిర గాడ్దికొడక" అని కొంతసేపు బాదాడు.

"తెల్వదు, బాంచను, కాల్మొక్త కొట్టకుండ్రి."

బలరామయ్య గెలిచినట్లు వళ్ళు విరిచాడు. చేతిలోని కర్ర పారేసి "కుక్కలోలె పడుండాలె గాడ్దికొడుకులు, యామనుకుంటుండ్రో దొరంటే, తిన్నయ్యన్ని కక్కాలె, ఒకొక్కణ్ణి యాపచెట్టుకు యాళ్ళదీసి తోళ్ళొలుస్త." అని ఏదో

స్ఫురణకు రావడంతో "నడుప్ కుక్కలకొడక, గది ఊడ్చి సాఫ్ చెయ్యి" అని మెడపట్టుకొని గడీవైపు నెట్టాడు. ఆ తోపుకు కొన్ని అడుగులు ముందుకువేసి ముంచుండిపోయాడు జగ్గయ్య. జగ్గయ్యకూ కోపం వచ్చింది. వళ్ళు మండింది. దొరలు దొంగలు, దోచుకునేవాళ్ళు అనే విషయం అతని నరనరాల్లో జీర్ణించి పోయింది. ఈ పెత్తనం నశింపచేసిన వాళ్ళలో తానూ ఒకడు. ఒక్కడు తుపాకి సైతం లేకుండా గొడ్డలితో ముగ్గురు రజాకార్లను నరికిపారేశాడు. మొదటనే దొర తోక ముడిచాడు. ముందు బస్తీకి వెళ్ళి తరువాత బెజవాడ పోయాడు. అప్పుడు దొరికుండాల్సింది దొర - ముక్కలకింద నరికేశేవాణ్ణి. కాని మళ్ళీ దొరతనం నెత్తినపెట్టుకొని దిగాడు బలరామయ్య. మళ్ళీ తనను బానిసను చేశాడు. తనతో ఊడిగం చేయించ చూస్తున్నాడు. చేయాలా? చేసినా ఫరవాలేదు. వాళ్ళ రహస్యం బయటపెట్టరాదు. ఈ దొర ఎన్నాళ్ళుంటాడు? ఈ పోలీసులు ఎన్నాళ్ళుంటారు?

ఆలస్యం సహించలేకపొయ్యాడు బలరామయ్య. పోలీసులకు సంజ్ఞ చేశాడు. తుపాకి మానుతో వీపున గుద్దారు. కాస్త తూలి పడబోయి సర్దుకున్నాడు జగ్గయ్య. మౌనంగా మెట్లెక్కాడు. పొరక్కట్ట అందుకొని ఊడ్పు సాగించాడు.

పెద్దగా నవ్వాడు బలరామయ్య. వికటంగా నవ్వాడు. గడీ ప్రతిధ్వనించేట్టు నవ్వాడు. ఆ నవ్వుకు దిగ్భ్రమ చెందారు పోలీసులు. చుట్టూ చూసి వింతగా అతణ్ణే చూడసాగారు. ఇంకా నవ్వుతూనే వున్నాడు బలరామయ్య. విజయ గర్వంతో నవ్వుతున్నాడు. అవును. అతడు ఒకణ్ణి బానిసను చేశాడు! మళ్ళీ దొరతనం చలాయించాడు. అదీ అతని విజయం. అదీ అతని గర్వం!

కొంతసేపు నవ్వి చాలించాడు బలరామయ్య. జగ్గయ్య మన్నంతా మూలకు తోసి మరొకగదికి వెళ్ళాడు. పోలీసులు అప్రమత్తంగా ఉన్నారు. బలరామయ్య చూస్తూనే ఉన్నాడు. జగ్గయ్య ఊడుస్తున్నాడు. కుప్పలు తోస్తున్నాడు. లంకంత ఇల్లు. ఊడ్చేది ఒక్కడు. దెబ్బలతో వళ్ళు హూనం అయింది. వంగిన నడుము లేవడంలేదు. చివరి గదిలో ఊడుస్తున్నాడు. కిటికీ కనిపించింది. దానికి చువ్వలు కాదు చట్రం సహితం లేదు. కిటికీలోంచి దూకి పారిపోదా మనుకున్నాడు. చూశాడు. కిటికీలోంచి ప్రహరీ కనిపించింది. ఎత్తుగా వుంది. ఎక్కడం కష్టం. దాన్ని కూల్చక విడిచినందుకు విచారించాడు. తిట్టుకున్నాడు. ఎక్కలేక పడిపోతే ప్రమాదం. కాని పారిపోవాలి. ఎలా? ఎంతో ఆలోచించాడు. ఆలోచిస్తూనే కసవు ఎత్తాడు పగిలిన కుండలోకి. అది నెత్తిన పెట్టుకొని బయలుదేరాడు. ఆకాశంలో మబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి. గాలి విసురుగా వీస్తూంది. మబ్బులను అదరగొట్టి పారేస్తూంది. అవి బెదరి బెదరి పారిపోతున్నాయి. ఆ గాలికి పగిలిన కుండలోని మట్టి లేచింది. అరుగుమీద నుంచున్న బలరామయ్య కళ్ళలో పడ్డది. కళ్లు నలుపుకుంటూ జగ్గయ్యను తిట్టాడు. జగ్గయ్య పట్టించుకోలేదు! సాగిపోతున్నాడు. పోలీసులు తుపా

కులు పట్టుకొని నుంచున్నారు. వారిని దాటి దుమ్ము ఎత్తి పోశాడు. గాలి దుమ్మును మబ్బుగాలేపి పోలీసులమీదికి తోలింది. అది వారి కళ్ళల్లో పడింది. అంతా కళ్లు నల్చుకోసాగారు. జగ్గయ్య పగిలిన కుండ చేత్తో పట్టుకొని వెనక్కి చూశాడు. సమయం బాగుంది. ఎవడూ చూడ్డంలేదు. పారిపోదామనుకున్నాడు. ఒక అడుగు వేయమన్నది మనస్సు. వేసింది మేధస్సు. బలరామయ్య గర్జన విన్నాయి చెవులు. ముందుకు వేసిన అడుగు వెనక్కు పడ్డది. మళ్ళీ అదే కుండతో గడీ మెట్లెక్కాడు. మళ్ళీ కసువులు ఎత్తిపోశాడు. గడీ మొత్తం శుభ్రంచేశాడు. బలరామయ్య గుడిసె లన్నీ వెతికించి మంచాలు, కుర్చీలు, పగిలిన నిలువుటద్దాలు, పటాలు, చెంబూ తప్పాలా అన్నీ జగ్గయ్యతో తెప్పించి గడీ నింపించాడు. నీళ్లు తోడించాడు. కట్టెలు కొట్టించాడు. చాకిరి యావత్తూ చేయించాడు. ఆ రాత్రి చీల్చి చెండాడాలనుకున్నాడు. తుపాకులవాళ్ళ రహస్యాలన్నీ లాగాలనుకున్నాడు. వారి మీద దాడి చేసి అందరినీ కాల్చేయాలనుకున్నాడు. తన కొడుకును కాల్చి చంపిన పగ తీర్చుకోవాలను కున్నాడు. పట్టె మంచంమీద పడుకొని ఆలోచిస్తుండగానే దీపాలు పెట్టారు. గడీ హడావుడిగా వుంది. పోలీసులు గడీలోకి మారారు. నిన్నటి గుబులు గానీ బోసితనం గానీ లేదు. గడికి జీవం వచ్చింది. జగ్గయ్య వల్లనే ఇదంతా జరిగింది. ఊరంతా జనంతో నిండాల, అప్పుడుగాని కళకళలాడదు. జగ్గయ్యను హింసిస్తే వచ్చేవాడు బెదరిపోతాడనుకున్నాడు. జగ్గయ్య భోజనాన్ని గురించి శ్రద్ధ తీసుకున్నాడు. ఆ రాత్రి గడీలోనే పడుకొమ్మన్నాడు జగ్గయ్యను. తన గుడిసెకు పోతానన్నాడు జగ్గయ్య. వద్దనలేదు బలరామయ్య. ఆగలేదు జగ్గయ్య.

భోజనానంతరం సిగరెట్లు కాలుస్తూ శయనించిన బలరామయ్యకు అమృత వాణి గుర్తుకు వచ్చింది. రాత్రినుంచీ ఆమె జాడ తెలియలేదు. ఎంత మంచిది! ఊరుయావత్తూ తన సొమ్మంతా దోచుకున్నారు. పూచికపుల్ల ముట్టలేదు. అదే గుడి సెలో పడివుంది. ఎంత మారిపోయింది! రోగం ఆమెను పీల్చేసింది. ఏవో పూర్వ స్మృతులు మనసులో మెసిలాయి బలరామయ్యకు. ఆమె పుత్తడి బొమ్మ. తాను ఉరుకులు పెడుతున్న పరువంలో ఉన్నాడు. తన కౌగిలిలో ఉక్కిరి బిక్కిరి అవు తూంది. ఆనందం దోసిళ్ళతో తాగించింది. అమృతాన్ని కళ్ళతో అందించింది. ఇప్పుడు చిక్కి శల్యంలా మారింది. అతనికి తెలియకుండానే అడుగులు గుడిసె వేపుగా సాగాయి. ఇంతలో తనముందునుంచి జారిపోయిన పాము గుర్తుకు వచ్చింది. వెనక్కివచ్చి లాంతరు అందుకొని సాగాడు. గుడిసెలో కుక్కిమంచపు మీద, ప్రాణం ఉన్నజాడ కనిపించని ప్రాణి పడివుంది. లాంతరు పట్టి ముఖం చూశాడు. లోతుగా ఉన్న కళ్ళు, ముడతలు పడి వికృతంగా ఉన్న ముఖం కనిపిం చాయి.

"అమృతవాణీ" పిలిచాడు బలరామయ్య.

కళ్ళు తెరిచింది వాణి. "దొరా, వచ్చినవా?" అని లేచి కూర్చోబోయింది లేవలేకపోయింది. నిన్నటి సత్తువ సైతం లేదు. అయినా లేచి కూర్చుంది.

"వద్దు పండుకో, ఎందుకు లేస్తవు?"

"దొర నిలబడ్తె నేను పండ్తాను?!" అని మంచం మీదినుంచి జారి నేలమీద కూలబడ్డది. తల వంచుకుని కూర్చున్నది. "కూకుండు దొరా మంచంమీద" అన్నది నీరసంగా.

బలరామయ్య కూర్చోలేదు. నుంచునే చూస్తున్నాడు.

"దొరా! అన్నం తిన్నవా?" అవి ఆవేదన నిండిన పదాలు.

బలరామయ్య ఉక్కిరిబిక్కిరి అయినాడు. గుండె కరిగి నీరై కళ్ళల్లోంచి రాలింది. తాను వాణిని గురించి పట్టించుకోలేదు. కనీసం ఆ మాట తాను అడగలేదు.

"దేవుడిట్ల చేసె. దొరకింత వండి పెట్టుకోలేకపోతి" నిరాశతో అన్నది. ఎక్కడో లోతుగా ఉన్న కళ్ళల్లోకూడా నీరు నిండింది.

"వాణీ! ఎంత మరచిదానివి! రోగం ముదిరింది. పట్నం తీస్కపోత వస్తవా?" బలరామయ్య నుంచునే అడిగారు.

"ఎందుకుండి ఇంక? రాముణ్ణిచూసి చస్త దొరా! బతకాల్నని లేదు" బలరామయ్యను చూస్తూ అన్నది. ఇంతలో దగ్గుతెర వచ్చింది. సతమతం అయింది. సుళ్లు తిరిగింది, తెములుకుంది, తనుస్తూ పడిపోయింది నేలమీద.

"లే, మంచంమీద పండు" బలరామయ్య అన్నాడు.

దొర ఆజ్ఞ పాలించింది అమృతవాణి.

లాంతరు గుడిసెలో వదిలి సాగిపోయాడు బలరామయ్య. పందిరిమంచంలో మేను వాల్చాడు దొర. కాస్సేపు పడుకుని లేచి దిండ్ల కానుకుని కూర్చున్నాడు. సిగరెట్టు కాల్చాడు. అమృతవాణి ఎందుకో అతణ్ణి బాధపెడుతూంది. మనస్సు మనసులో ఉండడంలేదు. "దొరా! బతకాలనిలేదు. రాముణ్ణి చూసి చస్త" ఈ మాటలే చెవుల్లో గింగురు మంటున్నాయి. తన కొడుకు శ్రీనివాసులు. వాడూ తుపాకి పట్టాడు. తానూ చందా ఇచ్చాడు. కాని భూములు పంచేందుకు కాదు - ఆస్తి సంరక్షించేందుకు, నిజాం నవాబుకు వ్యతిరేకంగా పోట్లాడేందుకు, భూములు పంచేవాళ్ళను ఏరి పారేసేందుకు. వారిని కాల్చిపారేసేందుకు. అతడు కాల్పుల్లో కూలాడు. కనీసం శవం కనిపించలేదు. ఇప్పుడు తనకు మిగిలింది అమృతవాణి ఒక్కతే. దానికి కూడా చావు వాకిటికి వచ్చేసింది. రాముణ్ణి చూడాలనుకుంటూంది! రాముడు. రాముడుకూడా తన రక్తమే కదా! అయినా తనకే ఎదురు తిరిగాడు. తనను కూల్చడానికే తుపాకి పట్టాడు! అయినా వాణ్ణి తెచ్చి వాణికి చూపించాలి- ఎలా? తాను ఎక్కడికి వెళ్ళాలి? ఎక్కడ దొరుకుతాడు వాడు? దొర్కుతే వాణ్ణి

క్షమించాలి. నచ్చచెప్పాలి. వాణికి చూపించాలి. అప్పటికైనా వాణి పట్నం వస్తుందేమో! బ్రతుకుతుందేమో! ఏమో! ఏమో! ఏదో ఆశ.

క్రమక్రమంగా ఊరికి జనం చేరుకోసాగారు. అలా చేరుకుంటున్న వాళ్ళం దర్ని రాముణ్ణి గురించి అడిగాడు దొర. ఎవరూ తమకు తెలియదనే జవాబు చెప్పారు. పని పాటలవాళ్ళు గడీకి వస్తున్నారు. పట్నం నుంచి వంట మనుషుల్ని పిలిపించాడు. అమృతవాణి విషయంలో శ్రద్ధ తీసుకుంటున్నారు దొర. ఆమెనోట 'రాముడా' అనే మాటతప్ప వేరే రావడంలేదు. తను ఆరాతీస్తున్నాననీ రావలసిం దని అనేకమందితో చెప్పి పంపుతున్నాననీ అంటున్నాడు బలరామయ్య. ఏదో ఆశ అమృతవాణి కళ్ళల్లో కనిపిస్తూంది. రాముడు వస్తాడు. అదే ఆశతో జీవిస్తుం దామె.

బలరామయ్య తన పొలాలు చూసుకోడానికి వెళ్ళివస్తున్నాడు. జీతగాండ్లను కుదిరించుకుంటున్నాడు, వాళ్ళకు డబ్బిస్తున్నాడు. అప్పులు పెడుతున్నాడు. అయినా అతనిలో ఏదో వెలితి కనిపిస్తూంది. పూర్వపు వైభవం లేదు. జనం తాను చెప్పిన పని చేస్తున్నారు. కాని తన అధికారానికి భయపడి కాదు, వారి అవసరాలకు లొంగి. ఇప్పుడు తన అధికారం కాదు, డబ్బు పెత్తనం చేస్తూంది!

అర్ధరాత్రి దాటింది. చీకట్లు కమ్ముకున్నాయి. ఆకాశంలో మబ్బులున్నాయి. కనీసం నక్షత్ర కాంతి లేదు. గడీ డాబా మీద పోలీసులు కాపలా కాస్తున్నారు. పెట్రోమాక్సు లైట్లు వెలుగుతున్నాయి. సెంట్రీలు మెళుకువతోనే ఉన్నారు. కింద ఎక్కడో అలికిడి అయింది. నాలుగువైపులనుండీ టార్చ్‌లు పడ్డాయి. ఏదో మాన వాకారం చెట్టు చాటున దాగింది. డాబామీద కేకలు అరుపులు. అంతా తుపాకులు పట్టుకుని సిద్ధంగా నుంచున్నారు. టార్చిలైట్ల వెలుగు ప్రవాహం తిరుగుతూంది. వెలుగు దాటగానే మానవాకారం ముందుకు నడిచింది. అడుగుల సవ్వడి వినిపిం చింది. లైటు వెలిగింది. మానవాకారం ఎక్కడో నక్కింది. బూట్లు టకటక మన్నాయి. మేడమెట్లు దిగాయి. ప్రహరీ లోపలంతా తిరిగాయి! ఆకారం ఉరికి నట్లనిపించింది. బూట్లు ముట్టడించాయి. ఆ ఆకారం అమృతవాణి గుడిసెలో దూరింది. పోలీసులు అటు ఉరికారు. తుపాకులు పేలాయి. బలరామయ్య లేచి పరిగెత్తాడు. అమృతవాణి గుండెలోంచి దూసుకుపోయిన బుల్లెట్ రాముడి ఎడం భుజంలో యిరుక్కొంది. "ఆగండి" అని కేక పెట్టి అమృతవాణీమీద పడిపోయాడు దొర.

"దొరా! రాము డొచ్చెగదా ఏడి? పట్కపోయిన్రా?" రక్తం ధారగా ప్రవ హిస్తున్నా అడిగింది వాణి. ఒళ్ళు నిండా రక్తం అయినా విన్నాడు బలరామయ్య.

చిత్రపటంలా నుంచొని చూస్తున్నారు పోలీసులు.

"వాణీ! ఒక్కసారి చూడు. ఇగ్గో రాముడిక్కడ్నే ఉన్నాడు"

టార్చిలైట్ల వెలుగులో వాణి కన్నీటిధార కనిపిస్తాంది. రాముడు ఏడుస్తు న్నాడు. రాముని తలను తననోటి దగ్గరకి తీసుకుంది. ముద్దుపెట్టుకుంది. "దొర మీద పగబడ్తావు! ఆయన ఉప్పుతిని మనం పెరిగినం, తప్పు. ఇగచేయకు" అని రాముణ్ణి దొరకు అప్పగించి "దొరా! వీడు బాంచోడు. నీ చేతులపెట్టి........" పెద్ద దగ్గుపొర వచ్చింది. రక్తం ధారగా ప్రవహిస్తాంది. తెములుకోలేక పోయింది వాణి. ప్రాణాలు ఎగిరిపోయాయి. పీనుగు మిగిలిపోయింది. రాముడు తల్లిమీద పడి బోరుమన్నాడు. బలరామయ్య మౌనంగా కన్నీరు కార్చాడు. పోలీసుల కళ్లూ చెమర్చాయి!

దుఃఖం ఎవని గుండెల్లోనూ కలకాలం కాపురం ఉండదు. మాన్పే శక్తి ప్రకృతిలో ఉంది. తెల్లవారడంతో తెములుకున్నాడు రాముడు. బలరామయ్య ఆలోచనలో పడ్డాడు. గడీలో ఏదో వైభవం వెలిగించాలని ఊరికి వచ్చాడు. అంతా తలక్రిందులైంది. అనుకోనిది జరిగిపోయింది. రాగానే ఒక హత్యా, ఒక చావు, ఒక పీనుగు. అది అతని మనసును కలచివేయసాగింది. రాముడు వచ్చి ముందు నుంచున్నాడు. దొర ఆలోచనలో ఉన్నాడని గ్రహించాడు. కొంతసేపు మౌనంగా నుంచున్నాడు.

"దొరా." ఆ మాట గొంతులోంచి వచ్చింది. మనసులోంచి వచ్చింది కాదు. గ్రహించాడు బలరామయ్య. విధిలేక అంటున్నాడనుకున్నాడు. అయినా "ఏందిర రాముడూ?" అని ప్రశ్నించాడు.

"అమ్మను దహనం చేయాలె"

ఉలిక్కిపడ్డాడు బలరామయ్య. "అదేందిర అట్లంటవు, మీ అమ్మ బోగంది. పూడ్చి పెట్టాలెర- కాలుస్తారు?" అన్నాడు. ఏదో రాబోతున్న అవాంతరాన్ని అడ్డు కోవడానికా అన్నట్లు అన్నాడు. అయినా అందులో అధికారం ఎక్కువగా ద్యోతకం కాలేదు.

"అమ్మను పూడ్చను. కాలుస్త. మా అమ్మ బోగంపని ఎప్పుడు చేసింది? నిన్ను కట్టుకున్నది. నీతోనే ఉన్నది" రాముని మాటల్లో ఏదో స్థిర నిశ్చయం ఉంది. సత్యం ఉంది. అయినా దొర కదిగిట్టలేదు. అసమ్మతి సూచకంగా తల అడ్డంగా తిప్పాడు. రాముడు తన పట్టు వదల్లేదు. గట్టిగా నిలిచాడు. తన అండవ చేరినవాణ్ని ఒక్కడ్ని జారవిడుచుకోరాదనుకున్నాడు దొర. "సరే నీ యిష్టం" అన్నాడు దొర- కొంత డబ్బు అందిస్తూ.

డబ్బుకు ఎంత విలువ ఉందో ఆనాడు తెలిసింది బలరామయ్యకు. ఊళ్ళో వాడు ఒక్కడూ గుమ్మందాటి బయట అడుగు పెట్టలేదు. రామునికి గడీదాటే ధైర్యంలేదు. ఇద్దరు పోలీసుల సాయంతో కాడు సిద్ధంచేశాడు. తల్లి శవాన్ని తానే మోసుకెళ్ళి తగలపెట్టాడు రాముడు. దొరా, కొందరు పోలీసులు వెంటవచ్చారు.

కాష్టపు మంట రాముని గుండెలో రగిలింది.

తల బాదుకొని ఏడ్చాడు.

కాడు ఎంతకని కాలుతుంది? కాలి కూలింది. ఇంటికివచ్చి కూలపడ్డాడు రాముడు. బలరామయ్య బ్రతిమిలాడితే ఎంగిలి పడ్డాడు. కాని నిరామయంగా చూడసాగాడు. అయోమయంగా చూడసాగాడు. తల్లి విడిచిపోయిన గుడిసెలోకి వెళ్ళాడు. ప్రమిద వెలిగించాడు. అంతా బోసిగా ఉంది. అంతా రిక్తంగా ఉంది. శూన్యంగా ఉంది. ఏదో అనంతమైన ఎడారిలో ఒంటరిగా నిలిచి విలపిస్తున్నట్లని పించింది. ఎద ఏడ్చింది కాని అది కంటిదాకా రాలేదు. కళ్ళు ఎండిపోయాయి. ఏదో చిదుగుల మంట రగిలింది గుండెల్లో. ఎవరినో ఓడించాలనుకున్నాడు. తానేదో గెలవాలనుకున్నాడు. పొడవా లనుకున్నాడు. అలా అనుకోగానే భయం ప్రవేశించి గుండెలో గుబులు చేరింది. చివాలున లేచాడు. చరచరానడిచి పోలీసు క్యాంపుకు వెళ్ళాడు. ఆ రాత్రికి తాను అక్కడే పడుకుంటానన్నాడు. అలా వారితో స్నేహం పెంచుకోజూచాడు. ఆ రాత్రి తాగాడు. వళ్ళు తెలియకుండా నిద్రపోయాడు. భుజంలో బుల్లెట్ ఇంకా ఉందనే విషయమే గుర్తులే దతనికి!

ఆ రాత్రి కల. వల్లకాడు. ప్రక్కన ఊడలమర్రి. ఒక బొంద, బొందమీద పాతగుడ్డలు. ఒక నల్లని కాటుకరంగు మనిషి- గునపంతో తవ్వుతున్నాడు. భయం భయంగా అటూ ఇటూ చూస్తున్నాడు. రాముడు వెళ్ళాడు. ఇద్దరూ కలియబడ్డారు. ఆ రాక్షసుడు గునపంతో తలమీద కొట్టాడు— కెవ్వున కేకపెట్టి లేచాడు. చుట్టూ చూచుకొన్నాడు. ఏమీలేదు. చుట్టూ పోలీసులున్నారు. చుట్టి వేశారు. ఏమైందని అడిగారు. ఇంకా గుండె దడదడ లాడుతూనేవుంది. ఏం చెప్పాలో తోచలేదు. చుట్టూచూచాడు. "తుపాకులవాళ్ళు నరికేస్తున్నారు" అన్నాడు ఇంకా వగరుస్తూనే. నవ్వారు పోలీసులు. ఒకడు సిగరెట్టు అందించాడు. రాముడు కాల్చాడు.

"వాళ్ళ తావరం చూపించు. మసిచేస్తాం" అన్నాడొక పోలీసు వచ్చీరానీ ఉర్దూలో.

"వాండ్లొకచోట ఉంటారనా పొద్దునొక చోటుంటే పొద్దుగూకే యాళ ఇంకొక చోటుంటరు. ఎట్ల చూపుదును?"

"అన్ని తావరాలు చూపు గాలిస్తాం. పొద్దున పోదమా?"

రాముడు భుజాన్ని చూసుకున్నాడు. గ్రహించాడు పోలీసు. "సరె బాగై వచ్చిన తరవాతనే వెళ్దాంలే" అన్నాడు ఓదారుస్తూ.

తెల్లవారి తల్లి కాటి దగ్గరకి వెళ్ళాడు రాముడు- ఇద్దరు పోలీసులను తీసు కొని. కాటిని చూచి ఊడల మర్రిని చూచాడు. దాని కింద బొంద, దానిమీద పాత బట్టలూ ఉన్నాయి. అవి చూచి తిరిగి వచ్చేశాడు.

మూడోనాడు బూడిద ఎత్తిపోసిం తర్వాత రాముడ్ని పట్నం తీసికెళ్ళాడు బలరామయ్య. ఆస్పత్రిలో చేర్పించాడు. ఆపరేషన్ చేసి బుల్లెటు తీసేశారు. కట్టు కట్టారు. మంచంమీద పడివున్నాడు. బలరామయ్య చాలాసార్లు వచ్చాడు. ఇంకా చాలామంది వచ్చారు. పోలీసు అధికారులు వచ్చారు. తుపాకుల వాళ్ళనుగురించి అనేక ప్రశ్నలు వేశారు. తనకు తెలిసినవీ తెలియనివి అన్నీ చెప్పేశాడు. వాళ్ళు తన ప్రాణం తీయడం ఖాయమన్నాడు. ఎన్నో రక్షణలు కల్పిస్తామన్నారు. ఏవేవో ఆశలు చూపారు. అన్నింటికీ లొంగాడతను. పూర్తిగా సాయం చేస్తానన్నాడు. కాస్త కోలుకుంటున్నాడు.

ఒకనాడు బలరామయ్య వచ్చాడు. "అమ్మ పెద్దదినం చెయ్యాలె" అన్నాడు రాముడు. బలరామయ్య కూడా చేతామనే అనుకున్నాడు. సాటివారితో సంప్రతింపులు జరిపాడు. బోగందాని దినం చేయడమేమిటీ అదీ పట్నంలో అతని హోదాకు తక్కువన్నారు. ఆ విషయం మానుకున్నారు. ఇప్పుడు మళ్ళీ లేవనెత్తాడు రాముడు.

"ఊరు చూస్తే అట్లుండె, పట్నంలో బోగందాని దినమెట్ల చెయ్యాలె?"

మనసు చివుక్కు మన్నది రామునికి.

"ఊరికె బోగంది, బోగంది అంటరు. మా అమ్మ ఎన్నడు బోగం పని చేసిందండి. కట్టుకున్న ఆలికంటె ఎక్కువగుండె. చచ్చేటప్పుడు సుత నువ్వె దాని మనసులుంటివి. నేను నీకు పుట్టినోణ్ని కాదా? చెప్పరేముండీ?"

బలరామయ్య ఓడిపోయాడు. రాముడు చెప్పిందాంట్లో అబద్ధం యిసుమంత లేదు. అమృతవాణి తనకు భార్యకన్నా మిన్నగా సేవచేసింది. రాముడు వాస్తవంగా తన కొడుకే. అది తన మనసుకే తెలుసు. అయినా ఆ విషయం బహిరంగంగా చెప్పలేడు. సంఘం, తన సమాజం దాన్ని ఒప్పుకోదు. సమాజం సత్యాన్ని అంగీకరించదు. బలరామయ్య మనసులో కలవరం చెలరేగింది. ఏం చెయ్యాలో తోచలేదు. రాము డన్నది బహిరంగంగా ఒప్పుకోడానికి దొరతనం అడ్డం వచ్చింది. "రాముడూ! సత్రంలో అన్ని ఇంతజాములుచేస్త. దినం చేసుకో. ఈ పట్నంలో ఎవడు ఎవడిని కనిపెత్తడు?" అన్నాడు.

"మల్లి మీరొస్తరా?"

"చూస్త!"

గూడకు కట్టిన కట్టుతోనే దినం చేశాడు రాముడు. బలరామయ్య చెప్పింది వాస్తవం. పట్నం ఎవడు ఎవడిని గుర్తిస్తాడు? చాలమంది బాపలు వచ్చారు. వాళ్ళు భోజనాలు చేస్తుంటే తల్లి తింటున్నట్లు సంతృప్తి చెందాడు రాముడు! తల్లికి ఇష్టమైన పదార్థాలన్నీ వండించి పెట్టించాడు. బాపలు భోజనాలుచేసి త్రేనుస్తే వారిలో తన తల్లిని చూసి ఆనందించాడు రాముడు! సత్రం ఖాళీ అయి ఒంటరిగా మిగిలిపోతే ఏడుపు వచ్చింది రామునికి. తల్లి తనను వంటరిగాణ్ణిచేసి వదలిపోయి నట్లని

పించింది. ఇంత విశాల ప్రపంచంలో తనకు 'నా' అనేవాడు లేడు. దొర మహా దాతలాగా ఇంత డబ్బే పారేశాడు. కనీసం ఇటు తొంగిచూడలేదు. అన్నీ తలచుకుంటే రామునికి దుఃఖం పొంగింది. కుమిలి కుమిలి ఏడ్చాడు. అతనికి తుపాకుల వాళ్ళే నయం అనిపించింది. వారికి కులాలూ, మతాలూ లేవు. వారికి రెండే కులాలు. ఉన్నవాడు, లేనివాడు. లేనివాళ్ళంతా ఒకటికావాలి. ఉన్నవాళ్ళను హతమార్చాలి. అందుకే తాను వాళ్ళలో చేరాడు. తుపాకి పట్టాడు. మొనగాణ్ని అనిపించుకున్నాడు. అక్కడ ఎవడూ తనను బోగందాని కొడుకనలేదు. కాని ఎందుకో వాళ్ళలో ఇమడలేకపోయాడు. వాళ్ళను మోసగించి వచ్చేశాడు. ఆ మాట తల్చుకునే వరకు అతనికి ఊడలమర్రి, దానికింది బొందా గుర్తుకు వచ్చాయి. ఎందుకో గుండె గుబగుబలాడింది. క్రమంగా నిద్ర ఆవరించింది. తెల్లవారుజామున కలలో ఊడలమర్రి, బొంద, దానిని తవ్వుతున్న కారునలుపు మానవాకారం! ఏదో గుండెదడ పట్టుకుంది. మేల్కొన్నాడు. గదిలో ఎవరూలేరు. వంటరితనం మరీ గుబులు పుట్టించింది. లేచి అటూ ఇటూ తిరిగాడు. ఊడలమర్రి, మర్రికింద బొంద అతన్ని వదల్లేదు. మెదడును ఎవరో గోళ్ళపట్టి చీలుస్తున్నట్లనిపించింది.

బాగా పొద్దెక్కిం తరవాత దొర దగ్గరనుంచి కబురువస్తే వెళ్ళాడు. బలిరామయ్య రాముణ్ని కారులో తీసుకెళ్ళాడు. కడుదూరం సాగి కారు నిలిచింది. దిగి చూస్తే పోలీసులు కనిపించారు. సన్నీలు రాముని గుండెలో మెరిశాయి. దొర రాముణ్ని ఒక గదిలోకి తీసికెళ్ళాడు. అది విశాలమైనది. అనేకమంది అధికారులున్నారు. రాముడు నుంచొనే ఉన్నాడు. అధికారులు రాముణ్ని ఎగాదిగా చూశారు. వారు అతణ్ని ఏవేవో అడిగారు. అతడు తెలిసినవీ, తెలియనివి అన్నీ చెప్పాడు. ప్రశ్నల పరంపర తెగడంలేదు. కాళ్ళు లాక్కుపోతున్నాయి. నడుమూ పీక్కుపోతూంది. ఎన్ని ప్రశ్నలో? తాను ఏమి చెపుతున్నాడో? సాయంకాలానికి బలిరామయ్య వెళ్ళిపోయాడు- రాముణ్ని వదిలి. ఆ రాత్రంతా అతన్ని వేధించారు. ఒకరి తరువాత ఒకరు అనేక మంది అడిగారు. అడిగిందే అడిగారు. రాముడు చెప్పిందీ, చెప్పందీ చెప్పాడు. ఏవేవో వ్రాసుకున్నారు. వ్రాసుకున్న వాటిని కలిపి చూసుకొని మళ్ళీ అడిగారు. ఎందుకలా చెప్పావన్నారు, ఏది నిజం అని అడిగారు. తనకు తోచింది చెప్పాడు. తెల్లవారిం తరవాత అతన్ని వదిలివెళ్లారు. వళ్ళంతా నొప్పులు. ఎప్పుడో మధ్యాన్నానికి నిద్రపట్టింది.

రాత్రికి మళ్ళీ వచ్చి లేపారు. ఏవేవో పటాలు తెచ్చారు. వాటిలో దారులు, కొండలు, అడవులూ ఉన్నాయి. రాముడు చెప్పినట్లు ఏవేవో గీతలు గీసుకున్నారు. బాటలు వేసుకున్నారు. గుర్తులు పెట్టుకున్నారు. మళ్ళీ ప్రశ్నల వర్షం కురిపించారు. ఏవేవో చెప్పాడు రాముడు. అతని మూలుగులు పీల్చి అధికారులు వెళ్ళిపోయారు.

అలసి పోయాడు రాముడు. సొలిసి పోయాడు జీవుడు. పోలీసులు వేసిన ప్రశ్నలు తల్చుకున్నాడు. బాధలు గుర్తుకు వచ్చాయి. అతనిలో ఏదో తిరుగుబాటు తలెత్తింది. తుపాకులవాళ్ళు ఎంత మంచివాళ్ళు? వాళ్లూ అనేక మందిని హింసించారు. దోచుకున్నారు. కాని వాళ్ళు చేసింది ప్రజల కోసం ఊరికోసం - మరి వీళ్లో? దొరలకోసం. ఆ మాట తలచుకోగానే వీరభద్రం గుర్తుకువచ్చాడు. బక్కపల్చగా పొడవైన మనిషి. భుజాన తుపాకి - కళ్ళలో నిప్పులు - సమాజాన్ని మార్చాలంటాడు. సంపదలు అందరికి అందాలంటాడు. తన మీదికి ప్రమాదం తెచ్చుకుంటాడు. ఇతరులను రక్షిస్తాడు!

ఆ రోజు ఏటి ఒడ్డున ఉన్నారు. పక్క ఊళ్లో ఏదో తగాదా జరిగింది. తీర్చడానికి వెళ్తున్నారు. ఉన్నది ముగ్గురే. అందులో రాముడూ వున్నాడు. చెట్లూ దుబ్బులు దట్టంగానే వున్నాయి. ఎవరికీ కనిపించడంలేదు. అయినా అటునుంచి సాగిపోతున్న రజాకార్ల దండుకు ఏదో అలికిడి వినిపించింది. తుపాకులు పేలాయి. వీరభద్రం తమను కాల్చవద్దన్నాడు. పడుకొమ్మన్నాడు. తూటాలు రివ్వున వస్తున్నాయి. తలమీదనుంచి సాగిపోతున్నాయి. చావు కళ్ళముందు నిలచింది. కొంత సేపు కాల్పులు ఆగేయి. వారు ముందుకు వస్తున్న జాడ కనిపించింది. వీరభద్రం తమను వెళ్లిపొమ్మన్నాడు. బెదిరించి అదిరించి పంపించేశాడు. తాము వెనుకనుంచి దుబ్బులోంచిపడి దూరంగా ఒక పొదలో దాక్కున్నారు. వీరభద్రం గురిచూస్తూ పడుకున్నాడు. దగ్గరికి వచ్చేదాకా చూచి కాల్పులు సాగించాడు. అనుకోకుండా జరిగిన దాడికి సిద్ధంగా లేరు రజాకార్లు. అయిదుగురు హతంకాగా మిగతా వాళ్లు కాలికి బుద్ధి చెప్పారు. కాని వీరభద్రం భుజంలోంచి దూసుకుపోయింది బుల్లెట్. అతడు మెల్లగా దిగి ఏట్లో రక్తం కడుక్కొంటుంటే తాము పరిగెత్తుకెళ్లి అతనికి కట్లుకట్టారు. అంత బాధలోనూ అతడు పక్క ఊరికి వెళ్లాడు. తీర్పు చెప్పాడు. అలాంటివాణ్ణి మోసగించి వచ్చేశాడు తాను. అలా వచ్చి తల్లిని పొట్టన బెట్టుకున్నాడు. ఇన్ని హింసల పాలవుతున్నాడు. మనసులో వీరభద్రానికి మొక్కాడు. అతనివైపే తిరిగింది మనసు. మెదడు ఏదో సూచించింది.

శ్మశానం పక్కన ఊడలమర్రి.

మర్రికింద బొంద.

బొందమీద చిరిగిన బట్టలు!

ఏదో భయం మొదలైనది రాముడికి. గుండె దడదడలాడింది. ఎలాగో ఊరికి చేరుకోవాలనుకున్నాడు. ఎప్పుడు బయలుదేరుతారో పోలీసులు! వీరభద్రం జాడ చెప్పాలా? పట్టుకుంటారో కాల్చేస్తారో; ఏమో చాల మందిని కాల్చేస్తున్నారు.

**వీరభద్రాన్ని**

**వీరభద్రాన్ని**

**కాల్పించాలా!!!**

తాను!

అసలే అలసి ఉన్నాడు. ఆలోచనలతో భయంతో మరీ అలసిపోయాడు, నిద్రపట్టింది.

అర్ధరాత్రి లేపారు పోలీసులు. రాముణ్ణి ఒక పోలీసుల లారీలో ఎక్కించారు. దొర జీపులో కూర్చున్నాడు. జీపు సాగింది. లారీలు సాగేయి. రోడ్డుమీద శర వేగంగా సాగిపోతున్నాయి. తెల్లవారుతుందనగా ఊరు వచ్చేసింది. ఊరికి దూరంగా ఆగాయి లారీలు. పోలీసులు తుపాకులతో దిగారు. రాముణ్ణి ఇద్దరు పోలీసులు పట్టుకున్నారు. బారులుతీరిన పోలీసులు ఊరిని చుట్టేస్తున్నారు. జగ్గయ్య చెంబు పట్టుకొని పోతున్నాడు. ఒక పోలీసు చూచాడు. కేకవేశాడు. తుపాకి పేల్చాడు. జగ్గయ్య అమాంతంగా పడిపోయాడు. తుపాకి గుండు వట్టిపోయింది. పోలీసులు ఈలలు మ్రోగాయి. పదిమంది పరిగెత్తారు. జగ్గయ్యను పట్టుకున్నారు.

కేకలు కూతలు విన్నారు పల్లెజనం. తలా ఒకవైపు పరిగెత్తారు. ఎటు చూచినా పోలీసులు! తప్పుకోవడానికి ఎలుకల్లా పరిగెత్తారు. అయినా బోనులో చిక్కుకున్నారు!! జగ్గయ్య సహితంగా జనాన్ని తుపాకీ మడమల్తో బాదారు. వాళ్ళ దగ్గర లాఠీలు లేవుమరి! జనంలో భీతాహం చెలరేగింది. ఏడుపులు, పెడబొబ్బలు. గడీముందుకు తెచ్చారు జనాన్ని. మోకాళ్ళ మీద నడిపించి పశువుల కొట్టంలోకి తోలారు. పోలీసులు ఊరంతా గాలించారు. ఇండ్లన్నీ గాలించారు. మనుషుల్ని పట్టుకెళ్ళి ఇండ్లలోంచి మంచాలు, కుర్చీలు, పాత్రసామగ్రి తెప్పించి గడీ నింపారు. ప్రజలు పంచుకున్న పశువుల్ని పట్టుకొస్తున్నారు. గంగమ్మను లాక్కొస్తున్నారు. అది జంగయ్య కొచ్చిన ఆవు. అతనికి రెండెకరాల పొలమూ, ఈ ఆవూ వచ్చాయి. ఇంతకాలంగా వాటిని తల్లికంటే ఎక్కువగా చూచుకుంటున్నాడు. ఇవ్వాళ దాన్ని లాక్కొస్తున్నారు గడీకి. అది గడీనుంచే జంగయ్యా ఇంటికి పోయింది. అయినా గడీకి రానని మొరాయించింది. మొండిపట్టు పట్టింది. అందుకే దానికి చాల దెబ్బలు తాకాయి. అయినా అది ఎదురు తిరిగింది. నడివీధిలో పట్టు విడిపించుకుంది. పోలీసు లను కుమ్మింది. జంగయ్య ఇంటివైపు పరిగెత్తింది. దాని వెంట పరిగెత్తారు పోలీసు బలగం. అది జంగయ్య ఇంట్లోకి పోయి తల ఎత్తింది. కాలు దువ్వింది. లాభం లేదనుకున్నారు పోలీసులు. జంగయ్యను పిలిపించారు. వళ్ళంతా వాచిన జంగయ్య వచ్చాడు. అతని కళ్ళలో నీరు నిండింది. "అమ్మా! గంగమ్మా! రా తల్లీ. నీ రుణం చెల్లిపోయింది" అన్నాడు. గంగమ్మ అతన్ని అనుసరించింది. గడీదాకా వచ్చి గంగమ్మ ఏడ్చింది. జంగయ్య గంగమ్మను కౌగలించుకుని ఏడ్చాడు. రెండు ప్రాణాలు ఏడ్చాయి. పల్లె ఏడ్చింది! పశువులు ఏడ్చాయి!! గంగమ్మకు దండం పెట్టాడు జంగయ్యా. పో అమ్మా! తల్లీ, ఇకనుంచి ఇదే నీ ఇల్లు. నేను ఎట్టి మాదిగోణ్ణి అని సాగనంపాడు. ఆవు సాగిపోయింది. జంగయ్యను కొట్టంలోకి తోశారు.

పొద్దు నెత్తికెక్కింది, పోలీసులు ఆకలికి అలమటించి పోతున్నారు. మండుతున్న పొయ్యిలమీదికి, డేగిశా లెక్కాయి. మేకలు గొర్రెలు తెగాయి. శివరావు సర్కిలినస్పెక్టరు కుర్చీలో కూర్చొని సిగరెట్టు పీకుతున్నాడు. బలరామయ్య కుర్చీలో కూర్చున్నాడు. రాముడు వారి పక్కనే నుంచున్నాడు. పోలీసులను వదిలితే నీటిని వదిలిన చేపలా అవుతున్నాడతను. శివరావు ఏదేదో అడుగుతున్నాడు. రాముడు జవాబులు చెపుతున్నాడు. ఏదో గొణుగుతున్నాడు శివరావు. బలరామయ్య ఏదో పలుకుతున్నాడు. వారు ఎంతోసేపు ముచ్చట్లు పెట్టుకున్నారు.

వంటలూ వార్పులూ పూర్తి అయినాయి. దొరలు గడీలోనూ, పోలీసులు బయటా భోజనాలు చేస్తున్నారు. పశువుల కొట్టంలోంచి ఆకలి కేకలు – పసిపాప అవి – వినిపిస్తున్నాయి. పశువులు అంబా అని అరుస్తున్నాయి. అయినా భోజనాలు ముగిశాయి. బంకుల్లో కూర్చొని జగ్గయ్యను పిలిపించాడు శివరావు.

"వాళ్ళెక్కడున్నారు?" అడిగాడు శివరావు.

"నాకే మెరకండి!"

శివరావు రాముణ్ణి చూచాడు.

"నీకు తెల్వకుంటె ఎవ్వరికి తెలుస్తుందిర. కొరియరువు కావు నువ్వు," అడిగాడు రాముడు.

జగ్గయ్య రాముణ్ణి చూచాడు- రాముడు జగ్గయ్యను చూచాడు. అతని కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. రాముడు తల వంచుకున్నాడు. జగ్గయ్య కాండ్రించి కింద ఊశాడు. రాముడు శివరావును చూశాడు. శివరావు పోలీసులను చూశాడు. పోలీసులు జగ్గయ్యమీద పడ్డారు. బాదసాగారు. జగ్గయ్య వళ్ళు చిట్లి రక్తం కారుతూంది. బాధ భరించలేక మొత్తుకుంటున్నాడు. కేకలేస్తున్నాడు. కాని ఒక్క మాటకు సమాధానం చెప్పటంలేదు. పశువుల కొట్టంలోంచి జనం గుంపులుకూడి చూస్తున్నారు.

శివరావు వళ్ళు మండింది, జగ్గయ్యమీదికి ఉరికాడు. పోలీసులు తప్పుకున్నారు. క్రిందపడ్డవాణ్ణి లేపి నుంచోపెట్టారు. పిస్తోలు చూపించి అడిగారు. "ఇప్పుడు చెప్పు ఎక్కడున్నారో" జగ్గయ్య నోటినిండా రక్తం ఉంది. ఉమిశాడు. మండిపోయాడు శివరావు. జగ్గయ్య మీదపడి దబా దబా బాదాడు. జగ్గయ్య పడిపోయాడు. అతడు కనీసం మూల్గలేదు. ఆ శక్తి అతనిలో చచ్చిపోయింది. పిస్తోలు తీశాడు శివరావు. పక్కకు కాల్చాడు. గుండు భూమిలోకి దూసుకుపోయింది. జగ్గయ్య కండ్లు తెరిచాడు. చిరునవ్వు నవ్వాడు. గుండెకు గురిపెట్టాడు శివరావు. "చెప్పు. గుండెలోంచి దూసుకుపోతుంది" అతడు తనుస్తున్నాడు. జగ్గయ్య భార్య మంగమ్మ సెంట్రీపోలీసులను పక్కకు నెట్టి పరిగెత్తుకొని వచ్చింది. బాణం విడిచిన అమ్ములా భర్తమీద పడిపోయింది. గోడుగోడున ఏడ్చింది. జగ్గయ్య ఆవిడ తల నిమిరాడు. అంతే. పోలీసులు ఆవిడ రెండు రెక్కలూ పట్టి లాక్కుపోయారు.

"చెట్టుకు వ్రేలాడతీయండి" తుపాకి గుండులా దూసుకువచ్చింది శివరావు ఆదేశం. జగ్గయ్య కాళ్ళకు పగ్గాలు కట్టి గడీ ముందరి వేపచెట్టుకి వ్రేలాడ తీశారు.

మంగమ్మ విలవిల్లాడింది. ఏడ్చింది. మొత్తుకున్నది. జంగయ్య ఆమెను ఓదార్చేడు: "సౌరాజ్జం వచ్చిందంట్రను. ఏడ్వకు" అని.

అది ఆ ఊరికి కాళరాత్రి. పశువుల కొట్టంలో జనం గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకున్నారు. గుండెలు గుబగుబలాడుతున్నాయి. ఎప్పుడు ఎవరివంతు వస్తుందో తెలీదు. పిల్లలు ఆకలికి అల్లాడిపోతున్నారు. గడీలోంచి గుమ్మని మాంసం ఉడికిన వాసన వస్తూంది. కళ్ళను పత్తికాయలు చేసి చూస్తున్నారు జనం జగ్గయ్యను. జగ్గయ్య వంటిమీద రక్తం పేరిపోయింది. పెక్కులు కట్టింది. ఇంక కారడంలేదు. అసలు ఆ బొందిలో ప్రాణం ఉందో లేదో తెలియడంలేదు.

జగ్గయ్య సంగతి తమకు పట్టనట్లు కోళ్ళుకూశాయి. వేగుచుక్క పొడిచింది. పోలీసు శిబిరంలో సంచలనం ప్రారంభం అయింది. మందు గుండు సర్దుకున్నారు. లారీలు వచ్చాయి. ఎక్కారు. బారులుతీరిన లారీల ముందు జీపు, జీపులో శివరావూ, బలరామయ్యా, రాముడు. శివరావు ఆదేశం మేరకు జగ్గయ్యను దింపారు. జగ్గయ్య పడిపోయాడు. మంగమ్మ సహితంగా జనం గొల్లుమన్నారు. జగ్గయ్యను ఎత్తుకెళ్లి, లారీమీద వేస్తుంటే గుండె బాదుకొని ఏడ్చింది మంగమ్మ. ముందుకు ఉరికిందాన్ని తుపాకి మడమలతో బాది పంపించేశారు పోలీసులు. ఆమె విరుచుకొని పడిపోయింది.

లారీల బిడారు సాగింది. ఊరు దాటింది. సాగుతూంది. ఊళ్ళు దాటింది. అడవిలో దూరింది. బాట ఇరుకుగా ఉంది. లారీలు సాగవు. జీపు వెనక తుపాకులతో పోలీసుల బారు సాగింది. ఎండ ఎక్కిందికూడ కనిపించడంలేదు. అంత దట్టంగా ఉంది అడివి. పోలీసుల బూట్లచప్పుడే, ఏదీ వినరావడంలేదు. మధ్యాన్నానికి ఒక గుట్టకు చేరారు. ఆగారు. గుట్టను చూచి గుండె దక్కుమన్నది శివరావుకు— అంత కొండను ఎలా దువ్వడం? ఎక్కడ ఏ మృగం ఉందో? అసలు ఈ బలగం చాలుతుందా? రాముడు నమ్మదగిన వాడేనా? తమను ఇరికించడు గదా! ఆదే మాట అడిగాడు బలరామయ్యను. బలరామయ్యకూ భయం పట్టుకుంది. స్పష్టంగా జవాబు చెప్పలేదు. రాముడ్ని అడిగాడు. ఇది వాళ్ళ తావరం కాకుంటే తన తల తీయించమన్నాడు. బాగానే వుంది. వాడి తల తీస్తారు కాని తన తల మాట! అనవసరంగా తలదూర్చాననుకున్నాడు. ఇక్కడికి వచ్చినందుకే ఒక ప్రమోషను వచ్చింది. ఎవణ్నన్నా పడ్తే మరో ప్రమోషన్ వస్తుందని ఆశపడ్డాడు. ఏం చేయాలా తోచలేదు. అయినా గుట్టను చుట్టేయమని ఆదేశించాడు. పోలీసులూ వెనుకా ముందాడారు. గద్దించాడు శివరావు. తప్పలేదు పోలీసులకు. పొద్దు కర్రకత్త ఎక్కింది. ఆకలి నకనకలాడుతూంది. ఏడుస్తూ అడుగులు వేస్తున్నారు పోలీసులు.

కొండను దువ్వటం- గాలించడం- సాగుతూంది. ఒక్క పురుగు బయటకు రావడానికి వీల్లేనట్లుగా సాగుతున్నారు పోలీసులు. పొద్దుతోపాటు గుండె కుంగుతూంది శివరావుకు. ఒక గుహకు దారితీశాడు రాముడు. శివరావు అనుసరించాడు. గుండె గుబగుబలాడింది బలరామయ్యకు. అయినా అనుసరించాడు. పోలీసులు తుపాకులు గురిపెట్టి గుహలో ప్రవేశించారు. లోన గలగల చప్పుడైంది. తుపాకులు ధన్ ధన్ పేలాయి. రెండు కుందేళ్ళు తుపాకులమీదినుంచి దూకి బయట పడ్డాయి. అంతా గుహలో దూరారు. చిమ్మన జీకటి. బ్యాటరీ లైట్లు వెలిగాయి. ఆ వెలుగులో విడిచిపోయిన విస్తళ్ళు, బియ్యం నూకలు, కొన్ని కాగితాలు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. గోడమీద నినాదా లున్నాయి.

"రైతురాజ్యం స్థాపిస్తాం"

"దున్నేవాడిదే భూమి"

"శివరావూ ఇంటికిపోవు"

శివరావు బుర్ర తిరిగిపోయింది.

"కాల్చండి" ఆదేశించాడు.

"టప్ టప్ టప్ టప్

ధన్ ధన్ ధన్ ధన్"

పేలుతున్నాయి తుపాకులు. ఒక గమ్యంలేదు. ఒక గురి లేదు. టపాకుల్లా పేలుతున్నాయి.

"ఆపండి. ఏమిట్రా ప్రేల్చుడు" అదొక ఆదేశం. ఎందుకన్నాడో అతనికే తెలియదు. కాని తుపాకులు ఆగాయి. మౌనంగా బయటికి నడిచాడు. బయటికి వచ్చి "పారిపోయారు లంజాకొడుకులు" అని పళ్ళు కొరికాడు శివరావు.

బలరామయ్యగారికి నవ్వువచ్చింది. కాని ఆపుకున్నాడు.

"దిగండి త్వరత్వరగా" అదొక ఆదేశం.

బూట్లు టకటకలు తప్ప ఏమీ వినిపించలేదు. కొండదిగి ఊపిరి పీల్చుకున్నాడు శివరావు.

సూర్యుడు పడమటికి వాలి కొండకు కుంకుమబొట్టు పెట్టాడు.

"కదలండి- వేగంగా నడవండి" అదొక ఆదేశం.

అంతకుముందే వేగంగా నడుస్తున్నారు పోలీసులు. అడవిదాటి వచ్చేవరకు తాటీలు తగలబడుతున్నాయి. ఆ మంటలుచూచి కోపం రావలసిన శివరావుకు దుఃఖం వచ్చింది. చీకట్లు కమ్ముకుంటున్నాయి. బయలే అయినా భయంకరంగా ఉంది. ఏం చేయాలో తోచలేదు. పోలీసులను వలయం తీర్చమన్నాడు. మధ్యన కూర్చుండి పోయారు ముగ్గురు ముఖ్యులు. ఎవరినోట మాట రావడంలేదు. కాలం కదలనంటూంది. అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకున్నారందరూ. ఆ రాత్రి వారికి కాళరాత్రి అయింది.

అలసి ఉన్నారు పోలీసులు. కొండ ఎక్కి దిగారు. కాళ్ళు పీకుతున్నాయి. ఉదయం నుంచీ తిండిలేదు. నిద్ర ముంచుకు వస్తూంది. అయినా అప్రమత్తంగానే ఉన్నారు. గుండ్లు నింపిన తుపాకులు అందరి చేతుల్లోనూ ఉన్నాయి. అంతా దేనికో గురిపెట్టే ఉన్నారు.

అర్థరాత్రి అయింది. కీచురాళ్ళు రొదపెడ్తున్నాయి. ఎక్కడో ఒక గుడ్లగూబ అరుస్తూంది. ఊరిముందు ఊళ్ళపెట్టే నక్కకూత వినిపిస్తూంది. చుక్కలు మిల మిల మెరుస్తున్నాయి. ఎక్కడో ఒక ఉల్క రాలిపడింది. దాంతోపాటే తుపాకులు పేలిన ధ్వని వినిపించింది. తూటాలు రఁయ్ఁమని శివరావు తలమీంచి దూసుకు పోయాయి. వెంట్రుకవాసిలో రామునికి గండం తప్పింది. శివరావు ప్రాణాలు పైపైనే పోయాయి. అతని నోట మాటరాలేదు. అయినా పోలీసుల తుపాకులు ప్రేలాయి. రాముడు నేలకు కరచుకొని పడుకున్నాడు. బలరామయ్యను లాగి పడుకోపెట్టాడు. శివరావు పడుకొని పొజిషన్ తీసుకున్నాడు. పోలీసులు బోర్లాపడు కొని కాలుస్తున్నారు.

'టప్ టప్ టప్ –

ధన్ ధన్ ధన్'

దీపావళి టపాకులు పేలుతున్నాయి. ఎటు పేలుతున్నాయో? ఎందుకు పేలుతున్నాయో తెల్వదు. గురిలేదు. లక్ష్యంలేదు. పేలుతూనే వున్నాయి. శివరావు 'ఆపండి' అనేదాకా పేలుతూనే ఉన్నాయి.

అంతా చుప్‌చాప్. కీచురాళ్ళ రొదలు, గుడ్లగూబల అరుపులుతప్ప ఏమీ వినరావడం లేదు. అందరి గుండెలు పీచుపీచుమంటున్నాయి.

అటునుంచి తుపాకులు పేలాయి. ఇటునుంచి పేల్చవద్దని శివరావు ఆదేశం- బుల్లెట్లు రఁయ్యిఁమని తలమీంచి పోతున్నాయి. ఒకటి, రెండు, మూడు.... ఎన్నో. ఒక గుండు రాముని పాదాన్ని చీల్చుకొని పోవడమూ, అతడు కేకపెట్టడమూ, ఇటునుంచి ఒక్కుమ్మడిగా తుపాకులు పేలడమూ ఒకేసారి జరిగాయి.

అలా గడిచింది ఆ రాత్రి. అయినా తెల్లవారింది. తెల్లివారుతుండగా శివ రావుకు ఒక దిగులు పట్టుకుంది. రావడం వీరుడిలా వచ్చాడు. లారీలు తగల బడ్డాయి. మందుగుండు బోలెడు ఖర్చయింది. ఒక్కణ్ని పట్టుకోకుండా పోతే ఎలా? ఏం చేయాలి? పట్నం నుంచి వచ్చేప్పుడే ఇందుకు కొంత తయారీ చేసుకొని వచ్చాడు. రజాకార్ల దగ్గర పట్టుబడ్డ తుపాకులు కొన్ని రహస్యంగా తెచ్చాడు. అవి ఇక్కడ పట్టుబడినవని ఒక ప్రదర్శన ఏర్పాటు చేయవచ్చు. సరే మరి మనుసులు? అతనికి జగ్గయ్య గుర్తుకు వచ్చాడు. ఎంత గట్టివాడు. ప్రాణాలు తీసినా ఒక్కమాట పొక్కలేదు! అతడు తప్ప గత్యంతరం కనిపించలేదు. అసలు అతడింకా ప్రాణా లతో ఉన్నాడా అని! లేకున్నా తన పని నెరవేరుతుంది. జగయ్యను రప్పించాడు. నీరసంగా ఉన్నాడు. అయినా నడుస్తూనే ఉన్నాడు.

"వదిలేస్తే ఏం చేస్తావు?"

జగ్గయ్య జవాబు చెప్పలేదు. కాని అతని కళ్ళు రక్తం చిమ్మాయి.

"నిన్నే అడిగేది"

"గీ రాముడ్ని చంపుత. వీడు దొంగ, ద్రోహి" అన్నాడు. జగ్గయ్య రక్తం తుకతుక ఉడికింది.

రాముడు వెనక్కు జరిగి శివరావు చాటుకు చేరాడు.

శివరావు రక్తమూ మండింది. కాని అణచుకున్నాడు.

''అయితే వదిలేశాం. ఇక పరిగెత్తు. ఊఁ'' అన్నాడు.

జగ్గయ్య ఒకసారి ఎగాదిగా చూశాడు. వెనక్కు తిరిగి పరుగు లంకించు కున్నాడు.

వెనకనుంచి శివరావు పిస్తోలు పేలింది. జగ్గయ్య వీపులో దూరిన గుండు ఎదను చీల్చుకొని బయటికి వచ్చేసింది. అయినా పరిగెత్తాడు. రక్తం వరద కట్టింది. పడిపోయాడు. శివరావూ, పోలీసులూ పరిగెత్తారు. బలరామయ్యా, రాముడు వెనకనే ఉండిపోయారు.

శివరావు కళ్ళు చీల్చుకొని చూశాడు జగ్గయ్యను.

''రైతురాజ్యం స్థాపిస్తాం''

''దున్నేవాడిదే భూమి''

''విప్లవం వర్ధిల్లాలె'' చివరి నినాదంతో జగ్గయ్య ఆఖరి నిశ్వాసం వదిలాడు.

శివరావు అదిరిపోయాడు. చచ్చేప్పుడూ దీక్ష వదల్లేదు. ఎంత వీరుడు అనుకున్నాడు. వెంటనే పోలీసుగా మారిపోయాడు. అతణ్ణి తీసుకొని బయల్దేరా ల్సిందని ఆదేశించాడు. పోలీసు పటాలం బయలుదేరింది. సాగిపోతూంది. తోవలో పరుగెత్తుతున్న ఒక గోచి గుడ్డవాడు కనిపించాడు. కాల్చమన్నాడు పోలీసుల్ని శివరావు.

పోలీసులు కాల్చారు.

అనామకుడు పడిపోయాడు.

అతడెవడో తెలియదు.

తుపాకులవాళ్ళకింద జమకట్టారు.

శివరావు జైత్రయాత్ర చేసి ఊరికి వచ్చేశాడు. అతడు చంపిన తుపాకుల వాళ్ళనూ, వాళ్ళ దగ్గర పట్టుకున్న వనుకున్న ఆయుధాలనూ గడీముందు ప్రదర్శన ఏర్పాటు చేశాడు. పశువుల కొట్టంలోని పల్లె జనం హోరుమని ఏడ్చారు. మంగమ్మ దుఃఖాన్ని వర్ణించడం ఎలా?

పశువుల కొట్టంలోని జనాన్ని విడిచేశారు. గడపదాటి బయటికి రావద్దన్నారు. ఊరు నిర్మానుష్యంగా ఉంది. మంగమ్మ జగ్గయ్య ఇల్లు చేరింది. ఇండ్లకు చేరా

రనేగాని ఆ రోజు ఒక్క ఇంట్లోనూ పొయ్యి రాజలేదు. ఊరు అశ్రుతర్పణం ఆర్పించింది జగ్గయ్యకు.

గడీముందు చాల సమ్మర్దంగా ఉంది. వంటలు జరుగుతున్నాయి. వార్తలు చేరుతున్నాయి. సాయంకాలానికల్లా పట్నంనుంచి పెద్ద అధికారులూ, నాయకులూ వచ్చారు. ప్రదర్శన చూశారు. శివరావును అభినందించారు అధికారులు. బలరామయ్యను అభినందించారు నాయకులు.

నాయకులు సభ జరుపుతామన్నారు. తుపాకులవాళ్ళ దౌర్జన్యాలను వివరిస్తామన్నారు. తమకు ప్రజల సహకారం కావాలన్నారు. పోలీసులు జనాన్ని కూడదీయాలన్నారు. శివరావు అభ్యంతరం చెప్పాడు. ప్రమాదం జరిగే అవకాశం ఉందన్నారు. నాయకులూ జంకారు. అంతటితో విరమించుకున్నారు.

ఆ రాత్రి విందులూ వినోదాలూ జరిగాయి.

తెల్లవారింది. ఆ రోజు సూర్యుడు ఉదయించలేదు. మబ్బుల్లో దాక్కున్నాడు. మేఘుడు ఉరిమాడు. వర్షం వస్తుందని భయపడ్డాడు శివరావు. అందుకే మత్తు వదలకున్నా బయలుదేరాడు. శవాలను అందరికీ కనిపించేట్టు లారీలమీద కట్టారు. ముందు ఆ లారీ నడిచింది. వెనుక పోలీసు వ్యానులు, పెద్దల జీపులు వరుసగా బయలుదేరాయి—పట్నానికి. శవాలు ఊళ్ళోంచి సాగుతుంటే కిటికీలోంచి అంజలి ఘటించారు జనం. కన్నీటి తర్పణం విడిచారు. అంతకు మించి ఏం చేయగలరు ప్రజలు? ఎక్కువమంది అన్యాయాన్ని సహించరు. అయినా ఏ ఒక్కడో గాని ఎదిరించడు.

పట్నంలో పెద్ద జాతర లాంటిది జరిగింది. మిలటరీ గవర్నర్ సహితంగా అనేకమంది మహామహులు వచ్చారు విద్రోహుల శవాలను చూడటానికి — పట్టితెచ్చిన ఆయుధాలను పరికించడానికి. వారంతా శివరావును ప్రశంసించారు. రాజప్రముఖ్ ఒక ప్రశంసా పత్రం ఇచ్చారు.

ప్రజలూ వేల సంఖ్యలో వచ్చారు. పోలీసులకు ఒక సమస్యగా పరిణమించారు. వారిలో ఎందరు చనిపోయినవారిని వీరులని మొక్కారో? ఎందరు విద్రోహు అని తిట్టారో చెప్పడం కష్టం.

మరుసటి రోజు పత్రికలు పతాక శీర్షికలు ఫోటోల సహితంగా ప్రకటించాయి. శివరావు వీరుడైపోయాడు. అతనికి ప్రమోషను వచ్చింది. — డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ అయిపోయాడు.

శివరావు అద్దం చూచుకున్నాడు. చిరునవ్వు నవ్వాడు. మీసం మెలేశాడు.

శివరావు యముడైనాడు. కాలరుద్రునిలా విజృంభించాడు. అతని తుపాకికి ఎదురులేదు. ఎంతోమందిని చంపాడు. వేలమందిని కాన్సెంట్రేషన్ క్యాంపుల్లో కుక్కాడు. అతడంటే దేశమంతా హడలిపోయింది. కాలాన్ని సహితం కాల్చేశాతను. హాహాకారాలు చెలరేగాయి.

శివరావు అన్న సుందరరావు. అతడు గాంధేయుడు. మోకాళ్ళ వరకే ఖద్దరుపంచె కట్టుకుంటాడు. పైన పంచె ఉండదు. వట్టి వేరుశనగకాయలమీద జీవిస్తాడు. వార్ధా ఆశ్రమంనుంచి పట్నంలో దిగాడు. పరిస్థితులు తెలుసుకున్నాడు. అతని ఎద ఏడ్చింది. ప్రాయశ్చిత్తానికని అయిదురోజుల నిరశన వ్రతం ప్రకటించాడు. దాంతో శివరావు సహితంగా అంతా హడలిపోయారు. అయిదు రోజులు గడచి పోయాయి. అయినా విరమించలేదు వ్రతం సుందరరావు. ఇంత ఘోరాన్ని చూస్తూ జీవించలేనన్నారు. ఆత్మార్పణం చేస్తానన్నారు. శివరావు వళ్ళు మండింది. తన సిరిసంపదలను చూచి అన్న సహించలేక పోతున్నాడని ప్రచారం సాగించాడు. అన్నను అరెస్టు చేస్తాననేదాకా వచ్చింది వ్యవహారం. అధికారులు వారించారు. వ్యవహారం ఢిల్లీదాకా పోయింది. విచారణ జరుపడానికి ఒక కమిటీని వేసింది ప్రభుత్వం.

శివరావు పడగ నేలకు కొట్టుకున్నాడు. ఇంతమందిని హడలగొట్టానే వంట్లో ప్రాణంలేని ఒక మనిషి తనను ఓడించాడు! ఏమిటా మహత్తు? అని ప్రశ్నించుకున్నాడు. కాని జవాబు దొరకలేదు.

అనేకమంది అభ్యర్ధనమీద సుందరరావుగారు వ్రతం విరమించారు. శివరావు ఇంటికే భోజనానికి వచ్చారు. శివరావు అన్నను చూచాడు. మండిపోయాడు. ఏమేమో అందామనుకున్నాడు, కాని ఏమీ అనలేకపోయాడు "భోజనానికి లేవండి" అనడం తప్ప.

దేశముఖ్ బలరామయ్యగారి పలుకుబడి పట్నంలో నానాటికీ పెరుగుతూంది. కాబూమరి. వారు ఒక అవతారం చాలించారు. కుచ్చుటోపీలు, షేర్వానీలు, చుడీదార్ పైజామాలు పాత పెట్టెల్లో భద్రపరిచారు. వారి ఇంట్లో ఒక ఖాదీ భండార్ వెలిసింది. వారు ఖద్దరు వినా అన్యం ధరించడంలేదు. అధికారాన్ని పట్టుకొని అర్థం ఉండే రోజులు పోయాయని గమనించారు. అర్థాన్నిబట్టి అధికారమూ పలుకుబడీ వచ్చే కాలం వచ్చిందని గమనించారు. అందు ననుసరించి ఖర్చుకు వెనుదీయడంలేదు. వారు ప్రభుత్వ యంత్రాంగంలో ఒక భాగంగా మారిపోయారు. అసలు ఆ దేశముఖ్ వ్యవస్థే అలాంటిది.

నైజాం నవాబు కాలంలో పకడ్బందీ అయిన పరిపాలన ఎన్నడూ లేదు. అడవిమయంగా వున్న దేశంలో బందిపోటు ముఠాలు రాజ్యం చేసేవి. బందిపోట్ల బాధ తట్టుకోలేకపోయింది ప్రభుత్వం. వారితో ఒక ఒప్పందం కుదిరించుకొని వారిని దేశముఖులను, దేశపాండ్యాలనూ చేసింది. దొంగలను దొరలను చేసింది. శిస్తు వసూలుచేసే హక్కు వారికి ధారాదత్తం చేసింది. కొంతకాలం పద్ధతి బాగానే నడిచింది. కాని తరవాత తరవాత దొరలు శిస్తులు ఎగబెట్టసాగారు. శిస్తు వసూళ్ళకు అధికారులు వస్తే వారి గుడారాలు తగలబెట్టించారు. వారి ప్రాణాలకు రక్షణ లేకుండా చేశారు. ఒక్కొక్కసారి శిస్తులు కట్టినట్టే కట్టేవారు. శిస్తులు పట్టుకెళ్ళే

అధికారులను అడవుల్లో దోపించేవారు. దాంతో ప్రభుత్వపు తలప్రాణం తోకకు వచ్చింది. "ఘర్ ఘర్ దేశముఖ్" విధానం ప్రవేశ పెడ్తామని ప్రతిజ్ఞ చేసింది ప్రభుత్వం. అందుననుసరించి రైత్వారీ పట్టా పద్ధతి ప్రవేశ పెట్టారు. అయినా దేశముఖులు వారి తాబేదార్లే అన్ని భూములూ వ్రాయించుకున్నారు. శిస్తు వసూలు హక్కును దేశముఖుల నుండి లాక్కొని కరణాలకు కట్టబెట్టింది ప్రభుత్వం. గ్రామాల్లో పటేల్ పట్వారీల రాజ్యం వెలిసింది. దేశముఖులు నామమాత్రులైనారు. అయినా వారి దొరతనానికి అడ్డు లేకుండేది. అందరినీ లొంగదీసుకొని సాగించిన నిరంకుశ ప్రభుత్వం తెలంగాణం జాగ్రుతం అయ్యేదాకా సాగింది. రైతులు తుపాకులు పట్టుకున్నారు. కాలరుద్రులైనారు. దేశముఖులు ఊళ్ళువదలి యూనియన్ ప్రాంతాలకు పారిపోయారు — వారు హిందువులు కావడాన వారికి నిజాం ప్రభుత్వపు అండ లభించకపోవడం ఇందుకు ప్రధాన కారణం. దొరలను పారదోలిన రైతు, దొరల భూములను పంచుకున్నాడు. పదిలక్షల ఎకరాలు పేదలకు పంచాడు. పల్లెల్లో రైతురాజ్యం స్థాపించాడు. హైద్రాబాదు రాజ్యంమీద పోలీసుచర్య జరగడంతో దొరలు మళ్ళీ చేరారు. వారి అవతారాలు మార్చుకొని ఖద్దరు దొరలైనారు. అలాంటివారిలో మన బలరామయ్య ఒకరు. వారి పలుకుబడి ప్రభుత్వంలో పెరిగిపోవడంతో శివరావు జరిపిన దౌర్జన్యాలను విచారించడానికి ఏర్పరచిన కమిషన్‌లో బలరామయ్యను కూడా సభ్యునిగా నియమించారు. అందువల్ల శివరావు బలరామయ్యను ఎక్కువగా ఆశ్రయించాల్సి వచ్చింది.

దొరవారు కమిషన్ కార్యక్రమంలో మునిగి ఉన్నారు. రాష్ట్రం మొత్తం లోనూ పర్యటన సాగిస్తున్నారు. తీరిక బొత్తిగా ఉండటంలేదు. అందుకే ఉదయమే వచ్చాడు శివరావు బలరామయ్య బంగళాకు. అప్పటికే డ్రైవరు కారు తుడుస్తున్నాడు. శివరావును సోఫాలో కూర్చొమ్మని చెప్పి రాముడు బలరామయ్యకు చెప్పడానికి వెళ్ళాడు. బలరామయ్య లేచాడు. తెలుగు పత్రిక గుణించుకొని చదువుతున్నాడు. తెలుగు చదవడం నేర్చుకుంటున్నాడతను. ఉర్దూ కాలం పోయిందిమరి. ఇంగ్లీషు అక్షరాలు కూడా నేర్చుకుంటున్నాడు. రాజకీయ భాషగా ఉర్దూ తొలగించి ఇంగ్లీషును ఏర్పరచారు.

"దొరా! శివరావుగా రొచ్చిండు"

"ఎందుకొచ్చిండట?"

"నాకు చెప్తాడుండి?"

"చెప్పకుంటె ఇంతెజార్ చెయ్యమను. స్నానం గీనం చేసిగాని వెళ్ళం. అన్నట్లు మరిచిన పదికొట్టంగ పోయెడిదున్నది. జర జల్ది కానియ్యి."

"అట్లనే నుండి."

శివరావుతో దొర చెప్పిన మాట చెప్పి వెళ్ళిపోయాడు రాముడు దొరవారికి ఏర్పాట్లు చేయటానికి.

శివరావు సిగరెట్టు కాల్చాడు. అటూ ఇటూ పచార్లు చేశాడు. బంగళా ముందున్న మొక్కల్ని పరిశీలించాడు. గోడలకున్న పటాల్ని చూశాడు. ఆఖరుకు పత్రిక చదువుతూ కూర్చున్నాడు. భారతదేశానికిగాను ఒక రాజ్యాంగం సిద్ధం చేయడం, అందరికీ సమాన హక్కులివ్వడం లాంటి వార్తలేవో కనిపించాయి. శివరావు చిర చిరలాడాడు. అందరికీ సమాన హక్కులేమిటి? పిచ్చిగాని ఇంగ్లీషు వాళ్ళకే తప్ప వీళ్ళకు ప్రభుత్వం చేయడం రాదనీ తేల్చుకున్నాడు.

"ఏమో వచ్చినవు?" టోపీ సవరించుకుంటూ వచ్చారు దొరవారు.

పత్రిక అక్కడ పడేసి లేచి నుంచొని నమస్కరించాడు శివరావు. "దర్శనం చేసుకుందామని...."

"చేసుకున్నవ్ గద........" అంటూ కూర్చున్నాడు బలరామయ్య.

తికమక పడ్డాడు శివరావు. "ఏదో మీ దయ ఉండాలి"

"ఏందో దయ దయ అంటున్నవు ఊళ్ళన్ని తిరిగి చూస్తున్నం గద ఎన్ని షికాయతు లొస్తున్న యనుకున్నవ్?"

"నేనేం చేయాలని చేశానండీ. అంత చేసినా వాళ్ళు లొంగందే. విన్నారుగా మొన్న పోలీస్ క్యాంప్‌మీదనే దాడిచేశారు. నలుగురు పోలీసులనే హతమార్చారు."

"నిజమేనయ్యా! అసలు తుపాకులోండ్లను ఎంతమందిని చంపినవంట, మొన్నగా ఊళ్లో ఇల్లు తగలబెట్టి పల్లీలు కాల్చుక తిన్నవటగద."

"రామరామ. ఇల్లు తగల పెట్టించింది నిజమేనండి. కాని శనక్కాయ కాల్చు కోవడాని క్కాదు. కాలుతున్న ఇంట్లో శనక్కాయలున్నాయండి. అవి బయటపడ్తే పోలీసులు తలా నాలుగు కొట్టుకు తిన్నారండి."

"నీకేమి నాలుగొద్దులుంటవు మూటకట్టుకుంటవ్ ఎల్లిపోతవు? మేము జవాబు చెప్పాలె ప్రజలకు. మళ్ళీ ఆ ఊళ్ళ మనిషిని బందూఖ్‌త కాలిస్తివి. మొఖం కండ్లు బడకుండ కట్టెల్ల పెట్టి కాలపెడ్తివి. తుపాకులోండ్ల లీడర్ను చంపిన్నని బాజాబజా యిస్తివి. అదేందంటవు?"

"ఆ మాత్రం చేయకుంటే ప్రజలు చేతిలో ఉంటారండి? ఏవో కొన్ని తప్పులు చేశా. అందుకే తమను వేడుకుంటున్నాను. రక్షించాలె."

"అది సర్లేగాని మా ఊళ్ళ గాంధీ విగ్రహం పెడదా మనుకుంటున్న ఏమంటవ్."

"చాల మంచి దండి. చేయమంటే ఏర్పాట్లన్నీ చేస్తానండీ. ఏంలేదు మీరో కంట కని పెట్టాలండి."

"సరే విగ్రహం బాగుండాలె చూడు. లీడర్లు గీడర్లు అందరు వస్తమంటు న్నారు."

"చిత్తం వేరే చెప్పాలండీ! శలవు తీసుకుంటా మరి" అని వెళ్ళిపోతూ విగ్రహం ఖరీదుకూడా తనమీదనే వేసినందుకు బలరామయ్యను మనసులో తిట్టు కున్నాడు.

"ఇగో చూడు" మళ్ళీ పిలిచాడు బలరామయ్య. పోతున్నవాడల్లా వెనక్కి తిరిగి "చిత్తం" అన్నాడు.

"రాముణ్ణి ఊరికి పంపుదామనుకుంటున్న. మనోడెవ్వడు లేకుంటెట్లు ఆడ? జర పోలీసుల్నిచ్చి పంపుండి. జర బందోబస్తు గట్టిగ చెయ్యండి. రాముడి క్షేమన్నాయెనా...."

"ఎంత మాటండీ. శివరావుండగానే! పోలీసు లారీలో పంపిస్తానండి రామయ్యగారిని."

"సరే ఇగపో."

శివరావు వెళ్ళిపోయాడు. బలరామయ్య కారులో ఏదో రాచకార్యం మీద సాగిపోయాడు.

రాముడు ఆ రాత్రంతా ఊరిని గురించే కలలుగన్నాడు. తన కేదో ప్రమాదం జరిగినట్లు, తల తెగినట్టూ కలవచ్చింది. ఉలికిపడి లేచి చూచాడు. ఏమీలేదు. అంతా భ్రమ. అయినా గుండెదడ ఆగలేదు. చాల సేపు నిద్రరాలేదు. కన్ను మలగగానే ఊడలమర్రి కనిపించింది.

ఊడలమర్రి, బొందమీద పాతబట్టలు, ఎవడో రాక్షసుడు, ఆ దృశ్యం అతన్ని భయపెట్టింది. అయినా అందులో ఏదో ఆకర్షణ ఉంది. అందుకే అతను తయారైనాడు ఊరికి వెళ్ళడానికి. పోలీసుల లారీలు కూడా వచ్చాయి ఇంటి ముందుకు. వారితోపాటే ఘోరం అయిన వార్త కూడా వచ్చేసింది.

"కుప్పలు తగలబడ్డాయి. తగల పెట్టారు."

బలరామయ్య అగ్గి అయిపోయాడు. ఆయన్ను చూచి శివరావు రుద్రుడై నాడు. మరికొన్ని పోలీసుల లారీలు వచ్చాయి. ఊరివైపు సాగాయి. బలరామయ్య గారి జీపు ముందు నడిచింది. ఆయన చేతిలోనూ తుపాకి ఉంది.

జరిగిందేమంటే పంచుకున్న పొలాలను ప్రజలే దున్నారు. విత్తనాలు వేశారు. పండించారు. పొలాలు పంటకు వచ్చేవరకు బలరామయ్య వచ్చాడు. పోలీసుల్ను ఉంచి ప్రజలతో కోతలు కోయించాడు. కుప్పలు పెట్టించాడు. కుప్పలకు సాయుధ పోలీసుల్ను కాపలా పెట్టాడు. అయినా అంటుకున్నాయి కుప్పలు. వారు ఊరికి చేరుకునేవరకు ఇంకా మండుతూనే ఉన్నాయి. పోలీసులు తప్ప అక్కడ ఎవరూ లేరు. గుండెలు గుప్పెట్లో పెట్టుకొని ప్రజలు ఇండ్లలో కూర్చున్నారు.

కుప్పలు ఒకేచోట కూర్చిపెట్టించాడు. కోసిన వాళ్ళకు కూలి ఇవ్వలేదు బలరామయ్య. మూడేళ్ళుగా తన పొలాల పంటలు తింటున్నారు. ఎందుకివ్వాలి అనుకున్నాడు. కాని తరవాత ఇద్దామనే అనుకున్నాడు. నూర్పిళ్ల అయినాక ఇస్తా

నన్నీ వ్వాగ్దానమూ చేశాడు. అయినా ఎంతపని చేశారు లుచ్చాలు అనుకున్నాడు. కుప్పలు కాలుతున్నాయి. మంటలు లేస్తున్నాయి. ధాన్యం చిటపట మని పేలాలు వేగుతున్నాయి. ఆ మంట బలరామయ్య ఎదలో మండింది. కళ్ళల్లో, ఊపిరిలో మండింది. మండింది గడ్డి. అది అంటుకుంటే ఆరదు. బూడిద అయి కూలా ల్సిందే.

"తమాషా చూస్తున్రా! బోగమోళ్ళొత్తున్రా!!" గొంతు చించుకొని కేక పెట్టాడు బలరామయ్య.

శివరావు గుండె దడల్లుమంది. మార్చ్ అన్నాడు. పోలీసులబూట్లు టకటక లాడేయి. ఊళ్లో ప్రవేశించాయి– గుడిసెల్లో దూరాయి. కొంపల్లో దూరాయి. దెబ్బలు, అరుపులు, కేకలు, ఆర్తనాదాలు, హాహాకారాలు, ఏడ్పులు, పెడబొబ్బలు. జనాన్నంతా తుపాకి మడమల్తో బాది, లాఠీల్తో కొట్టి గడీ ముందుకు లాక్కొచ్చారు పోలీసులు. జన్నాన్ని మధ్యనుంచి వలయాకారంగా ఏర్పడ్డారు పోలీసులు. లాఠీలతో బాదసాగారు. ఏడ్పులు కేకలు తగ్గాయి. మౌనంగానే దెబ్బలు తింటున్నారు! ఆదుకునే నాధుడు లేడని తేల్చుకున్నారు. అరచి ఏం ప్రయోజనం? అయినా పిల్లల కేకలు ఏడ్పులు వినిపిస్తూనే ఉన్నాయి.

బలరామయ్య, శివరావు వచ్చారు. వారి ముఖాల మంటలు కనిపిస్తూనే ఉన్నాయి. వారిని చూసి పోలీసులు తప్పుకున్నారు. బలరామయ్య ఒక్కసారి జనాన్ని తేరిపార చూశాడు. ఉరిమాడు "లంజ కొడుకుల్లార! కుప్పలు కాలబెట్టి పానాల్తో ఉంట మనుకుంటున్రేమో! ఒక్కొక్కణ్ణి బందూక్‌తో ఉడాయిస్త- ఊరిని కాడు చేస్త. చెప్పండి ఎవడు తగల పెట్టిండో?"

జనంలోంచి జవాబు రాలేదు.

నిశ్శబ్దం ఒక్కడూ పలుకలేదు.

పిల్లల ఎక్కిళ్ళు తప్ప ఏదీ వినరావడంలేదు.

"మాట్లాడరేం గాడ్దికొడుకులు. ఇట్లింటారు మీరు. చూడండి కాలుస్త" అని తుపాకి ఎత్తాడు. ట్రిగ్గర్‌మీద వేలుకూడా వేశాడు. కాల్చనూ కాల్చాడు. కాని శివ రావు పరిగెత్తుకొచ్చి తుపాకి మడమను వంచాడు. బుల్లెట్ గాలిలో తేలిపోయి వేప చెట్టుకు తగిలింది. జనంలో హాహాకారాలు చెలరేగాయి.

"చెప్పండి ఎవరు కాల్చారో, లేకుంటే అందర్నీ కాల్చేస్తా" ఈ తడవ శివరావు ఉరిమాడు.

"ఎరకలేంది ఎట్ల చెప్పుతముండి" జంగయ్య జనంలో అన్నాడు —కాదు సుమారు అరచాడు.

"పట్కొరాండి లంజకొడుకును" బలరామయ్య కేకకు దిక్కులు పిక్కటిల్లాయి.

పోలీసులు జంగయ్యను పట్టుకొచ్చి బలరామయ్య కాళ్ళ ముందుకు గెంటారు. జంగయ్య బోర్లపడిపోయాడు. నొసట రాయి గుచ్చుకుంది. రక్తం సొటసొట వారుతూంది.

"లే, లేచి నిలబడు."

లేవలేదు జంగయ్య.

"లేవమంటే లేవవులే" తన్నాడు బలరామయ్య- పాదానికి రక్తం అంటింది. గుండె జల్లుమంది. అయినా అరిచాడు. "లేపి నిలబెట్టండి."

లేపి నుంచోపెట్టారు పోలీసులు.

రక్తం ముక్కుమీది నుంచి పెదవులదాకా పారి నోట్లోకి పోతుంటే చేత్తో తుడుచుకొని నుంచున్నాడు జంగయ్య.

"చెప్పు ఎవరు తగలపెట్టిన్రో?"

మాట్లాడలేదు జంగయ్య.

"చెప్పమంటే దయ్యమాలె నిలబడ్డవు" అంటూ లెంపమీద కొట్టాడు బలరామయ్య. నొసట రక్తం చిమ్మి బలరామయ్య ముఖంమీద పడ్డది. జంగయ్య తూలి నిలదొక్కుకున్నాడు.

బలరామయ్య మరీ మండిపడ్డాడు. "చెప్పమంటే చెప్పవులే- బొంద పెత్త లంజకొడక" అని చెయ్యెత్తాడు మళ్లీ కొట్టడానికి.

దొర చేతిని పట్టుకున్నాడు జంగయ్య- హరిజనుడు- వెట్టిమాదిగ!

"చెప్పుతే ఏం చేస్తరుండి?" అడిగాడు! ప్రశ్నించాడు? సవాలు చేశాడు. అది సవాలు కాదు– శూలమై గుచ్చుకుంది దొర గుండెలో. రక్తం వేడెక్కింది. ఆవిర్లు వచ్చాయి. అయినా కోపం అణచుకున్నాడు.

"చెప్పుతె అందర్నీ ఇడ్చిపెడ్తం. కాల్చినోణ్ణి కోసి కాకులకు గద్దలకు ఏస్తం. పంటకుప్ప తగులపెడ్తే ఊరుకుంటమా? నోటికాడి ముద్ద గుంజుకున్నరు లంజకొడుకులు" కాస్త సౌమ్యంగానే అన్నాడు బలరామయ్య.

"ఎవరుండి నోటికాడి ముద్ద గుంజుకున్నది?" అని నొసట కారు రక్తాన్ని అరచేతితో రుద్ది దొరకు చూపిస్తూ "ఈ నెత్తురు ఒడిసి పొలాలు దున్నినం. పంట కోస్కపోతోంటే ఒక్క మంచిదానుండి?"

మండిపోయాడు దొర. "దొరలకు పుట్టినార్ర గాడ్దికొడుకుల్లార దొరల సొమ్ము తినేటందుకా?" కాండ్రించి నేలమీద ఊసి అడిగాడు బలరామయ్య.

"దొరల కాలం పోయిందండి. దున్నేటోనిదే...." మాట పూర్తి కాకుండానే లాఠీతో పడ్డాయి దెబ్బలు జంగయ్య మీద.

"వీడే తగుల పెట్టిండు. కొట్టండీ లంజాకొడుకును" ఆదేశించాడు బలరామయ్య. అంతకు ముందే సాగించారు పోలీసులు. ఇప్పుడు మరీ జోరుగా బాద సాగారు.

జంగయ్య మాట్లాడలేదు. మౌనంగా దెబ్బలు తింటున్నాడు. కాళ్ళు, చేతులు, వీపు, ముఖం వాచిపోతున్నాయి. అయినా ఆగడం లేదు. జనంలో హాహాకారాలు చెలరేగాయి. అక్కడా లాఠీలు పడ్తూనే ఉన్నాయి.

జంగయ్య స్పృహతప్పి పడిపోయాడు. అతన్ని లాక్కుపోయి గడీలో ఒక కొట్లో పారేశారు. శివరావు ప్లాను ప్రకారం జంగయ్య, జగ్గయ్య, వీరభద్రం ఇళ్ళకు నిప్పంటించ బడింది. అవి తగలబడుతుంటే బలరామయ్య గుండె చల్లబడ్డది.

కొట్లో జంగయ్య ఉన్నాడు. పశువుల కొట్టంలో ప్రజలున్నారు. ఊరుబయట పంటకుప్పలు, ఊళ్లో కొంపలు తగలపడ్తున్నాయి. దొరవారు గాంధీ విగ్రహ ప్రతిష్ఠాపన గురించి మాట్లాడుతున్నారు. సరిగ్గా గడీ ముందున్న విడి స్థలంలో విగ్రహం స్థాపించబడాలన్నారు. స్థలం నిర్దేశించి చూపించాడు శివరావుకు.

"ఎట్లుంటదంటవ్?"

"చాల బాగుంటుందండి" అన్నాడు శివరావు.

ఆ రాత్రి ఎందుకో భయం భయంగా ఉంది శివరావుకు. నిద్రపట్టలేదు. బలరామయ్య కూడా పొర్లుతున్నాడు. పోలీసు క్యాంపుల్లో పడుకున్న రాముడు ఉలిక్కిపడి లేచాడు. వీరభద్రం, వీరభద్రం అని కేకలు పెట్టాడు. అదే కేక పోలీసులూ పెట్టారు. కాపలా ఉన్న పోలీసు తుపాకి పేల్చాడు. అది ఎదుటవున్న పోలీసువానికి తగిలింది. పెద్ద కేక పెట్టి పడిపోయాడు. ఎవడు కాల్చిందీ ఎవడు పడిపోయిందీ తెలియలేదు పోలీసులకు. శివరావు అదిరిపడి లేచాడు. టార్చిలైట్లు వెలిగాయి. రక్తపు మడుగులో ఉన్న పోలీసు కనిపించాడు. తుపాకుల వాళ్ళు వచ్చారనుకున్నాడు శివరావు.

"వెతకండి, పట్టండి" కేక పెట్టాడు.

విజిల్స్

బూట్ల టకటకలు.

టార్చిలైట్ల వెలుగులు.

ఊరంతా గాలించారు పోలీసులు- ఏమీ అగుపించలేదు. ప్రజలు పశువుల కొట్టంలోనే ఉన్నారు. ఒక్కడూ కదల్లేదు. ఆశ్చర్యం అనిపించింది శివరావుకు. ఇంతమంది కళ్ళుమూసి వచ్చారు! ఒక పోలీసును చంపి వెళ్ళిపోయారు! తలవంపు అనిపించింది శివరావుకు. నామోషీ అనిపించింది. నామర్దా అనిపించింది.

"ఏం చెయ్యాలి?" ఈ ప్రశ్న శివరావు మెదడును చీల్చింది. బలరామయ్యను సంప్రదించాడు. జంగయ్యను ఖతంచేసి తీసికెళ్ళాలని సలహా ఇచ్చాడు. శివరావుకది నచ్చలేదు. సుందరరావుగారి ఉపవాసం అతన్ని అంత ఊపేసింది!

తెల్లవారింది. కొనవూపిరితో ఉన్న జంగయ్యనూ, ఊపిరిలేని పోలీసునూ

లారీలో వేసుకొని ఊరువదిలారు శివరావూ, బలరామయ్యా పోలీసు బలగంతో. రాముడు ఊళ్ళోనే ఉండిపోయాడు.

శివరావు ఇంటికి చేరే వరకు రోదన ధ్వనులు వినిపిస్తున్నాయి. గుమ్మంలో అడుగు పెట్టగానే అతని భార్య సావిత్రమ్మ అతన్ని చుట్టేసుకొని హోరుమంది. శివరావు స్థాణువులా నుంచున్నాడు. అతనిముందే ఘోరమైన దృశ్యం. శివరావు కూతురు స్వరాజ్యం – ఆరేళ్ళ ముద్దుపాప – లారీకింద పడ్డది. తల నలిగిపోయింది. మెదడు బయటికి వచ్చింది. అది చూశాడు శివరావు. భరించలేకపోయాడు. "పాపా" అని కేక పెట్టి పాపమీద పడిపోయాడు. కన్నీరు కాలువలు కట్టింది. గుండెలు అవిసేట్టు ఏడుస్తున్నాడు. అతన్ని చూచే వాళ్ళకు దుఃఖం వస్తూంది.

అతడు పోలీసు శివరావు కాదు – తండ్రి శివరావు!

జంగయ్యను కాన్సెంట్రేషన్ క్యాంపులో వేశారు. విడిగావున్న మైదానం చుట్టూ ముళ్ళతీగ చుట్టారు. ఆచ్ఛాదనలేదు. జనం క్రిక్కిరిసి ఉన్నారు. జంగయ్యకు అప్పటికి స్పృహ వచ్చింది. అతని స్థితిచూసి నలుగురూ దూరం జరిగి అతనికి కూర్చునే స్థలం ఇచ్చారు. ఎండ మండిపోతూంది. వళ్లూ, గుండె మండుతున్నాయి. దాహం వేసింది. నీళ్ళడిగాడు. నలుగురూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. రోజు మొత్తానికి లోటా నీరు మాత్రమే ఇస్తారు. అందులోనే అన్నీ గడుపుకోవాలి. అయినా కొద్ది నీళ్ళిచ్చారు. త్రాగాడు జంగయ్య. కొద్దిగా స్థిమిత పడ్డాడు.

"ఎందుకొచ్చిన్రీడికి?" అడిగాడు. ధ్వని నీరసంగా ఉంది.

"పట్టుకొచ్చిన్రు"

"ఎందుకు?"

"నిన్నెందుకు తెచ్చిన్రు?"

"దొరకెదురు తిరిగిన"

"ఊరికెనె తెచ్చిన్రు మమ్ముల్ని – తుపాకులోండ్లల్ల చేరిన మంట్రు"

"ఎట్లున్న దీద?"

"అడుగుతావు! చూస్తున్నవుకద. ఒక్కపాలి చంపుతె బాగుండెడిది. గిద్దెడు గుగ్గిళ్ళు, లోటెడు నీళ్ళిస్తరు. ఎండనక వాననక గిట్లనె చావాలె. గత్తర తగిలింది కేంపుల. ఇయ్యాల పది పీనిగల్ను పట్కపోయిన్రు. మనతోనే బొందలు సుత పెట్టిస్తాన్రు, సొరాజ్జమొచ్చిందంటాన్రేమె మల్ల. అంతె మల్ల దొరరాజ్జి మేనంటావా?"

జంగయ్య మాట్లాడలేదు. అతనికేదో తల తిరుగుతున్నట్లయింది. కళ్ళ ముందు చీకట్లు కనిపించాయి. కూర్చున్నవాడు సోలాడు. తూలాడు. పక్కనున్న వారు పట్టుకున్నారు. వళ్ళు మసిలి పోతూంది. వేలాలు వేగేట్లున్నాయి. ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"ఏం చేద్దమంటవ్?'' ఒకడు అడిగాడు.

"చేసెడిదేమున్నది. చూస్తుందం" ఇంకొకడన్నాడు.

"దేవుడా! జల్ది పాణం తీయి. నీ దయ" అన్నాడు మరొకడు.

తెల్లవారే వరకూ జంగయ్య గాయాలన్నీ చీములు పట్టాయి. వళ్ళంతా సలుపులు, తీవ్రమైన జ్వరం. అందులో వాంతులూ విరేచనాలు. ఆ సాయంకాలానికి కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. ప్రాణాలు ఎగిరి పోయాయి! పక్కనున్నవారు కన్నీళ్లు కార్చారు!!

మూడోనాడు శవాన్ని పూడ్పించారు.

వార్త ఊరికి ఆలస్యంగా చేరింది. చేరి ఊరు ఏడ్చింది. వల వలా ఏడ్చింది. లబ లబ మొత్తుకో లేకపోయింది. పోలీసుల బెదురుకు కుమిలి కుమిలి ఏడ్చింది. ఆ ఊరు నిద్రపోలేదు. ప్రతి ఇంట్లో అతనికి సంబంధించిన కథలు చెప్పుకున్నారు.

గడీలో రాముడికి నిద్ర పట్టలేదు. ఆతడికి మర్రిచెట్టు దయ్యం ఆవరించింది. కన్ను మూసినా, తెరిచినా మర్రిచెట్టు కనిపిస్తూంది. మర్రి దగ్గరికి వెళ్ళాలి. కాని ధైర్యం చాలడంలేదు. తుపాకులవాళ్ళ భయం. పోలీసులను తీసికెళ్ళలేడు. పోలీసుల భయం! ఎవరినీ నమ్మలేడు. అంతా తనను మోసం చేస్తారని బుగులు. ఈ బుగులుతో నిద్రపట్టలేదు. అతడు ఎవరినీ నమ్మడు, తనను తానే నమ్మని దశకు వచ్చాడు. ఏం చెయ్యాలో తోచదు. మనసులో ఆరాటం. మనసులో మంట. మనసులో తహ తహ. మాట చెప్పలేడు. మనిషిని నమ్మలేడు. అయినా ధైర్యం చేశాడు. తెగించాడు. చావుకూ సిద్ధమయ్యాడు. తెల్లవారు జామున మసక చీకట్లో, ముసుగు వేసుకొని బయలుదేరాడు. చెంబు తీసుకొని బయల్దేరాడు. అదొక నెపం. ఊరు దాటాడు. గుండె గుబగుబ లాడుతూంది. శ్మశానానికి చేరాడు. తల్లిని కాల్చిన చోటు చూశాడు. మనసులో తల్లి వెలిసింది. కళ్ళు చెమ్మగిల్లాయి. గిరుక్కున తిరిగాడు. పెద్ద పెద్ద అంగలు వేశాడు. మర్రికిందికి చేరాడు. తాను వేసిన పాత గుడ్డలు లేవు. పాతినచోటు కనిపించలేదు. ప్రాణాలు ఆవుర్న పోయినాయి. కూలబడ్డాడు. చతికిలబడ్డాడు. ఒకసారి చుట్టూ చూశాడు. మర్రి ఊడ గుర్తుపట్టి తోడాడు. మళ్ళీ చుట్టూ చూశాడు. ఎక్కడా అలికిడి లేదు. దూరాన కుక్క ఏడుస్తూంది. ఇంకా తోడాడు, తోడాడు. మసక చీకట్లు మాయం అవుతున్నాయి. ధైర్యం విచ్చుకు పోతూంది. అయినా గుండెను బండను చేసుకున్నాడు. తవ్వుతున్నాడు. తోడుతున్నాడు. వచ్చేసింది. కనిపించింది. మూట! అదేగుడ్డ, గుండె గంతేసింది. అయినా అనుమానమే. ఎవడైనా చిల్లపెంకులు కట్టి పెట్టాడేమో! మూట పైకి తీశాడు. చుట్టూ చూశాడు. ఏదో అలికిడి వినిపించింది. మర్రిచాటునుంచి. మొద్దట వెనుకనుంచి. మూట చంకన పెట్టుకొని మర్రిచాటుకు పరుగెత్తాడు. చూశాడు. ఏమీ లేదు. తొండ ఎండుటాకుల మీద పరుగెత్తుతూంది. రాముడు నవ్వుకోవాల్సింది. అంత ధైర్యం లేదు. మళ్ళీ చుట్టూ చూశాడు. అక్కడే చతికిలబడ్డాడు. మూట విప్పాడు.

జిగేలుమన్నాయి. కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. బంగారు నగలు! నోట్లు! డబ్బు! వేలితో గెలికి చూశాడు. అన్నీ ఉన్నాయి. మూట కట్టాడు. చంకన పెట్టుకున్నాడు. ముసుగు కప్పుతున్నాడు. ఊరివైపు సాగాడు. కాళ్ళు ఊగిసలాడుతున్నాయి. కళ్ళు ఏలిధుకో మసకలు కమ్ముతున్నాయి.

రాముడి చంకన మూట ఉంది. అది అతనికి ధైర్యాన్ని ఇవ్వాల్సింది. కాని ప్రాణమును చంకన పెట్టుకున్నట్లు బెదురుతున్నాడు. ఈ డబ్బు విషయంలోనే తుపాకులవాళ్ళతో కలహించాడు. వాళ్ళతో విడిపోయాడు. చెప్పకుండా పారి వచ్చాడు. వారు పగబట్టారు. ఇది పగ సొమ్ము. దొంగసొత్తు. అందువల్ల అతనికి భయం. అయినా గబగబా వచ్చాడు. గడిలో ప్రవేశించి గదిలో దూరాడు. తలుపులు వేసుకున్నాడు. కూర్చున్నాడు. మూట విప్పాడు. ఒక్కొక్కటే లెక్క పెట్టాడు. అన్నీ ఉన్నాయి. నోట్ల కట్టలు రొంటికి కట్టుకున్నాడు. మరి నగలు! వీటిని ఏం చేయాలి! ఎక్కడ పెట్టాలి! మూటకట్టి మూలకు పెట్టాడు. గది బయటికి వచ్చాడు. గదికి తాళం వేశాడు. గుంజి చూశాడు. కాలు కాలిన పిల్లిలా తిరిగాడు. గుండెలో గుబ గుబ తగ్గలేదు. మూట మంచంకింద ఉన్నప్పుడూ బుగులే, అది రొంటిన చేరిన బుగులే, ఏదో అగ్గిమూట దగ్గర పెట్టుకున్నట్లుంది. అటూ ఇటూ తిరిగాడు. ముందరినుంచి వెనక్కు, వెనుకనుంచి ముందుకు, ఎందుకీ భయం? ఏమిటీ భయం? ఎలా పోతుందీ భయం? ఏమీ అర్థం కాలేదు.

రాముడు ఆ రోజు తిండి తినలేదు. తిన్నాననిపించాడు. ఏదో పాపం చేసి నట్లు కుమిలి పోసాగాడు. నిజమే తాను పాపం చేశాడు. ఈ సొమ్ముకోసం దొంగ తనంగా పారి వచ్చాడు. వీరభద్రంతో పోట్లాడుకున్నాడు. వీరభద్రం ఎంత మంచి వాడు! పేదల బాధల్ను గురించి చెప్పాడు. దొరల దౌర్జన్యాన్ని గురించి చెప్పాడు. తనను మనిషిని చేశాడు. నాయకుణ్ని చేశాడు. నమ్మాడు. అతనికే ద్రోహం తల పెట్టాడు తాను. పాపం మూటకట్టుకున్నాడు. పాపం! పాపం. పాపం!

రాముడు మళ్ళీ ఆలోచించాడు. పాపం, పుణ్యం ఎక్కడున్నాయి? ఇవన్నీ మాటలు బాపలు కనిపెట్టిన అసత్యాలు. లోకం డబ్బుమీద ఆధారపడి ఉంది. అది ఉంటే పాపం పుణ్యం అవుతుంది. అది లేకుంటే పుణ్యమే పాపం అవుతుంది. తన దగ్గర డబ్బుంది. ఇక దాన్ని వదులుకోడానికి వీల్లేదు. వదులుకుంటే నాశనం అయినట్లే. తెంటచెడ్డ రేవడి అవుతాడు. అది నిజమే కాని ఈ బుగులు, ఈ దిగులు ఎట్లా?

రాముడు అనుకున్నాడు పల్లెలో పాపం దాగదు. పట్నంలో పాపం అనేది లేదు. అక్కడ ఎవరిదారి వారిది. పల్లె వదిలెయ్యాలను కున్నాడు. ఇక్కడ తనకేం ఉంది? పాత వాసనలు, దాసీపుత్రుడు. పట్నంలో తాను దొరనన్నా అడిగినవాడు లేడు. ఆదే మంచిదనుకున్నాడు. ఒక నిర్ణయానికి వచ్చేశాడు. కాని అప్పటికే సూర్యుడు గుట్టచాటున చేరాడు.

రాముడికి ఆ రాత్రి నిద్రలేదు. తెల్లవారింతరువాత పల్లెలో నిలవలేదు. ఇద్దరు పోలీసులను వెంటపెట్టుకొని స్టేషను చేరాడు. పోలీసులను సంతోష పెట్టాడు. వారికి డబ్బిచ్చాడు. రైలెక్కాడు. పట్నంలో దిగాడు.

రాముడికి పట్నం అందంగా కనిపించింది. కొత్త అందాలు గోచరించాయి. అతడు బలరామయ్య ఇంటికి వెళ్ళలేదు. హోటల్లో బస చేశాడు. ముందు వేషం మార్చుకోవాలనుకున్నాడు. మంచి దుస్తులు ధరించాలనుకున్నాడు. బజారుకు బయలుదేరాడు. అతనికి ఖద్దరు దుస్తులు నచ్చాయి. వాటిలో ఏదో ఖదర్ గోచ రించింది. కొన్నాడు. హోటలుకి వచ్చి దుస్తులు ధరించాడు. టోపీ పెట్టుకున్నాడు. అద్దం చూచుకున్నాడు. అచ్చు బలరామయ్యలాగే ఉన్నాడు తాను. ఖద్దరు బట్టలు కొత్తఠీవిని తెచ్చిపెట్టాయి. కొత్త గౌరవాన్ని తెచ్చిపెట్టాయి. చిరునవ్వు నవ్వాడు రాముడు. ఎన్ని పాపాలనైనా కట్టిపెట్టగలవనుకున్నాడు ఈ బట్టలు. అందుకే గాంధీజీని గొప్పవాడంటారేమో! అనుకున్నాడు.

రాముడికి కొత్త ఉత్సాహం వచ్చింది. కొత్త ధైర్యం వచ్చింది. అసలు కొత్త జన్మ వచ్చింది. పాత జన్మ తాలూకువి ఏవీ ఉంచదలచలేదతను. నగలు బ్యాగులో వేసుకొని బయలుదేరాడు. డబ్బుగా మార్చాడు. హోటలుకు వచ్చి హాయిగా నిద్ర పోయాడు. పల్లెలో పట్టుకున్న గుబులు వదిలి పోయింది. పట్నపు గాలి సోకింది. నిద్రలో ఏవేవో కలలు గన్నాడు. అవి అతనికి గిలిగింతలు పెట్టాయి. ఆకాశానికి ఎత్తాయి.

రాముడు బలరామయ్య ఇంటికి వెళ్ళాడు. బలరామయ్య రాముణ్ని చూశాడు. పాదాలనుండి తలదాకా కొలిచాడు. మండిపోయారు లోపల్లోపల. తన రోజులే అవుతే ఆడబాపబిడ్డ ఇంత ధైర్యం చేసేవాడా? ఈ వేషంలో తన ముందుకి వచ్చి బతికేవాడా? కాలం మారిపోయింది. ఎంత ధైర్యంగా వచ్చాడు రాముడు! అనుకు న్నాడు.

రాముణ్ణి మరొకసారి చూశాడు బలరామయ్య. రాముడు నుంచునే ఉన్నాడు. చేతులో పత్రిక ఉంది. ఇంకా కూర్చోలేదు. కూర్చుంటాడేమో! "ఎప్పుడొచ్చినవ్?" నుంచోపెట్టే ప్రశ్నించాడు బలరామయ్య.

"వస్తనే ఉంటిని"

"ఈడికి కాదు. ఊర్నించి" కాస్త కరకుగా అడిగాడు బలరామయ్య. కళ్ళు కొద్దికొద్దిగా ఎర్రబడుతున్నాయి.

"నాలుగొద్దులాయె" వినయంగా జవాబు చెప్పాడు రాముడు.

"యాడున్నావ్?"

"హోటల్ల"

"అంతదాక వచ్చినాది? ఈవేసమేంది?"

"ఖట్టలు మంచిగనిపిస్తే......." తడబడ్డాడు రాముడు.

"లీడరు వైతవ?"

"మేమేమైతముండి. దొరలుకావాలెగాని పట్కపోతరేమోనని గీ గుత్తలు కొన్న."

"బాగానే ఉన్నది బాగోతులేశం" బలరామయ్య కాస్త తగ్గాడు. తనవాడనే వాడు ఈ ఒక్కడే ఆ ఊళ్ళో. వాణ్ణి దూరం చేసుకోవటం మంచిదికాదనుకున్నాడు. "సరేలే. లోపలికి పో. హోటల్లెందుకుంటవ్? ఈణ్ణేదిగు" అన్నాడు.

రాముడు తలవంచుకొని వెళ్ళిపోతుంటే చూచాడు బలరామయ్య. అచ్చం తనలాగే ఉన్నాడు రాముడు. నడకకూడా తనదే, మనస్సులో ఏవేవో మధుర స్మృతులు మసిలాయి. అమృతవాణి గుర్తుకు వచ్చింది. పోయిన దొరసాని, తన కొడుకూ గుర్తుకు వచ్చారు. కళ్ళు చెమర్చాయి. ధోవతి అంచుతో కళ్ళు తుడుచు కుంటుండగా శివరావు వచ్చి నమస్కరించాడు.

"గాంధీజీ విగ్రహం తయారైందండీ" శివరావు విన్నవించాడు.

"అయినాది? యాడున్నది? చూస్త" ఆతురత వ్యక్తపరచాడు బలరామయ్య.

"ఇంకా రాలేదు. వారం రోజుల్లో వస్తుంది. ఊళ్ళో ఏర్పాట్లన్నీ జరగాలి."

"అదీసర్లెగాని ఎప్పుడు పెద్దమంటవ్?"

"గాంధీ జయంతి దగ్గర్లోనే ఉంది కదండీ. ఆ రోజే అయితే బాగుంటుంది."

"మంచిమాట చెప్పినవ్. సుందర్రావేమన్నడు. వస్తడటనా?"

"అక్కడకు వచ్చి ఏంపేచీలు పెడ్తాడోనని నేను అడగలేదండీ. అడుగుతే వస్తాడే అనుకుంటా. కాని...." అని నసిగాడు శివరావు.

"ఏందయ్యా చెప్పేడిది ఎన్నడు చక్కంగ చెప్పినవుగన్క. సంగతేందో చెప్పు"

"ఏదో భూదానం, గీదానం అంటున్నాడండి."

"అదేంది? ఏమొ కొత్త మాట పట్టుకొస్తివి"

"అవునండీ కొత్త మాటేనండి. అసలు హింసాకాండకంతటికి భూమి ప్రధాన కారణమని ఆయన సిద్ధాంతం. అయితే ఎవరినీ బలవంతం చేయవద్దంటాడాయన. భూమిని మీ లాంటి వారినుండి దానం అడిగి తీసుకుంటాడట."

"తీసుకొని యవసాయం పెడ్తాడా?"

"కాదండి. అలా తీసుకున్న భూమిని పేదలకు పంచిపెడ్తాట."

"బాగానే ఉన్నది, తుంటదించి మొద్దు ఎత్తుకున్నట్లున్నది. దానాలు గీనాలు శాన చేసినం ఇక చేసెడ్డిలేదు."

"సరే అది మీ యిష్టం. కాని రిపోర్టు నాకు వ్యతిరేకంగా తయారవ్తుందని...."

"అవ్వయ్యో చూస్తున్నలేగని వాళ్ళేమొ అంగ్రేజల రాస్తాండిరి. నాకేమొ తెల్వదాయె. నీకేంకాకుండ చూస్తలే. బేఫికర్ గుండు నీకెందుకు? అన్నట్లు మరిచిన మీటింగుకు పోవాలె. అగో పదైంది. జరడ్రైవర్ను పిలువ్."

శివరావు డ్రైవర్ను పిలవడానికి వెళ్తే రాముణ్ణి పిలిచాడు బలరామయ్య. ఇంట్లోంచి రాముడు, బయటనుంచి శివరావూ, డ్రైవరు ఒకేసారి వచ్చారు.

శివరావు రాముణ్ణి చూచి ఆశ్చర్యపోయాడు.

"రామయ్యగారా?" అన్నాడు.

రాముడు నమస్కరించాడు.

"ఇల్లిడిచి యాడికిపోకు" అని చెప్పి వెళ్ళిపోయాడు బలరామయ్య.

రాముడు సోఫాలో కూర్చున్నాడు. అతని బుర్రలో ఏవేవో ఆలోచనలు ముసిరాయి. అనుకోని విధంగా డబ్బు అందింది. అమాంతంగా ధనికుడు అయి పోయాడు. కాని డబ్బుతో ఏంచేయాలి? తానేం కావాలి? ఇంకా ఎంత సంపాదించాలి? ఎలా సంపాదించాలి? తాను పెరగాలి. పెద్దవాడు కావాలి? తానూ మీటింగులకు వెళ్ళాలా? వెళ్ళాలి. అందుకేం చేయాలి? ఏవేవో ఆలోచనలు వచ్చాయి. అంతులేని ఆలోచనలు ముసిరాయి. జేబులోంచి సిగిరెట్టు తీశాడు. వెలిగించాడు. పొగతోసహ ఏదో భారం తగ్గుతున్నట్లు అనిపించింది. ఇంకా పీల్చాడు. ఇంకా పీల్చాడు. గట్టిగా దమ్ములు లాగాడు. వంటరితనం భరించలేకుండా ఉన్నాడు. తన ఆలోచనలు ఎవరితో చెప్పుకోవాలి? ఎవరున్నారు తనకు? ఉన్న తల్లిపోయింది. అమృతవాణి పోయింది. ఆ ఆలోచనే ఏదో గుండెలో భారం కలిగించింది. తల్లి ఉంటే ఎంత సంతోషించేదో! అసలు సంతోషించేదా? మళ్ళీ ఒక ఆలోచనల తంపర. చాయ్ తాగా లనిపించింది. వంటవాణ్ణి పిలిచాడు. వాడు వచ్చి వినయంగా ముందునుంచున్నాడు. నవ్వువచ్చింది రాముడికి. తానూ అలాగే నుంచున్నాడు నిన్నటిదాకా. ఎంత మార్పు!

"చాయ్ చేస్కరా" ఆజ్ఞాపించాడు.

వంటమనిషి వెళ్ళిపోయాడు. క్షణంలో టీ తెచ్చి టీపాయ్ మీద పెట్టాడు. వెళ్ళిపోతుంటే పిలిచాడు రాముడు!

"ఏమ్ సంగతులు?" అడిగాడు. ఎందుకడిగాడో అతనికే తెలియదు.

"నాకేం తెలుస్తయ్ దొరా - వండిపెట్టుకునెటోణ్ణి."

"అంతేగని నువ్వాణ్ణుంచి వచ్చినవ్" అదే ఉబుసుపోకకే అడిగాడు.

"ఇమలమ్మ దొర్సాని పంపింది."

రాముడి మెదట్లో ఏదో మెరుపు మెరిసింది.

"ఆ దొర్సాని యాడుంటున్నది?"

చెప్పాడు వంటమనిషి.

"బాగున్నదా?"

"ఏం బాగున్నది— పెన్మిటి చచ్చె. వలవల ఏడుస్తాంది."

"సర్లె పో వంట చేస్కొ" పంపించేశాడు వంటమనిషిని.

విమలమ్మ వరవరరావుగారి మొదటి భార్య. వరవరరావు ఆ వూరికి కరణం. మంచివాడు. భక్తిపరుడు. ఒకనికి చెడుపుచేసి ఎరుగడు. అతడంటే ఆ ఊళ్లో అందరికి గౌరవం. ఎప్పుడూ పురాణాలు, సమారాధనలతో కాలం గడుపుతుండే వాడు. బోలెడు ఆస్తివుంది. అలాగని గర్వపడేవాడు కాడు. పిల్లలులేక వార్థక్యంలో మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. కమలమ్మ సాధ్వి. మంచి వయసులో ఉంది. ఆమెకూ చాలాకాలం పిల్లలు కలుగలేదు. ఈలోగా రజాకార్లు విరుచుకపడ్డారు. ఊరు తగల బెట్టి వరవరరావుగారిని సజీవదహనం చేశారు. కమలమ్మను వీధిలో చెరిచారు. ఆమె ఆ రాత్రి బావిలోపడి ఆత్మహత్య చేసుకుంది. తల్లిగారి యింట్లో ఉన్నది విమలమ్మ మాన ప్రాణాలు దక్కాయి. కాని కనీసం భర్త శవాన్ని చూచుకోలేదు. కాలం కన్నెర్రచేసింది. తల్లిగారిల్లూ బుగ్గి అయింది. ప్రస్తుతం ఒక్కతీ పట్నంలో తల దాచుకుంటూంది. ఆమెకు పల్లెలో లంకంత ఇల్లుంది. రాముడికి జానెడు జాగలేదు. ఆలోచించాడు రాముడు. విమలమ్మ ఇంటికి వెళ్ళాడు.

పిలుపు విన్నది విమలమ్మ. ధ్వని గుర్తించి గుమ్మంలోకి వచ్చింది. ఒక్క క్షణం దీక్షగా చూస్తేగాని రాముణ్ణి గుర్తించలేదు. గుర్తించగానే ఏనాటిదో దుఃఖం పొంగివచ్చింది. ఏడ్చేసింది. స్థాణువై నుంచున్నాడు రాముడు. ఎందుకు ఏడుస్తు న్నది అర్థంకాలేదు. తరువాత అర్థం చేసుకున్నాడు. వరవరరావు పోయిన్నాటి నుంచీ తాను కనిపించలేదు. చావు అందరికి వస్తుందని ఓదార్చాడు. నలుగురితో మంచి అనిపించుకొని పోయాడు మహానుభావుడన్నాడు. తన తల్లి పోయిందని చెప్పి కంటతడి పెట్టాడు. "పాపం! అమృతవాణి పోయినాది" అని రాముణ్ణి ఓదార్చింది. తరవాత ఒక కుర్చీవేసి రాముణ్ణి కూర్చోమన్నది. తాను లోపలికివెళ్ళి చాయ్‌కి నీళ్ళుపెట్టి వచ్చింది. చిరుచాప వేసుకొని తలుపుకు ఆనుకొని కూర్చుంది. పేరు పేరు వరుసన ఊళ్లో వాళ్ళందరినీ అడిగింది. తెలిసినంతవరకు చెప్పాడు రాముడు. తన కథకూడ కొంత చెప్పాడు.

"సరెగాని ఈ గడబిడ ఎప్పుడు తగ్గుత దంటవ్?" అడిగింది విమలమ్మ.

"తగ్గకేం చేస్తదిగని. ఊళ్ళ పోలీసోళ్ళు మకాం పెట్టిన్రు. ఇగ తుపాకు లొందు ఊళ్ళకి బందైన్రు. అడువుల్ల గాలిస్తాన్రు పోలీసులు. ఇయ్యాల్లో, రేపో పట్టుపడ్తరు. పట్టుపడ్డనాడు ఖతమే ననుకోరి."

"ఏమొ! ఏమైతదో!! అంత అన్యాయంగున్నది. అయినోడు కానోడు చస్తున్నడు."

"ఇనుముతోని నిప్పుకూడ దెబ్బతినాలె దొర్సాని. ఊళ్ళకి వస్తమను కుంటున్నా!"

"ఊరికొచ్చి ఏం చెయ్యాను రాముడూ! ఆయన తిరిగినచోటూ, కూచున్న చోటూ చూసుకుంటూ ఎట్లుండ? మహారాజు మంచిగనే పోయుండు. దుఃఖం మూట నా నెత్తిన పెట్టి పోయుండు. ఈడనే 'రామా, కృష్ణా' అనుకుంటు ఉంట. ఇంకె న్నాళ్ళని? నేనుకూడ కాటికి కాళ్ళు చాచుకొనె ఉంటిని."

"మరి ఇల్లేం చేస్తరు?"

"ఇల్లు కట్టినోడే పాయె. నేను చేసేదేందీ? ఉంటది."

"ఏమనుకోకుంటే, దొర్సాని, ఒక్కటి అడుగుదమనుకుంటున్న."

"అడుగు నాయనా అనుకునే దేమున్నది?"

"ఊడ్చి, చల్లి దీపం పెట్టుకుని మీ ఇంట్ల ఉందమనుకుంటున్న. ఎన్నాళ్ళని దొరతానుంట? మీరెప్పుడొస్తనంటె అప్పుడు ఎళ్ళిపోత. చేయించి పెట్టమంటె భూములుకూడ చేయించిపెడ్త. వచ్చిందాట్ల నా కింత మీకింత ఏమంటరు?"

"మంచిది అట్లనే చెయ్యి. ఎప్పుడన్న వస్తే ఉండేటందుకు ఒక అర్ర ఉంచు. గింజలు ఈడికే తెచ్చియ్యి. నువ్వన్న బాగుపడు చూసి సంతోషిస్త."

"అట్లనె దొర్సానీ, మీ దయుండాలె."

"దేవుడి దయుండాలె. బాగుపడు నాయనా బాగుపడు. ఆ రోజు వస్తే ఎవడు ఆపగలడు?"

"దొర్సానీ ఇంకొక్కమాట"

"ఊఁ" అని లేచిపోయి చాయ్‌చేసి గ్లాసులోతెచ్చి కుర్చీకి దూరంగా పెట్టి "చాయ్ తీసుకో" అని కూర్చున్నది.

గ్లాసు అందుకుంటూ "మల్లి మీకు?"

"నా మొఖానికి చాయ్ కూడానా? తాగు నాయనా తాగు. ఏమో అడుగుత నంటివి?"

"ఆబ్కారీపాటలు పాడ్తాను. నేనే తీసుకుంద మనుకుంటున్న."

"తీస్కో. నన్నెడిగెడిదేంది?"

"నిన్ను అడగకుండ ఎట్ల చేస్త?" అని చేతులు పిసుక్కుంటూ "మీ షేర్లు మీద తీసుకుందమనుకుంటున్న. నిన్ను పైసడగను. వచ్చిందాంట్ల ఏకాన్నొంత్తు మీకిస్త."

"ఇంత బతుకు బతికి ఇంటెనక బాయిల పడమంటవా?" కాస్త కోపంగానే అన్నది విమలమ్మ. "వరవరరావు పెండ్లం సార దుకాణం పెట్టుకున్నదని షేరు తెచ్చుకుందునా? నాకు నీ ఏకానొద్దు, దో ఆనొద్దు."

లాగి లెంపమీద కొట్టినట్లయింది రామునికి. తల తిరిగిపోయింది. దట్టు పేరు చెబితే లొంగుతుందనుకున్నాడు విమలమ్మ. ఓడిపోయాడు. లేచి నుంచ్చొని చేతులు జోడించాడు.

"దొర్సానీ తప్పుకూసిన మన్నించండి. బుద్ధి గడ్డితిన్నది. పైకం దొర్సాని ఇచ్చిందని దొరతో చెప్పత. మీరు పైసియ్యొద్దు. మాట సహాయం చెయ్యాలె. అంతే. దొర అడుగుతే కాదనకుండి. చాలు. నాలుగు పైసలు సంపాయించుకుంట, మీ దయ.''

విమలమ్మకు ఆ మాటలు బాగనిపించలేదు. అసహ్యంగా కూడా అనిపించాయి. అయినా రాముడు బాగుపడడానికి అడ్డురాదల్చుకోలేదు. ''అట్లనేలే'' అని లేచి నుంచుంది. అది ఇంక వెళ్ళిపోవచ్చు ననడానికి సంకేతం.

''ఈ మాత్రం దయ ఉంచుండి. నేను పొయ్యొస్త'' అని వెళ్ళిపోయాడు రాముడు.

రాముడు అబ్కారీ కంట్రాక్టు తీసుకోవాలనడంలో అర్థం ఉంది. భారత దేశానికి స్వాతంత్ర్యం ఇస్తూ బ్రిటిష్‌వారు సంస్థానాధీశులకు కూడా స్వాతంత్ర్యం ఇచ్చారు. నైజాం నవాబు మీర్ ఉస్మానలీఖాన్ స్వతంత్ర ప్రభువును అయినానని బుజాలు ఎగరవేశాడు. ప్రజలను అణచిపెట్టి తన స్వాతంత్ర్యం పరిరక్షించుకోవాలనుకున్నాడు. కాని ఒక ప్రజా వెల్లువ లేచింది. ఒక మహోద్యమం తలెత్తింది. రాజకీయ పార్టీలన్నీ సహాయ నిరాకరణం ప్రకటించాయి. తాడిచెట్లు కొట్టివేయడం, ఆబ్కారీ కంట్రాక్టులు తీసుకోక పోవడం, విద్యా సంస్థలను, ప్రభుత్వ కార్యాలయాలను బహిష్కరించడం ఆ కార్యక్రమంలో కొన్ని అంశాలు. అందువల్ల ఆబ్కారీ బందైంది. ఊళ్ళల్లో సారాయి దుకాణాలు లేకుండా అయినాయి. పోలీసుచర్య తరువాత సైతం సాయుధ పోరాటం కొనసాగినందున కంట్రాక్టులు తీసుకోవడానికి భయపడ్డారు జనులు. వాస్తవంగా ఆ పల్లెలో మొదట్నుంచీ సారాయి దుకాణం లేదు. కాబట్టి చౌకగా దుకాణం సాధించవచ్చనుకున్నాడు రాముడు. ఎవరు తాగినా తాగకున్నా పోలీసులైతే ఉన్నారు. గిట్టుబాటు కాకపోదు అనుకున్నాడు. అబ్కారీ కంట్రాక్టు రావడానికి బలరామయ్య తగుమాత్రం సహాయం చేశాడు. కంట్రాక్టు వచ్చేసింది. దానికీ ఒక చిన్న ప్రారంభోత్సవం చేయించదలచుకున్నాడు రాముడు. బలరామయ్య గారితో విన్నవించాడు. గాంధీజయంతి వస్తూనే ఉంది. ఎలాగూ గాంధీజీ విగ్రహ ప్రతిష్ఠాపన జరగాల్సే ఉంది. కాబట్టి ఆనాడే చేయింతామన్నాడు. రామునికీ ఆ మాట నచ్చింది. అందుకు ఏర్పాట్లు చేయడానికి పల్లెకు పంపాడు రాముణ్ని బలరామయ్య.

గల్లుమని గజ్జలు మ్రోగాయి. గడీ ముందు కచ్చడం ఆగింది. ఎవరో అధికారి వచ్చారనుకున్నారు పోలీసులు. అటెన్షన్లో నుంచున్నారు. దిగింది రాముడే అయినా క్షణం గుర్తించలేదు. గుర్తించి తక్కుమని సలాం కొట్టాడు సుబేదార్. ప్రతి నమస్కారం చేసి కరచాలనం చేశాడు రాముడు. ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు. బండి మనిషి పెట్టెబెడ్డింగు తెచ్చి బంకుల్లో పెట్టాడు. పెట్రొమాక్సులైట్లు, జెండాలతోపాటు పేకలు కూడా తెచ్చిపెట్టాడు. వెళ్ళిపోయాడు. సుబేదారుకు సిగ్గ

రెట్టు అందించి తాను సిగరెట్టు కాల్చాడు రాముడు. "ఊళ్ళు ఎట్లున్నది?" అడిగాడు రాముడు.

"అలాగే ఉంది" ఉర్దూలో సమాధానం చెప్పాడు సుబేదారు. తరువాత సంభాషణ ఉర్దూలోనే జరిగింది.

"ఏం చేయాల? వాళ్లు వస్తూనే వున్నారు. ప్రజలు ఇంకా వారికి సహాయం చేస్తూనే ఉన్నారు. సరేగాని ఏమో చాలా సామాను తెచ్చారు?" సుబేదారు అడిగాడు.

"తెలీదా? గాంధీజీ విగ్రహం ప్రతిష్ఠించాలి. ఏర్పాట్లు చేయడానికి వచ్చాను. పనులు చాల ఉన్నాయి. ఎలా జరుగుతాయో భయం ఏమీ లేదుకదా?"

"భయం లేకుంటే మేమెందుకూ! అయినా మేమున్నాం కాబట్టి భయంలేదు. ఊళ్ళో అందర్నీ పట్టి చేయింతాం. ఏం ఊరో ఇంత సార బొట్టన్నా దొరకదు."

"ఎందుకు దొరకదు? దుకాణం పెడ్తున్నాగా. నేనే పట్టా!"

"ఏమీ! మీరే పట్టారూ!! బాగుంది. పేకముక్కలు కూడా తెచ్చినట్లున్నారు. బాగానే పొద్దుపోతుంది. ఏం ఊరో ఒక్కనికి పేకరాదు."

"నేర్పాలి. నేర్పుదాం. పట్నం నుంచి కొంచెం తెచ్చాను. మంచి సరుకు లేవండి."

"ఏర్పాట్లకు ప్రారంభోత్సవం పదండి."

ఇద్దరూ గదిలోకి వెళ్ళారు తాగడానికి. తరవాత కొందరు వచ్చారు. తాగుడు అయింతర్వాత పేకాటతో తెల్లవారింది.

తెల్లవారిం తరవాత ఏర్పాట్లు మొదలైనాయి. మార్గాలు చదును చేయించడానికి ఊళ్లో వాళ్ళ వీపులు చదునుచేశారు. గ్రామం మొత్తాన్ని కదిలించారు. హాహాకారాలు లేచాయి. అయినా పనులు సాగుతూనే ఉన్నాయి. గాంధీ జయంతి మరి? పట్నంనుంచి తాపీ పనివారు వచ్చారు. గద్దెకట్టారు. ఊరునిండా తోరణాలు వెలిశాయి. ఖద్దరు జండాలు గర్వంగా ఊగసాగేయి. లౌడ్ స్పీకర్ కూడా వచ్చేసింది. వచ్చేజీపులకు, పోయే కార్లకు విరామంలేదు. ఊరు పోలీసులతో నిండిపోయింది. తెల్లవారితే గాంధీ జయంతి.

గాంధీ జయంతి రానే వచ్చింది. బలరామయ్యగారూ ఉదయాన్నే దిగారు. ఏర్పాట్లన్నీ చూచారు. రాముణ్ణి మెచ్చుకున్నారు. సారాయి దుకాణం ప్రారంభించాల్సిన స్థలం చూశారు. అందంగా అలంకరించబడింది. తోరణాలు కట్టారు. జండాలు చెక్కారు. బల్లలు, కుర్చీలు వేశారు. బలరామయ్యే దాని ప్రారంభోత్సవం చేయాల్సింది. బాగుందనుకున్నాడు. రాముని వీపు చరచాడు.

సాయంకాలానికల్లా పట్నంనుంచి నాయకులు దిగారు. లౌడ్‌స్పీకర్లో సినిమా పాటలు సాగేయి. ఊరివాళ్ళకు అంతా వింతగా ఉంది. పిల్లలు సభాస్థలిచుట్టూ తిరగడం గంతులు వేయడం సాగించారు.

నాయకులు గదిలో దిగారు. వారితోపాటు శివరావూ దిగాడు. వారికీ ఫలహారాల ఏర్పాట్లు జరిగాయి. మాటలు, ముచ్చట్లు, చర్చలు గదిసాంతం సంబరం నింపుకుంది. ఇలాంటి ఏర్పాట్లు చేసినందుకూ, పల్లెలో గాంధీ విగ్రహం పెట్టిస్తున్నందుకు నాయకులంతా బలరామయ్యను అభినందించారు. తీవ్రమైన చర్చ జరిగిం తరవాత సారాయి దుకాణపు ప్రారంభోత్సవమే మొదలు జరగాలని నిర్ణయించబడింది. నాయకులంతా అక్కడకు చేరారు. వారితోనే నిండిపోయిందా ప్రదేశం. వెండి కత్తెరతో రిబ్బను కత్తిరించాడు బలరామయ్య. కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. దేశాభివృద్ధికి సారాయి దుకాణాలు చాలా అవసరమనీ, ఊరూరా, ఇంటింటా ఈ దుకాణాలు ఏర్పాటు కావడానికి నిరంతర కృషి జరగాలనీ, చిన్న ఉపన్యాసం ఇచ్చారు బలరామయ్యగారు.

నాయకులంతా గాంధీజీ విగ్రహం దగ్గరికి చేరుకున్నారు. జనం ఎక్కువగా లేరు. ఏ కొద్దిమందో ఉన్నారు. ఊళ్ళో వాళ్ళందరినీ రావలసిందని మైక్‌లో నాయకులు విన్నవించారు. అయినా ఇంకా ఇండ్లలో చాలామంది ఉన్నారని గ్రహించాడు శివరావు. పోలీసులకు సైగచేశాడు. ఊరు ఖాళీ చేయించి సభాస్థలిని నింపారు పోలీసులు. సభాస్థలి జనంతో కిటకిట లాడసాగింది. జనానికి భక్తి వచ్చేసింది. మౌనంగా కూర్చున్నారు. కాని భక్తి ఎక్కువైన చంటి పిల్లలు ఏడ్వసాగారు.

ఒక పెద్దనాయకుడు వేదికమీద లేచి నుంచున్నాడు. బలరామయ్య ఆ నాయకునికి పూలదండ వేశాడు పెద్దది. చప్పట్లు కొట్టారు అందరూ. అతడు పూలదండ తీసి బల్లమీద పెట్టాడు. జనాన్ని ఒక్కసారి కలయచూశాడు. చేతులు జోడించి నమస్కరించాడు. తరవాత గాంధీజీ విగ్రహానికి మొక్కాడు. ఆ తరువాత ఆవిష్కరించాడు. ముసుగు తొలగించాడు. చప్పట్లు వినిపించాయి. లైట్లవెలుగుతు విగ్రహం జిగేలుమన్నది.

విగ్రహం బలరామయ్యాదిలా కనిపించింది జనానికి.

గాంధీజీ అలాగే వుండేవాడేమో అనుకున్నారు.

నాయకునికీ అలాగే అనిపించిందేమో. ఎగాదిగా చూచాడు. వేదికమీదికివచ్చి ఉపన్యాసం ప్రారంభించాడు.

"భాయియో ఔర్ బహనో!"

"ఇది గాంధీజీ విగ్రహం ఉన్నది. గాంధీజీ శాన గొప్ప మనిషి ఉన్నాడు. మహాత్ముడు ఉన్నడు. అసల్ ఆయన దేవుడు ఉన్నడు. అంగ్రేజోళ్ళను ఎల్లగొట్టె తందుకు పుట్టిండు. ఎల్లగొట్టిండు. అవతారం చాలించిండు. గాంధీజీ స్వరాజ్యం తెచ్చిండు. మన దేశంవాండ్లు రాజ్యం చేయాల్నన్నడు. చేస్తున్నరు. నైజాం నవాబు పోయిండు. ఇప్పుడు బలరామయ్య మీకు లీడర్. ఆయన చెప్పింది ఇనాలె. చెయ్యమన్నది....

"ధన్"మని పేలింది.

సభాస్థలంలో పేలింది.

వేదికదగ్గర పేలింది.

పొగ మబ్బులా లేచింది.

కల్లోలం చెలరేగింది. హాహాకారాలు బైల్దేరాయి. ఏమైంది? ఏం ప్రేలింది. ఎక్కడ? ఎందుకు? అది ఎవనికీ తెలియదు. అందరూ ప్రాణరక్షణకోసం పరిగెత్తారు. ఒకరిని ఒకరు తోసుకున్నారు. కొందరు పడ్డారు. లేచారు. పెద్దలు, నాయకులు, పోలీసు అధికారులు గడీలోదూరి తలుపు బిగించుకున్నారు. ఊళ్ళో తలుపులన్నీ బిగుసుకున్నాయి. గడీలో జనం తనుస్తున్నారు. పోలీసులు భయం భయంగా కాపలా కాస్తున్నారు.

గడీలో బలరామయ్య అన్నాడు "మంది నెత్తికెక్కిన్రి మాదర్‌చత్‌లు."

"ఔ. చేతులుంటలేరు. సభల్నె జరిగింది అబ్బ, ఎంత దైర్నం!" అన్న పెద్దనాయకుడు శివరావువైపు చూశాడు.

"కమీషన్లు వేశారు గదండీ. మరి జనం చేతిలో ఎలా ఉంటారు? మాకు శిక్షలు విధించండి. అణిగివుంటారు జనం." అన్నాడు శివరావు.

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు బలరామయ్య - వచ్చిన నాయకుడు.

"ఏం చేద్దమంటవ్!" ఇద్దరూ ఒకేసారి అడిగారు శివరావును.

"ఏం చేసేదేముంది! పేలిన పదార్థం తీసి అనాలిసిస్‌కు పంపుతాం. అక్కడ శాస్త్రజ్ఞులు తేలుస్తారు. అది ఎలా పేలింది? ఎందుకు పేలింది?"

"అయితే ఏమైతది?" బలరామయ్య ప్రశ్న.

"ఇంక అయ్యేదేమిటి? తేల్చేస్తారు. అంతే...."

"అట్లయితే ఎట్లనయ్యా" నాయకుని ప్రశ్న,

"అంతే అది రూల్సు"

"ఇగో చూడు ఖానూన్! గేనూన్ చెప్పకు. ఏం చేస్తవో చెయ్యి. నిన్ను రక్షించే జిమ్మేదారి మాది, ఏమంటరు?" నాయకుణ్ణి అడిగాడు బలరామయ్య.

నాయకుని గుండెదడ ఇంకా ఆగలేదు. నాలుక పిడుచకట్టుకపోతున్నది. మంచినీళ్ళు తెప్పించుకొని తాగి అన్నాడు.

"దేఖో శివరావ్ సాబ్ ! ఇగనీ మర్జీ, బారా ఖూన్ మాఫ్. ఎట్లనన్న చెయ్యి మనుషులు మన చేతులుండాలె. ఆఁ. అంతే"

"ఆఁ అలా ఆర్డర్ ఇవ్వండి. ఇగ చూడండి శివరావు ప్రతిభ" అని "కౌన్ హై" అని కేకవేశాడు.

నలుగురు పోలీసులు వచ్చి సలాం కొట్టారు.

"అందరు లంజకొడుకల్ను ఇళ్ళల్లోంచి లాక్కొనిరండి. రానన్నవాణ్ణి చావ కొట్టండి, తెలిసిందా? క్షణంలో జరగాలి. గాంధీబొమ్మ ముందు కూడాలి. బాంబు పేలుస్తారు! బాంబు!! చూపిస్తా నా శక్తి" అన్నాడు.

పోలీసుల బూట్లు టకటకలాడేయి. క్షణంలో గాంధీబొమ్మ ముందు కేకలు, ఏడ్పులు, హాహాకారాలు, ఆక్రందనలు వినిపించాయి. శివరావుకు శివం వచ్చింది. పెద్దకర్ర తీసుకొని జనంలో దూకాడు. "ఎవడ్రా బాంబు పేల్చింది?" అంటున్నాడు. బాదుతున్నాడు. పోలీసులు లాఠీలతో బాదుతున్నారు. జనం ఏడుస్తున్నారు. మొత్తుకుంటున్నారు. తమకు తెలియదని చెపుతున్నారు. అయినా దెబ్బలు తగులుతూనే ఉన్నాయ్. రక్తం చిమ్ముతూనే ఉంది. ఎవ్వడూ ఒప్పుకోవటంలేదు. ఒప్పుకునేటట్లు లేదు.

శివరావు సింహం అయినాడు. "బట్టలిప్పండి లంజాకొడుకులివి" ఆజ్ఞాపించాడు.

చావబాది బట్టలు విడిపించారు పోలీసులు.

ఆడ, మగ, పిల్లా, జెల్లా అంతా నగ్నంగా నుంచున్నారు. వళ్ళు చిట్లింది. రక్తాలు కారుతున్నాయి. అయినా మౌనంగా నిల్చున్నారంతా దిశమొలలతో.

తరవాత ఏంచేయాలో అర్థంకాలేదు శివరావుకు. అతనికి వాస్తవంగా కోపం రావడంలేదు. తెప్పించుకుంటున్నాడు. తన ప్రతిభ చూపాలి. అందుకు ఏం చేయాలి?

"నడిపించండి." గట్టిగా కేక పెట్టాడు.

దిస మొలల జనం వీదులవెంట సాగారు. పోలీసులు నెట్టుతూ, బాదుతూ తీసుకెళ్తున్నారు. ఊరంతా తిప్పి గాంధీ బొమ్మదగ్గరకు తెచ్చారు. చేతులు పైకెత్తి తలలు వంచి నిల్చున్నారు జనం.

ఏంచెయ్యాలి? మళ్ళీ అర్థంకాలేదు శివరావుకు. ఎందుకు చేశాడు? అదీ అర్థం కాలేదు పోలీసు అధికారికి. అతనికి తెలిసిందల్లా ఏదో చెయ్యాలి. అంతే.

"బోర్లాపడి మొక్కండి" ఆజ్ఞాపించాడు.

అంతా మొక్కారు.

"గాంధీజీకి జై" అనాలన్నాడు.

అతడు "గాంధీజీకి" అన్నాడు.

జనం "జై" అన్నారు.

అలా మూడుసార్లు అనిపించాడు.

నాయకులు సంతోషించారు.

అందర్నీ బట్టలు వేసుకొమ్మన్నాడు శివరావు. అరక్షణంలో అంతా వేసుకున్నారు. ఇండ్లకు పరిగెత్తమన్నాడు. తలుపులు వేసుకొని ఇండ్లల్లో దూర్చేవా అన్నాడు. ఒక్కడూ బయటికి వెళ్ళరాదన్నాడు.

క్షణంలో సగం వీధులు నిర్మానుష్యం అయినాయి.

ఆజ్ఞ తు.చ. తప్పకుండా పాలించబడింది.

మరికొన్ని అమానుష కృత్యాలు జరిగాయి. రాయడానికి రచయితకు సిగ్గుగా ఉంది.

అనధికారమైన కర్ఫ్యూ విధించి అవతల పడ్డాడు శివరావు - లా - అండ్ ఆర్డర్ సుబేదార్‌కు అప్పగించి.

జీపులు బుర్ర్ మన్నాయి. ఊరు రామునికి అప్పగించి గాంధీజీకి ఒక దండం పెట్టి పట్నంలో పడ్డాడు బలరామయ్య. నాయకులందరూ పట్నంచేరి గాంధీజీ విగ్రహ ప్రతిష్ఠాపనను గురించి గొప్పగా చెప్పుకున్నారు. పత్రికలు వారు చెప్పిందాన్నే ప్రకటించాయి. బలరామయ్య బొమ్మకూడ వచ్చింది. అతనికి పలుకుబడీ, బలమూ హెచ్చాయి.

ఊళ్ళో జనం వుడికి పోతున్నారు. గడపదాటి బయటికి రావడానికి వీల్లేదు.

రామునిది వేదవాక్యం అయింది. కాబట్టి గడపదాటితే సారాయి దుకాణానికే. జనం సారాయి దుకాణానికి వెళ్ళవచ్చు. తాగింతరువాత గడబిడ చేయవచ్చు. తరవాత మళ్ళీ ఇండ్లల్లో దూరాలి. రామునికి వ్యాపారం బాగానేవుంది. రోజంతా దుకాణంలోనే ఉంటున్నాడు. ఒకనాటి ఉదయమే వచ్చాడు యాదగిరి.

"ఏయ్ యాదగిరి! ఎటో వచ్చినవు?" అడిగాడు రాముడు.

"ఇంకేడికి? ఈడికే వచ్చిన"

"ఏమ్ సంగతి?"

"ఏమున్నది? ఇంట్లో ఎళ్ళతలేదు. ఏమన్న పని చూపిస్తవేమోనని వచ్చిన. నీదయ."

"అయితే దుకానమ్ల కూర్చో, జీతమిస్త ఏమంటవ్?"

"అంతకంటెనా అన్న. చాలు- పని చూపించినవు. నీ కడుపున పుడ్త."

"అదంత ఎందుకులేగని జర భద్రం గుండాలె. లెక్కలు గిక్కలు బాగ రాయి. పైసె సెవ్వని తాన ఉన్నదిగని?" అని వ్యాపారానికి సంబంధించిన విషయాలన్నీ బోధించి యాదగిరిని కొట్లో కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు. వెళ్ళటం వెళ్ళటం కరణం ఇంటికి వెళ్లాడు. తాళం తీసి లోపలికి వెళ్ళిచూచాడు. అంతా పాడు బడ్డట్లుంది. బాగుచేసి ఆ ఇంట్లో ప్రవేశించాలనుకున్నాడు. బలరామయ్య మీద ఆధారపడ్డం ఎందుకో ఇష్టం ఉండడం లేదతనికి ఈమధ్య.

రాత్రి అవుతే పోలీసులతో చీట్లపేకకు కూర్చుంటున్నాడు. ఆటలో అతనిదే పైచేయి అంటున్నా కొద్దో గొప్పో పోతూనే ఉంది. అయినా లక్ష్యం చేయడం లేదతను. అతను ఆడేది ఆకట్టుకోవడానికి అది జరుగుతూనే ఉంది. పోలీసులు అతనికి గులాములయినారు. ఒకనాడు పేకాడుతూ అన్నాడు.

"ఊళ్ళోవాళ్ళనుకూడా ఆటకు పిలిస్తే?"

"ఈ ఊళ్ళో పేకాట ఎవనికొస్తుంది? వెనకపడ్డ ఊరు!" అన్నాడు సుబేదారు.

"నేర్చుకుంటే అన్నీ వస్తాయి. నాకు మాత్రం వచ్చిందా మొదట్లు. వస్తే మంచిదేగా ఏమంటారు?"

"సరే కానివ్వండి. మీరన్నది ఏది కాదన్నాను?"

ఆనాటి నుంచి రాత్రిపూట పేకాటకు మాత్రం రావటానికి ఊళ్ళోవాళ్ళకు అనుమతి లభించింది. ఒకటి, అరతో మొదలై పది పదిహేనుమందిదాకా ఆటకు రావటం సాగించారు. కొందరు ఆడడానికి కొందరు చూడడానికి రాసాగారు. కాని ఆట పట్టుబడ్డది శేషయ్యకే. వాస్తవంగా దోచేస్తున్నాడు. అయినా అతడు డబ్బు ఉంచుకొనే వాడు కాదు. తాగుడుకో తిండికో ఖర్చు పెట్టేవాడు. అందువల్ల అతడు తలలో నాలుక అయినాడు.

ఊరికి సారాయి మైకం కమ్మింది. పేకాట పైత్యం తగిలింది. రాముడు వాటిని వాడుకున్నాడు. సారానీళ్ళు పోసే కరణం ఇల్లు బాగుచేయించ సాగాడు. అంతంత ఇల్లు. ఒకటి రెండు రోజుల్లో అయ్యేపనా? అవుతూనే ఉంది.

రాముడు ఒక కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నాడు. తాళంచెవుల గుత్తి తిప్పుతూ ఉదయం ఒకసారి, సాయంకాలం ఒకసారి ఊరంతా కలయ తిరిగి వచ్చేవాడు. అనేక మందికి అనేక పనులు పడేవి అతనితో. గింజా, గిరుగూ, కూలినాలి అన్నీ ఏర్పాట్లు చేస్తుండేవాడు.

ఒకనాడు ఉదయం రాముడు ఊరు సర్వే చేస్తున్నాడు. మంగమ్మ– చని పోయిన జగ్గయ్య భార్య – తల ఆర బెట్టుకుంటున్నది. భర్త పోయిన్నాటినుంచి ఆమె తల దువ్వడం, తలంటుకోవటం మానేసింది. అవసరం అయింది కాబట్టి తలమీంచి స్నానం చేసింది. వెంట్రుకలు ఆర పెట్టుకుంటూంది. ఆమె వెంట్రుకలు మబ్బుల్లా చెదురుతున్నాయి. మళ్ళీ దగ్గరకు వస్తున్నాయి. చూస్తూ నిల్చున్నాడు రాముడు. ఆ మబ్బులు అతని గుండెల్లో చేరాయి. ఉరుములు ఉరిమాయి. పిడుగులు కురిశాయి. రాముడు తదేకంగా చూస్తున్నాడు.

మంగమ్మ అది గమనించలేదు. గుడిసెలో దూరింది.

రాముని గుండె ఎగిరింది. గుడిసెలో దూరింది. రాముని కాళ్ళు గుడిసె ముందుదాకా సాగాయి. అతని నోరు పిలిచింది "మంగమ్మా!"–

మంగమ్మ బయటికి వచ్చింది.

ఆమె చెక్కిళ్ళల్లో అద్దాలున్నాయి.

రాముడు ఆమెను చూచాడు. అతని కళ్ళలో విషనాగులు బుసకొట్టాయి.

మంగమ్మ రాముడ్ని చూచింది. కొలిచింది. అతని వుద్వేగం చూచింది. ఆరాటం చూచింది. కళ్ళతో బుసలు కొడ్తున్న కామాన్ని చూచింది. కలవరపడ్డది. తడబడ్డది. తొణికిసలాడింది. తలవంచుకుంది. "రామన్నా" అని కన్నీరు టపటప రాల్చింది.

భోరుమని ఏడ్చేసింది. ఆమెకు భర్త గుర్తుకు వచ్చాడు – అతడుంటే!

సలసల కాగిన రాముని రక్తం చల్లబడ్డది. మంగమ్మను ఓదార్చాడు. "ఏడవకు– ఏడుస్తె ఏమొస్తది?" అంటూనే దగ్గరకు వెళ్లాడు. తల నిమిరాడు.

రాముడు మంగమ్మను చూశాడు.

కొలకుల్లా ఉన్నాయి కళ్ళు.

రాముని గుండెలో చిచ్చు పెట్టాయి.

ఆరిన అగ్గి భగ్గుమంది.

దూరం జరిగాడు రాముడు.

"వస్త. జగ్గన్న ఒకడు నే నొకణ్ని అనుకోకు. ఏమన్న కావాల్నంటె అడుగు" అంటూ పెద్దపెద్ద అంగలువేస్తూ సాగిపోయాడు.

మంగమ్మ వెర్రిగా అతణ్ణి చూస్తూ ఉండిపోయింది.

ఆ రోజు శనివారం. శనివారంరాత్రి పోలీసులు భజన చేస్తారు. డోలక్, హార్మోనియంతో భజన సాగుతుంది. ఆ రోజు భజనకు ఊళ్ళో వాళ్ళనూ పిలిచారు. జాగా రాత్రికి మొదలైంది భజన. డోలక్ మ్రోగింది, హార్మోనియం శృతికలిపింది. తాళాలు పడ్డాయి. 'రఘుపతి రాఘవ రాజారాం'తో మొదలైన భజన సినిమా పాటల సహితంగా సాగుతూంది.

రాముని కళ్ళు మంగమ్మ కోసం వెదికాయి. అసలు ఊళ్ళోవాళ్ళను భజనకు పిలిచింది అందుకే అతడు. మంగమ్మ కనిపించలేదు. రామునికి భగవంతుడు కనిపించలేదు.

ఆ రాత్రి రామునికి నిద్రలేదు. మంగమ్మ అతని మనసులో కూర్చుంది. గుండె బరువైంది. సిగరెట్లు త్రాగాడు. గడీ మొత్తం సర్వే చేశాడు. అంతటా మంగమ్మే కనిపించింది. ఎక్కడా ఆమె కనుపించలేదు. పడుకున్నాడు. మంచంలో పల్లేర్లు పరుచుకున్నాయి. లేచి తిరిగాడు. గాలి స్తంభించి నట్లయింది. ఆ రాత్రే మంగమ్మ ఇంటికి వెళ్దామనుకున్నాడు. మెట్లదాకా వచ్చాడు. ఆ తరువాత ధైర్యం చాలలేదు. మళ్ళీ వెనక్కు వెళ్ళాడు.

ఆ రాత్రి అతి దీర్ఘం అయింది.

అయినా సూర్యుడు మొలిచాడు.

మనసులోని చీకట్లు మాపలేకపోయాడు.

బయట వెలుగు. మనసులో చీకట్ల గుంపులు. మంగమ్మ ముంగురులు. ముంగురులు ముంచాయి రాముణ్ని. ముందడుగు వేశాడు. తోవలో అతడు ఎవరితోనూ మాట్లాడలేదు. వేలికి తాళంచెవులు లేవు. అవి గిరగిరా తిరగటం లేదు. కాళ్ళలో సైతం కలవరం కనిపించింది. కదులుతున్నా కదలనట్లే ఉంది. అయినా మంగమ్మ గుడిసె వచ్చింది. రాముడు గుడిసె ముందు నుంచున్నాడు. తరవాత ఏం చేయాలో అర్థం కాలేదు. కాస్త తికమక పడ్డాడు. తరవాత సాగాడు. అడుగు

మీద కూర్చున్నాడు. ఏదో అనుమానం. ఏదో బుగులు. ఏదో భయం. ఏదో లజ్జ. ఏం చేయాలో అర్థం కాలేదు.

"మంగమ్మా!" పిలిచాడు.

మంగమ్మ వచ్చింది. "ఏంది?" అని నుంచుంది. రాముడు ఆపాదమస్తకం కొలిచాడు. నిన్నటి అందం లేదు. వన్నెలేదు. వయ్యారం లేదు. హొయలు లేదు. సింగారం లేదు. సిగలో మబ్బుల్లేవు. చెక్కిళ్ళలో అద్దాలు లేవు. ఆమె అప్పుడే లేచింది. వచ్చింది. ఖిన్నుడైనాడు రాముడు. ఏదో ఖిన్నత కనిపించింది.

"నీ దగ్గరికే వచ్చిన"

"ఏమని?"

ప్రశ్న చిత్రంగా ఉంది. ఎందుకు వచ్చాడు తాను? ఏమని వచ్చాడు. ఏమనాలి? కాస్త తికమక పడ్డాడు రాముడు.

"కరణ పోరి ఇల్లు తీసుకున్న."

"అవు. అయితే"

"జర అలికి ముగ్గులు పెట్టాలె. ఎవరున్నారు చెప్పు నాకు. జర రావాలె. ఏమంటవ్?"

ఇరకాటంలో పడ్డది మంగమ్మ. ఇంట్లో గింజల్లేవు. పని ఇచ్చేవాడూ లేడు. ఆ పని చేయడం ఆవిడకు ఇష్టం లేదు. ఎందరు తమ ఇచ్చనుబట్టి పనులు చేస్తున్నారు? మంగమ్మ లొంగింది. లొంగక తప్పలేదు.

"సరె వస్త"

"నేను పోతున్న జర జల్ది రావాలె" అని రాముడు సాగిపోయాడు. పండ్లపుల్లవేసుకొని కరణం ఇంటి అరుగుమీద కూర్చున్నాడు - మంగమ్మ కోసం ఎదురు చూస్తూ.

మంగమ్మ వస్తుందా? ఏమో ఇంకా రాదేం? ఇంకా రాదేం? ఎక్కొట్టదు గాదా? ఏమేమో ప్రశ్నలు రాముని మనసును కలత పెట్టాయి.

మంగమ్మ రానే వచ్చింది.

మళ్ళీ ఏదో సోయగం కనిపించింది..

మంగమ్మను తీసికెళ్ళాడు లోనికి. ఎర్రమన్ను, పేడ వగైరా చూపించాడు. ఆమె అలుకు ప్రారంభించింది. రాముడు ఆమె వెంటనే ఉన్నాడు. "ఇదిగో ఇక్కడ అలకలేదు. ఇక్కడ పొడిగా వుంది." అని పని చేయిస్తున్నాడు. మధ్య మధ్య ఏవేవో ముచ్చట్లు చెప్తున్నాడు. కల్పించుకొని మాట్లాడుతున్నాడు. సాయంకాలం అయింది. ఇల్లు లంకంతది. ఒక్క రోజులో అవుతుందా? చేతులు కడుక్కున్నది మంగమ్మ. కూలి బాగానే యిచ్చాడు రాముడు. మళ్ళీ రేపు రమ్మన్నాడు.

అలుకు మూడురోజులు జరిగింది. నాలుగవనాడు నాముతో ముగ్గులు పెట్టింది. ఈ నాలుగు రోజులలోనూ పరిచయం పెరిగింది. ఒక్కొక్కసారి చేతులు,

ఒక్కొక్కసారి కాళ్లూ తాకాయి. అతడు ఆమెను చూచాడు. ఆమె అతనివి చూచింది. అయినా మంగమ్మ ఏమనుకుంటుందో రామునికి అర్థంకాలేదు.

గృహప్రవేశం ఏర్పాటు చేశాడు రాముడు. పోలీసులను భోజనానికి పిలిచాడు. మంగమ్మను వంటకు పెట్టాడు. వంటలు బాగా చేసింది మంగమ్మ. భోజనాలు అయ్యేవరకు సాయంకాలం అయింది. వెలుగును చీకట్లు కమ్మేశాయి. ఇల్లు ఖాళీ అయింది. చివరకు మంగమ్మ భోజనానికి కూర్చుంది. రాముడు వడ్డించాడు. భోజనం ముగించి వెళ్ళటానికి సిద్ధం అయింది. ఏదో సర్దమన్నాడు. సర్దింది. రాత్రి మించి పోతున్నది. రాముడు మించిపోతున్నాడు.

మంగమ్మ చేయిపట్టుకు లాగాడు.

ఊపిరి సల్పకుండా కౌగలించుకున్నాడు.

ఒక్కోసారి ఇంద్రియ దౌర్బల్యం మనసును చంపేస్తుంది. ఆలోచనలను అణచేస్తుంది. మనిషిని మసి చేస్తుంది.

మంగమ్మ ఇంద్రియాల ఆకలికి లొంగిపోయింది.

లొంగిన ఆడది మగవానికి లోకువ.

లొంగటం ఒకేసారి. తరువాత బెక్కు చూపలేదు. తరువాత అన్నీ మామూలే. వడ్డించడం, భోజనం చేయడం లాంటిది. అలాంటిదే రాముడు — మంగమ్మ మధ్య సాగింది.

మంగమ్మ గుడిసెలోనే వుంటూంది.

రాముడు కరణం యింటికి మారాడు.

వంటకని వస్తూంది మంగమ్మ రాముని యింటికి.

కరణం ఇల్లు రాముని ఇల్లుగా మారింది.

రాముడు ఇంటి ముందరి అరుగుమీద కూర్చొని తగాదాలు — తీర్పులు చేస్తున్నాడు. యాదగిరి సారాయి దుకాణంలో పెత్తనం చేస్తున్నాడు. శేషయ్య పేకాడు తున్నాడు.

కాలానికి కళ్ళుండవు. చెవులు అసలే ఉండవు. దానికి వేగం మాత్రం ఉంది. ఆ వేగానికి తట్టుకోగల వాళ్ళనే నిలుపుతుంది. కానివాళ్ళని నలిపేస్తుంది. ఇనుపపాదాల క్రింద తొక్కేస్తుంది. అది గమనించాడు వీరభద్రం. ఆయుధం విసర్జించాలని నిర్ణయించాడు. అతడు మధ్యవర్తులతో ప్రభుత్వానికి రాయబారం పంపాడు. తాము పంచిన భూములు పంచుకున్నవారికి ఉంచినట్లయితే తుపాకులు వదుల్తా మన్నారు. ప్రభుత్వం వినలేదు. ప్రభుత్వం ఎన్నికలు జరుగుతాయని ప్రకటించింది. వీరభద్రం తుపాకితో మేజిస్ట్రేటు ముందు హాజరైనాడు! ఊరు ఆశ్చర్యంలో మునిగింది. ఆశ, నిరాశ రెండూ వ్యాపించాయి. శివరావు వీరభద్రాన్ని అరెస్టు చేశాడు. అందుకతడు గర్వించాడు. బలరామయ్య కొడుకును హత్య చేశాడని, కరణాన్ని కాల్చి చంపాడని, జగ్గయ్య చావుకు అతడే కారణమని

ఇంకా ఇలాంటివే అనేకం ఆరోపించబడినాయి వీరభద్రం మీద. విచారణ జరుగుతున్న రోజుల్లో ఊరంతా కటాన కదిలింది. బస్తీలో కోర్టుకు చేరింది. సర్కారు వకీలు గట్టిగా వాదించాడు. సాక్ష్యం ఒక్కటీ దొరకలేదు. నిజమైన సాక్షి ఒక్కడూ రాలేదు. వచ్చిన సాక్షులు వంకరటింకర్లు చెప్పారు. అయినా విచారణపేర జైల్లో పెట్టారు వీరభద్రాన్ని.

ఊళ్ళో ఎన్నికల కోలాహలం జోరుగా ఉంది. పోలీసులు నిర్గమించారు. బలరామయ్య రంగానికి వచ్చేశాడు. వచ్చేశాడనే కాని ఊళ్ళో ఠికానా లేదతనికి. రావడం జీపులో వచ్చాడు. చేరడం గడీలోకి చేరాడు. కూర్చోవడం బంకుల్లో కూర్చున్నాడు. ఒక్కసారి గడీని, గడీముందరి స్థలాన్ని కూలిపోయిన గుర్రాల కొట్టాన్ని చూచాడు. అనేక పూర్వ స్మృతులు అతని మెదడులో కదలాడాయి. ఆపూర్వవైభవం, ఆ జవనాశ్వాలు, ఆ రచ్చబండ, ఆ అధికారం! ఆ దొరతనం! ఆ పెత్తనం! ఆ రాజఠీవి! వెంటనే మరికొన్ని దృశ్యాలు కళ్ళముందాడాయి. తానా ఊళ్ళో ఉండలేక పోవడం, పారిపోవడం, మళ్లీ రావడం, కూలిన గోడలు, కూలిన ఆశలు – ఆశయాలు. గోడలమీద నినాదాలు. గుండెలో గుబ గుబలు, గుబులు భయం. అవీ చెదిరిపోయాయి.

ఇది ప్రస్తుతం వర్తమానం, కనిపిస్తున్నది. పూర్వ వైభవం లేదు. మధ్యాన కన్న పీడకల లేదు. తాను తన ఊరికి రాగలిగాడు, భయం లేకుండా ఉండ కలుగుతున్నాడు, మళ్ళీ గుర్రాల కొట్టానికి కప్పువేయించాలా! గుర్రాలను పెంచాలా? బంకుల్లో నిలువుటద్దం అమర్చాలా? దాస దాసీ జనాన్ని కూర్చుకోవాలా! రచ్చబండలు సరిచేయించాలా! గడీలోకి మరొక దొరసాన్ని తేవాలా?

మరొక దొరసాని!

ఆ ఆలోచన ఎందుకు వచ్చిందో తెలీదు బలరామయ్యకు. అమాంతంగా తనను తలచుకున్నాడు. ముడతలు పడుతున్న శరీరాన్ని చూచుకున్నాడు. ఏదో సిగ్గనిపించింది. కాలానికి కళ్ళెం పట్టిన వాడెవడు? దాన్ని వెనక్కు తిప్పిన మొనగాడేడి? అదే అర్థం చేసుకున్నట్లున్నాడు బలరామయ్య ఒక్క చిరునవ్వు నవ్వాడు – నవ్వుకున్నాడు.

ఆ నవ్వులో అనేక అర్థాలున్నాయి. తన అధికార పరిధి పెరిగింది. అది రాష్ట్ర వ్యాప్తమైంది. గుర్రాలేం పనికొస్తాయి? కార్లు కావాలి. ఊరును పట్టుకొని ఉంటాడా తాను! గడీ ఎందుకు? పట్నంలో బంగళా కావాలి. రచ్చబండ లెందుకూ? రాచనగరులు కావాలి. అయినా తాను ఈ ఊరికి వచ్చాడు. ఎన్నికలలో తన విజయం ఈ ఊరిమీదా ఈ ప్రాంతంమీదా ఆధారపడి ఉంది. అందుకే ఇక్కణ్ణుంచి బిచానా ఎత్తడానికి వీల్లేదు. విడిదిగా ఉంటుంది గడీ. అందుకు పెద్ద ఖులమ్మత్తులు అవసరం లేదు.

ఇంతలో రాముడు వచ్చాడు. నమస్కరించాడు.

ఎగాదిగా చూచాడు దొర – ఆశ్చర్యపోయాడు. ఎంత మారాడు మనిషి! ఎంత మారింది కాలం!

రాముడు ముందున్న కుర్చీలో కూర్చున్నాడు.

దొర చిరచిర లాడాడు. కోపం సహితం వచ్చింది. దిగమింగాడు. అవును ఇప్పుడు పని అతనితోనే! అతడు స్థానికుడు తాను కాకుండా పోయినాడు.

ప్రతినమస్కారం చేశాడు బలరామయ్య.

"ఎట్లున్నది?" అడిగాడు దొర.

"అంత బాగున్నది. అందరు మన చేతులనే ఉన్నరు"

"ఏమున్నరో! వీరభద్రమొస్తే?"

"వస్తె ఏమైతది? వాడేమన్న కూడు పెట్టడా? గుడ్డ ఇస్తడా?"

"అయితె ఏం చేయమంటవు?"

"జర ముల్లె ఇప్పాలె. ముష్టిముండ కొడుకులు పైసంటె పడి చస్తరు. వోట్లు కొనాలె."

"కొందం" కాస్తబెరుగ్గా అన్నాడు దొర. "పైసకు లెక్కపెట్టేది లేదు. ఈ ఊరు నీ జమ్మెదారి. నాకు శాన పనులుంటయి."

"మీరు ఊఁ అన్నరు కద. ఇంక చూడుండి నా తడాఖా!"

దొర వచ్చాడని తెలిసి యాదగిరి వచ్చాడు. అతని వెంట మరి కొందరు వచ్చారు.

"దండం పెట్టదొర" అని చేతులు కట్టుక నుంచున్నాడు.

"ఏం కత?" దొర ప్రతినమస్కారం చేయకుండానే అడిగాడు.

"ఏమున్నది దొరా? ఎప్పుడున్న కతే. గరీబోల్లు. పనిపాటలులేక చస్తాను. జీతానికి పెట్టుకుంటె కాళ్ళకాడ పడుంటరు."

"పెట్టుకుంట. మరి మా పనికూడ చెయ్యాలె."

"చెయ్యకేం చేస్తం బాంచను. గులాపోల్లం."

"అట్లనా? మల్ల వీరభద్రమొచ్చి బూములిస్తం, బువ్వపెట్టమంటె గడీ మీద పడ్తరు. నమ్మెడి దున్నాదిర మిమ్ములను?"

"బుద్ధి గడ్డి తిన్నది. ఎప్పుడు తింటాది? – కాల్మొక్తం" వచ్చిన వాళ్ళంతా ముక్తకంఠంగా అన్నారు.

"సరెగని గింజలు, గిట్ట రామయ్య దగ్గర తీసుకొండి. మల్ల బుద్ధి కతిగుండాలె ఇన్నరా?"

"అట్లనె కాల్మొక్తం" అని వాళ్ళు వెళ్ళిపోతుండగా శేషయ్య ఎదురు పడ్డాడు. శేషయ్య దొరకు దండం పెట్టాడు.

"ఏం శేషయ్య ఎట్లున్నది?"

"బాగానె ఉన్నద్దొరా! గని పల్లెలేముంటది? పట్నం మెట్లున్నదో చెప్పకపోతిరి."

"పట్నానికేం బాగానే ఉన్నది. ఎన్నిక లొచ్చినయ్ ఎరికెగద. నన్ను మినిస్టర్ను చెయ్యాలె మీరందరు కలిసి. ఇగ నిన్ను పట్నంల్లనే ఉంచుత."

"ఎంత మాటంటరు దొర! మేమెంత మినిస్టర్ను చెయ్యటమెంత? ఒక్కపాలి పట్నం చూపాల్నుండి."

"పట్నం చూపిస్తలేగని ఓట్లు గీట్లు ఏయించెడి దున్నదా లేదా?"

"ఎంత మాట! ఎంత మాట!! దొరలకు కాక ఓట్లు ఇంకెవరి కేస్తముంది. ఒక్కమాట చెప్పుత ఏమనుకోకుండి జర పత్రికగని ఊళ్ళకి రావాల్నుండి. పత్రికల పడెయ్యాలిచాలు. అందరు చచ్చుకొంటేస్తరు."

"అట్లనే పత్రిక తెప్పించు రాముడూ" ఆదేశించాడు దొర.

ఊరికి 'గోలకొండ పత్రిక' రావడం ప్రారంభించింది.

ఎన్నికలు దగ్గర పడడంతో ఏడుకొండలవానికి మొక్కాడు బలరామయ్య. బలరామయ్య చాల మారిపోయాడు. ఊళ్ళోని గుళ్ళో అర్చనలు చేయించాడు. భజనల కార్యక్రమంలో తానూ పాల్గొంటున్నాడు తీరిక ఉన్నప్పుడు. పండితులతో పురాణాలు చెప్పిస్తున్నాడు – పరమాత్మని లీలలను గురించి, శివుని ఆజ్ఞ లేనిదే చీమ సైతం కదలదనీ, పుట్టెడు ఆముదంలో పొర్లినా అంటేంతే అంటుతుందనీ బోధిస్తున్నాడు. ఊళ్ళో ఒక కొత్త వాతావరణం ఏర్పడింది. భజనలు, పేకాటలు, తాగుళ్ళు. ఊరు పురోగమిస్తూంది. నాగరికత నాట్యం చేస్తున్నది.

బలరామయ్యకు కొంత సంతోషం కలిగింది. మరికొంత నమ్మకం కలిగింది. ఆ నమ్మకంతోనే నామినేషన్ వేశాడు.

ఆ నాడు పట్నంలో పెద్ద విందు చేశాడు. ఆ రాత్రి అతనికి ఎంతో హాయిగా ఉంది.

తెల్లవారి ఆ ఆనందం తెలతెల పోయింది. బలరామయ్య గుండెలో రాయి పడింది. వీరభద్రం నామినేషన్ వేశాడు జేలునుంచే. చట్టం మీద పళ్ళు కొరికాడు బలరామయ్య. జేలులో ఉన్నవాడు నామినేషన్ వేయడమేమిటో? అది అతనికి అర్థం కాలేదు. శివరావును పిలిపించాడు. వీరభద్రానికి శిక్ష పడేటట్టు చూడాలన్నాడు. సాక్షులకోసం డబ్బుకు వెనుకాడ వద్దన్నాడు. అనేక పక్షాలనుంచి అనేక ప్రయత్నాలు ప్రారంభించాడు.

బలరామయ్య దాతృత్వంకూడా పెరిగింది. ఊళ్లో ఎన్నికల కార్యక్రమపు ప్రారంభోత్సవం ఘనంగా జరిపాడు. జెండాలు రెపరెపలాడేయి. పచ్చని మామిడి తోరణాలు ఊరినిండా వెలిశాయి. పెద్ద పెద్ద నాయకులు వచ్చారు. మంచి మంచి ఉపన్యాసా లిచ్చారు. ఊరు బాగుపడాలంటే బలరామయ్యకే ఓటు ఇవ్వాలని చెప్పారు

చేశారు. బలరామయ్య మంత్రి అవుతాడనీ చెప్పారు. మంత్రులు చేయలేని పనులు లేవనీ చెప్పారు.

బలరామయ్య చాల వినయంగా మాట్లాడాడు.

రాముడు చాల మెచ్చుకున్నాడు.

ప్రజలు ఆశ్చర్య పోయారు.

బుర్రకథకూడా చెప్పించాడు బలరామయ్య.

మరుసటి రోజు ఊరు మొత్తానికి భోజనాలు పెట్టించాడు బలరామయ్య. మేకలు తెగాయి. సారాయి పారింది. బలరామయ్య స్వయంగా వడ్డించాడు. భోజనాలు చేస్తున్నప్పుడు చేతులు జోడించి ప్రార్థించాడు – తనకు ఓటు వేయవలసిందని – అంతా భోజనాలు ముగించారు. నాటినుంచీ ఊళ్ళో చర్చలు ప్రారంభం అయినాయి – దొర మారాడని కొందరు – దొంగవేషాలని కొందరు. యాదగిరి, శేషయ్య దొరను గురించి రామాయణ భారతాలు చెపుతున్నారు. రాముడు వారందరికీ నాయకత్వం వహిస్తున్నాడు.

మల్లయ్య, మస్తాను విడుదలయి రావడంతో ఊరి ధోరణే మారిపోయింది. మల్లయ్య, మస్తాను వీరభద్రంతోనే అరెస్టయినారు. వారిమీద నేరాలు మోపారు. రుజువుకాలేదు. వదిలేశారు. వీరభద్రం గెలుస్తే ప్రజలకు పొలాలొస్తాయి, ఇండ్లొస్తాయి, పశువులొస్తాయి అని ప్రచారం సాగించారు. సభలు ఏర్పాటు చేయించారు. బుర్రకథలు పెట్టించారు. వారి నాయకుల్ని పిలిపించారు. పోయిన దొరలు వేషాలు మార్చుకొని వస్తున్నారని హెచ్చరించారు నాయకులు. వీరభద్రం పంచిన భూములను గురించి తేల్చుకొమ్మన్నారు. 'వీరభద్రం గెలవాలి. పేదలు గెలవాలి. ప్రజలు గెలవాలి' అని నినాదాలు చేశారు నాయకులు.

మల్లయ్య, మస్తాను విధి విరామం లేకుండా ప్రచారం సాగిస్తున్నారు. మంగమ్మ వారికి తోడైంది. ప్రచారం కంటే ఎక్కువ "వీరభద్రం విడుదల అయినాడు" అనే వార్త పనిచేసింది. వీరభద్రం మీద ఆరోపించిన నేరాలను రుజువు చేయలేక పోయింది సర్కారు. అంతేకాక ప్రభుత్వం పాలసీ కొంత మారింది. వీరభద్రం విడుదలైనాడు. వీరభద్రం ఊరికి వచ్చాడు. ప్రజ సాంతం కదిలింది. పెద్ద ఊరేగింపు తీసింది. మంగమ్మ వీరభద్రం నొసట కుంకుమ పెట్టింది. మంగళ హారతి యిచ్చింది. మళ్ళీ అవే నినాదాలు, పాత నినాదాలు మారుమ్రోగాయి ఊళ్ళో.

"దున్నేవాడిదే భూమి"

"దొరలంతా దొంగలు"

వీరభద్రం మంగమ్మ ఇంట్లో విడిదిచేశాడు. అతని ఇలు తగులబెట్టబడింది. శేషయ్యను గౌరవించాలని అక్కడ విడిదిచేశాడు వీరభద్రం. ఆ రాత్రి అతనికి

నిద్రలేదు. ఊరి వాళ్ళెవరూ పడుకోనివ్వలేదు. ఎన్నో మాటలు, ఎన్నో ముచ్చట్లు, ఎన్నో ప్రశ్నలు, ఎన్నో సమాధానాలు.

మంగమ్మ ఇంట్లో జాతర సాగింది.

జాతరలో చేరని ముగ్గురు రాముని ఇంట్లో సమావేశమైనారు. రాముడు వీరభద్రానికి ముఖం చూపించలేకున్నాడు. మనసులో దొంగ మసలుతున్నాడు. వాడు బయటికి రాడు. వీరభద్రం తనను ఓర్వలేదని వెళ్ళబెట్టాడు. మైకంతో ఉన్నారు. యాదగిరి, శేషయ్య అతనికి తాళం వేసారు. ఊరంతా వీరభద్రం చుట్టు చేరింది. వారికి తేళ్ళూ, జెర్రులూ పాకాయి. దొర ఏమంటాడోనని బెదరసాగారు. 'దొరను గెలిపించాలె' అని నినాదం చేశారు రామయ్య ఇంట్లో. తరవాత తాగారు – అప్పుడు మరీ గట్టిగా నినాదాలు చేశారు. తప్పతాగారు ముగ్గురూ తందనాలాడారు. శేషయ్యా, యాదగిరి ఇండ్లకు వెళ్ళడానికి బయటికి వచ్చారు. వారినేదో భయం ఆవహించింది. బయట అడుగు పెట్టలేక పోయారు.

రామయ్య ఇంట్లోనే పడుకున్నాడు.

తెల్లవారింనుంచీ సారాయి వ్యాపారం సన్నగిల్లింది.

చీట్లాడ్డానికి జనం రావడంలేదు.

గ్రామంలో దొరలకు వ్యతిరేకమైన మాటలు బాహాటంగా సాగాయి.

ఎన్నికలు ముమ్మరం జోరుగా ఉంది. పోటీలు జరిగాయి. పోట్లాటలు జరిగాయి. తలలు పగిలాయి.

ఎన్నికలు జరిగాయి.

ఫలితాలు వచ్చాయి.

వీరభద్రం గెలిచాడు.

బలరామయ్య దరావత్తు పోయింది.

# రెండు

వేసవి. సూర్యుడు మండి పడుతున్నాడు. నిప్పులు చెరుగుతున్నాడు. మోదుగులు పూశాయి. మామిళ్లు కాశాయి. ఎండ భరించరాకుండా వుంది. వేడి గాడ్పులు. పిట్టలు సహితం చెట్లలో తల దాచుకుంటున్నాయి. చింతచెట్ల కింద బుడుతలు తప్ప మనుషులు కనిపించటం లేదు. అంత ఎండలోనూ పొలాలకు ఎరువులు తోలుకుంటున్నారు రైతులు. రైతుకు విశ్రాంతిలేదు. అతడు నమ్ముకున్నది భూమిని, ఎండను, వానను. ఈ ఎండే రేపు వానగా కురుస్తుంది. అది వారికి పసిడి వాన, అతడు ప్రకృతి బిడ్డ. అతనికి ఎండేం లెక్క!

వీరభద్రం సహితం లెక్కచేయలేదు ఎండను. మండే ఎండలో కాలి నడకన వచ్చాడు మంగమ్మ ఇంటికి. అతడు పట్నంనుంచి వస్తున్నాడు. శాసనసభా సమావేశాలు అయిపోయాయి. తరువాత అక్కడ వుండదలచలేదు. మంగమ్మ వీరభద్రాన్ని చూచింది. ముఖంనిండా వంటినిండా చెమట కారుతూంది. బట్టలన్నీ తడిసిపోయాయి.

"ఇంత ఎండల ఎందుకొచ్చిన్రు. చల్లపడ్డెనక రాకపోయినారు!" అన్నది మంగమ్మ వేదన నిండిన స్వరంతో.

"పని అయిపోయింది. పట్నంలో ఏం చెయ్యను? బండి చేరేవరకు ఈ వేళ అయింది. వచ్చేశాను. ఊళ్ళో ఎలావుంది?"

"ఏం చెప్పమంటరు?" అని లోపలికి వెళ్ళి చెంబుతో నీళ్ళు తెచ్చి అందిచ్చింది. కాళ్ళు కడుక్కుని లోన అడుగు పెట్టి మంచంలో కూలబడ్డాడు వీరభద్రం. మంగమ్మ వంట ప్రారంభించింది. వడ్డించింది. భోజనం చేస్తూ మాట్లాళ్ళేదు భద్రం. మంగమ్మా మౌనమే వహించింది. ఇద్దరూ మౌనంగా ఉన్నారు. ఇద్దరూ గంభీరంగా ఉన్నారు. భోజనం చేసి చేయి కడుక్కుని నడుం వాల్చాడు భద్రం. కన్ను మలిగింది. గుర్రు కొట్టాడు.

సూర్యుడు వాలిపోయాడు. వాడిపోయాడు. సాయంకాలం అయింది. గాలితో కొంత చల్లదనం ఏర్పడింది. పడుచులు కడవలతో నీళ్ళాటి రేవుకు వెళుతున్నారు. కల్లు దుకాణాల్లో గిరాకి హెచ్చుగా ఉంది. అది రామయ్యకే లాభం. అతడే పట్టాడు ఈ వూరి కల్లు దుకాణాల్ను. మల్లయ్య తాటి ఆకుల్లో ముంజలు తీసుకుని

మంగమ్మ ఇంటికి వచ్చాడు. వీరభద్రం వచ్చిన విషయం తెలిసిందతనికి. వీరభద్రం ఇంకా నిద్ర లేవలేదు. మల్లయ్య లేపాడు. కాళ్లూ ముఖమూ కడుక్కొని వీరభద్రం వచ్చి పందిట్లో కూర్చున్నాడు. ముంజలు వలుచుకొని తింటూ మాట్లాడుకుంటు న్నారు, ఒక్కొక్కరే పది పదిహేనుమంది దాకా జనం కూడారు.

"పట్నం ఖబర్లేమిటుండి?" అడిగాడు మల్లయ్య.

"ఏమున్నది అంతా మామూలే. శాసన సభా సమావేశాలు జరిగాయి."

"ఆ సంగతులే చెప్పమంటున్న"

"కొందరు ఏవేవో ప్రశ్నలు అడిగారు. మంత్రులు వారికి సమాధానాలు చెప్పారు. అవి వారికి అర్థం కాలేదు, మాకూ అర్థం కాలేదు. అదంతా ఒక ఆచారం అలా జరిగిపోతుంటుంది. అయితే ఒక ముఖ్యమైన శాసనం చేయబడింది. అది కౌల్దారీ చట్టం. అది మనకు విజయం. ప్రజలకు పేదలకు విజయం."

"ఎందుండి ఆ ఖానూను? ఎవరికి ఫాయిదైతది?"

"కౌలుకు చేసుకునే సన్నకారు రైతులను యజమానులు – భూస్వాములు – తొలగించడానికి వీలుండదు."

"ఎందో విచిత్రం గున్నదుండి. కౌలుకు యాడిదుండి బూమి నా బొంద. బూములన్ని పంచుకుంటిమి. దొర బూము లన్ని గుంజుకునే మళ్ళీ అందర్నీ కూలోళ్లను చేసె. పట్వారి జమీన్లు రామయ్య గుంజుకునె. దొరయి కూకుండె. మల్ల మీ ఖానూనేం పనికొస్తది? పట్నం పోతె ప్రజల్ను మరిచిపోతారుండి?"

చివరి ప్రశ్న గునపంలా గుచ్చుకుంది వీరభద్రం గుండెలో. వాస్తవానికి తనకి ప్రశ్నలు తెలియనివి కావు. తానివన్నీ శాసనసభలో లేవదీశాడు. కాని తన మాట విన్నారా? మెజారిటీ ఉంది నెగ్గించుకున్నారు. ఆ మాటలే విడమర్చి చెప్పాడు అక్కడి వారితో. కాని అవి ఎవరికీ అర్థంగాలేదు. సంతృప్తి కలిగించలేదు.

"దొరల్ను ఎల్లకొట్టమంటిరి. భూములు పంచుతమంటిరి. ఓటిస్తిమి, గెలిపిస్తిమి. ఇప్పుడేమో బూములు దొరలు గుంజుకునిరి. కూళ్ళకుకూడ రానియ్యమనెటట్లుండిరి. రామయ్యకూడ దొరాయె. రాచి రంపాన పెడుతుండె. మల్ల దొరల కాళ్లే పట్టుకోవాల్సొచ్చెటట్లున్నది" ఒకడు అడిగాడు.

వీరభద్రం తల తిరిగి పోయింది. శాసనసభ అక్కడి ప్రశ్నలు, మంత్రుల చిరునవ్వులు, మొండి జవాబులు, వాకౌటులు గుర్తుకువచ్చాయి. ఇక్కడి ప్రజలు వీరి సమస్యలు ప్రశ్నలు ఎదురైనాయి. ఎలా చెయ్యాలో అర్థం కాలేదు. తికమక పడ్డాడు. సతమతం అయినాడు. నిలదీసి అడుగుతే ఏం చెబుతాడు.

"ఓపిక పట్టాలి. ఒక్కసారె అన్ని సమస్యలూ పరిష్కారంకావు, కౌల్దార్ల జాబితా నాకివ్వండి. ప్రయత్నిస్తాను. దొర కూళ్ళకు రానియ్యకుంటే పోరాటం జరపాలి...."

"శాన పోరాటం జరిపినముండి. జరపంగ జరపంగ ఈడికొచ్చినం" ఒకడు విసుక్కున్నాడు. లేచిపోయాడు.

మల్లయ్యకు ఏమీ తోచలేదు. లేచి గబగబా వెళ్ళి అతన్ని తీసుకొచ్చాడు. "తొందర పడొద్దన్నా! అన్నీ జరుగుతయి. వీరభద్రంగారి సంగతి నీ కెరికలేదు గనకనా! మనకోసమె తుపాకిపట్టె, మనకోసమె ఎమ్మెల్లె అయె" అని తెచ్చి కూర్చో పెట్టాడు.

"అవ్. అవ్" అంటూ కూర్చున్నాడతను.

ఆ రాత్రి వీరభద్రానికి నిద్ర పట్టలేదు. అంతులేని ఆలోచనలు. ఏదీ చివరి దాకా కొనసాగటం లేదు. ప్రజలు నిజాం నవాబును గడగడ లాడించారు. భారతీయ సైన్యాలు వచ్చాయి. నైజాం లొంగిపోయాడు. ప్రజలు గెల్చారు. ప్రజాస్వామ్యాన్ని వరించారు. తనకూ ప్రజలమీదా ప్రజాస్వామ్యంమీద గాఢ విశ్వాసం ఉంది. ప్రజలు తన నమ్మకాల్ని వమ్ము చేయలేదు. డబ్బుకూ తాగుడుకూ లొంగలేదు. తననే ఎన్నుకున్నారు. అది ప్రజావిజయంగా భావించాడు తాను. ఏదో సాధించగలనను కున్నాడు. పేదల్ను సుఖపెట్టే మార్గాలు వెతకగలననుకున్నాడు. దొరల రాజ్యం అంతరించిందనుకున్నాడు. కాని అన్నీ తలకిందులు అవుతున్నట్టు కనిపిస్తున్నాయి. ప్రజలనిపించుకునేవారు శాసనాల్లో కనిపించడంలేదు. దొరలు మరొక వేషం ధరించి శాసనసభలో ప్రవేశించారు. మంత్రులైనారు. ప్రభుత్వం చేస్తున్నారు. మరొక రూపంలో పెత్తనం చెలాయిస్తున్నారు, తానేం చేయలేక పోతున్నాడు. ప్రజలు తననే అడుగుతున్నారు. ఏమిటీ వింత? ఏమిటీ విచిత్రం? ఏం చేయాలి? ఎలా చేయాలి? అవే ప్రశ్నలు సూదులై, బల్లెములై, గునపాలై అతని మెదడును చీల్చ సాగేయి. ప్రశ్నలు చీకట్ల గుంపులై అతన్ని తరుముతున్నాయి. సమాధానమనే వెలుగురేఖ ఎక్కడా కనిపించడంలేదు. సతమతం అవుతున్నాడు. అంతా అయో మయంగా కనిపించసాగింది. వీరభద్రం లేచాడు. సిగరెట్టు ముట్టించాడు. మంచంలో కూర్చుని గట్టిగా దమ్ము లాగి వదిలాడు. పక్క గదిలో పడుకున్న మంగమ్మ కూడా నిద్రపోయినట్లు లేదు. అలికిడి వినిపించిం దతనికి. మంగమ్మకు నిద్రరాక పోవడానికి కారణం కనిపించలేదు. పిలుద్దా మనుకున్నాడు. అది అర్ధరాత్రి. తాను వంటరి. మంగమ్మ ఒక్కతే. పిలవడం మంచిది కాదనుకున్నాడు. కాని మంగమ్మలో ఏదో విచిత్రం అయిన మార్పు కనిపిస్తూంది. ఏదో విచారంలో మునిగి ఉంటూంది. ఎందుకో తనకు అర్థం కాలేదు. అడుగుదామనుకున్నాడు. అడగలేదు. అడగాలి. కాని ఇప్పుడేం? ఈ అర్థరాత్రా? మంగమ్మ – జగ్గయ్య భార్య. ఆవిడ విషయంలో తనకు బాధ్యతలున్నాయి. ఊరికే బాధ్యత ఉంది. ప్రజలకు బాధ్యత ఉంది. ఏమైంది మంగమ్మకు? ఎందుకిలా ఉంది? అదొక ప్రశ్న. అందుకు సమాధానం రాదు. మనసు తెలుసుకోవడం మహా కష్టం.

గదిలో ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్లున్నది. గాలి ఆడుతున్నట్లు లేదు. ఉక్క పోస్తూంది. తలుపు తీసుకొని బయటికి వచ్చాడు. చంద్రుడు లేడు. వెన్నెల లేదు. కాని అంతగా చీకటిలేదు. ఆకాశంలోకి చూశాడు. చుక్కల గుంపులు మిల మిల లాడుతున్నాయి. గాలి చల్లగా వీస్తూంది. మనసు కొంత తేలిక అయింది. బయటకి నడిచాడు. ఊళ్ళోకి సాగాడు. వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఊర కుక్కలు అక్కడక్కడా మొరుగుతున్నాయి. చింతచెట్లు చీకట్లను చేర్చుకున్నాయి. గబ్బిలాలు స్వైర విహారం చేస్తున్నాయి. అంతరాత్రి తాను ఎందుకు వచ్చాడో తెలీదు. అయినా సాగిపోతున్నాడు. నేలమట్టం అయిన చావిడి కనిపించింది. క్షణం సేపు అక్కడ నుంచున్నాడు వీరభద్రం. ఆ క్షణంలో అతనిలో ఎన్ని పూర్వ స్మృతులు మసలాయో చెప్పలేం. అది కూలడానికి కారకుడు తాను. అధికార చిహ్నమనీ, దోపిడీ నిలయమనీ దాన్ని కూల్చాడు. అది కూలింది. కాని అధికారం కూలలేదు. ఇంక అక్కడ నిలువలేకపోయాడు. చకచకా సాగిపోయాడు. సగం కూలిన పోలీసు నాకాలో వెలుగు కనిపించింది. గబగబా సాగాడు. అక్కడ నుంచున్నాడు. గోడలు కూలినచోట తడకలు కట్టారు. లోపల లాంతరు వెలుగుతూంది. సిగరెట్లు, బీడీలపొగ పైకి లేస్తూంది. లోన జనం ఉన్నారు. ఏదో కొట్లాడుకుంటున్నారు. శేషయ్య గొంతు వినిపించింది. గ్రహించాడు. చీట్లాడుకుంటున్నారు. కూలిన పోలీసు నాకా చీట్లాటకు నిలయం అయింది. ఎంత మార్పు అనుకున్నాడు. చీట్లాట పేరు తెలియని జనం, ఎంత చెలరేగారు. ఊళ్ళో సారాయి దుకాణం వెలిసింది. ఇది నాగరికత పెరగడమా? అనాగరికత పడగ విప్పుకోవడమా? ఆ పడగ ఎంత పెద్దదో, పడగ నీడన దాగేవారెందరో? పాముకాటుకు చచ్చేవారెందరో? ఎటు పయనిస్తున్నాం మనం? అని ప్రశ్నించుకున్నాడు. ఇక ముందుకు అడుగు వేయలేకపోయాడు. వెనక్కు మెల్లగా నడవలేకపోయాడు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ సాగిపోయాడు. వేగంగా సాగిపోతున్నాడు. ఎవరో తరుముతున్నట్టు ఉరుకుతున్నాడు — సుమారు అతని అడుగుల చప్పుడు వినిపించసాగింది. ఎందుకలా పారిపోతున్నాడు తాను? ఎంత దూరం పోతాడు? ఎందుకూ భయం? ఏమిటీ భయం? భయపడి ఎక్కడికి పోతాడు? ఆలోచించుకున్నాడు. ఈ నాగరికత రంగుల వల. ఇందులో చిక్కుకోవడం తేలిక. ఛేదించడం కష్టం. వలను చించాలి, చీల్చాలి, ఛేదించాలి. పారిపోవడంవల్ల ప్రయోజనం లేదనుకున్నాడు. ఆలోచనలతో వేగం తగ్గింది. అడుగులు మెల్ల మెల్లగా పడుతున్నాయి. వెనక ఏదో కుక్క ఏడుస్తూంది. ఏడుపు వినిపిస్తూంది. మందమందంగా నడుస్తున్నాడు వీరభద్రం. ఇంటికి దగ్గరగా వచ్చేశాడు. ఇంట్లోంచి ఏడ్పు వినిపిస్తూంది. చెవులను నమ్మలేకపోయాడు. నాలుగడుగులు ముందుకు వేశాడు. ఎక్కెక్కి ఏడుస్తున్నారు — ఎవరు? ఎందుకు? ముందుకు సాగుతూంటే స్పష్టంగా వినిపిస్తూంది. తలుపు తెరిచి ఉంది. దీపం వెలుగుతూంది. తాను తలుపుతీస్తే వెళ్ళిపోయాననే విషయం అప్పుడు గుర్తుకు

వచ్చిందింది. అక్కడే నుంచున్నాడు, విన్నాడు. కుమిలికుమిలి ఏడుపు. ధ్వని గుర్తించాలని ప్రయత్నించాడు. గుర్తించలేకపోయాడు. ఇంట్లో ముంగిలిలో అడుగు పెట్టాడు. బావి దగ్గర వింత దృశ్యం! జుట్టు విరియబోసుకుని తెల్లని చీర కట్టుకుని బావిలోకి దూకడానికి సిద్ధంగావుంది ఒక ఆకారం. వీరభద్రానికి క్షణం భయం అయింది. తరువాత మతి స్తబ్దం అయింది. ఉరికాడు. ఆకారాన్ని పట్టి లాగేశాడు. అరక్షణం ఆలస్యం అవుతే బావిలోపడిపోయేదే! చేయిపట్టి లాగేవరకు గిరక్కున వెనక్కు తిరిగింది ఆకారం.

మంగమ్మ!!!

పిడుగుపడ్డది వీరభద్రంమీద.

"ఏమిటీ వెధవపని? వెర్రిపని? ఎందుకు చస్తావ్? ఏమొచ్చింది నీకు?" కేకపెట్టాడు వీరభద్రం. అతనిలో కోపం పొంగుతూంది. అమాంబాపతు వణకుతున్నాడు.

"చావనియ్యి. బతకలేను. నీకు ముఖం చూపించలేను. అన్నయ్యా పుణ్యం కట్టుకో. నన్ను వదులు. ఎందుకొచ్చినవిట్లు?" అని గింజుకుంటూంది మంగమ్మ. ఏడుస్తూంది. ఎంతసేపణ్నుంచి ఏడుస్తూందో గొంతు పగిలింది. ధ్వనిమారింది.

"ఆగు. గింజుకోకు. నిన్ను చావనియ్యను. నువ్వు జగ్గయ్య భార్యవు. నామీద బాధ్యత ఉంది. చెప్పు ఎందుకు చస్తావో?" ఉరిమాడు వీరభద్రం.

"చెప్ప. చస్త. నువ్వెవరు నన్నడిగెతందుక్క?" గట్టిగా అడిగింది. ఒక్క ఊపులో చేయి విదిలించుకుంది. అడుగు ముందుకు వేసింది బావివైపు. దబ్బున గంతువేసి పట్టుకున్నాడు వీరభద్రం.

"చస్త. మందికి మొఖం చూపలేను. నువ్వెవరు నన్నాపెటందుక్క? ఇడువు" ఉద్రేకంగా అన్నది మంగమ్మ. చండికలా ఉంది మంగమ్మ. మళ్ళీ ఒక ఊపు ఊపింది. కాని విడిపించుకోలేక పోయింది.

వీరభద్రానికి ఏమీ తోచలేదు. మంగమ్మ అవతారం ఉగ్రంగా ఉంది. "నువ్వెవరు నన్నాపెటందుక్క" అనే మాటలు మెదడులో గిరగిరా తిరిగాయి. ఏం చేయాలో తోచలేదు. తికమక పడ్డాడు. లాగి చెంపమీద ఒక్కటి వేశాడు. "నేనెవ్వరా? జగ్గయ్య తమ్ముణ్ణి. నిన్ను చావనియ్యను. ఎట్లా చస్తవో చూస్త" అని గొరగొరా లాక్కుపోయాడు. గదిలో వేసి గొళ్ళెం పెట్టాడు.

మంగమ్మ మంచంలో పడిపోయింది. ఎక్కెక్కిపడి ఏడుస్తూంది– వీరభద్రం క్షణం తర్వాత వస్తే బాగుండునన్నుకుంది. ఆమె కన్నీరు కాలవలై పారసాగింది. గుండెలోని మంటలు క్రుంగదీస్తున్నాయి.

బయట వీరభద్రం స్థితి అయోమయంగా ఉంది, ఏమైంది మంగమ్మకు? ఎందుకు చస్తుంది? ఎవరో ఆమెకు అన్యాయం చేసినట్లున్నారు. ఎవడువాడు? ఏ పాపాత్ముడు? వాణ్ని నరికివేయాలనుకున్నాడు. తాను మంగమ్మను కొట్టాడు. తనను

ఎవరో కొట్టినటు ఉలిక్కి పడ్డాడు. ఎంతపని చేశాడు తాను? మంగమ్మనే కొట్టాడు! పరిస్థితులు అలా వచ్చాయి. తానేం చేయగలడు? కొట్టాడు. ఎవరిని? మంగమ్మను! జగ్గయ్య భార్యను!

దుఃఖం ముంచుకొని వచ్చింది.

కన్నీరు కాలువలు కట్టింది.

తరవాత ఇంకిపోయింది.

గుండె తపిస్తూంది. అగ్గి ఆరడంలేదు.

అసలు జరిగిందేమి? ఎందుకు చావాలనుకుంటూంది?

జరిగిన వైపరీత్యం ఏమి? మంగమ్మనే అడగాలనుకున్నాడు. తలుపుతీసి గదిలో అడుగు పెట్టాడు. మంగమ్మ బావురుమని వీరభద్రం కాళ్ళమీద పడ్డది. "అన్నా నన్ను చావనియ్యి. నా కడుపుల పాపం పెరుగుతున్నది."

మండిపోయాడు వీరభద్రం.

"మంగమ్మా! చెప్పు ఆ దుర్మార్గు డెవడో చీల్చి చెండాడుతా" అన్నాడు.

"ఎవరినంటే ఏం లాభం, ఈ పాపం పెరగనీయను. నన్ను చావనియ్యి."

"చావు, చావు, చావు. చచ్చి ఏం సాధిస్తావు? పిరికివాళ్ళు చస్తారు. ధైర్యంగా ఎదిరించాలి. ఏం జరిగిందో చెప్పు. చస్తానంటున్నావు. బాగుంది. కాని పుట్టబోయే పాపను చంపే హక్కు నీ కెక్కడిది? నువ్వు పాపం చేశావు. మరెవడో పాపం చేశాడు. కాని నీ డొక్కలో పెరిగే పాప చేసిన పాపం ఏమిటి? మీ పాపానికి ఆ పాప బాధ్యత ఏమి? ఏ పాపమూ ఎరుగని ఆ పాపనెందుకు చంపుతావు? పుట్టబోయే పాపకోసం నీవు బ్రతకాలి. చెప్పు ఎవరో ఆ దుర్మార్గుడు?"

మంగమ్మ దుఃఖం ఇగిరిపోయింది. ఆమెలో ఆలోచన తలెత్తింది. తన పాపానికి పుట్టబోయే పాపదేం బాధ్యత? ఆ పాపను చంపే హక్కు తనకెక్కడిది? అది నిజమే. ఆ పాప ఎవరిబిడ్డ? ఎవడు దానికి తండ్రి? ఎలా పెరుగుతాడు? సంఘం తనను బ్రతకనిస్తుందా? అసలుమాట చెపితే వీరభద్రం క్షమిస్తాడా? చెప్పడం తప్పదు. చెప్పాల్సిందే. ఆ నిర్ణయంతో ఆమెకు మళ్ళీ దుఃఖం పొంగింది. కన్నీరు జలజల రాలింది. కథంతా సంక్షిప్తంగా చెప్పేసింది. చెప్పడం అయిపోవడంతో కూలబడి వీరభద్రాన్ని చూడసాగింది.

కథంతా విన్న వీరభద్రం మంచంలో కూలబడ్డాడు. తల చేతులతో పట్టుకున్నాడు. స్థాణువులా ఉన్నాడు. ఊపిరి ఆడకుంటే రాతిబొమ్మ అనుకోవచ్చు.

మంగమ్మ రెప్ప వాల్చకుండా వీరభద్రాన్ని చూస్తూంది.

వీరభద్రం నేలను చూస్తున్నాడు.

భయంకరం అయిన మౌనం.

ఎవరూ పలకడంలేదు.

ఇద్దరిలోనూ కదలిక లేదు.

రెండు గుండెల్లోనూ అగ్గి కొండలు మండుతున్నాయి. రెండు గుండెల్లో తుపానులు చెలరేగుతున్నాయి. దావాగ్ని మండుతూంది.

"మంగమ్మా!" మౌనాన్ని భగ్నం చేశాడు వీరభద్రం. గుండెను చీల్చుకొని వచ్చిన పదం అది. "మంగమ్మా! చాల తప్పుపని చేశావు. రాముడు రాక్షసుడుగా మారాడు. అమృతవాణి ఉంటే విషం పుచ్చుకునేది. ఎంత ఉత్తమురాలు ఆ తల్లి! ఎలాంటి బిడ్డను కన్నది!! రాముణ్ణి ఎలా నమ్మావు నువ్వు?"

జవాబుగా కన్నీరు జలజల రాలింది మంగమ్మకు.

"ఇప్పుడు ఏడ్చి ఏం ప్రయోజనం? మరెవడైనా అవుతే దండించి ఒప్పించే వాణ్ణి. కాకుంటే కాళ్ళ పట్టుకొని బ్రతిమిలాడేవాణ్ని. రాముని విషయంలో రెండూ చేయలేను."

మంగమ్మ అమాయకంగా చూచింది.

కరిగిపోయాడు వీరభద్రం. "ఈ అమాయకత్వాన్నే వాడుకుంటున్నారు వాళ్లు. దోచుకుంటున్నారు. ఎక్కడ కాటువెయ్యాలో వాళ్ళకు తెలుసు. అన్నీ తెలిసి మనం గోతిలో పడుతున్నాం – అయినా ప్రయత్నిస్తాను. నీ కోసం వాడి ఇంటికి వెళ్తాను. దేహీ అంటాను. ఏమైనా నువ్వు చావడానికి వీల్లేదు. నీ పాప బ్రతకాలి" అని చివాలున లేచి సాగిపోయాడు వీరభద్రం.

మంగమ్మ అతణ్ని అడ్డగించలేకపోయింది. చూస్తూ నుంచుంది. ఆమెకు తెలుసు రానున్న పరిణామం. అందుకే బేలగా చూచింది. అబలగా చూచింది. ఆరాటంగా చూచింది. ఆవిడలో అగ్నిపర్వతం బ్రద్దలైంది. లావా ప్రవహించింది. నోట్లో కొంగు కుక్కుకొని మంచంలో పడి పోయింది.

మంగమ్మలోని మధనకు అంతులేదు. అది వర్ణించడానికి అక్షరాలు లేవు. ఆ బాధ అక్షరం అయింది. ఆమెలో సముద్రాలు పొంగాయి. తుపానులు రేగాయి. అగ్గి కొండలు బద్దలైనాయి.

అనంతమైన ఆలోచనలు అల్లుకున్నాయి. తాను ఆశించిందేమి? అయిందేమి? వాస్తవంగా తానేమైనా ఆశించిందా? స్మృతి పథానికి అందినంతవరకు చూచింది. వాస్తవంగా తానేమీ ఆశించలేదు. అయితే ఈ పరిణామాలేమిటి? తాను రాముడికి లొంగింది. అది నిజం. తనలో ఏ లోపం ఉంది? ఎందుకు లొంగింది? తనలో ఏదో కోరిక రగిలింది. కాదు రగిలించాడు రాముడు. అది సామాన్యమైంది. సహజమైంది. సర్వ ప్రాణులకూ కలిగేదే. అన్నం ఎవడు పెట్టినా తినవచ్చు. నీరు త్రాగవచ్చు. ఆశ్రయం ఇచ్చినవాని అండన ఉండవచ్చు. కాని ఈ కోరిక అందరివల్లా తీర్చుకోరాదు. తీర్చుకుంటే పాపం. సమాజం దాన్ని హేయంగా భావిస్తుంది. నీచంగా చూస్తుంది. ఇందుకు కారణం ఏమిటి? ఎవరు ఇందుకు కారకులు? ఒక్క క్షణంలో కలిగిన ఇంద్రియ దౌర్బల్యానికి ఇంత శిక్ష అనుభవించాలా? అసలు రానున్న పాప ఎవరు? అది ఎందుకు రావాలి? తాను పిలిచిందా? పిలవనిది

ఎందుకు రావడం! ఈ అనాథ బిడ్డగా ఏం బావుకుంటుంది! తననే ఈసడించుకొనే లోకం తన బిడ్డను సహిస్తుందా! వీల్లేదు. అది రారాదు. పుట్టని బిడ్డమీద ఆమెకు కోపం పెల్లుబికింది. అమాంతంగా లేచి కూచుంది– "రావద్దు నువ్వు రావద్దు" అని అరుస్తూ పొట్ట గుద్దుకోసాగింది. ఆమె మనసులో ఏదో కేక వినిపించింది. అది "అమ్మా" అన్నది. అమ్మ కరిగిపోయింది. ఆమెలో అనురాగం పొంగింది. మాతృత్వం పొర్లింది. అవి రానున్న పరిణామాలను మరిపించాయి. అసలు ఆమె ఎన్నడూ వాటిని గురించి ఆలోచించినట్లే తోచలేదు. "బిడ్డా" అని ఏడ్చింది మంగమ్మ. తాను చేసిన, చేయబోయిన పనికి పశ్చాత్తాపంతో కుమిలిపోయింది. కుంగిపోయింది. కూర్చున్నది కూర్చున్నట్లే మోకాళ్ళమీద తలపెట్టుకుని వలవలా ఏడ్చింది. చంటిబిడ్డలా ఏడ్చింది. బిడ్డ అప్పటికే పోయిందేమో అన్నట్లు ఏడ్చింది. ఏడ్చి ఏడ్చి అలసిపోయింది. కన్నీటితో కడుపు చెరువైంది. ఆ చెరువులో మునగ సాగింది. తేలసాగింది.

వీపుకు కళ్లలేవు. వెన్ను దేనిని చూడలేదు. అందుకే మంగమ్మ ఘోష చూడలేకపోయాడు వీరభద్రం. అతనిలో వున్న తపనవేరు. మంగమ్మ కాలు జారింది. ఆమెను బయటకు లాగాలి. అతనిలో రాముడి మీద కోపం పెల్లుబుకు తూంది. దాన్ని అణుచుకోవడానికి శతధా ప్రయత్నిస్తున్నాడు. అతని ఆలోచన గాలి లేని దీపశిఖలా వెలుగుతూంది – నిశ్చలంగా అయినా అతడు సాగిపోతూనే వున్నాడు. ధ్యాస ఎక్కడో వుంది. మస్తాన్ పిలుపు వినలేదు. మస్తాన్ ఉరికివచ్చి అడ్డుగా నుంచున్నాడు. వీరభద్రం అడుగు ముందుకు వెయ్యబోయి నిలదొక్కు కున్నాడు.

"యాడికి పోతున్నావ్ ఇంత పొద్దాల?"

కాస్త చిరాకు పడ్డాడు వీరభద్రం. అయినా సౌమ్యంగానే "రాముని ఇంటికి" అని జవాబు చెప్పాడు.

"రామయ్య ఇంటికి పోతవ్‌లే"

"పోతే తప్పా?"

"నేనంటె తప్పైతదా? ఎట్లయిన మీరు మీరు ఒక్కటి! మునిగెటోల్లం మేమేగద?"

మస్తాన్ చేసిన వ్యాఖ్యానానికి వీరభద్రం తల తిరిగిపోయింది. చావు బతు కుల్లో తనకు అండగా నిలిచిన మస్తాన్ మాటలేనా ఇవి? మస్తాన్ మతిపోయిందా? మస్తానే ఇలా అంటే ఇతరులేమనాలి? ప్రజల మనిషి నడక కత్తిమీద సాము. అందరిదీ కొన్ని కళ్ళు – అతనిని వేల కండ్లు చూస్తుంటాయి. తాను రాముని దగ్గరికి వెళ్ళడాన్ని గురించి ఊరు ఎలా వ్యాఖ్యానిస్తుంది? ఆ వ్యాఖ్యల్ను ఎదురు కోవటం ఎలా? సమాధానం చెప్పడం ఎలా? కష్టమే! మరి వెనక్కు తిరగాలా?

మంగమ్మ శోకమూర్తిగా ప్రత్యక్షం అయింది. అతనిలోని మనిషి ఆకాశం అంత అయినాడు. మరే ఆలోచనకూ అవకాశం లేకుండా చేశాడు.

"మస్తాన్! ఒక మనిషిని రక్షించాలె. ఆడ మనిషిని. అదీ మంగమ్మను. అడ్డుజరుగు. నన్ను అర్థం చేసుకో" అని మస్తాన్ను తప్పుకొని ముందుకు అడుగు వేశాడు.

మంగమ్మను రక్షించాలి అనే మాటతో కొంత తికమక పడ్డాడు మస్తాను. "నన్ను రమ్మంటారా?" అడిగాడు.

"ఇప్పుడువద్దు. అక్కరపడితే పిలుస్త"

మళ్ళీ ఏదో అనుమానం మస్తాను మనసులో చేరింది. అతడు వీరభద్రాన్ని అనుసరించాడు.

వీరభద్రం రామయ్య ఇంటి మెట్లెక్కాడు. గడప దగ్గర పండ్లపుల్లతో రామయ్య ప్రత్యక్షం అయినాడు. అకస్మాత్తుగా ఒకరికి ఒకరు ఎదురైనారు. అడుగు ముందుకు వేయాల్సింది వెనక్కు వేశాడు రామయ్య. పిడుగు పడ్డట్లనిపించింది. కాస్త కలవరపడ్డాడు. గుండె దడదడ లాడింది. క్షణం నోటమాట రాలేదు. అతనికి తెలియకుండానే చేతులు రెండూ వీరభద్రానికి నమస్కారం చేశాయి. "మీరా! మా యింటికి!" అన్నది నోరు.

"అవును జర మాట్లాడాలె"

"మంచిది. రాండి లోపలికి" అని యాంత్రికంగా నడిచాడు రామయ్య. ఇద్దరూ కుర్చీలమీద కూర్చున్నారు.

ఇద్దరి గుండెలూ గుబ గుబ లాడుతున్నాయి. ఇద్దరి ముఖాల్లోనూ రక్తం లేదు. ఇద్దరూ ఒకరిని ఒకరు చూచుకున్నారు. ఇద్దరూ తలలు వంచుకున్నారు. ఆవరించిన నిశ్శబ్దత బిక్కు బిక్కు మంటూంది. ఎలా ఎలా ప్రారంభించాలో వీరభద్రానికి తెలియడం లేదు. విషయం ఏమిటో రామయ్యకు అర్థం కావడంలేదు.

"మంగమ్మ తెలుసా?"

పిడుగు పడ్డది రామయ్య మీద. చిరు చెమటలు పోశాయి. అందుకు సిదంగా లేడు. కళవళ పడ్డాడు.

"ఏ మంగమ్మ?"

వీరభద్రం వళ్ళుమండింది. ఆ ప్రశ్నతోనే రానున్న పరిణామాలను అర్థం చేసుకున్నాడు వీరభద్రం. అయినా నిగ్రహం వహించాడు.

"జగ్గయ్య భార్య...."

"ఎరికె. ఏం.... బాగున్నదా?"

నవ్వాడు వీరభద్రం. అది గునపంలా గుచ్చుకుంది రామయ్య గుండెలో. ముఖంలోని రక్తం యావత్తు దిగిపోయింది.

"ఆమెకు అన్యాయం చేశావు"

"నేనా.... నేన.... నేనేం చెయ్యలేదు. పని చేసింది. పైకం ఇచ్చిన. అంతరికిచ్చిందానికంటె ఎక్కువ ఇచ్చిన."

"పని చేస్తున్నప్పుడు ఏం చేసినవ్. ఆమె నాకు అన్నీ చెప్పింది. నిజం ఒప్పుకో ఆమెను నాశనం చేయకు."

ప్రేత ముఖంలా వెలవెలపోయింది రామయ్య ముఖం. అదో విధంగా చూశాడు వీరభద్రాన్ని. అతని నాలుక తడి అరి పోయింది. "అవు. నేనామెను బలవంతం చేసిన. అది సత్యం. మీరు వచ్చిను మంచిదైంది. నలుగుర్ల పెట్టకండి, ఏమియ్యమంటె అదిస్త. ఆమెకు లోటూ రానియ్యను. ఏమంటరు?"

"ఆమె కడుపుతో ఉంది"

రామయ్యమీద పిడుగు పడ్డది.

మాటాడలేదు.

"ఇప్పటికి మించిపోయిందేమీ...."

"ఏం చేయమంటరు. మీరు ఎంతియ్యమంటె అంతిస్త"

"రామయ్యా! ఆడదాని శీలాన్ని డబ్బుతో కొనగలవా?"

కాస్త చిరాకుపడ్డాడు రామయ్య. "డబ్బుతో కాకుంటె రాజ్యాలతో కొంటమా చెప్పండి ఏం చెయ్యమంటరో?"

"పెండ్లి చేసుకోవాలె"

ఈ తడవ అతనిమీద ఏ పిడుగూ పడలేదు. అతి సాధారణంగా అన్నాడు "మొగుడు చచ్చిన ముండనా?"

"లోకానికైనా వెరవాలి. ముఖం ఎట్లా చూపిస్తవు జనానికి?"

"ఏమి? కడుపు నేను చేసిన్నని దాఖలా?"

"మరి ఎవరు చేసిన్రంటవు!"

"నాకేమెరిక. మంగమ్మ ఇంట్లో ఉంటున్నది నువ్వు? నన్నడుగుతే నేనెట్ల చెప్పను?"

వీరభద్రం మండిపోయాడు. తనమీద నేరమా? అతని కాళ్లూ చేతులూ వణికాయి. "నన్నే దోషి అంటున్నావా రాముడూ. కాలం మారింది కాబట్టి సరిపోయింది. కాకుంటే నీ తల ఇప్పటికి తెగి ఉండేది."

"కాలం మారింది కాబట్టే అంటున్న. మంగమ్మకు కడుపు చేసింది నువ్వు, నువ్వు." అని గట్టిగా అరచాడు, లేచి నుంచొని వీరభద్రం వైపు వేలుతో చూపుతూ. అంతే అక్కణ్నించి చరచరా వెళ్ళిపోయాడు.

వీరభద్రం కుంగిపోయాడు. అతడు కుర్చీలోంచి లేవలేకపోయాడు. అయినా లేచి చరచరా మెట్లు దిగాడు. గుండెల్లో ఒక అగ్గి కొండతో చెరువువైపు నడిచాడు.

తూర్పున భానుడు ఉదయించాడు. వెలుగులు పరుస్తున్నాడు. పశువుల మందలు ఊరుదాటి పోతున్నాయి. ఎండిన కాలువ వెంట సాగిపోతున్నాడు.

వీరభద్రం. మనసులో చీకటి నిండుకుంది. వెలుగురేఖ కోసం వెతుకుతూ సాగిపోతున్నాడు. చెంబులు పట్టుకొని చెరువువైపు వెళ్ళేజనం నమస్కరిస్తున్నారు. పరాకుగానే ప్రతినమస్కారం చేసి సాగిపోతున్నాడు. చెరువు కట్ట ఎక్కాడు. నిప్పులు కురిసే మోదుగులు కనిపించాయి. మోదుగుపూలంటే వీరభద్రానికి ప్రాణం. ఆ ఎరుపుదనం అతనిలో ఏదో ఉత్తేజాన్ని కలిగించేది. వాటిలో ఏదో వెలుగు గోచరించేది. కాని ఈ రోజు? వాటిని చూశాడు. అవి నిర్గంధ కుసుమాల్లా కనిపించాయి. "పలాశ కుసుమం వృధా" అనిపించినట్లుంది అతనికి. అలాగే సాగిపోతున్నాడు మరి! నాగజముడు పొదలు కనిపించాయి. అవి దట్టంగా ఉన్నాయి. పాము పడగల్లా ఉన్నాయి. పైగా ముళ్ళు. నాగసర్పం మెత్తగా ఉంటుంది. చల్లగా ఉంటుంది. కాటు సంగతి తరవాత నాగజముడు తనను తాకనివ్వదు. దాన్నిండా సూదుల్లాంటి ముళ్ళు. రామయ్య నాగసర్పం అనుకున్నాడు. తాను నాగజముడు కాదుకదా అనుకుంటూ ఉండగానే గుండెలో నాగజముళ్ళు మొలిచాయి. నాగజముళ్ళు దాటాడు. చెరువులో నీటిచుక్క లేదు. బీటలు వారింది. చెరువుకట్ట దిగాడు. ఇంకా సాగిపోతూనే ఉన్నాడు. ఎక్కడికో? కాలిబాట వదిలాడు. ఎండిన చేలల్లోంచి పడి నడిచాడు. పెద్ద మర్రికింద వున్న పరుపు బండమీద కూలబడ్డాడు. తల ఎత్తి సూర్యుణ్ని చూశాడు. అతడు ఎదుగుతున్నాడు. ఎగబాకుతున్నాడు. రామయ్య ఎదుగుతున్నట్లని పించింది. రామయ్య సూర్యునిలా ఎగబాకుతున్నాడా? చీకట్లలా ఎదుగుతున్నాడా? అనుకున్నాడు. మనసు తేలిక పరచుకుందామని సిగరెట్టు కాల్చాడు. పొగ వదులుతుంటే మనసు తేలికయినట్లని పించింది. ఏంచేయాలి ? మంగమ్మను ఎలా కాపాడాలి. మంగమ్మ అమాయకురాలా? ఇందులో మంగమ్మ తప్పులేదా? అవును తప్పు చేసింది అనుభవించనీ శిక్ష! ఆమె చేసిన తప్పేమి? వాడు బలవంతం చేశాడు. అడ్డుకోలేక పోయింది. ఎదిరించలేక పోయింది. చేయని తప్పుకు శిక్ష ఎందుకు అనుభవించాలి? ఎంత దుష్టుడైనాడు రాముడు? తనమీదనే నేరం మోపాడే? దొరబానిసగా బతికినవాణ్ని మనిషిని చేసింది తాను. ఒక్కొక్క సారి తనకోసం ప్రాణాలే బలి ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. అలాంటి రాముడు తనమాట వినకపోతాడా? అని వెళ్ళాడు. ఎంత దుర్మార్గుడు. తననే మంగమ్మ కడుపుకు కారణం అంటాడా? అతనిలో కోపం పెల్లుబికింది. ఒకరాయి అందుకొని లాగి రాతికి కొట్టాడు. నిప్పు రవ్వలు వెలిగి మలిగిపోయాయి. రాముడు మంచివాడే. డబ్బు అన్ని దుర్మార్గాలను నేర్పుతుంది. వాడికి సిరి అబ్బింది. అది చేసిన దుర్మార్గాలను కప్పిపుచ్చగలదు. మరికొన్ని చేయించగలదు. రాముడిని తానేం చేయగలడు? అతడు బలవంతుడు. చేయాల్సిందల్లా మంగమ్మను రక్షించడమే రక్షించడం. రక్షించడం. రక్షించడం. ఎలా? ఎప్పుడు? ఎక్కడ? ఎవరు, ఏవో బాకులు. కత్తులు కటార్లు మెదడును చీల్చాయి. ఏమిటి? ఎలా? ఏం జేయడం?

దూరంనుంచి మస్తాన్ వస్తున్నట్లు కనిపించాడు. మనిషికి మనిషి కొంతధైర్యం. ఆలోచనకు ఉపకరిస్తాడు అని అతడు వస్తున్నవైపు చూడసాగాడు. అవును తనవైపే వస్తున్నాడు. ఎందుకు అంత వేగంగా వస్తున్నాడు? మంగమ్మ ఏమైనా అఘాయిత్యం చేయలేదుకదా! దాంతో అతని గుండె దడదడ లాడింది. మనసు కీడు శంకించింది. మెదడు ఏవేవో ఆలోచించింది. అమాంతంగా లేచి ఎదురుగా పరిగెత్తాడు. "మంగమ్మ బాగేనా?...." అడిగాడు దూరం నుంచే వస్తున్న మస్తాన్ను.

మస్తాన్ పరిగెత్తి వచ్చి కలుసుకున్నాడు. "నా కెరకలే - నే నటుపోలే. ఇయాళ తేలిపోవాల్నుండి. ఏం మొనగాడైండా రాముడు? వాని రక్తం కళ్ళచూస్త. పోతే జేలుకు పోత. పోతే పానంపోతది. పోరాటంల చచ్చిన్ననుకొంట. అవ్వ! ఎంత బద్మాష్!! తాను కడుపు చేస్తడు. మీ మీద పెడ్తాడు లంజకొడుకు.......ప్రజల సొమ్ముతిని బలుస్తాండు గాడ్దికొడుకు. అమృతవాణి ఉండాల్సుండెనుండి తేల్చెడిది వీడి తడాఖా. నేను అన్ని ఇన్న. మీరేం చెప్పొద్దు సై అనుండి. తేల్చేస్తం. అంత తయారున్నం" గుక్క తిప్పకుండా చదివేశాడు మస్తాన్.

వీరభద్రం మస్తాన్ బుజంమీద చేయివేసి చిరునవ్వు నవ్వాడు. ఇద్దరూ మర్రికింది బండవరకూ మౌనంగా నడిచి కూర్చున్నారు.

"మస్తాన్ నీకింకా పోరాటపు ఉద్రేకం తగ్గలేదు. మనం ప్రజాస్వామ్యంలో వున్నాం. అధికాగం వాళ్ళ చేతుల్లో ఉంది. మనం వాళ్ళ అంతుచూడ్డం కష్టం. మన అంతం వాళ్ళు చూడగలరు. ఉద్రేకంలో మంగమ్మ వేసిన తప్పడడుగుకు మనం ఇన్ని బాధలకు గురి అయినాం. మనలోని ఉద్రేకాన్ని పెంచి మనతో తప్పులు చేయించటం వాళ్ళ లక్ష్యం. నువ్వు ఉద్రేకంలోపడి ఏమైనా చేస్తే వాళ్ళు గెలిచినట్టే గాని మనం గెలిచినట్టుకాదు. మనం రామయ్యను ఏమీ చేయలేం. మంగమ్మను రక్షించడాన్ని గురించి ఆలోచించాలె."

ఉపన్యాసం చిన్నదైనా ఉక్కిరి బిక్కిరైనాడు మస్తాన్. తల వంచుకొని మౌనంగా ఆలోచించాడు. వీరభద్రం చెప్పిన ప్రతి అక్షరంలో అర్థం ఉందని గ్రహించాడు. నిస్సహాయుడై వీరభద్రాన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

వీరభద్రం మర్రి ఆకుల ఈనెలు తీస్తున్నాడు. లేచి నుంచుని ఊరివైపు అడుగు వేశాడు. అతడు గంభీరంగా ఉన్నాడు. ఆలోచనలలో మునిగి ఉన్నాడు. మస్తాన్ అతణ్ణి అనుసరించాడు.

"ఏం చేద్దమంటరు?" మస్తాన్ ప్రశ్న.

ప్రజాబలాన్ని గుర్తించినపుడు వారు చేసేది ఇదే. ఏమీ చేయలేనప్పుడు మనిషి శీలంమీద దెబ్బకొడ్తారు. తద్వారా వ్యక్తిమీద ఉండే గౌరవం పోగొడ్తారు. అది వారు ఉద్యమం మీద కొట్టే మొదటిదెబ్బ." నిరామయంగా చెప్పేశాడు నడుస్తూనే. తరవాత వీరభద్రం మాట్లాడలేదు.

వీరభద్రాన్ని అనుసరించి సాగుతున్నాడు మస్తాన్. మస్తాన్‌కేమీ అర్థం కాలేదు. మధనపడ సాగాడు. ఏం చేయాలో అతనికి తోచలేదు. అతనికి అర్థం అయ్యింది ఒక్కటి–వీరభద్రాన్ని అప్రతిష్టపాలు చేయడానికి ప్రయత్నిస్తున్నాడు రామయ్య అని. గ్రామానికి అసలు విషయం తెలియ పరచాలనుకున్నాడు. అందుకు కృతనిశ్చయుడైనాడు. మౌనంగా అనుసరించాడు వీరభద్రాన్ని.

వారు నాగజముండ్లను చూడలేదు. మోదుగు పూలను గమనించలేదు. చెరువు కట్ట ఎక్కారు. దిగారు. కాలువవెంట సాగిపోయారు. ఊళ్ళోంచి పోతుంటే జనం వారిని వింతగా చూశారు. అది ఇరువురూ గమనించలేదు. మంగమ్మ ఇంటికి చేరారు. అది పాడుబడ్డ ఇంటిలా వుంది. ఇంటి ముందు ఊడ్పులేదు. కళ్ళాపిలేదు. భయంకరం అయిన నిశ్శబ్దం ఆవరించి వుంది. అడుగు లోనవేశాడు. వీరభద్రం. మంచంలో మంగమ్మ కనిపించలేదు. గుండె దక్కుమంది. వేగంగా గదివేపు నడిచాడు. మంచంలో మూటలాపడివుంది మంగమ్మ. తల ఎత్తి వీరభద్రాన్ని చూచింది. ముందు చిరునవ్వు నవ్వింది. తరవాత పెద్దగానే నవ్వేసింది. వీరభద్రం బయటికి వచ్చి మంచంలో కూలబడ్డాడు. మస్తాన్ నుంచున్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

కాలం కరిగిపోతూంది. కారిపోతూంది.

మస్తాన్ వెళ్ళిపోయాడు - నిశ్శబ్దంగా.

వెళ్తున్న మస్తానువైపు అదోలా చూశాడు వీరభద్రం – అయినా మాట్లాడ లేదు.

ఆ రాత్రి సారాయి దుకాణంలో ప్రచారానికి ప్రారంభోత్సవం జరిగింది. అంటే అంతకుముందు జరుగలేదనికాదు. ప్రచారం ఇరుపక్షాలనుంచీ సాగింది. రామయ్య దుర్మార్గాన్ని గురించి మల్లయ్యా, మస్తాను అందరికీ చెప్పడానికి ప్రయత్నించారు. ఇటు యాదగిరి, శేషయ్యా "ఎమ్మెల్యేగారు ఎంతపని చేసిండో చూసిన్రా!" అని ప్రారంభించారు. అయితే ముమ్మరమైన ప్రచారం సారాయి దుకాణంలో ప్రారంభం అయింది. రామయ్య మొదటి సంవత్సరం ఆ ఊరి సారాయి దుకాణం మాత్రమే పట్టాడు. అందులో బాగా లాభంరావటం అటుండగా ప్రజల్లో పలుకుబడి పెరిగింది. లాభం వచ్చిందంటే అచ్చం గవర్నమెంటు సారాయి మీదనే కాదు. పేరు గవర్నమెంటుది. సాగింది కాపు సారాయి వ్యాపారం. అందులో అతనికి అండదండలుగా నిలిచిన వీరులు యాదగిరి, శేషయ్య.

చుట్టుపట్ల ఉన్న ఊళ్ళుకూడా పట్టాడు రామయ్య. కొన్ని ఊళ్ళల్లో అతనికి 'సారాయిదొర' అని పేరుకూడా వచ్చేసింది. శేషయ్య మాత్రం ఈ వ్యాపారంతో అట్టే ప్రమేయం పెట్టుకోలేదు. అతడు పేకాటలో ఘనుడైనాడు. పోలీసులు నేర్పిపోయారు. శేషయ్య వారినే తలతన్నాడు. మొత్తంమీద ఊళ్ళో పెత్తనం సారాయికి

పేకాటకూ వచ్చేసింది. కాబట్టి ఆ రెంటినీ మించిన ప్రచార కేంద్రాలు కనిపించ లేదు. సారాయి దుకాణంలో యాదగిరి సాగించాడు.

"ఔర, మీరేమో ఓట్లిచ్చిన్రు. గెలిపించిన్రు. ఎమ్మెల్యేగారేమో కడుపులు చేస్తాన్రు."

"ఏమోనండి అందరంటాన్రుగాని నాకు నమ్మకం కుదుర్తలేదు. ఈరబద్రం గారసువంటోడు కాడుండి" తాగడానికి వచ్చిన ఒకడు అన్నాడు.

"అరే. అరే ఏందిర నువ్వనెద్ది? వీరబద్రమంటే ఎనకటి మనిసనుకున్నావా? సారాగ్లాసు అందిస్తూ" అన్నాడు యాదగిరి. "మారిపోయిండుర ఎమ్మెల్యే అయిన కాణ్ణుంచి, పట్నపాయన చెప్పిండు పట్నంల ఊరంగ తాగుతాండట. సడక్‌మీదనే పడిపోయిండట ఒకసారి."

"అంటరుండి. అయన నిప్పుసువంటోడు."

"ఓరి గాడ్దికొడక తాగుడు రామయ్య దొరది, పాడేది ఈరబద్రం పాటర! అరే మంగమ్మింట్లో ఉన్నదెవర్ర? మీ వీరభద్రమేన? మల్లి కడుపెట్లయింద దానికి? గాలికైనాదిర గాడ్దికొడక? మల్లి మీదినించి రామయ్య దొరను బద్నాం చేస్తాండు."

"ఏమోనుండి లోకం ఇసిత్రం గున్నది గదంత నాకెందుకుగని ఇంకొక్క గ్లాసు ఇయ్యండి పోత."

"పైకం తెచ్చినావుర గిలాసుమీదగిలాసు తాగెటందుక్క."

"గదేందుండి ఇయ్యాల కొత్త గడుగుతాన్రు. పంటలమీద కాదుండి పైకం తీసుకునెడ్డి."

"అవు మేం పంటలమీద తీసుకుంటుం. నువ్వేమొ ముండల పాట పాడు. పైకమియ్యంది ఈణ్ణించి కదిలేడిది లేదు. గిలాసుమీద గిలాసు తాగుతాండు తీస్ మార్‌ఖాఁ."

"గదేందుండి గట్ల గుంజుతాన్రు? ఏం చెయ్యమంటరు మల్లి ఇప్పుడు?"

"అవుర! మంగమ్మకు కడుపుచేసిందెవ్వర్ర?"

"ఈరబద్రంగారే ననిపిస్తాదుండి. బుద్ధులు మారవానుండి మనుసులవి". మనసులో సంకోచం ఉన్నా బయటకు గట్టిగానే అనేశాడా మనిషి.

అక్కడ చేరిన జనం అంతా గొల్లున నవ్వేశారు. "యాదగిరన్నా ఇంకో గిలాసియ్యే తాగెటందుక్క" అన్నాడొకడు. మరొక గ్లాసు అందించాడు యాదగిరి ఆ మనిషికి. గటగటా తాగి రుమాలుతో మూతి తుడుచుకుంటూ "అప్పన పడ్డ మనిషి కుదువ పడ్డట్టేనసె" అని గొనుక్కుంటూ వెళ్ళిపోయాడు. అతని వెనక వికటంగా నవ్వే నవ్వులు వినిపించాయి.

ఆ రాత్రి ఊరు ఉడికిపోయింది. అంతకంటే ఉదయం అంటుకున్న చిచ్చు సారాయి దుకాణంలో భగ్గుమన్నది అంటే బాగుంటుంది. అది అన్ని ఇండ్లలోనూ అంటుకున్నది. అందరి గుండెలూ కుంపట్లయినాయి. కాని ఆ చిచ్చు కాల్చింది

ఎక్కువ మంగమ్మ ఇంటినే. ఆ ఇంట్లో వంటలేదు. రెండు అగ్గికొండలు రగులుకుంటున్నాయి. వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. రెండు ప్రాణులూ మాట్లాడ్డం లేదు. చావకూడదని నిశ్చయించుకున్నాక మంగమ్మ మనసులో యాతన ప్రారంభం అయింది. కొన్నింటికి బహుశః మృత్యువే పరిష్కార మార్గమేమో! కాని మంగమ్మకు ఇప్పుడలా అనిపించడంలేదు. తన కొక బిడ్డ కలుగుతాడు. వాడేదో సాధిస్తాడు అనుకుంటూంది. వెంటనే వచ్చిన ఆలోచన - ఈః అపవాదుల భారంతో అసలు తాను జీవించడం ఎలా? పైగా నిప్పులాంటి వీరభద్రం, తాను అన్నగా చూచుకుంటున్న వానిమీద నింద! ఇదెలా భరించడం? తనకోసం అతడెందుకు బద్నాం కావాలి? తాను అతనికి చేసిన మేలేమి? ఏమి జనం? ఏమి ఊరు? అతడు తుపాకి పట్టినాడు అతనిని పూజించింది. అతడు పంచిన వస్తువులన్నీ అనుభవించింది. అతడు చెప్పిన తీర్పును ఔదల దాల్చింది.

ఈః రోజు రాముడు, రామిగాడు దొంగసొమ్ముతో దొర అయినాడు. అతనినే అర్చిస్తూంది ఊరు. వాడు చెప్పిన మాట నమ్మి వీరభద్రాన్ని దూషిస్తూంది? వీరభద్రం తనకేమి అవుతాడు? ఏమీకాడు. ఎందుకు కాడు? తనప్రాణం రక్షించాడు. పుట్టబోయే తన బిడ్డను కాపాడాడు. అతడు దేవుడు. తండ్రి, దాత. వెంటనే మరొక ఆలోచన వచ్చింది. అప్పటికి వీరభద్రం రాకుండా వుంటే ఏమయ్యేది? తాను బావిలోపడి ఉండేది. ఇప్పటికి తనను తగలేసి ఉండేవారు. తనకి బాధలు ఉండేవి కావు. చావాల్సింది. అయినా జనం ఏమనుకునేవాళ్ళు? కడుపు చేసుకుని చచ్చిందనేవాళ్ళు. మళ్ళీ వీరభద్రం మీదనే అభాండం వేసేవాళ్ళేమో! అవును. అంతే జరిగేదేమో! అన్నిటికీ వీరభద్రమే దొరికాడా? అందుకు అతడు చేసిన తప్పేమి? ఎందుకు అతడు అన్నిటికీ గురి అవుతున్నాడు? మంచివాడు కావడమే తప్పా? మనసున్నవాడు బ్రతకడం తప్పా? ఇతరులను చూసి బాధపడేవాడు ఉండడం తప్పా? ఏమిటిది? ఇందుకు కారణం? పరిష్కారం? ఆమె ఆలోచనలకు అంతులేదు. ఆ ప్రశ్నలు ఆకాశంలా అలముకున్నాయి. సమాధానానికి ఎక్కడా అవకాశం లేకుండా అయింది. దాంతో మళ్ళీ తన పాపను గురించి తనను గురించీ చిలవలు పలవలుగా ఆలోచనలు ముసిరాయి. వాటికి ఒక అంతులేదు. పొంతులేదు.

.. ఆ విషయం తెలుసు వీరభద్రానికి. ఆమె ఆలోచనల్లో దూరడానికి వాటికి ఒక సమాధానం చెప్పడానికి ఆలోచిస్తున్నాడు. ఆలోచనలు అనంతంగా వస్తున్నాయి. మబ్బుల్లా తేలిపోతున్నాయి. మరుక్షణానికి తానేమాలోచించాడో గుర్తుండడం లేదు. సమాజం ఎంతలో మారిపోయింది. శతాబ్దాలుగా అణగి "దొరా బాంచన్" అన్న సమాజంలోంచే ఒక చిచ్చు పుట్టింది. ఒక వుద్యమం రగిలి రగిలి మహోద్యమం అయింది. జనం దోపిడీని గ్రహించారు. దోచుకునే వాళ్ళ మీద ఉప్పెనలా పడ్డారు. దొరలు ప్రాణాలు అరచేతపట్టుకొని పారిపోయారు. ఒక చైతన్యం పొంగింది. దాన్ని ఎదిరించినవాడు చచ్చి ఊరుకున్నాడు. ఏమైందా చైతన్యం?

ఏమైందా ఉద్రేకం? ఏమైందా వెల్లువ? కాలచక్రం వెనక్కు తిరిగిందా లేక ఎదుటనే గోతులుండెనా? జనం మళ్ళీ దోపిడీకి లొంగారు. దొరనుకాక రాముణ్ణి మరొక దొరను చేశారు. వాడు తనమీద అభాండం వేశాడు. జనాన్ని నమ్మేటట్లు చేశాడు. నమ్ముతున్నారా జనం? తన శీలాన్నే శంకిస్తున్నారా? తనను ఎన్నుకున్న జనమేనా ఇది ? తనను దుష్టునికింద లెక్క కట్టిందా? ఇప్పుడు తాను ఎవరిని నమ్మాలి? తాను నమ్మింది జనాన్ని. ప్రజను. వారే తనకు దిక్కు అనుకున్నాడు. సర్వం త్యాగం చేశాడు. వారే తనను నమ్మటంలేదు. వారు సరే అసలు మంగమ్మ! అతనికో చిరునవ్వు వచ్చింది. సమాజాన్ని, సంఘాన్ని గురించి ఆలోచించే తాను ఒక్క వ్యక్తిని గురించి ఆలోచిం చాల్సి వచ్చింది. తనను గురించి తాను ఆలోచించాల్సి వచ్చింది. ఎంత పతనం ! అయినా ఏం చేస్తాడు ? కాని ఎలా ? ఇంత దాకావచ్చి వదులు కుంటాడా? ఇప్పుడు మంగమ్మను వదిలివేయటం సాధ్యమా? మంగమ్మ చనిపోతేనే బావుండేది అనే ఆలోచన వచ్చింది లిప్తపాటు. తాను ఎంత నీరసించిపోయాడు అనుకున్నాడు. ఒక్క సంఘటనను ఎదుర్కోలేని వాడైపోయాడు. ఇంతకూ ఏం చేయాలిప్పుడు? మంగమ్మ ఏం కావాలి? తానేం కావాలి? మనసులో ముళ్ళపొదలు మొలిచాయి. గుండె రక్తం వరదలై పారింది. అందులో తడబడ్డాడు. సతమతం అయినాడు. నీరసించాడు. ఎక్కడో వేగుచుక్క వెలిగింది. వీరభద్రం మనసులో వెలుగు రేఖ గోచరించింది. మంగమ్మను పెండ్లి చేసుకుంటే? తాను పెండ్లి. తాను పెండ్లి. మంగమ్మకు పెండ్లి. మంగమ్మను పెండ్లి ఒక నిశ్చయానికి వచ్చేశాడు. పరిష్కారం లభించేవరకు తేలిక అయినాడు. ఏదో ఉత్సాహం పొంగింది. అమాం తంగా లేచి "మంగమ్మా!" అని పరిగెత్తాడు.

మంగమ్మ దిగ్గున లేచి కూర్చుంది.

మంచం పక్కన నుంచున్న వీరభద్రం "మంగమ్మా! నిన్ను నేను పెండ్లి చేసుకుంట" అన్నాడు.

మంగమ్మ కళ్ళప్పగించి చూచింది. ఆమెలో ఉప్పెనలు లేచాయి. తుపానులు చెలరేగాయి. జడి వానలు కురిశాయి. పెనుగాలులు వీచాయి. ఆమె ఉక్కిరి బిక్కిరి అయింది. ఉబ్బి తబ్బిబ్బైంది. గొంతులోంచి ఒక్కమాట పెగల్లేదు. కన్నీటి చుక్కలు రెండు రాలేయి.

నిర్విణ్ణుడై చూచాడు వీరభద్రం. కన్నీటికి అర్థం గ్రహించలేక పోయాడు. నిశ్చేష్టుడై నుంచున్నాడు.

ఒకరి ముందు ఒకరు. రెండు ప్రాణాలు. అయినా నిశ్శబ్దం. నిశ్శబ్దం. నిశ్శబ్దం. గుండెల చప్పుడు.

"అన్నయ్యా నువ్వు దేవతవు." అని కాళ్ళమీదపడి పెద్దగా ఏడ్చేసింది మంగమ్మ.

వీరభద్రానికి ఆగలేదు. గుండె చెరువైంది. కళ్ళు చెమ్మగిల్లాయి. రెండు బాష్పబిందువులు మంగమ్మ వీపుమీద రాలాయి.

మంగమ్మ తలెత్తి చూచింది.

రెండు బుజాలు పట్టుకొని అమాంతంగా లేవనెత్తాడు వీరభద్రం. ''మంగమ్మా! అప్పటికి నువ్వు నాకు చెల్లెలువే నీకు నేను అన్ననే. రాక్షసుణ్ణికాను. రాముణ్ణికాను. మన పెండ్లి ఖాయం. వేరే గత్యంతరం లేదు. నన్ను అపార్థం చేసుకోకు" అని మంగమ్మను మంచంలోకి నెట్టి చర చరా బయటికి వచ్చేశాడు.

మంగమ్మ నిర్విణ్ణురాలై చూస్తూ ఉండిపోయింది.

తెల్లవారింది.

తెల్లవారడం ప్రకృతి ధర్మం. అంతటితో అందరికీ తెల్లవారుతుందని చెప్పలేం. బయట చీకట్లను సూర్యుడేకాదు ఒక్క దీపం చీల్చి చెండాడగలదు. లోపల చీకట్ల బ్రహ్మ సహితం పారదోలలేడు. కొందరు కావాలని చీకట్లు పెంచుకుంటారు. చీకట్లు లేకుంటే వారు బతకలేరు. చీకట్లు వ్యాపింపజేయడం వారి వృత్తి. ఆ వృత్తి మీదనే ఉన్నారు నిన్నటినుంచి శేషయ్యా, యాదగిరి. తెల్లవారడంతో పేకాట నుంచి బయటపడ్డ శేషయ్యకు మల్లయ్య కనిపించాడు.

"మంచి లీడర్ దొరికిండయా, తిన్నింటి వాసాలు లెక్కపెట్టేటోడు" అంటించాడు శేషయ్య.

"ముండసొమ్ము తిని మందికొంపలు ముంచుతాండుకదా" మల్లయ్య వెటకారంగా అన్నాడు.

"అవు. చెల్లెలు, చెల్లెలనుకుంటనే కడుపు దింపిండు."

మండిపోయాడు మల్లయ్య. "చేసింది రామయ్య, మల్ల మా అయ్యమీద నూకిండు. ధరమ ముండాలయ్యా పై సుండగనే సరిపోయినాది!"

"అరే మల్లయ్య. ఏందిర మాట్లాడుతున్నవు? బద్రయ్యే చేసిండని లోకం కోడై కూస్తాంది. నువ్వేమొ ఎనకేసుకొస్తవేమిర?"

"అస్స. ఊరుకోవె, ఇన్ని సారనీలు పోస్తె అందరంటరు."

"అయితే తాగుడు పోయించి అనిపిస్తాన్నమంటవు?"

"నేననెడిదేందుండి. ఊరంతా ఉడుకుతాంది."

"ఏమని ఉడుకుతాందిబే"

"రామయ్య తప్పు చేసి బద్రయ్యమీద నూకుతాండని"

"ఆ మాటంటే మూతిపళ్ళు ఇరక్కొడ్త. ఏమనుకున్నవో గాడ్దికొడక. ఎవడ్రా అన్నది. ఒక్కణ్ణి పిల్చకరా నా ముంగలికి తోళ్ళొలుస్త లంజకొడుకుల్ని" అని మీదికి ఉరికాడు శేషయ్య.

శేషయ్య మీదికి రావడం చూచి ఒక్క తోపు తోసాడు మల్లయ్య.

అమాతంగా కిందకిపడిపోయాడు శేషయ్య. అయినా లేచి మల్లయ్య మీదపడి బాదుతుండగా మస్తాన్ వచ్చి శేషయ్యను నాలుగు అంటించుకున్నాడు. శేషయ్య వళ్ళంతా హూనం అయింది. జవచచ్చింది. చేతకాలేదు. పెద్దగా ఏడ్చాడు. ఎక్కణ్నుంచి పరిగెత్తి వచ్చాడో యాదగిరి, మరికొందరు వచ్చి మల్లయ్యమీదా, మస్తాన్ మీద పడ్డారు. చితకబాది బజార్లో పడేసి వెళ్ళిపోయారు. కీళ్ళు కదిలి పోయాయి ఇద్దరివీ. అయినా ఒకరిని పట్టుకొని ఒకరు లేచారు. వీరభద్రం దగ్గరికి నడిచారు.

వీరభద్రం వారిని చూచాడు.

ప్రాణాలు పైపైనే ఎగిరిపోయాయి.

నిశ్చేతనుడైనాడు.

లిప్తపాటు నోటమాట రాలేదు.

వచ్చిన మొదటిమాట "ఏందీ ఘోరం? ఎవరు చేసిను?" చేతనుండైంతర వాత చేసిన మొదటి పని వారిని తీసికెళ్ళి మంచంలో కూర్చోపెట్టడం.

"కావరం ఎక్కిందుండి. కావరం" అని మస్తాన్ అనగా "మదముండి మదం పైస మదం" అన్నాడు మల్లయ్య.

మంగమ్మ పరిగెత్తి వచ్చి చూచింది. కెవ్వున కేకపెట్టింది. అంతే, నుంచుండి పోయింది.

"అరుస్తవేమిర? ఇది చెయ్యబట్టే అయిందిదంతా. బండ కట్టుకుని బాయిల పడక పోయినావు? బతికి ఎందుకు ఇంతమందిని ఏడిపిస్తవ్?" మల్లయ్య బడబడా వాగేశాడు.

మంగమ్మ కుప్పకూలిపోయింది. నేలకు తల కొట్టుకొని ఏడవసాగింది. వీరభద్రం వారిని వదిలి మంగమ్మను పట్టుకునే వరకే నొసలు చిట్లి రక్తం కార సాగింది.

రక్తంచూసి వీరభద్రం రక్తం సలసల కాగింది. "ఏంది మల్లన్నా ఎట్లబడితె అట్లంటవ్ ? ఇందుల మంగమ్మదేం తప్పున్నది. బొందలపడ్డ వానిమీద రాళ్ళెయ్యటం మనకు అలవాటా?" కాస్త గట్టిగానే అన్నాడు.

"మీ అండ చూసుకొనే అదిట్ల ఎగురుతాంది." మస్తాన్ అన్నాడు. యిద్దరికి మంగమ్మమీద గొంతువరకు వచ్చింది. తప్పేం ? ఆవిడ మూలాన్నే వాళ్ళవళ్ళు హూనం అయింది.

మంగమ్మ ఏడుపుమాని కళ్ళప్పగించి చూడసాగింది.

ఆమె గుండె ఏడ్వసాగింది.

"జగ్గయ్య గుర్తున్నాడా?" అడిగాడు వీరభద్రం.

ఆ పదం ఏదో గారడి చేసింది అందరి మీదా.

అంతా మౌనంగా ఏదో స్మృతులను కెలుకుతున్నారు.

"జగ్గయ్య సమాధికట్టి పూజలు చేస్తున్నాం, జగ్గయ్య పెళ్ళాన్ని పట్టుకొని తిడ్తున్నం" బొంగురుబోయిన గొంతుతో అన్నాడు వీరభద్రం. ప్రతి పదంలోనూ వేదన వుంది. స్వరంలో వేదన నిండివుంది.

దెబ్బలు తిన్న వారిద్దరూ దెబ్బలు మరిచారు. ఏదో పూర్వ లోకంలోకి వెళ్ళిపోయారు. వారి ముఖాల్లో అపూర్వ వేదన కనిపించింది.

ఒకప్పుడు పదాలు గారడీ చేస్తాయి.

తాము ఏదో తప్పుచేసినట్లు చూశారు మంగమ్మను.

"నేను మంగమ్మను పెండ్లి చేసుకుంటున్నా" స్థిర నిశ్చయంతో అన్నాడు వీరభద్రం.

మల్లయ్య, మస్తాన్‌ల మీద కొరడాదెబ్బ పడ్డట్లయింది.

"ఏమంటున్నరు?" ఏకంగా అడిగారిద్దరూ.

మళ్ళీ అదేమాట చెప్పాడు వీరభద్రం.

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు మస్తాన్, మల్లయ్య.

"అయితే రామయ్య చెప్పింది నిజం చెయ్యాలనుకుంటున్నారా?"

"కాదు. మంగమ్మను కాపాడాలనుకుంటున్న. జగ్గయ్య రుణం తీర్చుకోవాలనుకుంటున్న."

"ఏందిదంతా?" గర్జించి అడిగాడు మస్తాన్ మంగమ్మను.

మంగమ్మ కన్నీరు జలజల రాల్చింది. అక్కణ్ణుంచి లేచిపోయి మంచంలో పడి కుమిలి కుమిలి ఏడ్వసాగింది.

"ఏం చేస్తున్నారో నాకైతే ఇష్టంలేదుండి" అనేశాడు మల్లయ్య.

బెరుకు బెరుకుగా చూశాడు మస్తాన్. మాట్లాడలేదు. కొరకొర చూశాడు మల్లయ్య. మస్తాను చూపు దించుకున్నాడు.

ఈ సంగతేందో తేల్చుకోవాలె. మరీ మితిమీరి పోతున్నరు. అన్నదానికి వంతపాడకుంటే చావగొడ్తరా? అసలు ఊళ్ళ ఉండాల్నావద్దా? పదుండి పోదం దవాఖానాకు, పోలీసుకు రిపోర్టిచ్చి ఈ విషయం ఏదో తేల్చుకుందాం? వీరభద్రం విషయం మార్చాడు.

"చూద్దాం లేరి యిప్పుడు పోలీసుల్లి ఏం పడ్తం" అని మస్తాన్ అనగా "వాళ్ళు కూడా రామయ్య మనుషలేనాయె." అన్నాడు మల్లయ్య.

వీరభద్రం చూస్తుండగానే ఇద్దరూ నిర్గమించారు.

వీరభద్రం విలవిలలాడాడు.

అతనిలోని రెండు ప్రాణాలు విడిపోతున్నట్లనిపించింది.

గుమ్మం పట్టుకొని చూపందినంతవరకు చూశారు.

"వారు వెళ్ళిపోయారు. అవును వెళ్ళిపోయారు." అనుకుని వచ్చి మంచంలో కూలబడ్డాడు.

*  *  *

కాలం విచిత్రమైంది. కానివారిని కలుపుతుంది. అయిన వారిని విడగొడ్తుంది. ఒకరిని కరుస్తుంది. ఒకరిని బెదిరిస్తుంది. ఒకరిని విరుస్తుంది. ఒకరిని పెంచుతుంది. ఒకరిని వంచుతుంది. ఒకణ్ణి మురిపిస్తుంది. ఒకణ్ణి మరిపిస్తుంది. మరిపించడం కాలపు ప్రధాన స్వభావంలా కనిపిస్తుంది. అది దేన్నైనా మరిపించగలదు. ఘోరాతి ఘోరాన్ని మరిపించ గలదు. ఉత్తమోత్తములను మరిపించగలదు. మహా పురుషులను మరిపించ గలదు. దానికి మంగమ్మ వృత్తాంతం ఒక లెక్కా? ఎక్కడో కాలంలో కలిసి, వెలిసి పోయిందా కథ. అది జరిగిందన్నది కూడా మరిచిపోయినట్లుంది ఊరు. కాల ప్రవాహానికి అది కరిగిపోతోంది. అరిగిపోతోంది. ఆ రాత్రి మంగమ్మకు అవస్థ వచ్చి వుండకపోతే ఆమెను మరచిపోతోంది జనం.

అర్థరాత్రి ఆమెకు బాధ మొదలైంది. అదృష్టవశాన వీరభద్రం ఉన్నాడు. మంత్రసాని దగ్గరికి ఉరికాడు. ముదివగ్గు ఆవూరి మంత్రసాని. ఆమెచేయి చల్లనిదని అందరికీ నమ్మకం. రానైతేవచ్చింది. కాని ఆమెకు ఏమీ అర్థంకాలేదు. ఏదో పీడ పట్టుకుంది అన్నది. జగ్గయ్యే దయ్యం అయి పట్టాడన్నది. కోరికలు తీరకుండా చచ్చినవారు పరిసరాల్ను విడిచి పోరన్నది. బలి యివ్వాలంది. వేపమండలు కట్టాలంది. సాంబ్రాణి పొగవేసింది. ముడుపు కట్టింది. చేతులు వెల్లకింతలేసి బయట వచ్చి కూర్చుంది. భగవంతుడే రక్షించాలంది. చిన్నప్రాణం పోయినా పెద్దప్రాణం దక్కితే అదృష్టం అంది. ఆకాశంవైపు చూసి ఒక దండం పెట్టింది. అన్నీ అతనికే అర్పించింది. తలపట్టుకుని కూర్చుంది.

మంగమ్మ బతికి బట్టకడుతుందని ఎవరూ అనుకోలేదు. అదీ మంచిదే నను కున్నారు చాల మంది. పాపం కలకాలం దాగదు, కట్టికుడుపుతుంది అన్నారు వృద్ధులు. మల్లయ్యకూ, మస్తాన్‌కూ ఎందుకో సంతోషం అయింది. మంగమ్మ ఏమనుకుందో మనం చెప్పలేం కాని, వీరభద్రం విలవిల్లాడాడు. ప్రాణాలు కాపాడ డానికి పల్లెలో అవకాశాలు తక్కువ. ప్రాణాలు తీయడానికి వీటిని మించినవి లేవు. మంగమ్మను పట్నం తీసుకెళ్ళడానికి నిశ్చయించాడు. బండి కట్టించాడు. కటికచీకట్లో బండి సాగింది. మంగమ్మ మళ్ళీ రాదని నిశ్చయించుకుంది జనం. తండోప తండాలుగా బండివెంట సాగింది. ఊరుదాటేవరకు పదిమంది మిగిలారు. వాగు దగ్గరకు చేరేవరకు ముందు లాంతరు పట్టుకొని నడిచే మస్తాను, వెనుక వీరభద్రంతో నడిచే మల్లయ్యా, బండిమనిషి మాత్రం మిగిలారు.

చీకటి, కీచురాళ్ళ రొద, అప్పుడప్పుడూ గుడ్లగూబ అరుపులు. బండి సాగి పోతూంది. మువ్వల చప్పుడు వినా ధ్వనిలేదు. అంతా మౌనంగా సాగిపోతున్నారు. వీరభద్రం గుండె దడదడ లాడుతున్నది. అసలు ప్రాణంతో ఉందా మంగమ్మ?

ఇది శవయాత్ర కాదుగదా! పలకరించాలని అనేక సార్లు అనుకున్నాడు. పలకదేమో నని భయం. ఆ తేలేదేదో తరవాతనే తేలనివ్వు అనుకున్నాడు. అయినా దగ్గిరికి వెళ్ళి పిలిచాడు. పలుకులేదు. గుండె గుభేలుమంది. బండి ఆగింది. ఉన్న నలుగురూ కూడారు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. ఏడుపు గొంతు దాకా వచ్చేసింది. గట్టిగా కేకవేశాడు.

మూలుగు వినిపించింది.

ఒక్క ఉల్క రాలింది.

వీరభద్రంలో వెలుగురేఖ వెలిగింది. మళ్ళీ పిలిచాడు. మూలుగు కాస్త గట్టిగా వినిపించింది.

"బండి సాగనీ" అన్నాడు. బండి సాగింది. ముందు లాంతర్‌తో మస్తాన్, వెనక వీరభద్రం, మల్లయ్య. బండి సాగింది.

బండి రైలు స్టేషనుకు చేరింది.

రైలెక్కించి బండి మళ్ళిపోయింది. మస్తాన్, మల్లయ్య అందులోనే తిరిగి వెళ్ళారు.

ఆస్పత్రిలో చేర్చేవరకు మంగమ్మ పరిస్థితి విషమంగానే ఉంది. అయితే ఎమ్మెల్లేగారి భార్యగా చికిత్స సత్వరంగా లభించింది. టెలిఫోన్లు మ్రోగాయి. డాక్టర్లు, స్పెషలిస్టులు వచ్చారు. రక్తం వచ్చింది. ఎక్కించారు. ఆస్పత్రిలో హడావుడి అంతకంతకూ ఎక్కువ అవుతూంది.

"డెలివరీకి ఇంకా సమయం ఉంది" అని వీరభద్రానికి చెప్పి వెళ్ళిపోయింది నర్సు.

వీరభద్రం సిగరెట్లుమీద సిగరెట్లు కాలుస్తున్నాడు. పేషెంటును స్పెషల్ వార్డులోకి చేర్చామని కబురువిని అక్కడికి వెళ్ళాడు.

మంగమ్మకు స్పృహలేదు. పడి ఉంది.

పక్కనే స్టూలుమీద కూర్చున్నాడు. వెంట్రుకలు ముఖంమీదినుంచి తొలగించాడు. ఆమె ఊపిరి పీలుస్తుంటే చూస్తూకూర్చున్నాడు.

"ఇంక భయంలేదండి. సరిగ్గా సమయానికి చేర్చారు. రక్తం అందుబాటులో ఉండడం అదృష్టం. పాపం ఎంత రక్తం పోగొట్టుకుంది; చిన్న ఆపరేషను, అంతే బ్లీడింగ్ కట్టిపోయింది. ఇంక భయం లేదు లెండి. పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అది మేం చూసుకుంటాంలెండి" అని వచ్చి లేడీడాక్టరు కూర్చుంది.

"థాంక్సండి. మీకు చాల శ్రమ కలిగించిన" అన్నాడు వీరభద్రం.

"అదేమిటండి. అది మా డ్యూటీ" అంటుండగానే కాఫీ వచ్చింది.

"మీరు చాల అలసిపోయారు. కాస్త కాఫీ తీసుకోండి" అని అందించిన లేడీ డాక్టరు రాజకీయాలను చర్చించసాగింది. తనకు రావలసిన ప్రమోషను గురించి,

అఘ్నుతగులుతున్న వారి గురించి, తన సిన్సియారిటీని గురించి సుదీర్ఘంగా మాట్లాడి, మంత్రిగారితో ఒక్కమాట చెప్పవలసిందని వీరభద్రాన్ని కోరింది.

వీరభద్రం జవాబు చెప్పకముందే మంగమ్మ కళ్ళు తెరిచి, అటూ ఇటూ చూడ్డం గమనించాడు. వెంటనే ఆమె ముఖం ముందుకు వంగి "ఏం కావాలె?" అని అడిగాడు.

మంగమ్మ రెండు పక్కలూ తడివి చూసుకుంది. ఆమె చేతులకు ఏమీ అంద లేదు. నిరాశగా అడిగింది.

"పాప ఏడీ" కళ్ళల్లో నీరు చేరింది. "పోయిందా?" అన్నది. స్వరం నీర సంగా ఉంది. దుఃఖం పొంగివస్తున్నది.

"ఇంకా కాన్పు కాలేదమ్మా. పాప ఎలా వస్తాడు? పాప క్షేమంగా ఉన్నాడు కడుపులో" ఊరడింపుగా చెప్పింది లేడీడాక్టరు తల నిమురుతూ.

మంగమ్మ పొట్టచూసుకుంది.

చిరునవ్వు నవ్వింది.

"ధైర్యంగ ఉండాలె" వీరభద్రం స్థిరత్వంతో అన్నాడు.

డాక్టర్ను ఎవరో పిలవడంతో వెళ్ళిపోయింది.

మంగమ్మ కోలుకుంటున్నది. నీరసం తగ్గింది. కొద్దిగా బలం పుంజుకుం టూంది. వాతావరణం బాగుంది. మనసుకు వ్యధలు లేవు. ఎమ్మెల్లే భార్యగా మాత్రమే ఆమె పరిచయం అందరికి. మంగమ్మ ఆమె పూర్వ చరిత్ర అక్కడ ఎవ రికీ అవసరం లేదు. మనసుతో మందులకు దగ్గిర సంబంధం. మందులు బాగా పని చేస్తున్నాయి. పుష్టికరమైన ఆహారం లభిస్తూంది. పరిచర్యలు బాగా జరుగుతు న్నాయి. కానుపు దాకా ఇక్కడే ఉంచమంది డాక్టరు. అన్నట్లు చెప్పడం మరచాను లేడీ డాక్టరుకు నిలిచిపోయిన ప్రమోషను వచ్చింది. ఆమెను ఆ ఆసుపత్రికే పోస్టు చేశారు. అందుకే ఆ కేసు విషయంలో అంత శ్రద్ధ తీసుకుంటున్నదామె. డాక్టరు మాటకు అభ్యంతరం చెప్పలేదు వీరభద్రం. ఇంతకంటే భద్రమైనచోటు లేదనుకు న్నాడతను.

తీరిక ఉన్నప్పుడల్లా వచ్చిపోతున్నాడు వీరభద్రం. ఆ నాటి సాయంకాలం పళ్ళు అవీ తీసుకుని వెళ్తున్నారు—జనరల్ వార్డులోంచి అతడు అలా చూస్తూ పోతు న్నాడు రోగుల్ను. మంచంలో పడివున్న ఒక రోగిని చూశాడు. పరిచయం ఉన్న మనిషిలా కనిపించింది. అయినా నాలుగడుగులు వేశాడు. మళ్ళీ వెనక్కు వచ్చాడు. మంచం దగ్గరికెళ్ళి పరీక్షగా చూశాడు.

విమలమ్మ!

విమలమ్మ దొరసాని! !

వరవరరావు భార్య !!!

"ఎంత మారిపోయింది?"

"ఎందుకు వచ్చిందిక్కడికి?" తనను తానే ప్రశ్నించుకున్నాడు వీరభద్రం. అసలు ఆమేనా? ఆ పోలికలున్న మరో మనిషా? ఏవో అనుమానాలు, ఆలోచనలు గిరగిరా తిరిగాయి మెదడులో.

ఆమె నిద్రలో ఉంది.

మళ్ళీ వచ్చేప్పుడు చూతాం అని బయలుదేరి వెళ్తున్నాడు. నర్సు కనిపించి ఒక చిరునవ్వునవ్వి నమస్కరించింది. ప్రతినమస్కారంచేసి అడిగాడు.

"ఎవరు?"

"బెడ్ నెం. తర్టీనా?"

"అవును"

"చూసి చెపుతా" అని కేస్ షీట్ తెచ్చి చూసింది. విమలమ్మే వరవరరావు భార్యే!

"ఏమిటి జబ్బు!"

"చాలా ఉన్నాయ్. ముఖ్యంగా హార్ట్ – మీకేమైనా బంధువా!"

"కాదు. నిద్ర పోతూందా?"

"పెతిడిన్ ఇచ్చాం. మెళకువ వస్తే భరించలేదు. అందుకు"

"కాస్త జాగ్రత్తగా చూస్తారా ప్లీజ్. ఆమెది మా ఊరు. ఒకప్పుడు బాగా ఉన్న వాళ్ళు"

"మంచిదండీ, నమస్కారం" అని నర్స్ వెళ్ళిపోయింది.

ఆ ఆలోచనతోనే మంగమ్మ గదిలోనికి వెళ్ళాడు. ఆ విషయమే వారూ చర్చించారు. ఆవిడ భూములన్నీ చేసుకుంటున్నాడు. కరణీకం సైతం చేతబట్టాడు రాముడు. ఆమెకేమీ ఇవ్వడంలేదా? లేక అకస్మాత్తుగా యిలా జరిగిందా ? అనే సంగతులు చర్చించుకున్నారు. ఎందుకో అగాధమైన సానుభూతి ఏర్పడింది ఇద్దరికీ ఆవిడ విషయంలో.

తిరిగి వెళ్ళేప్పుడు విమలమ్మ మంచందగ్గరకు వెళ్ళాడు వీరభద్రం. స్టూలు మీద మంచంప్రక్కన కూర్చున్నాడు. విమలమ్మ మెళకువగానే ఉన్నట్లుంది. స్టూలు లాగిన చప్పుడువిని పక్కకు చూచింది.

మనిషి కూర్చున్నాడు.

ఎవరు?

బాగా చూచింది. గుర్తుపట్టలేక పోయింది.

"ఎవరు నాయనా?"

"విమలమ్మగారూ! నేను – నన్ను గుర్తుపట్టలేదా?"

"నాయనా చూపు తగ్గింది కనపడదు. మాట ఎక్కణ్ణో విన్నట్లున్నది. పేరేమిటి నాయనా?"

వీరభద్రానికి దుఃఖం క్రమంగా మంచులా ఆవరిస్తూంది.

"నేను వీరభద్రాన్ని. మన ఊరే. గుర్తు పట్టిన్రా?"

"ఎవరు వీరభద్రమా. నువ్వానాయనా ? ఎన్నాండ్లకు కండ్లబడ్డివి ! ఏది నాయనా నీ చెయ్యి యిటియ్యి" చేయి అందుకొని తనచేత్తో రాస్తూ "బాగున్నావా? ఊరు బాగున్నదా? ఇగో ఇట్లయింది. నా గతి" గొంతు పూడుకపోయింది. మాటల్లో సైతం తడి కనిపించింది. కను కొలకుల్లో నీళ్ళు నిండాయి. "అంతా రాత నాయనా! పెండ్లి చేసుకున్నావా? పిల్లలెందరు?"

వీరభద్రం గుండె కలుక్కుమంది.

"ఏమైంది దొర్సానీ?"

"ఇంకెక్కడి దొర్సాని. పిట్ల దొర్సాని. దొరల్లేకుండ చేసిన్రుకద నాయనా! నువ్వే నయమనిపించినవ్ వీరభద్రం – ఎందరిని చంపినా నీ కోసం చంపలేదు. ఆస్తులు, భూములు అందరికి కావలెనన్నవు. మంచివానివి వీరభద్రం మంచివానివి. వాకు నచ్చినవ్. వాడున్నడు చూడు–ఆ రాముడు–కొత్తదొర............"

గుండెనొప్పి వచ్చింది విమలమ్మకు.

విలవిలలాడింది.

వీరభద్రం పరిగెత్తాడు డాక్టరు దగ్గరికి.

డాక్టరు లేడు.

గది తలుపులు వేసివున్నాయి.

దబదబ బాదాడు.

గట్టిగా అరిచాడు.

డాక్టరు బొత్తాములు పెట్టుకుంటూ తలుపు తీశాడు.

లోపల ఒక నర్సు మూలకి నక్కివుంది. అలా ఒకసారి లోపలకుచూచి డాక్టరును చూశాడు వీరభద్రం. గ్రహించాడు. అయినా మాట్లాడలేదు.

ఇది ధర్మాసుపత్రి!

"బెడ్ నెంబర్ తర్టీన్ సీరియస్" అన్నాడు వీరభద్రం.

"జెస్టు యే మినిట్" అని వాష్‌బేసిన్ దగ్గరికి వెళ్ళాడు డాక్టరు.

సూది గుచ్చాడు డాక్టరు విమలమ్మకు. నిముషాల్లో ఆమెకు మంచులా మత్తురా వాసాగింది. పలవరిస్తున్నట్లు "వీరభద్రం ఇక్కడనే ఉండు. దిక్కులేని...." నిద్ర లోకి పోయింది.

డాక్టరు తల వంచుకొని వెళ్ళిపోయాడు.

కాసేపు చూస్తూ కూర్చున్నాడు వీరభద్రం. అలా ఆమెను చూస్తుంటే ఎన్నెన్నో ఆలోచనలు ముసిరాయి. ఎంత బాగా మాట్లాడింది. దొరలు పోయారు. నిజమే. కొత్తదొర రామయ్య! కొత్తదొరలు ! కొత్తదొరలు !! రామయ్యలు! ఆ మాటలే గిరగిరా తిరిగాయి. అవి తననే వెక్కిరిస్తున్నట్లనిపించాయి. ఏవేవో ఆలోచ

నల చీకట్లు ముసురుతున్నాయి. మధనపడ్డాడు. అన్నీ ప్రశ్నలే. ఒక్కదానికి సమాధానం రాలేదు. అలిసి పోయాడు. సొలసిపోయాడు. విమలమ్మకు రగ్గుకప్పి కాళ్ళు సరిగా సర్దాడు. లేచాడు. మంగమ్మ గదికి వెళ్ళాడు. మంగమ్మను తీసుకొనివచ్చి చూపించాడు.

"ఈమె విమలమ్మ దొర్సానా!" ఆశ్చర్యంగా అడిగింది మంగమ్మ.

"అవును. తెలుసుకొన్నా. నువ్వు ఆలోచించకు ఆరోగ్యం చెడుతుంది పద" అని గదిలో వదిలి వెళ్ళిపోయాడు వీరభద్రం.

ఆ రాత్రి వీరభద్రానికి నిద్రపట్టలేదు. విమలమ్మ అన్న మాటలు మననం చేసుకున్నాడు. మధనపడ్డాడు. దొరలు పోయారు. కొత్త దొరలు వచ్చారు." అనేది తలచుకొని "దొరలు పోలేదు. కొత్త దొరలు వచ్చారు." అనుకుంటే బాగుంటుం డనుకున్నాడు. ఈ కొత్తదొరలు అసలు దొరలు కంటె ప్రమాదకరంగా పరిణమించారు అనుకున్నాడు. తెల్లవారి శాసనసభలో ఆ విషయమే మాట్లాడాడు.

"కొత్తదొరలు ఊరూరా వెలిశారు. సారాయి, గూండాలు వారి రాజకీయాలైనాయి. ఈ కొత్త దొరలకు నడమంత్రపు సిరి అబ్బింది. డబ్బుకోసం వారు తలలు తీయటానికి సైతం వెనుకాడటం లేదు. గుండెలు తీసిన బంట్లయినారు. ప్రభుత్వ యంత్రాంగం వారికి అన్నివిధాల సహకరిస్తూంది. అసలు ప్రభుత్వం చేస్తున్నది కొత్తదొరలా ? ఎన్నికైన శాసన సభ్యులా అనే విషయం అర్థం కాకుండా ఉంది. ప్రజలు విసిగిపోయారు. న్యాయం అనేది మందులోకి సైతం దొరకడంలేదు. ప్రభుత్వం ఇందు విషయంలో గట్టి చర్యలు తీసుకోకుంటే పరిస్థితులు విషమించే సూచనలున్నాయి."

శాసనసభ్యులు కొందరు హర్షధ్వానాలు చేశారు. కొందరు అభ్యంతరం తెలియజేస్తూ కేకలువేశారు. అసలు దీనిని శాసనసభ రికార్డునుంచి తొలగించా లన్నారు. "కొత్త దొరలు" అనే పదం పార్లమెంటరీ కాదన్నారు.

శాసనసభలో తర్జన భర్జనలు జరిగాయి. కొంత గొడవ కూడా జరిగింది. చివరకు ప్రభుత్వం "కొత్త దొరలు" అనే పదానికి నిర్వచనం సూచించ డానికిగాను ఒక కమిటీ వేయడానికి అంగీకరించింది. ప్రతిపక్షాలవారు అది తమ విజయంగా భావించి హర్షధ్వానాలు చేశారు. బల్లలు చరిచారు.

పత్రికలు ఆ సంఘటనకు ఎంతో ప్రాముఖ్యాన్నిచ్చాయి. వీరభద్రం ఫోటో సహితంగా అతని ఉపన్యాసాన్ని యధాతథంగా ప్రకటించాయి. ఊళ్ళో రామయ్య వీరభద్రం బొమ్మచూచి పత్రిక మడిచి దాచేశాడు. మల్లయ్య పత్రికపట్టుకొని ఊరం దరికి చదివి వినిపించాడు. మస్తాన్ చుట్టుపట్ల గ్రామాలకు వెళ్ళి అందులోని విషయాలు వివరించి చెప్పి అఖండ ప్రచారం చేశాడు.

వీరభద్రానికి శాసనసభలోనూ బయటా గౌరవ ప్రతిష్టలు పెరిగాయి. పత్రికలవారు ప్రశ్నల వర్షం కురిపించారు.

"కొత్తదారలు అనే పదానికి ముద్ర మీదేనా?" ఒకరు అడిగారు.

"ఆ పదానికి మీ నిర్వచన మేమి?" ఇంకొకరు ప్రశ్నించారు.

"కమిటీ వేయడంతో మీకు సంతృప్తి కలిగిందా?" మరొకరు పృచ్ఛచేశారు.

"పదాలు ప్రజలోంచీ, పరిస్థితుల్లోంచీ పుడ్తాయి. మన ప్రభువులు, నాయకులు ప్రజలకు దూరం అయినారు. వారికి ప్రజల భాష అర్థం కావడంలేదు. అది అర్థం చేసుకోడానికి కమిటీలు వేసే దశకు వచ్చాం మనం. సమస్యను బుట్టదాఖలు చేయటానికి కమిటీలు" అన్నాడు వీరభద్రం.

పత్రికలవాళ్ళు వీరభద్రం మాటలకు చిలవలు పలవలు కల్పించారు. కొన్ని పత్రికలు వ్యాఖ్యలు, కొన్ని కువ్యాఖ్యలు చేశాయి. కొన్ని సంపాదకీయాలే వచ్చాయి. మంగమ్మ చాలా సంతోషించింది.

డాక్టరు ఆవిడ విషయంలో మరింత శ్రద్ధ తీసుకో సాగింది.

వీరభద్రానికి అట్టే తీరడంలేదు. అతడు రోజూ ఆస్పత్రికి రాలేక పోతున్నాడు. అయినా అవకాశం ఉన్నప్పుడల్లా వచ్చి పోతూనే వున్నాడు. వచ్చినప్పుడల్లా విమలమ్మను చూస్తూనే వున్నాడు. కాని ఆమె స్పృహలో ఉండడంగాని మాట్లాడటంగాని జరగడంలేదు.

ఆ రోజు వీరభద్రం వెళ్ళేవరకు విమలమ్మ కాస్త తెలివిగా ఉంది. గుర్తించింది.

"రోజు నీ కోసం చూస్తూన్న వస్తవేమోనని?"

"అప్పుడప్పుడు వచ్చి పోతూనే ఉన్న. మీరు నిద్రలో ఉంటున్నారు"

"అవును నాయనా ఏకంగా నిద్రవస్తే బాగుండును. భూమిమీద యింకా గింజలు అయిపోలే. ఆ దేవునికి దయ రాలేదు" అని చేతులెత్తి కనిపించని భగవంతునికి నమస్కరించింది.

"అట్లనకండి. డాక్టరుతో మాట్లాడిన. బాగవుతుందన్నాడు."

"అంటరు" చిరునవ్వు నవ్వి అన్నది. "డాక్టర్లు అట్లనక ఎట్లంటరు ? బతికి చేసేదేమున్నది. దొరవారు నాకోసం ఎదురుచూస్తుంటరు అక్కడ. ఎంత తొందరగా పోతే అంత మంచిది."

"ఎంత ఇశ్వాసం! ఎంత నమ్మకం!!" అదీ ఎవడూ చూడనిదాన్ని గురించి అనుకున్నాడు వీరభద్రం. "సరేగాని రాముడు గింజా గిరిజా సరిగ్గా యిస్తున్నాడా?"

"అడుగకు నాయనా అడుగకు. ఆ పాపిష్టిపేరు ఎత్తకు. బుద్ధి గడ్డితిన్నది. వాడన్న వాటి కన్నిటికీ తల ఊపిన. ముంచిండు. ఏడాది రెండేడ్లు అంతో ఇంతో పంపించిండు. ఇంతలో నేను రోగానపడ్డ. మళ్ళ ముఖం చూపించలే. కరణీకం వాని చేతుల్నే ఉండె. అంగుష్టలేసి తన పేర చేసుకున్నడట. ఎవరో చెప్పంగ విన్న. ఎంతవరకు నిజమో ఆ భగవంతునికి తెలియాలె."

వీరభద్రం రక్తం సలసల కాగింది. అయినా ఆ సౌమ్యమూర్తి ముందు వ్యక్తం కానివ్వలేదు. "మీరు ఊఁ అంటే అన్నీ సాధించిపెడ్తా" అన్నాడు.

'ఏం సాధించను? ఎవరి కోసం సాధించను?'

'మీకు అంత వైరాగ్యం కలుగుతే పేదా, బిక్కికి పంచిపెట్టండి. తల్చుకుంటరు.'

'ఎవడు ఎవడికిస్తాడు నాయనా? భగవంతుడివ్వాలె. ఎవడి కర్మ వానిది. నా కర్మ ఇట్లా....'

మాట పూర్తిచేయలేక పోయింది. గుండె నొప్పి వచ్చింది. విలవిల్లాడింది. డాక్టరు వచ్చి ఇంజక్షన్ ఇచ్చాడు. మత్తులోనికి జారిపోతు పలవరిస్తున్నట్లు అన్నది.

'నాయనా! వీరభద్రం! నన్ను బూది చెయ్యి, వచ్చే జన్మలో నీ ఋణం తీర్చుకుంటా.'

కర్మసిద్ధాంతం మీద కోపం వచ్చింది వీరభద్రానికి. ఈ వెర్రే దేశాన్ని నాశనం చేసింది అనుకున్నాడు.

మంగమ్మకు ఆరోజు మళ్ళీ నొప్పులు వచ్చాయి - పోయాయి. మనిషి మహా నీరసం అయిపోయింది. మంచంలో పడి ఉంది. మత్తుగా ఉంది. ఆమె దగ్గర చాలా సేపు కూర్చున్నాడు వీరభద్రం. తరవాత డాక్టరునూ నర్సును కలుసుకొని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి వీరభద్రానికి నిద్రపట్టలేదు.

మంగమ్మ, విమలమ్మ ఇద్దరు చెరొకవైపు చేరారు. ఇద్దరూ అతన్ని సతమతం చేస్తున్నారు. పరిస్థితులు పెద్ద వలపన్ని తనను అందులోకి లాగుతున్నట్లనిపించింది. మమత మానవత తనను నీరసింపచేస్తున్నాయి. చేసిన వాడొకడు. చిక్కుకున్నది తాను! ఎందుకిలా జరుగుతూంది? ఎవరు దీనికి కారకులు? ఏమిటి మార్గం? ఏం చేయాలి తాను? ఈ ఆలోచనలే అతనిని సతమతం చేశాయి. మమత మానవతా మంచివి కావా? వదులు కోవాలా? పరులకోసం బాధ పడడంలో ఆనందం ఉంది. తనకోసం తాను ఏనాడూ జీవించడు అనుకున్నాడు. ఈ ఆలోచన తనకు కొత్తగా వచ్చిందనుకున్నాడు. ఏదో సంతృప్తి కలిగింది. అయినా వ్యధను అది అట్టే కాలం కప్పి ఉంచలేదు.

ఉదయం లేచి ఆస్పత్రికి పరిగెత్తాడు. ఏదో తరుముతున్నట్లనిపించింది. ఎవరో పిలుస్తున్నట్లనిపించింది. గుండె ఎందుకో కొంతసేపు దడదడలాడింది. గబగబా ఉరికాడు. ఆస్పత్రి మెట్లెక్కి జనరల్ వార్డులోంచి చరచరా సాగిపోతున్నాడు. విమలమ్మ మంచం కనిపించింది. చూచి వెళ్దామనుకున్నాడు. కప్పుతీసి ముఖంమీద చేయి వేశాడు.

చల్లగా ఉంది.

గుండె ఆగినంత పనైంది.

గొంతులోంచి మాట పెగల్లేదు.

కన్నీరు టపటప రాలింది.

నర్స్ పరుగెత్తుకొని వచ్చి అత్యంత ఉత్సాహంగా వార్త వినిపించింది.

"మంగమ్మగారు ప్రసవించారు. మగబిడ్డ. అభినందనలు" అన్న నర్సు అతన్ని చూసి నిశ్చేష్టంగా నుంచుండిపోయింది. ఆమె విషయం గ్రహించింది. విమలమ్మ ముఖంమీద గుడ్డ కప్పింది.

సంతోషించాలో, దుఃఖించాలో అర్థం కాలేదు వీరభద్రానికి. అయినా క్రుంగిన మనసుకు ఆలంబనం లభించినట్లయింది. మౌనంగా ఒక అడుగు ముందుకు వేశాడు. అడుగుల్లో మణుగుల బరువు చేరినట్లయింది. నర్సుకూడా మౌనంగా ముందుకు నడిచింది. రోగులంతా మంచాల ముందు నుంచొని మౌనంగా వారిని చూస్తున్నారు.

నిశ్శబ్దం.

ప్రశాంతంగా విగతాత్మ ఆకాశంలోకి ఎగిరిపోతున్నట్లుంది!

వీరభద్రం భారంగా నడుస్తున్నాడు. అతనికి వాష్‌బేసిన్ కనిపించింది. అద్దం చూచాడు. మూర్తీభవించిన దుఃఖంలా ఉన్నాడు తాను. ముఖం కడుక్కున్నాడు. తుడుచుకున్నాడు. కొంత ప్రసన్నత ముఖంలోకి తెచ్చుకున్నాడు. నడిచాడు. అడుగులు కొంత తేలికపడ్డాయి. చరచరా సాగిపోయాడు. నర్సును అందుకున్నాడు.

మంగమ్మ మంచంలో పడుకొని ఉంది. ముఖంలో ప్రసన్నత గోచరించింది. వీరభద్రాన్ని చూసింది. చిరునవ్వు నవ్వింది. 'మగపిల్లవాడు' అని తొట్టి చూపించింది.

"నీ కోరిక ఫలించింది, మగబిడ్డను కన్నావు."

"అంతా నీ దయ."

ఊయలలో పాపను చూశాడు. కళ్ళుమూసుకొని పడుకున్నాడు. ముద్దుగా ఉన్నాడు. వేలితో బుగ్గ తాకి ముద్దుపెట్టుకున్నాడు. పరిశీలనగా చూచాడు. పాప ముఖంలో రాముడు కనిపించాడు. రాముణ్ణీ, పాపనూ, పాపనూ, రాముణ్ణీ చూచాడు. ఏదో మనస్తాపం కలిగింది. వీడు మరొక రాముడు కాడుకదా అనుకున్నాడు. కాడు. కాకూడదు. కారాదు. వెంటనే విమలమ్మ ప్రత్యక్షం అయింది. శవం. ఏదో బుగులు చేరింది. పాపను చూచాడు. పాప! ఎంత ముద్దుగా ఉన్నాడు! మనసుకు గిలిగింతలు పెట్టినట్లయింది. అతనికి తెలియకుండానే పెదవులమీద చిరునవ్వు చిందులాడింది.

పుట్టుక ఆనందాన్ని కలిగిస్తుంది.

చావు దుఃఖాన్ని కలిగిస్తుంది.

వీటిలో ఏది నివార్యం అనుకున్నాడు.

విమలమ్మ చావు విషయం మంగమ్మకు చెప్ప దలచలేదు. దానంతట అదే తెలుస్తుందా-తెలవనీ అనుకున్నాడు. ఏదో అత్యవసరం అయిన పనివుందని బయలు దేరాడు.

శవయాత్రకు ఏర్పాట్లలో మునిగిపోయాడు.

సాయంకాలానికి ట్రక్కుమీద శవం స్మశాన వాటికకు చేరింది. చితికి చిచ్చు అంటించాడు వీరభద్రం. చిటపటమని అంటుకున్న చితి భగ్గున మండింది. విమలమ్మ భౌతికకాయం పంచభూతాల్లో కలిసి బూడిద అయి కూలింది.

సూర్యుడు కృంగాడు.

చీకట్లు క్రమంగా కమ్ముకోసాగాయి.

"ముసలిదాని ముల్లెకోసం తలగొరివి పెట్టిండు" వల్లకాటి నుంచి వెళ్ళిపోతూ వ్యాఖ్యానించాడు బలరామయ్య.

* * *

రామయ్య పెళ్ళి నిశ్చయం అయింది.

పెండ్లికూతురు సుమతి. కలవారి కూతురు.

పెండ్లిరోజు రానే వచ్చింది.

పల్లె సాంతం కార్లతో నిండిపోయింది. బాజాలతో మారుమ్రోగింది. వంటల సువాసనలతో గుబాళించింది. పచ్చని తోరణాలతో పచ్చబడింది. ఖద్దరు బాబులతో గ్రామం కళకళలాడింది.

గడీ ముందరి పందిరి జనంతో క్రిక్కిరిసింది. కళ్యాణమండపం ధగధగా మెరిసింది. మంత్రాలు మైకుల్లో వినిపించాయి.

వధువు వచ్చింది.

తెరచాటున కూర్చుంది.

ఆకాశంలో మబ్బులు ఏనుగుల్లా కమ్ముకున్నాయి. ఉరుము ఉరిమింది. గుండెలు దడదడలాడేయి. సుదీర్ఘ తటిల్లత మెరిసింది. కళ్ళు చెమక్కుమన్నాయి. తర్వాత చీకట్లు కమ్మాయి.

బాపడు మంత్రాలు గబగబా చదువుతున్నాడు.

చిటపట చినుకులు మొదలై పెద్దవాన సాగింది.

హోరున గాలి. పందిరి కదలసాగింది. ప్రజలు-పెద్దలు-చిన్నలు గడీలోకి ఉరికారు.

మంగళసూత్రం కట్టగానే పందిరి ఒకవైపు కూలింది. ఆ కల్లోలంతో సుమతి చేయిపట్టి లాక్కుపోయాడు రామయ్య.

కుండపోతగా వానసాగింది.

వంట పందిళ్ళు కూలిపోయాయి.

పొయ్యిలు ఆరిపోయాయి.

ఉరుములు ఉరుముతున్నాయి.

మెరుపులు మెరుస్తున్నాయి.

వాన ఆ రోజంతా ఆగలేదు.

ఏర్పాట్లన్నీ అస్తవ్యస్తం అయినాయి. రాముడు చిరుబుర్లాడాడు. కేకలు వేశాడు. తిట్టాడు. పెద్దలందరినీ బ్రతిమాలుకున్నాడు. మరికొన్ని ఏర్పాట్లు చేసినా అవి అందరికీ అందలేదు. అడుగు బయటికి పెట్టేట్టు లేదు. ప్రళయంలా ఉంది. వీథుల్లో వరదలు ఏరులై పారుతున్నాయి. హోరుగాలికి గుడిసెల కప్పులు ఎగిరి పోతున్నాయి.

రామయ్య రక్తం సలసల కాగింది.

అయినా అతడు ఏమీ చేయలేకపోయాడు.

బయట అడుగుపెడ్తే వాన ముఖానికి కొట్టింది. బట్టలు తడిసిపోయాయి.

పెండ్లికొడుకు ఆకారం మారిపోయింది.

సాయంకాలానికి ఆకాశం కొంత నిర్మలం అయింది. వీధులలో కాలువలు క్షీణించాయి. చెట్లు వాన నీరు రాలుస్తున్నాయి. చల్లనిగాలి ఫెళ్ళుమని వీస్తూంది. ఎండపొడ అక్కడక్కడ పడుతుంది. మట్టి గోడలు పెల్లలు పెల్లలుగా కూలుతున్నాయి.

'ముగ్గురు చచ్చారు. ముప్పై ఇండ్లు కూలాయి.' అనే వార్త విని మంత్రులు, నాయకులు కార్లలో ఊరుదాటారు, వెళ్ళేప్పుడు అధికారులకు ఆదేశాలిస్తూ. వారి తరువాత అధికారులు వెళ్ళిపోతూ సహాయ కార్యక్రమాల పని రామయ్యకు అప్పగించి వెళ్ళారు.

తెల్లవారి తెరిపి ఇచ్చింది. ఆకాశం నిర్మలం అయింది. సూర్యుడు ఏమీ ఎరగనట్లే ఎండకాచాడు. పందిళ్ళు మళ్ళీ లేచాయి. బాజాలు మళ్ళీ మ్రోగాయి. వంటలు మళ్ళీ సాగాయి. అయినా జనం పల్చబడ్డారు.

మిగతా నాలుగు రోజులూ కార్యక్రమాలు జోరుగా సాగేయి. ఒకనాడు నాటకం. ఒకనాడు బుర్రకథ, మూడవనాడు పండితగోష్ఠి జరిగింది. రాముడు పూర్వజన్మలో బ్రాహ్మడు అని నిర్ణయించడానికి పండితులు ఎన్నో ప్రమాణాలు ఉటంకించారు. సుమతీ, రాములకు పనసలు చదివి ఆశీర్వదించారు.

అయిదవనాటి కవి సమ్మేళనం అందరినీ ముగ్ధులను చేసింది. కవులకు పట్టుశాలువాలు కప్పి నూట పదహార్లు సమర్పించాడు రాముడు.

కవులు యతి ప్రాసలు తప్పకుండాను, తప్పించిన్నీ వ్రాసి రాముని వైభవాన్ని కొనియాడారు. ఒక యువకవి సుమతి అంటే సీత అనే అర్థం చెప్పి ఈ దంపతులు సీతారాముల వంటి వారని పొగిడాడు. అసలు యిది అయోధ్యే నన్నాడు

ఒక కవి. త్రేతాయుగంలో ఉండ వలసిన రాముడు కలియుగంలో అవతరించా డన్నాడు మరో కవి. రాముణ్ణి కృష్ణదేవరాయలతో పోల్చిన కవిశేఖరులు లేక పోలేదు.

ఆ వైభవం చూసి బలరామయ్యకూ మళ్ళీ పెళ్ళిచేసుకోవాలని పించిందంటే రామయ్య ఎంత పొంగిపోయాడో అర్థం అవుతుంది. ఆ ఉత్సాహంలో, ఆ రాత్రి శోభనపు గదిలో ప్రవేశించాడు. తనకోసం వేయి కళ్ళతో ఎదురుచూస్తూ ఉంటుం దనుకున్న రామయ్యకు సుమతి కన్పించలేదు. గది జిగేలు మంటున్నా శూన్యంగా కనిపించింది. గుండె గుబగుబలాడింది. ఆతురత, ఆరాటం పెరిగాయి. రక్తంలో చిచ్చు రగిలింది.

'సుమతి వస్తుంది' అని ఎదురుచూడ సాగాడు. నిముషాలు యుగాలవుతు న్నాయి. సహనం చస్తున్నది. తాపం భరించరానిది అవుతూంది. తహతహ పెరుగుతున్నది.

సుమతి రాలేదు.

రామయ్య మతిపోతుంది. గదిలో చుట్టూ తిరిగాడు. ఏవో పదార్థాలు నోట్లో వేసుకున్నాడు. సిగరెట్లు కాల్చాడు. నేలను తన్నాడు. చిరచిరలాడాడు. చిరాకు పడ్డాడు.

గది తలుపు తెరుచుకొంటున్న చప్పుడైంది.

రామయ్య తలుపు దగ్గరికి ఉరికాడు.

ఒక ముసలవ్వ లోన ప్రవేశించింది.

ఆమెను చూచాడు—మండిపోయాడు. 'ఏది?' అని కేకపెట్టాడు. ముసలవ్వ అదిరిపోయింది. కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయింది. నోట మాట రాలేదు.

'ఏది సుమతి? చెప్పు' ఆమె భుజాలు పట్టుకొని ఊపి గట్టిగా అరిచాడు.

ఆమె ఒక అడుగు వెనక్కు వేసింది.

'వసతి కాదు. సుమతి రాదు' అని చెప్పి వెనక్కుతిరిగి సుమారు పరిగెత్తి నట్లుగా నడిచిపోయింది.

తలుపు ధడాలుమని వేసి మంచంలో కూలబడ్డాడు రామయ్య.

ఆ సౌధంలో, ఎక్కడో, మూలకు, కూలబడి మౌనంగా ఏడుస్తూంది సుమతి. అది ఎవరికి వినవచ్చే ఏడుపు కాదు. ఆమె గుండె ఏడుస్తూంది. ఆ ఏడుపు గుండె గలవారికి మాత్రమే అర్థం అవుతుంది. అది వున్నవారు అక్కడ ఎవరూ ఉన్నట్లులేరు.

ఒక ప్రాణి కుములుతూంది.

ఒక ప్రాణి మండిపడుతూంది.

మంట ఎంతోసేపు మండదు. మనసు ఒకే విషయం మీద ఉండదు. రామయ్యకు నిద్ర రావడంలేదు. మంచంలో పొర్లుతున్నాడు. ఏవేవో ఆలోచనలు

తరంగాలుగా వచ్చి తీరాన్ని తాకి ఆగిపోతున్నాయి. మరో తరంగం ఎక్కణ్ణుంచో వచ్చి అతడ్ని ఉక్కిరిబిక్కిరి చేస్తుంది.

కవులు పండితులు తనను రామచంద్రుడన్నారు! నవ్వుకున్నాడు రామయ్య. దొర గడీలో పడివున్నప్పుడు తానూ ఒక గులాము. దొర తంతే పడ్డాడు— పెడ్తే తిన్నాడు. ఈ రోజు తానెంత వాడైనాడు! ఎందుకు? ఎలా? డబ్బు! డబ్బు! అదంతా చేసింది డబ్బే! ధనం ఎంత గొప్పది? తాను ఇంకా సంపాదించాలి. ఇంకా గొప్ప వాడు కావాలి? ఎలాగైనా సంపాదించాలి. ఎలా సంపాదించావని ఎవడూ అడగడు. ఎంత ఉందో చూస్తాడు. అందుకు ఏ పనైనా చేయి. అవును విమలమ్మను తాను ముంచలేదూ? వెధవముండ చచ్చింది. చచ్చిందా? తాను చంపించాడా? ఎలాగైతేనేం? పోయింది. ఒక పీడ విరగడైంది. వీరభద్రాన్ని ఆశ్రయించింది. తాను మునుగుతా ననుకున్నాడు. చచ్చింది. ఈ లోకం నుంచే వెళ్ళిపోయింది. ఇక తనకు అడ్డెవరు? ఆస్తి సొంతం తనది! ఎంత ఆస్తి! ఎంత అధికారం! ఇన్నీ తనకే దక్కాయి. మరి విమలమ్మ! అదేమిటి ఇంకా బతికి వుందా? అన్నీ విన్నదా? వస్తున్నది, తనమీదికే! ఎంత భయంకరంగా వుంది. వచ్చేసింది. ఇంకా ఎక్కడికి ఆగు. కేకవేశాడు. కళ్ళు తెరిచిచూశాడు. ఏముంది? ఏమీలేదు. అయినా గుండె వేగంగా కొట్టుకుంటూనే ఉంది. నాలుక తడి ఆరిపోయింది. లేద్దామనుకున్నాడు. పూర్తిగా నీరసించి పోయాడు. లేవలేదు. దాహం. గొంతు ఆర్చుకొనిపోతుంది. ప్రాణం పోతుందేమో! ఎవరూ లేరిక్కడ. ఏం చేయాలి? చావగూడదు. తాను బ్రతకాలి? బలం పుంజు కున్నాడు. లేచాడు. కాళ్ళు వేళ్ళాడపడుతున్నాయి. నీళ్ళ గ్లాసు అందుకున్నాడు. నీరు త్రాగబోయాడు. విమలమ్మ కనిపించింది గ్లాసులో. నీళ్ళు గోడకు కొట్టాడు. తనుస్తూ కూర్చున్నాడు. ఆరాటం ఎక్కువ అవుతూంది. లేవలేకపోతున్నాడు. కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. విమలమ్మ వికటంగా నవ్వుతూంది. కళ్ళు తెరిచాడు. ఏమీలేదు. అంతా భ్రమ. ఇంకెక్కడి విమలమ్మ! బూడిదై పోయింది? కావచ్చు. దయ్యం కాదుగదా! అవును మనుషులు దయ్యాలవుతారట! పట్టి పీడిస్తారట! ఏమో! దయ్యమేనేమో!

గోడలోంచి వస్తున్నది విమలమ్మ.

మళ్ళీ గుండెదడ హెచ్చింది, పుంజుకున్న ధైర్యం చచ్చింది. నీరసించి పోతున్నాడు. వస్తున్నది విమలమ్మ. తన మీదికే - అదుగో రానే వచ్చింది. మీదికి, మీది మీదికి పడ్డది తనమీద. కెవ్వుమని కేకవేశాననుకొని పడిపోయాడు. గొంతు పెగల్లేదు- మాట రాలేదు.

"దయ్యాలుండవు. అంతా పిచ్చి. వెర్రి నమ్మకాలు. చచ్చినవాడు తిరిగిరాడు. ఇంతగా అడవుల్లో తిరుగుతున్నాం. ఉంటే మనకు కనిపించవా? పీడించవా?" వీరభద్రం చెపుతున్నాడు. ఒక్కసారి నిప్పులు కుప్పలుగా రాలుతుంటే భయ పడ్డాడు తాను. కొరివి దయ్యం అని ఉరికి వీరభద్రాన్ని చేరుకున్నాడు. వీరభద్రం

తనను ఆ నిప్పులుపడే చోటికి తీసికెళ్ళాడు. గుండెలో గుబులుతోనే వెళ్ళాడు తాను. ఈతచెట్టు తలదగ్గర నిప్పంటుకుంది. అది రాలినపుడల్లా గంపతో నిప్పులు గుమ్మరించినట్లు అవుతూంది. అప్పుడు చెప్పాడు వీరభద్రం దయ్యాలగురించి.

"అవును దయ్యాలు లేవు. ఉండడానికి వీల్లేదు అనుకొని కళ్ళు తెరచాడు. అతనికేమీ కనిపించ లేదు. మామూలు మనిషి అయినాడు. తన భ్రమకు తానే నవ్వుకున్నాడు. లేచాడు. నీళ్ళు తాగాడు, పడుకున్నాడు. ఆలోచనలను అవతలకునెట్టి నిద్రపోవా లనుకున్నాడు.

మనసు విచిత్రమైంది. అది ఎన్నైనా వింతలు చేయగలదు.

రామయ్య పడుకున్నాడనేగాని మళ్ళీ నిద్రరాలేదు. వీరభద్రం కనిపించాడు. వీరభద్రంమీద నెట్టాడు తాను చేసినపాపం! కాకుంటే తననే బద్నాం చేయ చూస్తాడా? ఒకే మాటతో లొంగిపోయాడు, ప్రజలు తన చేతిలో ఉన్నారు. కాదు తన డబ్బు చేతిలో ఉన్నారు. తాను ఆడించినట్లల్లా ఆడాల్సిందే. ప్రతివాడూ డబ్బు చేతికీలుబొమ్మ! డబ్బు లేకున్నా ఆడించాడు వీరభద్రం. ఆడించడం ఏమిటి వణికించాడు. ఆ కాలంపోయింది. ఇది ధనస్వామ్యం. డబ్బుతో ముడివడిన కాలం. అందుకే వీరభద్రాన్ని అంత తేలిగ్గా ఓడించగలిగాడు. కాని పాపం మంగమ్మేం చేసింది? మంగమ్మ! మంగమ్మ అతని ముందు ప్రత్యక్షం అయింది. ఆమె చేతుల్లో బిడ్డ వున్నాడు. బిడ్డ? తన బిడ్డ! తన బిడ్డనే దూరం చేసుకున్నాడు. హృదయంలో ఎక్కడో మమత మేల్కొన్నది. గుండె కొద్దిగా కరిగింది. తన బిడ్డ వేరేవాని బిడ్డగా పెరుగుతాడు! వేదన మనసులో చోటుచేసుకుంది.

"వీడు నీ బిడ్డడు కాడా!"

"నాకు అన్యాయం చేస్తావా?" మంగమ్మ పలికింది.

రామయ్య గుండె రాయి అయింది.

"కాదు. కాదు. కాదు. నడువ్ ఇక్కడి నుంచి" కేకవేసి కళ్ళు తెరచాడు. ఈ తడవ గుండె దడదడ లాడలేదు. ఏదో చిచ్చు మనసులో రగులసాగింది. మంగమ్మను తాను పట్టుకోవడం, ఆమె తల వంచుకోవడం, ఆవిడను గట్టిగా కౌగలించు కోవడం ఆమె అందం తన ఆనందం.

మంగమ్మ నగ్నంగా నుంచుంది.

తనను రమ్మంటూంది.

రామయ్య నరాలు బిగిశాయి. రక్తం వేగంగా ప్రవహించింది. నరాల్లో చిచ్చు రగిలింది. కళ్ళు పొగలు, సెగలు కక్కాయి. ఇంద్రియాలు వశం తప్పాయి, మనసునూ, మెదడునూ అన్నింటినీ గెలిచాయి. రామయ్య భరించలేకపోయాడు. సుమతిని ఏ దశలోనైనా పట్టాలనుకున్నాడు.

గది తలుపు తెరిచాడు.

బయటపడ్డాడు.

అర్థరాత్రి దాటింది. అంతా అంధకారం. అలికిడిలేదు. అంతా నిద్రతో ఉన్నారు. బంగళా బావురుమంటూంది. సాగిపోతున్నాడు రాముడు అంధకారంలో. అంధకారం అతని బంధువు. అంధుడుగా సాగిపోతున్నాడు. ఆరని తాపంతో ఉరుకుతున్నాడు.

సుమతి గది దగ్గరికి చేరాడు.

ఆమె నిద్రపోవడం లేదు. ఆమె ఏడుస్తూంది. ఎవరికీ వినిపించకుండా ఏడుస్తూంది. కుమిలి కుమిలి ఏడుస్తూంది.

రామయ్య గదిలోదూరి తలుపేశాడు.

సుమతి దిగ్గునలేచి కూర్చుంది.

ఆమె కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి.

రామయ్య ఆమెను సమీపించాడు.

ఆమె లేచి నుంచుంది.

రామయ్య బుసలు కొడుతున్నాడు— మీదికి ఉరికాడు.

ఆమె తప్పుకుంది."అరుస్త" అన్నది.

"నువ్వు నా పెళ్ళానివి. అరువు చూస్త ఎవడొస్తడో?" అని నోరుమూని ఆమెను లాక్కొచ్చి మంచంలో పడేశాడు.

ఎలుకను పిల్లిపట్టినట్టు పట్టాడు. దాహం తీర్చుకున్నాడు.

ఆమెకు కడుపులో తిప్పుతూంది. ఆమె అతన్ని నెట్టేసింది. తల ఓరగా పెట్టి భళ్లున కక్కింది.

గది సాంతం గలీజు అయింది.

పులిసిన వాసనతో నిండిపోయింది.

రామయ్య ప్రతిమలా నుంచుండి పోయాడు.

ఆమె లేచి మూతి తుడుచుకొని దూరంగా నుంచుంది. ఆమె కళ్ళలో భయం నాట్యమాడుతుంది.

"ఏందిది?" రామయ్య అడిగాడు.

"నా కేమెరక?"

"నా అవ్వరలకు పోదాం రా"

ఆమె బెదురు చూపులు చూచింది.

అతడు ఆమెను లాక్కుపోయాడు.

తెల్లవారింది. రామయ్యకు బాగా పొద్దెక్కిన తర్వాతగాని తెల్లవారలేదు. అతడు లేచాడు సుమతిని చూచాడు. ఆమె వాడిపోయిన తామరపువ్వులా కనిపించింది. నలిగిన మల్లెలా ఉంది. మబ్బుచాటు వెన్నెలలా ఉంది.

రామయ్య ఆమెను చాలసేపు చూచాడు - ధ్యాసగా చూశాడు - ధ్యానంగా చూచాడు. అంత యిదిగా ఆమెను ఎప్పుడూ, అంతవరకు చూడలేదు.

సుమతిలో అందం ఉంది ఆకర్షణ ఉంది. ఏదో ఠీవి ఉంది. ఎందుకో లొంగినట్లయినాడు రామయ్య. ఓడినట్లయినాడు. అతనికి తెలియకుండానే సుమతి అతనిలో అంతర్భాగం అయిపోయింది.

రామయ్య ముఖం మీద పడిన ఆమె ముంగురులను సవరించాడు. దుప్పటి సరిగా కప్పాడు. గది బయటికి వచ్చాడు.

రామయ్య చాయ్ తాగుతున్నప్పుడు గది కడుగుతున్న చప్పుడు వినవచ్చింది. అవును ఆ గదిలోనే సుమతి వాంతి చేసుకుంది. సుమతి వాంతి ఎందుకు చేసుకుంది? ఆలోచనే అతనిని ఎవరో ఫెళ్ళున కొట్టినట్లనిపించింది. సుమతి కడుపుతోందా? వేవిళ్ళు కావుకదా? కాకుంటే రాత్రి గదిలోకి ఎందుకు రాలేదు? తనకు దూరం దూరంగా ఎందుకు నిలిచింది? ఏదో అనుమానం? అతన్ని వేధించింది. ఏవేవో వెర్రివెర్రి ఊహలొచ్చాయి. ఇంతలో సుమతి కనిపించింది. ఆమెను చూశాడు. నిదానంగా చూచాడు. అలా కావడానికి వీల్లేదనుకున్నాడు. ఏదో నలత అయ్యుంటుందనుకున్నాడు. అంతే కావాలనుకున్నాడు. అయినా ఎక్కడో అనుమానం వేధిస్తూనే ఉంది. ఎవరినైనా అడగాలనుకున్నాడు. ఏమని అడగాలి? ఛా—తన భార్య కడుపుతో ఉందా అని మందిని అడగాలా? ఎలాంటి స్థితి వచ్చింది! ఇతరులకు చెప్పుకో లేదు. తనకు అర్థం కాదు. ఎంత కాదనుకున్నా ఏదో అనుమానం మనసులో కెలుకుతూనే ఉంది. సుమతినే అడిగేస్తే? ఏమని అడుగుతాడు? అయితే యేం చేయాలి? అతనికి ఏమీ తోచలేదు. ఏదో గందరగోళంగా ఉంది మనసులో. వెలుగు కనిపించడంలేదు. అంతా అయోమయంగా ఉంది.

'దొరా! దండం పెట్టం.'

రామయ్య అటు చూశాడు. ఒక గుంపు తనకోసం వచ్చింది. వారిని చూసి నవ్వుకున్నాడు రామయ్య. పూర్వం దొర దగ్గరికి ఇలాగే వచ్చేవారు. అక్కడే మంచునే వారు. తాను కూర్చున్న స్థానంలోనే దొర ఉండేవాడు.

'ఏందిర ఎల్లిగ! మందను ఎంటేసు కొచ్చినవు?'

'రాకుంటె ఎట్లాది? బాంచను. గాలివానొచ్చి ఇండ్లు కొట్కపోయినయి. కాల్మొక్త.'

'అయితే ఏం చేయమంటవ్? బవంతులు కట్టియ్యమంటవా?'

'అంత మాటంటాం దొర! బవంతులు బంగ్లాలు దొరలకు. మా కెందుకు బాంచెను. ఏదో గుడిసెలు కప్పుకుంటమని అడిగెటందుకు వచ్చినం!'

'కప్పుకోండి మల్ల నన్నేంది అడిగెడిది?'

'ఊరికి దొరలి అడగకుండ ఎట్ల చేస్తముండి. ఇండ్లకప్పులు పూడి కొటుక పోయినయుండి.'

'ఏం చెయ్యమంటవు మరి నన్నిప్పుడు?' విసుగు ధ్వనించింది.

'ఏం లేదు బాంచను గరీబోల్లం. లగ్గానికని పందిళ్ళగిట్ట యేయించ్రును గద! ఆ తాటాకు గిట్ట ఇస్తే గుడిసెలు కప్పుకుంటం. ధరమ దొరలు.'

'అక్కరపడ్తె నా దగ్గర కొస్తరు. ఓట్లేమొ ఆడ యేస్తరు. యియ్యను పందిళ్ళట్లనే ఉంటయి పోరి'

వచ్చినవాళ్ళంతా తలలు వంచుకున్నారు. క్షణం మౌనం వహించారు. తరవాత యల్లయ్య గునిశాడు. 'అట్లంటె ఎట్ల దొర! ఓట్లు మాల మాదుగులమే వేసినా ముండి? దయ దల్చకొంటె ఎట్ల బతుకుతం? మీ కాళ్ళకాడ పడుండెటోల్లం.'

'ఇయ్యనంటే యియ్యను. ఏం జగ్గయ్య గుడిసె పీక్కోరాదుండి. నా దగ్గరికి రాకుంటె'

జగ్గయ్య అనే మాట వినగానే అంతా తలలు వంచుకున్నారు. ఒక్కడూ మాట్లాడలేదు. క్షణం తరవాత అందరూ తిరిగి వెళ్ళిపోయారు.

రామయ్యకు ఏదో అవమానం జరిగినట్లు అనిపించింది. అంత నిర్లక్ష్యంగా వెళ్ళిపోతారా జనం? అంతా తనను నిర్లక్ష్యంగా చూస్తున్నారు. సుమతి కూడానా? మళ్ళీ సుమతి వాంతి గుర్తుకు వచ్చింది. మళ్ళీ ఏవేవో వెర్రివెర్రి ఆలోచనలు వచ్చాయి. అనుమానాలు పుట్టలోని పాముల్లా తల బయటికి పెడ్తున్నాయి. లోనికి లాక్కుంటున్నాయి. అవుననుకుంటాడు ఒకసారి. కాదనుకుంటాడు మరోసారి. ఒకసారి మంగమ్మ కనిపిస్తుంది. ఒకసారి సుమతి ప్రత్యక్షం అవుతుంది. అసలు విషయం అర్థంకాదు. అనుమానం పీడిస్తూంది. అనుమానం అపూర్వమైన అగ్ని. అది లోపల్లోపలే మనిషిని కాలుస్తుంది. కొంపలు కాలుస్తుంది. ఆ నిప్పు చరచర లాడుతుంది రామయ్యలో. చిటచిట మండుతూంది. మనసు సరిగా లేదు. మనిషి సరిగా లేడు. సుమతిని అడిగితే ఏం తప్పా? ఆమె తన భార్య అనుకున్నాడు. విషయం తేల్చుకోవాలనుకున్నాడు. లేచి చరచరా గదిలోకి వెళ్ళాడు.

సుమతి మంచంలో ఉంది.

అదోలా చూచిందతన్ని.

రామయ్య కరిగిపోయాడు. మంచంమీద కూర్చున్నాడు. నొసలు తాకుతే వేడిగా ఉంది.

'జ్వరం వచ్చిందా?' అడిగాడు రామయ్య. ధ్వనిలో ఆతురత ఉంది. ఆవేదన ఉంది.

సుమతి చిరునవ్వు నవ్వింది. మళ్ళీ నొసటమీద చేయివేశాడు. ఆ చేతిమీద సుమతి తన చేయివేసింది.

'ఎంత చల్లగున్నది మీ చెయ్యి!'

'నిజంగానా?'

'అవును. అబద్ధం చెప్పుతానా?'

'వైద్యుణ్ణి పిలుస్త. నిజంగనే జరం వచ్చింది' అని వైద్యుని కోసం మనిషిని పంపాడు. రామయ్య సుమతిని చూస్తూ కూర్చున్నాడు. ఆమె కళ్ళు మూసుకుంది. ఎంత అమాయకంగా ఉంది! అంత పని చేయగలదా? ఛ. ఏమిటి తన ఆలోచనలు? అయినా అడగడం మంచిది కాదూ? ఇప్పుడా? ఇప్పుడేనా?

'సుమతీ!'

ఆమె కళ్ళు తెరిచింది. ఒక చిరునవ్వు నవ్వింది. ఏమిటీ? అన్నట్లు చూచింది.

రామయ్య కరిగిపోయాడు. అడగలేకపోయాడు. తికమక పడ్డాడు. అయినా అడిగేశాడు. "రాత్రి అట్ల చేస్తివి?"

చెంపలు జేవురించాయి. కళ్ళలో సిగ్గు తొణికిసలాడింది. ముఖం తిప్పేసు కుంది. మాట్లాడలేదు.

రామయ్యకు అర్థం కాలేదు. మళ్ళీ అడిగాడు?

ఆమె రెప్పలాడించింది. కళ్ళలో భయం, బెదురు కనిపించింది. ఏం చెప్పాలో అర్థం కాలేదు.

'సిగ్గు....భయం....'

మళ్ళీ దొంతరలు దొంతరలు సిగ్గు వచ్చింది.

ఇంక రామయ్య అడగలేకపోయాడు. అంతే అయ్యుంటుంది. అంతే అనుకు న్నాడు. ఆ విషయం మరిచిపోవడానికి ప్రయత్నించాడు.

"తల నొప్పిగున్నదా?" అడిగాడు.

ఇంతలో వైద్యుడు వచ్చాడు.

'చెయ్యిట్ల ఇయ్యి. నాడి చూడాలె.'

గాజులు గలగలలాడేయి.

'చెయ్యిచూడకుండ మందియ్యరాదా?' రామయ్య వైద్యుడ్ని అడిగాడు.

వైద్యుడు బిక్కమొఖం వేసి రామయ్యను చూచాడు. 'అదెట్ల కుదురుతుం దండి. నాడి చూడాలెకద' అన్నాడు వైద్యుడు.

'సరె, కానియ్యి. డాక్టర్లయితే చూడరు అందుకని అన్న. జల్ది చూడు.'

వైద్యుడు నాడి చూశాడు. నాలుక చూచాడు.

"వళ్ళు తిరిగినట్లుంటదా?"

అవునన్నట్లు తల ఊపింది.

"వాంతి అయే టట్లున్నదా?"

"అయిందండి వాంతి...." రామయ్యే జవాబు చెప్పాడు. సుమతి మాట్లా శ్లేదు. చూస్తూ ఉండిపోయింది.

"పైత్య ప్రకోపం. బాగా పైత్యం చేసింది. జ్వరం తగిలింది. పైత్యజ్వరం. పైత్యాంతకం ఇస్తున్న. తేనెలో కలిపి నాకించాలె. అప్పుడు తగ్గుతది. జ్వరం తగ్గటా నికి నాలుగైదు రోజులు పట్టది" అని మందిచ్చి వైద్యుడు వెళ్ళిపోయాడు.

వాంతి పైత్యంవల్ల అనేమాట ఎంతో మనశ్శాంతిని యిచ్చింది రామయ్యకు. వాంతులు కావూ? అవుతుంటాయి. ఎందుకు కావూ? అనుకొన్నాడు.

జ్వరం మూడు నాలుగు రోజులవరకు తగ్గలేదు. పెరుగుతుందేగాని తగ్గుముఖం పట్టటంలేదు. సుమతి తండ్రి బెదిరిపోయాడు. రామయ్య అదిరిపోయాడు. మామ తన కూతురును పట్నం తీసికెళ్తానంటే కాదనలేక పోయాడు.

సుమతి పట్నం వెళ్ళిపోయింది.

డాక్టర్లు "టైఫాయిడ్" అన్నారు. రామయ్యకూడా వెళ్ళి చూచివచ్చాడు.

సుమతి జ్వరం తగ్గింది. బాగా నీరసించిపోయింది. విశ్రాంతి కావాలన్నాడు డాక్టరు. తన ఇంటికి పంపించవలసిందనీ కాస్త కోలుకున్నాక పంపిస్తానని రామయ్యను వేడుకున్నాడు సుమతి తండ్రి.

"మా ఇంటికాడ ఏం తక్కువ ఉన్నది గనక" రామయ్య అన్నాడు. సుమతిని తన ఇంటికే తీసికెళ్ళాలని ఉందతనికి.

'ఒక్కతే బిడ్డ. గారాబంగా పెంచుకున్న. నవిసిందని అన్న' దీనంగా అన్నాడు తండ్రి.

రామయ్య సుమతిని అడిగాడు.

'మీ ఇష్టం. ఎక్కడుండమంటే అక్కడుంట. నాదేంది' అన్నది సుమతి.

తండ్రి ముఖం వాడిపోయింది. ఎంత త్వరగా తెంచుకుంటారు బంధం ఆడపిల్లలు! అనుకున్నాడు. కని పెంచి పెద్దచేసిన వాణ్ణి ఇట్టే మరిచిపోతారు. క్షణంలో కట్టుకున్న వాడ్ని తనవాణ్ని చేసుకుంటారు. మెట్టిన ఇంటినే తమ ఇల్లు చేసుకుంటారు. పుట్టిల్లు దూరం అవుతుంది. పరాయి ఇల్లు అవుతుంది. కూతురుతో తన బంధం తెగిపోయినట్లే ఒక అయ్య చేతిలో పెట్టాడు. అల్లుని ఔదార్యానికై కళ్ళప్పగించి చూడసాగాడు.

ఇక రామయ్య సుమతి మాటలు విని మురిసిపోయాడు. తన ఆజ్ఞకోసం ఎదిరిచూసే ఆడది దొరికింది. గుండెలో గిలిగింతలు పెట్టినట్లయింది. సుమతి తన ఇంటికి రావాలి. తన లోగిలి వైభవం పెంచాలి. తనకూ భార్య ఉంది. తన భార్య తన ఇంటికే రావాలి అనుకున్నాడు. భార్య అనగానే ఏదో అధికారం వచ్చేసినట్లు.

"అయితే ఇంటికే పోదాం" రామయ్య నిర్ణయం చెప్పేశాడు.

తండ్రి హతాశుడైనాడు.

సుమతి కళ్ళు కన్నీళ్ళతో నిండాయి.

"సరే" అన్నదామె. అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది, సామాను సర్దుకొనడానికి.

సుమతి తండ్రి సంచి సర్దుకొని చేతికర్ర తీసికొని వెళ్తున్నానని కూతురుతో చెప్పాడు.

సుమతి తండ్రిని కౌగిలించుకొని బావురుమంది.

"అమ్మా! నీ ఇంటికి నువ్వు పోతున్నావు. ఆడపిల్ల ఎన్నటికైనా అత్తింటిదే నమ్మా! ఏడవకు తప్పు" అని కండవాతో తన కళ్ళు తుడుచుకుంటూ ఓదార్చి బయలుదేరాడు. బయటికి వచ్చి రామయ్య చేతులు పట్టుకొని "అయ్యా! బిడ్డను నీ చేతుల పెట్టిన. ఎట్ల చూచుకుంటవో" అని ఏడ్చేశాడు.

రామయ్య స్థాణువులా నుంచున్నాడు. ఏం చేయాలో అర్థం కాలేదతనికి.

కండవాతో కళ్ళు తుడుచుకొంటూ వెళ్ళిపోయాడు వృద్ధుడు. చూపందినంత సేపు చూస్తూ నుంచున్నాడు రామయ్య – గుమ్మంలో.

సుమతి రామయ్య ఇంటికి వచ్చేసింది - తెచ్చుకున్నాడు రామయ్య. రామయ్య ఇంట్లో కొత్తవెలుగు ప్రవేశించింది. సుమతి కొద్దిరోజుల్లోనే రామయ్య ఇంటిని తన ఇల్లు చేసుకుంది. ఇల్లంతా చక్కగా సర్దింది. ఇంటికి కొత్తశోభ తెచ్చింది. ఒక క్రమశిక్షణ ఏర్పరచింది. పని మనుషుల ఆటలు కట్టాయి. ఆమె ఆ ఇంటికి అధికారిణి అయింది.

ఇంట్లో వసంతం విరిసినట్లు అయింది రామయ్యకు. ఎన్నడూ కనని ఆనందం అతనిలో పరచుకుంది. అతని బట్టల విషయంలోనూ, భోజనాదుల విషయంలోనూ సుమతి తీసుకుంటున్న శ్రద్ధ అతనికే ఆశ్చర్యాన్ని కలిగిస్తూంది. అందుకు ఆనందమేకాదు. కొంత గర్వంగానూ ఉంది రామయ్యకు.

సాయంకాలం కాగానే పూలు తురుముకొని తయారు అవుతుంది సుమతి. రాత్రులు గదిలో గంటలు క్షణాలలో గడిచిపోతున్నాయి రామయ్యకు. అడుగు పెట్టగానే ఒక చిరునవ్వు నవ్వుతుంది సుమతి. రామయ్య ఆ చిరునవ్వులో కరిగి పోతాడు. మునిగిపోతాడు. ఉక్కిరిబిక్కిరి అవుతాడు. ఆమె ఏవేవో ముచ్చట్లు చెపుతుంది. నవ్విస్తుంది. రామయ్య పరవశుడు అవుతాడు. తెల్లవారుతుంది. అడుగుదా మనుకున్న విషయం అడగలేడు.

తొలిరాత్రి రామయ్య గుండెలో గుచ్చుకున్న ముల్లు అలాగేవుంది. అప్పు డప్పుడూ అది కెలుకుతుంది. కదిలిస్తూంది. బాధపెడుతూంది. ప్రతిరోజూ ఆ విషయం అడగాలనే స్థిర నిశ్చయంతో గదిలో అడుగు పెడ్తాడు. రోజూ ఓడిపోతు న్నాడు. సుమతి దగ్గర ఏదో మత్తుమందుంది. అలా నవ్వేస్తుందామె. అంతే.

కాలం ఆగుతుందా? కరిగిపోతూనే వుంది.

ఆనాడు అతని గుండెలోని ముల్లు కాస్త ఎక్కువ కెలికింది. అందుకు కారణం లేకపోలేదు. వీరభద్రం ఊరికి వస్తున్నాడు. మంగమ్మనూ, ఆమె కొడుకు ప్రకాశాన్ని తీసుకొని వస్తున్నాడు. ఆ ఊళ్ళో జరగాల్సిన అమరవీరుల స్మారక దినానికి వారు వస్తున్నారు. ఆ వార్త అతనిలో సంచలనం కలిగించింది. వచ్చేవాడు తన కొడుకు అని ఎక్కడో తన మనసు లాగసాగింది. దాంతో ముల్లు కాస్త ఎక్కువ కెలికింది. సుమతిని ఆ రాత్రి అడిగేయా లనుకున్నాడు. అసలు భోజనాలప్పుడే అడుగుదామనుకున్నాడు. అవకాశం లభించలేదు. పైగా సుమతి కాస్త చిన్నబుచ్చు

కొని ఉంది. ముఖం కాస్త వాడిపోయినట్లుంది. అయినా అడుగుదామని చాల ప్రయత్నించాడు. సుమతికి తన రహస్యం తెలిసిపోలేదుకదా అనుకున్నాడు. దాంతో ఖంగుతిన్నాడు. అడగలేకపోయాడు. అందుకుకూడా మానసికంగా ఎంతో కృంగిపోయాడు. అన్నం తిన్నాననిపించి లేచాడు.

ఆనాడు పొలాల దగ్గరికి వెళ్ళినా, వీధిలో పంచాయితులు విన్నా అతనికి ఏవీ అర్థం కాలేదు. ఆ రాత్రి సుమతిని అడిగెయ్యాలి. అది ఒక్కటే అతని మనసులో మసలుతూంది. అందుకు ఆ రోజంతా సిద్ధం అయినాడు.

ఆ రాత్రి గదిలోకి పోయాడు.

సుమతి మెరిసిపోతుంది. అయినా ఏదో కొత్తసిగ్గు ఆమెను ముంచెత్తుతూంది. గదిలో అడుగు పెట్టగానే అడిగింది, "ఒక ముచ్చట చెప్పనా?"

రామయ్య గుండె ధడల్లుమన్నది.

ముఖం పాలిపోయింది. 'చెప్పు' అన్నాడు.

'కూచోండి'

కూర్చున్నాడు కాని ఏమి చెపుతుందోనని గుండె దడదడలాడింది. మంగమ్మ ముచ్చట కాదుకదా! మంగమ్మ వూరికి వస్తూందంటే ఆమె విషయమే చెప్పుకుంటూంది ఊరంతా. ఈమెదాకా రాలేదుకదా!

'మంచి ముచ్చట.'

'చెప్పు' ఆ సిగ్గేమిటో అర్థంకాలేదతనికి.

'ఎట్ల చెప్పాలె' ఆమె తలవంచుకొని అన్నది.

ఈ తడవ ఆశ్చర్యపడ్డాడు రామయ్య.

'ఎందుకట్ల సిగ్గుపడ్తవ్. చెప్పు'

'మీరు తండ్రి కాబోతున్నరు' తలవంచుకొనే చెప్పింది సుమతి.

పిడుగు పడ్డది రామయ్యమీద. 'ఏంది?' అడిగాడు. ధ్వనిలో ఏదో భయం ఉంది. ఆనందం లేదు.

తలెత్తి చూసింది. అతనిలోని భయం ఆమెలో ప్రవేశించి, "అవు, నిజం, నీలుపోసుకున్న."

'అట్లనా?' నిరామయంగా అన్నాడు.

'ఎందుకట్లున్నరు?'

'ఎట్లున్న? బాగనే ఉన్నకద'

'నేనేమన్న తప్పుచేసిన్నా?' గొంతు పూడుకున్నది. కళ్ళల్లో నీరు నిండింది.

రామయ్య కలవరపడ్డాడు. అడుగుదామనుకున్నాడు.

సుమతి ఏడ్చేసింది.

కన్నీరు కట్టలు తెంచుకుంది. రామయ్య మళ్ళీ ఓడిపోయాడు.

* * *

వీరభద్రం ఊరికి వచ్చాడు. మంగమ్మ తన బిడ్డతో వచ్చింది. మంగమ్మ బిడ్డతో ఊరికి రావడం అదే మొదటిసారి. వీరభద్రం కూడా అదే రావడం మళ్లీ. వారు ఊళ్ళో అమరవీరుల దినం జరిపించడానికి వచ్చారు. మంగమ్మ రావడంతో జగ్గయ్య ఇంటికి తిరునాళ్ళ సాగింది. మంగమ్మలో చాలా మార్పు వచ్చింది. అబలగా తనను అంతం చేసుకుందామనుకున్న మంగమ్మ కాదు. పట్నం నుంచి విజ్ఞానం మోసుకొని వచ్చింది. ఆమె ముఖంలో ఉత్సాహం ఉంది. కళ ఉంది. కారుణ్యం వుంది. వీరభద్రం ఆమెకు చదువు నేర్పాడు. కొద్దిరోజుల్లోనే చదవనూ వ్రాయనూ నేర్చింది. పుస్తకాలు ఆమెకు నేస్తాలైనాయి. ఇంగ్లీషు కూడా కొంత చదువ నేర్చింది.

ఆమెను చూడవచ్చిన వారంతా ఆమెలోని మార్పు చూచి ఆశ్చర్యపోయారు. ఆమె ఎన్నెన్నో విషయాలను గురించి మాట్లాడుతూంది. అతి సామాన్యంగా మాట్లాడుతూంది. గంభీరంగా మాట్లాడుతూంది. 'మనకు వెలుగు చూపారు, మన కోసం ప్రాణా లర్పించారు. వారిని స్మరించుకోవడం మన విధి. వారి సందేశాన్ని మరిచిపోకుండడం మన కర్తవ్యం. ఈ అమరవీరుల దినం బ్రహ్మాండంగా జరపాలి అని బోధించింది. ఆడవారిలో ఉత్సాహం పొంగింది, ఏర్పాట్లు ఘనంగా సాగించారు.

"నైజాం నవాబు రోజుల్లో ప్రజలు పశువులుగా పరిగణించబడ్డారు. ఇప్పుడు ప్రజలకు హక్కులు వచ్చాయి. వారే శాసనాలు చేస్తున్నారు. అయితే శాసనసభల్లో నిజమైన ప్రజాప్రతినిధులు తక్కువ వున్నారు. సరియైనవారిని ఎన్నుకోవాల్సిన బాధ్యత ప్రజలమీద వున్నది. మనకు హక్కులు సాధించి పెట్టినవారు జగ్గయ్య వంటి వీరులు. వారిని స్మరించుకోవడం మన విధి" అని చెప్పాడు వీరభద్రం.

'అది సరేలెండి. దొరభూములు మా కెప్పుడు పంచిపెడ్తరు?" అడిగాడు మల్లయ్య.

"ఒకరు పంచేదేమిటి! మనమే పంచుకోవాలి. మనశక్తిని పెంచుకోవాలె."

"పెరుగుతాదుండి ఈ రామయ్య వంటోడుండంగ మళ్లీ తుపాకి పట్టాల్నేమో?"

"ఒక్కరోజులో ఏదీ రాదు. ఆకాశంనుంచి ఊడిపడదు. ప్రజలు తమ శక్తిని గుర్తించేట్లు చేయాలి. ప్రజాశక్తి విజృంభించిందా పరమాత్ముడైనా దిగిరావాల్సిందే! మన వీరులు మనకు ఉత్తేజం కలిగిస్తారు."

వీరభద్రం అమరవీరులను గురించి చెపుతూ ఊరూరికి తిరిగాడు. ప్రజలందరిలో ఏదో ఒక చైతన్యం కలిగించాడు. రానున్న కాలంలో వెలుగుందని బోధించాడు. రానున్న వెలుగునే మనసుల్లో నింపుకున్నారు ప్రజలు. ఆ వెలుగులో తమను చూచుకున్నారు. అమరవీరులను చూచారు. అమరవీరుల దినం కనులపండువుగా జరుపుకోవడానికి కృతనిశ్చయులైనారు.

ఎదిరిచూచిన రోజు రానేవచ్చింది.

ఊరంతా పండుగ పసిడి పులుముకొంది.

ఇండ్లన్నీ అలికి ముగ్గులు పెట్టుకున్నారు. తోరణాలు కట్టుకున్నారు. వీధుల కేదో కొత్త అందం వచ్చింది. ప్రజల్లో ఏదో ఆనందం తొంగి చూచింది. ఉదయం పాటలు పాడుతూ ఊరంతా తిరిగారు యువకులు. అసలు సంరంభం సాయంకాలం మొదలైంది.

ఊరుబయట సభ ఏర్పాటయింది.

ఊళ్ళోనుంచి ఊరేగింపు బయలుదేరింది. ముందు డప్పులు, కొమ్ములు సాగాయి. వెనుక నడచిన జనం పాటలు పాడుతున్నారు. ఆడవారు గుంపులు గుంపులుగా వస్తున్నారు. నినాదాలు చేస్తున్నారు. జనం ప్రవాహంగా సాగిపోతూంది. సభాస్థలికి చేరింది.

సభాస్థలం రమ్యంగా అలంకరించబడింది. వేదికకు బంతిపూల తోరణాలు కట్టారు. పెట్రొమాక్సులైట్లు వెలుగుతున్నాయి. మైకులో పాటలు వినవస్తున్నాయి. అనేక గ్రామాలనుంచి డప్పులు, తప్పెటలతో ఊరేగింపుగా వచ్చి సభాస్థలానికి చేరుకుంటున్నారు. సభాస్థలం జనార్ణవం అయిపోయింది. నగరంనుంచి వచ్చిన నాయకులతో మంగమ్మ, వీరభద్రం మాట్లాడుకుంటున్నారు. కార్యక్రమం ప్రారంభం అయింది. వీరభద్రాన్ని సభకు అధ్యక్షత వహించాల్సిందని కోరాడు మస్తాన్.

సభలో కరతాళ ధ్వనులు మ్రోగాయి.

వీరభద్రం అధ్యక్షత వహించాడు.

మంగమ్మ సహితంగా పెద్దలంతా వేదికమీద కూర్చున్నారు.

వీరభద్రం కొత్త దొరలను గురించి మాట్లాడాడు. "ప్రభుత్వం దొరలను, కొత్త దొరలను నమ్ముతూంది. ప్రజలను వారికి ఒప్పగించి పరాకు చిత్తగించింది. దొరలు కల్లు, సారాయిని ఆశ్రయంగా చేసుకున్నారు. దుండగులను పోషిస్తున్నారు. దుండగులు ప్రజలను నానాహింసలు పెడ్తున్నారు. వారు నేరాలు చేస్తున్నారు. మంది మీదవేస్తున్నారు. దొరలే మళ్ళీ ప్రభుత్వానికి ఏజంట్లయినారు. వారే హుకూమత్ సాగిస్తున్నారు. మొన్నటి తుపానుకు కొంపలు కూలినవారు ఏడుస్తుండగా వారికోసం ప్రభుత్వం ఇచ్చింది ఈ ఏజెంట్లు స్వాహా చేశారు."

"అవు! రామయ్య డబ్బు తిన్నడు" అనే కేకలు సభలోంచి వినిపించాయి.

"పేదల కొంపలు కూలుతున్నాయి. కాదు కూలుస్తున్నారు. దొంగ సొమ్ముతో బంగళాలు కడ్తున్నారు. దోచుకుంటున్నారు. ఆడదాని శీలం సైతం వారికి లెక్కలేదు" మంగమ్మ కాస్త ఉద్రేకంగా మాట్లాడింది.

ఉపన్యాసాల తరువాత బుర్రకథ జరిగింది. సభా కార్యక్రమం ముగిసే వరకు అర్ధరాత్రి అయింది.

ఇంకా సభ జరుగుతుండగానే ఉరికి వచ్చాడు యాదగిరి రామయ్య ఇంటికి. తనుస్తూ చెప్పాడు "అందరు నిన్ను తిడ్తున్నరు. గుడిసెలకోసం ఇచ్చిన డబ్బు మింగినవట. కక్కిస్త మంటున్రు."

"కుక్కలు శాన మొరుగుతయి! శాన బుగులు పడ్తున్నట్లున్నవు. ఇదో. గ్లాసు గటగటా మింగు" అని గ్లాసు అందించాడు.

యాదగిరి వెర్రిగా రామయ్యను చూచాడు. గ్లాసు కాళీచేసి దగ్గాడు.

"ఏదో గడబిడ అయ్యేటట్లున్నది, మంది ఉడికి పోతాన్రు"

ఈ తడవ జంకాడు రామయ్య.

'ఏమను కుంటాన్రక్కడ?'

"ఏమంటా న్లేందుండి. దొరల్ను దొంగలంటాన్రు. గుడిసెల డబ్బు మింగిన వట. సర్కారుకు గుంజి కక్కిస్తనంటాండ్ను వీరభద్రం."

రామయ్య గుండెలో మరికాస్త భయం చేరింది. వీరభద్రం శాసనసభలో లేవ దీస్తాడేమో ఈ విషయం. కలెక్టరుకు తాను అంగుష్టాలు వేసిన రశీదులిచ్చి డబ్బు తెచ్చాడు. వాస్తవంగా ఎవరికీ ఇవ్వలేదు. జనం ఇంత తెలివి మీరారను కోలేదు. కాక వీరభద్రం మళ్ళీ ఈ ఊరికి వస్తాడనుకోలేదు. మంగమ్మను వెంటపెట్టుకొని పబ్లిగ్గా వచ్చాడు. సిగ్గులేని వాడిని ఏమంటే ఏంలాభం? అసలు వీరభద్రం ఎన్నిక కావడమే తన ప్రాణం మీదికి వచ్చింది. తాను ఏమీ చేయ లేకపోతున్నాడు. చేతులు ముడుచుకొని కూర్చోవాల్సి వచ్చింది. ఆలోచనలో మునిగి ఉండగా శేషయ్య వచ్చాడు.

'అబ్బ! మంగమ్మ ఏం మాట్లాడిందుండి. ఏం......"

"ముయ్ నోర్! ఎళ్ళు ఈడినుంచి" కేక పెట్టాడు రామయ్య.

నిర్విణ్ణుడై చూచాడు శేషయ్య. లాంతరు వెలుగులో కూడా కోపాన్ని వ్యక్తం చేస్తున్నాయి రామయ్య కళ్ళు.

"నేనేమన్ననుండి? నామీద గరమైతరు" అన్నాడు. అక్కణ్ణుంచి కదల్లేదు.

"ఆ ముండను మెచ్చుకుంటావు. సర్లే కూచో. ఆడ ఏమైందో చెప్పు."

'ఎందుకు లేరి. మీరు గరమైతరు' అని కూర్చున్నాడు శేషయ్య.

"అట్లకాదు. ముండమోసింది కడుపు చేసుకొనె. పోరణ్ణి కనె. దాన్నేమొ వీరభద్రం చేసుకున్ననంటాండె. దాన్నేమొ నువ్వు మెచ్చుకుంటుంటివి. ఎట్లుంటదం టవ్" అడగనైతే అడిగాడు కాని గుండె కెలికింది రామయ్యకు.

'ఏమో నాకెందుకు లేరి. సభ శానబాగ జరిగిందుండి. ఊరంతా ఆడనే ఉన్నదనుకోరి-నువ్వు తప్ప. అబ్బ జగ్గయ్యను, చచ్చినోళ్ళను ఏం పొగిడిన్రుండి లీడర్లు. ఎరకలేక అడుగుత వీరభద్రం ఖానూన్లు చేస్తడట కాదుండి.'

'చేస్తడు పిడకలు. సర్కారుకు మన దొరంటేనే నమ్మిక. ఎన్నికైెండుగదా అని ఊరుకుంటాండు. మల్లగెలుస్తడేమో చూస్త. సర్లేగని ఆటకెవడన్నా వచ్చిండా ఇయ్యాళ!'

'ఆటకెవడొస్తడుండి? ఊరంత అడనే ఉండె'

'కల్లు సార దుకాణాలుకూడా బందేనుండి. ఒక్కడు రాలేదంటే తాగటానికి' యాదగిరి చెప్పాడు.

రామయ్య ఆలోచనలో పడిపోయాడు. యాదగిరి, శేషయ్య గ్లాసులు కాళీ చేస్తున్నారు.

నిశ్శబ్దంగా గడిచింది కొంతకాలం.

రామయ్యలేచి నుంచున్నాడు. 'యాదగిరీ రేపు జగ్గయ్య పేరుమీద ఊరందరికీ సార పోయి. రేపు కల్లు సారా దుకాణాల్లో అమ్మకం బంద్. తాగినంత తాగనియ్ గాడ్దికొడుకులు' అని ఆజ్ఞాపించి చరచరా లోనికి వెళ్ళిపోయాడు రామయ్య.

వెళ్ళిపోతున్న రామయ్యనుచూస్తూ వుండిపోయారు యాదగిరి, శేషయ్య. తరవాత ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. సీసా ఖాళీ చేసి మెట్లుదిగారు. 'జగ్గయ్య వంటి వీరుడు జగాన లేడయ్యా' అని పాడుకుంటూ ఒకరి భుజం మీద ఒకరి చేయివేసుకొని తూలుతూ సాగిపోయారు.

అప్పటికి అర్థరాత్రి దాటింది. ఊరు నిర్మానుష్యంగా ఉంది. కుక్కలు అక్కడక్కడా మొరుగుతున్నాయి. చింతచెట్టుమీద పెద్ద పిట్ట అరుస్తుంది. ఊరి బయటినుంచి నక్కల ఊళలు వినిపిస్తున్నాయి.

రామయ్య గదిలో అడుగుపెట్టాడు. సుమతి నిద్రపోతూంది. రామయ్య సుమతిని చూశాడు. మనసు కలుక్కుమంది. ఏదో అనుమానం భూతంలా మనసులో చేరింది. సుమతి కడుపుతో ఉంది. అందుకు కారకు లెవరు? తానేనా? ఏమో! ఎందుకు అనుమానం? ఆ రాత్రి ఆవిడెందుకు వాంతి చేసుకుంది? అప్పటికే కడుపుతో ఉందా సుమతి? ఏమో! ఎవరికి తెలుసు? ఎన్నిసార్లు అడుగుదా మనుకున్నాడు తాను? ఏమిటా పిచ్చి? అడిగితే చెప్పుతుందా ఆడది? ఇంకెంతకాలం? రహస్యం దాగుతుందా? ప్రసవిస్తే తెలియదా? ఓపిక పట్టడం మంచిది. అవును ఓపిక పట్టడం మంచిది.

ఆ నిర్ణయం కొంత శాంతి నిచ్చినమాట వాస్తవం కాని వెంటనే మంగమ్మ అనర్గళంగా మాట్లాడిందనే మాటలు స్ఫురణకు వచ్చాయి. మంగమ్మ! మంగమ్మకు కొడుకు కలిగాడు! వాడు వాస్తవంగా తన కొడుకు. ఆ ధ్యాస వచ్చేవరకు అతనిలో ఏదో వేదన మొదలైంది. వాడు తన బిడ్డ! తనకు దూరంగా ఉన్నాడు. తన బిడ్డడు అని కనీసం చెప్పుకోలేకుండా ఉన్నాడు.

ఆ ఆలోచనతోపాటే మంగమ్మ గుర్తుకు వచ్చింది. మంగమ్మ తనమీద పగ తీర్చుకోవడానికి చూస్తుంది. ఊరువదలి పోయిందిపోకుండా మళ్ళీ వచ్చింది సిగ్గు

లేకుండా. వీరభద్రాన్ని వెంటపెట్టుకొని వచ్చింది. పగతీర్చుకోడానికి గుడిసెల డబ్బు విషయం తెలుకుతూంది. అసలు వాళ్ళు వచ్చిందే ఇందుకు. పేరు మాత్రం జగ్గయ్య దినం. తాను చేసిన మోసం బయటపడదు కదా! అంగుష్టాలు తమవి కావంటారేమో ఊరివాళ్ళు. వీరభద్రానికి పెద్దపెద్దవాళ్ళు తెలుసు. తానేమైపోతాడు? ఏం చేయాలి? ఎలా చేయాలి! వీరభద్రాన్ని అంతమొందిస్తే! అమ్మో? వీరభద్రాన్నా!

రామయ్య గుండె దడదడలాడింది. వాస్తవంగా వీరభద్రాన్ని తాను చంపినట్లు వణికిపోయాడు. నోరు ఆర్చుకొనిపోయింది. సుమతిని లేపాడు. మంచినీళ్ళిమ్మన్నాడు. ఆమె ఇచ్చింది.

'ఏదన్నా ముచ్చట చెప్పు' అడిగాడు రామయ్య.

'ఇప్పుడేం ముచ్చట?'

'చెప్పరాదు'

'ఏం చెప్పమంటరు?'

'ఏదన్న'

'సభ బాగా జరిగిందంట కద'

'ఊఁ'

'మంగమ్మ బాగ మా...'

"సరే. ఇగ పండుకో. నీకు గూడ ఆ ముచ్చటె వచ్చినాది?"

సుమతి వెర్రిగా చూచింది. రామయ్య దుప్పటి కప్పుకొని కళ్ళుమూసుకున్నాడు. తానూ పడుకుంది. కళ్ళు మూసుకుంది-కాని నిద్ర రాలేదు.

ఇద్దరూ నిద్రపోలేదు.

అయినా తెల్లవారింది.

సారాయి సంతర్పణ వార్త అగ్గిలా పాకింది. ఎండ ఎక్కుదంలో ఆ వార్తకు వేడి వచ్చింది. 'జగ్గయ్యపేర సారా పోస్తుండట రామయ్య' ఊళ్ళో అదే ముచ్చట అయింది. తాగకముందే మత్తెక్కింది ఊరికి. జనం ఉదయంనుంచే గుంపులు గుంపులుగా చేరసాగారు దుకాణానికి. ఊరు సొంతం దుకాణం ముందు చేరింది. తొక్కిడి సాగింది. తోసుకోవడం సాగింది. తిట్టుకోవడం సాగింది. తన్నుకోవడం సాగింది. జగ్గయ్యను అంతా మరచారు. అంతా సారాయని భజించసాగారు.

వీరభద్రం మీద ఈ వార్త పిడుగులా పడింది. కార్యక్రమం ప్రకారం ప్రజ అంతా రామయ్య ఇంటికి వెళ్ళి గుడిసెల డబ్బును గురించి అడగాల్సి ఉండె. కాని జనానికిసారాయి మత్తు కల్పించాడు రామయ్య. మస్తాన్, మల్లయ్య పరిగెత్తుకొని వచ్చి చెప్పారు.

'మంది బద్మాషలున్నరుండి. వాడు సార పోయిస్తనంటె అటే ఉరుకుతాన్రు. ఒక్కడు వస్తలేడు.'

"నరకాల్నుండి గాడ్దికొడుకును. ఎంత పెద్ద ఎత్తేసిండు" అన్నాడు మస్తాన్.

"వాణ్ణంటె ఏం లాబముండి మందికి బుద్ధిలేక పాయె. మందిమీద పడి దోచుక తినెటోడు ఇన్ని సారనీలు పోస్తననంగనే ఉరికిరి" అన్నాడు మస్తాన్.

"ఎంత ఘోరం! ఈ అన్యాయాన్ని ఎదిరించాలె. నేను వెళ్ళి ఊరంటరికీ చెప్పుత" మంగమ్మ పులై లేచింది. నడుం కట్టి సిద్ధం అయింది.

వీరభద్రానికి ఏమీ తోచలేదు. వెర్రిగా చూడసాగాడు. ఏదో ఆలోచనలో పడిపోయాడు.

'నడవండి' అన్న మంగమ్మ మాటలు అత న్నీ లోకంలోకి తెచ్చాయి.

'లాభంలేదు. ప్రజలు మైకంలో వున్నారు. వాళ్ళు మనం చెప్పుతే వినరు. మత్తు దిగింతర్వాత గాని వారికి అర్థంకాదు. మరొక దెబ్బ తగిలినప్పుడు గాని వారు కోలుకోరు. ఇప్పుడు వారికి చెప్పడం వృధా - బాధపడుతూ ఇక్కడే కూర్చోవడం మేలు" అన్నాడు వీరభద్రం. అతని ధ్వనిలో ఏదో నిరాశ ఉంది. ఓటమి ఉంది.

'అయితే గాజులు తొడిగించుకోవాలె. మంగమ్మ ఉద్రేకంగా అన్నది. వీరభద్రం ఆమెను చూచాడు. కళ్ళ రక్తం కక్కుతున్నాయి. 'ప్రజలు అమాయకులు. ఆశాపరులు. తెలియచెప్పటం మన విధి. మీరు ఇంట్లో ఉండండి మేం వెళ్ళివస్తాం. అని బయలుదేరింది. మస్తాన్, మల్లయ్యా ఆవిడ వెంట సాగారు.

వీరభద్రం వాళ్ళను చూస్తూ గుమ్మంలో నుంచున్నాడు.

ముగ్గురూ సాగిపోయారు.

వీరభద్రం నిట్టూర్చి వెనక్కి వెళ్ళి మంచంలో కూలబడ్డాడు.

* * *

యాదగిరి, శేషయ్య వీరుల్లా వచ్చారు సారాయి దుకాణానికి. వారిని చూచి జనం తప్పుకున్నారు. తాళాలు తీశాడు యాదగిరి. జనంలో కల్లోలం మొదలైంది. దుకాణంలోకి చొరబడ్డారు జనం. విరుచుకు పడ్డారు జనం. ఆ వత్తిడిలో సారాయి జాడీ బద్ధలైంది. సారాయి ప్రవహించింది. జనం దానిమీద పడ్డారు. నేలమీద పడ్డ దాన్ని కతుకసాగారు. ఊరి జనమంతా గదిలో పట్టలేదు. బయటవారు లోనివారిని లాగుతున్నారు. తిడుతున్నారు. కొడ్తున్నారు. సారాయి వరద గుమ్మందాటి బయటికి వచ్చింది. దానిమీదపడి నాకసాగారు జనం. అది దొరక్క ఆరాటపడుతున్నారు కొందరు. దొరికినవారికి, దొరకనివారికీ యుద్ధం సాగింది. వీధి రణరంగంగా మారింది.

ఈ దశలో వచ్చాడు రామయ్య. 'అరే! ఎందుకురా కొట్టుకుంటరు. ఎందుకురా చస్తరు. జగ్గయ్య పేర సార పోయిస్తున్న, సభ చేస్తలేను! ఎంతన్న తాగుండి పోస్త, అందరు వరసలుగ కూచోండి.' అని యాదగిరికి, శేషయ్యకు ఆజ్ఞాపించాడు రామయ్య. యాదగిరిని చాటుగా పిలిచి సర్కారు సారాయి కాదు కాపుసారాయి పొయ్యమన్నాడు.

జనమంతా వీధిలో వరుసలుగా కూర్చున్నారు. కుండలతో సారాయి తెచ్చి వడ్డిస్తున్నారు. తాగుతున్న జనం రామయ్యను కీర్తిస్తున్నారు.

ఆ దశలో వచ్చింది మంగమ్మ అక్కడికి. జనాన్ని చూచింది. వాళ్ళ తాగుడు చూచింది. వారి కీర్తనలు విన్నది. దూరంగా రామయ్యను చూసింది. ఆమె రక్తం సలసల కాగింది. కేకలు వేసినట్లు మాట్లాడింది:

"నిన్న జగ్గయ్య దినం జరుపుకున్నం. రామయ్య బండారం బయటపెట్టాం. మీ పొట్టలు కొట్టి పెద్దోడైనోడు సార పోయిస్తున్నడు. సార మైకంలో అతడు చేసిన వన్ని మరిచిపోతున్నరు. అందుకే అతడు సార పోయిస్తున్నది. ఆ విషయం మీరు గ్రహించలేకున్నరు. సార వదిలెయ్యండి. అంతా కదలండి. రామయ్య బండారం బయటపడాలి."

జనంలో కాస్త కలవరం ప్రారంభం అయింది.

"గుడిసెల డబ్బు మింగిండు, సార పోయిస్తున్నడు" మస్తాన్ అరిచాడు.

'మందికి కడుపు చేసుకున్న ముండ మహానీతులు చెప్పుతాంది' జగ్గయ్య మీద భక్తి ఉన్నదైతే మందికి కడుపెందుకు చేసుకున్నది?' రామయ్య గట్టిగా అరచాడు.

'మందికి కడుపు చేసుకున్న ముండ' యాదగిరి, శేషయ్య అరిచారు.

జనమూ కొందరు అరచారు. ఎక్కణ్ణుంచో ఒకరాయి మంగమ్మ దాకా వచ్చి పడ్డది.

మల్లయ్య ఉద్రేకం పెరిగింది. 'రాళ్ళ కొడ్తాను. రాళ్ళ కొడ్తాను' అని కేకలువేసి శేషయ్యమీదికి ఉరికాడు.

జనంలో కలోలం లేచింది.

మంగమ్మమీద రాళ్ళవర్షం కురిసింది.

జనంలో కొందరు సీసాలందుకొని పరిగెత్తారు ఇండ్లకు. కొందరు మరింత సారాయికోసం దుకాణంమీద పడ్డారు. కొందరు రాళ్ళనుచూసి పారిపోయారు. మిగిలిన వాళ్ళు తమలో తాము పోట్లాడుకున్నారు.

మంగమ్మ తలకు బలంగా రాయితగిలింది. సౌద సౌదా రక్తం కారింది. ఆమె కెవ్వన కేకపెట్టింది. ఎక్కడి వారక్కడ పారిపోయారు. గప్ చిప్ సాంబారు బుడ్డి. ఎక్కడి దొంగలక్కడే నక్కారు. మిగిలింది ముగ్గురే. వార్త తెలిసి పరిగెత్తుకొని వచ్చాడు వీరభద్రం. మంగమ్మను తీసికెళ్ళి తలకు కట్లుకట్టారు.

బాబు కేర్ మని ఏడ్చాడు.

మంగమ్మ పాపను ఒళ్ళోకి తీసుకుంది. వలవలా ఏడ్చింది.

ఓదార్చాడు వీరభద్రం. ఓదార్పు మరింత ఏడ్పించింది. బాబు ఏడ్చాడు. మంగమ్మ ఏడ్చింది. ఓదారుస్తున్న వీరభద్రం కళ్ళు చెమ్మగిల్లాయి. మల్లయ్య, మస్తాన్ కన్నీరు కార్చారు.

'మన సభ ఏమైనట్లు?' అడిగాడు మస్తాన్.

'సభకంటే సారాయి ఎక్కువోలె ఉన్నది' అన్నాడు మల్లయ్య.

వీరభద్రం నిర్విణ్ణుడై చూచాడు.

మంగమ్మ చకితురాలై చూచింది.

బాబు ఇంకా ఏడుస్తూనే ఉన్నాడు.

ఆ రాత్రి రామయ్య సంబరాలు చేసుకున్నాడు. యాదగిరి, శేషయ్య తందనాలాడారు.

తెల్లవారి వీరభద్రం కలెక్టరు దగ్గరికి వెళ్ళాడు. పేదలకు అందాల్సిన డబ్బు రామయ్య మింగాడని చెప్పాడు. కలెక్టరూ కాస్త తికమక పడ్డాడు. ఫైలు తెప్పించి చూశాడు. అన్నీ సక్రమంగానే ఉన్నాయి. డబ్బు అందరికీ అందినట్లు రశీదులూ ఉన్నాయి.

'ఇవన్నీ దొంగ రశీదులు. కొంపలు కూలినవారు డబ్బు అందలేదంటున్నారు' అన్నాడు వీరభద్రం.

'అందలేదంటే మేమేం చేయగలం? రశీదు లున్నాయి. మాకు కావలసింది. అవి.'

'అయితే మీరేం చేయలేరు?'

'మాకు అధికారాలు అంతవరకే వున్నాయి'.

'మీ అధికారం రశీదుల వరకేనా? ప్రజలకు అందాల్సిన సొమ్ము మింగి. సారాయి సంతర్పణలు చేస్తుంటే మీరేం చేయలేరా?'

'రూల్సు ప్రకారం చేసేవాణ్ణి మేమేం చేయగలం చెప్పండి? ప్రభుత్వం అంటే రూల్స్ రూల్స్ రూల్స్. రూలు లోపల మీరేం చేసినా మాకు అభ్యంతరం లేదు, రూలు దాటితే అది దాటినట్లు ఋజువైతేనే మేమేమైనా చేయగలిగేది. అయినా మీరు అసెంబ్లీలో లేవతీయకూడదూ?'

'అవును అంతే చేయాలి' అని లేచిపోయాడు వీరభద్రం.

అన్నట్లుగానే అసెంబ్లీలో నోటీసిచ్చాడు. మూడు నెలల తరువాత జరిగిన అసెంబ్లీ సమావేశంలో ఆ ప్రశ్న వచ్చింది. అన్నీ సక్రమంగానే జరిగాయని మంత్రి గారు సమాధానం చెప్పారు. ప్రతిపక్షాలవారు విచారణ జరిపించాలని ఏకగ్రీవంగా కోరారు. విచారణ జరపడానికి కలెక్టరును నియమించినట్లుగా ప్రభుత్వం ప్రకటించింది. దీనిని ప్రతిపక్షాలవారి ఘన విజయంగా పత్రికలు ప్రకటించాయి.

* * *

బలరామయ్యకు తల తెగినట్లయింది-తాను ఓడినందుకు కాదు - వీరభద్రం నెగ్గినందుకు. అతని గెలుపు తమ అధికారానికి గొడ్డలిపెట్టులా అనిపించింది. అయినా ఏం చేయలేక విలవిల్లాడాడు. అసలు ఈ ఎన్నికలలోనే లోపం ఉందనీ ఎన్నికలు రద్దు చేయాలనీ అందామనుకున్నాడు. అన్నాడు కూడా కొందరితో.

మన రాజ్యాంగంలోనే ప్రజాస్వామ్యం ఉందని, అలా అనకూడదనీ వారికి సలహా ఇవ్వబడింది. అనగూడదు కాని అలగా జనమంతా అధికారంలోకి వస్తుంటే వారికి మండుతూంది. ఒక్కడూ దొరతనం చేసినవాడు కాదు. ఏ పొలం దున్నుకునేవాడో కూలిచేసుకునేవాడో ఎన్నిక అవుతే తాను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవాలా? తోటి దొరలు కొందరు ఎన్నికయినారు. మంత్రులుకూడా అయినారు. తాను ఎందుకూ పనికిరాని వాడైనాడు. ఏం చేయాలో అర్థం కాలేదు. తాను చలాయించిన అధికారం మాయమైపోయింది. తనను అడ్డిన వాడెవడు? అడిగిన వాడెవడు? తన ఊరికి తాను రాజు. ఊళ్ళో మనుషులున్నారని తానెప్పుడూ భావించలేదు. అంతా పురుగుల్లా ప్రవర్తించారు. తనకు నచ్చనివాణ్ణి పురుగును చంపినట్లు చంపే శాడు. అంతా తన అడుగులకు మడుగులొత్తారు. అవునన్నది ఎవడూ కాదనలేదు. తాను వలచింది తన ఇంటికిరాక మానలేదు. అప్రతిమానమైన ప్రభుత్వం చలాయించాడు తాను. వీరభద్రం అక్కడ పుట్టిన పురుగే! పులియైనాడు - తుపాకిపట్టి తనను బెదిరించాడు. ప్రాణాలు అరచేతులో పెట్టుకొని పారిపోయాడు తాను. ఆ తరువాత అంతా అంధకారం. వీరభద్రం తన భూములు పంచాడు. తనను బికారిని చేశాడు. మళ్ళీ తన ఊరు చూడననుకున్నాడు. భార్య పోయింది. కొడుకును పొట్టన పెట్టుకున్నారు. మళ్ళీ ఏదో వెలుగు కనిపించింది. తాను ఊరికి వచ్చాడు. అధికారం నిలబెట్టుకోవడానికి ఖద్దరు కట్టాడు. అధికారం విస్తృతంగానే తన చేతికి అందినట్లయింది. వీరభద్రం పట్టుబడ్డాడు. తన పీడ విరగడ అవుతుందనుకున్నాడు. కాని వీరభద్రం విడుదలైనాడు. అప్పుడే అనుకున్నాడు తాను ఈ విధానంలో ఏదో లోపం ఉందని. కాని ఎన్నికలు చూసి ఆశపడ్డాడు. డబ్బు చిమ్మాడు. అయినా ఓడిపోయాడు తాను-కాదు వీరభద్రం నెగ్గాడు!

వీరభద్రం నెగ్గడంతో విచారం పట్టుకుంది బలరామయ్యగారికి. మానసికంగా క్రుంగిపోయాడు. మంచం పట్టాడు. అతని మంచం చుట్టూ ప్రభుత్వం చేరింది. అతనిని ఓదార్చింది. అతనికి కావలసింది మందు కాదు. అధికారం. అతనికి అధికారం ఇవ్వడానికి ప్రభుత్వమూ తహతహ లాడింది. అయినా మార్గం కనిపించలేదు. పార్టీకి అధ్యక్షునిగా ఉండమన్నారు. తనకు అనుభవం లేదని ఉండననీ అన్నాడు బలరామయ్య. అతని అనుయాయులు పట్టుపట్టారు. అందువలన అంగీకరించక తప్పలేదు.

బలరామయ్య అధ్యక్షుడైంది ఆస్పత్రిలోనే. సమావేశానికి ఆయన హాజరే కాలేదు. అయినా అధ్యక్షుడైనాడు. సమావేశంలో ప్రతిపాదించబడింది. ఒక్క బలరామయ్య పేరు మాత్రమే కాదు. కాని ముఖ్య మంత్రిగారు జోక్యం కలిగించుకొని మిగతా పేర్లు ఉపసంహరించుకునేట్లు చేశారు. కొందరిని బెదిరించడం కూడా జరిగిందని వదంతులు వ్యాపించాయి. మొత్తంమీద బలరామయ్య ఏకగ్రీవంగా ఎన్నిక అయినారు. ఆ వార్తతో ఆస్పత్రి నిండిపోయింది. బలరామయ్యగారి గది

పూల దండలతో పూడిపోయింది. నగరంలోని పెద్దలంతా ఆస్పత్రికే చేరారు. దాంతో బలరామయ్య ఆస్పత్రి వదిలారు. ఒక పెద్ద కార్ల వూరేగింపుతో వారు ఇల్లు చేరుకున్నారు. ప్రభుత్వం ఆ రాత్రి బలరామయ్య ఇంట్లోనే విందు కుడిచింది.

తెల్లవారి పత్రికల్లో బలరామయ్య పటాలు ప్రచురించబడ్డాయి. వారి జీవిత విశేషాలు వివరంగా ప్రచురించారు. వారు చేసిన దేశసేవను ఘనంగా కీర్తించాయి పత్రికలు. వారు కొంతకాలం గాంధీజీ ఆశ్రమంలో గడిపారని ఒక పత్రిక రాస్తే, గాంధీజీ స్వయంగా వారిని ఆశీర్వదించారని వేరే పత్రిక రాసింది. దాంతో బలరామయ్య జబ్బు పారిపోయింది. బలం పుంజుకున్నాడు. అయినా డాక్టర్లు ఆయన్ను వదలడంలేదు. వారు రోజూ పరీక్షిస్తూనే ఉన్నారు. సూదులు గుచ్చుతూనే వున్నారు.

బలరామయ్య అధ్యక్షుడయిం తరువాత అతని ఇంటికి ఒక జాతర సాగింది. వచ్చే పోయే వారితో ఇల్లు కలకలలాడింది. ఉద్యోగాలు, బదిలీలు, ప్రమోషన్లు, పర్మిట్లు, పరిష్కారాలు, వీటన్నింటికీ ఆ ఇల్లు విపణివీధి అయింది.

దొరలంతా బలరామయ్యను బలపరచారు. దొరలు కానివారు ప్రభుత్వంలో ఉండరాదని రహస్యంగా పనిచేయసాగారు. శాసన సభ్యులను ఖరీదు చేశారు. అక్కడి బలం తలక్రిందు చేశారు. పార్టీ చెప్పినట్లు ప్రభుత్వం వినాలన్నారు. మంత్రులను మార్చాలని ఆదేశించాడు బలరామయ్య. ముఖ్యమంత్రి మండిపోయాడు. అతడే అధ్యక్షుణ్ణి చేసింది బలరామయ్యను! అతనిమీదనే సవారి చేస్తున్నాడు! బలరామయ్యను పదవి నుంచి తొలగించే ప్రయత్నం చేశాడు ముఖ్యమంత్రి. కాని సఫలీకృతుడు కాలేకపోయాడు. దాంతో వేరే పార్టీ పెట్టి తనదే అసలు పార్టీ అన్నాడు. రాష్ట్రమంతటా ఉభయపార్టీలకూ హోరాహోరీ పోరాటాలు జరిగాయి. అసలు ప్రభుత్వపక్షం క్షీణించి ప్రతిపక్షాలు బలపడే దశ వచ్చింది. అప్పుడు ఢిల్లీలో నాయకులు మేల్కొన్నారు. ఉభయులనూ అక్కడికి పిలిపించారు.

బలరామయ్య ఢిల్లీ ప్రయాణం రోజు, ఉదయాన పత్రిక చదువుకుంటూ వాలుకుర్చీలో కూర్చున్నారు. నమస్కారం అనే పదం విని పత్రిక మడిచి చూశారు. ఒక అమ్మాయి కనిపించింది. ఆమె అందంగా ఉంది. వయసులో ఉంది. అలా చూస్తూ ఉండిపోయాడు బలరామయ్య. రెప్పనైతం వాల్చడం లేదు.

ఆమె సిగ్గు పడ్డింది. తల వంచుకుంది.

'నమస్కారమండీ'

ఆ ధ్వని విని లోకంలోకి వచ్చాడు బలరామయ్య.

'కూచో' అని కుర్చీ చూపించాడు.

'అక్కరలేదండీ. నా పేరు సరస్వతి'

'ఎందుకు వచ్చినవు?'

ఎన్నో చెప్పుకుందా మనుకుంది సరస్వతి. కాని ఏమీ చెప్పలేక పోయింది. 'ఉద్యోగమేమన్న చూపుతారేమోనని....'

'చదువుకున్నవా?'

'బి.ఎ. వరకు చదివానండి'

'అంగ్రేజు బాగ వస్తదా?!'

'వస్తుందండి'

'నాకు సెక్రటరీ కావాల్ననుకుంటున్న. ఉంటనంటె ఉంచుకొంట. ఏరే కొలువులు ఇప్పట్ల దొరికెటట్లు లేవు, ఏమంటవ్'

'మంచిదండీ. ఎప్పటినుంచి చేరమంటారు?'

'ఇయ్యాళనుంచే చేరు. నేను ఢిల్లీ పోతున్న పొద్దుగూకె యాళ. నా ఎంబడి రావాలె, ఉత్తరాలు గిన జర అంగ్రేజులో వ్రాసి పెట్టాలె. ఏమంటవ్?'

'వస్తానండి. సాయంకాలం రమ్మంటారా?'

'పగటిపూట రా. జర కాగితాలు గిన చూడాలె'

'అట్లనే. వస్తానండి' అని వెళ్ళిపోయింది సరస్వతి.

మధ్యాహ్నానికి వచ్చింది సరస్వతి. ఈ తడవ ఆప్యాయంగా పిలిచారు బలరామయ్యగారు.

'ఎవ్వరు లేరా నీకు?'

'అందరూ పోయారు. ప్రస్తుతం ఎవ్వరూ లేరు' అని కంటతడి పెట్టింది సరస్వతి.

ఏం మాట్లాడాలో అర్థంకాలేదు బలరామయ్యకు.

'భోజనం చేసినవా?' అడిగారు.

'సర్లె కూచో' అని కొన్ని కాగితాలు తెచ్చి ముందరేశాడు. 'ఇయన్ని చదువు, జవాబు రాయాలె. నువ్వే రాయి. మరి నా ఎంబడి ఢిల్లీ రావాలె, తయారుగున్నవా? బట్టలు గిన తెచ్చుకున్నవా? నేను జర ఆరామ్ చేస్త' అని లేచాడు బలరామయ్య.

'మంచిదండీ' అని కుర్చీలోంచి లేచిన సరస్వతి బలరామయ్య నిష్క్రమించగానే కూర్చొని ఉత్తరాలు చూడసాగింది. అన్నీ మామూలు ఉత్తరాలే. దేశం నలుమూలలనుంచి వచ్చాయి. కొన్ని బలరామయ్యను పొగుడుతూ వ్రాసినవి. కొన్ని అతనితో ఏదో పనివుండి వ్రాసినవి. ఒకటి సుదీర్ఘమైన ఉత్తరం ఉంది. దాంతోపాటు ఏవో కరపత్రాలు అవీ వున్నాయి. ఉత్తరాన్నీ, కరపత్రాలనూ చదివింది. వాటిలో ఏదో ఆసక్తి ఏర్పడింది ఆమెకు. అవి భూదానానికి సంబంధించినవి.

'హింస మనిషిని పశువుగా మారుస్తుంది. మనిషిని బాధించడం, మోషపెట్టడం మానవత్వ లక్షణాలుకావు. మనిషికి మనసు ప్రధానమైంది. మనసు మార్చడం అవసరం. మానవులంతా సమానులే, వారిలో కొందరు అదృష్టవంతులు. వారికి సంపద చాల ఉంది. భూమిలో చాలభాగం వారికే ఉంది. మానవులలో చాల

మంది దురదృష్టవంతులు. వారికి తిన తిండిలేదు. కట్ట బట్టలేదు. వారంతా దరిద్ర నారాయణులు. ఈ దరిద్ర నారాయణులు అదృష్టవంతులను చూచి సహించలేకపోతు న్నారు. వారి మీద తిరుగుబాటుచేసి వారిని హింసిస్తున్నారు. హింసకు ప్రతిక్రియ హింస. ఉభయ పక్షాలు హింసకు తలపడుతున్నాయి. దాంతో మానవత నశిస్తున్నది. శాంతి లోపించింది. కార్పణ్యమూ, ఈర్ష్య, ద్వేషం ఎక్కువయినాయి. మానవజాతిని ఈ హింసనుండి రక్షించాలంటే సంపన్నులలో ఔదార్యం పెంపొందాలి. వారు దరిద్ర నారాయణులను గుర్తించాలి. తమకు ఉన్నదానిలో కొంత పేదలకు పంచాలి. వారిని ఆదుకోవాలి. సంపన్నులు తమ ఆస్తికి తాము ధర్మకర్తలము మాత్రమే అనుకో వాలి. తమ సంపదనంతా దరిద్ర నారాయణులకు వెచ్చించాలి. అలా జరిగిన్నాడు రామరాజ్యం వెలుస్తుంది. శ్రేయోరాజ్యస్థాపన జరుగుతుంది.

తెలగాణంలో జరిగిన హింసాకాండ కంతటికీ మూలం భూమి. భూమినంత టినీ కొద్దిమంది ఆక్రమించుకున్నారు. భూమి లేనివారు ఉన్న వారిమీద తిరగబడు తున్నారు. భూమి ఎవరి సొత్తూకాదు. భగవంతుడు యిచ్చింది. కాబట్టి భూస్వాములు దాన్ని ఆక్రమించుకోవడం మంచిదికాదు. తమ భూమిని లేనివారికి పంచి ఇవ్వడం సబబు. మొత్తం భూమిని ఇవ్వగల ఉదారులు, ఉత్తములు. అలా కాకున్నా ఉన్న దానిలో కొంత దానంచేస్తే అది పేదలకు పంచబడుతుంది. దానం చేసిన వారికి ఇహ పర సౌఖ్యాలుంటాయి. అందుకే భూదానోద్యమం ప్రారంభించాం. తాము కొంత భూమిని దానంచేసి సహకరించగలరు.'

ఇది ఆ కరపత్రాల సారాంశం. సరస్వతి దానిని రెండు, మూడుసార్లు చది వింది. కరపత్రం ఆమె మీద ఏదో ప్రభావం వేసింది. సరస్వతికి తన గత జీవితం కళ్ళముందు కనిపించినట్లయింది. గతం వర్తమానంగా గబగబా తనముందు నుంచి పరిగెత్తుతున్న ట్లనిపించింది.

సరస్వతి తండ్రి విశ్వనాథం హైద్రాబాద్‌లో లెక్చరర్. అతడు ఉర్దూతో ఎం.ఏ. చేశాడు. ఉర్దూ అతని అభిమానభాష. కవితకూడా ఎంతో అందంగా చెప్పే వాడు. అతనికి పరిచయస్తుల్లో మహమ్మదీయులే ఎక్కువ. అతని జీవన విధానంలో కూడా మహమ్మదీయ సంస్కృతే గూడు కట్టుకుంది. 1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం రావడంతో, నైజాం నవాబు స్వాతంత్ర్యం ప్రక టించాడు. తన స్వాతంత్ర్య పరిరక్షణకు మహమ్మదీయ మతాన్ని ఆయుధంగా ఉపయోగించాడు. హైద్రాబాదు రాజ్యాన్ని దక్షిణ పాకిస్తాన్ చేయా లను కున్నాడు. ఖాసిమ్ రజ్వీని ఉసికొల్పాడు. రజాకార్ల దండు రాజ్యమంతటా వీర విహారం చేశాయి. ఈ హింసకు ప్రతిక్రియగా ప్రజలు మేల్కొన్నారు. సాయుధులై తిరగబడ్డారు. ఈ ఉప్పెన వచ్చింది ముఖ్యంగా విద్యార్థులలో. ఆ చైతన్యం నుంచి సరస్వతి దూరంగా ఉండలేకపోయింది. అందరితోబాటు ఆమెకూడా కాలేజీ వదిలేసింది. రహస్యదళాలతో సంబంధాలు ఏర్పరచుకుంది. బాంబులు తయారు

చేయడం నేర్చుకుంది. దాంతో తండ్రీ కూతుళ్ళకు కొంత బెడిసింది. అయినా విశ్వనాథానికి కూతురంటే ప్రాణమే. ఒక్కొక్కసారి అర్ధరాత్రిదాకా ఆమె వచ్చేదికాదు. విశ్వనాథ దంపతుల గుండెలు దడదడలాడేవి. ఏం ప్రమాదం సంభవించిందోనని వణికిపోయేవారు. కళ్ళల్లో వత్తులు వేసుకొని ఆమె వచ్చేదాకా ఎదిరి చూస్తుండేవారు. ఆమె రావడం ఆలస్యం అయితే విశ్వనాథం కాలుకాలిన పిల్లిలా తిరిగేవాడు.

ఆ కాలంలోనే సరస్వతికి వీరభద్రంతో పరిచయం అయింది. వీరభద్రం మాట్లాడుతుంటే నిప్పులు చెరిగేవి. అతడు లోకాన్నంతా మారుస్తానన్నట్లు మాటాడేవాడు. అతని ధోరణి సరస్వతికి ఎంతో నచ్చింది. వారు గంటల తరబడి మాటాడుకునేవాడు. పరిచయం ప్రణయంగా మారింది. ఏవేవో బాసలు చేసుకున్నారు. ఇద్దరూ భవిష్యత్‌ను గురించి బంగారుబాటగా కలలుగన్నారు.

ఒకనాడు వీరభద్రం అమాంతంగా మాయం అయినాడు. అండర్ గ్రౌండ్ లోకి పోయాడని తెలిసింది సరస్వతికి. ఏదో చేతికందిన స్వర్గం కూలిపోయినట్లనిపించిందామెకు. కొన్నాళ్ళు పిచ్చిపిచ్చిగా తిరిగింది. తరువాత మళ్ళీ కార్యక్రమంలో మునిగిపోయింది.

ఆనాడు ఉంట్లో పండగని ఉండమన్నాడు విశ్వనాథం సరస్వతిని. సరస్వతికి ఉండాలని లేకున్నా ఉండిపోయింది. తలంటి స్నానాలు వగైరా అయినాయి. ఏదో పుస్తకం చదువుతూ కూర్చుంది సరస్వతి. ఒక స్నేహితురాలు వచ్చింది. వీరభద్రం వచ్చాడు, ఎదిరిచూస్తున్నాడని చెప్పింది. సరస్వతి వెంటనే బయలుదేరింది. తలిదండ్రులు భోజనం చేసి పొమ్మన్నారు. భోజనానికి వస్తానన్నది. తాను వచ్చేదాకా భోజనాలు చేయవద్దని చెప్పి మరీ వెళ్ళింది.

సరస్వతి తల్లి వంటలో మునిగిపోయింది. రకరకాల పిండివంటలు చేసింది. కూతురుతో కలిసి భోజనం చేయాలనుకున్నారు దంపతులు. పొద్దు గడిచిపోతూంది. మధ్యాహ్నం అయింది. ఒంటిగంట రెండు, సరస్వతి రాలేదు. వంట ముగించి వచ్చి కూర్చుంది భార్య. విశ్వనాథం బయటికి వెళ్ళి చాలాసార్లు చూశాడు. సరస్వతి వస్తున్న జాడ కనిపించలేదు. భోజనానికి వస్తానని వెళ్ళింది, ఇంకా రాలేదు. విశ్వనాథం దంపతుల్లో ఆందోళన ఎక్కువైంది, చిరాకుపడ్డారు. తరువాత ఇద్దరూ భయం భయంగా ఒకరిని ఒకరు చూసుకున్నారు.

'పిల్ల జిమ్మేదారి లేకుండ తిరుగుతాంది సమజ్జవస్తలేదు. పొద్దాల పాయే. పత్త లేదాయె, మీరేమో గప్‌చుప్‌గుంటరు. జర గద్మాయించకుంటె ఎట్ల?' మాతృహృదయం పలికింది.

'సియాసత్ల తిరుగుతాండె. చెప్తనే ఉంటిని. దాని దిమాగ్‌కు ఎక్కుతలేదు. సర్కారేమో శాన సఖ్త్‌గున్నది. పిల్లేమో చెప్తే దిమాగ్‌ల ఉంచుతలేదు. ఏమ్‌చేత్తు, ఇయ్యాళ రానియ్యి, ఏదో ఒకటి ఫైస్లా చేస్త. అది చెత్ల ఉండెటట్టు లేదు' అన్నాడు విశ్వనాథం. అన్నాడేగాని అంత గట్టిగా కూతురును అనలేడనే విషయం భార్యకు

తెలుసు. ఎంతకూ సరస్వతి రాలేదు. ఇద్దరూ ఏదో ఎంగిలి పడ్డారు. బిక్కు బిక్కు మంటూ కూర్చున్నారు. ఒక్కతే కూతురు, ఆవిడా వారితో భోజనం చేయలేదు. వారి గుండెలు శూన్యంగా ఉన్నాయి. నిరీక్షణతో కళ్ళు పీక్కుపోయాయి. ఇంటిలో నిరాశ నిండిపోయింది. నిరామయంగా ఉంది. నిశ్శబ్దం ఆవహించింది. రెండు ప్రాణాలూ బిక్కు బిక్కు మంటున్నాయ్ ఆ ఇంట్లో. అయినా, సాయంకాలం అయింది. సూర్యునికి గుండెలేదు. ఉంటే ఆ ఇంటిమీదికి వచ్చి ఆగిపోయేవాడు.

ఆ సాయంకాలం నిజాం నవాబు మీర్ ఉస్మానలీఖాన్ మక్కా మసీదుకు వెళ్తున్నాడు. ఆ సాయంకాలమే కాదు ప్రతిసాయంకాలం మసీదుకు వెళ్తాడతను. అత నికి భక్తి మెండు. అదీ ప్రజలకే చిక్కు. నవాబు బయలుదేరాడంటే రోడ్లమీద రాక పోకలు బంద్. పోలీసులు వరుసగా రోడ్డుమీద నుంచుంటారు. విజిల్ మీద విజిల్స్, బాటంతా సాఫ్. నవాబు వచ్చే వైపు చీమసైతం ఉండరాదు. మరొకప్రక్కన జనం గోడలా నుంచున్నారు. మోటార్లు, సైకిళ్ళు, బస్సులు ఇతర వాహనాలు నిలిచి పోయాయి. అంతా ఆ వచ్చే వాహనంకోసం ఎదిరిచూస్తున్నారు. అది కాస్తా దాటిపోతే గాని వారు కదలడానికి వీల్లేదు.

పోలీస్ విజిల్స్ మోగుతున్నాయి. రోడ్లు కాళీ అయినాయి. కారు ఒకటి దాటి పోయింది. రెండవది వస్తూంది. అందులోనే నవాబు ఉండేది. అది సాగిపోతూంది.

'ధన్' మని పెద్ద ధ్వని అయింది.

'ధన్, ధన్' మరో రెండుసార్లు.

బాంబులు పేలాయి మూడు.

ప్రజల్లో కల్లోలం, పోలీసుల్లో కలవరం.

నవాబు కారు దాటిపోయింది. చావు తప్పింది. వెనుక కారుకు దెబ్బలు తగి లాయి. అందులోనివారు గాయపడ్డారు.

నవాబు మీద హత్యా ప్రయత్నం !!!

పోలీసులు పిచ్చికుక్కలైనారు. ప్రజల్ను చావబాదారు. రోడ్డు రణరంగం అయింది కల్లోలం చెలరేగింది. కేకలు-పెడబొబ్బలు, లాఠీలు, గందరగోళం.

'నేను బాంబు వేసింది' అని ముందుకు వచ్చాడొక యువకుడు. నేరస్థుడు దొరకడంతో పోలీసులు అతనిమీద పడ్డారు. దొరికినవాడొక్కడు పారిపోయినవారు ఇద్దరు.

ఆ ఇద్దరికోసం అన్వేషణ సాగింది. పోలీసులతోపాటు రజాకార్లు రాక్షసులై నగరంమీద పడ్డారు. కనిపించిన వాడినల్లా కొట్టారు, దోచుకున్నారు. విచ్చుకత్తులతో విచ్చలవిడిగా వీరవిహారం చేశారు.

ఆ రాత్రి విశ్వనాథం ఇల్లు ఉడికిపోయింది. సరస్వతి అప్పటికి ఇంటికి రాలేదు. క్షణం యుగంగా గడుస్తూంది దంపతులకు. పిచ్చి పిచ్చిగా చూస్తున్నాడు విశ్వనాథం. హత్యానేరంతో తనకూతురు ఉందేమోనని అతని అనుమానం. భార్య

అసలే గుండె పగిలి వుంది. తన సంశయం ఆవిడకు చెప్పదలచలేదు. లోపల్లోపల మసిలిపోతున్నాడు. సరస్వతి తల్లి విషయం చెప్పలేం. ఆవేదన మూర్తీభవించిందా అన్నట్లుంది. ఒకరి బాధ ఒకరికి వ్యక్తం కానివ్వరాదన్నట్లు ఉన్నారిద్దరూ.

'పిల్ల వస్తదా?' తల్లి గుండెను చీల్చుకొని వచ్చిన పదాలవి. అడగ్గూడదను కొని అడిగిన ప్రశ్న అది. ఆగకుండా వచ్చేసిన మాటలవి.

ఎలా జవాబు చెప్పాలో అర్థం కాలేదు విశ్వనాథానికి. తికమక పడ్డాడు. అతని మనసు ఏదో కీడు శంకిస్తూంది. సరస్వతికి ఏదో ప్రమాదం సంభవించిందని పిస్తూంది. అలా కాకూడదు అనుకుంటున్నాడు. అయినా అన్నాడు : 'రాకేం చేస్తది వస్తది. అన్నంపెట్టు మూడు కంచాల్లో, రాంగనే తిందాం'. అది భార్యకు పని కల్పించడానికి అన్నమాట. ఆమె మనసు మళ్ళించడానికి అన్నమాట - అయినా లేచింది శ్రీమతి. ఎక్కడో ఏదో ఆశ మిణుకు మిణుకు మంటూంది. వంటింటిలోకి పోయింది పీటలు వేసింది యంత్రవత్తుగా. పళ్ళేలు పెట్టింది, ఒక్కొక్కటే లెక్క పెట్టి అన్నీ వడ్డించింది. కూతురుకని ప్రత్యేకంగా ఎక్కువ వడ్డించింది. సరస్వతికి ఇష్టమైన వంటకాలు చేసిందా రోజు. వడ్డన ఎంతసేపు? బయటికి వచ్చింది. పతా కుగా 'వస్తరా!' అన్నది.

'గదేందీ. సరస్వతి రావద్దు' అన్నాడు విశ్వనాథం. మళ్ళీ ఏదో కీడు శంకిం చింది విశ్వనాథం మనసు.

'అవు. బిడ్డరావాలె. ముగ్గురం కూచుని తినాలె' అన్నది శ్రీమతి. ఆ మాట లేవో వెర్రిగా ఉన్నాయి. పిచ్చి పిచ్చిగా ఉన్నాయి. మనసు చలించినట్లున్నాయి.

కళ్ళప్పచెప్పి చూచాడు విశ్వనాథం.

అంతే! మళ్ళీ మౌనం-నిశ్శబ్దం. భయంకరమైన నిశ్శబ్దం. రెండు ప్రాణులు మిణుకు మిణుకు మంటున్నాయి. రెండు గుండెలు దడదడ లాడుతున్నాయి. నాలుగు కళ్ళు వెర్రి వెర్రిగా చూస్తున్నాయి.

వాతావరణం వెర్రిగా ఉంది. పిచ్చిగా ఉంది.

కాలం కారిపోతూంది.

'మనం తిందామా?' విశ్వనాథం ప్రశ్న.

'పిల్ల రానీయండి' శ్రీమతి జవాబు.

తలుపు తట్టిన చప్పుడైంది.

రెండు గుండెలకు రెక్కలొచ్చాయి.

పోతున్న ప్రాణాలు లేచివచ్చాయి.

'వచ్చే వచ్చే' విశ్వనాథం పరిగెత్తాడు.

శ్రీమతి అనుసరించింది.

తలుపు తీశాడు విశ్వనాథం.

పిడుగులవాన కురిసింది. దయ్యాలు ప్రత్యక్షం అయినాయి.

అది రజాకార్ల గుంపు. నగ్న కరవాలాలతో ప్రత్యక్షం అయినారు.

వారిని చూసింది శ్రీమతి. కెవ్వుమని కేకపెట్టి పడిపోయింది.

'కహాఁరే సరోసతీ. గద్దార్ కహీఁకా!' రజాకార్ల కేక.

నిర్వీణ్ణుడై నుంచున్నాడు విశ్వనాథం.

అతని నోటివెంట మాట రాలేదు.

'బోల్ కాఫిర్. కహాఁ ఛుపాయా?' అన్న కేకా కత్తిమెరుపూ, విశ్వనాథం డొక్కలో గుచ్చుకోవడమూ, కెవ్వున కేకపెట్టి,శ్రీమతిమీద పడిపోవడమూ క్షణంతో జరిగిపోయాయి.

నేల రక్తంతో నిండిపోయింది.

కాళ్ళూ చేతులూ కొట్టుకొని కేకపెట్టాడు.

మరో కత్తిపోటు.

చల్లబడిపోయాడు.

భర్త కేకవిని తెలివి వచ్చింది శ్రీమతికి.

భర్త శవం రక్తంలో మునిగి తనమీద పడివుంది.

ముందు రాక్షసులు కనిపించారు. పెద్ద కేకపెట్టి లేచి భర్తమీదపడి ఏడ్వ సాగించింది.

రజాకార్లు రెక్కలుపట్టి ఆమెను లేవనెత్తాను. 'చూపు సరస్వతి ఎక్కడుందో' అని ఉర్దూలో బూతులు తిడ్తూ ఆమెను ఇంటిలోకి లాక్కెళ్ళారు. ఆమె తనకు తెలియదని మొత్తుకుంటున్నా వినేవాడులేడు. ఆమె పయ్యెద జారిపోయింది. రెండు చేతులూ పట్టి లాక్కుపోతున్నారు. చీర వదులవుతూంది.

ఇల్లంతా తిప్పి ఆమెను వంటింట్లోకి లాక్కెళ్ళారు.

అక్కడ వడ్డించిన మూడు పళ్ళాలు కనిపించాయి.

దాంతో రజాకార్ల అనుమానం ఎక్కువైంది. రెచ్చిపోయారు. ఒకడు తుపాకి మడమతో తలమీద కొట్టాడు. రక్తం చారలై కారసాగింది. ఒకడు కత్తితో చేతిమీద పొడిచాడు. ఒకడు కర్రతో నడుంమీద కొట్టాడు. చీర ఊడింది. ఇద్దరు ఆమె రెక్కలు పట్టుకునే ఉన్నారు. చీర ఊడడంతో చండిక అయింది శ్రీమతి. ఇద్దరిని విదిలించి కొట్టింది. వారు పడిపోయారు. మూలకు ఉరికి రోకలి అందుకొని లంఘించింది. బట్ట ఉన్నదీ లేనిదీ గమనించలేదు. రోకలితో చండికలా వారిమీద పడింది.

ఆకలిగొన్న సింహంలా లంఘించింది. ఇద్దరి తలలు బద్దలు కొట్టింది. ఒకని నడుం ఎరగ్గొట్టింది. కానీ ఒక రజాకార్ కత్తి ఆమె డొక్కలో గుచ్చుకొంది. వడ్డించిన అన్నంలో పెనుకేకపెట్టి పడిపోయింది. పడిపోయింతరువాత కత్తులతోగుచ్చారు శ్రీమతిని. శ్రీమతి సరస్వతి పేరు పలుకుతూనే ప్రాణాలు విడిచింది. ప్రాణాలు విడిచే దాకా పొడిచారు రాక్షసులు.

వంట ఇల్లు సాంతం రక్తమయం అయింది.

చెదిరిపోయిన అన్నం రక్తంలో కలిసిపోయింది.

కూడు రక్తపుకూడు అయింది.

అయినా అంతటితో ఆగలేదు రజాకార్లు. ఇరుగు పొరుగు ఇండ్లమీదపడి దోచుకోవటం సరేసరి, విశ్వనాథం ఇంటికి కిర్సనాయిలుపోసి నిప్పంటించారు. సరస్వతి అందులో ఉంటే కాలి చస్తుందనుకున్నారు.

రెండు కళేబరాలనూ కాలుస్తూ మంటలు ఆకాశాన్ని అంటాయి. అవి చాలా కొంపల్ను పొట్టబెట్టుకున్నాయి.

కొంపలంటుకున్నప్పుడే తెలిసింది సరస్వతికి జరిగిన ఘోరం. ఉరుకుతానంది-ఛతికి చస్తానంది. కాని ఆమెను కదలనివ్వలేదు. ఆనాటి వాతావరణం అలా ఉంది. అందుకే ఆ రాత్రి సాంతం కన్నీరుమున్నీరుగా ఏడ్చింది. నాటిరాత్రి ఆమె గుండెలో రగిలిన దావాగ్ని ఎలాంటిదో ఎలా చెప్పడం?

తల్లీ తండ్రి ఘోరంగా చచ్చారు. తానిక్కడ ఒంటరి. కనీసం శవాలను చూడలేకపోయింది. కొంప తగలబడింది. ఆ మంట ఆమె మనసులో మండింది. ఆ దశలో హైద్రాబాదు వదలి వెళ్ళాల్సివచ్చింది. హైద్రాబాదులో ఉండడం ప్రమాదమని తేల్చారు ఆమె మిత్రులు. వేషాలు మార్చుకొని, సరిహద్దు దాటి నాగపూరుకు చేరింది సరస్వతి.

ఇంతకూ సరస్వతికి వీరభద్రం కనిపించలేదు. అతడు హైద్రాబాదుకు రానేలేదు. ఆవిడతో పనివుండి, ఆ నెపంతో పిలిపించారు ఆమె మిత్రులు.

సరస్వతి నాగపూరులో కొంతకాలం ఉంది. వీరభద్రం జాడ తెలియలేదు. ఎంతో ప్రయత్నించింది. విఫలురాలైంది. ఎక్కణ్ణుంచో గాలి వార్త అందింది. వీరభద్రాన్ని పట్టుకున్నారనీ, కాల్చేశారనీ. ఆ వార్త నిజానిజాలను గురించి ఆమె ఆలోచించలేదు. అమాంతంగా వార్ధా ఆశ్రమానికి వెళ్ళింది. అక్కడ ఆమెకు కొంత శాంతి లభించింది. అక్కణ్ణుంచి ఆమె బొంబాయి వెళ్ళింది. ఏదో ఉద్యోగం చేసింది. తరవాత హైద్రాబాదు రావాలనిపించింది. వచ్చింది. తమ ఇల్లు చూతామనుకుంది. వెళ్ళింది. అక్కడ ఇల్లున్న జాడ కూడా లేదు. జిల్లేళ్ళు మొలిచాయి ఆ స్థలంలోనే. కొంతసేపు కూర్చుంది, ఏడ్చింది. అక్కడి నేలకు దండంపెట్టింది. మన్ను తలకు రాసుకుంది. ఆ బస్తీలో ప్రతి ఇల్లూ చూస్తూ పోయింది.

అందరూ కొత్తవారే.

ఆమెను గుర్తించినవారు లేరు.

ఇంతలో ఎంత మార్పు! అనుకుంది సరస్వతి. ఇంక బొంబాయి వెళ్ళడం మానుకుంది. హైద్రాబాదులోనే ఉండిపోవాలనిపించింది. ఉద్యోగం కోసం బలరామయ్యను ఆశ్రయించింది.

టీ కప్పు టేబుల్ మీద పెట్టిన చప్పుడైతే ఈ లోకంలోకి వచ్చింది సరస్వతి. అప్పటికే కళ్ళు చెమ్మగిల్లి ఉన్నాయి. తుడుచుకుంది. టీ తాగింది. పక్కనేవున్న వాలుకుర్చీలో కూర్చుని ఉత్తరాలు చూడసాగింది. అన్నీ మామూలు ఉత్తరాలే. కొన్ని సిఫార్సుకు సంబంధించినవి, కొన్ని తగాదాలవి, కొన్ని పార్టీలవి. అన్నీ విడదీసి జాగ్రత్తగా టేబుల్ మీద పెట్టింది.

బలరామయ్య బయటికివచ్చి 'తయారుగున్నావా?' అని అడిగాడు.

ఆమె తల ఊపింది.

కారు కదిలింది.

విమానం ఎగిరింది.

వారు ఢిల్లీ చేరుకున్నారు.

ఢిల్లీ చలి కొంకర్లు పోయే చలి. చలి, ప్రాణాలు తీసేచలి. చలి. గడ్డకట్టుకు పోయే చలి, చలి. నిప్పుకు సైతం చలి. వీధుల్లో చలి, ఇండ్లలో చలి, ఆఫీసుల్లో చలి, అందానికి చలి, ఆనందానికి చలి. అయితే ఢిల్లీవాసులకు ఆ చలి అలవాటు. బయటవారు భరించలేరు. బలరామయ్య మంచి హోటల్లోనే దిగాడు. వెచ్చని గది లోనే వుంటున్నాడు. అయినా అతన్ని చలి పీడిస్తూనే ఉంది. చలికి మందు సారాయి. అది సేవిస్తూనే ఉన్నాడు. అయినా భరించలేక పోతున్నాడు. ఇక చవక హోటల్లో దిగిన సరస్వతి విషయం చెప్పలేం.

చలి. ఢిల్లీ చలి. అది రాజకీయాలకూ పట్టుకుంది. బలరామయ్య తెల్లవారి పార్టీ పెద్దలను కలుసుకున్నాడు. హైద్రాబాదు నుంచి ముఖ్యమంత్రి దిగారు. ఆయనతో మంతనాలు జరిపారు. కీచులాటలుపోట్లాటలూ మొదలయినాయి. బలరామయ్యకుదొర తనం తెలుసు. అధికారం తెలుసు. అహంకారం తెలుసు. మంతనాలు తెలియవు. పార్టీ పెద్దలను సమాధానపరచలేకపోయాడు. మంకుతనం తప్ప మందు కనిపించలేదు. ఓడిపోతున్నాననుకున్నాడు బలరామయ్య. దాంతో చలి ప్రభావం ఎక్కువైంది. దొర వణకసాగాడు. దొరతనం వణికింది. ఆరోజు సన్నగా జ్వరం వచ్చింది. హైద్రాబాదుకు వార్త అందింది. అక్కణ్నుంచి విమానాలు ఎగిరాయి. ఢిల్లీలో వాలాయి. దొరల పక్షపు బలం పెరిగింది. మంతనాలు హనుమంతుని తోకలా సాగుతూనే ఉన్నాయి. వాటికి ఒక అంతు కనిపించలేదు. వర్గాలు, కులాలు, మతాలూ, ప్రాంతాలూ అన్నింటినీ ఆశ్రయించారు ఉభయపక్షాలవారు. తుదకు దొరలు తిరుగుబాటు చేశారు. **ప్రజల తిరుగుబాటు జరిగినచోట దొరల తిరుగుబాటు! ఇదీ ప్రగతి. ఇదీ అభ్యుదయం. ఇదీ విప్లవం.**

బలరామయ్యకు జ్వరం ఎక్కువైంది. రాజకీయాల్లో వేడి హెచ్చింది. తగాదా ప్రధానిదాకా పోయింది. ప్రధాని చిరాకుపడ్డారు. ఉభయ పక్షాలవారిని చీవాట్లు పెట్టారు. ప్రజాస్వామ్యాన్ని గురించి ఉపన్యాసం ఇచ్చారు. ఉభయపక్షాల వారూ మాదే ప్రజాస్వామ్యం అంటె మాదే ప్రజాస్వామ్యం అన్నారు. తాము చేయ

బట్టే అధికారపక్షం జీవిస్తుందన్నారు. పార్టీలోంచి కొందరిని మంత్రులుగా తీసుకోవ లసిందని ముఖ్యమంత్రికి పేచీలుపెట్టి పార్టీ ఐక్యతకు భంగం రానీయవద్దని బల రామయ్యకు చెప్పి బేరం తెగతెంపులు చేశారు ప్రధాని. దాంతో దేశ సమస్యలు పరి ష్కారమయ్యాయి. విమానాలు ఢిల్లీలో ఎగిరి హైద్రాబాదులో దిగాయి.

బలరామయ్యకు జ్వరం ఎక్కువైంది. చికిత్స జరుగుతూంది. అందువల్ల ఎగరలేకపోయారు. ఢిల్లీలోనే ఉండిపోవాల్సి వచ్చింది. మంత్రి పదవులు చంకన పెట్టుకొని అంతా వెళ్ళిపోయారు. మిగిలింది సరస్వతి మాత్రమే. ఆమెను చవక హోటలునుంచి తన హోటలుకు మార్పించాడు. డాక్టర్లు మందుల కంటె పరిచర్య ఎక్కువ అవసరం అన్నారు. అయిన వారెవరైనా ఉంటే పిలిపించమన్నారు. ఆ మాట విన్నాడు బలరామయ్య. అతనికి అనేక దృశ్యాలు కళ్ళెదుట కనిపించాయి. అయినవారు! అయినవారేరీ తనకు? అంతా పోయారు. అమృతవాణి గుర్తుకు వచ్చింది. తనకోసమే బలి అయిందేమో అనిపించింది. తన గడికి కాపుండి చచ్చింది. కాకుంటే అందిరిలో హాయిగా ఉండేదేమో! అదంతా గతం. ఇప్పుడు తన వారేరి? ఆపదలో ఆదుకునే వారేరి? కష్టాల్లో కనిపెట్టుకొని వుండేవారేరి? ఏరి వారెక్కడున్నారు? ఎలా దొరుకుతారు? ఎక్కడ లభిస్తారు? ఏం చేయాలి? ఎలా? ఏం చేయాలి? అనే ఆలోచనలతో సతమతం అవుతూ కళ్ళు తెరిచాడు.

సరస్వతి కనిపించింది.

చిరునవ్వు నవ్వుతూంది.

బలరామయ్యకు ఏదో ఉపశాంతి లభించింది.

చిరునవ్వు వెన్నెలలాంటిది. వసంతం వంటిది, మలయమారుతాన్ని మించింది. అది మనసును మురిపిస్తుంది. మరపిస్తుంది. గాయపడిన గుండెకు మందులా పని చేస్తుంది.

సరస్వతిని చూచాడు బలరామయ్య. స్నిగ్ధమైన చిరునవ్వును చూచాడు. అన్నాడు "సరస్వతీ! కూర్చో! ఇప్పుడు నువ్వే నాకు దిక్కు. నావోళ్ళంతరు పోయిన్రు. మంచంలోపడ్డ. ఊరుకాని ఊరు. దేశంకాని దేశం. దేవుడు నిన్ను పంపిండు. నువ్వే కాపాడాలె." గొంతు బొంగురుపోయింది. కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

సరస్వతి కరిగిపోయింది. ఆవిడ కళ్ళు చెమ్మగిల్లాయి. "సార్! నేనున్నా కదా! మీకెలాంటిలోటు రానివ్వను. ఇక్కడే వుంటాను. ఇక్కణ్ణుంచి కదల్ను. మీరు మనసు బాధ పెట్టుకోకండి" అన్నది.

"సరస్వతీ! అందరు వచ్చిన్రు. పని తీరింది వెళ్ళిపోయిన్రు. సహాయం చేయ డానికి సరస్వతి మిగిలింది" అన్నాడు.

ఇంతలో డాక్టరు వచ్చాడు. జ్వరం చూచాడు. ఎక్కువగా ఉంది. ఊపిరి తిత్తులు చూచాడు. రెంటిలోనూ కఫం చేరింది. ఇంజక్షన్ యిచ్చాడు. మందులు

ఎలా వాడవలసిందీ చెప్పాడు. "వేళకు మందు, వేళకు ఆహారం వీటిమీద ఆధార పడివుంది రోగి చికిత్స. బలరామయ్యగారు బాగుపడ్డం మీ చేతులో ఉంది". అన్నాడు డాక్టరు సరస్వతిని ఉద్దేశించి. డాక్టరు వెళ్ళిపోతూ సరస్వతిని బయటికి పిలిచి చెప్పాడు. "డబుల్ న్యూమోనియా" అనీ, చాలా జాగ్రత్తగా వుండాల్సిందనీ.

"డబుల్ న్యూమోనియా!!" సరస్వతి ధ్వనిలో ఆశ్చర్యం ఉంది. భయం ఉంది. ఎక్కడో ఆవేదనా ఉంది.

"భయపడాల్సిన అవసరంలేదు. తగ్గిపోతుంది. అవసరం అనిపిస్తే ఫోన్, చేయండి. టెంపరేచరి రికార్డు చేయడం మరవకండి" అని చెప్పి డాక్టరు వెళ్ళి పోయాడు.

గదిలోకి వచ్చింది సరస్వతి. బలరామయ్య మత్తుగా పడివున్నాడు. నిద్ర పోతున్నాడనిపించింది. తలమీద వున్న మంచు సంచి చూచింది. మంచు కరిగి పోయింది. తీసి మంచుముక్కలు వేసింది. మళ్ళీ తలమీద పెట్టింది. తరవాత పని లేదు. బలరామయ్యను చూస్తూ కూచుంది. జ్వరంతో మంచంలో పడివున్న బలరా మయ్య వింతగా కనిపించాడు. ఒక రాష్ట్ర ప్రభుత్వాన్ని కదలించిన బలరామయ్య, ప్రధానితో మంతనాలాడి గెలిచిన బలరామయ్య, అధికారాన్ని అందిపుచ్చుకున్న బలరామయ్య బలంలేని రామయ్యగా కనిపించాడు. మంచంలో బాలునిలా కనిపిం చాడు. నిస్సహాయుడుగా కనిపించాడు. బలహీనునిగా కనిపించాడు. మృత్యుముఖం లోకి పోతున్నవాడిలా కనిపించాడు. ఆమెకు జాలి కలిగింది. మనస్సు కరిగింది. మానవత పెల్లుబికింది. బలరామయ్య మాటలు గుర్తుకు వచ్చాయి. అయినవారు తనకు మాత్రం ఎవరున్నారు? "నా" అనే వారేరీ లోకంలో? లోకంలో ఎన్నిటినైనా సాధించవచ్చు. తనవారిని సాధించుకోగలడా మానవుడు. మమత లేనిది మానవుడేడి? ఆమెకు తలిదండ్రులు గుర్తుకు వచ్చారు. గత సంఘటనలన్నీ మాయగా మసగ్గా మనోఫలకం మీద మసిలాయి. ఏదో వేదన అనుభవించింది. ఏదో ఆవేదన మూర్తీభ వించింది. ఆలోచనలలో మునిగిపోయింది. గడియారం గంటవిని ఈ లోకంలోకి వచ్చింది. మందు ఇవ్వాల్సిన సమయం! బలరామయ్యను లేపింది. వళ్ళు సలసలకాగి పోతోంది. బలరామయ్య మత్తుగా లేచాడు.

"సరస్వతీ! నువ్విక్కడనే ఉండాలె. ఎక్కడికీ పోవద్దు. ఇక్కణ్ణే ఉండాలె పోవద్దు" అన్నాడు పలవరిస్తున్నట్లు.

సరస్వతి కళ్ళు చెమ్మగిల్లాయి. "ఇక్కడే ఉన్నా. ఎక్కడికీ పోను. ఇదిగో మందు" అని మందు తాగించింది.

"బాగైత నంటావా?" అడిగాడు బలరామయ్య. గొంతు జీరవోయింది. నిరాశ వ్యక్తం అయింది.

"బాగవుతుందన్నాడు డాక్టరు. రేపటికి జ్వరం తగ్గుతుందట" సరస్వతి ఓదా ర్చింది.

"నిజంగా తగ్గుతుందన్నాడా?" అని ఆమె చేతిని ఆశ్రయంగా పట్టుకొని ఊపాడు.

మౌనంగా తల ఊపింది.

ఆశగా చూచాడు ఆమెను.

తగ్గుతుందనుకున్న జ్వరం అర్థరాత్రికి విషమించింది.

వెర్రి చూపులు చూస్తూ కన్నీరు కార్చాడు బలరామయ్య.

సరస్వతి గుండెలో రాయిపడింది. డాక్టరుకు టెలిఫోన్ చేసింది. గొంతులోని ఆవేదన కనిపెట్టాడు. హుటాహుటిని వచ్చాడు డాక్టరు. పరిస్థితి విషమంగానే కనిపించింది. అంబులెన్స్ తెప్పించి ఆస్పత్రికి చేర్చారు. అక్కడ ఆక్సిజన్ పెట్టారు బలరామయ్యకు.

బలరామయ్య ఆస్పత్రికి వచ్చాడు. ఆస్పత్రి మేలుకుంది. వళ్ళు విరుచుకుంది. అమాంతంగా అలజడి మొదలైంది. టెలిఫోన్లు గణగణ మ్రోగాయి! కార్ల హారన్లు వినవచ్చాయి. ఆవరణ కార్లతో నిండిపోయింది. ఆస్పత్రి అమాత్యులతో నిండి పోయింది. డాక్టర్లు మంచం చుట్టూ మాత్రమే కాదు - ఆస్పత్రినిండా పోగయ్యారు. సలహాలు సంప్రదింపులు జరుగుతున్నాయి! ఒక నాయకుని ప్రాణం కాపాడాలి! ఒక నాయకుణ్ణి దక్కించాలి! దీక్షతో పనిచేస్తున్నారు డాక్టర్లు. వారూ హడలిపోతున్నారు! ఆదేశాలు అందుతున్నాయి అత్యంత ఉన్నతుల నుంచి. అల్లకల్లోలంగావుంది! గుసగుసలు సాగుతున్నాయి. పత్రికలవాళ్ళు వచ్చారు. బలరామయ్య జీవిత విశేషాలు అడుగుతున్నారు. ఎవరూ తమకు తెలియదంటే తమకు తెలియదంటున్నారు. పత్రికల వాళ్ళంతా ఊహాగానాలు చేశారు. బలరామయ్యను స్వాతంత్ర్య యోధుణ్ణి చేశారు!

ఇదంతా బయట. బలరామయ్య గదిలో భయంకరమైన నిశ్శబ్దం. డాక్టరు ఒకపక్క సరస్వతి మరోపక్క కూర్చున్నారు. ఎవరూ మాట్లాట్టంలేదు. ఇద్దరూ బలరామయ్యనే చూస్తున్నారు. ఊపిరిసైతం ఆడుతున్నట్టులేదు. గడియారం మాత్రం టిక్‌టిక్ అంటూంది.

మౌనంగా కూర్చుంది సరస్వతి. ఆమె గుండెలో ఉప్పెనలు లేస్తున్నాయి! అగ్నికొండలు సలసల కాగుతున్నాయి! ఏమిటీ వింత! తనవారనుకున్న వారంతా ఇలా కావలసిందేనా? తండ్రి పోయాడు! తల్లి పోయింది! కొంప పోయింది! గోడు మిగిలింది. తనవాడనుకొన్నది వీరభద్రాన్ని. అతడూ పోయాడు. ఎటు పోయాడు? ఎక్కడికి వెళ్ళాడు? ఏమో! ఇప్పుడు బలరామయ్య. అతడు తనకు ఉద్యోగం ఇచ్చాడు. ఏదో ఆత్మీయత కనబరచాడు. తాను అతనిని రక్షించాలని దీక్ష బూనింది. ఇప్పుడు ఇలా ఉంది. భగవానుడా ఎందుకీ పరీక్ష! ఏం పాపం చేశాన్నేను? ఎందుకిలా బాధపెడుతున్నావు స్వామీ! బలరామయ్యను రక్షించు-అతన్ని కాపాడు.

అతడు బతకాలి. నాకు అంతగా నిలవాలి. రక్షించు, రక్షించు—రక్షించు- అని మౌనంగా ప్రార్థిస్తూంది.

క్షణం యుగంగా గడుస్తూంది. ఆవేదన ఆమెను కుంగదీస్తూంది. కండ్లు పీక్కుపోయాయి. జుట్టు చెదిరిపోయింది. దుఃఖం గుండెనుండి గొంతుదాకా వచ్చింది. కొంత కళ్ళల్లోకూడా ప్రవేశించింది.

తెల్లవారింది. అయినా ఎండరాదు. మంచు దట్టంగా కమ్మింది. అయినా కళ్ళు తెరిచాడు బలరామయ్య.

"బలరామయ్య కళ్ళు తెరిచాడు?"

"బలరామయ్య కళ్ళు తెరిచాడు!"

"కళ్ళు తెరిచాడు!"

ఈ వార్త ఆస్పత్రినిండా పాకింది. అక్కడ్నుంచి పత్రికలకూ తద్వారా నగరంలో పాకింది.

బలరామయ్య కళ్ళు తెరిచాడు. చుట్టూ చూశాడు. "సరస్వతీ" అన్నాడు. ప్రాణం లేచివచ్చింది ఆమెకు. 'ఇక్కడే ఉన్నాను' అన్నదామె.

అదొకరకంగా చూచాడు అతను.

ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

డాక్టర్లు గుంపులు గుంపులుగా చేరారు. గండం గడిచిపోయిందన్నారు.

క్రమంగా కోలుకుంటున్నాడు బలరామయ్య. జబ్బు పూర్తిగా తగ్గిపోయిందన్నారు డాక్టర్లు. బలం పుంజుకోవాలన్నారు. విశ్రాంతి కావాలని అక్కడే కొన్ని రోజు లుండమన్నారు. బలరామయ్య మళ్ళీ హోటలుకు మారాడు. సరస్వతి పూర్తిగా నీరసించిపోయింది.

"సరస్వతీ! పూరా నీరసంగైనవు. ఎన్నాళ్ళిట్లుంటవు? నేను జర బాగవుతున్న. నువ్వు చెయ్యబట్టె బతికిన. ఇగ నువ్వు బాగుకావాలె. మంచిగ తిను. ఆరామ్ చేయి."

సరస్వతి చిరునవ్వు నవ్వింది. "బాగానే వున్నా. నాకేమైంది!" అని పత్రిక చదివి వినిపించసాగింది.

"అక్కడేమో అన్ని కాగితాలున్నాయి ఏందయ్యి?" అడిగాడు బలరామయ్య.

సరస్వతి కాగితాలవైపు చూచింది. "అవి టెలిగ్రాములు. మీ ఆరోగ్యాన్ని గురించి తెలుసుకోవడానికి వచ్చినవి. నేనూ చూళ్ళేదు. చాలా ఉన్నాయి. చదవమంటారా!"

"చదువు"

ఒక్కొక్కటే చదవసాగింది. ఒక కాగితం దగ్గరికి వచ్చి ఆగిపోయింది. గుండె టక్కుమని లిప్తపాటు ఆగినట్లయింది తరువాత గుండె దడదడలాడింది. శ్వాస వేడి అయింది.

"వీరభద్రం" అనే పేరు చూచిందామె.

ఎవరు ఈ భద్రం? తన వీరభద్రమేనా? ఎవరితను? ఎక్కడుంటాడు? ఏం చేస్తుంటాడు?

పోయిన ధనం దొరికినట్లనిపించింది. వాడిన మల్లె వికసించింది. మనసుకు రెక్కలువచ్చి రెపరెపలాడాయి! క్షణంలో పూర్వస్మృతులు దబదబా మెదడుతో తిరిగాయి.

"ఎవరీ వీరభద్రం!" అడిగేసింది. మాట ఎంతసేపు దాగుతుంది మనసులో. చోటు చేసుకొని బయటికి వచ్చేసింది.

"ఉన్నాడులే ఒక పుండాకోరు" నిర్లిప్తంగా జవాబు చెప్పాడు బలరామయ్య.

"అంటే" ప్రశ్నలో ఆరాటం కనిపించింది. ఆవేదన దాగివుంది.

"అంటే ఏమున్నది? కొన్నాళ్ళు దోచుకొని బతికిండు. ఇప్పుడొక ముండను కట్టుకున్నడు"

'ముండను కట్టుకున్నడు' ఆ మాటలు ఆమె మెదడులో గిరగిరా తిరిగాయి. తన వీరభద్రం ముండను కట్టుకున్నాడా? కాదు తనవాడు కాదు. ఎవరో ఎక్కడి వాడో? తన వీరభద్రం చచ్చిపోయాడు. అవును చచ్చిపోయాడు. విరిసిన మల్లెలు రాలి పోయాయి. వాడిపోయాయి. మట్టిలో కలసిపోయాయి.

మరొకనాడు కాఫీ కలిపి ఇచ్చింది బలరామయ్యకు.

అతడు కాఫీ అందుకున్నాడు. ఆమెను చూచాడు. ఆ చూపులో ఏదో కొత్తదనం ఉంది.

"సరస్వతీ ఒక్కమాట అడుగుదునా?"

"అడగండి"

"ఏమనుకోవు గద"

"ఎందుకు అనుకోవడం?"

కొంత మౌనం - ఇద్దరూ కాఫీ చప్పరిస్తున్నారు.

"నన్ను పెండ్లాడ్తావా?"

సరస్వతి బలరామయ్యను చూచింది. అతనిలో అమాయకత కనిపించలేదు. ఆ బలహీనత కనిపించలేదు. అతడు మనిషైనాడు.

ఆమె మాట్లాడలేదు.

"నేను వయసుల లేను. వయసు మళ్ళింది. అయినా నాకొక అండ కావాలె. నువ్వు నన్ను చావు నుంచి కాపాడినవు. నీ అసువంటిదే నాకు కావాలె. నువ్వు ఒప్పుకుంటేనే చేసుకుంట. నీ ఇష్టం"

ఆమె మాట్లాడలేదు. అతడన్నదాంట్లో ఆవిడకు తప్పు కనిపించలేదు. వీరభద్రం పోయాడు. ఎవరైతేనేం? తనకూ ఒక ఆశ్రయం కావాలి. దైవమే ఇది సమకూర్చినట్లున్నాడు. తప్పేం?

"ఇష్టం లేకుంటే చెప్పు బలవంతం లేదు"

"బలవంత మెందుకు? నాకు ఇష్టమే"

"సరస్వతీ! ఎంత మంచిదానివి!" అని ఆవిడ చేతులు పట్టుకున్నాడు బలరామయ్య. తాను ఊగిపోయాడు. ఆమెను ఊపాడు.

పెండ్లి-ఆ పదమే వారిలో ఆత్మీయత పెంచింది. వారిలో అంతరం పోయింది. మనసులు కలిశాయి. మాటలు కలిశాయి. మనసులు విప్పుకున్నారు. మాటలు చెప్పుకున్నారు. ముచ్చట్లాడుకొన్నారు. మురిసిపోయారు. మురిపెంతో రోజులు ఆగవు. అవి ఇట్టే దొర్లిపోతూనే ఉన్నాయి. బలరామయ్య బలం పుంజుకుంటున్నాడు. బాగుపడ్తాడు.

"పెండ్లి ఆడంబరంగా జరగడం నాకిష్టంలేదు" అన్నది సరస్వతి.

"అంటే?"

"అట్టహాసం అవసరంలేదు. పెండ్లి రిజిష్టరు చేయింతాం. హైద్రాబాదు ఆడావుడి అవసరం లేదు"

"ఎందుకు?"

"ఈ వయసులో పెళ్ళి పిల్లలమై కూర్చుందామా? నాకు సిగ్గుగా ఉంటుంది. రిజిష్టరు చేసుకున్నా మనం భార్యాభర్తలం అవుతాంగా"

"పెండ్లి సంబరాలు వద్దంటవు"

"ఎందుకని? వృధా. డబ్బు ఖర్చు. పేదలకు అన్నదానం చేయడం మంచిది"

"దానాలు శానచేసినం. గరీబోళ్ళను మనమేం బాగుచేస్తం? దేవుడు బాగు చేయాలె. అన్నదానాలెందుగ్గని హైద్రాబాదు పోయినంక దావతు ఇద్దాం. ఏమంటవు"

సరస్వతి మనసు చివుక్కుమంది. ఆకలిగొన్నవారికి అన్నం పెట్టడంలో ఆనందం ఉంది. డొక్కనిండినవానికి పెట్టడంలో ఏముంది? అయినా ఈ విషయంలో కలతలు మంచివి కావనుకుంది.

"సరె, అలాగే కానివ్వండి"

"ఇగో చూడు. మేం దొరలం. దొరతనం చేసినం, చేస్తున్నం. దొరతనానికి తగినట్లుండాలె. పేదోండ్లు గీదోంట్లంటే ఏంబాగుంటది? మనదర్జా కనపడాలె. దొరతనం కనపడాలె. నువ్వుకూడా అట్లనే ఉండాలె. ఇగ నువ్వు దొర్సానివి. విన్నావా?"

"అంటే నన్ను కట్టేస్తారా?" అని కిలకిలా నవ్వింది సరస్వతి.

వెలవెలపోయాడు బలరామయ్య. "అట్లనికాదు. మన హోదాకి తగినట్లుండాలె. ఆడికి పోయినంక అన్ని నీకే తెలుస్తయి" అన్నాడు.

దాన్ని సాగనీయదలచలేదు సరస్వతి. అంతటితో ఆ ప్రసంగం ముగిసింది.

ఒకనాడు రిజిష్ట్రారు ఆఫీసుకు వెళ్ళారు బలరామయ్య, సరస్వతి. వెంట ఇద్దరు మంత్రులు వచ్చారు సాక్షులుగా. రిజిస్ట్రేషన్ అయిపోయింది. రిజిష్ట్రారు వారిని అభినందించాడు. మంత్రులు శుభాకాంక్షలు పలికారు. అంతటితో పెండ్లి తతంగం ముగిసింది. ఆ నాటి సాయంకాలం ఒక చిన్న విందు ఏర్పాటు చేశారు హోటల్లో. విందు చిన్నదయినా పెద్ద పెద్ద మనుషులే వచ్చారు.

దంపతులు కూర్చున్నారు.

అనేకమంది దండలు వేశారు.

దండల్లో వారు మునిగిపోయారు.

అందరూ అభినందించారు. ఒక మంత్రి ఉపన్యాసమే యిచ్చాడు. అసలు అభినందించడానికే అతడు లేచింది. అయినా ఉపన్యాసం వచ్చేసింది అలవాటు ప్రకారం.

"భారతీయ నాగరికత అతి సనాతనమైంది. అతి ఉన్నతమైంది. ఇంగ్లీషు వారు దాన్ని అతి పాడుచేశారు. మనకు స్వతంత్రం వచ్చింది. మనం అతి కృషి చేయాలి. మన నాగరికతను అతి బాగుచేయాలి. మన సంప్రదాయంలో పెండ్లి అతి మంచిది. దానికి వయసుతో అతి సంబంధంలేదు. మగవాని వయసు అతి మళ్ళదు. అతడు అతి ముసలితనంలో కూడా అతి వయసువాడే. అతి ముసలితనపు పెళ్ళిళ్ళు అతి మంచివి. యయాతి అతి ముసలితనంలో పెండ్లాడలేదా? భారతనారి అతి మంచిది. అతి పతివ్రత. ఆమెకు భర్తయే అతి దైవం. ఆమె భర్తను అతిగా ప్రేమించును. మన ప్రభుత్వం- అవును- మన స్వంత అతి ప్రభుత్వం- అతి ముసలితనపు పెళ్ళిళ్ళను అతిగా ప్రోత్సహించవలెను. అయినా ప్రజలు అతిగా ముందుకు రావలెను. అతిగా ముందుకు వచ్చిన ఈః- ఈః- అనగా బలరామయ్య దంపతులను నేను అతిగా అభినందిస్తున్నాను."

ఉపన్యాసము ముగిసెను.

కరతాళ ధ్వనులు చెలరేగెను.

పూట కూటి ఇంట ప్రతిధ్వనించెను.

దిక్కులు పిక్కటిల్లెను.

దేవతలు పూలవాన కురిపించిరి.

గంధర్వులు పాడిరి.

అప్సరసలు ఆడిరి.

అంతటితో వివాహ మహోత్సవ కార్యక్రమంబు పరి సమాప్తంబయ్యె.

ఆ రేయి గడచెను. దిక్కులు తెల్లవారెను. దీప్తవంతంబు అయ్యెను. పక్షులు కలకలమనెను. పాందులు చద్దిమూటలతో బయలుదేరిరి. అట్లు కొన్ని రేలును, పవళ్ళును గడచె. తదనంతరంబ.

నవదంపతులు ఢిల్లీ సాంతం చూచారు. బలరామయ్యకు మళ్ళీ కొద్దిగా దగ్గు మొదలైంది. దాంతో పట్నానికి బయలుదేరారు. నవదంపతుల రాకను గురించి తెలిసిపోయింది హైద్రాబాదుకు. విమానాశ్రయంలో వారికి ఘనమైన స్వాగతం లభించింది. పూలదండలతో మునిగిపోయారు. బలరామయ్య మరింత బలంతో తిరిగి వస్తున్నాడు. నవ వధువుతో తిరిగి వస్తున్నాడు. అందుకే అంత స్వాగతం! కప్పులేని కారులో బయలుదేరారు దంపతులు. చేతులు జోడించి నుంచున్నాడు బలరామయ్య. ఆతనిమీద పూలవాన కురిసింది. వారు ఇల్లు చేరుకున్నారు. గృహ ప్రవేశం జరిగింది.

బలరామయ్య నగరంలోని ప్రముఖు లందరికీ గొప్ప విందు ఏర్పాటుచేశాడు. ఆ విందుకోసమని రామయ్యా వచ్చాడు. విందు గొప్పగా జరిగిందని పత్రికలు ఫోటోల సహితంగా ప్రకటించాయి. విందు అయిపోయింది. మామూలు ఇల్లు అయింది.

రామయ్య ఏకాంతంగా బలరామయ్యను కలుసుకున్నాడు.

"వీరభద్రం మళ్ళీ తోక లేపుతాండుండి."

"ఏం చేసిండు?"

"అడుగుతారుండి. మళ్ళీ ప్రజల్ను కూడగొడ్తుండు. దొరల్ను దొంగలంటాండు."

"జనం ఏమంట్రును?"

"ఏమంటరుండి. అందరు అటే తిరుగుతాన్రు"

"నువ్వేం చేస్తున్నవు?"

"ఏంచేస్త. నా బొంద. చేతులుంటేనా. దెబ్బకు దయ్యం కూడా దడుస్తదుండి. పోలీసోళ్ళు ఉన్నన్నాళ్ళూ తోకముడుచుకొని పడివున్నరు.వాండ్లటుపోయిన్రా ఇటు తోక లేపుతాన్రు"

"అట్లనా?"

కొంతసేపు మౌనంగా గడిచింది.

"ఇగ చూడు సార నీ చేతులున్నది. బూమి నీ చేతులున్నది. దబ్బు నీతాన ఉన్నది. మందిని కట్టిపెట్టాలె. పోలీసుల్ను పంపుతె బాగుండదు. అప్పులు పెట్టలేవా అందరికి" బలరామయ్య ఉవాచ.

"అందరు బాకీలే వున్నరు కాదుండి"

"అట్లయితే జంకుత వెందుకు? తోక లేపినోడిని బాకి అడుగు. కుక్కోన పేనోతె పడుంటరు. అయినా వీరభద్రం ఏం చేస్తడని నమ్ముకుంటున్నరు. సర్కార్ మన చేతులుండె"

"నాకే మెరకనుండి. ఏమన్నంటే అధికార్ల దెగ్గరికి, అప్సర్ల దెగ్గరికి పురుగు

తాడు. ఆసెంబ్లీల ఆడుగుతడు. అది పత్రికల వస్తది. అదిచూసి మురుస్తరుండి మంది".

"అడుగుతె ఏమైతది. ఆడందరు మనోండ్లె వున్నరుగని. పత్రికల్ల రాకుండ చూడటమెట్ల?" అని ఆలోచించి "రానియ్యి. వస్తే నీకు బయమెందుకు? నేనున్న గద"

"అందకనే ధైర్యం, అసలు ఎమ్మెల్లే గిరినుంచి ఊడపీకలేమా అని, అది పోయిందనుకోరి, నీళ్ళిడిచిన చేప యితడు."

"ఇప్పుడెట్ల? మళ్ళీ ఎన్నికలు రావాలె. ఇంకవాణ్ణి రానిస్తాను? బేఫికరుండు. జర గట్టిగ పనిచేయాలె! మందిని చేతులుంచుకో. ఆ వెన్క పని నేను చూస్త"

"అట్లనెలేరి"

రామయ్య హెచ్చిన బలంతో ఊరికి చేరుకున్నాడు. ఇంటికివచ్చి నీరుకారి పోయాడు–సుమతికి నొప్పు లొస్తున్నాయి. రామయ్యతల తిరిగిపోయింది. ఎటునుంచి లెక్కచూచినా తన పెండ్లయి ఏడు నెలలే! ఏడు నెలలకు నొప్పులేమిటి? పుట్టబోయె బిడ్డెవరు? పెండ్లి. పెండ్లినాటి రాత్రి సుమతి వాంతి. అన్ని ఒకసారి మనసులో గిరగిరా తిరిగాయి. అనుమానం పడగలెత్తింది. అనుమానానికి అర్థం ఉండదు. ఆ అనుమానంలో ఆజ్యం పోస్తున్నాయి ఆడవారి గుసగుసలు.

"ఏడు నెలలకు నొప్పులేమిటమ్మా! మా రోజులలో ఇలాకాదమ్మా" ఒక పెద్ద ముత్తైదువ అన్నది.

"వస్తయమ్మా! ఎందుకు రావు మాయ నొప్పులు" మరొక పూర్వసువాసిని.

"మావోడు ఏడు నెలలకే కాదమ్మా పుట్టింది. ఏమో చోద్యం చెప్పుకుం టారు?" మరొక మహాతల్లి మాట.

ఇల్లు ఆడవారితో నిండిపోయింది. వారి వ్యాఖ్యానాలతో ప్రతిధ్వనిస్తూంది.

అక్కడ సుమతి మెలికలు తిరుగుతూంది.

ఇక్కడ రామయ్య అనుమానాలు మెలికలు తిరుగుతున్నాయి.

పల్లెల్లో కష్టసుఖాలు పదిమందీ పంచుకుంటారు. ఒక్క ఇంట్లో పెళ్ళి అవుతే అది వూరికే పెళ్ళి. ఒక ఇంటి ఆపద ఊరికే ఆపద అవుతుంది. అందుకే ఊరుసాంతం చేరింది రామయ్య ఇంటికి. ముఖ్యంగా ఆడవారు. సుమతిబాధ వారం దరి బాధ. అందరూ ఏవేవో వైద్యాలు చేస్తున్నారు. మంత్రసాని సతమతం అవు తూంది. అయినా సుమతి నొప్పులు ఆగడంలేదు. బిడ్డ బయటపడడం లేదు.

రామయ్య తలపట్టుకొని కూర్చున్నాడు. రాబోయే బిడ్డ తన బిడ్డ కాదు. ఆనాడే అనుమానించాల్సింది. ఇంతదాకా ఓపిక పట్టాడు.సుమతి ఎంత నీచురాలు! ఆ బాధలో చచ్చిపోతే బాగుండును. ఆమె చావు తనకు విముక్తి కలిగిస్తుంది. ఎంత ఘోరం! ఏమనుకుంటారు నలుగురు, తన పరువు ప్రతిష్ట లేమవుతాయి. సుమతి చచ్చిపోవాలి. సుమతి చావాలి? అదే తనకు నిష్కృతి.

"ఇంకా అట్ల కూచున్నరు. బండి కట్టించండి, పట్నం తీసుకుపోవాలె"
ఆ మాటలు అతన్ని ఈ లోకంలోకి తెచ్చాయి. తన లోకంలోంచి బయటికి వచ్చాడు. చూచాడు. ఎవరు?
మంగమ్మ!
చంకలో పిల్లాడు !!
చంకలో బిడ్డతో మంగమ్మ!!!
పిచ్చెత్తిన వానిలా చూచా డామెను. చూస్తూ ఉండిపోయాడు. క్షణం చలిం చాడు. అమాంతంగా ఆమె చంకలోంచి బిడ్డను లాక్కోవాలనుకున్నాడు. ముద్దులు కురిపించాలనుకున్నాడు.
పాప నవ్వాడు!
రామయ్య గుండెలో గిలిగింతలు పెట్టాడు. రామయ్య మనసు లాగింది. పాప వైపు గుంజుతూంది. పాప నవ్వులో నవరత్నాలు కనిపిస్తున్నాయి.
"బండి కట్టించండి. మంత్రసాని చేతకాదని చెప్పింది" ఇంకో అవ్వ. మరో అమ్మ-మరో తల్లి-అంతా వచ్చేశారు. రామయ్యను తొందర చేయసాగారు.
"బండ్లు తయారుగున్నాయి తీస్కరాండి" బయటినుంచి వీరభద్రం గొంతు.
ఆ గొంతు విని ఆదిరిపడ్డాడు రామయ్య. ఎవరు? వీరభద్రం. ఎక్కడ? తన ఇంటిముందు. ఎందుకు? బండితో-తన భార్యకోసం. తానేమో కదలడంలేదు. వీరభద్రం కదిలాడు. ఇక్కడా అతడే నాయకత్వం చేస్తున్నాడు. ఛ! ఎందుకు తానంత అనుమానపడ్డాడు! ఏడో నెలనే బిడ్డ పుట్టవచ్చన్నారు నిజమేనేమో! అయినా వచ్చినవి నొప్పులేగా! తానిలా కూర్చోవడం బాగుండలేదు అనుకున్నాడు. లేచాడు.
"జల్ది కానియ్యండి. జల్ది కానియ్యండి. బండ్లు తయారుగున్నయి" అని అర చాడు. ఆ అరుపుతో అతనిలో ఏదో ఉత్సాహం వచ్చింది.
సుమతిని పట్టుకొని తీసుకువస్తున్నారు. అబ్బ! ఎంత వేదనవుంది ముఖంమీద! ఎంత బాధపడుతూందో పాపం.
సుమతి రామయ్యను చూచింది. తల ఎత్తి భర్తను చూచింది. ఒక చిరునవ్వు నవ్వింది. రెండు కన్నీటిబొట్లు రాల్చింది. నిలువునా కరిగిపోయాడు రామయ్య.
"సుమతీ!"
కన్నీరు జాలువారింది.
ఆమె వెంట నడిచాడు రామయ్య.
ఆమె బండెక్కుతున్నది. రామయ్యవైపు చూచింది. భోరుమన్నది.
నలుగుర్నూ ఆమెను ఓదార్చారు.
తానింక బతకనన్నది సుమతి.
ఆమెను చూస్తే బండలు చెమర్చేట్లుంది.

అందరూ కళ్ళు తుడుచుకున్నారు.

రామయ్య కన్నీరు రాల్చాడు.

బండిసాగింది. రామయ్య సాగాడు వెనక—కాలినడకన.

బండి వెనక బండి, బండి వెనక బండి-బండ్లుసాగాయి.

బిడారు సాగింది. ఊరు దాటింది. బాట పట్టింది.

బండ్లు మెలికలు తిరుగుతున్నాయి. సుమతి మెలికలు తిరుగుతూంది-బండ్లు, బయట మెలికలు తిరుగుతున్నాడు రామయ్య.

బండ్లబాట ఒక తీరుగా ఉండదు. ఒకచోట ఎత్తు, మరొక చోట పల్లం. ఒక చోట వర్రె. ఒకచోట వాగు. ఒకచోట బండ, ఒకచోట కొండ. అయినా సాగుతుంది బండి.

బండి సాగుతూంది. ఒక చక్రం మెట్టనుంది. ఒక చక్రం పల్లానుంది. మెట్ట నున్నవైపు బండిని పట్టుకున్నారు నలుగురు. అలాంటి చోట బండి పడే ప్రమాదం ఉంది. అందుకే ఆ జాగ్రత్త. బండి మెల్లగా సాగుతుంది, సుమతి మెల్లగా మూలుగు తూంది. బండి దాటింది. బాట చదునుకు వచ్చింది, పల్లంలోకి ఉరికింది. పగ్గాలు లాగిపట్టినా పరిగెత్తుతున్నాయి ఎడ్లు. చక్రంకింది కొకరాయి వచ్చింది. ఎక్కింది. ధడల్‌మని పడ్డది. అమ్మో! అని కేకపెట్టింది సుమతి. రామయ్య గుండె ధడల్లు మన్నది.

బండి సాగింది. బాట సాగింది. బండిబాట వడిసింది. రైలుబాట మొదలైంది. అదీ అయిపోయింది. పట్నం వచ్చింది. ఆగిపోయింది. కార్లు వచ్చాయి. కదిలాయి ఆగాయి. ఆస్పత్రి వచ్చేసింది. సుమతి చేరింది.

అప్పటికి రాత్రయింది. చీకటిపడ్డది. అయినా పట్నం వెలుగుతూనే వుంది. ఆస్పత్రి వెలిగిపోతూంది. అయినా నిద్రపోతూంది. అప్పుడు మేల్కొంది. అయినా కునికిపాట్లు పడుతూంది. సుమతికి ఎనిమా యిచ్చారు. కొంత శాంతించింది. ఆస్పత్రి మళ్ళీ నిద్రలోకి పోతూంది. ఇంతలో టెలిఫోను మ్రోగింది. అది బలరామయ్య నుంచి. ఆ తరువాత కొన్ని టెలిఫోన్లు ఆస్పత్రినుంచి పోయేయి. కార్లు సాగాయి. ఆగాయి- ఆస్పత్రి పోర్టికోలో. స్పెషలిస్టులు దిగారు. పెద్ద పెద్ద డాక్టర్లు వచ్చారు. సుమతి గది డాక్టర్లతో నిండిపోయింది. మళ్ళీ ఆమెకు నొప్పులు వచ్చాయి. మెలికలు తిరుగుతూంది. నర్సులు పరిగెత్తుతున్నారు. మందులు వస్తున్నాయి. ఇంజక్షన్లు గుచ్చుకుంటున్నాయి. అంతా అల్లకల్లోలంగా ఉంది. సుమతి వడకి పోతూంది. ఆస్పత్రి వణకిపోతూంది.

బయట రామయ్య సిగరెట్లు పీకుతున్నాడు. ఆందోళన పడుతున్నాడు. ఏమవు తుంది! రానున్న బిడ్డ ఎవరు? మళ్ళీ అవే ఆలోచనలు. అనుమానాలు. సుమతి చనిపోతే బాగుండును. కనీసం బిడ్డపోతే. ఆ బిడ్డ ఆ రాబోయే బిడ్డ ఎవరు? ఎందుకు రావాలి?

ఇంతలో ఒక నర్సు వచ్చింది. ఒక కాగితం ముందు పెట్టింది. సంతకం పెట్టమంది.

"ఏమిటిది? ఎట్లున్నది?"

"ప్రమాదంగా ఉంది. ఆపరేషన్ చేయాలి. సంతకం పెట్టండి"

"ఎన్నో నెల?"

"ఏమో నాకు తెలీదు. సంతకం పెట్టండి"

యంత్రవతుగా కాగితంమీద సంతకం పెట్టాడు.

కలం అందించి ఆలోచనల్లో పడిపోయాడు. సుమతి చనిపోతుందా ఏమో? తన భార్య సుమతి! బతకాలి. ఎందుకు చావాలి! బతకాలి. ఎందుకా అనుమానం తనకు? ఎంతమంచిది సుమతి? ఎంత చక్కగా నవ్వుతుంది! ఆ బిడ్డ తన బిడ్డే కావచ్చు. ఎందుకు కారాదు! అయినా బిడ్డను చూస్తే తెలీదా? తన పోలికలు ఏమీ రావా ? ఎందుకు రావు? ఎలా రావు!! చూడాలి. సుమతి బతకాలి. బతకాలి. బతకాలి. ఆపద మొక్కులవాడా! రక్షించు! రక్షించు.

బలరామయ్య దిగాడు. రామయ్యకు ప్రాణం లేచివచ్చింది. ఇద్దరూ గదిలోకి వెళ్ళారు. డాక్టర్లు వచ్చారు.

"ఎట్లున్నది?" బలరామయ్య ప్రశ్న.

"ప్రమాదంగానే ఉంది" డాక్టరు జవాబు.

"మళ్ళీ మీరెందుకు!"

"సాధ్యమైన ప్రయత్నాలు చేస్తున్నాం"

"ఇప్పుడేం చేస్తున్నరు?"

"ఆపరేషన్"

"ఆపరేషన్! ప్రమాదంలేదు కదా!"

"చెప్పలేం ఆవిడ బాగా నీరసించి ఉంది. తల్లినైనా రక్షించాలని ప్రయత్నిస్తున్నాం"

పిలుపు వస్తే వెళ్ళిపోయింది డాక్టర్.

గదిలో ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

పంకా తిరుగుతూంది.

"ఏమైందంటాను?" రామయ్య ప్రశ్న.

బలరామయ్య పరాకుగా ఉన్నాడు. వినలేదు.

ఎక్కడో 'కేర్' మన్నట్లు వినిపించింది రామయ్య మనసుకు. లేచి అటూ ఇటూ చూశాడు. నర్సు పరిగెత్తుకుంటూ వచ్చింది.

"కంగ్రాచులేషన్స్. మగపిల్లవాడు" అని చెప్పి ఇద్దరు వుండడాన ఎవరికి చెప్పిందో అర్థంకాక వెర్రిగా చూసింది. తరవాత ఒక చిరునవ్వు నవ్వింది.

"బాగున్నదా!" అడిగాడు రామయ్య. బలరామయ్య అదే ప్రశ్న అడిగాడు.

"తల్లీ పిల్లా బాగున్నారు. కంగ్రాచులేషన్స్" అని మళ్ళీ చిఒకరునవ్వు నవ్వింది. వెళ్ళిపోయింది.

ఇంతకు తండ్రెవరో అర్థం కాలేదు నర్సుకు. ఎవరి ముఖాలోనూ సంతోషం కనిపించలేదు.

బలరామయ్య తనకూ ఒక బిడ్డ కలుగుతే బాగుండునని ఆలోచిస్తున్నాడు!

గదిలో ఇద్దరున్నారు.

ఇద్దరూ మాట్లాడలేదు.

పంకా గిరగిరా తిరుగుతుంది.

ఆ చప్పుడే వినిపిస్తూంది.

"తల్లిని, బిడ్డనూ చూడవచ్చు" యంత్రవతుగా వచ్చి ఆ మాటలని వెళ్ళిపోయింది ఒక నర్సు.

ముందు బలరామయ్య లేచాడు. అయినా ముందు రామయ్య నడిచాడు.

సుమతి మంచంలో ఉంది. ఇంకా స్పృహ రాలేదు. పక్కనే తొట్టిలో ఉన్నాడు పాప.

పాపదగ్గరికి పరిగెత్తాడు రామయ్య. బలరామయ్య అనుసరించాడు.

రామయ్య పాపను చూశాడు.

పాప అచ్చం తల్లి పోలిక!

బలరామయ్య పాపను చూశాడు. అతని ముఖం చేటంతయింది. రాముడూ ! నీ అదృష్టం మంచిది. మగబిడ్డ తల్లిపోలికలు వచ్చినయి. అది అదృష్టం!" అని సుమారు రామయ్యను ఊపేశాడు.

రామయ్య సుమతిని చూచాడు. అమాయకంగా ఉంది. అందులోనూ తెలివి లేదు. అయినా రామయ్య మనసులో చిచ్చుపెట్టింది. అదొక రకంగా చూచాడు రామయ్య.

బలరామయ్య అతని చూపులను చూచాడు.

"ఏమో అట్ల చూస్తవు! బిడ్డతల్లి ! ఎందుకట్ల చూస్తవు" అడిగాడు.

"ఏంలేదు. ఏంలేదు. ఎంతకష్టపడ్డదోనని? ఎళ్దమా?

ఇద్దరూ బయటికి వచ్చారు. కారు తలుపు తెరిచి పట్టుకున్నాడు డ్రైవరు. రామయ్యకు సలాం చేశాడు డ్రైవరు. రామయ్య గమనించలేదు. ఇద్దరూ కూర్చున్నారు. డోర్ చప్పుడైంది. హారను మోగింది. కారు సాగిపోయింది.

కారు ప్రవేశద్వారంలో ప్రవేశించింది. బలరామయ్య ఇంటి నిర్గమన ద్వారం నుంచి మరోకారు నిర్గమిస్తూంది. అది రామయ్య చూచాడు. అందులో సరస్వతి ఉంది. ఎక్కడికి వెళ్తూంది! ఏదో అనుమానం కలిగింది. అణచుకున్నాడు. అయినా అడిగేశాడు. 'దొర్సాని యాడికి పోతున్నది?'

'గుడికి పోతున్నదేమో' నిర్లిప్తంగా జవాబిచ్చాడు బలరామయ్య.

'అట్లనా?' అన్నాడు రామయ్య. అందులో ఏదో వ్యంగ్యం ధ్వనించింది. బలరామయ్య రామయ్యను అదోలా చూశాడు.

రామయ్య కిక్కురుమనలేదు.

సరస్వతి వెళ్ళింది గుడికికాదు- ఆశ్రమానికి. సుందరరావుగారు పట్నానికి కొద్దిదూరంలో ఒక ఆశ్రమం నెలకొల్పారు. సుందరరావుగారికి గాంధీజీ సిద్ధాంతాల్లో అచంచలమైన విశ్వాసం ఉంది. హింసను అహింసద్వారా గెలవాలని ఇక్కడికి వచ్చారు వారు. భూమికోసం ఎంతో రక్తం పారిందీ ప్రాంతంలో. బలవంతంగా లాక్కోవడం, మనిషిని బాధపెట్టడం వారికి గిట్టనివి. అయితే భూమి విషయంలో పేదలకు అన్యాయం జరిగిందనే విషయం వారు గ్రహించారు. ఈ సమస్యను పరిష్కరించాలనీ, అన్యాయాన్ని అంతమొందించాలని వారు కంకణం కట్టుకున్నారు. భూమి వలన జరుగుతున్న దురంతాలను వివరించి భూస్వాముల మనసులు మార్చడానికి వారొక మహాయత్నం ప్రారంభించారు. మనసు మార్చి మనిషిలో మానవత కలిగించాలి. త్యాగం సృష్టించాలి. త్యాగం శాంతికి చిహ్నం. ఆనందానికి నిలయం.

భూమి భగవంతుడిచ్చింది. అది ఏ ఒక్కరి సొత్తూ కారాదు. అది దుఃఖానికి మూలం కారాదు. ఈర్ష్యా, ద్వేషాలకు తావు కారాదు. గ్రామంలోని భూమి గ్రామస్థులది. అది ఉమ్మడి ఆస్తి అందరికీ చెందుతుంది. దానిని అంతా సమానంగా అనుభవించాలి.

భారతదేశపు సంపద పల్లెలమీద, పల్లీయులమీద ఆధారపడి ఉంది. కుటీర పరిశ్రమలు భారతదేశపు జీవనాడి. వాటిని ఆంగ్లేయులు నాశనం చేశారు. వాటిని ఉద్ధరించడంలోనే భారతదేశపు ప్రగతి ఉంది. యంత్రాలు అనేకమందిని నిరుద్యోగులను చేస్తున్నాయి. కాబట్టి గ్రామాలలో వాటికి తావుండరాదు. గ్రామం స్వయం సమృద్ధం కావాలి. అక్కడున్న వారే అక్కడి అవసరాలు తీర్చుకోవాలి. అలా అయిననాడు శాంతి వెల్లి విరుస్తుంది. హింసకు తావుండదు. ఈర్ష్యా ద్వేషాలు మాయం అవుతాయి. సర్వోదయం వెలుస్తుంది. సకల జనులు సుఖంగా జీవిస్తారు.

వారి ఆదర్శాలను అమలుపరచడానికే భూదానోద్యమం ప్రారంభించారు సుందరరావుగారు. వారి కృషికి అక్కడక్కడా విజయంకూడా లభించింది. కొందరు భూస్వాములు తమ యావదాస్తినీ దానం చేశారు. అనేకమందికి తమ సిద్ధాంతంతో విశ్వాసం కలిగించారు వారు. అలాంటి వారంతా సుందరరావుగారి ఆశ్రమంలోనే ఉండదలిచారు. అందుకే ఆశ్రమం నెలకొల్పారు సుందరరావుగారు.

ఆనందాశ్రమం ఆధునిక నాగరికత అంటనిచోట స్థాపించబడింది. అక్కడన్నీ పర్ణశాలలే. అవి ఒక పద్ధతి ప్రకారం నిర్మించబడినాయి. విశాలంగానూ, శుభ్రంగానూ ఉంటాయి. ప్రార్థనశాల, వంటశాల, విశ్రామశాల ఇలా అనేక పర్ణశాలలున్నా ఏ ఒక్కరికీ ప్రత్యేకంగా పర్ణశాల ఉండదు. అన్నీ అందరూ వాడుకోవాల్సిందే. అక్కడివారు ధాన్యం దంపుకుంటారు. దారం వడుకుతారు. బట్ట నేసుకుంటారు. అవ

సతాలకు సరిపోయినంత పండించుకుంటారు. అందరూ తమ శక్తినిబట్టి పని చేస్తారు. అవసరానికి తగినంత వాడుకుంటారు.

ఆశ్రమంలో చక్కనిచెట్లూ, వాటిని చుట్టుకున్న తీగలు, పూల మొక్కలు ప్రశాంత వాతావరణాన్ని ఏర్పరచాయి. ఎప్పుడూ అక్కడ చరకా సంగీతం విని పిస్తుంటుంది. ఉభయ సంధ్యల్లో ప్రార్థనా సమావేశాలు జరుగుతాయి.

సుందరరావుగారిది సుందర విగ్రహం. వారు మోకాలివరకే పంచ కడ్తారు. పైన ఒక చిన్న పంచెమాత్రం ఉంటుంది. వారి ముఖంలో శాంతం ఉంది. వారి చిరునవ్వు వెన్నెలలు కురుస్తుంది. ఎంత పరితప్త హృదయానికైనా శాంతి ప్రసాది స్తుంది. వారి మాటల్లో అమృతం ఉంది. అది ఎదుటి వారిని ముగ్ధుల్ని చేస్తుంది.

సుందరరావుగారు ఎల్లప్పుడూ ఆశ్రమంలో ఉండరు. వారు కాలినడకనే ప్రయాణిస్తారు. దరిద్రనారాయణుని కోసం యాచించడానికి ఎప్పుడూ యాత్ర చేస్తూనే వుంటారు. ఈ మధ్యనే వచ్చారు. మళ్ళీవెళ్ళిపోతారు.

ఆ విషయం తెలిసే తొందరపడ్డది సరస్వతి. భర్తను అడిగే బయల్దేరామను కుంది. ఎంతసేపటికీ బలరామయ్య రాలేదు. సుందరరావుగారు ఆశ్రమంనుంచి వెళ్ళిపోతారేమోనని భయం. ఈ మధ్య ఆమె సర్వోదయ సాహిత్యం చాల చదివింది. సుందరరావుగారి విషయంలో భక్తి శ్రద్ధలు ఏర్పడ్డాయి. అక్కడికి వెళ్ళాలని తహ తహలాడింది. అవకాశాన్ని జారవిడుచుకో దలచుకోలేదు. బలరామయ్యతో అనుమతి తీసుకోకుండానే బయలుదేరింది. ఆమెకు అక్కడ ఆకర్షణ ఉంది. అందుకే బయలుదేరింది.

కారు ఆశ్రమానికి కొద్దిదూరంలో ఆగింది. అది ఆశ్రమ నిలయం. అందుకు సంబంధించిన బోర్డు ఉంది. అది ఒక చెట్టుకు తగిలించి ఉంది. సరస్వతి కారు దిగింది. కాలినడకన బయలుదేరింది. ఆశ్రమంలో ప్రవేశించింది. ఆ వాతావరణం ఆమెను ఆకర్షించింది. ఆమె పరిగెత్తింది.

సుందరరావుగారు కనుపించారు. వారు రాట్నంమీద దారం తీస్తున్నారు. ఆ మూర్తిని ఆమె గుర్తించింది. వారి పాదాలమీద వాలిపోయింది. వారు వడకడం మానలేదు.

"సర్వేజనా స్సుఖినోభవంతు. లేతల్లీ! ఎవరు నువ్వు!" అడిగారు సుందర రావుగారు.

ఆమె పాదాల మీదనుంచి లేచింది.

"స్వామీ! నేను సరస్వతిని"

"సరస్వతివా? చదువుల తల్లివి. నీ భర్త ఎవరమ్మా!"

"బలరామయ్యగారు"

"ఆయన బలవంతుడుగదా తల్లీ! నేను బలహీనుణ్ణి. ఇక్కడికెందు కొచ్చా వమ్మా!"

"స్వామి! నాకు శాంతి కావాలి"

"సంపాదించాలమ్మా. ఊరికే ఎలా వస్తుంది?"

"నన్నేం చేయమంటారు స్వామీ!"

"చెయ్యాల్సింది చాలా ఉంది తల్లీ! నీ భర్తతో చెప్పి భూదానం చేయించు. దరిద్రనారాయణులకు కావలసిందదే"

"ప్రయత్నిస్తాను స్వామీ! నన్నేం చేయమంటారు"

"కోపాన్ని జయించు. ఆడంబరాలు వదులు. రాట్నం నడిపించు. ఖద్దరు కట్టు. ఆశలు వదులుకో. ఆశయాలు పెంచుకో."

"అలాగే స్వామీ!"

ఇంతలో ప్రార్థనా సమావేశం జరిగింది. ఆ ప్రార్థన ఆమెకెందుకో ఆనందాన్నిచ్చింది. తానూ రోజూ ప్రార్థించాలనుకొంది. ఏదో ప్రశాంతతనూ తృప్తినీ మనసులో పెట్టుకొని వచ్చింది.

కారు దిగి ఇంట్లో అడుగు పెట్టగానే హూంకరించాడు బలరామయ్య. "ఎక్కడికి పోయినవ్?"

తలవంచుకొని ఇంట్లోకి వెళ్ళిపోయింది.

బలరామయ్యా లోపలికి వెళ్ళాడు. "యాడికి పోయినవు చెప్పమంటె మాట్లాడవు? మూగదయ్యమోలె నిలబడ్తవు?"

"తప్పైంది. చెప్పకుండా వెళ్ళా"

"సరెలే. యాడికిపోయినవో చెప్పరాదు" బలరామయ్య ధ్వనిలో కాస్త మార్దవత కనిపించింది.

"ఆశ్రమానికి వెళ్ళా- సుందరరావుగారి ఆశ్రమానికి"

"ఆడికెందుకు పోయినవ్? ఏమున్నదాడ?"

సరస్వతికి కొంత ధైర్యం వచ్చింది. "అక్కడ చాల బాగుంది. సుందరరావుగారు ఋషివంటివారు. మీరూ రాగూడదు ఒకసారి. ఎంతో ప్రశాంతంగా ఉంటుందక్కడ."

"సరె బాగనే ఉన్నది. సన్నాసులల్లో కలవమంటవా? నాకు ఫుర్సత్‌లేని పనులున్నయి. నేనాడ వస్తగని. నువ్వుకూడా పోవద్దిగ. ఇప్పుడు నువ్వు దొర్సానివి. ఇక్కడ నీకేం తక్కువని ఆడికి పోయినవు. ఇప్పుడు పోతే పోయినవుగాని-ఇగ పోకు" అని చెప్పి ఏదో రాచకార్యంమీద వెళ్ళిపోయాడు బలరామయ్య.

బలరామయ్యకు తగిలిన రాచకార్యం బహు దొడ్డది. అది విద్యార్థులకు సంబంధించింది.

నైజాం నవాబు పరిపాల నంతకాలం ఉర్దూ రాజభాషగానూ, బోధనా భాషగానూ ఉండేది. ఉన్నవారికి తప్ప ఉద్యోగాలు దొరకవని గ్రహించారు ప్రజలు. అందువల్ల ఎవరిపనులు వారు చూసుకొనేవారు. ఉద్యోగాలకు ఎగబడేవారు

తక్కువ. పోలీసుచర్య జరగ్గానే మాతృభాష బోధనా భాష అయింది. పాఠశాలల స్థాపన ఒక ఉద్యమంగా సాగింది. చదువుకునేవారు ఎక్కువైనారు. ఉద్యోగాల్ల కోసం ఎగబడసాగారు. అవి దొరకడం కష్టం అయింది. దాంతో విద్యార్థుల్లో అసం తృప్తి చెలరేగింది. కొందరు విద్యార్థి నాయకులు బలరామయ్యను ఆశ్రయించారు. ప్రభుత్వంమీద కసి ఇంకా తీరలేదు బలరామయ్యకు. ప్రభుత్వం ముల్కీ నిబంధన లను గట్టిగా అమలుజరపడం లేదనీ, బయటివారంతా ఉద్యోగాల్లో చేరుతున్నారనీ ఉసికొల్పాడు. అసలే వేడిరక్తం అందులో చిచ్చు పెట్టాడు బలరామయ్య. ఆ చిచ్చు ఇట్టె రాష్ట్రమంతటా వ్యాపించింది. "నాన్ ముల్కీస్ గో బ్యాక్", "ఇడ్లీ సాంబార్ ముర్దాబాద్" అనే నినాదాలు గోడలనిండా కనిపించాయి. విద్యార్థులు సమ్మె చేశారు. నగరంలో పెద్ద ఊరేగింపు తీశారు. ఆ వార్త తెలిసి పరిగెట్టాడు బలరామయ్య. అతడు బహిరంగంగా సహాయం చేయడంలేదు. అయినా అతని హస్తం ఉందని అందరికీ తెలుసు. ఆ రోజు ప్రభుత్వాన్ని గడగడలాడించా లనుకున్నాడాయన. తన సత్తా ఎరుకపరచ దలిచాడు. తన మనుషుల్ను ఊరేగింపులోకి పంపాడు.

ఊరేగింపు ఉధృతంగా వుంది. ఉద్రేకం ఉప్పెనలా పొంగుతూంది. నినా దాలు మిన్నంటుతున్నాయి. ఊరేగింపులోంచి రాళ్ళు కురిశాయి. దుకాణాల అద్దాలు పగిలాయి. ఈ ఉప్పెన అటుసాగింది. దుకాణాలమీద పడ్డది. దుకాణాలు బద్దలవు తున్నాయి. దోపిడి సాగుతూంది. పోలీసులకు అదను దొరికింది. ధన ధనా తుపా కులు కాల్చారు. తూటాలు దూసుకుపోతున్నాయి. మనుషులు ఒరుగుతున్నారు. జనం చెల్లాచెదరై పోతూంది.

నిముషాల్లో రోడ్డు నిర్జనం అయింది. కళేబరాలు రోడ్డుమీద పడిపోయాయి. రోడ్డు సాంతం రక్తంతో నిండిపోయింది. ఉద్యమానికి పదిమంది బలియైనారు. పసి బాలురు ఒరిగారు. పదిమంది రక్తంతో తర్పణం చేశారు నాయకులు. ఒళ్ళు విరుచుకున్నారు. జబ్బలు చరుచుకున్నారు. పొంగిపోయారు. గెలిచామనుకున్నారు. గంతులు వేశారు.

తెల్లవారి విద్యార్థులను మంతనాలకు పిలిచింది ప్రభుత్వం. మధ్యవర్తిగా బలరామయ్యను ఎన్నుకున్నారు విద్యార్థులు.

ప్రతిపక్షాలవారు ప్రభుత్వాన్ని పత్రికల్లో తీవ్రంగా విమర్శించారు. వీరభద్రం ప్రభుత్వం నాజీ దురంతాలకు దిగిందన్నాడు. నైజాంనవాబును మించిపోయిం దన్నాడు. పోలీసులు అదుపు, ఆజ్ఞ లేకుండా కాల్పులు జరుపుతున్నారు. కాల్పుల్ల విషయంలో బహిరంగ విచారణ జరపాలి. కాల్పుల్లో చనిపోయినవారి బంధువుల నష్టపరిహారం చెల్లించాలి. ముల్కీ నిబంధనలను గట్టిగా అమలుజరపాలి అంటూ పత్రికా ప్రకటన చేశాడు. అంతేకాదు ప్రతిపక్షాలవారి నందరినీ కూడదీసి ఒక బహి రంగసభ చేశాడు. అక్కడ ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు.

ప్రభుత్వం పాక్షికంగా వ్యవహరిస్తూంది. తమ పార్టీవారు ఎన్నికైన ప్రాంతాల్లోనే అభివృద్ధి కార్యక్రమాలు అమలుపరుస్తూంది. కావాలని ప్రతిపక్షాలవారి ప్రాంతాలను విస్మరిస్తూంది. ఇది ఎక్కడి ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్యం మీద ప్రజల విశ్వాసం పోతున్నది. మళ్ళీ ఆయుధం పట్టాల్సిన పరిస్థితిని ప్రభుత్వం కల్పిస్తూంది. ఈ పరిస్థితిని ఎదుర్కోకుంటే ప్రమాదకర పరిస్థితులు ఏర్పడ్తాయి అనే ధోరణిలో ఉపన్యాసాలు సాగాయి. ప్రభుత్వాన్ని ఘాటుగా విమర్శించినందుకు ప్రజలు ఉబ్బిపోయారు. కరతాళధ్వనులతో తమ ఉత్సాహాన్ని వ్యక్తపరిచారు.

"నా ప్రాంతంలో ఇంతవరకు ఒక్క పాఠశాలకూడా స్థాపించలేదు. అందును గురించి అనేకసార్లు మంత్రులనూ, అధికారులనూ కలుసుకున్నాను. లాభం లేకపోయింది. ప్రతిపక్షాలవారందరూ ఏకమై కృషి చేయాలి. ప్రజలు ప్రభుత్వపు ఈ కుట్రను భగ్నంచేయాలి" అని ఉపన్యసించాడు వీరభద్రం. ప్రజలు ఆ ఉపన్యాసాన్ని ఎంతో మెచ్చుకున్నారు. "ఇన్క్విలాబ్ జిందాబాద్" అనే నినాదాల్ను కూడా చేశారు.

చివరకు కాల్పుల్లో చనిపోయినవారి విషయంలో సంతాప తీర్మానం ప్రవేశపెడ్తూ బహిరంగ విచారణ జరగాలనీ, నష్టపరిహారం చెల్లించాలనీ ముల్కీ నిబంధనలను గట్టిగా అమలు జరపాలని తీర్మానం ఆమోదించారు.

సభ సమాప్తం అయింది.

పత్రికలు ఈ వార్తకు బాగా ప్రాధాన్యం ఇచ్చి ప్రకటించాయి. కొన్ని పత్రికలు సంపాదకీయాలు కూడా వ్రాశాయి.

తెల్లవారి బలరామయ్య పత్రికా ప్రకటన చేశాడు. ప్రతిపక్షాలవారి కోర్కెలు న్యాయసమ్మతమైనవే నన్నాడు. ఒక్క బహిరంగ విచారణ తప్ప మిగతా అంశాలను గురించి తాము ఏకీభవిస్తామన్నారు. ఈ విషయంలో ప్రభుత్వంతో చర్చలు సాగుతున్నాయన్నారు. తాము సూచించిన అంశాలను బలపరిచినందుకు ప్రతిపక్షాలవారికి కృతజ్ఞత తెలియపరిచారు.

బహిరంగ విచారణే తమ ముఖ్యాంశమనీ అది తప్పక జరగాలనీ వీరభద్రం పట్టుపట్టాడు.

దేశంలో ఇదొక ప్రధాన అంశం అయింది. ప్రతిరోజూ పత్రికల్లో గరం గరం వార్తలు రాసాగాయి. ప్రజల్లో అందును గురించే చర్చ సాగింది. మధ్యతరగతి ప్రజలు అసలు సమస్య ఏమైందని తెల్లమొఖాలు వేశారు.

ఇప్పుడు బలరామయ్య బలం పెరిగింది. విద్యార్థులేకాక, ప్రతిపక్షాలవారూ, ప్రజలూ ఆయన్ను బలపరుస్తున్నారు. ఆ బలంతో మంతనాలు ప్రారంభించాడు బలరామయ్య. ప్రభుత్వానికి అతన్ని కాదనే దమ్ములు లేకుండా పోయినాయి. అయినా మంతనాలు చాల రోజులు సాగేయి. వాటిని గురించి రోజూ పత్రికల్లో వచ్చేది.

బలరామయ్యగారి పేరు, వారు విలేకరులతో జరిపిన గోష్ఠి పత్రికలకు తప్పనిసరి అయిపోయినాయి.

తుదకు మంతనాలు ముగిశాయి. ప్రభుత్వ ప్రకటన వెలువడింది. ముల్కీ నిబంధనలను గట్టిగా అమలుపరుస్తామనీ, కాల్పుల్లో మరణించిన వారి కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించబడుతుందనీ ప్రకటించారు ముఖ్యమంత్రి. పాత్రికేయుల గోష్ఠిలో బలరామయ్యా ఉన్నాడు. తనకు సంతృప్తి కలిగించిందన్నాడు.

విద్యార్థులు దాన్ని తమ విజయంగా భావించారు. బ్రహ్మాండమైన బహిరంగ సభ చేశారు. బలరామయ్యను పూలదండల్లో ముంచెత్తారు. ఒక పెద్ద ఊరేగింపు చేశారు. బలరామయ్యను ఊరేగించారు.

అంతటితో ఆ అధ్యాయం ముగిసింది.

తమ ప్రతిపాదన నెగ్గనందుకు ప్రతిపక్షాలవారు కన్నెర్ర చేశారు. అన్ని పక్షాలవారూ సమావేశమై ముక్తకంఠంగా విచారణ జరపాల్సిందని ప్రకటించారు. మంత్రులను కలుసుకున్నారు. అధికార్లను కలుసుకున్నారు. ప్రభుత్వం కొంత వారి వైపు మొగ్గుచూపిన మాట వాస్తవం. కాని బలరామయ్య బెదిరించాడు. ప్రభుత్వానికి తన మద్దతును ఉపసంహరించుకొంటానన్నాడు. విశ్వాస రాహిత్య తీర్మానాన్ని బల పరుస్తానన్నాడు. బహిరంగంగా అతడు చేసిన ప్రకటన ఏమంటే-

"ప్రతిపక్షాలది రాజకీయ స్టంటు. సమస్యలు పరిష్కారమైనాయి. నష్టపరిహారం చెల్లించబడింది. ఇప్పుడు విచారణ జరపడంవల్ల ప్రయోజనం ఏమిటి? ప్రతిపక్షాలు రాజకీయ ప్రయోజనాలకోసం విద్యార్థులను వాడుకొంటున్నారు. వారిని రెచ్చగొట్ట చూస్తున్నారు. విద్యార్థులు, ప్రజలు వారికి బుద్ధిచెప్పాలి."

ప్రభుత్వం కూడా సుమారు ఇలాంటి ప్రకటనే చేసింది.

వీరభద్రం రెచ్చిపోయాడు. ప్రతి ప్రకటనలు చేశాడు. ప్రతిపక్షాలవారు సమావేశమై పాక్షిక విధానాన్ని గురించి విమర్శించారు. దాన్ని బట్టబయలు చేయాలని తీర్మానించారు. తమ తమ నియోజక వర్గాలలోని అన్ని గ్రామాల్లోనూ పాఠశాలలు ఏర్పాటు చేయాలన్నారు. అందును గురించి బలమైన ఉద్యమం నిర్మించాలని తీర్మానించారు.

ఇంతటితో ఈ అధ్యాయమూ ముగిసింది.

అసలు నిరుద్యోగ సమస్య ఏమైనట్లు? అని ఒక వీధి మానిసి ప్రశ్నించుకున్నాడు.

* * *

"సుమతి తండ్రి చనిపోయాడు"

సుమతి ఇంకా ఆస్పత్రిలో ఉండగానే వార్తఅందింది. అయితే వార్తఅందింది రామయ్యకు. రామయ్య వార్త విన్నాడు. చకితుడైనాడు. సుమతి తండ్రి ముసలివాడే. అయినా బాగా ఆరోగ్యంగా ఉండేవాడు. కర్ర అందుకుంటే పదిమందికి

జవాబు చెప్పగలవాడు. ఒక్క పన్ను ఊడలేదు. శనగలు నమిలేవాడు. ఒక్క వెంట్రుక తెల్లబడలేదు. ఒక్క ఊపున పదికోసులు నడిచేవాడు. తిన్నప్పుడల్లా యాభై గారెలు తినేవాడు. అతడు ఎన్నడూ జిర్రున చీదలేదు. బాగా ఆస్తిగలవాడు. అయినా ఉదారుడు. పేదా, బిక్కాని కనిపెట్టి ఉండేవాడు. ప్రజల ఆదరాన్ని చూర గొన్నవాడు. అతనికి ఒక్కతే కూతురు - సుమతి. అంటే వారి తరవాత ఆస్తికంతటికీ సుమతి వారసురా లవుతుంది. పరోక్షంగా ఆ ఆస్తి రామయ్య పరం అవుతుందని అర్థం. ఆస్తికంతటికీ తానే అధిపతిని అవుతానని రామయ్యకు తెలుసు. అది అంత తొందరగా జరుగుతుందనుకోలేదు.

సుమతి తండ్రిని పాము కరచింది. అదీ అర్థరాత్రి. చెంబు తీసుకొని దొడ్డికి వెళ్ళాడు. అక్కడ కాలుకు కుట్టింది. వెంటనే గ్రహించాడు. చేతిలో ఉన్న కర్రతో దాన్ని చంపేశాడు. చంపనైతే చంపాడు కాని మైకం రాసాగింది. ఇంట్లోకి వచ్చి పడ్డాడు. చొంగలు కార్చాడు- ఆదుకునే నాథుడులేడు. అది అర్థరాత్రి. ఆదుకున్నది మృత్యుదేవతే. అది తెల్లవారిం తరవాతగాని తెలియలేదు జనానికి. సుమతి ప్రసవ వార్త తెచ్చినవాడికి కళేబరం కనిపించింది. ఊరివాళ్ళు వార్త పంపించాలనే అను కుంటున్నారు. వార్తాహరుడు వాయువేగంతో పట్నంలో వచ్చి వాలాడు.

రామయ్యకు ఏమీ తోచలేదు. బలరామయ్యను అడుగుదామనుకున్నాడు. అతడు అందలేదు. సుమతికి ఈ వార్త చెప్పడమా - ఎలా చెప్పడం? ఏమని చెప్పడం? ఇప్పుడు సుమతి రామయ్యకు భార్య మాత్రం కాదు. తండ్రి ఆస్తికి వారసురాలు. సుమతి విషయంలో గౌరవం పెరిగింది రామయ్యకు. ప్రసవించిం తరువాత మళ్ళీ సుమతి దగ్గరికి వెళ్ళలేదు రామయ్య. వెళ్ళకపోవడం మంచిదే అయిందను కున్నాడు ఇప్పుడు. అతనిలోని రాక్షసుడు పెరిగాడు. అతనిని ఆక్రమిం చేశాడు. ఏం చేశాడో? అలా చేయకపోవడం మంచిదైం దనుకున్నాడు. ఆస్తి దక్కింది. దైవం తన పక్షాన ఉన్నాడనుకున్నాడు. ఆసుపత్రికి వెళ్ళాడు. సుమతి నీరసంగా ఉంది. బాగా పాలిపోయింది. పాపకు పాలిస్తూంది. రామయ్యను చూసింది. ఆమె కండ్లు వెలిగాయి.

రామయ్య వచ్చి పక్కన కూర్చున్నాడు.

"పాపను చూచినా?"

"చూచిన. అచ్చు నువ్వే"

ఆమె ముఖంలో ఒక వెలుగు వెలిగింది.

"మగబిడ్డ తల్లి పోలికైతే అదృష్టవంతుడంటరు"

రామయ్య ఆమెను చూశాడు. ఎంత నిర్మలంగా ఉంది. ఎంత అమాయ కంగా అంటుంది. అంత పాపం చేయగలదా? మరొకనికి బిడ్డను కనగలదా? వీల్లేదు వీల్లేదు. తన సుమతి మంచిది. ఇంతకాలం వెర్రి అనుమానాలకు గురి అయినాడు.

వీడు తన బిడ్డడే! తన బిడ్డడా? ఇంతలో అసలు విషయం గుర్తుకు వచ్చింది. ఎలా చెప్పడం?

"సుమతీ! మీ నాయ్నకు..."

"ఏమయింది నాయ్నకు....ఏమైంది చెప్పండి" ఆవేశం, ఆతురత, దుఃఖం, బాధ గూడుకట్టుకున్నాయి మాటల్లో....

"ఏంలేదు బీమారైందట!"

ఆమె మనసు కీడు శంకించింది.

"నిజం చెప్పండి. నాకేదో భయం భయంగున్నది" గొంతు వణుకుతూంది. దుఃఖం కళ్ళదాకా వచ్చింది. దుముకనున్నది.

"నిజంగ బీమారుగున్నడు. బతికేటట్టు లేదట."

"నాయ్నా!" అని ఏడ్చేసింది, "పోదాంపాండి. నాకు చూపులన్న అందుతాయో లేదో" అని భోరుమంది.

"నువ్వు! ఇట్ల వస్తవా?"

"వస్త. ఎళ్ళండి" అని బిడ్డను తీసుకొని లేచింది. కాదనలేక పోయాడు రామయ్య.

పసిబిడ్డతో బయలుదేరింది సుమతి. గంపెడు దుఃఖంతో బయలుదేరింది సుమతి. ఎదలో కుంపటి పెట్టుకొని బయలుదేరింది సుమతి. రామయ్య వెంట వున్నాడు. రాయిలా కూర్చున్నాడు. సాగిపోతూంది కారు. కారుచీకట్లు కమ్ముకున్నాయి సుమతికి. క్షోభ పడిపోతోంది. ఆమె మనసు అసలు విషయం తేల్చేసింది. మెదడు ఇంకా ఏవేవో ఆశలు కల్పిస్తూనే ఉంది. కడసారి చూపులు అందుతాయనుకుంటూంది. తండ్రి తనకేదో చెపుతాడనుకుంటూంది.

ఊరి పొలిమేరలోనే పసికట్టింది సుమతి. దుఃఖం పొంగుతూంది. ఊరు ఏడుస్తూంది- వాలకం తెలుస్తూనే ఉంది. ఆమెను చూసి కళ్ళు తుడుచుకునే ఆడవాళ్ళు కనిపిస్తూనే ఉన్నారు. ఇంటిముందు జనాన్ని చూచింది. నిప్పును చూచింది. ధ్రువపరుచుకుంది. కారు దిగింది. బిడ్డను కరచి పట్టుకుంది. ఉరికింది గుంపులోంచి.

తండ్రి శవం కనిపించింది.

"నాయ్నా" గావుకేక పెట్టి తండ్రిమీద పడిపోయింది. మన్నూ మిన్నూ ఏకం అయ్యేట్టు ఏడిచింది.

"నాకేం చెప్పిపోయినవు? చూడు మనవడు పుట్టిండు. నాయ్నా మనువణ్ణి చూడు ఒక్కసారి చూడు నాయ్నా! ఒకపాలి చూడు నాయ్నా బిడ్డను చూడు" పిలపిస్తూంది. రెక్కలు విరిగిన పక్షిలా కొట్టుకుంటూంది. బిడ్డ ఏడుస్తున్నాడు. ఆమె లెక్కచేయలేదు. ఆడె గుండె పగిలింది. నీరైంది. కారుతూంది. ఆమె దుఃఖం చూసే వాతే భరించలేకుండా వున్నారు.

రాళ్ళు ఏడుస్తున్నాయి.

బోళ్ళు ఏడుస్తున్నాయి.

ఇల్లు ఏడుస్తుంది.

వాకిలి విలపిస్తుంది.

అయినా సుమతి తండ్రి పలకలేదు. ఉలకలేదు. ఏ తండ్రి పలికాడు! అయినా ఏ పీనుగు ఆగింది. ఆడవారు సుమతిని లాక్కోపోయారు. మూలకుపడి ఏడవ సాగింది.

శవం లేచింది.

సుమతి గొల్లుమంది. ఇల్లు గొల్లుమంది. ఊరు గొల్లుమంది. వాటితోపాటు బాజాలు మోగాయి. వాద్యాలు మోగాయి.

శవయాత్ర సాగింది.

రామయ్య తడిబట్టల్తో ముందు నడుస్తున్నాడు. నిప్పు పట్టుకొని నడుస్తు న్నాడు. తల కొరివితో నడుస్తున్నాడు.

ఊరు సొంతం కదిలింది.

శవంవెంట ఎంతదూరం పోగలరు? శ్మశానం వరకే. అక్కడికే చేరారు జనం.

కాటికి నిప్పంటించాడు రామయ్య.

చిటపట కాలి మంటలు అంటుకున్నాయి. నాల్కలు చాచి మండాయి. అంత భారీమనిషి నిముషాల్లో బుగ్గి అయిపోయాడు.

దానాలు బాగా చేశాడు రామయ్య. ఆ పదిరోజులూ అక్కడికి ఒక జాతర సాగింది. పేదా బిక్కికి అన్నదానం చేశాడు. చుట్టుపట్ల బ్రాహ్మణ్యం సొంతం అక్కడే చేరింది. రామయ్య తిలదానం నుండి హిరణ్యదానం దాకా ఇచ్చాడు. గోదానా లిచ్చాడు. ఆబోతుని అచ్చు వేయించాడు. ఇంకా ఏవేవో చేశాడు. నలుగురూ రామయ్యను మెచ్చుకున్నారు. బాపలు రామయ్య చేతికి ఎముక లేదన్నారు. జనం జయ్యతుగా దినాలు చేశాడన్నారు.

దిన వారాలు అయిపోయాయి. చుట్టపక్కాలు వెళ్ళిపోయారు. బాపలు జారు కున్నారు. పెండ్లి ముగిసిన్నాటి ఇల్లయింది, పండగదాటిన్నాటి రోజులా ఉంది. ఇల్లు దివాళాతీసినట్లయింది. లంకంత ఇంట్లో మూడే ప్రాణాలు పీచుపీచు మన్నాయి.

రాతలూ, పూతలూ జరిగాయి. ఆస్తి సొంతం సుమతి పేర అయింది. అంతతోటి అక్కడి పని తీరింది. కాని సుమతి నలతగా ఉంది. బాగా చిక్కి పోయింది. బాబుకు జ్వరం పట్టుకుంది. ఆస్తి మార్పుకు సంబంధించిన మరికొంత తతంగం పట్నంలో ఉంది. అందుకే పట్నానికి బయలుదేరాడు రామయ్య. బండి సిద్ధం అయింది. జనం అంతా కూడారు సాగనంపడానికి. సుమతి బండెక్కింది. చూస్తే గుమ్మానికి పెద్ద తాళం కనిపించింది. తన బాల్యమూ, యౌవనమూ గుర్తుకు

వచ్చాయి. తండ్రి గుర్తుకు వచ్చాడు. తాళం కనిపించింది. బావురు మన్నది. అమ్మలక్కలు ఓదార్చారు. వెళ్ళేటప్పుడు ఏడవ రాదన్నారు. దుఃఖం దిగమింగి సుమతి కొంగుతో కళ్ళు తుడుచుకుంది.

ఎదుల మెడలలోని మువ్వలు గలగల మన్నాయి.

బండి సాగింది.

ఊరి బయటదాకా సాగనంపారు జనం.

ఆ తరువాత ఒకే బండి. మువ్వల చప్పుడు.

సాగిపోతూంది బండి. కనిపించినంత దూరం ఊరిని చూచింది సుమతి. ఆమె పుట్టి పెరిగిన ఊరది. ఎన్ని స్మృతులు మసలాయో ఆమె మనసులో. ఎన్ని మల్లె పొదలు మొలిచాయో! ఎన్ని పిడుగులు రాలేయో!

ఊరు దూరం అయింది. కనిపించడంలేదు. ఆ ఊరితో బంధం తెగింది. మళ్ళీ ఎందుకొస్తుంది తానక్కడికి? ఇంతలో పాప ఏడ్చాడు. అన్నీ మరచింది. పాపను చూచింది. వళ్ళు కాలిపోతూంది. బండి చీమ నడక నడుస్తూంది. "ఎడ్ల నదిలించండి. జల్దీ పోవాలె" అన్నది.

రామయ్య దంపతులు దిగేవరకు వరండాలో కూర్చొని ఉన్నాడు బలరామయ్య. పేపరు చదవడం మిష మాత్రమేనని కనిపిస్తూంది. ముఖం ధుమధుమలాడుతూంది. ముఖం మీద పేలాలు వేగుతున్నాయి. అర్థం కాలేదు రామయ్యకు. అయినా నమస్కరించాడు. ప్రతినమస్కారంచేసి పేపర్లో మునిగిపోయాడు. రామయ్య లోపలికి వెళ్ళాడు. సరస్వతికూడా ఏదో విచారంగా కూర్చొని ఉంది. అయినా సుమతిని చూచి లేచింది. సుమతి కన్నీరు తుడిచింది. పాపను తీసుకుంటే మండిపోతూంది వళ్ళు.

"అరె. ఎంత జ్వరం! అలా చూస్తారేం టెలిఫోను చెయ్యండి డాక్టరుకు" అన్నది సరస్వతి ఆవేశంతో.

రామయ్య అలాగే నుంచున్నాడు.

"సరే. నేనే చేస్తా" నని పాపను సుమతికిచ్చి పరిగెత్తింది.

రామయ్య ఇంకా అలాగే నుంచొని ఉన్నాడు. అతడు సరస్వతిని చూశాడు' ఆమె వెళ్ళిపోయింది. అయినా చూస్తూనే ఉన్నాడు. అంటే అతడు ముందు ఆమెను చూడలేదని కాదు. ఇప్పుడు వింతగా తోచింది ఆతనికి. ఎప్పుడూ పట్టుబట్టల్లో మిస మిసలాడుతుండేది. ముఖాన ఏదో దర్పం ఉండేది. అలంకారంలో ఆమెనుమించిన చేయి లేదనుకున్నాడు. ఇప్పుడు? ఈ సరస్వతి? ఎంత మార్పు? మామూలు ఖద్దరుచీర కట్టుకుంది. అలంకారాలు లేవు. ఆ దర్పం మాయం అయింది. ముఖంలో సౌమ్యత వచ్చేసింది. పక్కకు చూస్తే రాట్నం కనిపించింది. ఏకుల బుట్ట కనిపించింది. సగం దారం ఉన్న ఏకు కనిపించింది. వడకుతూ వద్ద

కుతూ లేచిపోయినట్లు కనిపిస్తూంది. పక్కలకు చూచాడు. తెరలు ఖద్దరువి- టేబిల్ క్లాత్ ఖద్దరుది - దిండ్లు ఖద్దరువి. పరుపుల తొడుగులు ఖద్దరువి. ఇల్లంతా ఖద్దరు మయంగా ఉంది. ఒక ఖాదీభాండార్ వెలిసినట్లుంది. వెంటనే స్ఫురించింది ఆలుమగల జగడానికి కారణం. ఈవిడ ఇల్లు ఖద్దరుతో నింపేసింది. అతడు అది పనికిరాదని ఉంటాడు. ఈవిడ జీవితమే మారిపోయింది. అది అతనికి నచ్చి ఉండదు. అదిసరే, అసలు సరస్వతి జీవితంలో ఇంత మార్పెలా వచ్చింది? ఎలా వచ్చింది? అదే ప్రశ్న తిరిగి తిరిగి అతని మెదడులో మసలింది.

ఒకసారి చుట్టూ తిరిగి చూచాడు రామయ్య. ఎక్కడా మిల్లుబట్ట కనిపించ లేదు. ఇంతలో డాక్టర్ వచ్చేసింది. ఆమెను చూచిం తరవాత గాని పత్రిక వదల్లేదు బలరామయ్య. "డాక్టరెందుకు? ఏమైంది" అని లోపలికి నడిచాడు. సుమతిని చూచి "ఏంది కోడలొచ్చినాది?" అడిగాడు. అంతా డాక్టరు దగ్గరే ఉన్నారు. ఎవరూ వినిపించుకోలేదు. అతనూ అక్కడికే చేరాడు. బాబును చూచాడు. అతని ఆనందం, సంతోషం వెన్నెముకలోంచి పుట్టుకొచ్చాయి. ఎంత బాగున్నాడు అనుకొన్నాడు. డాక్టరు ఇంజక్షన్ ఇచ్చింది. మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిపోయింది.

అంతా కూర్చున్నారు.

"కోడలొచ్చిందని చెప్పకపోతివి?" మళ్ళీ అడిగాడు బలరామయ్య.

"వస్తనే ఉంటిమి. మీరు పత్రిక చదువుతుంటిరిగద"

"ఏముంటదిలే పత్రికల. అయనగని చదవాలెగద, ఇగో చూచినవా కొడుకొచ్చిండు- కోడలొచ్చింది. బాబును చూచినవా ఎంత ముదుగున్నడో?" అన్నాడు. తరువాతి మాటలు సరస్వతిని ఉద్దేశించి.

"గాంధీ అని పేరు పెడ్దామండీ" అన్నది సరస్వతి.

"ఈమెకు ఈ పిచ్చి తగిలింది. ఎన్నడన్న పెట్టుకున్నామా అసువంటి పేర్లు. గాంధీగారు గొప్పోడే అనుకో. అయితే మాత్రం? మాల మాదుగుల్ను బాపనోళ్ళల్ల కలిపె. దొరలు దాతలు ఉండొద్దనె. అదేమన్న జరిగెడిదేనా? నువ్వే చెప్పు" రామయ్య నడిగాడు.

"బాబు గాంధీజీ అంతవాడు కావాలి. ఆయనంటే బ్రిటిషువాళ్ళే గడగడలాడేరు. గాంధీజీ కలలుగన్న రామరాజ్యం రావాలి. అందుకే బాబుకు గాంధీ అని పేరుపెట్టుతున్న" అని లేచిపోయి రాట్నంముందు కూర్చుంది దారం తీయడానికి.

రామయ్యకూ, సుమతికీ ఏమీ అర్థం కాలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. అసలు బలరామయ్య తనను కొడుకుగానూ, సుమతిని కోడలుగానూ పరిచయం చేసినప్పుడే ఆశ్చర్యపడ్డాడు. అందులోంచి ఇంకా కోలుకోకముందే ఇది. ఏమనాలో? ఎటు మాట్లాడాలో అర్థంకాక తికమకలో పడిపోయాడు. ఈలోగా బాబు

లేచాడు. ఏడ్చాడు. ఇద్దరూ అటువైపు చూచారు. సుమతి బాబును ఎత్తుకుంది. పాలివ్వ డానికని గదిలోకి వెళ్ళిపోయింది.

బలరామయ్య, రామయ్య ఎదురుబదురుగా కూర్చున్నారు. ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు. గది నిశ్శబ్దంగా ఉంది. రాట్నపు సంగీతం మాత్రం వినిపిస్తూంది. సరస్వతి ఎటూ చూడ్డంలేదు. ఆమె ధ్యానం సూలుపోగుమీదే ఉంది. రోజురోజుకూ ఎక్కువ దారం తీయాలనీ, మంచిదారం తీయాలనీ సంకల్పించిందామె. అందుకే దృఢనిశ్చయంతో పనిచేస్తుందామె.

"చూసినవా ఇది కత!" బలరామయ్యే మౌనాన్ని భంగపరచాడు.

రామయ్య వెల వెలబోయి చూచాడు. "ఏమిటా కధ?" అన్నట్లున్నాయి చూపులు.

"మనం ఖద్దరు కట్టుకోవాల్నయా! తప్పదాయె! ఆ గాంధీగారు చెప్పిపోయిం డంటాండిరి, నిజంగ చెప్పిండో లేదో తెల్వదాయె. ఆయన్ను నేను చూడనైతి. చెప్పింది విననైతి. ఆయనగని మనోండ్లు చెప్పిరి. మనమేమొ ఇనాల్నాయె. నలు గురు చూసెటందుకు కట్టుకుంటున్న మనకో. అయ్యగారు అందరికి చెప్పి ఉల్లిగడ్డ తినొద్దని తానేం తినకుండున్నాడు. మొగోళ్ళం మనమెట్లనన్న ఏడుస్తం. ఆడోళ్ళ కెందుకయా అది? ఆ సుందరరావుకాడికి పొయ్యొచ్చింది. మనిషి పూర మారిపోయిం దనుకో. చూస్తున్నవు గద. ఇల్లంతా ఖద్దరు చేసింది. ఈ ముతకబట్ట లెందుకయ్యా మనకు? మా తాతలు కట్టిన్రా? తండ్రులు కట్టిన్రా? ఆ మాటంటె కోపమొస్తది. ఇగ కిర్రుకిర్రుమని రాట్నం తిప్పుత కూచుంటది. నువ్వన్న చెప్పు జర" అన్నాడు బలరామయ్య. అంతటితో తన బరువేదో దించుకున్నట్లు సిగరెట్టు వెలిగించాడు.

రామయ్య ఇరకాటంలో పడ్డాడు. ఏంచెప్పాలో అర్థంకాలేదు. కాస్త తట పటాయించాడు. ఏదో ఆలోచన వచ్చింది. కాని బలరామయ్యను ఏమని సంబోధిం చాలో అర్థంకాలేదు. అమృతవాణి కొడుకుగా-ఆడ బాప కొడుకుగా- అతి నీచంగా పెరిగాడు గడీలో. ఆ నాడు బలరామయ్యను "దొరా?" అని పిలిచాడు. ఊళ్ళోకి "సంగం" తెచ్చాడు వీరభద్రం.

"సంగం" ఆంధ్రమహాసభ. సంగంలో రైతులు చేరారు. కూలీలు చేరారు. "సంగం" బలం హెచ్చింది. పేదలు దొరను బెదిరిస్తున్నారు. వింతగా ఉంది జనా నికి. వణుకుగా ఉంది దొరకు! జనం వెల్లువలా పొంగుతున్నారు. అప్పటికి తాను చిన్నవాడు. తనకూ ఉద్రేకం వచ్చింది. ఉత్సాహం వచ్చింది. తానూ దొరను ఎదిరిం చాలనుకున్నాడు. వీరభద్రం దగ్గరికి వెళ్ళాడు. అడిగాడు వీరభద్రం నవ్వాడు.

"దొర పేరు తెలుసా?" అడిగాడు వీరభద్రం.

తనకే కాదు, ఊళ్ళో ఎవరికీ తెలియదు. అతడు ఊరికి దొర. అంతే తెలుసు తనకు. అంతే తెలుసు అందరికీ.

"బలరామయ్య" వీరభద్రం చెప్పాడు.

తెరలు తెగిపడ్డట్లనిపించింది. వెలుగు చిమ్మినట్లనిపించింది.

"దొరకు పేరుపెట్టి పిలువు" వీరభద్రం అన్నాడు.

తనకు దొరను బలరామయ్యా అనాలనిపించింది ఆ రోజుల్లో. తాను అడబాప కొడుకు-దాసీ పుత్రుడు-అనగలడా? అసలు దొరముందు నిలువగలడా? కాని అలా అంటే తానేదో వీరుడై పోతాననుకొన్నాడు. ఎలా అనడం? ఎవరి ముందు అనడం? తల్లి దగ్గరికే వెళ్ళాడు. మెల్లగా అన్నాడు, "బలరామయ్య" అని. అమృతవాణి రెచ్చిపోయింది. తనను పట్టుకొని బాదేసింది. ఇంత గుడిసెలో తానూ-తల్లి. అంత పెద్ద గడిలో దొరా - దొరసాన్లు. తానూ దొరకే పుట్టాట్ట! తన తల్లి దొరకు పెండ్లామే. ఆమె దొరసాని ఎందుక్కాదు? తాను దొరబిడ్డ ఎందుక్కాడు? తాను బలరామయ్యను నాయనా? అని ఎందుకు పిలువలేడు? అందులో ఏదో అన్యాయం కనిపించింది. వీరభద్రం చెప్పింది నిజమనిపించింది. దొరలంతా దొంగలు. అందుకే తాను దొరను బలరామయ్యా అని పిలవాలనుకున్నాడు. తల్లి ముందంటే చావతన్నింది. అయినా తనలోని తపన పోలేదు. ఇంట్లోంచి బయల్దేరాడు. ఊరు బయటికి చేరాడు. చెరువుకట్ట ఎక్కాడు. దిగాడు. ఇంకాసాగేడు. మర్రిచెట్టు - పరుపుబండ. అక్కడ కాస్సేపు కూర్చున్నాడు. చుట్టుపట్ల చూశాడు. ఎవరూలేరు నిర్మానుష్యంగా ఉంది. అనేద్దామనుకున్నాడు. బల అనిమాత్రం అనగలిగాడు. ధైర్యం చాలలేదు. ఇంకా దూరం వెళ్ళాడు. గుట్టల్లోకి వెళ్లాడు. గుట్టలమధ్యన నుంచున్నాడు. చుట్టూ చూశాడు. బలరామయ్యా అన్నాడు మెల్లగా, గుట్టలుకూడా కూనిగా బలరామయ్యా! అన్నాయి. ధైర్యం వచ్చింది. గట్టిగా అరచాడు. గుట్టలూ, దొనలూ, గుహలూ అరచాయి. ఆశ్చర్యం అనిపించింది. ఇంకా బిగ్గరగా అరచాడు. అవీ బిగ్గరగా అరచాయి. అలా చాలాసార్లు అరచాడు. అంతటితో బరువు దించుకున్నట్లయింది. ఏదో ఘనకార్యం చేసినవానిలా సాగాడు. వీరునిలా సాగాడు. విర్రవీగుతూ సాగాడు. శూరుడై సాగాడు.

తరువాత కొంతకాలానికి వీరభద్రం ఇంటికి వెళ్ళాడు - రాత్రిపూట ఎవరికీ తెలియకుండ. వీరభద్రంతో బలరామయ్య అన్నాడు. వీరభద్రం తన వీపు చరచాడు. ఏవేవో చెప్పాడు. తనకు అర్థమైంది "దొరలు దొంగలు" అనే విషయం మాత్రమే. తరవాత కాలం క్రమంగా పెరగసాగింది. ఎదగసాగింది. బలరామయ్యను దొంగా అనే పిలవసాగారు. దొర ఊరు విడిచి పారిపోయేడు. అప్పుడు తానూ బిగ్గరగా అందరితోటి దొంగపారిపోయాడు అన్నాడు. జనం గడీని దోచుకున్నారు. తనను పూచికపుల్ల సైతం తీసికెళ్ళనీయలేదు తల్లి. ఊరివాళ్ళ కాళ్ళావేళ్ళా పడి బ్రతిమిలాడింది దొర సొమ్ము దోచుకోవద్దని. అంతా పోయింది. గడీ గోడలు విరిగి కూలేదశలో ఉన్నాయి. అయినా దాన్ని కాపాడమన్నది తల్లి. ఆ దొరకు నీమీద అంత ఉండే ఎందుకు తీసికెళ్ళలేదు అని అడిగాడు తాను. అప్పటికి తాను పెద్దవాడైనాడు. తల్లి తనను కొట్టలేక పోయింది. కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. కాళ్ళు కడుపులూ పట్టుకొని బతిమిలాడింది. తప్పలేదు. అయినా మనసు ఆదేలాగింది. అర్ధరాత్రి తల్లికి చెప్ప

ఖుండా వెళ్ళిపోయాడు-వీరభద్రం దగ్గరికి. వీరభద్రం తనకో తుపాకి ఇచ్చాడు. నమ్మినబంటును చేసుకున్నాడు. డబ్బు తన దగ్గరే దాచాడు. డబ్బు చూచి న్నాటి నుంచీ తనకో ఆలోచన వచ్చింది. ఈ డబ్బుతోనే గదా దొర. దీంతోనే అతన్ని లొంగదీయాలనుకున్నాడు. తాను దొరను మించిపోవాలనుకున్నాడు. అవకాశంకోసం ఎదిరిచూచాడు. డబ్బు చిక్కించుకొని పారి వచ్చాడు. అప్పుడు బలరామయ్యను చూచాడు. బలరామయ్యా అనాలనిపించలేదు. "దొరా!" అన్నాడు. తల్లి పోయింది. తనకు ఆస్తి వచ్చింది. అధికారం వచ్చింది. పేరు వచ్చింది. పలుకు బడి వచ్చింది. అయినా బలరామయ్యను "దొరా!" అనే పిలిచాడు. బలరామయ్య ఎన్నడూ తనను కొడుకుగా గుర్తించలేదు. "రాముడూ!" అనే పిలిచాడు. ఇప్పుడు తన మామ ఆస్తి తనకు కలిసింది. తనకో బిడ్డ గలిగాడు. ఈరోజు తనను కొడుకుగా గుర్తించాడు! సుమతిని కోడలన్నాడు! మరి తానేమని పిలవాలి బలరామయ్యను? తండ్రిగానా? తప్పేమీ? వాస్తవంగా తండ్రేగా? స్వరాజ్యం తనకెంత మేలు చేసింది? కాకుంటే ఈ దొర నన్ను కొడుకనేవాడా? అనుకొని నాయ్నా అని పిలుద్దామనుకున్నాడు. కాని "అయ్యా!" అన్నాడు.

"అయ్యా! ఇదెందుకొచ్చిందో! ఎందుకట్ల ఫికర్ చేస్తరు? దేవుడు ఏది చేసినా మన మంచికే చేస్తడు. చిన్నమ్మకు మాత్రం ఎరకలేదా." అన్నాడు రామయ్య.

"ఎరకలేక చేస్తున్నాది?" వెటకారం ధ్వనించింది బలరామయ్య మాటల్లో.

సరస్వతి మాట్లాళ్ళేదు. దారం తీస్తూనే ఉంది.

ఎదుటవారు ఏమీ అనకపోయేవరకు చిర్రెత్తింది బలరామయ్యకు. చిటపటలాడి లాభంలేదని గ్రహించాడు. వేరే విషయం ఏదైనా ఎత్తుకోవాలని గోడలూ, కప్పూ చూచాడు. ఏమీ దొరకలేదు.

"ఇంతకూ దినవారాలు బాగ చేసినావా!"

"బాగనే చేసిన. బాపనోళ్ళకు బాగనే పెట్టిన. ఊళ్ళోళ్లందరికి అన్నాలు పెట్టించిన-తల్చుకుంటరు"

"మంచి పని చేశావు. అన్నదానాన్ని మించినదానం లేదు" దారం తీస్తూనే అన్నది సరస్వతి.

"దానధర్మాలు శాన చేసినం. సర్లేగని ఇప్పుడన్న ఎరకైందా ఆ మంగి ముండను చేసుకుంటనంటివి?"

మంగమ్మ పేరు వినగానే ఏదో కలుక్కుమన్నది రామయ్యకు. మంగమ్మ కొడుకు తన కొడుకు మనసులో మసలాడు.

"ఇప్పుడు చూసినవా ఎంత ఆస్తి వచ్చె. ఏదైన కాస్త ఆలోచించిన చేయాలె. పేరేం పెద్దవోగని బారసాల జోరుగ చెయ్యి—యాడ చేస్తవు ఈడనా? ఊళ్ళెనా?"

"ఊళ్ళనే చేస్తామనుకుంటున్న. నలుగురికి అన్నాలు పెట్టొచ్చు"

"చాలా మంచిది. అక్కడే చేయి. అన్నదానం చేయి" అన్నది సరస్వతి రాట్నంమీది నుంచి లేవకుండానే.

వెర్రిగా చూచాడు బలరామయ్య. "నీకు చిన్నమ్మ పిచ్చె పట్టినాది? కానియ్యి. నేనొద్దంటే ఊరుకుంటరా? సరెగాని దేవుని దగ్గరికి పోతలేవా?"

"యాదగిరి గుట్టకు పోదమనుకుంటున్నం"

"యాదగిరి గుట్టకేంది? ఏడుకొండలకే పోవాలె. మంత్రులందరు దినాం ఆడికే పోతున్నరు."

"అట్లనే పోదం"

ఇంతలో ఇంటిముందు కారొచ్చి ఆగింది. మంత్రిగారు కబురు చేశారని చెప్పాడు వచ్చిన మనిషి. ఖాదీబోర్డు మీటింగుంది. మరిచిపోయాడు బలరామయ్య. బయల్దేరాడు. "వస్తవా? మంత్రులు గింత్రులు పరిచయమైతరు?"అన్నాడు రామయ్య నుద్దేశించి.

రామయ్యను ఇంట్లో ఉంచిపోవడం బలరామయ్యకు ఇష్టంలేదు. సరస్వతి వయసులో ఉంది. రామయ్యా వయసులో ఉన్నాడు. మనిషిని ఎవడు నమ్మాడు! అందుకే వరుసలు కలిపేశాడు. అక్కడికి కొంతవరకు ఆనకట్ట. సరస్వతి అవలంబించే సర్వోదయమూ అతనికి గిట్టదు. అయినా సహిస్తున్నాడంటే సరస్వతి ఏదో వేదాంత ధోరణిలో పడట్లనిపించింది. అందుకోసం తూష్ణీంభావించాడు- ఆమెను మాన్పించలేకకాదు.

"అట్లనే వస్త" అని బయల్దేరాడు రామయ్య.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోవడంతో ఇంట్లో మిగిలింది సుమతి, సరస్వతి మాత్రమే. సుమతి తన బాబు పనిలో మునిగిపోయింది. సరస్వతి దారం వడుకుతూంది. ఆ సంగీతంలో ఆమెకేదో ఆనందం వుంది. దారం తీయడంలో లీనం అయిపోయిం దామె. సుమతికి అలా కాదు. బాబు నిద్రపోయాడు. కాసేపు గదిలో కూర్చుంది. ఏమీ తోచలేదు. వచ్చి సరస్వతి ముందు కూర్చుంది.

"కూర్చో" అన్నది సరస్వతి. తన పనిలో మునిగిపోయింది.

"అత్తగారూ? ఎందుకిట్ల దారం తీస్తరు? మనకేమన్న తక్కు వున్నదా?"

"గాంధీజీ చెప్పారు ఎవరి బట్ట వారే తయారు చేసుకోవాలని. దేనికీ మరొకరి మీద ఆధారపడగాదు" అని రాట్నాన్ని గురించీ, దాని ప్రాముఖ్యాన్ని గురించీ ఉత్సాహంగా చెప్పింది సరస్వతి.

సుమతి కేమీ అర్థంకాలేదు. కళ్ళప్పగించి చూచింది. "నువ్వు కూడా ఒక రాట్నం తీసికెళ్ళి దారంతీయి, తెలుస్తుంది గాంధీజీ ఎందుకు చెప్పిండి" అన్నది.

"నాకేం మనస్సు పట్టలేదు. దారంతీస్తే స్వరాజ్యం వస్తదన్నాడేమో గాంధీ తాతు. అది వచ్చే: మళ్ళి దారం ఎందుకు తీయాలే"

ప్రశ్న కాస్త సూటిగా ఉంది. కొద్దిగా ఆలోచించాల్సి వచ్చింది సరస్వతికి. రాట్నం క్షణం ఆగింది. తరవాత సాగింది. అన్నది, "ఇంకా గాంధీగారనుకున్న స్వరాజ్యం రాలేదు. అందరికీ కడుపునిండా తిండి, వంటి నిండా బట్ట కలిగిన్నాడే గాంధీజీ స్వరాజ్యం వచ్చినట్లు"

సుమతికి అదీ అర్థం కాలేదు. కాని ఎదురు ప్రశ్న వేయలేదు. మౌనంగానే కూర్చున్నారిద్దరూ. ఇంతలో బాబు ఏడిస్తే లేచిపోయింది సుమతి.

ఆ సాయంకాలం ప్రార్థనకు సుమతినీ రమ్మంది. సరస్వతి తన ఇంట్లోనే ఒక ప్రార్థన మందిరం తయారు చేసుకొంది. విశాలమైన శుభ్రమైన హాలు. కింద తివాచీ పరచి ఉంది. ఒకే ఒక గాంధీజి పటం ఎత్తున బల్లమీద పెట్టి ఉంది. దానికి పూలదండ ఉంది. ముందు అగరుబత్తీలు వెలుగుతున్నాయి. వాతావరణం చాలా ప్రశాంతంగా ఉంది. సరస్వతి, సుమతి కాక ఇంటిలో పనిచేసే పదిమంది ఉన్నారు- తోటమాలి, వంటమనిషి వగైరాలు. అంతా శుభ్రంగానే ఉన్నారు. అందరూ ఖద్దరే ధరించారు- ఒక్క సుమతి తప్ప. అయినా అంతస్తులు మరిచి అందరినీ అలా కూడదీయడం సుమతికి నచ్చలేదు. ఎవడు ఏ కులంవాడో? ఎవని అంతస్తెంతో? అందరినీ ఇలా కూడదీస్తూందేం అనుకుంది. మాలలను మనను ఒకటి చేయదుకదా? అనుకుంది. అయినా ఏమీ అనలేదు. దూరంగా కూర్చుంది.

సరస్వతి "వైష్ణవజనతో" చదివింది. సుమతి తప్ప మిగతావారు ఆమెతో చదివారు.

"స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్తస్య కేశవః
స్థితధీః కిం ప్రభాషేత? కిమాసీత వ్రజేత కిం?"

అనే శ్లోకం నుంచి భగవద్గీతలోని కొన్ని శ్లోకాలు చదివింది. అంతా దానిని శ్రద్ధగా విన్నారు. ఆ తరువాత కొన్ని నిముషాలు మౌనంగా ధ్యానించారు.

వాతావరణం స్నిగ్ధంగా ఉంది. శాంతంగా ఉంది. నిర్మలంగా ఉంది. ఏకాంతంగా ఉంది. ఎక్కడో ఉన్నట్లుంది. ఎంతో హాయిగా ఉంది.

ధ్యానంలో నిమగ్నురాలైంది సరస్వతి.

వాతావరణం ధ్యానం చేస్తున్నట్లున్నది.

ఆ గది ధ్యానం చేస్తున్నట్లున్నది. అందరూ ధ్యానం చేస్తున్నట్లున్నది. అంతా ధ్యానం చేస్తున్నట్లున్నది.

సుమతిపై దాని ప్రభావం పడింది.

తెల్లవారుజామున మళ్ళీ ప్రార్థన జరిగింది. రామయ్యను పిలిచింది సుమతి. రామయ్య బలరామయ్యను పిలిచాడు. తప్పలేదు. వెళ్ళాడు.

మళ్ళీ మామూలు కార్యక్రమం జరిగింది.

బయటికి వచ్చిన రామయ్యా, బలరామయ్యా ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

సుమతి కోలుకుంది. దుఃఖం అడుగంటడంతో టానిక్కులు పనిచేశాయి. వాతావరణంకూడా అందుకు కొంత సహాయ పడిందనే చెప్పాలి. బాబు కూడా బాగుపడ్డాడు. వారు వూరికి ప్రయాణం అయినారు. ఊళ్ళోనే నామకరణం చేస్తా నన్నాడు రామయ్య. బలరామయ్యనూ, సరస్వతినీ రావలసిందని ఆహ్వానించాడు. వస్తామనే వాగ్దానం చేశారు. ఊరు చూస్తాను వారి వెంటనే వెళ్తానంది సరస్వతి. బలరామయ్య అంగీకరించలేదు. బారసాలకు ఇద్దరమూ వస్తామన్నాడు.

బాబుతో రామయ్యా, సుమతీ కారెక్కారు. బాబుని తీసుకొని ముద్దాడింది సరస్వతి. ఆ మధ్య ఆమెకు బాగా అలవాటయ్యాడు బాబు. వదలడమంటే బాధని పించింది. వదలకుండా ఉండలేకపోయింది. బాబును సుమతికి ఇచ్చేసి గుడ్డతో నీరు కుక్కుకుంది. కారు సాగిపోతుంటే కన్నీరు ధార కట్టింది. బలరామయ్య చూచాడు. అతని గుండెలోనూ దుఃఖం చేరింది.

"మనకూ ఒక బాబుంటే!" బలరామయ్య అనుకోకుండా వచ్చేసిన మాటలవి. సరస్వతి ఒక్కసారి ఎగా దిగా చూచింది బలరామయ్యను. అక్కణ్ణుంచి వెళ్ళి పోయింది.

బలరామయ్య ఆవిడను చూస్తూ నుంచుండిపోయాడు. ఒక చిరునవ్వు నవ్వు కొని లోపలికి వెళ్ళిపోయాడు.

రామయ్య ఊరికి వచ్చాడు. బాబు బారసాల ఘనంగా చేయాలని సంకల్పిం చాడు. ఏర్పాట్లు చేయసాగారు. పందిళ్ళు వేశారు. బస్తీనుంచి బండ్లతో సామాను వచ్చింది. వంటవారొచ్చారు. పాత్రసామాగ్రి దిగింది. ఊరివారినందరినీ పిలిచాడు చుట్టుపట్ల వాళ్ళనూ పిలిచాడు. అత్తగారి ఊరివారందరినీ రమ్మన్నాడు.

తానూ, సుమతీ వెళ్ళి వీరభద్రాన్నీ, మంగమ్మనూ పిలచివచ్చారు. పిలవ నైతే పిలచాడు కాని మంగమ్మను చూచి మనసు కలుక్కుమంది. బాగా శుష్కించి పోయింది. ప్రకాశం పెద్దవాడవుతున్నాడు. వాడు ఎక్కణ్ణుంచో పరిగెత్తి వచ్చి తల్లి కాళ్ళకు చుట్టేసుకున్నాడు. "ఎవరే వచ్చింది?" అడిగాడు తల ఎత్తి తల్లి ముఖంలోకి చూస్తూ. రామయ్య నిలువలేకపోయాడు. గిరుక్కున తిరిగి వచ్చేశాడు. తన బిడ్డను దూరం చేసుకున్నానను కున్నాడు. వాడు అక్షరాల తన రూపే! సుమతి బిడ్డ తన బిడ్డేనా? మళ్ళీ సంశయం మనసును పీడించసాగింది.

జనం బండ్లతో వస్తున్నారు. ఊరిబయట విడిసిన బండ్లకు గడ్డి,నీరు ఏర్పాటు చేశాడు. గ్రామం సాంతం జనంతో నిండిపోయింది. వీధులే భోజనశాలలైనాయి. లడ్డూలు, జిలేబీలు, రకరకాల కూరగాయలు. వందలమంది భోజనాలు చేస్తున్నారు. ఊరినిండా పండగ పరుచుకుంది. అన్నం. అన్నం. అన్నం. ఎక్కడ చూచినా భోజ నాలే. పేదా, బిక్కీ అంతా తిని తేన్చారు. రామయ్య పెట్టిన భోజనాలను గురించి ఊరంతా చర్చ సాగింది. రామయ్యను ధర్మాత్ముడన్నారు. తమకు తెలిసినంత వరకు ఇలా పండుగ చేసినవారు లేరన్నారు.

సాయంకాలానికి ఆడవారి లాంఛనాలు మొదలైనాయి.

సుమతి బావిలో చాద వేసింది. లోపలికి వస్తుంటే గుమ్మందగ్గర అడ్డగించారు అమ్మాయిలు. 'ఊరికెనే ఎట్లపోతవ్? మీ ఆయన పేరు చెప్పు' అన్నారు. సుమతి ముందు సిగ్గుపడింది. తరవాత చెప్పక తప్పలేదు. మూడుసార్లు చెప్పించుకొని గాని విడువలేదు ముగుదలు. తరవాత తొట్టెలోవేశారు బాబును. బాబును బంగారంతో ముంచేశారు! పేరు పెట్టడాన్ని గురించి చర్చ జరిగింది. రామయ్యను పిలిచారు. అడిగారు. గాంధీ అన్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు, ఈ పేరేమిటని? "మనకు స్వరాజ్యం తెచ్చింది గాంధీజీ. అందుకే ఆయన పేరు పెట్టాలనుకున్నాను" అభ్యంతరం ఎవరూ చెప్పలేదు.

తరవాత పేరంటాలు, ఫలదానాలూ అన్నీ జరిగాయి.

మంగమ్మ అక్కడికి వచ్చింది. కలిసిమెలిసి తిరగలేకపోయింది. ఆమెనెవరూ పట్టించుకోనూలేదు. అన్నీ ముగియడంతో కాలుకాలిన పిల్లిలా గబుక్కున బయటపడింది. ఆమెగుండె నిండిపోయింది. దుఃఖాన్ని గొంతులో కుక్కుకొని బయల్దేరింది. ఇంటికివెళ్ళి బావురుమని ఏడ్చేసింది.

వీరభద్రం అప్పుడే ఇంట్లో అడుగుపెట్టాడు. మంగమ్మ స్థితి చూచాడు. మాట్లాడలేదు. ఇంటిముందలి అరుగుమీద కూర్చుని సిగరెట్టు వెలిగించాడు.

సందడి పూర్తిగా తగ్గిపోయింది. ఊరినిండ విస్తరాకులు పడి ఉన్నాయి. వాటికోసం కుక్కలు పోట్లాడుకుంటున్నాయి.

బీడీలు కాల్చుకుంటూ మల్లియ్యా, మస్తాను వీరభద్రం దగ్గరికి వచ్చారు. కూర్చుంటూనే అడిగారు "ఏమిటండీ గిదంత?" అని. వెంటనే మస్తానే జవాబు చెప్పాడు "ఎన్నికలొస్తున్నాయి కాదుండి?" అని.

వీరభద్రం ఏదో ఆలోచిస్తున్నాడు. విన్నట్లులేదు. "మాట్లాడరు!" అని అడిగాడు మల్లియ్య.

"ఏం మాట్లాడమంటవు! ఇదొక ఎత్తు. ఒక జిత్తు. సారాయి సంతర్పణ చూచారా? ప్రజల్లో ఏదైనా కాస్త చైతన్యం మిగుల్తే దాన్ని ధ్వంసం చేయడానికి దానధర్మాలు బాగా పనికి వస్తాయి. పిడికెడన్నం పెడ్తే మురిసిపోతాడు పేద. పెట్టినవానికి దాసుడై పోతాడు. ఆ అన్నంలో విషం ఉంటుందని, అది తనను దోచుకోవడానికి వేసిన ఎర అనీ గ్రహించలేడు. నువ్వు చెప్పావా ఓర్వలేక చెప్తున్నావంటాడు. ఈ ప్పెన తనమీదికే వచ్చిందా ఖర్మ అని వాపోతాడు. నీవు చెప్పింది నిజం అయిందని గ్రహించడు. ఈ అమాయకత్వాన్నీ, అజ్ఞానాన్నీ, మూఢత్వాన్నీ వాడుకుంటారు వారు. పెత్తనం చెలాయిస్తారు. పేదల రక్తం పీలుస్తారు. పేగులు మెడకు వేసుకుంటారు. అయినా వాటిని కనిపించనీయరు. మనం చాటి చెప్తామా మననే హంతకులంటారు. దోపిడీదార్లంటారు. గతిలేనివాళ్ళంటారు. గంపెడు గోల

చేస్తారు. సిగరెట్టు పారేసి ఊపిరి పీల్చుకున్నాడు వీరభద్రం. ఒక నిట్టూర్పు విడిచాడు. మల్లయ్యా, మస్తాన్ బీడీలు ఆర్పిపారేశారు. వాతావరణం స్తబ్దంగా ఉంది. వీరభద్రం చెప్పేది వినాలని సర్వేంద్రియాలనూ చెవులలో కేంద్రీకరించుకొని కూర్చున్నారు మల్లయ్యా, మస్తాను.

"మస్తాన్! మనం దొరలమీద దండెత్తాం. వారిని ఓడించాం. భూములు పంచాం. అది సులభంగానే చేశాం. ఎందుకో తెలుసా? దొరలు జలగలు. ఆ విషయం అందరికీ తెలుసు. వారు కొడ్తారు. చంపుతారు. మానభంగాలు చేస్తారు. అందును గురించి మనం చెపుతే తెలుస్తుంది. ప్రజలు ఉద్రిక్తులవుతారు. తిరుగుబాటుకు సిద్ధం అవుతారు. అయినారు. తిరుగుబాటు చేశారు. కాని వీళ్ళలా కాదు. మేకతోలు కప్పుకున్న పులులు. వీరు ఒక్కసారే చంపరు. ఎందుకంటె వారితో వీరికి పని ఉంది. ఓట్లు కావాలి. అందుకోసం మెల్లమెల్లగా చంపుతారు. తాము చంపుతున్నామని తెలియనీయరు. ప్రజలను మత్తులో ఉంచడం వారి ధ్యేయం. దానధర్మాలూ, మతాలు, మహాత్ములు, బైరాగులు వారికి ఆయుధాలు. అవి ఆయుధాలని ఎవరికీ తెలియనీయరు. ఆ ఆయుధాల్లో ఒక్కొక్కదాన్నీ ప్రయోగిస్తున్నాడు రామయ్య" అని అమాంతంగా ముగించాడు వీరభద్రం.

వింటున్నవారి గుండెల్లో మెల్లగా రాజుకున్న నిప్పు నరాల్లో ప్రవేశించింది. నిటూర్పులు వేడిగా వచ్చాయి. వారు అమాంతంగా లేచి నుంచున్నారు.

లోపలినుంచి సివంగిలా దూకింది మంగమ్మ.

"గాజులు తొడిగించుకోండి" అని చేతిగాజులు గబగబా లాగింది. అవి చిట్లి నేలమీద పడ్డాయి. చేయి చీరుకొనిపోయి రక్తం వచ్చేసింది. రక్తపు చుక్కలు నేలమీద రాలేయి.

నుంచున్నవారు బొమ్మల్లా నుంచున్నారు.

వీరభద్రం లేచి లోపలికి వెళ్ళిపోయాడు.

మల్లయ్యా, మస్తాన్ ఇంటిదోవ పట్టారు. తోవలో ఎవరూ మాట్లాడలేదు. మస్తాన్ ఒక బండదగ్గర నిలిచిపోయాడు. మరో బండను తీసుకొని ఆ బండమీద కొట్టాడు. పెద్ద చప్పుడైంది. మిణుగుర్లు వచ్చాయి.

మల్లయ్య చూస్తూ నుంచున్నాడు.

మస్తాన్ మళ్ళీ బండతీసి బండమీద వేశాడు. ఈ తడవ మరింత బలంగా వేశాడు. నిప్పు బాగా వచ్చింది. రాయి ఓటుపోయిన చప్పుడు వచ్చింది. మళ్ళీ బండ తీసి బండమీద కొట్టాడు. బండ బద్దలైంది. పైనుంచి వేసిన బండ అందులో ఇర్రుక్కుంది. అంతటితో చేతులు దులుపుకున్నాడు.

"పద మల్లన్నా!" అన్నాడు.

మల్లయ్య యంత్రంలా అనుసరించాడు.

ఇద్దరూ జంటగా వెళ్ళిపోయారు.

చీకటి. కటిక చీకటి. కాటుక పులుముకుంది.

సుందరరావుగారు వస్తున్నారని కబురందింది రామయ్యకు. వారు రావటం కాలినడకన వస్తున్నారు. పాదయాత్ర సాగిస్తున్నారు. అయినా వారివెంట జీపులూ, వ్యానులూ వస్తున్నాయి. వారి శిష్య సందోహం వస్తూంది. సరస్వతి కాలినడకన వస్తూంది. బలరామయ్య వారి వెంట కాకున్నా జీపులో వచ్చేస్తారు ఆనాటికి. అవ సరం అయిన ఏర్పాట్లు చేయవలసిందని ఆదేశం అందింది.

ఏర్పాట్లు ప్రారంభించాడు రామయ్య. గడీని శుభ్రంచేయించి సిద్ధం చేయిం చాడు. సభ జరగడానికి గడీముందు పెద్ద పందిరి వేయించాడు. వాటిని అరటి చెట్లతోనూ, తోరణాలతోనూ అలంకరింపజేశాడు. చుట్టుపట్ల గ్రామాలకు కబురం పాడు. స్వయంగా అన్ని ఏర్పాట్లూ చేశాడు. అన్నీ సిద్ధం చేశానని కబురుకూడా అందించాడు.

ఆనాటి తెల్లవారుజామున దిగారు సుందరరావుగారు. ఊరివాళ్ళంతా ఎదు రేగి స్వాగతం చెప్పారు. ఊళ్ళోకి తీసుకొని వచ్చారు. గడీలో విడిది చేయించారు. సుందరరావుగారు కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. వారు అపక్వాహారం మాత్రం సేవిస్తారు. అయినా శిష్యబృందం కోసం సాత్వికాహారం తయారైంది. ఆ సమయా నికి దిగారు బలరామయ్యగారు. భోజనాలయినాయి. తరువాత విశ్రాంతి. సుందర రావుగారు ఎక్కడా ఒక రోజునుమించి ఉండరు. కాని బలరామయ్యగారి బలవం తాన ఇక్కడ రెండురోజులు ఉండడానికి అంగీకరించారు. అందుకే బహిరంగ సభ తెల్లవారికి ఏర్పాటయింది. ఊళ్ళోని కొద్దిమంది పెద్దలతో మాట్లాడామన్నారు సుందరరావుగారు. రామయ్య ఏర్పాట్లు చేశాడు.

సంధ్యా సమయంలో సమావేశం జరిగింది. వీరభద్రం వచ్చాడు. సరస్వతి వీరభద్రాన్ని చూచింది. లేచి నుంచుంది. వీరభద్రం సరస్వతిని చూచాడు. చిత్తరు వులా నుంచుండిపోయాడు. ఉభయుల గుండెల్లోనూ ఉప్పెనలు లేచాయి.

"సరస్వతీ!" అందామనుకున్నాడు వీరభద్రం. పెదవిదాకా వచ్చి ఆగిపోయింది.

"భద్రం" అందామనుకుంది సరస్వతి. గొంతుదాకా వస్తే మింగేసింది.

ఒకరి ఎదుట ఒకరు! పెదవి కదలడంలేదు. కంటిరెప్ప వాలడం లేదు. ఎంత కాలం తరువాత కలుసుకున్నారు! విడిపోయి కలుసుకున్నారు! చనిపోయారనుకున్న వారు కలుసుకున్నారు. మనసుల్లో ఎన్ని ముచ్చట్లు మసలుతున్నాయో! అయినా పలుకలేరు. చెప్పుకోలేరు. అందుకే రెప్ప వాల్చకుండా చూచుకొంటున్నారు.

కొన్ని లిప్తలు, క్షణాలు గడిచాయి.

"దొర్సాని" అనే రామయ్య మాటతో ఈ లోకంలోకి వచ్చాడు వీరభద్రం. "సరస్వతమ్మ, మన దొరసాని" అని పరిచయం చేశాడు రామయ్య.

"నమస్కారం" అన్నాడు తేరుకున్న వీరభద్రం.

"న...మ...స్కా...రం" అని కూర్చుంది సరస్వతి.

"వీరు వీరభద్రం ఎం.ఎల్.ఏ." అని పరిచయం చేశాడు అక్కడున్న వారం దర్శికి రామయ్య.

"మీరు హింసావాదులు అవునా?" సుందరరావుగారు అడిగారు.

"కాము. అయినా అహింస మా మతంకాదు. అలవిగానిచోట, తప్పనిసరి అయినపుడు హింసకు దిగడంలో తప్పులేదంటాం. గాంధీజీ ఆవుదూడను చంపలేదా?"

"గాంధీజీ మహాత్ముడు. ఆయన చేసిన పనులన్నీ మనం చేయగలమా?"

"వారు మహాత్ములు, అయినా మానవమాత్రులని మా విశ్వాసం. వారు ప్రజా బలంతో ఉద్యమాలు నడిపించారు. మాకు ప్రజల్లో విశ్వాసం ఉంది."

మీకు లేదనే అర్థంలో వాడాడు వీరభద్రం· సుందరరావుగారికి కోపమైతే రాలేదుగాని కాస్త తికమక పడ్డారు. బలరామయ్య, రామయ్య కాస్త సంకటంలో పడ్డారు. దూరంగా నుంచొని వింటున్న మల్లయ్యా, మస్తాన్‌కు కాస్త హుషారు వచ్చింది.

"భూమి విషయంలో మీ విశ్వాసమేమి" సుందరరావుగారు మరొక సమస్యకు వచ్చారు.

"భూమి ప్రజల సొత్తు అని మా విశ్వాసం. ఈ ధరాతలం యావత్తూ శ్రామికు లది. వారు తమ శ్రమతో ఈ విశ్వాసాన్ని నిర్మించారు. వారి శ్రమను దోచుకుం టున్న కొందరు వారి రక్తం పీలుస్తున్నారు. ప్రపంచమంతటా పేదలు మేల్కొ న్నారు. శ్రామికులు మేల్కొన్నారు. తమ హక్కులను గుర్తించారు. పెట్టుబడిదారీ కోటలను కూలగొడ్తున్నారు. తమ రాజ్యాలు ఏర్పరచుకుంటున్నారు. ఇది తప్పని సరి. ప్రజలను ఎల్లకాలం అణచి ఉంచలేరు. వారి గుండెల్లో అగ్గి రగులుతూంది. వారు విజృంభిస్తారు. పరాన్నభుక్కుల్ను అంతమొందిస్తారు. శ్రామిక రాజ్యం స్థాపించుకొంటారు."

వాతావరణం ఉద్రిక్తం అయింది.

సరస్వతి కళ్ళప్పగించి చూడసాగింది.

బలరామయ్యకూ, రామయ్యకూ చెమటలు పట్టాయి.

మల్లయ్యా, మస్తానుల కళ్ళల్లో ఉత్సాహం తొణికిసలాడింది.

సుందరరావుగారు ఉద్రేకపడలేదు. మౌనం వహించారు. వారికి మౌనంతో విశ్వాసం మెండు. మౌనం ఉద్రేకాన్ని తగ్గిస్తుందనేది వారి నమ్మకం.

కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి. అయినా వాతావరణం శాంతంగా లేదు. ఏదో గజిబిజిగా ఉంది.

"ఈ భూమి, ఈ ధరిత్రి భగవానునిదని నమ్ముతాం మేము"

"మాకు దేవునిమీద నమ్మకం లేదు."

"అది నాకు తెలుసు, అయినా చెప్పేది వినండి. అది భగవంతునిది కాబట్టి

అందరికీ చెందాలి. అయితే ప్రకృతిసిద్ధంగా కొందరు ఉన్నవారూ కొందరు లేనివారూ ఉంటారు. ఉన్నవారు తమ సంపదకు తమను యజమానులుగా భావించరాదు. వారు తమ సంపదకు ధర్మకర్తలుగా మాత్రమే భావించాలి. తమకున్న దానిని పేదలకొరకే వినియోగించాలి. ఇది గాంధీజీ ప్రవచించిన ధర్మకర్తృత్వ సిద్ధాంతం. ఆ సిద్ధాంతాన్ని అమలు పరచడానికి నేను కంకణం కట్టుకున్నాను. ఉన్నవారి దగ్గర దానం తీసుకొని లేనివాళ్ళకు ఇస్తున్నాను. మా సిద్ధాంతం బావుండలేదా?"

రామయ్యా, బలరామయ్యా ఉత్సాహం కనబరచారు. వారి ముఖాల్లో తృప్తి తొణికిసలాడింది.

"మీ సిద్ధాంతం మంచిదికాదని నే ననను. మీ సంకల్పాన్ని శంకించలేను. కాని ఆస్తిని చేజేతుల వదులుకొనే వాడుండడు. మీరు వదులుకునేటట్లు చేయగలిగినా ఒక్కొక్క వ్యక్తిని మార్చేవరకు కొన్ని శతాబ్దాలు పట్టవచ్చు. అప్పటికి ఈ బూర్జువా వర్గం మీ ఉద్యమాన్నే మింగేస్తుంది. మిమ్మల్నే నమ్మించి మోసం చేయగల దీరులు వీరు. గాంధీజీని ఖాతరు చేయని కామందులు మీకు లొంగుతారా? నాకు నమ్మకం లేదు. మీరు కొండకు వెంట్రుక కట్టారు. లాగాలని ప్రయత్నిస్తున్నారు. వెంట్రుక తెగడమేగాని కొండరాదు."

"మన ఇద్దరి లక్ష్యం ఒకటే. మార్గాలు వేరు అనే విషయం అంగీకరిస్తారా?"

"అంగీకరించను. మీరు భూమిని భిక్షగా అడిగి బిచ్చంగా ఇవ్వాలనుకుంటారు. మేం భూమిమీద ప్రజల హక్కుందంటాం. దాన్ని సాధించాలంటాం."

ప్రార్థనకు సమయం అయిందని సుందరరావుగారు లేచిపోయారు. అతని వెంట అంతా లేచిపోయారు. లేచి నుంచున్న సరస్వతి వీరభద్రం వీపును చూపందినంత దూరం చూచింది. నిట్టూర్పు విడిచి ప్రార్థనలో కూచుంది.

తెల్లవారి సభ జరిగింది. చుట్టు పట్ల ఊళ్ళనుంచి జనం బాగా వచ్చారు. సుందరరావుగారు ఉపన్యాసం ఇచ్చారు. భూమి దానంచేయవలసిందిగా ప్రార్థించారు. వెంటనే బలరామయ్య ఒక కాగితం అందించి భూదానం ప్రకటించారు. రామయ్య బలరామయ్యను అనుసరించాడు. అతడూ భూదానం చేశాడు.

వారిని గురించి ప్రశంసించాడు సుందరరావుగారు.

సరస్వతి పట్నం నుంచి ఖద్దరు చీరలు తెచ్చింది. వాటిని హరిజనులకు అందించింది.

అందుకోవలసినవారి పట్టిక తయారు చేసినవాడు రామయ్య.

సమావేశం ప్రార్థనా గీతంతో ముగిసింది.

తెల్లవారు జామున బయల్దేరారు సుందరరావుగారు. ఊరంతా వారిని సాగనంపడానికి మేల్కొంది. ఊరి బయలుదాకా నడిచింది.

సరస్వతి కళ్ళు ఎక్కడో వెదుకుతున్నాయి.

వీరభద్రం కనిపించలేదు.

# మూడు

"శేషయ్యా"

"దొరా!"

"ఎట్లున్నదంటవ్?"

"శాన బాగున్నదుండి"

"ఏంది?"

"ఏమోనండి నా కేమెరక"

"మరి ఏందో బాగున్నదంటివి"

తికమక పడ్డాడు శేషయ్య. వాస్తవంగా అతనికి తెలీదు. దొర ఎలా ఉందంటే బాగుందన్నాడు. అంతే తెలుసు అతనికి. శేషయ్య ఈ మధ్య బాగు పడ్డాడు. పేకాటలో నిష్ణాతుడైనాడు. పల్లెలో అతనితో ఆడేవారు చాలడం లేదు. మకాం పట్నానికి మార్చాడు, కబ్బుల్లో ఆట మొదలు పెట్టాడు. అక్కడికి అనేక మంది ఉన్నతాధికారులు వస్తుంటారు. మొదట కాస్త బెరుకు బెరుకుగానే ఉంది. కాని ఇప్పుడు అందరిలో కలసిపోయాడు. అతని పలుకుబడి కూడా పెరిగింది. తెల్లని గాపోక్ పంచె మీద వదులైన సిల్కు లాల్చీ వేస్తున్నాడు. వెంట్రుకలు పొడవుగా పెంచి జులపాలు చేశాడు. వేళ్ళకు మంచి రాళ్ళ ఉంగరాలు పెడు న్నాడు. మెడలో సన్నని బంగారు గొలుసు వచ్చేసింది. ఖరీదైన సిగరెట్టు చేతిలో పట్టుకొని ఎప్పుడూ దమ్ము లాగుతుంటాడు. రెండవ చేతిలో సిగరెట్టుపెట్టె అగ్గి పెట్టె పట్టుకుంటాడు. సిగరెట్టు దానం చేయడంలో ఘను దాతడు. ఎవరడిగినా లేదనడు! ఎన్నడిగినా ఇచ్చేస్తాడు. అతడు బలరామయ్యను ఊళ్ళోనే ఆశ్రయిం చాడు. ఇప్పుడు దొరకు సన్నిహితుడైనాడు.

మనిషి విచిత్రమైనవాడు. అతని మనస్తత్వం అతి విచిత్రం అయింది. అత నికి లక్షమంది అనుచరులున్నా, ప్రపంచ సామ్రాజ్యానికి అధిపతియైనా, ఒక సన్నిహితుని కోసం వెదుక్కుంటాడు. ఆ సన్నిహితుడు అతనికి సమానుడు కానక్కరలేదు. తనకు ఆత్మీయుడుగా మసలడానికి ఒకడు కావాలి. ఆత్మీయులు లేక మనిషి జీవించలేడు. ఒంటరిగా వెర్రివాడు తప్ప బతకలేడు. అందుకే శేష య్యను సన్నిహితుడ్ని చేసుకున్నాడు బలరామయ్య.

ఎంత సన్నిహితుడ్ని చేసుకున్నా బలరామయ్యంటె బెదురే శేషయ్యకు అందుకే కాస్త తికమకపడ్డాడు. అయినా అన్నాడు.

"మీరు మంత్రి కావటం"

"మళ్ళీ అన్నావు ఆ మాట! మజా అంతా పోయిందయ్యా"

శేషయ్య గుడ్లప్పగించి చూచాడు. వాస్తవంగానే బలరామయ్య ముఖంలో ఉత్సాహంలేదు. ఏవో గబగబా రంగులు మారేయి.

శేషయ్య చూపు దించుకున్నాడు. టీపాయ్‌మీద రెండు గ్లాసుల్లో సగం సగంగా ద్రవం ఉంది. ద్రవపాత్ర, సోడాసీసాలు వున్నాయి. తెరచిన సిగరెట్టు పెట్టెలు పడివున్నాయి. గ్లాసందుకొని గుక్కవేయాలనిపించింది శేషయ్యకు. అందుకోలేక పోయాడు. కనీసం సిగరెట్టు కాలుద్దా మనుకున్నాడు. సిగరెట్టు చేతిలోకి తీసుకున్నాడు. వెలిగించుకోలేకపోయాడు. బలరామయ్య ఏదో గంభీరంగా వున్నాడు. అతడు మామూలు మనిషి కావడానికి ఎదురు చూస్తున్నాడు.

మౌనంలో క్షణాలు భారంగా అడుగులు వేస్తాయి.

"శేషయ్యా" గ్లాసందుకొని గుటకవేస్తూ అన్నాడు.

శేషయ్యా గ్లాసందుకొని ఖాళీ చేశాడు.

"దొరా!"

"ఏం గెలుపులేవయ్యా"

శేషయ్యకు ఏమీ తోచలేదు. బిక్కమొఖం వేసి చూచాడు. గ్లాసులో ద్రవం వంచి సోడా పోసి కలుపుతున్నాడు.

"అదేంది దొరా! అట్లంటరు"

"నిజం చెప్పాలంటే నేను గెలవలేదయ్యా"

గుడ్లప్పచెప్పి చూచాడు శేషయ్య. గెలిచాడు మంత్రి అయినాడు ఇలా అంటాడేం అనుకున్నాడు.

సారాయి ఒక్కోసారి సత్యాన్ని పలికిస్తుంది.

"అట్ల చూస్తవేం! నిజం చెప్పుతున్న"

"అదెట్ల దొరా!"

"ఎంత డబ్బు ఖర్చు పెట్టిన్ననుకున్నవ్! ఓట్లుకొన్న. ప్రజలేసినారు!"

గ్లాసందుకొని గటగట తాగాడు బలరామయ్య. సిగరెట్టు వెలిగించాడు. గుప్పున పొగ వదిలాడు.

"శేషయ్యా!"

"...... ......"

"బాగున్నదయ్యా"

"ఏంది దొరా!" బలరామయ్య పరాకులో మాట్లాడుతున్నాడని గ్రహించాడు శేషయ్య.

"మందేశపోండ్లకు సారకూడ చెయ్యరాదులే"

"ఏమో దొరా!"

"ఏమో ఏంది? ఇసువంటిగి చేయగలరా!"

"అవు దొరా!"

"శాన బాగున్నదయ్యా!" ఒక గుటక వేశాడు బలరామయ్య. సిగరెట్టు దమ్ము గట్టిగా లాగి వదిలాడు.

"శేషయ్యా! నిజంగా నేను గెలవలేదయ్యా" గొంతు బొంగురు పోయి నట్లుంది.

"గెలిచింది వీరభద్రమే"

"అదేంది అట్లంటరు దొరవారూ!"

"నీకేమెర్కగని! ఓట్లు కొంటిమి! ఆశ చూపిచ్చి ఏయించుకొంటిమి? పెట్టెలుకూడా మార్పిస్తిమి! ఇంక గెలిచిన్ననే అంటవా?" దుఃఖం గొంతుదాకా వచ్చింది.

"అదేంది దొరా అట్లంటరు? గెలిస్తిరి మంత్రి అయితిరి! అట్లంటె ఎట్ల?"

"ఏం గెలుపు శేషయ్యా! ఇన్నిచేసినా ఒక్క వెయ్యి, ఒక్క వెయ్యి ఓట్లే ఎక్కువొచ్చే. ఏం గెలుపు శేషయ్యా! ఈ గెలుపు వీరభద్రానిదే శేషయ్యా! వీరభద్రానిదే!!" కళ్ళవెంట ధారాపాతంగా నీరు వస్తూంది.

శేషయ్యకు ఏమనాలో? ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు.

"అదేంది దొరవారూ! అట్లేడుస్తరు చిన్న పిల్లగానోలె. యాడ గెలిచిండుండి వీరభద్రం. ఓడిపోయిండు. ఓడిపోయుండు. ఓడిపోయుండు"

"అట్లనకు శేషయ్యా! వీరభద్రమే గెలిచిండు న్యాయమే గెలిచింది. ప్రజలే గెలిచిన్రు" అని శేషయ్యను పట్టుకొని బిగ్గరగా ఏడ్చాడు బలరామయ్య.

అది బలరామయ్య సౌధపు మూడో అంతస్తు గాబట్టి సరిపోయింది. కాకుంటె సరస్వతి పరిగెత్తుకొని రావాల్సిందే. బలరామయ్య మంత్రి అయినా ఇల్లు మారలేదు. తన ఇంటినే సర్కారు డబ్బుతో బాగుచేయించుకొన్నాడు. ఈ మూడో అంతస్తు తనకోసమని ప్రత్యేకంగా వేయించుకున్నాడు. ఇవన్నీ సరస్వతి చూడకుండా ఉండాలని ఆ ఏర్పాటు. ఈ అంతస్థుకు ఎవరికీ ప్రవేశంలేదు. అంతరంగికులకు మాత్రమే అందు ప్రవేశం. అందుకే ఈ ఏడుపు సరస్వతిదాకా వెళ్ళలేదు.

శేషయ్య కండ్లు తుడిచి ఓదార్చాడు. ఏమనాలో ఎలా చెప్పాలో అతనికి అర్థం కాలేదు.

"కిందికి పోదామా దొరవారూ!"

శేషయ్యను వదిలించుకొని సోఫాలో కూర్చున్నాడు నిటారుగా బలరామయ్య. యాష్ట్రేలో సిగరెట్టు కాలుతూనే ఉంది. ఇంకో సిగరెట్టు వెలిగించాడు. పొగ వదు

లుతూ కూర్చున్నాడు. ఆ పొగద్వారా మనసులోని జిడ్డు ఏదో పోయినట్లవుతూంది. క్రమక్రమంగా మనసు తేలిక అవుతూంది.

"అయిపోయిందా?"

సీసా బోర్లించాడు శేషయ్య. మళ్ళీ సీసాను మామూలుగా బల్లమీద పెట్టి అగ్గిపుల్లగీసి అందులో వేశాడు. అది భగ్గుమని మండి ఆరిపోయింది.

ఆ మంట తనలో మండి ఆరిపోయినట్లనిపించింది బలరామయ్యకు.

శేషయ్యకు ముండ్లమీద కూర్చున్నట్లున్నది. వెళ్ళిపోతే బాగుండుననుకున్నాడు. మళ్ళీ ఏమంటాడో ముసలివాడు! ఔనంటే ఏమో! కాదంటే ఏమో! పలుకులు పలుకుతున్నా డివాళ. బాగా ఎక్కినట్లుంది అనుకున్నాడు. అయినా లేచిపోవడం తన వశమా? చూస్తూ కూర్చున్నాడు.

బలరామయ్య సిగరెట్టు పొగ వదులుతూ, పరాకుగా పైకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. ముఖంలో ఏదో వింతమార్పు వస్తూంది. మళ్ళీ ఏదో వేదాంతిలా మాటాడేట్లున్నాడు.

ఇద్దరూ మౌనంగా వున్నారు.

టీపాయ్‌మీద కాళీ గ్లాసులున్నాయి.

గోడ గడియారం టక్కు టక్కు మంటూంది.

పంకా తిరిగిన చప్పుడు వినిపిస్తూంది.

"మంత్రిపదవి అంతే శేషయ్యా"

శేషయ్య కేమీ పాలుపోలేదు. ముసలివాడు మహామహా నీతులు పలికేస్తున్నా డివ్వాళ. కుక్క దాలిగుంటలో పడుకొని ఇలాగే అనుకుంటుందట! అనుకున్నాడు.

"ఎమ్మెల్లేలకు ఎంత పెట్టిన్ననుకున్నవ్? ఎన్నెన్ని ఆశలు చూపించిన్ననుకున్నవ్? గ్రూపు కావాలె శేషయ్యా గ్రూపు! అప్పుడుగాని మంత్రిపదవిరాదు"

"చిత్తం దొరా!"

"వాళ్ళుమాత్రం ఎప్పుడు మనకే ఉంటరనుకున్నవా? బోగందెంతో వాళ్ళంత. ఎటు లాభముంటే అటు మొగ్గుతరు! వాళ్ళను నిలబెట్టుకోవటం ఒక గారడి అనుకో. గారడి. గారడోడు గడమీద నిలబడ్తడులే. అట్ల. ఎక్కేదన్క బాగానే ఉంటది. ఎక్కినెన్క మొదలైతది బుగులు-ఎప్పుడు పడ్తమోనని. ఏమంటవ్?"

"నాకేం తెలుస్తయుండి దొరల ఎవారాలు!"

"అవును నీకేం తెలుస్తదిగని? పేకాడుడు మందిని ముంచుడు."

"మీ దయ"

గడియారం ఒక గంట కొట్టింది. "అబ్బ ఒంటిగంటయిందితే. సరే దిగుదాంరి పా! డ్రైవరుగాడు నిద్రపోతుంటడు. లేపి తీస్కపో" అని మెట్లు దిగసాగారు.

"దొరవారూ!"

"మల్ల ఏంది?"

"ఏంలేదుండీ"

"చెప్పరాదు నసుగుత వెందుకు?"

"ఏంలేదుగని ఊరికె మీ బండికోసమె ఉరికొస్తున్న"

"అయితే"

"ఏం లేదండి"

"ఏ మాట సాఫ్‌సీదగ చెప్పవుగద!"

"ఒక బండిప్పిస్తరేమోనని?"

"ఏంది? బండిదాకా వచ్చినాది కత! ఊరంగ గుంజుతున్నవా?"

"మీదయ. ఒక్క చిన్నకేసున్నదండి జంగ్లాత్‌ది (ఫారెస్టు) మీరు జర తల్సుకుంటె అయిపోతది."

"జంగ్లాత్ నాతాన లేదుగద"

"మీరు తల్సుకుంటె అగుతాది బాంచను."

బాంచను అంటె పొంగిపోతాడు బలరామయ్య అనే విషయం శేషయ్య ఎరుగు.

"చూస్తం"

"అమ్మో! చూస్తమంటెకాదు. చెయ్యాల్నుండి. కాలుపట్టుకుంట" అని కాళ్ళ మీద పడ్డాడు శేషయ్య.

"అట్లనేలే వదిలిపెట్టు" అని విడిపించుకొని లోనికి వెళ్ళిపోయాడు బలరామయ్య.

బయటికివచ్చి తీవిగా సిగరెట్టు కాల్చాడు శేషయ్య. ఫారెస్టు కంట్రాక్టర్లు అతనికోసం బండి పెట్టుకొని ఎదురుచూస్తున్నారు. అతన్ని చూడగానే అడిగారు "ఏమైంది? కాయా పండా?" అని.

మాట్లాడకుండా కార్లో కూర్చున్నాడు శేషయ్య.

కారు సాగిపోయింది క్లబ్బుకు దర్వాన్ చేసే సలాం సైతం గమనించకుండా.

బలరామయ్య మనసు తేలిగ్గా ఉంది. మనసులో ఎంతకాలంగానో ఉన్న భారం దిగిపోయినట్లుంది. ఉత్సాహంగా కూడా వున్నాడు. గాలిలో తేలిపోయి నట్లుంది. హాయిగా ఉంది. ఆనందంగా వుంది. అప్పుడు అతనికి జ్ఞాపకం వచ్చింది సరస్వతి చెక్కిళ్ళ నిగ్గులు ఆమె కనుల సోయగం ఆమె చిరునవ్వు వెన్నెలలు. వయసు పరుగు పరుగున వచ్చి అతనిలో చేరినట్లయింది. సరస్వతి అనురాగంలో కరగిపోవాలనుకున్నాడు. ఆమె చెక్కుటద్దాల్లో తనరూపం చూచుకోవాలనుకున్నాడు. ఆమె కనుపాపల్లో తనపాప కనిపిస్తుందనుకున్నాడు. కోరికలు గుర్రాలైనాయి. కళ్ళేలు లేకుండా పరిగెత్తసాగేయి. అతడు పడకగదిలో అడుగుపెట్టాడు.

మంచం కాళీగా వుంది.

ఆమె లేదు.

ముసలితనపు పరువం! నీరు కారిపోయాడు. మంచంలో కూలబడ్డాడు. ఎక్కడికి వెళ్ళి వుంటుంది సరస్వతి! ఈ సమయానికి రోజూ ఇక్కడ ఉండాల్సిందే! అయినా రోజూ వస్తున్నాడా తాను! అనుమానం అగ్గి అయి రగులుకుంది. ఉత్సాహం ఉద్రేకం అందులో కాలిపోయాయి. లేచాడు మెల్లగా అడుగులువేస్తూ సాగాడు. లంకంత ఇల్లు ఎక్కడని చూస్తాడు! అశోకవనంలో ఎక్కడుందో సరస్వతి. అమాంతంగా ఆలోచన వచ్చింది.

ధ్యాన మందిరం!

అటువైపే నడిచాడు. ధ్యాన మందిరంలోకి తొంగి చూచాడు. ఉన్నది సరస్వతి! సరస్వతి ఉన్నది!! ఒంటరిగా—పద్మాసనం వేసి కూర్చున్నది. అతడు తలుపు తెరచాడు. చప్పుడైంది. లోపలకి అడుగులు వేశాడు. అడుగుల సవ్వడి అయింది. అయినా చలించలేదు సరస్వతి. ధ్యానముద్రలో ఉంది.

చూచాడు బలరామయ్య.

సహజంగా కలగాల్సిన ఉద్రేకం కలగలేదు. నమ్రభావం-వినమ్రతా కలిగాయి. ఏదో ఆర్ద్రత ఏర్పడింది. ఆదరం ఏర్పడింది. అభిమానం ఏర్పడింది.

చూస్తూ నుంచున్నాడు కాసేపు.

కూర్చున్నాడు కొన్ని క్షణాలు.

తరవాత లేచి వెళ్ళిపోయాడు. ఇదీ తన మేలుకే అనుకున్నాడు. అనుమానించినందుకు తనను తానే నిందించుకొన్నాడు. గదిలోకి వచ్చి మంచంలో పడుకున్నాడు. సిగరెట్టు కాల్చాడు.

సరస్వతి ఈ మధ్య పూర్తిగా మారిపోయింది. ఆమె ధ్యానాన్ని అభ్యసిస్తూంది. కళ్ళు మూసుకొని కూర్చుంటే అనేక రకాల ఆకారాలు ఆమె ముందు కదలసాగేయి. ఆరంభంలో అలాగే కదులుతాయన్నారు. ఈ మధ్య ఆవిడముందు ఒకే ఒక ఆకారం విగ్రహం కనిపిస్తుందామెకు.

వీరభద్రం!

వీరభద్రం!!

వీరభద్రం చనిపోయాడనుకుంది. అందులో ఏదో తృప్తి కనిపించిందామెకు. అతని జాడ తెలియలేదు. నీడ కనిపించలేదు. బాగానే ఉంది. మొన్న ఊళ్ళో కనిపించాడు, అదీ ఎలాంటి పరిస్థితిలో! తాను పెదవి కదపలేకపోయింది. పోయినవాడు దొరికాడు. పోయిందనుకున్న సంపద చేతికందింది. ఏం లాభం? తాను దొర్సాని! దొరతనాన్ని తిట్టుకుంది. సంపదను దూషించింది. అధికారాన్ని దూరింది. తాను మామూలు ఆడది అయ్యుంటే ఎంత బావుండేది. ఆ తరవాత చాలా ప్రయత్నించింది. కాని ఎలా? ఈ వజ్రాల పంజరాన్ని బద్దలు కొట్టడం ఎలా? పత్రికలో అనేక ఫార్లు అతని పేరు చదివింది. అప్పుడప్పుడూ పటాలు చూచింది. అతడు పోటీ చేస్తున్నాడని తెలిసింది. మనసారా భగవంతుని ప్రార్థించింది అతడు గెలవాలని! అతడు

గెలవలేదు సరే వెర్రివెర్రి వార్తలందాయి. అతడు పెండ్లి చేసుకున్నాడనీ - అతనికి కొడుకనీ! నమ్మలేకపోయింది. తన వీరభద్రం అలా చేయడు. చేయడానికి వీల్లేదు. అయినా అది మనసులో శల్యమై కూర్చుంది.

ఆనాడు శేషయ్య వచ్చాడు బలరామయ్యకోసరం. బలరామయ్య ఇంట్లోలేడు. సాధారణంగా వెళ్ళిపోవలసినవాడే- కూర్చున్నాడు.

"దొర్సాని ఉన్నాదిర?" నౌకరును అడిగాడు.

"ఉన్నద్దొరా! చెప్పొస్త" అని లోపలికి పరిగెత్తాడు శేషయ్య మాటకోసం సైతం ఎదిరి చూడకుండా.

ఆ మాట ఎందుకన్నానా అని తటపటాయించాడు శేషయ్య. ఈలోగా నౌకరు వచ్చి "దొర్సాని రమ్మంటాంది" అన్నాడు.

కాలుస్తున్న సిగరెట్టు పారేసి, చెప్పులు విప్పి లోనికి అడుగుపెట్టాడు. నౌకరు అతన్ని తీసికెళ్ళాడు.

సరస్వతి రాట్నంమీద దారం తీస్తుంది. తివాచీమీద కూర్చుని ముసుగు వేసుకొని ఉంది. శేషయ్య వచ్చింది గమనించనట్లే రాట్నం తిప్పుతూంది.

"నమస్కారం దొర్సానిగారూ" అన్నాడు శేషయ్య తన రాకను తెలియపరచడం కోసమా అన్నట్లు.

"కూచో శేషయ్యా"

కుర్చీలున్నాయి. కాని దొర్సాని కింద కూర్చొని వుంటే కూర్చోవడానికి ధైర్యం చాలలేదు.

"నిలపడ్తలేరి. అంతా బాగేనా!"

"ఊరి విశేషాలేమిటి?"

"ఏమున్నయ్యండి. రామయ్య దొరయిండు. దొర మంత్రి అయిండు"

"అవి నాకూ తెలుసు. భూదానం సంగతి ఏమనుకుంటున్నారు!"

ఆ విషయమే తెలియదు శేషయ్యకు. తడబడ్డాడు.

సరస్వతి రాటం ఆపి శేషయ్యను చూచింది.

"వీరభద్రం అట్లెందుకు మాట్లాడ్తాడు?"

"ఎట్ల?"

"భూదానానికి వ్యతిరేకంగా"

"తెల్వదుండి"

"అసలు ఎలాంటివాడు?"

"వీరభద్రమా? దేవుడుండి. దేవుడు. దొరల్ను గడగడలాడించిండు కాదుండి. నైజాం నవాబునే ఉచ్చపోయించిండు. మంది బాగుండాల్నంటడుండి."

సరస్వతి మనసు గంతులేసింది.

"మరి ముండను పెళ్ళిచేసుకున్నాట్టగా"

"రామ. రామ" అని అటూ ఇటూ చూచి "అంతా బూటకముండి-ఉన్నమాట చెప్పుతున్న నమ్మురి నమ్మకపోరి. మంగమ్మకు కడుపుచేసింది రామయ్యండి. మంగమ్మ బాయిల దుముకుతనంటే పెండ్లి చేసుకున్నడుండి. అయినగని కాపురం చేస్తాడనుకుంటున్నా! ఆ మనిషిని అన్నోళ్ళు పురుగులు పడి చస్తరు. ఆయ నొక అన్న అయిండనుకోండి ఆ ముండకు" గుక్క తిప్పకుండా అప్పచెప్పాడు శేషయ్య.

సరస్వతి సంతోషానికి అంతులేదు.

ఆమెలో ఆనాడు వెన్నెలలు విరిశాయి.

ఆనాడు గాంధీ చిత్రపటానికి మొక్కింది వీరభద్రాన్ని రక్షించమని.

నాటినుంచీ వీరభద్రమే ఆమె ధ్యానమందిరంలో ఉంటున్నాడు. ఐలా రామయ్య వచ్చి చూచినప్పుడూ ఉన్నాడు. మనసులో ఉన్నదాన్ని మానవుడు కని పెట్టలేడు.

సరస్వతి కళ్ళు తెరిచి చూచింది.

వీరభద్రం మాయమైనాడు.

మళ్ళీ కళ్ళు మూసుకుంది.

* * *

గ్రామ స్వరూపం కొంత మారింది. పట్నం నుంచి నేరుగా ఊళ్ళోకి రోడ్డు పడింది. రామయ్య తన దనుకుంటున్న కరణం ఇంటిమీద రెండో అంతస్తు నిర్మిం చాడు. పాత యింటిని ఆధునికంగా కనిపించేటట్లు మార్పులు చేయించాడు. ఆ సందర్భంలోనే రోడ్డు కాంట్రాక్టుకూడా తన పేరనే తీసుకున్నాడు. వాస్తవంగా చేయించింది యాదగిరి. యాదగిరి మంగుళూరు పెంకుతో మంచి ఇల్లు కట్టుకు న్నాడు. అదే ఆ వూరికి మొదటి మంగుళూరు పెంకు ఇల్లు. శేషయ్య డాబా ఇల్లు కట్టాడు. అతడుపట్నానికి మకాంమర్చినతరవాతఅది పేకాటవారికి నెలవు అయింది. అప్పుడప్పుడు బస్తీ నుంచి బ్రాందీ సీసాలుకూడా వస్తున్నాయి. ఒక చిన్న హోటలు కూడా వెలిసింది. ఒకతను మళయాళ దేశం నుంచి వచ్చాడు. రావడం రావడం రామయ్యను ఆశ్రయించాడు. రామయ్య అనుమతించాడు. అతడు హోటలు పెట్టాడు.

ఊరు బయట స్కూలు కోసం ఒక భవనం కట్టారు. చరిత్రలో అది మొదటి బడి ఆ ఊరికి. కావడానికి బడికి సంబంధించిన మంజూరీ వగైరాలు వీరభద్రం ఎమ్మెల్లేగా ఉన్నప్పుడే అయినాయి. పంతుళ్ళ నియామకమూ జరిగింది. కాని వారిని వేరే బళ్ళల్లో పనిచేయడానికి పంపించారు. జీతాలు ఇంతకాలం వారు ఈ ఊరి పేరనే తీసుకున్నారు. ఇంకా వారు ఈ ఊరికి రాలేదు. పాఠశాల ప్రారంభోత్సవం బలరామయ్యతో చేయించాలనుకున్నాడు రామయ్య.

ఊరికి అవతల పాఠశాలకు దగ్గర్లో ఒక పాడుబడిన దేవాలయం ఉండేది. పసుల కాపర్లు ఎండపూట అందులో విశ్రాంతి తీసుకొనేవారు. దాని చుట్టూ దట్టంగా చింత చెట్లున్నాయి. ఒకసారి ఎందుకో అది పోయింది సుమతి. ఆ జీర్ణ దేవాలయం

ఆమె కంటపడింది. గుళ్ళోకివెళ్ళి చూచింది. గబ్బిలాలు కాపురం పెట్టాయి. గుడి చెక్కు చెదరలేదు. గుళ్ళో లింగమూ బాగుంది. కొన్ని మరమ్మత్తులు కావాలి. అది చూసి ఇంటికి వచ్చింది. రామయ్యతో అన్నది: "ఊరన్నంక ఒక గుడి వుండాలె. ఉన్న గుడన్న బాగుచేయిస్తే మంచిది. గుళ్ళో గొడ్లపోరలు వుంటాౢను." రామయ్య అందుకు అభ్యంతరం చెప్పలేదు. పట్నం నుంచి పనివాళ్ళు వచ్చారు. చకచకా పని జరిగిపోయింది. బ్రాహ్మల్ను పిలిచి ప్రతిష్ట చేయించారు. వారం రోజులపాటు సంతర్పణలు జరిగాయి. దేవాలయం దివ్యంగా తయారైంది. ఒక బాపనికి ఉద్యోగం దొరికింది. అతడా గుళ్ళోనే ఉంటున్నాడు. ఎటుపడీ పాపం పసుల కాపర్లకు నీడ లేకుండా పోయింది. వారు నాలుగు రోజులు కాలు కాలినపిల్లిలా గుడిచుట్టూ తిరిగారు. తరవాత అటుపోవడం మానేశారు.

సుమతికి గుడి విషయంలో శ్రద్ధ ఎక్కువైంది. ఆమె ఉభయ సంధ్యల్లోనూ దేవాలయానికి వెళ్తుంది. అర్చనలూ, ఆరాధనల విషయంలో స్వయంగా శ్రద్ధతీసుకుంటూంది. శనివారాలు భజనలు జరుగుతున్నాయి. అప్పుడప్పుడూ హరికథలూ పురాణ కాలక్షేపాలూ జరుగుతున్నాయి. ఈ మధ్యనే సంపూర్ణ రామాయణం పురాణ కాలక్షేపం చెప్పి పోయాడయ్యగారు. జనం తండోపతండాలుగా వచ్చారు. ఇప్పుడు ఊళ్ళో చర్చల్లా రామాయణ భారతాలను గురించే.

భక్తి ఎక్కువై పోతూంది వూళ్ళో.

రామయ్య పట్నం నుంచి రావడం రావడమే యాదగిరిని పిలిపించాడు. పిడుగు మీదపడినట్లు ఊరికి వచ్చాడు యాదగిరి.

"ఏమో పిలిచిౢనట"

"అవు. పిలిచిన. దొర వస్తనన్నడు బడి ప్రారంభోత్సవానికి. ఎప్పుడనుకున్నావు? ఎల్లుండే. ఏర్పాట్లు కాస్త గొప్పగా చేయాలె. మంత్రి అయినన్క దొర మనూరికి రానేలే. ఆయనకుమాత్రం పుర్సతాడున్నది. మల్ల ఢిల్లీపోతున్నడట. ఎల్లుండైతేనే కుదురుత దన్నడు. పట్నంల కుర్చీలకు షామ్యానకు చెప్పొచ్చిన. రేపొస్తయి లారీమీద. మందిని కూడగట్టాలె. మల్ల ఈవూ రావూరు పోయి చెప్పి రావాలె. జర ఇంతజాములు బాగచూడు. మాట దక్కించాలె. అన్నట్లు మరచిన సైదయ్య, హుసేన్ యాడున్నరు? వాండ్లు గొడ్లొలె తింటాౢను. ఎడ్లోలె పంటాౢను. లంజకొడుకులు. వాళ్ళకు జర పనిపెట్టు. జిమ్మెదారంత నీ మీదనే పెడ్తన్న. ఇగ నువ్వే చూచుకోవాలె."

గడగడా చదివేశాడు రామయ్య, తరవాత చెప్పడానికి ఏమీ దొరక్క లేతుకోక్కసాగాడు.

"అట్లనేనండి" అని నిలబడ్డాడు యాదగిరి.

"అట్ల నిలబడ్తవు. నిలబడ్తె పన్లయితాయి? ఉరుకు" అన్నాడు.

యాదగిరి ఉరికినంత వేగంగా నడిచాడు.

"ఇగో చూడు" మళ్ళీ పిలిచాడు.

తిరిగి వచ్చాడు అంత వేగంగానూ యాదగిరి.

"సైదయ్యనూ, హుసేన్నూ పిలిపించు నేన్చెప్త వాళ్ళతోటి. నువ్వు చెప్తే ఇంటరో ఇనరో"

అట్లనే అని వెళ్ళిపోయాడు యాదగిరి. రామయ్య చరచరా నడిచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

అన్నట్లు చెప్పడం మరచాను. ఈ ఊరికి వచ్చిన ప్రగతిలో ఇద్దరు వస్తాదులూ ఉన్నారు. రామయ్య వారిని ఎక్కణ్ణుంచో పిలిపించి వుంచుకొన్నాడు. వారిలో సైదయ్యను చూస్తేనే భయంవేస్తూంది. గిరజాల జుట్టూ, గండు మీసాలు, దట్టమైన కనుబొమలు, వెడల్పయిన నుదురూ, పెద్ద కుంకంబొట్టు, బొగ్గులాంటి రంగూ, కండలు తేరిన శరీరం-చూడ్డానికి యమునిలా ఉంటాడు. హుసేన్ అంత పొడగిరి కాడు. తల ఎప్పుడూ నున్నగా ఉంచుకొంటాడు. పిల్లిగడ్డం. మెళ్ళో తాయెత్తూ మనిషి మహా బలిష్టుడు. అతడు మీసాలుంచడు. దట్టమైన కనుబొమలు, గడ్డం, మెళ్ళో తాయెత్తు, చేతిలో దుడ్డుకర్ర చూస్తేనే దడుచుకొంటారు పిల్లలు.

వాళ్ళను తన రక్షణకని తెచ్చుకున్నాడు రామయ్య. అయినా ఊరిభక్షణకు తెచ్చిపెట్టాడనుకొంటారు ఊళ్ళోవారు- సైదయ్యకూ, హుసేనుకూ ప్రత్యేకంగా పని అంటూ ఏమీలేదు. దిట్టంగా తినడం నిద్రపోవడమే. సారాయికి సంబంధించిన బాకీలు వసూలు చేయడానికని వారిని పెట్టుకున్నానంటాడు రామయ్య. వారు వచ్చిన్నాటినుంచి ఒక్క బాకీ కూడా వారు వసూలుచేయాల్సిన పని పడలేదు. అలాంటి వారిని రామయ్య పిలిచాడంటే వాయువేగ మనోవేగాల్తో వచ్చేశారు.

"దొరా వచ్చినం" రామయ్య యింటిముందు నుంచొని అరచాడు సైదయ్య.

రామయ్య బయటికి వచ్చాడు. ఇద్దరూ దండాలు పెట్టారు. రామయ్య వారిద్దరినీ తృప్తిగా చూచాడు.

'పిలిచిన్రంటె వచ్చినం సర్కార్. ఎవనికన్న చావు దెగ్గరపడ్డదా? ఏక్ మార్ దో ఫైనల్'' హుసేన్ అన్నాడు దుడ్డుకర్ర నేలకు కొడ్తూ.

"చెప్పండి దొర ఏమో పిలిచిన్రట'' సైదయ్య అడిగాడు హుసేన్ను అదోలా చూస్తూ.

"పనేమ్లేదుర! ఊరికినే పిలిచిన. ఎల్లుండి మినిస్టర్ దొరొస్తున్నడు. మదర్స ఉన్నదికద అది సురు చేస్తడు. ఇంతజాములు యాదగిరికి అప్పజెప్పిన. జర వానికి మద్దత్ చేయండి.''

"అచ్చా సర్కార్" అని కర్ర భుజాన పెట్టుకొని, సలాంకొట్టి, గిరుక్కున తిరిగి సాగిపోయాడు హుసేన్.

"మంచిదుండి. అయితే యాదగిరి తానికే పోత" అని దండంపెట్టి నడిచిపోయాడు సైదయ్య.

రామయ్య వారిద్దరినీ చూస్తూ మురిసిపోయాడు!

తెల్లవారింది. పట్నంనుంచి లారీ దిగింది. స్కూలు ముందు షామ్యానా పడింది. వెట్టివారిని పిలుచుకుని వచ్చారు వస్తాదులు. వారితో ఆ ప్రాంగణం సాంతం శుభ్రం చేయించారు. కొత్త భవనానికి మరొకసారి వెల్లవేశారు. రంగులు వేశారు. రంగుల కాగితాలు అంటించారు. పిల్లలు సైతం అడావుడిగా పనులన్నీ చేశారు.

మళ్ళీ తెల్లవారింది. ఊరంతా ఉత్సవంలో మునిగిపోయింది. మువ్వన్నె పతాకాలతో మురిసిపోయింది. ఆ సాయంకాలానికి సభాస్థలికి బల్లలు చేరాయి. వేదిక తయారైంది. ఉన్నంతవరకు జంపకానాలు పరచారు నేలమీద. వేదికమీద పట్నంనుంచి వచ్చిన సోఫాలు వేశారు. జనం గుంపులు గుంపులుగా రాసాగారు. మైకులో పాటల్తో వూరు మారుమ్రోగింది.

సమయం అయింది. రామయ్య, యాదగిరి అడావుడిలో ఉన్నారు. పెట్రో మాక్సులు వెలిగాయి. చీకటి పడిపోతూంది. అయినా మంత్రిగారు రాలేదు. జనంలో ఓపిక చచ్చిపోతున్నది. ఈలోగా రామయ్య ఏదో ఉపన్యసించాలనుకున్నాడు.

గుండె దడదడలాడింది. గొంతుకు ఆరుకుపోయింది. మైకుముందర నుంచున్నవాడు మళ్ళీ వచ్చేశాడు. అయినా మాట్లాడాలని ఆతురతపడ్డాడు. మళ్ళీ మైకు ముందుకు వెళ్ళాడు. పాటలు ఆగిపోయాయి. రామయ్య దగ్గాడు. అదీ మైకులో వినవచ్చింది.

"సోదర సోదరీమణులారా! దొర వస్తడు. అంటే మంత్రిగారు వస్తరు. రాక యాడికిపోతడు? జర ఓపికపట్టండి. అగొవస్తనే ఉన్నట్టున్నడు. మోటార్ల చప్పుడైతున్నది" అని అటు ఉరికాడు.

అనుకున్నట్లు కార్లు వచ్చి ఆగాయి. బలరామయ్య దిగాడు. జనమంతా లేచి నుంచొని చప్పట్లు కొట్టారు. చేతులు జోడించి అందరికీ నమస్కరించాడు మంత్రి. యాదగిరి అతనికి పూలదండలు వేశాడు. సైదయ్య, హుసేన్ పక్కలకు నుంచున్నారు. మంత్రిగారు కదిలారు. వారూ కదిలారు. దర్వాజాకు కట్టివున్న రిబ్బను వెండి కత్తెరతో కత్తిరించారు మంత్రిగారు. మళ్ళీ చప్పట్లు చరచారు జనం. తరవాత సభ ప్రారంభం అయింది. రామయ్యగారు సభకు అధ్యక్షత వహిస్తారని చెప్పాడు యాదగిరి. వహించాడు రామయ్య. పూలదండ వేశాడు యాదగిరి. దాన్ని తీసి బల్ల మీద పెట్టాడు రామయ్య.

మంత్రిగారు మాట్లాడారు.

"సోదర సోదరీమణులారా!"

"దొర తెలుగుల మాట్లాడ్తాండు. తెలుగుల మాట్లాడ్తాండు" అని గుసగుసలు బయల్దేరాయి.

ఈ మధ్య తెలుగులోనే మాట్లాడుతున్నాడు సభల్లో బలరామయ్య. అతని తెలుగు కొంత మెరుగుపడ్డది సరస్వతే అందుకు చాలవరకు కారణం.

మంత్రిగారు మళ్ళీ ప్రారంభించినారు-

"సోదర సోదరీమణులారా!"

"మనకు స్వరాజ్యం వచ్చింది. అది గాంధీగారు తెచ్చి పెట్టిండ్రు. ఇప్పుడు నెహ్రూగారు సోషలిజం తెస్తనంటుండు. సోషలిజం తేవడానికి మేమంత కంకణం కట్టుకున్నం. అంటే వీరభద్రం తెస్తనన్న సోషలిజం అటువంటిదికాదు. మందిని చంపటం చీల్చటం ఉండదు. క్రమంగ మెల్లగ తెస్తం. మీరు బేఫికర్ ఉండుండి. మేం తెచ్చిపెట్తం. మీరు గడబిడలు గిట్ల చెయ్యొద్దు. చేస్తే ఎనక్కు పోతయి. మాట్లాడకుంట చూస్తుండండి వచ్చేస్తది సోషలిజం.

అసలే సోషలిజమంటే ఏమనుకున్నారు మీరు? ఇగో ఈ ఊరికి చక్కగా. సడక్ ఏసినమా అదే సోషలిజం. ఇప్పుడు బడి పెడ్తున్నమా అదే సోషలిజం ఎన్నడన్న బడి ఉన్నాది మన ఊళ్ళ? మళ్ళీ బడి వచ్చె. సోషలిజం రాక ఇంకేంది? పోరలంత బాగ చదువుకోవాల్నని బడి పెట్టినం. పోరలంత బాగా చదువుకోవాలె. పోకిరి తిరుగుళ్ళు తిరగొద్దు. అంతే సోషలిజమంటే ఇంకేమున్నది?"

"ఇగో జగ్గయ్యున్నడు చూసిన్రా. జగ్గయ్య. ఏ జగ్గయ్య మన జగ్గయ్య ప్రజల కోసం ప్రాణాలిచ్చిండే ఆ జగ్గయ్య. ఆ జగ్గయ్య మనూరోడు. అతడు సోషలిజం కావాలన్నాడు. దానికోసం చచ్చిండు. మేం సోషలిజం తెస్తున్నాం. మల్లా ఆయన మాకు గొప్పోడే. మీకు గొప్పోడే. ఆయన్ను మేము గౌరవించాలె. మీరు గౌరవించాలె. కాబట్టి ఈ ఏడాది జగ్గయ్య సమాధి బాగుచేయిస్తం. జగ్గయ్య దినం మేమే జరుపుతం మీరంతా మాకు సహకరించాలె."

"సోషలిజం-జిందాబాద్"

"తాళ్ళపాక జగ్గయ్య - జిందాబాద్"

అని కూర్చున్నారు మంత్రిగారు. అప్పటికే అలిసిపోయారు. బల్ల మీద పెట్టిన గ్లాసెడు నీళ్ళు త్రాగేశాడు.

తరువాత కృతజ్ఞతలు, జనగణమన మామూలుగా జరిగిపోయాయి.

కారు ఒక్కొక్కటే సాగిపోయాయి.

జనం కాళీ అయింది.

వీరభద్రం ఇంటిముందు కొందరు కూడారు.

"ఎరక లేకడుగుత, జగ్గయ్యను పట్టుకొని చంపించినోడు దొరేనాయె? మళ్ళ ఇప్పుడేమో సమాధి బాగుచేయిస్తనంటడు జాతర్లు చేస్తనంటడేముంది?" చాకలి ఎల్లమంద అడిగాడు.

ప్రశ్న సూటిగా ఉంది. మామూలుగా ఉంది. ముక్తసరిగా ఉంది. అయినా తల గోక్కున్నాడు వీరభద్రం.

"అదొక ఎత్తు"

"అంటె ఏందో మాకు తెలుస్తాదుండి? జర తప్పీల్గ చెప్పరాదుండి."

అడగడం బాగానే ఉంది. ఎలా చెప్పాలో అర్థం కాలేదు వీరభద్రానికి.

"వారికి బతికినవాడు శత్రువు. చచ్చిన వానిమీద భక్తి పుడుతుంది"

ఇంకా అర్థం కానట్లే చూశారు జనం.

"గాంధీజీ తెలుసుగదా! వారు మనకు స్వరాజ్యం కావాలన్నారు. వారు కోరిన స్వరాజ్యం ఎటువంటిదో తెలుసా?"

"మాకేం తెలుస్తదుండి. బట్టలుతుక్కొనేటోళ్ళకు. చెప్పండి యింటం" అన్నాడు యలమంద.

"మిక్కిలి పేదవాడు ఎక్కువ ఆనందం అనుభవించింది నా స్వరాజ్యం అన్నారు గాంధీజీ. గాంధీజీ అంటే ప్రజలకు ఒకరకమైన భక్తిభావం ఏర్పడింది. ఆయనను చంపేశాం. ఇప్పుడు వీళ్ళేం చేస్తున్నారు? ఆయన అన్నదాన్ని మరిచి పోయారు. ఆయన విషయంలో ఉన్న భక్తిభావాన్ని వాడుకుంటున్నారు. ఆయనకు విగ్రహాలు పెడుతున్నారు. పూజలు చేస్తున్నారు. ఆయనే బతికి ఉంటె ఇవన్నీ చూసి విషంతాగి చచ్చేవాడు. అదే విధంగా బతికి ఉన్నప్పుడు జగ్గయ్యను చంపారు. అతని మీద ప్రజలకున్న అభిమానాన్ని వాడుకోవడానికి సమాధులు కట్టిస్తా మంటున్నారు. జాతరలు చేస్తామంటున్నారు."

"దొంగలుండీ. దొంగలు" యలమంద ఉవాచ.

"కాదు వాండ్లే సర్కార్ చేస్తాన్రుండి" అన్నాడు మస్తాన్.

"మరేమొ సోషలిజం, సోషలిజం అంటాడేముండి దొర?"

"అదికూడా జగ్గయ్యకు కట్టె సమాధి వంటిదే"

"మళ్ళ మా మాన్యాల సంగతి మాట్లాడకపోతిరి."

"మాట్లాడెడిదేమున్నది? మందిపోవాలె. గుంజుకోవాలె. దున్నుకోవాలె. రామయ్యేం సర్కారా మళ్ళ మాన్యాలు గుంజుకునేటందుకు?" కాస్త ఉద్రేకంగానే అన్నది మంగమ్మ.

"రామయ్య సర్కారోలెనె కండ్ల పడ్తున్నది." అన్నాడు యలమంద.

ఇంతలో సన్నగా చినుకులు ప్రారంభం అయినాయి. ఎక్కడి వారక్కడ చెదిరిపోయారు.

* * *

ప్రకాశం పెద్దవాడవుతున్నాడు. అప్పుడే ఆరేళ్ళు వచ్చేశాయి. కుర్రాడు కాస్త బలిష్టంగా ఉంటాడు. పొడగరి. కాబట్టి ఇంకా ఎక్కువ వయస్సున్నట్లు కనిపిస్తాడు. చురుకైనవాడు చెబితే ఇట్టే అంటుకుపోతాడు. అతని ముఖంమీద వర్చస్సుంది.

ముచ్చటగా ఉంటుంది ముఖం. ముద్దు వస్తాడు. పైగా చదువంటే చెప్పలేని ఆకాంక్ష. ఇంట్లో మంగమ్మా, వీరభద్రం చదువు చెప్పడం ప్రారంభించారు ఊళ్ళో బడిలేని కారణాన. అప్పుడే మూడు వాచకాలు ముగించేశాడు. ఒకనాడు పాఠం చెబుతుంటే తల్లిని అడిగాడు. అమ్మా! ఆవుకు నాలుగు కాళ్ళుంటాయని నాకు తెలుసుగదా! పుస్తకంలో ఎందుకు చదవాలని. పాపం మంగమ్మ బిత్తరపోయి చూసింది. జవాబు చెప్పలేక పోయింది. తరవాత వీరభద్రం చెప్పాడు.

"బాబూ! ఈ చదువు మనకు ఇంగ్లీషువాళ్ళు పెట్టిపోయారు. ఆ దేశంలో పిల్లలకు కనిపించేన్ని ఆవులుండవు. అక్కడి పిల్లలకు ఆవుల్ను గురించి చెప్పడం అవసరం"

"మరి మనకు స్వరాజ్యం వచ్చింది కదా!"

"అవును వచ్చింది"

"చదువు లెందుకు మారవు మరి"

వీరభద్రం కూడా తికమక పడ్డాడు ఆ ప్రశ్నకు. ఏం చెప్పాలో ఎలా చెప్పాలో అర్థం కాలేదు. అంత చిన్న ప్రశ్నకు జవాబు చెప్పలేక పోయాడు అంత పెద్దమనిషి!

"మార్తాయి బాబూ మార్తాయి" అన్నాడు. కాని ఆ జవాబు అతనికే సంతృప్తి కలుగలేదు.

పాఠశాల లేనప్పుడు అవన్నీ చెప్పారు. ఇంట్లో చదివించారు. పాఠశాల రావడంతో చేర్చేయాలని నిర్ణయించారు. ఆ రోజంతా మంగమ్మతో ఏదో మాట్లాడాలనుకున్నాడు వీరభద్రం. ఎప్పుడూ బాబు ఇంట్లోనే ఉంటున్నాడు. మాట్లాడలేకపోయాడు మంగమ్మతో. చాలా సేపు మేలికతో ఉన్నాడు. బాగా రాత్రి అయిం తరవాత మగమ్మను పిలిచాడు. ప్రకాశానికి దుప్పటికప్పి, సరిగా పడుకోబెట్టి వచ్చింది.

"కూచో"

కూర్చున్నది మంగమ్మ. మంగమ్మ మనసు గుబగుబలాడింది. ఇంత రాత్రి తనను పిలవడం ఏమిటి? ఏం మాట్లాడ్తాడు అనుకుంది.

ఎలా ప్రారంభించాలో వీరభద్రానికి అర్థంకాలేదు. అతనూ తికమక పడ్డాడు. ఉబుసుపోకగా అన్నట్లు మంచంలో కూర్చున్నవాడు దుప్పటితీసి కాళ్ళమీద కప్పుకున్నాడు.

"చలిగా ఉన్నదా?"

ప్రశ్న అర్థంకాలేదు మంగమ్మకు. జవాబు కూడా చెప్పలేదు.

వీరభద్రం సిగరెట్టు వెలిగించాడు. పొగ భుస్సుమని వచ్చింది నోట్లోనుంచి ముక్కులోంచీ. మరొక దమ్ము గట్టిగా లాగి వదిలాడు.

"బాబును స్కూల్లో చేర్పించాలెగద!"

ఏం ప్రశ్న అది? అనుకుంది మంగమ్మ.

"అనుకున్నం గద"

"అదె చెప్పుతున్న. బాబు పండుకున్నాడా?"

"ఆ."

"చూసిరా ఒక్కసారి. నిద్రపోతున్నడో, తెలివితోనున్నడో"

సంభాషణ తీరు మంగమ్మకేమీ అర్థం కావడంలేదు. అవకాశం దొరికిందికదా అని లేచిపోయింది. అయినా గుండె గుబగుబలాడుతూనే ఉంది. ఎంత సేపు? క్షణంలో చూసివచ్చింది.

"నిద్రలోనే ఉన్నడు" అని కూర్చుంది కుర్చీలో.

"మన మాటలు వినటంలేదుగద"

"ఎట్లింటడు? నిద్రపోయుండన్న గద"

"ప్రకాశాన్ని బళ్ళో చేర్పించాలె"

"చెప్పిన్రుగద-రేపు చేర్పిస్తరని"

"అదే ఆలోచిస్తున్న"

"ఆలోచించెడి దేమున్నది?"

"అక్కడ తండ్రి పేరు రాయించాలె"

ఆ ప్రశ్న మంగమ్మమీద పిడుగులవాన కురిసింది. గుండె దడదడలాడింది. అందునుగురించి తానెన్నడూ ఆలోచించనేలేదు. అసలు భర్త జగ్గయ్య పోయాడు. తనదారి తాను చూచుకున్నాడు. తనను ఈ రొంపిలో దింపిపోయాడు. రామయ్య! ఆ పదమే ఆవిడముందు ఒక దయ్యాన్ని, ఒక రాక్షసిని నుంచో పెట్టింది. తాను లొంగింది. ఫలితంగా పాపం మోసింది. పాపను కన్నది. నలుగురూ చూడ్డానికి వీరభద్రాన్ని పెళ్ళాడింది. వీరభద్రం. ఆ మాట, ఆ పలుకులు, ఆ పేరు ఒక దేవతను తలపించింది. దేవుడు? కాదు, కాదు దేవుణ్ణి మించిన వాడు! చావనున్న తనకు ప్రాణంపోశాడు. ఆశయాలు నేర్పాడు. ఆశలు చూపాడు. జీవితంలో ఏదో వెలుగుందనీ, అది రాబోతూందనీ చూపాడు. ఆ వెలుగు చాటున ఆ వెలుగునీడలో నిశ్చింతగా యింతకాలం జీవించింది. తాను ఎన్నో పుస్తకాలు చదివింది. ఎంతో విజ్ఞానం ఆర్జించింది. కాని వీరభద్రం అడిగిన ప్రశ్నకు జవాబు ఎందులోనూ కనిపించలేదు. జీవితంలోని ప్రశ్నకు జీవితమే సమాధానం చెప్పాలి. పుస్తకాలు అవగాహన మాత్రం కలిగిస్తాయి. కట్టుకున్నవాడు పోయాడు. కాలరాచినవాణ్ణి గురించి చెప్పుకోరాదు. ప్రకాశానికి వాస్తవంగా తండ్రెవరో తెలియదు! తెలియరాదు!! మరి ఇప్పుడు తండ్రి కావలసిన వాడెవడు? ఏ పాపమూ ఎరుగని వీరభద్రం. వీరభద్రం! వీరభద్రమే! అతన్ని తల్చుకుంటే ఆవిడ కళ్ళు చెమ్మగిల్లాయి, నిండాయి. దీనంగా చూసింది వీరభద్రాన్ని.

"నన్నెందుకు అడుగుతున్నరు??" అని వేదనా కలశాలు బద్దలై గుండెనిండా చేరి బయటికి వస్తున్నాయి. ఆమెగొంతు బొంగురుపోయింది.

"నిన్నటినుంచి అడుగుదామనుకొంటున్న, బాబు ముందు ఎట్లడగాలెనని ఊరుకున్న. నీ అభిప్రాయం తెలుసుకుందామని!"

కన్నీరు కట్టలు తెంచుకుంది. జలజలా రాలింది. మంగమ్మ మాట్లాడలేక పోయింది.

"నా పేరు రాయించనా?"

"అన్నా!" అని భోరుమంది, అమాంతంగా కాళ్ళమీద పడిపోయింది. కన్నీటితో కాళ్ళు కడిగింది.

"నన్నడగాల్నా?" అనే మాటలు దుఃఖపు మాటలయినాయి.

వీరభద్రం గుండె బరువైంది. "లే. ఏడవకు" అని లేవనెత్తి కన్నీరు తుడిచాడు. "పో పండుకో" అని సాగనంపి నిట్టూర్చి మంచంలో పడిపోయాడు వీరభద్రం.

'బావిలో పడనిస్తేనే బావుండేదేమో! మనసులో బడబానలం పెంచుకుంటూంది' అనుకున్నాడు.

గదిలో మంగమ్మ నిద్రపోలేదు. బయట వీరభద్రానికి నిద్రలేదు. ప్రకాశానికేం తెలుసు వారి గుండెల బరువు! ఆ బాబు ఆదమరచి నిద్రపోయాడు.

ఇంకా పూర్తిగా తెల్లారకుండానే లేచాడు ప్రకాశం. బళ్ళో చేరుతాననే సరదాలో ఉన్నాడు తల్లిని లేపాడు. వెంటనే లేచింది, బాబును చూచింది. గట్టిగా కౌగిలించుకొని ముద్దులు కురిపించింది.

"అమ్మా! ఇవ్వాళ బడికి పోవాలె"

"అవును బాబూ! తలంటి పోసుకోవాలె, కొత్తబట్టలు వేసుకోవాలె, అప్పుడు బడికి పోవాలె."

"అట్లనే కొత్త పలకా, కొత్త పుస్తకం తీస్కపోత."

"తీస్కపో బాబూ! నీ కోసమేగదా తెచ్చింది."

"కక్కయ్య ఇంకా లేవలేదు గద."

"లేస్తడు. పా. మనం నీళ్ళు కాగబెడ్తాం" అని ఇద్దరూ వెళ్ళి పొయ్యిలో నిప్పు రాజబెట్టారు. అది మంగమ్మ గుండెలో రాజింది.

ప్రకాశం తలంటు పోసుకున్నాడు. కొత్తబట్టలు వేసుకున్నాడు. మంగమ్మ వండిన తీపి తిన్నాడు. కొత్త పుస్తకమూ-పలకా తీసుకొని బయలుదేరాడు. మంగమ్మ కొన్ని మిఠాయీలు యిచ్చింది పిల్లలకు పంచమని. అవి తీసుకొని వీరభద్రం బయలుదేరాడు.

వీరభద్రం వేలుపట్టుకొని ప్రకాశం సాగిపోతున్నాడు.

గుమ్మంలో నుంచొని చూస్తూ నుంచుండిపోయింది తల్లి మంగమ్మ.

వీరభద్రం వేలు పట్టుకొని సాగిపోతున్నాడు తన బిడ్డ!

ఆ ఆలంబనమే లేకపోతే! ఎందుకొచ్చిందో ఆ ఆలోచన ఆమెకు! కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

మసక మసగ్గా కనిపిస్తున్నారు.

మలుపు తిరిగారు!

గిరుక్కున తిరిగి లోపలకి వెళ్ళింది.

ఆమెకు రామయ్య కనిపించాడు.

రామయ్య పొలంనుంచి వస్తున్నాడు. అదే బాటన వస్తున్నాడు.

వీరభద్రం, ప్రకాశం ఎదురువచ్చారు. ప్రకాశం ఏదో అడుగుతున్నాడు. వీరభద్రం సమాధానం చెపుతున్నాడు. వీరభద్రం రామయ్యను గమనించలేదు. రామయ్య వారిద్దరినీ చూశాడు.

ప్రకాశం! తనకొడుకు! పలక పట్టుకొని పోతున్నాడు బడికి! మూల మలుపు దాకా వచ్చాడు. వెనక్కు తిరిగి చూశాడు. వారిద్దరూ సాగిపోతున్నారు తండ్రికొడుకుల్లా!

వీరభద్రం! చూస్తూ నుంచుండిపోయాడు. చూపందినంత సేపు చూశాడు. మనసులో ముల్లు కెలికింది. వెనక్కు తిరిగి సాగిపోయాడు.

గుమ్మందగ్గర గాంధీ, సుమతి కనిపించారు. సుమతి తలమీద నుంచి స్నానం చేసింది. నొసట కాసంత కుంకుమ ఉంది. చేతులో పళ్ళెం వుంది. పళ్ళెంలో మాణిక్యాలూ, కొబ్బరికాయ, పండ్లు, పూలు వగైరా వగైరా లున్నాయి.

సుమతినీ, గాంధీని గుమ్మంలో చూశాడు రామయ్య.

సుమతి రామయ్యను చూసింది.

"గుడికి పొయ్యొస్త" అని "ఏమొ అట్లున్నరు వళ్ళు బాగలేదా!" అడిగింది.

"బాగనే వున్నది-సరె పోయిరా" అని గుమ్మంలో అడుగు పెట్టాడు రామయ్య. గుమ్మం బయట అడుగు వేసింది సుమతి. గాంధీ ఆమెను అనుసరించాడు. ఇద్దరూ గుడివైపు సాగిపోయారు.

వీరభద్రం ప్రకాశాన్ని తీసుకొని హెడ్‌మాస్టర్ దగ్గరికి వెళ్ళాడు. అతడు తీరిగ్గా కూర్చొని గోళ్ళు గిల్లుకుంటున్నాడు. స్కూల్లో పిల్లలెం కనిపించలేదు ఇల్లు తప్ప. నమస్కారాదులు అయింతరువాత కూర్చున్నారు. వీరభద్రం ఒళ్ళో కూర్చున్నాడు ప్రకాశం.

"పిల్లగాణ్ణి చేర్పించటానికి తీసుకొచ్చినా?"

"అవును. మూడోక్లాసుదాకా ఇంటిదగ్గర చదివించినం. నాలుగో క్లాసులో చేర్చుకోవాలె."

"అట్లనా? వయసెంత?"

"ఆరు."

"ఆరైతే కుదరదండి. కాస్త వయసు ఎక్కువ రాయించండి."

"మీ ఇష్టం."

"బాబూ! భూమి ఎట్లున్నది?"

"గుండ్రం గున్నది" అని చెప్పిన ప్రకాశం "కక్కయ్యా! భూమి గుండ్రం గున్నదని తెలుసుకుంటె మనకేమొస్తది?" అని అడిగాడు.

"మాస్టరుగారిని అడుగు బాబూ."

అడిగాడు ప్రకాశం. కాని మాస్టరుగారికేమీ అంతుపట్టలేదు. వాస్తవంగా భూమి గుండ్రంగా ఉందని బోధించడంవల్ల ప్రయోజనం ఏమి? అర్థంకాలేదు మాస్టారుకు. తాను అదే చదువుకొన్నాడు. అదే చెపుతున్నాడు అందరికీ. ఎందుకు చెపుతున్నాడో తనకూ తెలీదు. ఇంతవరకు ఎవ్వరూ అడగలే దా ప్రశ్న. ఈ రోజు ఆరేళ్ళ కుర్రాడు అడిగాడు. ఆలోచిస్తే ఏమంత ప్రయోజనకారిగా కనిపించలేదు. మళ్ళీ మళ్ళీ ఆలోచించాడు. సమాధానం ఏమీ దొరకలేదు.

"గట్టివాడివేనయ్యా! అన్నీ నేర్చుకోవాలె."

"పిల్లి పాలు తాగును. అదికూడా నేర్చుకోవాలెనా మాస్టరుగారూ" ప్రకాశం ప్రశ్న.

అదిరిపోయాడు మాస్టరు. ఇవి అందరికీ తెలిసిన విషయాలే. అయినా పాఠాల్లో చెపుతారు. ఎందుకోఅర్థంకాలేదు. మహామహులకే అర్థంకాలేదు. ఆయనకేం అర్థం అవుతుంది.

"మరి ఏం నేర్పమంటావు బాబూ" ఓడిపోయి వేసిన ప్రశ్న. ఇక దానికి ప్రకాశం జవాబు చెప్పలేదని అడిగాడు. ఆరేళ్ళ కుర్రాణ్ని ఓడించినా తాను గొప్పవాణ్ణే అనుకొన్నాడు.

"రామయ్యకు మేడెందుకున్నది? మాకు గుడిసెందుకున్నది మాష్టారూ?"

పిడుగు పడ్డది మాస్టరుమీద. తాను బి.ఏ. దాకా చదువుకున్నాడు. ఆర్థిక శాస్త్రం చదివాడు. రాజకీయ శాస్త్రం చదివాడు. ఫస్టుకూడా వచ్చాడు. చిన్న తరగతినుంచి పెద్ద పెద్ద తరగతుల వరకూ ఎక్కడా ఈ వ్యత్యాసాలకు కారణం చెప్పలేదు. ఈ చదువులు ఎందుకు పనికివస్తున్నట్లు? భూమి గుండ్రంగా ఉంది. అక్బరు మహాచక్రవర్తి. పిల్లి పాలుతాగును. ఇవి ఎంత విజ్ఞానం కలిగిస్తున్నాయి? నిత్యజీవితంలో ఎంతగా పనికివస్తున్నాయి? ఎందుకు పనికివస్తున్నాయి? కనీసం ఇంత తిండీ గుడ్డ సంపాదించుకోడానికి పనికిరావే - ఊడిగం చెయ్యడానికి తప్ప! ఏం చదువులో అనుకున్నాడు. ప్రకాశం చురుకుదనానికి పొంగిపోయాడు మాస్టరు. కుర్చీలోంచి లేచివచ్చాడు. ప్రకాశాన్ని ఎత్తుకున్నాడు. ముద్దు పెట్టుకున్నాడు.

"చాల గొప్పవాడు అవుతాడండి" అని దింపాడు.

"అయితే పారం నింపాలె" అంటూ కుర్చీలో కూర్చొని డ్రాయర్లోంచి ఒక ఫారం తీశాడు. "చెప్పండి నేనే రాస్తా" అన్నాడు.

“బాబునే అడగండి” వీరభద్రం అన్నాడు.

మాస్టరుకు చిరుచెమటలు పోశాయి.

“పేరు?”

“ప్రకాశం”

“తండ్రి పేరు”

ప్రకాశం వీరభద్రాన్ని చూచాడు.

మాస్టరు ప్రకాశాన్ని చూచాడు.

“నా పేరు రాసుకోండి”

“వీరభద్రంగారు” అని గుణించుకొని రాసుకున్న మాష్టారు “మీ పిల్లవాడేనా నండి?” అని అడిగాడు.

“నన్ను కక్కయ్యా అని పిలుస్తాడులెండి”

“అట్లనా?” చర్చలోకి దిగతలచలేదు మాష్టరు. మళ్ళీ ఏమడుగుతాడో అని పడ్డది అతనికి.

“మతం?” అడిగాడు మాష్టారు.

“మనుషులం” ప్రకాశం జవాబు.

బిత్తరపోయి వీరభద్రాన్ని చూశాడు పంతులు.

“భారతీయుడు అని రాసుకోండి” అన్నాడు వీరభద్రం.

పెదవి కదపకుండా రాసుకున్నాడు పంతులు.

“కులం?” బెరుకు బెరుకుగానే అడిగాడు.

“లేనివాళ్ళం” ప్రకాశం జవాబు.

మళ్ళీ బిత్తరపోయి చూశాడు వీరభద్రాన్ని.

“అదికూడా భారతీయుడు అని రాసుకోండి” అన్నాడు వీరభద్రం. రాసుకున్నాడు పంతులు.

తరవాత ఇతర విషయాలు, వివరాలు రాసి సంతకాలు తీసుకున్నాడు హెడ్ మాస్టరు. ప్రకాశాన్ని క్లాసులోకి పంపించాడు. వీరభద్రం అక్కడున్న పిల్లలకు మిఠాయిలు పంచాడు. హెడ్మాస్టరు దగ్గరికి సెలవు తీసుకోవడానికి వచ్చాడు.

“వస్తానండి మరి ప్రకాశం విషయం కాస్త శ్రద్ధ తీసుకోవాలె.”

“మాకే చదువులు చెప్పేట్లున్నడు. పిడుగండీ పిడుగు. అదృష్టవంతులండీ ఇలాంటి కొడుకును కన్నారు” అని “కూర్చోండి కాఫీ తెప్పించిన ఎప్పుడూ వస్తారా మా దగ్గరికి?” అన్నాడు.

కాఫీ వచ్చింది.

ఇద్దరూ తీసుకొన్నారు.

“ఏమీ అనుకోకుంచే అడుగుత మతం కులం లేకుండా ఎలా ఉంటుం దండీ?”

"లేనివారిని విభజించడానికి స్వార్థపరులు పెట్టిన కోటలు అవి. ప్రపంచంలో రెండే కులా లున్నాయి. ఒకడు దోచుకునేవాడు. ఒకడు దోచబడేవాడు. మాకు ఈ మతాలమీదా కులాలమీదా నమ్మకాలు లేవు."

మాటలు తీక్షణంగా ఉన్నాయి. మాష్టరు మరి మాట్లాడలేక పోయాడు. ఒక సిగరెట్టు వీరభద్రానికిచ్చి తానొకటి తీసుకొని కాల్చసాగాడు.

ఇద్దరూ మౌనం వహించారు.

ఇద్దరూ పొగవదులుతున్నారు.

ఆలోచిస్తున్నది మాత్రం మాష్టారే. ఎలా వాదించాలా అని ఆలోచిస్తున్నాడు. తాను చదివినవన్నీ ఒకసారి తిరగతోడాడు. వర్ణ వ్యవస్థ ఎలా ఏర్పడిందీ, అది ఎంతగా సమాజానికి ఉపకరించిందీ నెమరు వేసుకున్నాడు. ఆధునిక సమాజానికి వర్తింపజేస్తే అన్నీ గుజ్జనగుళ్ళలా కూలిపోతున్నాయి. ఓట్లు సంపాదించడానికి పనికి వస్తాయనే నిర్ణయానికి వచ్చాడు మాష్టరు. అదేమాట అనేశాడు.

"దోపిడీకి పనికివచ్చే హంగులన్నీ మన పూర్వులు ఏర్పరచి పెట్టారు. వాటిని వీళ్ళు వాడుకున్నారు. అసలు విషయం ప్రజలు గుర్తించిన్నాడు వీళ్ళకు నిలువనీడ ఉండదు. అందుకే ఇలాంటి చదువులు. ఒక కవి సూటిగా ప్రశ్నించాడు-

"ఆకలందరికుండు నెందుకు?

అన్న మందరికుండ దెందుకు?"

"అయ్యా? మీకు మేం సమాధానం చెప్పలేం. మీరు కోరిన సమాజం వస్తే సంతోషించే వాళ్ళలో నేను ఒకణ్ని. ఒక్క మనవి. స్కూలు పెట్టాం. పిల్లలు లేరు తాము శ్రద్ధ తీసుకొంటే........"

"మాష్టరుగారూ! మన ఆర్థిక విధానం పాలక వర్గాలకు అర్థంకాదు. బళ్ల పెట్టడం వాళ్ళకు సరదా! ఆరేళ్ళ పిల్లవాడుంటే పసులుకాయ బోతాడు. మానెడో, తవ్వెడో సంపాదిస్తాడు. వాడ్ని బడికి ఎట్ల పంపుతరు చెప్పండి. అయినా మీరన్నది నిజం. అందరూ చదువుకోవాలె అప్పుడుగాని కళ్ళు తెరవరు. నాకు సాధ్యమైనంత ప్రయత్నం చేస్తాను. మా సహకారం ఎప్పుడూ మీకు లభిస్తుందని హామీ ఇస్తున్నాను. వస్తా" అని లేచి వెళ్ళిపోయాడు వీరభద్రం.

అప్పుడుగాని ఊపిరాడలేదు మాష్టరుకు.

అదేరోజు మల్లయ్య కొడుకు కోటయ్య బళ్లో చేరాడు.

విరామ సమయం. బడి పిల్లలు చింత చెట్లకింద చేరారు. పసుల కాపర్లు కూడారు. ఆటలాడు కుంటున్నారు. కోటయ్య, ప్రకాశంకూడా వారితో చేరారు. ఆస్తులు, అంతస్తులు మరిచి అంతా కలసి ఆడుకుంటున్నారు. ఇంకా అవి తెలియని బాల్యం వారిది.

గుడి గంటలు మ్రోగాయి. గణ గణ గణ మోగుతున్నాయి. పిల్లలు ఆటలు వదిలి అటు పరిగెత్తారు. గంటలు ఆగిపోయాయి. సుమతి పళ్ళెంలో ప్రసాదంతో

బయటికి వచ్చింది. పిల్లలకు ప్రసాదంమీద భక్తి మెండు. ఆమె చుట్టూ కూడారు. అందరికీ ఓపిగ్గా ప్రసాదం పంచిపెట్టింది. అలా తల ఎత్తి చూసింది. ప్రకాశం దూరంగా నుంచొని ఉన్నాడు. ఒంటరిగా ఉన్నాడు. పుల్లతో తన చుట్టూ గిరిగీసు కుంటున్నాడు.

సుమతి ప్రకాశాన్ని చూసింది.

అచ్చం రామయ్యలాగే ఉన్నాడు.

లిప్తపాటు గుండె ఆగింది. సాగిన తరవాత దడదడా కొట్టుకుంది.

తనకో సవతి ఉందా ఈ ఊళ్ళో?

రామయ్య మంచివాడనుకుంది తాను.

తననే మోసం చేస్తున్నాడా?

ఇలాంటి ఆలోచనలే క్షణంలో లక్ష వచ్చాయి.

ప్రకాశాన్ని ధ్యానంగా చూసింది. పిలిచింది. ప్రకాశం ఆమెవైపు చూశాడు. పుల్ల అవతల పారేశాడు. కాని కదల్లేదు.

"బాబూ ప్రసాదం తీసుకో. రా!"

ప్రకాశం కదల్లేదు. చూస్తూ నుంచున్నాడు.

కోటయ్య వచ్చాడు. "దొర్సాని పిలుస్తున్నది రా" అని చేయిపట్టుకొని లాగాడు. చేయి వదిలించుకున్నాడు. కాని కదల్లేదు ప్రకాశం.

సుమతి కదిలింది. వెంట కొంగు పట్టుకొని గాంధీ నడిచాడు. మెట్లు దిగింది. మెల్లగా నడిచింది. ప్రకాశం దగ్గరికి వచ్చింది.

"ప్రసాదం తీసుకోబాబూ"

"ఊహుఁ. నా దగ్గర మిఠాయి లున్నయి" అని జేబులోంచి తీశాడు.

గాంధీ చేయిచాచాడు తన కివ్వమన్నట్లు.

సుమతి గద్దించింది. గాంధీ చేయి వెనక్కు లాక్కున్నాడు. ముఖం ముడుచు కున్నాడు.

"దేవుని ప్రసాదం వద్దనకూడదు."

"అయితే ఆ బాబు మిఠాయి తీసుకుంటే"

సుమతి కాస్త వెనకా ముందాడింది. గాంధీని మిఠాయి తీసుకోమంది. కాని జేబులో దాచుకొమ్మంది.

గాంధీ ముఖం చాటంతయింది. ఉత్సాహంగా చేయి చాచాడు తల్లి చాటు నుంచే. ప్రకాశం మిఠాయి అందించాడు. గబాల్న అందుకొని జేబులో వేసు కొన్నాడు. తల్లివైపు చూచాడు తల ఎత్తి. అంతే అన్నట్లుగా సంజ్ఞ చేసిందామె.

పిల్లలు మళ్ళీ ఆటలో పడిపోయారు. అందరూ దూరంగా వెళ్ళిపోయారు.

"తీసుకో బాబూ ప్రసాదం."

చేయి చాచాడు ప్రకాశం.

అలా చాచే పద్ధతి బాగనిపించలేదు సుమతికి. ప్రసాదం అంటే ఒక చేయి కింద ఒకటి ఉంచి భక్తిగా అందుకోవాలి. లేకి పిల్లలు. వాళ్ళ కేం తెలుస్తుంది అనుకుంది. అయినా ప్రసాదం పెట్టింది. గభాల్నోట్లో వేసుకున్నాడు ప్రకాశం. అదీ నచ్చలేదామెకు. కళ్ళ కద్దుకొని వేసుకోవాలి. వీళ్ళంతా ఇంతే అనుకుంది.

"బాబూ నీ పేరేమి?"

"ప్రకాశం"

"నాయ్న పేరు."

"మాకు నాయ్నలేదు. కక్కయ్యే. వీరభద్రంగారు"

సుమతి కలవరపడింది. చేతులు వణికాయి. పళ్ళెం పడిపోవలసిందే. కాని అశుభ సూచనాన్ని అరికట్టడానికి పట్టుకుంది గట్టిగా.

"నువ్వు మంగమ్మ కొడుకువా?"

"మా అమ్మ పేరు మంగమ్మగారు"

"రామయ్య వస్తడా మీ యింటి కెప్పుడన్న?"

"రామయ్యేందు కొస్తడు మా ఇంటికి? వాళ్ళు ఉన్నోళ్ళు - మేం లేనోళ్ళం"

"అస్సలు రాడా?" ఎందు కడుగుతుందో ఆమెకే తెలియడంలేదు.

బడిగంట కావడంతో ఉరికాడు ప్రకాశం.

చిరచిరలాడింది సుమతి.

"అమ్మా! మిఠాయి తిననా?" అని జేబులోంచి తీసి చూపించాడు గాంధీ. చేతిలోంచి లాగి విసిరి పారేసింది.

గాంధీ ఏడుపు మొదలు పెట్టాడు. గాంధీని లాక్కొని చరచరా నడిచి పోయింది.

సుమతి ముఖాన పేలాలేగుతున్నాయి.

ఏదో ఆలోచనలో నిమగ్నుడైవున్న రామయ్యకు ధుమధుమలాడుతూ ఇంట్లో అడుగు పెడ్తున్న సుమతి కనిపించింది.

"ఏమో అట్లున్నవు?" అడిగాడు రామయ్య.

సుమతి మాట్లాడలేదు. ఏడుస్తున్న గాంధీని లాక్కొని లోనికి వెళ్ళిపోయింది.

రామయ్య కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాడు. కదల్లేదు.

ఇల్లు నిరామయంగా ఉంది.

సుమతి గదిలోకి వెళ్ళి తలుపేసుకుంది. ఆమెకు క్షణం క్రితపు దృశ్యం మనసులో మసలింది. గాంధీ ఏడుస్తున్నాడు. తాను లాక్కొని వస్తూంది. రామయ్య అక్కడే ఉన్నాడు. గాంధీని దగ్గరికి తీసుకోలేదు. ఓదార్చలేదు. రామయ్యకు తన బిడ్డమీద అనురాగంలేదు. అతనికి ఒక బిడ్డ ఉన్నాడు! అందుకే గాంధీమీద అనురాగం లేదు. "మాకు నాయన లేదు" అన్న ప్రకాశం మాటలు సుమతికి మెదడులో తిరుగుతున్నాయి.

ఆమెకు దుఃఖం ముంచుకొని వచ్చింది.

తండ్రి గుర్తుకు వచ్చాడు.

దిండుని కావిలించుకుని ఏడ్చేసింది.

ఆ సాయంకాలం హెడ్‌మాస్టరును పిలిపించాడు రామయ్య.

మాస్టరు నుంచొనే ఉన్నాడు.

రామయ్య సోఫాలో కూర్చొని సిగరెట్లు పీకుతున్నాడు.

అమాంబాపతు ముచ్చట్లన్నీ అయింతరవాత అడిగాడు :

"ఇవ్వాళ చేరిన పిల్లలెందరు?"

"ఇద్దరండీ"

"అదికాదయ్యా! ఎవరెవరు చేరిన్రంటే ఇద్దరని చెప్పుతవేం? యాడ చదివిసా వయ్యా?"

"చిత్తం. కోటయ్యా, ప్రకాశమండి."

"ఎట్లుంటరు?"

"బాగానే వుంటరండి."

"బాగనే వున్నది! పోరలకు చదువెట్ల చెప్పుతవయ్యా! తెలివి తేటలు గిట్ల ఎట్లుంటయని అడుగుతున్న."

"చిత్తం"

"చిత్తమేమిటి నా బొంద! నీ బొంద!"

"చిత్తం -అంతేనండి."

"అంతేమిటయ్యా! కొలువుకు పనికొచ్చేటట్లు లేవు తీసేయిస్త"

"అయ్యా! అయ్యా! కాళ్ళు మొక్కమంటె మొక్కుత కడుపున పుట్టమంటె పుడ్త. ఎంతమంది కాళ్ళు పట్టుకుంటెనో కొలువొచ్చింది. బియ్యే పాసైన ఫస్టు క్లాసుల. బికారినై తిరిగిన. ఇప్పుడే లగ్గం చేసుకున్న. బుక్కెడు తింటున్న. బతకనియ్యండి మహారాజా! బతకనియ్యండి"

గొంతు బొంగురుపోయింది. సుమారు ఏడ్చేంతపని చేశాడు పంతులు.

"లగ్గం చేసుకున్నవ్ లే"

"అవునండి."

"పెండ్లాన్ని తెచ్చుకున్నవా?" ఏదో అపశ్రుతి వినిపించింది పంతులుకు.

"చిత్తం, ఇంకా తెచ్చుకోలేదండి. తెచ్చుకుంట."

"అందుకే అట్ల మాట్లాడుతున్నవ్"

"చిత్తం. ఎట్ల మాట్లాడిన్నండి?"

"అడిగిందానికి సీదా జవాబు చెప్పవ్ సర్. ఉర్ ఫిరాయిస్తున్నదా?"

వాస్తవంగానే తల తిరగసాగింది పంతులుకు.

"ఏ మడిగిన్రండి?"

"చేరిన పోరలెట్లున్నరన్న" గట్టిగా మాట్లాడాడు రామయ్య.

"బాగున్నరని చెప్పిన గదనుండి"

"బాగానే ఉన్నది. రెడ్డొచ్చె మొదలాడు అన్నట్లున్నది. వాండ్ల తెలివితేట లెట్లున్నయయ్యా!"

"చిత్తం."

"చిత్తమేమిటయ్యా! అడిగిందానికి జవాబు చెప్పకుండ"

"చిత్తం. ఇద్దరు చేరిన్రనుండి-కోటయ్య, ప్రకాశం"

"ఊఁ"

"చిత్తం ప్రకాశమున్నడు చూసిన్నానండి."

"ఊఁ"

"వాడు పిడుగండి. పిడుగు"

రామయ్య ముఖం వెలిగింది. కళ్ళల్లో వెలుగు కనిపించింది. దాంతో కాస్త ధైర్యం వచ్చింది పంతులుకు.

'వాడు నన్నే సవాళ్ళడిగుండి'

'గట్టోడంటవు!'

'అబ్బ! జర గట్టోడానుండి. శాన గట్టోడు'

అడిగిందె అడిగాడు రామయ్య. చెప్పిందే చెప్పాడు పంతులు. అలా చాలా సేపు గడిచింది. పంతులు నుంచొని ఉన్నాడు. కాళ్ళు పీక్కొని పోతున్నాయి. లోప ల్లోపల రామయ్యను నానా శాపనార్థాలు పెడుతున్నాడు. వీరభద్రాన్ని తలుచుకుంటే దేవునిలా కనిపించాడు. మనసులో దండం పెట్టాడు. తరవాత అనుకున్నాడు 'మొక్కిన వరమీని వేల్పు' అని.

రామయ్య సిగరెట్టు పొగ గుప్పున ముఖాన ఊది 'కూర్చో' అన్నాడు.

వరమిచ్చిన వేల్పులా కనిపించాడు రామయ్య పంతులుకు. దూరంగా ముడు చుకొని కూర్చున్నాడు.

'ఏమి! నేను దయ్యమోలే కన్పడుతున్ననా? అట్ల దూరంగ కూర్చుంటవు? రా దెగ్గరికి'

"అబ్బే? అదేం కాదండి. బాగున్నది ఇక్కడ్నే" అని సర్దుకొని కూర్చు న్నాడే కాని కదల్లేదు.

'రావయ్యా అంటే. ఇట్లరా. దగ్గర కూర్చో'

పంతులు కాస్త తికమక పడ్డాడు. అయినా లేచి పిల్లిలా పోయి పక్కనే కూర్చున్నాడు ముడుచుకొని.

'ఇగో చూడు. ప్రకాశం తండ్రి పేరేమని రాయించిండు?'

'వాడా? ప్రకాశమా?'

'ఉష్! జర చిన్నగ మాట్లాడు. ఊఁ ఏమని రాయించిండు?'

'పంతులుకంతా అయోమయంగా ఉంది. ఏమీ అర్థం కాలేదు.

'తండ్రి పేరే రాయించిండండి'

"అదేనయ్యా ఏం పేరు....?"

'వీరభద్రమే కదండి అబ్బాయి తండ్రి?'

'అదంత నీకెందుకు? ఏం రాయించిండు చెప్పమంటె?'

'వీరభద్రమనే రాయించిండండి.'

'సరె. ఇగ పో. ఈ సంగతి ఎవ్వరికి తెల్వవద్దు'

"అట్లనేనండి" అని నమస్కరించి బయల్దేరాడు.

"పెండ్లాన్ని తెచ్చుకో. ఒక్కని వెన్నాళ్ళుంటవ్?"

"అట్లనేనండి" అని సాగిపోయిన పంతులు మెదడు అనుమానాలతో నిండి పోయింది. ఇప్పుడు ప్రకాశంలో రామయ్య పోలికలు అచ్చు గుద్దినట్లు కనిపించాయి పంతులుకు. తానిక్కడ నెగ్గగలనా అనుకున్నాడు.

ఆ రాత్రి సుమతిలో మామూలు ఆకర్షణ కనిపించలేదు. ఆమె సింగారించుకుంది. పూలు తురుముకుంది. అయినా అదోలా ఉంది. ఆకర్షణకు మనసుతో సంబంధం. అది పూలతో రాదు. ఆవిడ మనసులో ఒక రకం కలవరపాటుంది. ఒక అగ్గికొండ రగులుకుంటూంది. ఒకబాణం ఎక్కుపెట్టి ఉంది. ఏ మాత్రం తాకిడికైనా దూసుకుపోతుంది.

"ఏమొ అట్లున్నవు?"

"ఎట్లుంటె మీకెందుకు"

సూటిగా గుండెలో గుచ్చుకుంది రామయ్యకు.

"అట్లెందు కంటవ్?"

"నే నొక్కదాన్నె ఉన్ననా మీకు"

ఇంకాస్త వాడి బాణం తాకింది.

"మనసుల ఏమొ పెట్టుకొని మాట్లాడుతున్నవ్"

"ఏముంటె మీ కెందుగ్గని?"

"చెప్పంది ఎట్లు తెలుస్తది"

"ఆరుస్తరా? తీరుస్తరా?"

రామయ్య ఆశ్చర్యపడ్డాడు. ఏమిటో మంకుతనం? ఎన్నడూ లేంది ఎందుకొచ్చిం దివ్వాళ? అర్థం కాలేదు. కాస్త తికమక పడ్డాడు.

"చెప్పుతె ఆర్చుటమొ, తీర్చుటమొ చేస్తగద"

"గాంధీని బడికెందుకు పంపరు?"

"ఉస్స్ ఇంతేనా?" అని పెద్దగా నవ్వేశాడు రామయ్య. "కోపమొచ్చినా ఎంత అందంగున్నవు?" అని దగ్గరికి జరిగాడు.

అడుగుదా మనుకున్నమాట అడుగున పడిపోయింది. సుమతి కాస్త వెలవెల బోయింది. మళ్ళీ చిరుకోపం తెచ్చుకుంది.

"ప్రకాశం ఎవ్వరు?"

చిరుచెమటలు పట్టాయి రామయ్యకు. అయినా మామూలుగానే అన్నాడు "మంగమ్మ కొడుకు."

"తండ్రి మీరు కాదూ?"

రామయ్యలో కోపం పొంగింది. పెదవులూ, చేతులూ వణక సాగాయి. కళ్ళలోంచి ఆవిర్లు లేచాయి.

"నీ కేమన్న బుద్ధున్నదా ? ఆ ముండను నాకు కట్టబెడతావు ? ఆ బైరాగి పోరడు ఎవనికి పుట్టిండో నాకేమెరకనా?"

గద్దించాడు. గట్టిగా అరిచాడు. గడగడ లాడిపోయింది సుమతి. అతని ఆకారం చూసి వణికిపోయింది. ఏంచేయడానికీ తోచలేదు. రెప్ప ఆర్పకుండా చూస్తూ నుంచుండిపోయింది. దుఃఖం పొంగింది. దుమికేట్లుంది.

ఎదురుగా నుంచున్న రామయ్య వణికిపోతున్నాడు. గుండె వేగంగా కొట్టు కోవడం కనిపిస్తూనే ఉంది.

"గాంధీ నా కొడుకే నంటవా?" అంత గట్టిగా అరిచాడు.

పొంగిన దుఃఖం కట్టలు తెంచుకొంది. కన్నీరు చెక్కిళ్ళమీంచి జలజలా రాలింది. గుండె గాయపడింది. భోరుమని ఏడ్చి కాళ్ళమీదపడిపోయింది సుమతి.

"ఎందుకట్లంటరు? ఎందు కనుమానపడ్తరు? నా శీలాన్ని శంకించిందానికంటె నన్ను చంపి అవతల పారెయ్యండి. అనండి. గాంధీ మీ కొడుకేనని అనండి. అన కుంటే నా తల బద్దలు చేసుకుంటా" అని తల నేలకేసి కొట్టుకోసాగింది. నొసలు చిట్లింది. రక్తం కారుతూంది. అయినా తల నేలకేసి బాదుకుంటూనే ఉంది.

"సుమతీ!" అని ఆమెను లేవనెత్తాడు.

ఆమె రామయ్య భుజంమీద వాలిపోయింది. ముక్కుమీదినుంచి కారుతున్న రక్తంతో రామయ్య భుజం తడిసింది.

"పిచ్చిదానా!" అని రామయ్య తన రెండు చేతుల్లోనూ సుమతి ముఖాన్ని తనముఖం ముందుకు తెచ్చుకున్నాడు.

ముఖం నిండా రక్తం. చెంపల నిండా రక్తం.

ముద్దు పెట్టుకున్నాడు రామయ్య.

అతని పెదవులకు రక్తం అంటింది.

రామయ్యను గట్టిగా కౌగలించుకొంది సుమతి ఏదో జారిపోతున్న ఆలంబ నాన్ని పట్టుకున్నట్టు.

ఆ తరువాత ఎవరూ, ఎన్నడూ మళ్ళీ ఆ మాట ఎత్తలేదు. గుండెల్లోనే కుంపట్లు దాచుకున్నారు.

ఒకనాడు బెరుకు బెరుగ్గానే అన్నది సుమతి.

"గాంధీ పెద్దవాడవుతున్నాడు. బడికి పంపటం మంచిది."

మళ్ళీ పూర్వపు అన్యోన్యత వారిలో పుంజుకోలేదు. అయితే ఎడముఖం పెడముఖంగా మాత్రంలేరు. ఇద్దరూ నిత్య శంకితులైనారు. ఉభయులూ మనస్సుల్లోని మాటలు చెప్పుకోవడంలేదు. లోకాపవాదభీతి లేకుంటే సుమతీ, సుమతి ఆస్తి లేకుంటే రామయ్యా విడిపోయేవారే. మనసులు విడిపోయాయి. మనుషులు మాత్రం కలిసి ఉంటున్నారా ఇంట్లో. భార్యాభర్త లనిపించుకుంటున్నారు. ఆ బంధమే అలాంటి దేమో!

"ఎప్పుడు పంపుదా మంటవ్?"

"మంచిరోజు చూసి. ఈ ఊరి బడికైతే వద్దు. అంత లేకి పోరలున్నరు?"

ప్రకాశాన్ని దృష్టిలో పెట్టుకునే ఆ మాట అన్నదని రామయ్య గ్రహించాడు. గాంధీ మీద ప్రకాశం నీడ పడకూడదని ఆమె ఆకాంక్ష.

"సరె పట్నం పంపుదామా? చిన్నమ్మ మంచిగ చూచుకుంటది" రామయ్య దాన్ని సాగదీయదలచుకోక అన్నాడు.

"అక్కణ్నె వుంచుదమా?" రామయ్య తన బిడ్డను ఇంట్లోంచి తప్పిద్దామని చూస్తున్నాడనుకొంది సుమతి.

"నేను గాంధీని విడిచి ఉండలేను."

అంటె తనను విడిచి ఉండగలదన్నట్లు వ్యాఖ్యానించుకున్నాడు రామయ్య.

"అయితే నువ్వుగూడ పోతవా"

తనను వదిలించుకోవా లనుకుంటున్నాడు రామయ్య అనుకుంది సుమతి. తాను లేకుంటే మంగమ్మతో కులకవచ్చు ననుకుంటున్నా డనుకుంది.

"మిమ్మల్ని విడిచి నేనెట్లపోత?"

తనకు కాపలాకాయడానికి ఉంటా నంటున్నట్లు అర్థంచేసుకున్నాడు రామయ్య. అయినా అది వ్యక్తం కానివ్వకుండానే అన్నాడు "మళ్ళ ఎట్ల చేస్తమంటవ్? మెడకు బెండు కాలుకు గుండు అన్నట్లున్నది"

"ఎందుకిట్ల విసుక్కుంటరు? ఒక కారు కొనండి. గాంధీ ఇక్కడున్నట్లె ఉంటుంది. రోజు బడికి పొయ్యొస్తడు."

రామయ్య కాస్త విసుక్కున్నాడు. ఆ మాటల్లో అతనికి నీడబ్బేం పెట్టక్కర్లే. నా డబ్బు పెట్టే కొను అనే అర్థం ద్యోతకం అయింది. ఒక సిగరెట్ ముట్టించాడు. ఆలోచనలో పడ్డాడు. ఆలోచించిన కొద్దీ సుమతి ప్రతిపాదన మంచి గానే కనిపించింది- సాటివాళ్ళంతా కారు కొనేశారు. అదొక హోదా—ఒక గౌరవం. పైగా తాను పిల్లవాణ్ని బడికి పంపడానికి కారుకొంటాడు. ఎంత గొప్పధనం! పైగా తనకు పట్నానికి చీటికీ మాటికీ పని పడుతూనే ఉంటుంది. ఆలోచన వచ్చిందతనికి. బాగుందనుకున్నాడు.

"అయ్యేమాత్రం దొరుకుతున్న యనుకున్నవా? ఇవ్వాళ అడుగుతె రెండేళ్ళ కిస్తున్రా" ఏదో అనాలని అన్నమాట అది.

అర్థం మరోరకంగా చేసుకుంది సుమతి - ఏదో రకంగా ఎగ్గొట్టాలని చూస్తున్నాడని. "మీరు తలుచుకుంటె అదొక లెక్కా? మామగారిని అడగండి. మంత్రి అయ్యిండుగద మనకు బండన్న ఇప్పిచ్చడా? డబ్బు మనమే కట్టుకుంటం గద."

నువ్వు వట్టి వాజమ్మవు. మామగారైతే ఏ పనైనా సాధించగలడు అన్న ధ్వని వినిపించింది రామయ్యకు. అయినా సంభాషణ సాగదీయదలచలేదు. మాట్లాడుతున్నంతసేపూ ముండ్లమీద ఉన్నట్లుండి- ఇప్పుడు పూలు కొరవడంలేదు.

"అట్లనే చెప్త" అని సంభాషణ ముగించి దీపం ఆర్పేశాడు రామయ్య.

రామయ్య ఇంటికి కారు వచ్చేసింది - అంబాసెడర్. అది వచ్చి పచ్చని పందిరికింద ఆగింది. తెల్లవారి గాంధీ అక్షరాభ్యాసం. అందుకే అడావుడిగా వుంది రామయ్య ముంగిలి. కారువచ్చి ఆగడంతో ఊరంతా అక్కడే కూడింది.

ఆ రాత్రంతా ఊళ్ళోవాళ్ళకు నిద్రలు లేవు. పెట్రోమాక్సులు వెలుగుతున్నాయి. కొందరు పందిరిని అలంకరించడంలో నిమగ్నులైనారు. రంగు రంగుల కాగితాలు అంటిస్తున్నారు. తోరణాలు కడ్తున్నారు. జంపకానాలు పరుస్తున్నారు. కుర్చీలు సర్దుతున్నారు. వేదికను అలంకరించే పని కొందరు తీసుకున్నారు. ఆ వేదిక మీదనే అక్షరాభ్యాసం జరగాల్సింది. పూలతో నింపేశారు దాన్ని. పూలదండలే తోరణాలుగా కట్టారు. రబ్బరు బెలూన్లు అందంగా వ్రేలాడకట్టారు.

వీధులు ఊడుస్తున్నారు కొందరు. మరికొందరు నీళ్ళు చల్లుతున్నారు. వచ్చే కార్లవారికి దుమ్ముమవాసన తగలరాదని ఆ ఏర్పాటు. ఊరి బయటనుంచి పందిరిదాకా గడలు పాతారు. వాటికి మువ్వన్నె జండాలూ, మామిడాకులూ కట్టారు.

లారీలలో సామానులు వచ్చేశాయి. వంటవాళ్ళు దిగారు. పిండివంటలు తయారవుతున్నాయి. అక్కడ ఆడవాళ్ళు సతమతం అవుతున్నారు. మేకలు తెగుతున్నాయి. కోళ్ళు చస్తున్నాయి. మసాలాలు తయారవుతున్నాయి. రుబ్బేవారు రుబ్బుతున్నారు. నూరేవారు నూరుతున్నారు. వంటవాళ్ళు చమటలు కక్కుతున్నారు.

యాదగిరి, సైదయ్యా, హుసేన్ అడావుడిగా అన్నీ అజమాయిషీ చేస్తున్నారు. తెల్లవారేవరకు ఊరు ఉత్సవపు రంగు పులుముకుంది. రామయ్య ఒక్కసారి ఊరంతా తిరిగి చూచి వచ్చాడు.

పట్నం నుంచి బ్యాండువారి వ్యాను దిగింది. ఊరివారి సన్నాయి మోగింది. బ్యాండు వాద్యం సాగింది. పట్నంనుంచి కార్లు ఒకటొకటే వచ్చేస్తున్నాయి. వాటిల్లో భారీ మనుషులు దిగుతున్నారు. శేషయ్య వారందరికీ గులాబి పూలు, అత్తరు పన్నీరు ఇచ్చి స్వాగతం పలుకుతున్నాడు. కార్లన్నీ గడీ ఆవరణలో నిలుపుతున్నారు. అది నిండిపోయింది. బలరామయ్య దిగాడు. మరికొందరు మంత్రులూ వచ్చారు. వాటికి రామయ్య స్వయంగా స్వాగతం పలికాడు.

పందిరి సదస్యులతో నిండిపోయింది. గాంధీని చుడీదార్ పైజమా, తళతళ మెరిసే షేర్వానీ, జరీ అంచు టోపీతో అలంకరించి వేదికమీదికి తెచ్చారు. రామయ్యా, సుమతి పీటలమీద కూర్చున్నారు. మంగళవాద్యాలు మ్రోగాయి. బాపడు మంత్రాలు చదివాడు. బలరామయ్య స్వయంగా గాంధీకి అక్షరాభ్యాసం చేశాడు. అంతటితో ఆ తంతు ముగిసింది.

పిల్లలకు పలకలూ, పుస్తకాలూ, మిఠాయి డబ్బాలూ పంచిపెట్టించారు గాంధీతో. పిల్లలు వరుసనే నుంచున్నారు. ఒక్కొక్కడే ముందుకు వచ్చి అందుకొని పోతున్నారు.

ప్రకాశం చేతులు కట్టుకొని దూరంగా నుంచున్నాడు. మొదటినుంచీ అతడు అక్కడే ఉన్నాడు. దీక్షగా చూస్తున్నాడు. స్థిరంగా నుంచున్నాడు. కదలడు. మెదలడు. ఉలకడు. పలకడు.

పిల్లలంతా పలకలూ, పొట్లాలు తీసుకుని వెళ్ళిపోతున్నారు.

ప్రకాశం కదల్లేదు.

రామయ్య ప్రకాశాన్ని చూచాడు.

ప్రకాశం రామయ్యను చూచాడు.

ఇద్దరు కొయ్యబారి నుంచున్నారు-దూరంగా.

రామయ్యకు ప్రకాశాన్ని పిలవాలనిపించింది. మిఠాయి పొట్లం అందించాలనిపించింది. మెరుపులా వచ్చిన ఆలోచన-ఎత్తుకొని ముద్దు పెట్టుకోవాలని.

అడుగు ముందుకు వేశాడు.

ప్రకాశం అడుగు వెనక్కు వేశాడు.

రామయ్య పక్కలకు చూచాడు. పందిట్లో జనం, పెద్దలు మంత్రులు, నాయకులు. తాను తన హోదా. వెనక్కు చూచాడు. సుమతి చూస్తుంది! ముందునుంచీ గమనిస్తూంది. అడుగు వెనక్కు వేశాడు. అడావుడిగా పన్లలో మునిగిపోయాడు.

మనసు ప్రకాశంమీదనే ఉంది.

ప్రకాశం నిశ్చలంగా నుంచున్నాడు.

పూలతో అలంకరించిన కారు వచ్చి వీధిలో నుంచుంది. అది రామయ్య కారు-కొత్తది-అంబాసెడర్!

వాద్యాలు మోగుతూండగా గాంధీ కదిలాడు. రెండు వైపులా సుమతీ, రామయ్యా ఉన్నారు. ముందు మంత్రాలు చదివే బాపడు నడుస్తున్నాడు. వెనక పెద్దలు నడుస్తున్నారు. గాంధీని కార్లో కూర్చోపెట్టారు. బలరామయ్య ఎక్కాడు. ముందు బ్యాండు వాద్యపు వాను సాగింది. వెనుక మెల్లగా సాగింది కారు.

ప్రకాశం చూస్తున్నాడు.

కారెంచి గాంధీ చూచాడు.

చేయి ఊపాడు రమ్మన్నట్లు.

ప్రకాశం చిరునవ్వు నవ్వాడు. కాని కదల్లేదు.

కారు సాగిపోయింది.

తరవాత భోజన భాజనాలయినాయి- పట్నం జనం సాగిపోయారు. కార్లన్నీ వెళ్ళిపోయాయి. ఊరు సద్దుమణిగింది - రామయ్య ఇంట్లో తప్ప.

అప్పుడు కదిలాడు ప్రకాశం.

ఇంటికివెళ్ళి తల్లినడిగాడు ధనవంతులు కావడానికి ఏం చేయాలని.

"కష్టపడి చదువుకోవాలె. పెద్ద ఉద్యోగాలు చెయ్యాలె" అని చెప్పింది మంగమ్మ.

"రామయ్య చదువుకున్నడా? పెద్ద ఉద్యోగాలు చేస్తున్నడా?"

ప్రశ్న విని బిత్తరపోయింది మంగమ్మ. ఆమెలో వెంటనే ఏదో సంతోషం పెల్లుబికింది. తన కొడుకు ఎంత పెద్ద పెద్ద ప్రశ్నలడుగుతున్నాడు అనుకుంది. ప్రకాశాన్ని దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంది.

ఇంతలో కోటయ్య వచ్చాడు. ఒక పలకా పుస్తకం వగైరా చంకలోనూ, మరొకటి చేతులోనూ పట్టుకొని వచ్చాడు. చేతులోనివి కింద పెట్టి "రామయ్య దొర ఇయ్యమన్నడు - ప్రకాశానికి" అని నుంచున్నాడు.

ఆ మాట వినగానే రౌద్రం వచ్చింది మంగమ్మకు. చివాలునలేచి అవి తీసుకొని విస్సిరి పారేసింది "పెద్ద దయ చూపొచ్చిండు" అంటూ.

ప్రకాశం, కోటయ్య, వీరభద్రం నిర్విణ్ణులై చూస్తూ నుంచున్నారు.

"వాడేదిచ్చినా నువ్వు తీసుకోవద్దు. వాడు దొంగ, మోసకారి. లుచ్చా, లఫంగా" అని ఆవేశంగా అనేసింది మంగమ్మ.

"అట్లాంటోళ్ళే ధనవంతులైతరా?" అమాయకంగా ప్రశ్నించాడు ప్రకాశం. మంగమ్మ కరిగిపోయింది. పొంగిపోయింది. కొడుకును గట్టిగా కావిలించుకొని ముద్దుల వర్షం కురిపించింది-ఏడ్చేసింది.

రామయ్యకు వచ్చిన అంబాసెడర్‌కు ఒక కథ ఉంది. ఒక చరిత్ర ఉంది.

ఆ కారు శేషయ్యది. అతని కెలా వచ్చిందీ? అంటే అదే మరి రామయ్య కారు కథ.

పోలీసు చర్యకు పూర్వం నైజాంలో అనేక జాగీర్లుండేవి. వారి ఏలుబడిలో నైజాం రాష్ట్రంలోని మూడవవంతు నేల ఉండేది. మొత్తం 1167 మంది జాగీర్దారు లుండేవారు. వారు స్వతంత్రులు. జాగీరు ప్రభుత్వం వారిది. దానికి వారు సార్వభౌములు! ప్రజల రక్తం పిండి డొక్కలు నింపుకుంటూ హైద్రాబాదులోనూ, ఇతర ప్రముఖ నగరాల్లోనూ జల్సాగా జీవితం గడపడం వారి నిత్యకృత్యం. వారితో పోల్చినప్పుడు నైజాం నవాబు మెరుగనిపిస్తాడు.

నైజాంలో పోలీసు చర్య జరిగిం తరువాత ప్రభుత్వం జాగీర్లను రద్దుచేసింది- నష్టపరిహారం చెల్లించేననుకోండి! కాని నష్టపరిహారం వారికి ఏ మూలకు? అందువల్ల డబ్బుకోసం వెర్రివాళ్ళలా చూడసాగారు. ఆ వెర్రితనాన్ని వాడుకున్నారు తెలివిగల, కంట్రాక్టర్లు.

అలాంటి ఒక జాగీర్దారు జాగీరులోని అడవినంతా రాయించుకొన్నాడు ఒక కంట్రాక్టరు. అసలు అది జరిగింది జాగీర్ల రద్దు తరువాతనే! నజ్రానా అందడంతో పూర్వపు తేదీవేసి సంతకం పెట్టాడు నవాబు. బాగానే ఉంది. మరో కంట్రాక్టరుకు కన్ను కుట్టింది. అతడూ నజ్రానా చెల్లించాడు. అతడు తెచ్చిన కాగితంమీదా సంతకం పెట్టాడు నవాబు. ఇద్దరు కంట్రాక్టర్లకు పోటీపడింది. నాది అసలైన కాగితమంటె, నాది అసలైన పత్రం అని పోట్లాడారు. అది ప్రభుత్వందాకా పోయింది. ఈలోగా ఒక కంట్రాక్టరు శేషయ్యను ఆశ్రయించాడు. తాను గెలిస్తే అంబాసెడర్ ఇప్పిస్తా నన్నాడు. శేషయ్య బలరామయ్యను ఆశ్రయించాడు. బలరామయ్య అందుకు సంబం ధించిన మంత్రికి సిఫార్సు చేశాడు. పని జరిగిపోయింది. ఆ కంట్రాక్టరు శేషయ్యకు అంబాసెడర్ ఇప్పించాడు.

ఇది ఇలా ఉండగా రామయ్యకు కారు కావలసి వచ్చింది. రామయ్య బల రామయ్యను ఆశ్రయించాడు. బలరామయ్య ఏమన్నాడంటే మొన్ననేగదా గవర్న మెంటు కోటానుంచి శేషయ్యకు కారు ఇప్పించారు. మళ్ళీ అడగడం బాగుండదని కావలిస్తే శేషయ్య దగ్గరికి వెళ్ళి తాను చెప్పినట్లుగా చెప్పమన్నాడు. అంతకైతే బదులు ఇవ్వమని చెప్పమన్నాడు.

రామయ్యకు కారు వచ్చిం తరవాత శేషయ్యది శేషయ్యకు యివ్వవచ్చు నన్నాడు.

రామయ్య శేషయ్య దగ్గరికి వెళ్ళాడు మరి. శేషయ్య కాదనగలడా? మంత్రి గారు చెప్పింతరవాత! అయినా బ్రేకు వేశాడు. కారు తన పేరునుంచి రిజిస్ట్రేషన్ మార్చడానికి వీల్లేదన్నాడు. రామయ్యేం తక్కువవాడా? అయినా ఫరవాలేదన్నాడు. రామయ్య శేషయ్యకు డబ్బిస్తానన్నాడు. శేషయ్య తనకు కారే కావాలన్నాడు. మంచిది. అలాగే చేస్తానన్నాడు రామయ్య.

కథ కంచికి పోయింది.

కారు ఇంటికి వచ్చింది.

* * *

పోర్టికోలో ఇంపాలా ఆగింది. అందులోంచి ఇద్దరు దిగారు. ఒకడు మార్వా డీలా ఉన్నాడు. ధోవతి కట్టాడు కోటు వేశాడు. టోపీ పెట్టాడు. మాటకు పండ్లిగిలి స్తాడు-బహుశా బంగారు పన్ను చూపించాలని. అతడు కాస్త పొట్టి. రెండవవాడు పొడ గరి. సూట్‌తో ఉన్నాడు. ఎప్పుడూ టైయి సవరించుకుంటాడు. పెద్ద ఆఫీసరులా ఉన్నాడు. అతడు మార్వాడీకి అడ్వైజర్. ఇద్దరినీ చూశాడు. పొట్టిగా గుండ్రంగా

ఉన్న పహిల్వాన్ సలాం చేశాడు. ఇద్దరినీ డ్రాయింగ్ రూమ్‌లోకి తీసికెళ్ళి కూర్చో పెట్టాడు. అక్కడ అంగనల బొమ్మలున్న అనేక పత్రికలున్నాయి. అవి చూచు కుంటూ కూర్చున్నారు ఇద్దరూ. అప్పటికే మరో ఇద్దరు ముగ్గురు వచ్చేశారు. వారు వేరే హాలులో కూర్చున్నారు. ఇంకా వస్తూనే ఉన్నారు విజిటర్స్.

శేషయ్య మాత్రం ఇంకా బయటికి రాలేదు. రాత్రంతా పేకాడాడు. త్రాగాడు. మహెందీలో గడిపాడు. అందుకే ఇంకా నిద్రలేవలేదు. అయినా ఈ పడిగాపులు కాసేవాళ్ళు మామూలే. ఎవరి పనులమీద వారువస్తారు. ఒకనికి పర్మిట్ కావాలి. ఒకనికి లైసెన్సు కావాలి. ఒకనికి ప్రమోషన్ కావాలి. ఒకనికి బదిలీకావాలి. మరొకనికి బదిలీ రద్దుకావాలి. అందరూ పనులకోసమే వస్తారు. వారికోసం శేషయ్య నిద్ర ఎందుకు చెడగొట్టుకోవాలి? అందుకే అతను పదిగంట లకు లేచాడు. స్నానాదులు ముగించుకున్నాడు. ఏడుకొండలవానికి మొక్కాడు. టిఫిన్‌చేసి కాఫీ సేవించాడు. సిగరెట్టు దమ్ము లాగుతూ వరండాలో అడుగు పెట్టాడు. అంతా అతనికి నమస్కారం చేసి ఆఫీసు గదిలోకి వెళ్ళాడు. విజిటింగ్ కార్డులన్నీ చూచాడు. మార్వాడీని పిలవమన్నాడు. గుండు పహిల్వాన్ పరిగెత్తాడు. వచ్చిన ఇద్దరూ గదిలో ప్రవేశించారు. వారు నమస్కరించారు. శేషయ్య లేచి నమ స్కరించాడు, కరచాలనం చేసి కుర్చీలు చూపించారు. ఉర్దూలో వారికి సంభాషణ సాగింది.

"పాపం చాలా పోగొట్టుకున్నారు రాత్రి" శేషయ్య.

"పోయింది, సాలా. పోనీండి. మీవంటి వారితో ఆడడం సాలా సర్దా" పొట్టి వాడన్నాడు.

"మీకు బాగానే వచ్చినట్లుంది ఐ థింక్" పొడుగరి అన్నాడు.

"ఇంటర్నేషనల్ గదా వచ్చినా అలాగే వస్తుంది. పోయినా అంతే. రాత్రి అన్నీ పోను ఇరవైవేలు మిగిలాయి"

"సాలా, ఇలా సత్యం చెప్పేవాళ్ళులేరు. సాలా. మీరు సూటిగా మాట్లాడ్తారండి సాలా"

"మా సేటుకు మీరు చాల నచ్చారండి. మీతో ఆడడం అంటె ఐ థింక్ వారికి సరదాగా ఉంది"

"దానికేం? మాకూ అంత పెద్దవారితో ఆడడమంటే గౌరవమే కదా!"

"సాలా. హైద్రాబాదులో ఏముంది? బొంబాయిలో ఆడాల. సాలా ఇక్క డంతా కంట్రీ. సాలా అక్కడంతా ఫారిన్ సాలా"

"మా సేటుకు ఐ థింకు మిమ్మల్ని బొంబాయి తీసికెళ్ళాలని ఉంది. ఐ థింకు మీరు ఆమోదిస్తారు. మీకు తెలుసుగదా ఐ థింక్ మా సేటు సంగతి. బొంబా యితో సగం ఇండస్ట్రీస్ సేటువే"

"స్సాలా మీరు అంగీకరించాలి. డబ్బుదేముంది. సాలా, కోట్లు సంపాయి స్తున్నాం. స్సాలా, సర్కారుకి పెడుతున్నాం. సాలా, మీలాంటి పెద్దల్తో సావాసం చేయలని, వుంటుండి. స్సాలా, ఎప్పుడూ నాకు."

శేషయ్యకు అవకాశం మంచిదే వచ్చింది. బొంబాయి చూడాలంటే కాస్త ఉబలాటమూ అయింది. అయినా టెక్కు చూపించాడు.

"చూస్తున్నారుగా విసుగూ విరామం లేకుండా పనులున్నాయి. నాకు రాజకీయా లతో పనిలేదు. అయినా చంపుకు తింటున్నారు జనం. చూశారుగా ఎంతమంది విజి టర్సు ఉన్నారో? ఎలా రావడం చెప్పండి!"

పొట్టివాడు పొడుగువాని ముఖం చూచాడు. పొడుగువాడు సాగించాడు. "మీకు ఐ థింకు, చాల పనులుంటాయి. చూస్తున్నాంగా నిన్నటి నుంచి, ఐ థింకు చంపేస్తున్నారు. మిమ్మల్ని ఐ థింకు మీకూ కొంత రిలాక్సేషన్ కావాలి. ఐ థింకు మనిషికి అది అవసరం. ఎంత - రెండు రోజులు! ఐ థింకు విమానంలో వెళ్ళడం, విమానంలో రావడం, ప్లీజ్ ఒప్పుకోండి. ఐ థింకు రేపు టిక్కట్లు బుక్ చేయాలా?"

విమానంలో ఎగరడం, బొంబాయి శేషయ్య మనసులో రెపరెపలాడేయి. తనకు చిల్లిగవ్వ ఖర్చులేదు. గెలిచినా కొంత గెలవచ్చు అనుకున్నాడు.

"స్సాలా, ఒప్పుకోండి. ఎంత రెండు రోజులు, సాలా, మళ్ళీ ఇక్కడ దింపు తాంగా" అని పొడుగువాడ్ని చూచి "స్సాలా - టికెట్టు కొను" అన్నాడు.

"తప్పదంటారా?" శేషయ్య ఉవాచ,

"రేపు సిద్ధంగా వుండండి. ఐ థింకు. కారు ఇక్కడికే వస్తుంది. మరి వస్తాం ఐ థింకు" అని లేచి నుంచున్నాడు. పొట్టివాడూ లేచి నుంచున్నాడు.

"సరే అలాగే" అని లేచి నుంచున్నాడు శేషయ్య.

వారిద్దరూ వెళ్ళిపోయారు.

శేషయ్య సిగరెట్టు వెలిగించి మస్తుగా పొగ వదిలాడు. తనలో తాను నవ్వు కున్నాడు. తనకు పేకాట నేర్పిన పోలీసులకు మనసులోనే కృతజ్ఞత తెలుపు కున్నాడు.

ఆ పొడవతను మిస్టర్ రాబర్ట్ హైద్రాబాదులో ఒక ప్రభుత్వ పరిశ్రమలో జనరల్ మేనేజరుగా వుండేవాడు. ఆ పొట్టి మార్వాడీ అతన్ని కొనేశాడు. డబ్బుకు గులామై ఇతని వెంట తిరుగుతున్నాడు రాబర్టు. మార్వాడీ ఒక పెద్ద వలవేశాడు. ఆ వలలో భాగమే రాబర్టు, కాబోతున్నవాడు శేషయ్య.

శేషయ్య విమానం ఎక్కాడు. అంతా వింతగా ఉంది అతనికి. ఎయిరు హోస్టెస్ అతని దగ్గరికి వచ్చింది. ఏవో అందించింది. అందుకున్నాడు. ఆవిడ చిరు నవ్వు నవ్వింది. అర్థం కాలేదు శేషయ్యకు. ఆమెను అలా చూస్తూ ఉండిపోయాడు. విమానం స్వర్గంగానూ ఆవిడ అప్సరసగానూ కనిపించాయి అతనికి. ఏదో పనిమీద

ఆవిడ వేళ్ళు తాకాడు. తాకిన తన వేళ్ళను ముద్దు పెట్టుకున్నాడు. అతనికి తేలిపోతు పట్లుంది. ఆకాశానికి ఆవల ఉన్న అప్సరస లోకంలో ఉన్నట్లుంది.

విమానం దిగింది. అతనికోసం ఖరీదైన ఫోర్డు సిద్ధంగా ఉంది. ఎయిరు హోస్టెస్ వంటి మరో అమ్మాయి కనిపించింది. కత్తిరించిన జుట్టు, మోకాళ్ళ వరకు స్కర్టు, ఎత్తుమడమల బూట్లు, లిప్‌స్టిక్ రాసిన పెదవులు. చిరునవ్వు. నవ్వింది. శేషయ్యకు ఎట్లాగో అనిపించింది. తల వంచి విష్ చేసింది. నమస్కరించాడు శేషయ్య. చేయి చాచింది కరచాలనానికి. కాస్త వెనకా ముందు అయినా చేయి అందించాడు. ఆమె చేయి మెత్తగా ఉంది. పూవులా వుంది. పాములా ఉంది! ఆమె తలుపు తెరచి పట్టుకుంది. శేషయ్య బొమ్మలా ఫోర్డులో కూర్చున్నాడు. సేటు ఎక్కాడు. రాబర్టు ఎక్కాడు. అమ్మాయి ముందు సీటులో కూర్చుంది. ఫోర్డు సాగింది- సాగిపోతూంది. అమ్మాయి వెనక్కు తిరిగి చిరునవ్వు నవ్వింది. శేషయ్య కూడా నవ్వాడు. నవ్వాలని నవ్వాడు. ఆవిడ తనను చూచే నవ్విందా అని అనుమాన పడ్డాడు.

కారు బొంబాయి నగరంలోకి వచ్చేసింది. సాగిపోతూంది. చూస్తున్నాడు శేషయ్య. రోడ్లు! ఆ కారు? ఆ జనసమ్మర్థం! ఆ ఆడావుడి! ఆ భవనాలు! ఆ అందం! ఆ సొగసు! హైదరాబాదు పల్లెలా కనిపించింది!

కారు ఆగింది. ఒక పెద్ద హోటలు, చూచాడు శేషయ్య. బిత్తరపోయాడు. అమ్మాయి దిగింది. డోర్ తెరిచింది. మళ్ళీ నవ్వింది. శేషయ్య దిగాడు. అమ్మాయి ముందు నడిచింది. శేషయ్య అనుసరించాడు. శేషయ్య వెనక మార్వాడీ, మార్వాడి వెనక రాబర్టు నడిచారు.

ఆ అమ్మాయి ఆంగ్లో-ఇండియన్. పేరు రోజీ-కాల్ గర్ల్!

లిఫ్టులోకి వెళ్ళారు. రోజీ శేషయ్య పక్కనే నుంచుంది. అతనిని తాకుతుంది. పూలచెండులా ఉంది. పల్చని సువాసన వస్తూంది. లిఫ్టు ఆగింది. గదిలోకి వచ్చే శారు. ముగ్గురూ కూర్చున్నారు. ఫలహారాలు వచ్చాయి. పానీయాలు దిగాయి. రోజీ వడ్డిస్తూంది - శేషయ్య చేతులు తాకుతూ.

పార్టీ మొదలైంది. అన్నీ విదేశీ పానీయాలే! జానీవాకర్! వాట్ 69, ఫ్రెంచి షాంపెన్, రష్యన్ ఓడ్కా!

శేషయ్య బాగా పట్టించాడు.

మార్వాడి సైగచేశాడు. రాబర్టు సహితంగా నిర్గమించారు.

రోజీ శేషయ్యా మిగిలిపోయారు.

రోజీ శేషయ్యకు ఎదురుగా కూర్చుంది.

శేషయ్య సిగరెట్ తీశాడు.

రోజీ లైటరుతో వెలిగించింది.

సిగరెట్టు పొగ వదులుతున్నాడు. రోజీని చూస్తున్నాడు. ఎర్రని వెంట్రుకలు

వదులుగా వ్రేలాడుతున్నాయి. వాటిని తాకాలనుకున్నాడు. వేళ్ళతో ఉయ్యాల ఊపాలనుకున్నాడు. ముఖం! వెన్నెలలు కనిపించాయి! వెన్నెలను పట్టుకోవాలనుకున్నాడు. చెంపలు రోజారేకులు! ముద్దు పెట్టుకోవాలనుకున్నాడు! మెడ పొడవుగా అందంగా కూజా కాడలా ఉంది. రొమ్ములదగ్గర చూపు నిలిచిపోయింది.

సిగరెట్టు పారేశాడు!

ఆమె చేయి అందించింది.

అందుకున్నాడు.

"నీవు అప్సరసవా?"

"ఉహూఁ. హ్యూమన్ బీయింగ్"

అర్థంకాలేదు శేషయ్యకు.

"ఒక్క ముద్దిస్తావా?"

కిలకిలా నవ్వింది రోజీ.

అతను లేచాడు.

ఆమె లేచింది.

అతడు కౌగలించుకున్నాడు.

ఆమె మాట్లాడలేదు.

అతడు ముద్దులు కురిపించాడు.

ఆమె మురిసిపోయింది.

సురపొన్నల నీడలలో, సురసుందరితో సౌఖ్యం అనుభవిస్తున్నట్లుంది శేషయ్యకు.

ఆ రాత్రి పేకాడలేదు-శేషయ్య.

అటు ఎవరూ రాలేదు.

ఆ గది ముద్దులతో గుబాళించింది.

తెల్లవారి రోజీ కాస్త నలిగిపోయింది. ఆ అందాలు కనిపించలేదు శేషయ్యకు. అయినా అతను రోజీని వదల్లేదు. రోజీ టాయ్‌లెట్ అయింది. మెల్లని, సన్నని లవెండర్ పరిమళం చిమ్మింది. వ్యాపించింది. పోర్డులో బయలుదేరారు. బొంబాయి సొంతం తిరిగారు. గుర్రప్పందాలకు వెళ్ళారు. ఆవి తన్నాయి. అయినా బాధపడలేదు శేషయ్య. జూదగాళ్ళకు రావడం, పోవడం ఒకటే. ఆ సాయంకాలం మెరిన్ డ్రైవ్‌కు వెళ్ళారు. సముద్రం విచిత్రంగా కనిపించింది శేషయ్యకు. అతడు వూళ్ళో చెరువు చూశాడు. గండిపేట చెరువు చూశాడు. ఈ జలరాశి! దానికి అంతేది! ఎంత ఎత్తుగా పడగలెత్తుకొని వస్తున్నాయి తరంగాలు. దరికి చేరి పడగలు నేలకు కొట్టుకుంటున్నాయి. ఎంత దూరంనుంచి వస్తున్నాయో అవి! ఎన్ని ఆశలు పెట్టుకుని వస్తున్నాయో! ఎంత పరుగు పరుగున వస్తున్నాయో! ఏం లాభం. చివరకు వచ్చి,

తల బద్దలుకొట్టుకున్నాయి. బెదరిపోతున్నాయి. చెదరిపోతున్నాయి. జీవితమూ అంతేనా? అనుకున్నాడు.

రోజీ కనిపించింది. నడుంమీద చేయివేశాడు. అంత రాద్ధాంతంగా! అంత బహిరంగంగా! తన వూళ్ళో వేయగలడా? పట్నంలో వేయగలడా? ఇక్కడ అంతా వేస్తున్నారు! ఇక్కడ ఎవరికి ఎవడు? సీతాకోక చిలుకలన్నీ కూడాను. ఇది వాటిని పట్టుకోవడంలాంటిది! శేషయ్యకు బాల్యం గుర్తుకు వచ్చింది. సీతాకోక చిలుకల్ని వేటాడ్డం గుర్తుకు వచ్చింది.

రోజీ శేషయ్యను చూచింది.

శేషయ్య నవ్వాడు.

ఇద్దరూ చెట్టాపట్టాలు పట్టుకొని ఇసుకలో తిరిగారు. అదేదో తమాషాగా ఉంది. ఇసుకలో నడవడం నిజంగా వింతగా ఉంటుంది. కాలు పెడ్తే కూరుకుపోతుంది. అయినా ఇట్టే వచ్చేస్తుంది! అయినా కాలికి ఏమీ అంటదు. వెనక్కు చూస్తే మన పాదాల గుర్తులు మనకే స్పష్టంగా కనిపిస్తాయి.

ఆ రాత్రి గదికి చాలమంది వచ్చారు. మార్వాడీ వచ్చాడు వారి వెంట. ఆ వచ్చినవారిలో పెద్ద పెద్ద వ్యాపారులున్నారు. ఛోటా బడా నాయకులున్నారు. వాగంతా పేకాటకు వచ్చారు. వారు రోజూ ఆడేదాళ్ళే. ఈరోజు అక్కడికి పిలిచాడు సేటు-అందరినీ పరిచయం చేశాడు సేటు.

అంతా ఆటకు కూర్చున్నారు.

ఆట సాగుతున్నది. పానీయాలు వస్తున్నాయి! అదొకరకం విందు లాంటిది. మాటలు, ముచ్చట్లు, రాజకీయాలు, మంతనాలు, బేరాలు అన్నీ సాగిపోతూనే ఉన్నాయి.

ఆట సాగుతూనే ఉంది.

శేషయ్య ఆటను అంతా మెచ్చుకుంటున్నారు.

బాగానే వస్తూంది శేషయ్యకు. అమాంతంగా పోతూంది. ఆట పెద్దది. వచ్చినా పోయినా పెద్దమొత్తంలోనే ఉంటూంది.

తెల్లవారేవరకు రానూ పోనూ శేషయ్యకు పదివేలదాకా మిగిలాయి. రావడం అంటే జూదరికి అట్టె సంతోషమేం కాదు. అయినా సంతోషించాడు శేషయ్య.

అంతా వెళ్ళిపోయారు. అతడు పడుకున్నాడు. పగలంతా నిద్రపోయాడు. నిద్రలో అతనికి రోజీ కనిపించింది. గడిచిన రాత్రి కనిపించింది. పొంగుతున్న సముద్రం కనిపించింది. విరుగుతున్న అలలు కనిపించాయి.

రోజీ నవ్వింది.

అది పేలవంగా ఉంది.

రోజీ చూచింది.

చూపు వెలవెల పోతూంది.

సాయంకాలానికి గాని లేవలేదు శేషయ్య. లేచేవరకు మిస్టర్ రాబర్ట్ బయట కూర్చుని ఉన్నాడు.

"ఎట్లున్నది ఐ థింకు?"

"చాలా బావుంది. కొత్తలోకంలోకి వచ్చినట్లుంది"

"రాత్రికి డాన్స్ ఏర్పాటు చేశాం. ఐ థింకు మీరు లైకు చేస్తారు. బాంబ్ షెల్ బార్బరా డాన్సు చేస్తుంది. ఐ థింకు-కెబెరా-రెడీకండి. ఐ థింకు ఇవ్వాళ ఆట లేదు. ఐ థింకు. ఏమంటారు?"

"మంచిది డాన్స్ చూద్దాం" రోజీని గురించి అడుగుదామనుకున్నాడు. ఎందుకో మింగేశాడు-పూవు నలిగిపోయింది.

ఆ రాత్రి కెబెరా చూశాడు శేషయ్య.

బార్బరా స్టేజీమీద వింత వాద్యాలు?

రెండే రెండు పేలికలు! మిగతా సొంతం నగ్నం. రావడం బట్టలతోనే వచ్చింది బార్బరా. డాన్సులోనే విప్పేసింది!

ఆ ఉలుకు, ఆ కులుకు, ఆ హొయలు, ఆ కదలిక, ఆ ఊపు! వూపేసింది శేషయ్యను. ముందు పానీయం, ఎదురుగా బార్బరా, జుమ్మగా ఉంది. హాయిగా ఉంది. ఆనందంగా ఉంది. అందంగావుంది.

బార్బరా స్టేజి దిగి వచ్చింది.
శేషయ్య దగ్గరికే వచ్చింది.
శేషయ్య మీద కూర్చుంది.
సారాయి తాగించింది.
శేషయ్యలో విద్యుత్తు ప్రవహించింది.
ఆవిడ లేచిపోయింది.
మరొకరి దగ్గర? మరొకరిదగ్గర.
మళ్ళీ స్టేజీమీదకు వెళ్ళింది.

లైట్లు ఆరిపోయాయి. స్పాట్ లైట్ ఆమెమీదనే పడుతూంది...ఆమె ఒంపులను చూపిస్తూంది. ఒయ్యారాలను చూపిస్తూంది. ఆమె రెండు పేలికలూ లాగేసింది.

రెప్పపాటు లైటు వెలిగింది.
ఆరిపోయింది.
చీకట్లో చప్పట్లు వినిపించాయి.
బార్బరా శేషయ్య పక్కన నుంచుంది.
అతడు ఆమె చేయి పట్టుకున్నాడు.
గదిలోకి నడిపించుకొని వెళ్ళాడు.
తెల్లవారింది, బార్బరా వెళ్ళిపోయింది.

శేషయ్యకు గడచిన రాత్రి మత్తుగా కళ్ళల్లో ఆడుతూంది. అయినా గది శూన్యంగా కనిపించింది.

సేటు, మిష్టర్ రాబర్టు ఇద్దరు వచ్చారు.

"స్సాలా, కలకత్తాలో పనిపడ్డది. స్సాలా రాత్రే ట్రంకు వచ్చింది. వెళ్ళాల్సొచ్చింది స్సాలా. మీతో నాలుగు రోజులు ఉండే అవకాశం లేకపోయింది, స్సాలా."

"దానికేం లెండి, నాకూ పనులున్నాయి హైదరాబాదులో. మీ రుణం ఎలా తీర్చుకుంటాను? నన్ను మూడు రోజులు స్వర్గంలో వుంచారు. నాతో ఏమైనా పని వుంటే చెప్పండి.

"ఎంత మాట, స్సాలా, స్నేహితులంగదా! స్సాలా దీనికి రుణం ఏమిటి? స్సాలా. సాయంకాలం ప్లేనుంది. కారు పంపిస్తా స్సాలా. నేను రాలేను స్సాలా రాబర్టు వస్తాడు.

"మంచిది. మీకెలా కృతజ్ఞత తెలియజేయాలో తెలియడంలేదు"

"స్సాలా, మళ్ళీ మళ్ళీ ఆ మాటనకండి. ప్లేను టయిమైంది. స్సాలా వెళ్తున్నాం. క్షమించాలి" అని ఇద్దరూ నిర్గమించారు.

శేషయ్య యేరోడ్రోములో దిగగానే రోజీ, బార్బరా కనిపించారు.

అంతా కూర్చొని కాఫీ తాగుతున్నారు.

"మా సేటుకు, ఐ థింకు బలరామయ్యగారిని కలుసుకోవాలని ఉంది. ఐ థింకు."

దానికేం మీరెప్పుడంటే అప్పుడు. ఏమైనా పని వుంటే చెప్పండి"

"ఐ థింకు పనేంలేదు. పరిచయం చేసుకోవాలనే అంతే ఐ థింకు"

"ఫరవాలేదు. ఎప్పుడొస్తారు?"

"సేటుకు ఐ థింకు, తీరికైనపుడు"

అనౌన్స్‌మెంటు వచ్చింది. బయలు దేరాడు శేషయ్య. రోజీ, బార్బరా చేతు అందించారు. కరచాలనం చేశాడు.

వారు చిరునవ్వు నవ్వారు.

అతడు సాగిపోయాడు.

విమానం ఎగిరింది.

* * *

ఉగాది వచ్చింది.

ఉరికి వచ్చింది.

ఊరికి ఉరికి వచ్చింది.

ఊళ్ళోకి వచ్చింది.

ఊరినిండా వేపపూత పరచినట్టు పడి వుంది. మామిడాకుల మయంగా ఉంది ఊరు. ఇంటింటికి పచ్చని తోరణాలు. అలికి ముగ్గులు పెట్టిన ఇండ్లు. తీర్చి

దిద్దిన ముగ్గులతో ముస్తాబైంది గ్రామం. ఇంటింటా వేపప్రసాదం. మరి అది ఏ చేదును తలపిస్తుందో? చేదు జీవితాల్లో రవ్వంత తీపి తెచ్చే రోజేమో? కావచ్చు. అందుకే చాకలివాడ సైతం సంబరాలు చేసుకుంటూంది. సంఘపరంగా కొన్న మేక మాంసం వాటాలు వేశాడు యలమంద. వంటలై భోజనాలయినాక బండ్లు కట్టారు. అంతకుముందే ఎరువు నింపిపెట్టారు వాటిల్లో. ఆ రోజు అది పొలాల్లో పోస్తే పొలిగలుతుంది. పంట సిరి పొంగుతుంది. ఇంట్లో నిండుతుంది. అందుకే కొత్త బట్టలు కట్టుకొని, తలగుడ్డలు చుట్టుకొని, ముఖాన కుంకుమలతో బండ్లెక్కారు చాకళ్ళు.

బండ్లు కదిలాయి. బాటపట్టాయి. పొలంకాడికి పోతే పులులు కనిపించాయి.

హుసేను, సైదయ్యా దుడ్డుకర్రలతో కాపలా కాస్తున్నారు. బండ్లను అడ్డగించారు. అడుగు ముందుకు పడితే తలలు ఎగిరిపోతా యన్నారు.

యలమంద బండి దిగాడు.

ఎడ్లు నిలిచిపోయాయి.

బిలబిలమంటూ బండ్లవాళ్ళంతా పరిగెత్తి వచ్చారు. వాళ్ళ చేతుల్లో ముల్లుగర్ర లున్నాయి. పోలోమని వచ్చారు. పొలంలో పడ్తామన్నారు. పొట్టు లేపేస్తా మన్నారు.

యలమంద రెండు చేతులు చాచి అందరినీ ఆపాడు. ఏదో మంత్రం వేసి నట్లు ఆగిపోయారంతా. ఒక్కడూ పలకలేదు. బొమ్మల్లా నుంచున్నారు. అంతా నిశ్శబ్దం. ఊపిరి పీల్చే ధ్వని సహితం వినిపిస్తూంది.

యలమంద వస్తాదులవైపు తిరిగాడు. బారెడు విగ్రహం. తల పాగా, గండు మీసాలు, నొసట సూర్యునిలాంటి బొట్టు! వెలిగి పోతున్నాడు యలమంద.

ఎదురు బదురుగా ఉన్నారు యలమంద వస్తాదులు. వారి చేతుల్లో దుడ్డు కర్ర లున్నాయి. వీరి చేతుల్లో ముల్లుగర్ర లున్నాయి. కర్రలు కలుస్తే వస్తాదుల ఎముకలు మిగలవు. ఆ మాట తెలుసు యలమందకు. అయినా కర్రలు కలపనీయ రాదనుకున్నాడు, కారణం? ఈ రోజు విరిగిన కర్ర రేపు కత్తిగా మారుతుంది. ఎల్లుండి తుపాకి అవుతుంది. తాము తుపాకులను ఎదిరించలేరు. పోలీసులను అడ్డగించలేరు. అందుకే మాటల్తో పరిష్కరించ దలిచాడు.

"ఏక్ ఖదమ్‌కా ఏక్ సిర్. ఒక్క అడుక్కు ఒక తల - గాండ్రించాడు హుసేన్.

"ఎందుకే సైదన్నా ఇట్ల అవుతాన్రు? ఈ మాన్యాలు మాయేగద! మా తాత దున్నుకునే మా అయ్య దున్నుకునే. మేం దున్నుకుంటాంటిమి! ఇయ్యాళ ఏమొచ్చింది? పండగనాడు ఇట్ల తగిల్రినేమె?" యలమంద అన్నాడు.

"కుచ్ నై జాన్తే సర్కారుకా హుకుమ్ హై. ఆగేబడేతో సఫా"

"యలమందన్నా! సర్కారు ఖానూన్ చేసిందట - మాన్యాలు పోయినయని మా దొర చెప్పిండు."

"అదేంది అట్ల చెప్పుతవ్? ఈరబద్రంగారు చెప్పె కౌల్దారీ ఖానూన్ చేసిం డని. మొన్నొచ్చినప్పుడు దొరకూడా చెప్పెగదనె సోషలిజం తెస్తమని. మల్లచాకలోల్లా బూములెట్ల గుంజుకొంటరు?"

"సోష్లిజం గీష్లిజం జాన్తానై ఏకుమార్ కూ దో సఫా" హుసేన్.

"మాకే మెరకయితయి చెప్పు అయ్యన్ని? దొర చెప్పిండు పొలంలో అడుగు పెట్టనియ్యొద్దని" సైదయ్య.

ఇంతలో మస్తాను వచ్చాడు అక్కడికి. చాకళ్ళకు కొంత ధైర్యం వచ్చింది. యలమంద మస్తానుకు విడమర్చి చెప్పాడు.

"ఏందయ్యా! ఎందుకు ఆపుతున్నారు" అడిగాడు మస్తాను.

"కుచ్‌నై జాన్తా బక్ బక్ బంద్" అని కర్ర ఎత్తాడు హుసేను.

"ఏమొ శాన మొరుగుతున్నవు? రామయ్యను చూసుకోనా? తగులుకుంటె మల్ల ఎన్కకు చూడకుండా ఉరకాలె ఏమనుకొన్నావా?" మస్తాను గట్టిగానే అడి చాడు.

హుసేను చేతిలోని కర్ర మస్తాను చేతిమీద పడ్డది.

"ఓరి లుచ్చా" అని పులిలా లేచాడు మస్తాను యలమంద చేతిలోని కర్ర లాక్కొని.

జనంలోకూడా ఉద్రేకం ఎక్కువైంది.

హోలోమని కర్రలు పట్టుకొని ఉరికారు.

మస్తాను కర్రదెబ్బను కర్రతో అడ్డుకున్నాడు హుసేను. హుసేను కర్రదెబ్బ నేలమీద పడేట్లు జరిగాడు మస్తాను.

సైదయ్య కల్పించుకోలేదు.

జనం ముందుకు సాగకుండా ఆపాడు యలమంద.

ఎక్కణ్ణుంచి ఊడిపడ్డాడో వచ్చాడు యాదగిరి. హుసేన్ను ఆపాడు. మస్తాన్ను విడిపించాడు. కథంతా విన్నాడు. ఎందుకన్నాడో తెలియదు నోరుజారింది. 'అన్యాయమే' అనేశాడు.

యాదగిరి అన్యాయం అనేవరకు యలమందకు ధైర్యం వచ్చింది.

"అట్లకాదన్నా! మాన్యాలు మాకు సర్కారిచ్చె. ఇయ్యాళ దున్నుకోవద్దంటే ఆగుతుదా? నువ్వే చెప్పు న్యాలం?"

"అరే ఓరి యలమందా! ఎట్లచెప్పిండో ఏమని చెప్పిండో రామయ్య దొర? వీండ్లకేం తెలిసినాదిర అది. చూడు మస్తానన్నా! కొట్లాడితే ఏమొస్తది? ఆడికేపోయి అడుగుతేబాయె అసలు సంగతి ఎరకైతది? పండగపూట గడబడెందుగ్గని? బండ్లు మళ్ళించుకపోరి పొద్దాల పోయి రామయ్య దొర నడుగండి. నేను కూడా చెప్తా తలె."

"మంతి సొమ్ము తినమరిగిండు. ఇంటడనుకుంటున్నావా?" మస్తాను అన్నాడు.

"అన్నిటికి కాలు దువ్వితే ఎట్ల మస్తానన్నా. మునిగిపోయిందేంది రేపు పోసు కొంటం మట్టి!" అన్నాడు యలమంద.

బండ్లు మళ్ళించమన్నాడు యలమంద.

కొందరు మళ్ళించమన్నారు. ఇప్పుడే తేల్చుకుంటామన్నారు. మస్తాను వారికి నాయకత్వం వహించాడు. ముందడుగు వేశారు. అడ్డుతగిలారు యలమందా, మరి కొందరు. మస్తాన్ను బతిమలాడాడు యలమంద. తాను పరిష్కారం చేయిస్తానన్నాడు యాదగిరి.

వెనకడుగు వేయక తప్పలేదు మస్తానుకు.

బండ్లన్నీ వెనక్కు తిరిగాయి.

వరుసగా ఊరివైపు సాగిపోతున్నాయి.

సైదయ్య కర్ర గడ్డంకింద పెట్టుకొని చూస్తూ వుండిపోయాడు.

'మాలుమ్‌నై తడాకా!' అని తొడ చరిచాడు హుసేను.

ఇద్దరూ కలిసి సాగిపోయారు కల్లుకొట్టువైపు.

బీటలు వారిన పొలం నవ్వింది.

ఆ సాయంకాలం గుళ్ళో పంచాంగశ్రవణం జరిగింది. ఊళ్ళో వాళ్ళంతా చేరారు పంచాంగం వినడానికి, ఫలితాంశాలు తెలుసుకోడానికి. బాపడు శ్లోకం చదివాడు!

"శ్రీ కళ్యాణ గుణావహం రిపుహరం
దుస్వప్న దోషావహం
గంగాస్నాన విశేష పుణ్యఫలదం
గోదాన తుల్యం నృణాం,
సంవత్సర ఫలితాలు చెప్పింతరవాత అడిగారు ఎవరో.

'వానలు యాళకు పడ్తాయుండి.'

"నాయనా! గ్రహాలు బాగున్నయి. సకాలానికి వర్షాలు రావాలె. సస్యసమృద్ధి ఉన్నట్లే చెపుతూంది పంచాంగం. అయితే కలికాలం! గ్రహాల్ను వాటిదారిన నడవనిస్తున్నారా? పాపం పెరిగి పోయింది. ఉపగ్రహాలు పంపుతున్నారటగదా! ఉపగ్రహాలు!! అసలు గ్రహాలకు కోపంరాదూ? ఇక వానలెట్ల పడతాయి?" బ్రాహ్మణ వాక్యం.

గ్రహచారాలు చెప్పించుకున్నారు జనం.

రామయ్యకు గ్రహాలు ఉచ్ఛస్థానంలో ఉన్నాయని చెప్పాడు. లేకుంటే వాటిని పితాయిస్తాడు రామయ్య. అతని జాతకచక్రం అలాంటిది - అన్నట్లుగా చెప్పాడు సిద్ధాంతి.

తీర్థప్రసాదాలు అయిపోయి వెళ్ళిపోయేపుడు చాలమంది చాకళ్ళ తగాదాను గురించే ముచ్చటించుకున్నారు.

రామయ్య వినీ విననట్లు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి. అది మంగమ్మ ఇల్లు. ప్రకాశం నిద్రపోయాడు. వీరభద్రం పట్నంలో వున్నాడు. అతడు కార్మికరంగంలో పని చేస్తున్నాడు. మంగమ్మ గుడ్డి దీపం ముందు పుస్తకం చదువుతూ కూర్చుంది. అది 'ప్రజల మనిషి'....వట్టికోట ఆళ్వార్‌స్వామి నవల. అప్పుడే వచ్చిందది. వీరభద్రం పంపించాడు పట్నం నుంచి.

నవలలో మునిగిపోయింది మంగమ్మ.

దొర రామ భూపాలరావు కొమరయ్య పొలం లాక్కున్నాడు. కొమరయ్యను గుంజకు కట్టి, పొలం దున్నడానికి అరకలు పంపాడు. కొమరయ్య తల్లి అన్నమ్మ, మనమడ్ని చంకన వేసుకొని అరకలకు అడ్డం తగిలింది. పొలం దున్ననీయలేదు. పోరు పెట్టింది. అరకలు విప్పేసి వెళ్ళిపోయారు జీతగాండ్లు.

"అన్నమ్మ కొట్టంలోంచి బయటికివచ్చి నాలుగువైపులా దీనంగా చూసింది. మోటను పట్టుకుని బావిలోనికి పరీక్షగా చూసింది. ఆమె కన్నీటి బొట్లు బొటబొట బావిలో పడ్డాయి. నీళ్ళు వలయాకారంగా బావిలో విహరించాయి. కప్పలు బెకబెక మన్నాయి."

మంగమ్మకు మోటబావి కన్నీటితో నిండినట్లనిపించింది. అంత ధైర్యంగా దొరవారి అరకలను ఎదిరించిన అన్నమ్మ మోటబావిలోకి వంగి ఏడ్చేసింది. ఆడది ఏడవడం తప్ప బెదిరించలేదా? అనే ఆలోచనలో ఉండగా తలుపు చప్పుడైంది. తెరచి చూస్తే మస్తాన్, మల్లయ్య. పూర్తిగా తెరిచి వదిలేసి వచ్చి కూర్చుంది.

వారిద్దరూ వచ్చి కూర్చున్నారు.

బయట చీకటిగా వుంది. దూరంగా కీచురాళ్ళ రొద వినిపిస్తూంది.

"ఏమో చదువుతున్నరు?"

"నవల. దొరల సంగతి రాసిండు. బాగ రాసిండులే"

"మనకెరకున్నయే గదనుండి. కొత్తయేమన్న రాసిండా?"

"కొత్తగేం రాసిండుగని చదువుతూంటె మన కథోల్నె అనిపిస్తున్నది."

"అయితే చదివినంక యియ్యండి. చదువుతం"

"అట్లనేగని ఇంత రాత్రొచ్చిన్రు?"

"మీదన్క రాలేదా?"

"ఏందది?"

"చాకలోండ్ల పంచాయితుండి"

"చెప్పుకుంటుంటె ఇన్న. మాన్యాలు దున్నుకోనియ్య నంటున్నడటకత రామయ్యగాడు"

"అట్లనే అంటుండటగని చాకలోండ్లు గట్టిగ నిలబడెటట్టున్నరు."

పుస్తకం మూసి మంచంమీద పెట్టింది మంగమ్మ. "ఏమనుకుంటున్రు?" అడిగింది.

"మాన్యాలు వదలమంటున్నరుండి"

"ఇప్పుడట్లనే అంటరు. వాడు కాసిన్ని సారనీళ్ళు పోస్తె తుస్సు మంటరు"

"అట్ల అనేటట్లు లేరు(న్రి. యాదగిరికి రామయ్యకు బెడిసిందంటున్నరు. యాదగిరి చాకలోండ్ల పట్టయిండు. మాన్యాలు దున్నుకోనియ్యమన్నడట రామయ్యతోని. రామయ్యేమొ నూరు ఆరైనా, ఆరు నూరైనా ఇయ్యనంటాండట! యాదగిరి కొలువు ఊడపీకి(న్రంటాన్రు. ఊరంత ఉడికిపోతాంది."

"యాదగిరి ఎట్ల మారిండంటవు?"

"మనిషి కాదుండి మారకుండుంటడా? అసలు పొలంకాడనె పుర్రెలు ఎగిరెడిపి. యాదగిరి వచ్చిండుండి. రామయ్యను ఒప్పిస్తనని ఇడిపించిండు. రామయ్య మాట ఇనకపొయెటాలర్కల్లి ఎదురుతిరిగుంటడు. మంచిదె కాదుండి మనకు?" మస్తాన్ వివరించాడు.

"అట్ల కాదనె. అసలు సార దుకాణం బాగాలకాడ పంచాయితీ వచ్చిండట. అది రాజుకుంటున్నది. ఇప్పుడు భగ్గుమన్నది?" మల్లయ్య వాదన.

"యాదగిరి నిలపడ్తడా అని?" మంగమ్మ సంశయం.

"వాడు నిలబడెడిదేందుండి -- చాకలోండ్లు పానాలిస్తమంటున్రు. బూమి వదులుకుని బువ్వేం తింటరు లంజకొడుకులు?" మస్తాను వ్యాఖ్యానం.

"ఎట్ల తెలుసు వాండ్లు నిలబడ్తరని!"

"అయ్యో! అడుగుతారు(న్రి? చాకలి గూడెం తుకతుకలాడుతున్నదుండి. పోర గాండ్లంత యలమంద మీదికి ఉరుకుతాన్రు. బండ్లెందుకు మళ్ళొచ్చినవని! జర నీలు పడ్డయనుకోరి లంజకొడుకులకు అయినగని పంచాయితి ఇదే జరుగుతాందుండి - ఆడినుంచే వస్తున్నాం కాదుండి"

"సమయం బాగున్నది. రేపు చాకలోండ్లందర్ని తీస్కపోదం. అడ్డమెవడు తగుల్తడో నేనొస్త. రేపుమట్టిపోయింతం పొలాల్ల. ఏమన్నకానియ్యి. నేను ముందుంట. పోతే నా ప్రాణం పోయినంకనే ఇంకొకళ్ళది. జర చాకలోండ్లను గట్టిపరుచుండి. ఇప్పుడొద్దు తాగున్న రంటున్నరుగద! పొద్దున్నె పొండి. అటెన్క ఇక్కడికి రాండి. నేను వస్త చాకలి గూడానికి!" మంగమ్మ మాట.

"ఇగ అడుగుతారు! రేపు ఎట్లనన్న మట్టిపడ్డదె పొలంల" మస్తాను ప్రతిజ్ఞ.

"అది సరెగని, మస్తానన్నా. వాండ్లేమొ పొద్దాల రామయ్యకాడికి పోదామనుకుంటుండిరి గదనె!" మల్లయ్య సంశయం.

"హయ్యో? ఎప్పటి మాట మాట్లాడుతున్నవె? యాదగిరి మాట ఇనడాయె రామయ్య. ఆ సంగతి చాకలోండ్లకు తెలిసిపాయె. ఇగందెకు పోతరే అటలాడెతందుకా?" మస్తాను వివరం.

"అట్లయితె సరే. మల్ల పోదమా?" అని లేచాడు మల్లయ్య, మస్తాను లేచాడు. ఇదరూ కలిసి వెళ్ళిపోయారు.

మస్తాను, మల్లయ్య కొంతదూరం కలిసిపోయి చీలిపోయారు. మస్తాను ఒంటరిగా సాగిపోతున్నాడు. చీకటి. చుక్కలు మిలమిల మంటున్నాయి. కీచురాళ్ళు అరుస్తున్నాయి. దూరంగా ఎక్కడో నక్క ఊళ పెడ్తూంది. కుక్కలు గూడెంలో మొరుగుతున్నాయి.

చేతిలో కర్రతో సాగిపోతున్నాడు మస్తాను.

కర్రవుంటే అతడు పదిమందిని ఎదిరించగలడు. అదీ అతని ధైర్యం. అయినా బిక్కుబిక్కు మంటూంది. ఒంటరిగా ఎడారిలోంచి పోతున్నాడు. పగలు పొలందగ్గర జరిగిన తగాదా గుర్తుకు వచ్చింది. మల్లయ్యను వెంట రమ్మనాల్సింది అనుకున్నాడు. మల్లయ్యను పంపడానికి మళ్ళీ తాను పోతాడా? ఏమిటీ వెర్రి ఆలోచన అనుకొన్నాడు. ఇంతలో చాకలివాడ గుర్తుకు వచ్చింది. ఆలోచనలో మునిగిపోయి సాగిపోతున్నాడు. చింతచెట్టు దగ్గరికి వచ్చాడు, దాటాడు. ఇద్దరు మనుషులు అమాంతంగా మీదపడ్డారు. ముందు నోరు మూశారు. నోట్లో గుడ్డలు కుక్కారు. పడేసి కర్రల్తో బాదసాగారు. ఆ బాదడం అతని స్పృహ తప్పేదాకా బాదారు. నోట్లో గుడ్డలు సరిగ్గా వున్నదీ లేనిదీ చూచి చింతచెట్టుకు కట్టి వెళ్ళిపోయారు.

మర్నాడు మసకచీకట్లో చెంబుపట్టుకొని పోయేవాడు చూశాడు. చింతచెట్టుకు కట్టిన మానవాకారం కనిపించింది. భయపడ్డాడు. దయ్యం అనుకున్నాడు. అయినా ధైర్యంచేసి ముందుకు సాగాడు. దీక్షగాచూస్తేగాని తెలియలేదు. కనిపించిన తరువాత గట్టిగా కేక పెట్టాడు.

"మస్తానన్న" అని చేతులోని చెంబు పడిపోయింది.

బొళబొళ నీళ్ళు కారిపోయాయి. వెనక్కు తిరిగి గిరగిరా ఉరికాడు. ఊళ్ళోపడి, మల్లయ్య ఇంటికి వెళ్ళేంత వరకూగాని ఊపిరి పీల్చుకోలేదు. మల్లయ్య ఇంకా నిద్రలో ఉన్నాడు. వచ్చినవాడు లేపాడు. తనుసుకుంటూ చెప్పాడు.

"మల్లయ్యన్నా! మస్తానన్నను చితుకకొట్టి చింతచెట్టుకు కట్టేసిన్రను."

మల్లయ్య లిప్తపాటు నిశ్చేష్టుడైనాడు. తరవాత దిగ్గున లేచాడు. చింతచెట్టు వైపు పరిగెత్తాడు. "మస్తానన్నను చితుకకొట్టి చింతచెట్టుకు కట్టేసిన్రను" అని కేకలు పెడ్తూ మల్లయ్య చింతచెట్టు దగ్గరికి చేరేవరకు మరికొందరు వచ్చేశారు. అసలు ప్రాణం ఉందా అని ముక్కు దగ్గర చేయిపెట్టి చూశాడు. ఊపిరి ఆడుతూనే ఉంది. కట్లు విప్పాడొకడు, మస్తాను మల్లయ్యమీద పడిపోయాడు.

వార్త అగ్గిలా ఊళ్ళో పాకింది. ఊరు సాంతం చింతచెట్టు దగ్గరికి చేరింది. ఒకడు మంచం తెచ్చి వేశాడు. మంచంమీద పడుకోపెట్టారు మస్తాన్ను. ఒకడు న్యూనె తెచ్చి రాస్తున్నాడు. ఒకడేదో మూలిక విషయం చెపుతున్నాడు. ఒకడు పసరు సంగతి మాట్లాడుతున్నాడు. మస్తాను భార్య మంచం దగ్గర కూర్చొని శోకాలుపెట్టి ఏడుస్తూంది.

మంగమ్మ సివంగిలా వచ్చి దూకింది. జనాన్ని తోసుకుంటూ వెళ్ళిపోయింది. ఉద్రేకంగా ఉరికి వచ్చింది. మంచం మీద పడివున్న మస్తాన్ను చూసింది. "ఎంతమందిని చంపుతరు? ఎంతమందిని పొట్టన పెట్టుకుంటరు? ఎంతమంది రక్తం తాగుతరు? చస్తే చచ్చినం. ఇవ్వాళ తేల్సుకోవాలె" అని పిడికిలి బిగించి అరిచింది.

"రామయ్య దౌర్జన్యం" అన్నాడు యలమంద.

"నశించాలె" జనం అరిచారు.

దిక్కులు పిక్కటిల్లాయి. ఇంట్లో కూర్చొని సిగరెట్లు కాల్చుకుంటున్న రామయ్య గుండెలు గుబగుబలాడించింది.

"చూస్తరేం పట్నం ఏసుకపోవాలే. బండ్లుకట్టుండి" కేకవేసింది మంగమ్మ.

మంగమ్మ మస్తాన్ను చూస్తూంది. వణికిపోతూంది.

నిముషాల్లో బండ్లు తయారైనాయి.

మస్తాన్ను బండిమీద వేశారు. మస్తాను భార్య బండి ఎక్కింది. మల్లయ్య బండివెంట సాగాడు. బండి పట్నంవైపు సాగింది.

"బతుకు తాడుండి?" సాగిపోతున్న బండివైపు చూచి నిట్టూర్చి అడిగాడు యలమంద.

మంగమ్మకుకూడా ఎక్కడో అనుమానంగానే ఉంది.

"బతకాలె. చచ్చినా మీకోసం చస్తడు. మీరు గాజులు తొడిగించుకొని కూర్చుంటరా? మగసిరి గలిగి లేస్తరా? పదండి పొలం కాడికి పోదాం. పందోలె పదేండ్లెందుకు పులోలే పదిరోజులు బతుకుతె చాలు"

"మాన్యాలు" నినాదం ఇచ్చింది.

"అన్నీ మావి" నినాదాలు-కావు గర్జనలు.

"దున్నేవానిదే భూమి" మరో నినాదం.

"దౌర్జన్యాలు నశించాలె" మరో కేక.

ఊళ్ళో ఉద్రేకం, ఉత్సాహం, ఉత్తేజం పరుగులు తీస్తున్నమాట నిజమే. కాని అట్టడుగున ఎక్కడో భయం భయంగా కూడా ఉంది.

భయం-ఉద్రేకం-ఉత్తేజం.

ఉత్తేజం-ఉద్రేకం-భయం.

అలా ఉంది స్థితి. కొందరు అక్కడ్నుంచి చల్లగా జారుకోసాగారు.

"పిరికిపందలు పారిపోతున్నారు" యలమంద కేకపెట్టాడు.

జనమంతా అటు చూశారు.

"పిరికిపందలు" అని కేకలు వేశారు.

పోతున్నవాళ్ళు కేకలు గమనించలేదు. ఇండ్లలో పడ్డాకనే తలలు ఎత్తారు.

వయస్సు మళ్ళిన
శక్తులు చచ్చిన

సోమరులారా!
చావండి.
రక్తం మండే
శక్తులు నిండే
సైనికులారా
రారండి."

పదం పాడింది మంగమ్మ. వందలమంది పాడారు. ప్రకాశం ముందు - మంగమ్మ తరవాత, ఆమె వెనక జనం సాగారు. పొలాలవైపు కదంతొక్కుతూ పదంపాడుతూ హృదయాంతరాళం గర్జిస్తూ సాగింది జనం.

సాగుతున్నది జన ప్రవాహం.
ఆగబోదు నర ప్రవాహం.
ఆశల అంచులు చేరేదాకా
అంబర వీధులు అంటేదాకా!

కొందరు ముసళ్ళు ముదివగ్గులుకూడారు ఊళ్లో. వాళ్ళకూ జరుగుతున్నది అన్యాయం అని అర్థం అయింది. అయినా అలా వెల్లువలాపోయి రామయ్య అధికారాన్ని ధిక్కరించడం వారికి బాగనిపించలేదు. నలుగురూ కలసి రామయ్య దగ్గరికి బయలుదేరారు.

వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి.

ఊరు ఏదో ఉత్పాతం వచ్చినట్లుంది.

అలాంటి వీధుల్లోంచే వెళ్ళారు పెద్దమనుషు లనిపించుకునేవారు - చాకళ్ళ-మంగళ్ళ వగైరా.

"దండం దొరా! కాల్మొక్తం"

"ఏమిరా ఏమో వచ్చిన్రు?" లోపల గుబగుబ అంటున్నా గంభీరంగానే అన్నాడు.

కారు హారను వినిపించింది.

తప్పుకున్నారు పెద్దలు.

గాంధీని తీసుకుని కారు సాగిపోయింది.

మస్తాన్ను తీసుకెళుతున్న బండిని దాటి దూసుకొని వెళ్ళిపోయింది కారు. అది కారు మరి!

"ఏమెరికలేనట్లు అడుగుతరేముండి గులాపోండ్లం"

"చెప్పకుంటె ఎట్లెరికైతదిరా"

"అదెనుండి మా మాన్యాలు దున్నుకోవద్దన్నరుటగద?"

"ఆరే! ఓట్లేమొ వీరభద్రాని కేసిరి. సర్కారు భూములెట్ల దున్నుకుంటర్రా?"

"ఓట్లకోసం ఇచ్చినారు(ని బూములు. చాకిరి చేసినందు కిచ్చిరి. అయినా మేమే యేసినాముండి ఓట్లు? ఎరకలే కడుగుత. కోప్పడగుండి బాంచెను."

"సర్కారు మీద తిరగబడ్తె బూములెట్లుంటయిర"

"యాడ తిరగబడినముండి! చెప్పినట్లింటాంటిమి! కొట్టినట్లు పడ్తాంటిమి! ఏమన్నమరి-అన్నాలంగున్నదుండి కాల్మొక్తం."

"అన్నాలంగుంటె నాదగ్గరికి ఎందుకొచ్చిను(. పోతా(నట గద పొలాలు గెల వటానికి - పోకపోయినారు. లంజకొడుకుల్లార! నీతులు చెప్పటానికి వచ్చి(ను మీ అమ్మల....అక్కల...." అని లేచిపోయాడు రామయ్య.

"పదండిర. దొరకోపమొచ్చింది." అని లేచిపోయారందరూ.

రామయ్యలోనికి వెళ్తుంటే సుమతి కనిపించింది. తప్పించుకొనిపోవడానికి ప్రయత్నించాడు. కాని నుంచోపెట్టే అడిగింది సుమతి.

"ఎందుకండి ఆ నెత్తుటికూడు మనకు?"

"హుఁ. ఇంక"

"వాళ్ళంతా ఇంటిమీద పడ్తె మనమాడుంటం?"

"హుఁ పడ్తారు గాడ్దికొడుకులు, ఒక్కొక్కడ్ని పట్టుకపోయి జేల్ల నూకిం తను"

"ఏమోనండి ఎందుకీ అన్యాయం?"

"అన్నావు నువ్వుగూడ. పో వాండ్లల్లనే కలువు. సాధిస్తవేమో నన్ను" చక చరా సాగిపోయాడు.

సుమతిలో దుఃఖం నిండింది.

కన్నీటి చుక్కలు పాదాలమీద రాలాయి.

సాగిపోయిన జనం పొలం దగ్గరికి వెళ్ళి ఆగిపోయారు.

వస్తాదులిద్దరూ వస్తున్న జనాన్ని చూశారు. దూరంనుంచే పొంగిపోతున్న కెరటాల్లా వస్తున్నారు. మండిపోతున్న దావాగ్నిలా ఉరికి వస్తున్నారు. వారిచ్చే వినాదాలు పొలాలుకూడా పలుకుతున్నట్లున్నాయి.

"దున్నేవానిదే భూమి" భూమి దద్దరిల్లింది.

భూమి వాస్తవంగా దున్నేవానిదే. ఫలసాయం పరులది.

వస్తాదులకు వణుకు పట్టుకుంది. జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు. కేకలేస్తూ వస్తున్నారు, కేరింతలు పెడ్తూ వస్తున్నారు. తామిద్దరు అడ్డగలరా? కూలతు గదా!

"హుసేనన్నా! ఇది అన్నాలమేనే!" సైదయ్య మెల్లగా అన్నాడు.

"అవు నా కట్లనే అనిపిస్తున్నది" అన్న హుసేను "వచ్చిరి పడిరి. కట్టె తిప్పు. మనమైతే బతకాలెగద" అని దుడ్డుకర్ర అందుకొని గిర గిరా తిప్పుతూ పొలం పొంతం తిరుగసాగాడు. సైదయ్య హుసేన్ను అనుసరించాడు.

కర్రలు వేగంగా తిరుగుతున్నాయి. కదం పొలంలో పడితే కణత పగిలేట్లుంది.

అందుకే ఆగిపోయింది. సాగివచ్చిన జనం అక్కడిదాకా ఉత్సాహంతో వచ్చారు. ఉరకలు పెడుతూ వచ్చారు. ఆనకట్ట ప్రవాహం నిలిచినట్లు ఆగిపోయారు. చెలియలి కట్టను తాకి సముద్ర తరంగాలు చెదిరినట్టు చెదరిబెదరుతున్నారు.

అడుగు లోపలికి పెడ్తున్నారు. విసురుగా కర్ర వచ్చేస్తూంది. వెనకడుగు వేస్తున్నారు. ముందడుగు, వెనకడుగు కొంతసేపు కదం తొక్కడం జరిగింది.

"ఉరకండి" అని కేక పెట్టి దూసుకొనిపోయింది మంగమ్మ. ఒక్క అడుగు! ఒకే అడుగు! నొసటికి కర్ర తాకింది. చర్మం లేచిపోయింది! రక్తం సొడసొడ కారింది. ముందున్న ప్రకాశం నెత్తిన పడింది. ప్రకాశం తల ఎత్తి తల్లిని చూచాడు. "మా అమ్మను కొడ్తావురా!" అని ముందుకు ఉరికాడు.

కర్ర తిరుగుతూనే ఉంది.

మంగమ్మ ప్రకాశం రెక్కపట్టుకొని వెనక్కు లాగింది.

పులి అయింది మంగమ్మ.

"కొట్టండి. ఉరకండి"

జనంలో ఉత్తేజం నిండింది. ఉత్సాహం పొంగింది.

"మాన్యాలు మావి" అని కేకపెట్టారు.

అడుగు లోనికి వేయబోయారు.

హుసేనుకు కంపరం పుచ్చుకుంది.

కర్రపారేశాడు. జంబియాతీశాడు. దాని కొన జనంవైపు పెట్టి జనం వున్నంత దూరం శరవేగంగా వురకసాగాడు. ముందుకు పోయిన యలమంద చేయి చీరుకుపోయింది.

"చంపుత. చస్త" వెర్రికేక పెట్టి తిరుగుతున్నాడు హుసేను.

"మాకాడ మీకేందుండి. రామయ్యకాడ తేల్చుకోరాదుండి" కేక గట్టిగానే పెట్టాడు సైదయ్య. అయినా అందులో ఏదో ఆవేదన వుంది. మమ్ములను ఎందుకు చంపుతారు. ఆ రామయ్యమీదనే పడండి అన్నట్టుంది ధ్వని.

జనంలో కలకలం బయలుదేరింది. అవును. రామయ్య దగ్గరే తేల్చుకోవా అన్నారు కొందరు.

"చలో రామయ్య ఇంటికి" యలమంద కేక.

జనం వెనక్కు తిరిగింది. మరలిపోతూంది.

రక్తంతో తడిసింది పొలం. అది నేలను నమ్ముకున్నవారి రక్తం. నేలతల్లి భరించలేకపోయింది.

భూమాత ఏడ్చేసింది!

వెనక్కు మళ్ళిన జనం కొంతదూరం సాగి నిలిచింది. వాదోపవాదాలు సాగేయి. రామయ్య దగ్గరికిపోతే ఏం చెపుతాడు? మళ్ళీ అదే పాతపాట. కొందరు కోర్టుకు వెళ్ళాలన్నారు. అవి ఖరీదైనవి. వీరికి అందనివి. మంగమ్మ అమాంతంగా అంది—

"మంత్రి దగ్గరికే పోదాం. బలరామయ్య దగ్గరికే పదండి. అక్కడే తేల్చుకుందాం."

"చలో హైద్రాబాద్‌కో" యలమంద కేక.

ఉత్సాహం పొంగులు వారింది. అది నినాదంతో ప్రతిధ్వనించింది.

మళ్ళీ సాగింది జైత్రయాత్ర. జనయాత్ర.

ప్రకాశం ముందు సాగుతున్నాడు.

అతని చేతిలో జండా ఉంది.

అది రక్తసిక్త పతాకం.

రెపరెపలాడుతూంది.

"పదండి ముందుకు

పదండి తోసుకు

పదండి పోదాం - పైపైకి"

ప్రకాశం చెపుతున్నాడు.

జనం గర్జిస్తున్నారు!

సాగిపోతున్నది జనం.

రామయ్య ఇల్లు వచ్చేసింది. తలుపులు బిగించి ఉన్నాయి. అవి మనుషులను అడ్డగలవు. కేకలను, అరుపులను అడ్డలేవు.

"రామయ్య దౌర్జన్యం" పిడికిలి బిగించి ప్రకాశం కేకపెట్టాడు.

"నశించాలె" గొంతులు చించుకొని ప్రజలు అరచారు.

రామయ్య గదిలో మూలకు నక్కి కూర్చున్నాడు.

అయినా అతని గుండెకు గాయం కొట్టాయి కేకలు.

సుమతి మేడమీదినుంచి చూచింది.

ప్రకాశం నినాదాలిస్తున్నాడు! కొడుకు తండ్రిమీద తిరుగుబాటు చేస్తున్నాడు అనుకుంది. ఎక్కడో ఏ మూలకో సంతోషం పొడచూపింది. కాని వెంటనే బుగులు చేరింది గుండెలో—

సాగిపోతున్న జనాన్ని చూస్తూ నుంచుంది.

చీమల బారులా సాగిపోతూంది జనం.

నినాదాలు ఇంకా వినవస్తూనే ఉన్నాయి.

ప్రకాశం పెట్టిన కేకలు ఆమె చెవుల్లో ఇంకా రింగుమంటూనే ఉన్నాయి.

మేడమెట్లు దిగి లోనికి వచ్చింది.

తలుపులు తెరుచుకొని రామయ్య బయటికి వచ్చాడు.

ఊరు బావురుమంటూంది.

రామయ్య గుండె దడదడ లాడుతూంది.

వస్తాదులు వచ్చి నుంచున్నారు.

"బతాదియే భంచత్ తడాకా. జమీన్ మీదికి వస్తార్, జమీన్ మీదికి" అని తానుచేసిన వీరకృత్యాలన్నీ వినిపించాడు హుసేన్.

కర్ర పట్టుకొని బొమ్మలా నుంచున్నాడు సైదయ్య.

రామయ్య లేచి లోనికి వెళ్ళాడు. డబ్బు తెచ్చి వస్తాదులకు ఇచ్చాడు. డబ్బు అందుకొంటూ అన్నాడు సైదయ్య.

"నాకైతే అన్నాయంగనే కండ్ల పడుతున్నదుండి"

హుసేను సైదులును ఎగాదిగా చూచాడు.

రామయ్య సైదులును కళ్ళతో ఒకసారి కొలిచాడు. "సరె పోయిరాండి" అని లోపలికి వెళ్ళిపోయాడు.

నిర్మానుష్యమైన వీధుల్లోంచి సాగిపోయా రిద్దరూ.

రామయ్య లోపలికి వెళ్ళి మంచంలో పడిపోయాడు. నీరసంగా ఉంది. నిరామయంగా ఉంది. అయోమయంగా ఉంది. అర్థం కాకుండా ఉంది. బోసిబోసిగా ఉంది. బుగులు బుగులుగా ఉంది. సిగరెట్టుపెట్టె కనిపించింది. సిగరెట్టు తీశాడు. కాల్చబుద్ధి కాలేదు. అక్కడే పెట్టేశాడు. కళ్ళు మూసుకున్నాడు.

ప్రకాశం కేకలు వినిపించాయి. ప్రకాశం మనసులో మసలాడు. కేక పెడుతున్న భంగిమ ఊహించుకొన్నాడు. చిరుతడు, బుడితెడు, చిన్నవాడు! ముమ్మూర్తులా తానే!! తన రక్తం పంచుకొని పుట్టాడుకదా! తనమీదికే తిరగబడుతున్నాడు కొడుకు! తండ్రిమీద తిరుగుబాటు! మంగమ్మ పగ తీర్చుకుంటున్నది. అవును పగ తీర్చుకుంటుంది! అసలు ఎందుకు తల దూర్చాడు తానిందులో? మాన్యాలు వాళ్ళవి? తానెందుకు మంకుపట్టు పట్టాడు? ఓట్లు వేయలేదు సరే. అయితేమాత్రం తనకేం హక్కు ఉంది?

"ఎందుకండి ఆ నెత్తుటికూడు మనకు" సుమతి అంటున్నది.

"ఓట్లకోసం ఇచ్చినారున్ని బూములు?" చాకలిపెద్ద అంటున్నాడు.

"నాకైతే అన్నాయంగనే కండ్లపడ్తున్నదుండి" సైదయ్య పలుకుతున్నాడు.

అవును. అది అన్యాయమే. తన పెత్తనం చూపాలనుకున్నాడు. దొరతనం నిభాయించుకోవాలనుకున్నాడు. దొర ఎన్నిసార్లు చేయలేదిట్లా? కిక్కురు మన్నారా జనం? కాలం మారిందన్న విషయం తాను గ్రహించలేదు. దొర చెప్పాడు అధికారంలోంచి డబ్బు పుట్టేకాలం పోయిందని! డబ్బులోంచి అధికారం పుట్టే కాలం వచ్చిందని. అయినా తానిలా చేశాడు. ఊరు స్వాంతం ప్రగ్గైంది. యాదగిరి సహితం తెగిపోయాడు. ఇదంతా ఎవరికోసం చేశాడు? బలరామయ్య కోసం! బలరామయ్యకు

ఓట్లు వేయలేదని. ఇప్పుడు బలరామయ్య తనకు అండగా నిలుస్తాడా? ఎలా నిలుస్తాడు? తానే వెళ్ళి జనంతో సమాధానపడితే, తన తప్పులేదని వస్తాదుల మీద తోస్తే! బాగానే ఉంటుంది. కాని ఎవరితో మాట్లాడాలి? మంగమ్మయితే! మంగమ్మతోనా? మంగమ్మతో!! సాధ్యంకానిపని. తాను మాట్లాడలేడు. మాట్లాడడు. కనీసం వీరభద్రం ఉంటే బాగుండేది. అతడు అర్థంచేసుకోగలడు. క్షమించగలడు? అదీ లాభంలేదు. ఇక బలరామయ్యే శరణ్యం. ఏదోరకంగా తనను రక్షించమనాలి? తాను వెళ్ళడం మంచిదా? సుమతిని పంపడం మంచిదా?

సుమతిని పంపడం?

ఆ ఆలోచన వచ్చినందుకే ఆశ్చర్యపడ్డాడు. విడిగా పెట్టిన సిగరెట్టు తీసి కాల్చాడు! సుమతి దగ్గరికి బయల్దేరాడు. సుమతి పూజామందిరంలో ఉంది. రామాయణం చదువుతూంది.

రాముడు, రామ కథాగానము వినవలెనని కుతూహలపడెను. పెద్దసభ ఏర్పాటు చేయించెను. సామంతులు, పండితులు, మహర్షులు ఆసీనులైన ఆ సభ నక్షత్రములచే నిండియున్న ఆకసమువలె నుండెను. అట్టి సభాభవమునకు రాముడు కుశలవులను పిలిపించెను. వారు సభాభవమునకు వచ్చి రాగతాళ యుక్తముగా గానము చేయసాగిరి. సభాసదులు వారిని చూచి.

'జటితా యదినస్యాతాం న చ వల్కల ధారిణౌ
విశేషం నా వగచ్ఛామో రామస్యా నయో స్తథా'

ఈ బాలురు జటావల్కలములు ధరించకున్న, రామునకును వీరికిని భేదము కానలేకుండును అనుకొనిరి.

రాముడును అట్లే భావించెను.

తలుపు దగ్గర నుంచొని వింటున్న రామయ్యకు అది తననిగురించే చదివినట్లు అనిపించింది. గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. మళ్ళీ మంచంలో పడిపోయాడు.

భోజనాల సమయంలో ప్రస్తావించాడు.

"జర మీ మామయ్యగారి దగ్గరికి పొయ్యొస్తవా?"

కొంతసేపు మౌనంగానే భోజనాలు చేశారు. ఎలా ప్రారంభించాలో అర్థం కాలేదు రామయ్యకు. చివరకు అనేశాడు.

ముద్ద నోటిదాకా పోయింది. అలాగే పట్టుకొని చూచింది వింతగా సుమతి— ఆమెకు ఆశ్చర్యం అయింది. ఎన్నడూ అనని మాట అన్నాడు. ఎందుకన్నాడో అర్థంకాలేదు.

"ఏంలేదు. జర ఆయనతో చెప్పటం మంచిది."

ఏం చెప్పాలి? అన్నట్టుగా చూచింది.

"నువ్వు చెప్పినప్పుడు వినాల్సింది."

అయోమయంలో పడ్డది సుమతి. అంత సాత్వికంగా అతడు ఈ మధ్యన మాట్లాడలేదు. అయినా సుమతి పెదవి కదపలేదు.

"అదే మాన్యం సంగతి. చాకలోండ్లు రెచ్చిపోయిన్రు లంజకొడుకులు" మంగమ్మ పగ తీర్చుకుందామనుకుంటూంది, అనబోయి మాట మింగేశాడు.

సుమతి ఇంకా అలాగే చూస్తూంది.

"వాండ్లు మా నాయన దగ్గరికే పోయిన్రు. నువ్వుపోయి జర మాట దక్కించ మనాలె. నువ్వు చెప్పుతే ఇంటడు."

తికమక పడ్డది సుమతి. వెర్రిగా చూచింది.

"మీరు చెప్పుతే ఇనడా?"

"ఇంటడనుకో! ఎట్లయినా నువ్వు చెప్పింది అదొాక తీరు"

"అదేం బాగుంటది? నేను పోను"

"అయితే నేను నాశనం కావాల్నని ఉన్నదా? పాత మిండనితోని కులుకుతవా?"

వందల బాణాలు సుమతి గుండెలో గుచ్చుకున్నాయి. విలవిల్లాడింది. దుఃఖం ముంచుకుని వచ్చింది. పళ్ళెంలో కన్నీరు టపటపరాలింది.

"ఎందుకట్ల గడ్డపారలు గుచ్చుతరు? ఒక్కసారె పొడిచి చంపరాదుండి. నమ్మకంలేని దొరకు సుఖం తక్కువ" మాటల్లో కూడా కన్నీరు తొణికిసలాడింది. అన్నం వదలి ఏడ్చుకుంటూ వెళ్ళిపోయింది. చేయి కడుక్కొని, కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ తిరిగివస్తున్న సుమతిని చూచి "ఇంతకు ఏమంటవు?" అని అడిగాడు.

అసహ్యమనిపించింది సుమతికి. దుఃఖం మరికొంత పొంగింది. "ఒక్కదాన్ని పోను" అని చెప్పి వెళ్ళిపోయింది. మంచంలో పడి ఏడ్చేసింది. ఏడ్చి ఏడ్చి లేచింది. రాముని పటానికి దండం పెట్టింది.

"ప్రభూ! ఎంతకాల మీ కత్తులబోనులో? తీసుకొని పోరాదు నాయనా?" అని "సీతమ్మనే అనుమానించిన వానివి. ఆమెనే అష్టకష్టాలపాలు చేసినవు. నాకేం సహాయం చేస్తవు!" అనుకుంది.

సాయంకాలానికి కారు తిరిగి వచ్చింది. గాంధీ వచ్చి ఒళ్లో వాలిపోయాడు. ఆమెకు దుఃఖమూ, ఆనందమూ కలసి పొంగాయి. గాంధీని కావిలించుకొని ఏడ్చేసింది. కన్నీరు తుడుచుకొని అడిగింది.

"ఇంతసేపైందేం బాబూ?"

"దోస్త్ ఇంటికి పోయిన"

"ఏం చేసినవ్"

"ఆడుకున్న"

"ఏమాట"

"పేకాట"

సుమతి గుండెలో రాయిపడింది. గాంధీ చెడిపోతున్నాడా? ఈ ఒక్క ఆశ్రయం కూడా జారిపోతూందా? అనుకోగానే మళ్ళీ దుఃఖం పొంగింది.

"పేకాట ఆడకూడదు నాయనా, తప్పు" అన్నది.

"ఎందుకాడ కూడదు? అంద రాత్తరు. చూడు. ఎన్ని పైసలొచ్చినయో!" అని జేబు గలగల లాడించాడు.

సుమతి నిశ్చేష్ట అయి చూచింది. బాగుపడ్డానికి పట్నం పంపింది కొడుకును! తన గతి ఇంతేనా? అనుకుంది.

జీతగాడు వచ్చి కారు సిద్ధంగా ఉందని చెప్పాడు. గాంధీని పట్టుకొని సాగి పోయింది. కారులో కూర్చుంది. పలకలేదు.

"ఆ లుచ్చాలు పోయే తోవన తీస్కపోకు. చుట్టయినా ఏరే తోవన పో" అని ఆదేశించాడు డ్రైవరుకు. డ్రైవరు ఆశ్చర్యంగా రామయ్యను చూశాడు. స్టార్ట్ చేశాడు. కారు సాగిపోయింది.

తోవలో గాంధీ విషయం ముచ్చటించింది.

"ఏమైతది? ఫేషన్లు మారుతున్నయి" అన్నాడు పరాకుగా రామయ్య.

తన కొడుకు విషయంలో శ్రద్ధ తీసుకో దలచలేదు అనుకుంది సుమతి. అది మనసును అతలా కుతలం చేసింది.

కారు బలరామయ్య ఇంటికి చేరింది.

బలరామయ్య ఇంట్లోనే ఉన్నాడు.

సుమతి బలరామయ్య దగ్గరికి వచ్చి కూర్చుంది. బలరామయ్య ఆశ్చర్య పడ్డాడు. సిగరెట్టు ఆర్పి యాష్ట్రేలో వేసి నలిపేశాడు.

ఇద్దరూ మాట్లాడలేదు.

సుమతి వెలుగుతున్న లైట్లను చూస్తుంది.

"ఏమమ్మా! ఏం సంగతి?"

ఉలిక్కిపడ్డది సుమతి. ఒకసారి బలరామయ్యను చూపులతో కొలిచింది. గంభీరంగా ఉన్నాడు. అతనూ ఏదో ఆలోచిస్తున్నట్లున్నాడు.

"మామగారూ మాట దక్కించాలె" అని కథంతా సంక్షిప్తంగా చెప్పింది.

"నాకు అంతా తెలిసిందమ్మా. రాముడు ఇంక దొరల కాలం ఉన్నదను కొంటున్నడు, మాన్యాలు వాండ్లవి. మనమెట్ల ఆపుతం చెప్పు."

"మనిషన్నవాడు తప్పు చేయడా మామగారూ!"

ఆశ్చర్యపడ్డాడు బలరామయ్య. కోడలు తనతో వాదిస్తుంది! తమ రోజు అవుతే కోడళ్ళ ముఖం చూపేవారుకారు. ఇంత దూరాన కనిపిస్తే అంత దూరం మంచి తెరలో దూరేవారు! అయినా భర్తకోసం వాదిస్తూంది. ఎంత అభిమానం ఉత్తందే అనుకున్నాడు. అది అతనికి ముచ్చటగా ఉంది. ఆనందంగా ఉంది.

"చేస్తదమ్మా చేస్తడు. కాని ఇటువంటి తప్పు చేయకూడదమ్మా! ఊరు పొంతం పగ చేసుకున్నడు."

"అందుకేగద మామగారూ వచ్చింది మీ దగ్గరికి. ఎట్లనన్న మాట దక్కించాలె"

"నువ్వు గొప్పదానివమ్మా! సావిత్రివి! నీ మొగుడ్ని కాపాడాలని చూస్తున్నవు."

"మీ దయ"

"మంచి బిడ్డను కన్నాడమ్మా మీ నాయన. మా రాముడు అదృష్టవంతుడు."

సుమతి కళ్ళలో నీరు నిండింది. అది నిండిం దొకందుకు. బలరామయ్య అర్థం చేసుకున్నది ఒక తీరుగా.

"ఏడవకమ్మా! కోడలు ఏడుపు ఇంటికి మంచిది కాదు. ఎట్లనో చేస్తలే. నీ మొగనితో చెప్పు మిడిసి పడొద్దని. వానికి నా ముందరి వచ్చేటందుకు మొఖం లేదు" అన్నాడు.

"ఎట్లనన్న చేయండి మామయ్యా! ఆయన పరువు మీ పరువు కాదా?"

మాటలు బరువుగా వచ్చాయి. అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయింది.

గాంధీ, తాతదగ్గరికి వచ్చాడు. వచ్చి వళ్ళో కూచున్నాడు.

"తాతా! పేకాడటం తప్పా?" అడిగాడు.

"కాదుబాబూ" పరాకుగా చెప్పాడు.

"అమ్మ ఓడిపోయింది. అమ్మ ఓడిపోయింది" అని చప్పట్లు కొట్టుకుంటూ వెళ్ళిపోయాడు గాంధి.

అర్థంకాక నివ్వెరపోయి సుంచున్నాడు బలరామయ్య.

జనయాత్ర పాదయాత్ర సాగిందా! అది పక్క ఊరు చేరకముందే వార్త అందింది. పొరుగూరు జనం పాదయాత్రకు స్వాగతం పలికారు. పూలదండలువేసి సన్మానించారు. కుంకుమ బొట్టు పెట్టి మంగళహారతు లిచ్చారు. వారితో గొంతు కలిపి నినాదం చేశారు.

"విప్లవం వర్థిల్లాలె"

"దున్నేవానిదే భూమి"

"రామయ్య దౌర్జన్యం నశించాలె"

అతిథులను ఆహ్వానించారు. చెట్లకింద విశ్రమింపచేశారు. ఫలహారాలు అందించారు. బిందెలతో చాయ్‌చేసి ఇచ్చారు. ఏదో ఉత్సాహం కనిపించిందా ఊళ్లో. ఏదో ఆనందం కనిపించింది ఆతిథ్యం ఇవ్వడంలో. సేద తీర్చుకొని గుంపులు గుంపులుగా చేరి కూర్చున్నారు – ఉభయ గ్రామాలవారు కలసి. వారిలో బంధువు లున్నారు. మిత్రులున్నారు. చుట్టపక్కాలున్నారు. కష్టాలు నలుగురిని కలుపుతాయి. అందుకే పాలలో నీళ్ళలా కలిసిపోయారు వారు. ముచ్చట్లాడుతున్నారు. మంతనాలు

జరుపుతున్నారు. తుదకు తీర్మానించుకున్నారు. తమ ఊరి వారూ కొందరు కదలాలని. అక్కణ్ణుంచి కొందరు కదిలారు. మరో పతాకం రెపరెప లాడింది.

జనయాత్ర మళ్ళీ సాగింది.
మరింత పొడవై సాగింది.
పదం పాడుతూ సాగింది.
కదం తొక్కుతూ సాగింది.
"దారి పొడుగునా గుండె నెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు!
బాటలు నడిచి
పేటలు కడచీ
కోటలన్నిటిని దాటండి!
నదీనదాలూ
అడవులు కొండలు
ఎడారులా మన కడ్డంకి"

ప్రకాశం పాడుతున్నాడు. పదం అందుకుంటున్నారు జనం. జనపదం సాగుతూంది! జనపదం పాడుతూంది.

మధ్యాహ్నానికి మరొక ఊరు చేరారు. అక్కడా స్వాగతం లభించింది. భోజనాలైనాయి. మూడో పతాకం కలిసింది. మరింత జనం కలిసింది.

మళ్ళీ సాగింది యాత్ర
జైత్రయాత్ర!
"పదండి ముందుకు!
పదండి తోసుక!
ప్రభంజనంవలె హోరెత్తండీ
భావవేగమున ప్రసరించండీ
వర్షుకాభ్రముల ప్రళయ ఘోషవలె
పెళ పెళ పెళ విరుచుకుపడండి"

మరో జనపదం! మరో గ్రామం! మరో పతాకం: మరింత.

సాయంకాలానికి ఒక గ్రామం చేరుకున్నారు. అక్కడ భోజనాలు ఏర్పాటు. కాగడాలు పట్టుకొని కదలాలని తీర్మానం. కర్రలు, గుడ్డపేలికలు, చమురు, అగ్గి.

వేల దివిటీలు వెలిగాయి!
వేల కాగడాలు మండాయి.
మంటలు సాగుతున్నాయి.
జ్వాలలు నడుస్తున్నాయి.

గుండెల్లో మంటలు! చేతుల్లో మంటలు!
మంటలు! మంటలు! మంటలు!
వెలుగులు! వెలుగులు! వెలుగులు!
జనం సాగుతున్నారు. పదం పాడుతున్నారు.
"పదండి
పదండి
పదండి ముందుకు!
కనబడలేదా మరో ప్రపంచపు
కణకణ మండే త్రేతాగ్ని"
అక్కడికి వీరభద్రం వచ్చాడు. అతని ఆశ్చర్యానికి అంతులేదు. ఎన్ని కాగడాలు! ఎంత జనం! ఎంత ఉత్సాహం! ఎంత ఉద్రేకం! జనమూ, కాగడాలూ..
భగభగ మండుతున్నాయి!
ధగధగ మెరుస్తున్నాయి.
బిగ్గరగా నినాదం చేశాడు.
"విప్లవం వర్థిల్లాలె"
సముద్రం ఘోషించినట్లు వచ్చింది నినాదం. కొండలు ప్రతిధ్వనించేట్లు వచ్చింది నినాదం.
మళ్ళీ పదం సాగింది.
జనపదం సాగింది.
"త్రాచుల వలెనూ
రేచులవలెనూ
ధనంజయుడిలా సాగండి!
కనపడలేదా మరో ప్రపంచపు
అగ్ని కిరీటపు ధగధగలు?
ఎర్రబావుటా నిగనిగలు,
హోమ జ్వాలల భుగభుగలు"
తెల్లవారేదాకా నడుస్తే మిలమిల మెరిసె పట్నపు దీపాలు కనిపించాయి.
జనయాత్ర పట్నంలో ప్రవేశించింది.
పట్నీయులు వింతగా చూశారు యాత్రను.
బాల్కనీలోంచి చూచారు.
మిద్దెలమీది నుంచి చూశారు.
మేడమీంచి చూచారు.
కార్లు ఆపి చూచారు.
సైకిళ్ళు నిలిపి చూచారు.

పల్లెజనం పట్నంమీద పడ్డారనుకున్నారు.

బలరామయ్య ఇంటిముందుకు వచ్చింది జనసాగరం. ఘోష పెట్టింది.

"విప్లవం వర్థిల్లాలె"

"దున్నేవాడిదే భూమి"

"మాన్యాలు మాకే చెందాలె"

నినాదాలు విని బాల్కనీమీదికి వచ్చింది సరస్వతి. చూచింది.

వీరభద్రం!

ఆమె హృదయం ఉప్పొంగింది.

పురివిప్పి నాట్యం చేసింది.

వీరభద్రం. తన వీరభద్రమే!

ఎంత ఉద్రేకంగా నినాదాలిస్తున్నాడు?

ఏమీ మార్పులేదు.

ఆ ఉద్రేకంలో ఏమీ తచ్చులేదు.

అమాంతంగా పరిగెత్తాలనిపించింది.

ఆలింగనం చేసుకోవాలనిపించింది.

చమక్కున స్ఫురించింది. తాను బలరామయ్య భార్య. మంత్రిగారి పత్ని. దొరసాని.

ఉత్సాహం కరిగిపోయింది.

నీరసంగా చూస్తూ నుంచుండిపోయింది.

లోపల బలరామయ్య తడబడ్డాడు. గుండె గుబగుబ లాడింది. అయినా సర్దుకున్నాడు. ఖద్దరు ధోవతి చక్కగా కట్టుకున్నాడు. లాల్చీ వేసుకున్నాడు. టోపీ పెట్టుకున్నాడు. అద్దంలో చూచుకున్నాడు. తడబాటు కనిపించడం లేదుగదా అని. ఒక చిరునవ్వు నవ్వాడు. అద్దానికి నమస్కరించాడు. బయలుదేరాడు.

దిక్కులు పిక్కటిల్లే నినాదాలు.

"విప్లవం వర్థిల్లాలె"

"మాన్యాలు మాకే చెందాలె"

కాస్త తడబడ్డాడు బలరామయ్య. అయినా అందరికీ నమస్కరించాడు.

"దొర దండం పెడ్తున్నడు. దొర దండం పెడ్తున్నడు" గుసగుసలు బయల్దేరాయి.

చిరునవ్వు నవ్వాడు బలరామయ్య—కాదు మంత్రిగారు.

"మీరంతా ఇక్కడికి వచ్చినారు. సంతోషం. మీ సమస్యలు నాకు తెలుసు. వీరభద్రంగారు మాకు మిత్రుడు— మీకు నాయకుడు. ఆయనతో మాట్లాడి సమస్యలు పరిష్కరిస్తాం" అని మెట్లు దిగివచ్చి వీరభద్రానికి చేయి అందించి కరచాలనం చేశాడు. భుజంమీద చేయివేసి, మెట్లెక్కిన తరువాత ప్రజలవైపు తిరిగారు.

కెమేరాలు "క్లిక్. క్లిక్" మన్నాయి.

అనేక మెరుపులు మెరిశాయి.

"మీరంతా చాలా దూరంనుంచి శ్రమపడి వచ్చినారు. కాఫీ ఫలహారాలు ఏర్పాటు చేసినాము. క్షణంలో షామ్యానా వచ్చుతుంది, అప్పటివరకు నీడలో ఆరామ్ చెయ్యండి" అని చెప్పి వీరభద్రం, బలరామయ్య లోపలికి వెళ్ళిపోయారు.

బాల్కనీ మీది సరస్వతి నిట్టూర్చింది. వెళ్ళిపోబోతూ ప్రకాశాన్ని చూచింది. నుంచుండి పోయింది. నివ్వెరబోయింది.

ఎవరీ అబ్బాయి?

రామయ్యలా ఉన్నాడు!

దీక్షగా చూచింది. సంశయంలేదు. ముమ్మూర్తులా రామయ్యే! అక్కడెందు కున్నాడు? అని ఆలోచించుకుంటూ వెళ్ళిపోయింది.

నిముషాల్లో షామ్యానాలు వచ్చేశాయి. పందిళ్ళుగా వెలిశాయి. జంపకానాలు పరచారు. జనం చుట్టలు కాల్చుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ కూలబడ్డారు.

"దొర మంచోడేనసె. ఈ రామయ్యే మిడిసిపడ్తాండుగని" ఒకని వ్యాఖ్య.

"ఎంతైనా దొరలు దొరలేనే. ఏమంటవ్?" మరొకని ప్రశ్న.

హోటలునుంచి వ్యానుల్లో టిఫిన్లు దిగాయి. వడ్డన సాగింది — వరుసగా కూర్చున్నవారికి. కాఫీ లందాయి. అప్పుడు కునుకుపాట్లొచ్చాయి. ఎక్కడివారక్కడ ముడుచుకున్నారు.

"ఏం పసందుగున్నయిర ఫలారాలు. యాణ్నించి తెప్పించిండోగని దొర" చుట్ట తాగుతూ కూర్చున్న ఒకడన్నాడు.

"మల్ల దొరంటే ఏమనుకున్నవ్? ఇట్ల కబురు చేసిండో లేదో. అట్ల మోటర్ గాడిల దిగే — నీ యవ్వ.... పట్నమనుకున్నవా మళ్ళ ఏంది?" చుట్ట కాల్చుకుంటూ చేసిన మరొకని వ్యాఖ్య.

మరి కొంతసేపటికి కాస్త సందడి ప్రారంభమైంది. మంత్రిగారు వస్తున్నారని ప్రకటించారు జవానులు. ఉపన్యాసం ఇస్తారనికూడా వెల్లడించారు.

"దొరొస్తాండు. లేరి. సభ చెప్పుతడట" అని ఒక్కొక్కరూ జనాన్ని లేపారు. కునికిపాట్లు పడుతూ జనమంతా లేచికూర్చున్నారు.

సభకు అవసరం అయిన కుర్చీలు, బల్లి, మైకు వగైరా అమర్చబడ్డాయి.

మంగమ్మ ప్రకాశాన్ని పెట్టుకొని వెనుక కూర్చుంది.

ఆమెకు ఇదంతా చోద్యంగా కనిపించింది.

టోపీ సర్దుకుంటూ మంత్రిగారూ, వారితోబాటే వీరభద్రం విచ్చేశారు. జనం లేచి నుంచున్నారు. మంత్రిగారు వారందరినీ కూర్చోవలసిందని చెప్పి, వీరభద్రాన్ని పక్కన కూర్చోబెట్టుకొని, కుర్చీలో కూర్చున్నారు. వీరభద్రం జనాన్ని ఒక్కసారి

కలయజూచాడు. మంగమ్మ కనిపించలేదు. "మంగమ్మ ముందుకు రావాలె" అన్నాడు వీరభద్రం.

మంగమ్మ ప్రకాశాన్ని తీసుకొని ముందుకు వచ్చింది, కూర్చుంది. ఎవరు? అన్నట్లు చూశాడు బలరామయ్య.

"జగ్గయ్య భార్య"

"మీరు చేసుకున్నరట గద" వెటకారం ధ్వనించింది.

అవునన్నట్లు తల ఊపాడు వీరభద్రం.

టోపీ సర్దుకుని లేచి నుంచున్నారు మంత్రిగారు.

"మిత్రులారా! మహాజనులారా!

మనది ప్రజాప్రభుత్వము. అంటే ప్రభుత్వం మీదే. మేము మీకు సేవకులము మాత్రమే."

కరతాళధ్వనులు చెలరేగినవి.

"ప్రజలకు ముఖ్యంగా- పేదలకు- మేలు చేయవలెనని మా ప్రభుత్వము దీక్ష బూనినది. అందుకే మాన్యాలను రద్దుచేసినాము."

సభలో గుసగుసలు.

రద్దు చేసినామంటే ఏమిటి? వాటిని గుంజుకోదలచలేదు. వారికే ఇచ్చివేయ దలచినాము. అంటే మాన్యాలు వారి వారి పేర చేయించ దలచినాము. మనమంతా మనుషులమేగదా! తప్పులు చేయమా? అసలు విషయమును గ్రహించలేకపోయినాడు రామయ్య. తప్పు చేసినాడు- ఇప్పుడు మీ మాన్యాలు మీకు ఇచ్చివేస్తున్నాము."

కరతాళ ధ్వనులు మిన్ను ముట్టినవి.

"మస్తానుగారికి దెబ్బలు తగిలినవి. వారు దవాఖానాలో ఉన్నారు. వారికి నష్టపరిహారం చెల్లిస్తాడు రామయ్య. ఈ సభ తరవాత నేను, వీరభద్రంగారు పోయి వారిని చూచివస్తాము."

మళ్ళీ చప్పట్లు.

"అయితే మా అమ్మ నెందుకు కొట్టిన్రు" ప్రకాశం లేచి నుంచొని అడిగాడు.

మంత్రిగారు కాస్త తడబడ్డాడు.

"ఎవరు? వీరభద్రం కొడుకా? పులి కడుపున పిల్లి ఎట్లు పుట్టును?" అన్నారు. మళ్ళీ ఉపన్యాసం సాగించారు.

"మీరంతా చాల శ్రమపడి వచ్చారు. భోజనాలు చేయండి. విశ్రమించండి. మళ్ళీ మీరు నడిచిపోవలసిన అవసరము లేదు. బస్సులు ఏర్పాటు చేసినాము. వెళ్ళవచ్చును."

చప్పట్లు.

"మీరు కొన్ని నినాదాలు చేసినారు. "దున్నేవానిదే భూమి" అన్నారు. మేము

అందుకే ప్రయత్నించుచున్నాము. బంజరు భూములు లేనివారికి పంచుటనుగూర్చి ఆలోచించుచున్నాము. త్వరలోనే అవి అందరికీ అందగలవు."

"దున్నేవానిదే భూమి" నినాదాలు.

"చాల మంచి నినాదము చేసినారు. నేను అదే నినాదము చేస్తాను. మీరు మారు పలకండి."

"దున్నేవానిదే" మంత్రిగారు.

"భూమి" ప్రజలు.

"విప్లవం" మంత్రిగారు.

"వర్ధిల్లాలి" ప్రజలు.

"జైహింద్" అని బలరామయ్య కూర్చున్నాడు.

సభ ముగిసింది.

మంత్రిగారు, వీరభద్రం ఆస్పత్రికి వెళ్ళారు. మస్తాను కోలుకుంటున్నాడు. వారిని చూచి దిగ్గున లేచి కూర్చున్నాడు. బలరామయ్య అతని వీపుమీద చేయివేసి నిమిరాడు. జరిగిన విషయాలు చెప్పారు. మస్తాను పొంగిపోయాడు. తాను ఆస్పత్రిలో ఉండనన్నాడు. వారితోపాటే వచ్చేస్తానన్నాడు. ఎంత చెప్పినా వినలేదు. మంత్రిగారి కారులో బలరామయ్య ఇంటికి వచ్చేశాడు.

జనం మస్తాన్ను చూచి ఎగిరి గంతేసారు.

అతన్ని ఎత్తుకొని ఎగిరారు - ఆడారు.

పొద్దు వాలింది. బస్సులు వచ్చేశాయి. బిలబిలమంటూ బస్సుల్లో ఎక్కారు జనం. బస్సులు కదిలాయి. జండాలు ముడిచి లోపల పెట్టుకున్నారు.

"బలరామయ్యగారికీ జై"

"మంత్రి దొరగారికీ జై"

"దొర మంత్రిగారికీ జై"

నినాదాలు సాగాయి. నగరమంతటా ఆ నినాదాలు వ్యాపించాయి. నగరం దాటిం తరువాత బస్సుల్లో ముచ్చట్లు సాగాయి. ఎక్కువగా బబరామయ్య దాతృత్వాన్ని గురించే. అక్కడి ఫలహారాలను గురించి- ఏర్పాట్లను గురించి చర్చ సాగింది.

వెళ్ళేప్పుడు వీరుల్లా వెళ్ళారు.

చప్పబడి వచ్చేశారు.

బస్సులు ఊళ్ళో ఆగాయి.

వార్త అగ్గిలా పాకింది. ఊళ్లో మిగిలిన జనం బిలబిల మంటూ వచ్చేశారు. వచ్చిన వానిని కావిలించుకున్నారు. జయ జయ ధ్వానాలు చేశారు.

ఊరు గెలిచింది.

ఉత్సాహంలో తేలియాడింది.

ఆ రాత్రి నిద్రలులేవు. యాదగిరి సారాయి పీపాలు అందించాడు. జనం తాగారు. తిట్టుకున్నారు. కొట్టుకున్నారు. ఊసుకున్నారు. సమాధానపడ్డారు. సంఘంగా కూడారు. ఆడారు. ఎగిరారు. పాడారు. కోలాటాలు వేశారు. గోలగోల చేశారు. చేస్తున్నారు.

రామయ్య ఇల్లు మూలుగుతుంది.

మంగమ్మ ఇంట్లో బుడ్డిదీపం వెలుగుతూంది. అది మంట కంటె పొగ ఎక్కువ కక్కుతూంది. ఆ దీపం ముందు కూర్చొని చదువుతున్నాడు ప్రకాశం. చదువుతున్నది "ప్రజల మనిషి" ముగింపుకు వచ్చేసింది. దీక్షగా చదువుతున్నాడు.

మంగమ్మ గోడకు అనుకొని కూర్చుంది.

వీరభద్రం మంచంలో పడుకొని ఉన్నాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. మంగమ్మా ఆలోచిస్తూంది. ఇద్దరూ మాట్లాడ్డం లేదు. ప్రకాశం చదువుతున్నాడు. దీపం నిశ్చలంగా వెలుగుతూంది. గాలి స్తంభించినట్లుంది. పుస్తకం ముగించి అడిగాడు ప్రకాశం–

"రామభూపాలరావు, కొమరయ్య భూమి గుంజుకున్నాడు. అందుకు జేలుకు పోయిండు. మరి రామయ్య ఎందుకు పోలేదు?"

కాస్త గాలి వీచింది.

దీపం రెపరెపలాడింది.

ఇద్దరు పెద్దలూ ఆలోచనలో పడిపోయారు.

ఇద్దరి ముఖాలు చూస్తూ కూర్చున్నాడు ప్రకాశం.

మౌనంలో కొన్ని క్షణాలు గడిచిపోయాయి.

"అది నైజాం నవాబు కాలం కాబట్టి అట్లయింది. ఇది దొరల రాజ్యం కాబట్టి ఇట్లయింది" మంగమ్మ జవాబు చెప్పింది. మనసులో దాగిన మాట బయట పడ్డట్లన్నది.

వీరభద్రం లేచి కూర్చున్నాడు. "అట్లకాదు. నైజాం నవాబుకంటె ప్రజా స్వామ్యం వేయిరెట్లు నయం. చూచినవుగద ప్రజలెట్ల ఊరేగింపు తీసిన్రో! ఆ కాలం అయితే అందరిని కాల్చేసేవాండ్లు. మంత్రి సైతం ప్రజాబలం చూచి లొంగాడు. మనం అనుకున్నదాన్ని సాధించాం" అన్నాడు.

"ఏం సాధించినం? ఎక్కడున్న గొంగడి అక్కడనే వున్నది. నాదన్న నాకియ్యి రాజన్న దేవుడా అన్న సామెత గుర్తుకు వస్తున్నది. మన మాన్యాలే మనకు వచ్చినయి. మంత్రిగారి ప్రాబల్యం పెరిగినది. రామయ్య రాజోలె వున్నడు" మంగమ్మ అన్నది.

ప్రకాశం ఇద్దరివైపూ చూశాడు. నెత్తి గోక్కున్నాడు.

కోళ్ళు కూశాయి.

వేగుచుక్క పొడిచింది.

తెల్లవారింది. పొద్దు కూకింది. అలా కొన్నిసార్లు తెల్లవారింది. రాత్రయింది.

రామయ్య ఊరికి వచ్చేశాడు. అతని కారు రోజూ పట్నం వెళ్తూనే వుంది.

ఎదురు చూసిన నష్టపరిహారం అందలేదు.

ఒకనాడు తెల్లవారే వరకల్లా పోలీసు జీపు దిగింది. అధికారులు రామయ్య ఇంట్లో మకాం వేశారు. చాకలి యలమందను పిలిపించారు. ఏదో పని ఉందని జీపులో ఎక్కించుకుపోయారు. జీపు చుట్టూ జనం కూడింది. ఊరి బయటదాకా ఉరికింది. తిరిగి వచ్చేసింది.

సాయంకాలానికి వస్తాడనుకున్న యలమంద తిరిగిరాలేదు. తెల్లవారి వార్త అందింది.

యలమందను అరెస్టు చేశారు.

మస్తాన్ను కొట్టిన నేరం మోపారు.

ఊరు ఉడికిపోయింది.

తుక తుక లాడింది.

అయినా పొక్కలేదు.

* * *

అబ్కారీ పాట లొస్తున్నాయి. అయినా రామయ్యలో అంత హడావుడి కనిపించలేదు. బలరామయ్యతో బెడిసింది. మాన్యాల తగాదాలో బలరామయ్య తనను వంచించాలనే అలా చేశాడనుకున్నాడు. పట్నంలో ఉన్నా బలరామయ్య ఇంట్లో ఉండలేదు. వేరే ఉన్నాడు. ఇప్పుడు వచ్చేశాడు. కాని కల్లు, సారాయి దుకాణాల విషయంలో బలరామయ్యను ఆశ్రయించదలచలేదు. రోజులు దగ్గర పడుతున్న కొద్దీ ఆతురత ఎక్కువ అవుతూంది. చాలాసార్లు వెళ్దామనుకున్నాడు. మానుకున్నాడు. బలరామయ్యకు మాత్రం ఊళ్ళో పట్టుకావద్దూ? ఎంత మంత్రి అయితే మాత్రం గ్రామబలాన్ని వదులుకుంటాడా? తనను మించినవాడేడీ ఊళ్ళో? బలరామయ్యే పిలుస్తాడు అనుకున్నాడు. ఆ మాత్రం తెలీదా అతనికి? అయినా ఏదో అనుమానం వెంటాడింది. సతమతం అవుతున్నాడు! ఎవరినైనా సలహా అడుగుతే బాగుండును. ఎవరిని అడగాలి? శేషయ్య పట్నం చేరాడు. బలరామయ్యను ఆశ్రయించాడు. బాగా పెరిగిపోయాడు. శేషయ్య మాత్రం చేయడా తాను? ఇంకెవరున్నారు? యాదగిరి ఏకు మేకై కూర్చున్నాడు! తనకు అవసరం వచ్చినపుడే వదిలేశాడు. మంగమ్మ పక్షం చేరాడు. ఏరు దాటాడు. తెప్ప తగలేశాడు! తాను ఇప్పుడు ఒంటరి అయిపోయాడు. ఇంత మహా ప్రపంచంలో తన వాడనిపించుకొనే వాడే లేకుండా పోయాడు. సుమతి! సుమతి ఉందికదా! సుమతి అదోరకంగా మారిపోయింది. ఎప్పుడూ మౌనంగా ఉంటుంది. ఆమె, ఆమె పూజలు, వ్రతాలు తప్ప అన్యం పట్టించుకోదు. తాను ఒంటరి అయిపోయినాడు! ఎవరున్నారు తనకు!

ఇలాంటి ఆలోచన్లే నిత్యమూ వస్తున్నాయి రామయ్యకు. సతమతం అవుతున్నాడు. ఏ పరిస్థితిలోనూ సారాయి వ్యాపారం వదులుకో దలచుకోలేదు. డబ్బు ఎంతైనా పాడేస్తాడు. డబ్బు ఒక లెక్క కాదు. లాభనష్టాలు తాను పట్టించుకోడు. సారాయి వ్యాపారం బలానికి చిహ్నం. పలుకుబడికి గుర్తు. దాన్ని వదులుకోడానికి వీల్లేదు. యాదగిరి ఆటలు సాగనివ్వటాకి వీల్లేదు. ఊళ్ళో మరొకడు తలెత్తడానికి వీల్లేదు. అందుకే ఎంతైనా పాడ్తాడు. వేలం పాటలు ఎప్పుడో తెలుసుకున్నాడు. ఇంతట్లో లేవన్నారు. అంతటితో తృప్తిచెందాడు. మళ్ళీ అట్టే ఆలోచించలేదు రామయ్య.

కాని రామయ్య అంచనాలు తల్లక్రిందులైనాయి!

యాదగిరి బండ్లో సారా జాడీలతో దిగాడు.

రామయ్య గుండెలో చిచ్చు పెట్టినట్లయింది. రక్తం తుకతుక ఉడికింది. ఇల్లంతా దద్దరిల్లేటట్టు అరిచాడు ముందు. తరువాత వెర్రిగా చూడ్డం, వెర్రిగా తిరగడం సాగించాడు - అయితే ఇంట్లోనే.

సుమతి గుండె పగిలింది. పడక గదిలో అడిగేసింది.

"ఏమండీ! అట్లున్నరు?"

"బాగనే ఉన్నగద"

మళ్ళీ ఎలాంటి కటువైన మాట వస్తుందో రామయ్యనుంచి అని మౌనం దాల్చింది.

రామయ్య సుమతినే చూస్తూ వుండిపోయాడు.

సుమతి ఊరుకోలేక పోయింది.

"ఎందుకట్ల పరేషానుంటరు?"

"ఆరుసవా? తీరుస్తవా?"

సుమతి నేలనుచూస్తూ ఉండిపోయింది. తల్లీ! నాకింత చోటివ్వరాదూ - ఈ రంపపుకోత తప్పుతుంది అనుకుంది మనసులో. అయినా మిన్నకుండలేక పోయింది.

"సారా దుకాణం సంగతేగదా!"

"ఊఁ."

"మనకెందుకండీ ఆ వ్యాపారం? ఉన్నది చాలదా? కాలుమీద కాలువేసుకొని తినవచ్చునే"

"ముండోలె ఇంట్ల కూచోమ్మంటవు! ఆ యాదగిరిగాడు పెత్తనం చేస్తడు. అట్లయితే నీకు సంతోషంగుంటదేమో?" అని చివాలున లేచిపోయాడు.

సుమతి దిండుమీదపడి ఏడ్చింది.

తెల్లవారి పట్నం ప్రయాణం కట్టాడు రామయ్య. కాలుకాలిన పిల్లిలా తిరిగాడు పట్నమంతా. అనేక మంది దగ్గరికి తిరిగాడు. అనేక రకాలుగా మాట్లాడాడు. తన

బలాన్ని వివరించాడు. తన కొక ఆశ్రయం కావాలని అర్థించాడు. మరొక మంత్రిని పట్టాడు. ఆ మంత్రికీ ఒక గ్రూపుకావాలి. ఊళ్ళల్లో బలంకావాలి. ఉన్నంతలో గట్టి పడాలి. బలరామయ్య పెరిగిపోతున్నాడు. అతన్ని అడ్డాలి. తను పెరగాలి. అందుకే రామయ్యా వీపునిమిరాడు. తన బలమంతా రామయ్యదే నన్నాడు. ఇక చెప్పమన్నాడు.

"బలరామయ్య పగబట్టిండు. సారా దుకాణం ఇంకోనికిప్పించిండు"

"అదెట్ల?"

"మాన్యాల పంచాయతీ అయింది. నన్ను ముంచెటందుకు వీరభద్రాన్ని చేరదీసిండు"

"వీరభద్రాన్ని చేరదీసిండులే!"

"అవుమల్ల! ఇప్పుడేమొ ఇట్ల చేసిండు"

"ఏం చేసిండు" పరాకుగా అడిగారు మంత్రిగారు.

కళ్ళప్పగించి చూశాడు రామయ్య.

"అదేందుండి అట్లడుగుతరు? సార దుకాణం ఇంకోనికి ఇప్పించిండని చెప్పితిగద."

"ఆఁ అయితే నన్నేం చెయ్యమంటరు?"

"నన్నడుగుతె నేనేం చెప్పుతమండి? మీరే ఆలోచించాలె. సార దుకాణం నా కిప్పించాలె. ఇగ నేను మీ మనిషినే అనుకోండి. నాకింద పది ఊళ్ళున్నయి. బలరామయ్యను అడుగు పెట్టనిస్తే చెప్పండి"

"ఆఁ. సరె. ఆబ్కారి పాటలయినాయా?" తాపీగా సిగరెట్ ముట్టించారు మంత్రిగారు. రామయ్యకూ అందించారు? కాని అతడు అందుకోలేదు.

ఏమిటీ మనిషి! ఎలా మంత్రి అయినాడు. ఒకవైపు కొంపలంటుకుంటుంటే అంత తాపీగా మాట్లాడ్తాడేం అనుకున్నాడు రామయ్య. కొంత కోపమూ వచ్చింది. అయినా ఏదీ కనిపించనీయలేదు.

"అదేగదనుండి చెప్పెడిది. వేలంపాట లేదు, బండలు లేవు, గప్‌చిప్‌గా యాదగిరి పేర రాసిను. పాటలయితే నేనే తీసుకొంటుంటిగద!"

"పెద్ద చిక్కేనే! మీకింద ఎన్ని ఊళ్ళున్నయన్నరు."

రామయ్యకు చిర్రెత్తింది. తానేమడుగుతున్నాడు? అతనేం వింటున్నాడు! బలరామయ్యే నయం అనుకున్నాడు.

"పది"

"పంచాయతు లున్నయా? ఎన్నికలు జరిగినయా?"

"ఇప్పటి దన్క లేకుండె. ఇగ పెడ్తరట"

"అందరు మనోళ్ళే వస్తరా?"

"అడుగుతారింక! సార దుకాణం ఇప్పించండి సాలిం. చునకే! ఒక్కడు పోత అనుకున్నరా!"

"అయితే ఏమన్నరు- పాటలు కాలేదు. సార దుకాణం ఇంకోడ్లకిచ్చిన్రు? అంతేగద"

"అంతేనుండి. సరిగ్గ అంతే. యాదగిరి కిచ్చిన్రు. అది మనకు రావాలె. ఇగ చూదండి తడాఖా"

"అంతేగద" అని ఆలోచనలో పడిపోయారు మంత్రిగారు.

మౌనంగా వుండిపోయాడు రామయ్య. అది మాటకు సంబంధించినంతవరకు. లోపల గుండె గుబగుబలాడుతూంది- ఏమంటాడో మంత్రిగారు. అని.

"ఆ డిపార్టుమెంటు నాదగ్గర లేదండి" సుదీర్ఘమైన మౌనాన్ని భంగంచేస్తూ అన్నాడు మంత్రి. ఇతర డిపార్టుమెంటులో జోక్యం కలిగించుకోవటం అంత మంచిది కాదు. బలరామయ్య గారితో చెపుదామంటే అతనికీ, మీకూ పడదంటిరి"

ఏడుపు వచ్చినంత పనైంది రామయ్యకు.

"అవన్నీ చెప్పితే మాకేం తెలుస్తయండి? ఎట్లనన్న మీరే చేయాలె. మీరెట్ల చెప్పతె అట్ల. మీ మాటకు చింతాకమందం జరగను"

"అది నిజమే ననుకోండి. పది ఊళ్ళ మనకు ఖాయమే నంటరా? పంచాయతీ విషయాలు చెప్పండి, మీరేదంటే అదేచేస్త."

"పని పడ్డప్పుడు తప్పుతాదుండి. ముందర ఇది చూడండి."

"ఎట్లచెయ్యాలె రామయ్యగారూ! చిక్కుసమస్య తెచ్చిపెట్టిన్రు" అని బెల్లు నొక్కాడు. ప్యూను వస్తే పి. ఏ.ను పిలవమన్నాడు. పి. ఏ. వస్తే రామయ్యతో "రెండు నిమిషాలు అవతల కూర్చుంటారా? మీ విషయమే ఆలోచిస్తం" అన్నాడు.

రామయ్యవచ్చి బయట కూర్చున్నాడు. సిగరెట్టుతీసి వెలిగించాడు. ముఖం పీక్కుపోయింది. గుండె దడదడలాడుతూంది. చుట్టూ చూశాడు. చాల మంది వున్నా రక్కడ. అందరూ తననే చూస్తున్నారు. అప్పుడు తెలిసింది రామయ్యకు, అందరినీ ఇక్కడే వుంచి మంత్రిగారు తనతో అంతసేపు మాట్లాడారని! అప్పుడు తన ప్రాముఖ్యం గుర్తించుకున్నాడు. కుర్చీలో స్థిమితంగా కూర్చుని గట్టిగా సిగరెట్టు దమ్ములాగి వదిలాడు. జనాన్ని చూస్తూ కూర్చున్నాడు. ఒకసారి జనాన్ని ఒకసారి మంత్రిగారి గది తలుపులనూ చూస్తున్నాడు. స్థిమితంగా ఉన్నాడు రామయ్య. లోలోపల గుబగుబలాడుతూనేవుంది.

మంత్రి గదికి ఉన్న అర తలుపులు తెరచుకుంటున్నాయి. మూసుకుంటు న్నాయి! కూర్చున్నవారిలో ఒక్కొక్కరే లోనికి వెళుతున్నారు-వస్తున్నారు. ఎంతకూ లోనికి వెళ్ళిన పి.ఏ. రాడు, రామయ్యకు పిలుపు రాదు. గుబులు ఎక్కువ అవు తూంది. గదివైపే చూపు నిగిడించి కూర్చున్నాడు.

స్వింగ్ డోర్ తెరుచుకుంది.

పి.ఏ. ఏవో ఫైళ్ళు చంకన పెట్టుకొని బయటపడ్డాడు-వెళ్ళేటప్పుడు రామయ్య వైపు చూసి చిరునవ్వు నవ్వాడు. అర్థం కాలేదు రామయ్యకు. అయినా పి.ఏ. వెంట

వెనుక బయలుదేరాడు. గదిలోకి వెళ్ళింతరవాత ఫైళ్ళు బల్లమీద పడేసి, కుర్చీలో కూర్చొని వళ్ళు విరుచుకున్నాడు పి.ఏ. అప్పుడే రామయ్యను చూచినట్లు నటించాడు.

"కూర్చోండి మీపేరు రామయ్యగారు కద"

"అవు. మీకెట్ల తెలుసు?"

"మా కన్ని తెలుస్తుంటాయి. మంత్రిగారు చెప్పిన్రు."

"అయితే ఎంత దనుక వచ్చింది" అని లాల్చీ జేబులో చెయ్యిపెట్టాడు. అది పాంటు జేబులోకి వెళ్ళిపోయింది. పి.ఏ. ముఖం వికసించింది. సర్దుకొని కూర్చున్నాడు. చేతులు రెండూ టేబిల్‌మీద పెట్టి కూర్చున్నాడు. రామయ్య అందించిన సిగరెట్టు కాల్చాడు.

"కేసు చాల చిక్కుగా ఉందండీ" తాపీగా అన్నాడు పి.ఏ.

"ఇంతకు ఏమైత దంటరు?" ఆతురత కనిపించింది రామయ్య ధ్వనిలో.

"మంత్రిగారు మీ విషయంలో చాల శ్రద్ధ తీసుకుంటున్నారు-సెక్రటరీని పిలిపించిన్రు."

"ఆయనెందుకు? మంత్రిగారు చేయలేరా?"

"చేస్తరు. చేయలేకకాదు. సలహా అడుగుదామని. సెక్రటరీని పిలవటమంటే సామాన్యం కాదు. మీ కేసులోనే పిలుస్తున్నరు. అదీ మంత్రిగారి కారు పంపించి"

"అట్లనా? అయితే పని అయిత దంటరా?"

ఇంతలో పి.ఏ.కు పిలుపువస్తే వెళ్ళిపోయాడు.

కాస్తసేపు గదిలో కూర్చుని బయటికి వచ్చాడు రామయ్య.

ఒక కారు వచ్చి ఆగింది. కారులోంచి ఒక సూటు మనిషి దిగాడు-అతనే సెక్రటరీ అనుకున్నాడు రామయ్య. వచ్చిన మనిషి గదిలోకి వెళ్ళాడు. పి.ఏ. బయటికి వచ్చాడు. రామయ్య పి.ఏ.ను అనుసరించాడు.

"సెక్రటరీగారు వచ్చారు. సంప్రదింపులు జరుగుతున్నాయి" పి.ఏ. చెప్పాడు.

ఇంత చిన్న పనికోసం అంత అడావుడి చేస్తున్నాడేం మంత్రి? చాతకాని వాణ్ని పట్టుకున్నా ననుకున్నాడు. అయినా బలరామయ్యకు ప్రత్యర్థి గ్రూపువాడు ఇతనే. వేరే లేదు అనుకున్నాడు.

ఇంతలో పిలుపు వచ్చింది. రామయ్య వెళ్ళాడు. మంత్రిగారు సెక్రటరీకి పరిచయం చేశాడు. రామయ్య కూర్చున్నాడు. చెప్పమన్నట్లుగా చూచాడు మంత్రి. రామయ్యను ఒకసారి కనుచూపుతో కొలిచాడు సెక్రటరి. తరవాత ఉర్దూలో మాట్లాడాడు.

"చూడండి! మంత్రిగారు మీకేసు విషయంలో చాలా శ్రద్ధ తీసుకొంటున్నారు. అయినా శాసనరీత్యా ఎక్కడా అవకాశం లేదు. ఒకే ఒక మార్గం తోచింది మాకు."

రామయ్య సర్దుకుని కూర్చున్నాడు, ఆశగా చూచాడు, శ్రద్ధగా విన సాగాడు.

"మీరు కోర్టులో కేసు వేయండి. వకీలుతో మంత్రిగారు మాట్లాడారు. "స్టే" యిస్తే యివ్వవచ్చు. అప్పుడు దుకాణం మూతపడుతుంది. మనం గెలిచినట్లవుతుంది."

ఉత్సాహం జారిపోయింది. బేలగా మంత్రిగారిని చూచాడు రామయ్య.

"మీరు కేసు వేయండి. మిగతా విషయాలు నేను చూసుకొంట" అని లేచి నుంచున్నారు మంత్రిగారు. "అర్జంటుగా ఒక మీటింగుకు వెళ్ళాలె" అని రామయ్య భుజంమీద చేయివేసి కారుదాకా వెళ్ళారు. కారు ఎక్కిం తరవాత "మీరు వకీలును చూడండి. పని జరిగిపోతుంది. అధైర్య పడకండి" అని చెప్పారు.

కారు స్టార్టయింది. జండా ఎగిరింది.

కారు సాగిపోయింది. జండా రెపరెపలాడింది.

రామయ్య కాళ్ళీడ్చుకుంటూ వకీలు దగ్గరికి వెళ్ళాడు. వకీలు ఆ ఫీజనీ, ఈ స్టాంపనీ, మామూళ్ళనీ, పర్యాదలనీ బాగానే లాగాడు. ఆ రోజు కోర్టులో పిటిషన్ వేశాడు. అది తెల్లవారికి విచారణకు వచ్చింది. సర్కారు వకీలు చాలా వాదించాడు వేలం అయిపోయినట్లు సాక్ష్యాలు, సుబూతులు ఉన్న కాగితాలు సమర్పించాడు. రామయ్య వకీలు కూడా గట్టిగానే వాదించాడు. న్యాయానికి ముప్పు వచ్చిందన్నాడు. ప్రభుత్వమే అక్రమాలు చేస్తే ప్రజల గతేంకాను అన్నాడు. నాయకులు సారా యిని రాజకీయాలకు వాడుకుంటున్నారు. అన్యాయం జరిగినవారు న్యాయమూర్తుల దగ్గరికి వచ్చారు. న్యాయభిక్ష కోరుతున్నారు. ఆలస్యంగా జరిగిన న్యాయం జరగనట్లే జమ. కాబట్టి "స్టే" ఇచ్చి న్యాయం కలుగజేయవలసింది అని విన్నవించాడు.

వకీలు రామయ్యవైపు చూచాడు.

రామయ్య ముఖం చేటంత అయింది.

న్యాయమూర్తులు "స్టే" ఉత్తరువు ఇచ్చారు.

రామయ్య కోర్టు బయటికివచ్చి, ఎగిరి గంతేశాడు. వకీలుతో హోటల్లోకూర్చుని అతనికి అర్థంకాని ప్రశ్న ఒకటి వేశాడు.

"ఆ వకీల్ను సర్కారు వకీలనిరి. మరి మీరుకూడా మంత్రిగారు చెప్పుతేనే వచ్చిరనుగద. మీరు సర్కారు వకీలు కారా?"

వకీలు నవ్వాడు!

వకీలు కోర్టుకు, రామయ్య మంత్రిగారి దగ్గరకు వెళ్ళారు. వార్త విని మంత్రిగారు సంతోషించారు. రామయ్య వీపు చరిచారు. రామయ్య పొంగిపోయాడు.

కారు ఊరుకు చేరింది. కోర్టు మనిషి దిగాడు. రామయ్య సగర్వంగా దిగాడు.

దిగి నిటారుగ నుంచొని ఊరిని చూచాడు. ఏదో హెచ్చరిస్తున్నట్లు చూచాడు. గెలిచి నట్లు చూచాడు. గెలవనున్నట్లు చూచాడు.

కాలిమీద ఏదో పడ్డట్లయింది. చల్లగా ఉంది. క్రిందికి చూచాడు.

కప్ప!!

కాలిమీద దూకింది. మళ్ళీ చెంగుమని యెగిరింది. మళ్ళీ ఒక గంతు వేసింది.

చూస్తూ ఉండిపోయాడు క్షణం. ఇంటివైపు తిరిగి మనిషి కోసం కేక వేశాడు. కుర్చీ తెప్పించుకుని వాకిట్లో వేయించుకొని కూర్చున్నాడు.

"యాదగిరి ఎట్లమ్ముతడో చూస్త" అన్నాడు. ఎవరిని గూర్చి అన్నాడో తెలి యక, ముందు నుంచున్న మనిషి తికమక పడ్డాడు.

"కోర్టు ఆర్డరు తెచ్చిన, కోర్టు ఆర్డరు" ఆకాశాన్ని చూచి అన్నట్లు అన్నాడు.

మనిషి చేతులు కట్టుకొని ముందు నుంచున్నాడు.

"నిలబడ్డవేమిరా లంజకొడక! కండ్లపడ్డలేదు. కోర్టు జవానొచ్చిండు. యాద గిరి ఇల్లు చూపించు" సుమారు గర్జించినట్టుగా అన్నాడు. మనిషి కదిలాడు, మనిషి వెంట జవాను కదిలాడు. ఇద్దరూ సాగిపోతుంటే చూచాడు రామయ్య. నవ్వాడు-కాదు - నవ్వుకున్నాడు.

"సారాయి దుకాణానికి సీలుపడ్డది" ఈ వార్త సురసురా పాకింది ఊళ్ళో. గ్రామంలో అశాంతిచ్ఛాయలు కనిపించాయి. ప్రతి ఇంటిలోనూ అదే విషయం చర్చ జరిగింది. రామయ్య దుర్జయుడా? అజేయుడా? అనుకున్నారు. దాంతోనే రామయ్య అంటే ఒక విధం అయిన భయం చేరింది.

యాదగిరికి చెళ్ళుమని చెంపమీద కొట్టినట్లయింది. తాను చేసినదంతా బూడి దలో పోసినట్లయింది. అసలు జరిగిందేమంటే రామయ్య వ్యాపారంచూచి ఆశ అంకు రించింది యాదగిరికి. పని సొంతంచేసి తానే సంపాదించి పెడ్తున్నాడు. జీతం డబ్బులు తన ముఖాన పారేసి బలం సంపాదించుకున్నాడు రామయ్య. తనకు వ్యాపారంలో భాగం ఇమ్మని అర్థించాడు. కాదనలేదు రామయ్య. కాని టలాయిస్తూ పోయాడు. ఏండ్లు గడిచాయి. ఎప్పుడూ వచ్చే సంవత్సరం అంటాడు రామయ్య. ఈ సంవత్సరం నిలదీసి అడిగాడు. ఇవ్వనని కచ్చితంగా చెప్పేశాడు. అక్కణ్ణుంచి పట్టుకుంది అతనికి మంట. మాన్యాల పోట్లాట మంచికేవచ్చింది. రామయ్య బల రామయ్యనుండి విడిపోయాడు. అదను కని పెట్టి ఆశ్రయించాడు యాదగిరి. ఆశ్ర యించడం శేషయ్యద్వారా. అందుకే అంత సులభంగా జరిగిపోయింది. వేలంపాట జరిగిందన్నట్లు రాసి యాదగిరికి దుకాణం ఇప్పించాడు బలరామయ్య. ఇప్పుడు ఇలా జరిగింది. గత్యంతరం కనిపించలేదు యాదగిరికి. పట్నానికి ఉరికాడు. శేషయ్యను చేరాడు. బలరామయ్య కాళ్ళుపట్టుకున్నాడు.

హైకోర్టుకు అప్పీలు చేశాడు.

మళ్ళీ తతంగం సొంతం నడిచింది.

క్రింది కోర్టువారి ఉత్తరువును కొట్టివేశారు హైకోర్టువారు. శాసనరీత్యా విచారణ సాగిస్తామన్నారు. కోర్టువారు సాగించడం ప్రారంభించారు కూడా.

యాదగిరి ఊళ్ళో దిగాడు-ఉత్సాహంతో దిగాడు. దుకాణపు సీళ్ళు బద్దలైనాయి.

సారాయి అమ్మడం సాగించాడు.

ఊరు రెండుగా చీలిపోయింది. ప్రతి దానికీ ఉడుకుడు సాగింది. పట్నానికి ఉరుకుడు సాగింది.

ఒకటి మంగమ్మ పార్టీ. రెండోది రామయ్య పార్టీ.

రెండూ వీరంగం వేశాయి. రెండూ వీరకృత్యాలు చేశాయి. రెండు గిత్తలు పోట్లాడుతున్నాయి. మధ్యన ముప్పు వచ్చింది లేగలకు.

* * *

నైజాం రాజ్యంలో స్థానిక సంస్థలకు స్థానం లేకుండింది. ప్రజలంటే బెదురు పవాబుకు! పంచాయితీ పాలన ఎలా వస్తుంది? 1306వ ఫసలీతో లోకల్ ఫండ్ సంఘాలు స్థాపించారు. వీటికి ఆదాయానికిగాను రెవిన్యూ వసూళ్ళలో రూపాయికి అణా చొప్పున వసూలు చేశారు. తాలూకా కమిటీలు, జిల్లా కమిటీలు స్థాపించబడ్డాయి. అవన్నీ సర్కారువే. ఎన్నికలద్వారా ఏర్పడినవి కావు. వాటిలో ప్రజలకు స్థానం కల్పించాలనీ ఎన్నికలు జరపాలనీ ఆందోళన సాగింది. 25 సంవత్సరాల తరువాత 6 ఖుర్దాద్ 132. ఫసలీన ఒక ఉత్తరువు ద్వారా ఎన్నికల పద్ధతి మంచిదని సిద్ధాంతీకరించబడింది. ఔరంగాబాద్, పర్భిణీ జిల్లా సంఘాలకు పరీక్షార్థం ఎన్నికలు అమలు జరుపుతామని వాగ్దానం చేసింది ప్రభుత్వం. అది వాగ్దానంగానే నిలిచిపోయింది.

అన్ని దానాల్లోకి వాగ్దానం సులభమైంది.

పోలీసు చర్య జరిగింది. రాష్ట్రం విశాలమైంది. ఇతర భాషలవారు విడిపోయారు. తెలుగువారంతా ఒక రాష్ట్రంలోకి వచ్చేశారు. తెలుగుల కలలు పండాయి. వెలుగులు వస్తాయని ఎదిరిచూశారు.

తొలి ఎన్నికలు జరిగింతరవాత క్రమంగా పంచాయితీ పాలన గ్రామాల్లో ఏర్పర్చసాగింది ప్రభుత్వం. రామయ్యకు పంచాయితుల మంత్రితో పరిచయం అయింది. మంత్రిగారికి విశ్వాసం కలుగజేశాడు రామయ్య. దాంతో ఆ ఊరికి పంచాయితీ ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. ఆ నిర్ణయం తొలుత తెలిసింది రామయ్యకే. రామయ్య గట్టిపడాలని తెలియ పరచాడు మంత్రి.

అనడం తేలికగానే అన్నాడు రామయ్య. కాని నిర్ణయం తెలిసిం తరవాత దిక్కు దిక్కు మన్నాడు రామయ్య. సుమారు ఊరు సొంతం శత్రువైంది. యాద

గిరి గట్టిపడ్డాడు. మంగమ్మ అతని అండననిలిచింది. తనకు బలం లేకుండా పోయింది. ఈ పరిస్థితిలో ఎన్నికలు వద్దని మంత్రిగారితో చెబుదామనుకున్నాడు. కాని తాను చెప్పిన గొప్పలన్నీ ఏంకాను? ప్రయోజనం లేదనుకున్నాడు. స్థిరంగా మంచొని బలాబలాలు తేల్చుకోవాల్సిందే ననుకున్నాడు.

రామయ్య ఆలోచిస్తున్నాడు. ఆలోచనే అతనికి భోజనం అయింది. ఏం చేయాలి? మతం పేర ఊరిని విడదీద్దామనుకున్నాడు. మస్తాన్ను సాయెబు క్రింద జమకద్దామనుకున్నాడు. తన దగ్గర హుసేను ఉన్నాడు. కులాల తగాదా తెద్దామనుకున్నాడు. తన కులం సంగతే స్థిరంలేదు. కొరివితో తల గోక్కున్నట్లు అవుతుందనుకున్నాడు. ఇగ మిగిలింది పార్టీల తగాదా. తనది ప్రభుపక్షం - అంటే యాదగిరీ ప్రభుపక్షమే అంటున్నాడు. ఏం చెయ్యాలి? తోచలేదు. పట్నం చేరుకున్నాడు. అక్కడా అతనికి అంత మంచి సలహా లబించలేదు. అలా అని కాదు, అసలతను చెప్పుకోలేక పోతున్నాడు.

పట్నంనుంచి పరపతి సంఘంతో దిగాడు రామయ్య. అప్పులిచ్చే సంఘం తెచ్చాడు. అందులో సభ్యులు కావలసిందని చాటింపు వేయించాడు. ఊళ్ళో గుసగుసలు బయలు దేరాయి. మస్తాను, మల్లయ్య ఇదొక ఎత్తుగడ అని ప్రచారం సాగించారు. సారాయి దుకాణంలో యాదగిరి సాగించాడు. అయినా ఒక్కొక్కరూ రావడం మొదలుపెట్టారు రామయ్య ఇంటికి. మొట్టమొదట వచ్చినవాడు నారయ్య. నారయ్యకు పరపతి సంఘంలో కొంత అధికారం యిచ్చాడు. అదికాక ఇల్లు బాగు చేసుకోవడానికి, పశువులను కొనుక్కోవడానికి డబ్బిచ్చాడు. నారయ్య మరి కొంత మందిని తెచ్చాడు. చేర్పించాడు. పరపతి సంఘం పెరిగిపోతూంది-దాంతో రామయ్య పరపతి పెరగసాగింది.

ఒకనాడు రామయ్య నారయ్యతో అన్నాడు :

"నారయ్యా! ఆ మస్తానున్నడు చూసినవా వానికి శాన పొగరున్నదయ్యా! ఎట్లయిన తుర్కకులంగద! ఇగ చూడు. ఎట్లనో అయింది-మా మనుషులు మస్తాన్ను కొట్టిన్రే అనుకో. పైకమియ్యమని నాయన చెప్పె. వచ్చి పట్కపోతే తప్పా? నేను పోవాల్నా వానింటికి? ఏమంటవ్?" అన్నాడు.

"అట్ల కాదుండి. యలమంద కొట్టిండని పట్కపోయిరి గదనుండి. ఇక పైకమేమిస్తరని ఊరుకున్నడేమో. లేకపోతే రాకపోయినాడుండి- వానికేమన్న బండ్లున్నయా? బంగ్లలున్నయా?"

"ఇగొ చూడు నారయ్యా! సర్కార్ సంగతులంటవా అవి వేరు - మనకేం అర్థమైతయి. ఊళ్ళో వాళ్ళంతా ఒక్కటిగ వుండాలె చూడు. పైక మిస్తగని జర మస్తాన్ను కదిలించిచూడు".

రామయ్య మాటప్రకారం మస్తాన్ను కదిలించాడు నారయ్య. "చావగొట్టి పైకం మొఖాన పారేస్తే సరిపోత దనుకున్నడా? మల్లి యలమంద నెందుకు పట్టి

చ్చిండు? నక్కజిత్తులున్నయి వానికాడ. నువ్వవాని చంకల దూరినవు. వాని తొత్తు వైనవు. నిన్నుకూడ ముంచుతడు" అన్నాడు మస్తాను.

నారయ్యకు ఎటూ తోచలేదు. కాని "రామయ్య తొత్తు" అన్నందుకు కోపం వచ్చింది. అయినా దిగమింగాడు. అది రామయ్య దగ్గర వెళ్ళకక్కాడు. రామయ్య మాత్రం తొణకలేదు.

"కడుపు మండినోడు ఎన్నన్న అంటడు" అని లోపలికివెళ్ళి డబ్బు తెచ్చాడు. "ఇగో చూడు ఈ వెయ్యి రూపాయిలు ఇచ్చెయ్యి. "వాడట్లన్నడని మనంకూడా అట్లనే అన్నమనుకో బాగుంటదా? యలమందను ఇడిపించెటందుకు ప్రయత్నం చేస్తనే ఉంటిని. పట్టిచ్చినోడు వాళ్ళ బలరామయ్యేగద! నన్నంటె ఏం లాభం?" అని డబ్బు అందించాడు.

నారయ్య కాస్త భయం, భయంగానే తీసుకొన్నాడు. అనుకొన్నంతా అయింది. డబ్బు నారయ్య ముఖాన కొట్టాడు మస్తాను.

"రామయ్య డబ్బిస్తే తీసుకోలేదటరో మస్తాను"

"తప్పయిందయ్యా! ఒప్పుకున్నడుగద! మరేంది మస్తాను?"

"నువ్వేమన్న అనెహె దొరబిడ్డ. దొరబిడ్డే"

ఇలాంటివే మరికొన్ని వ్యాఖ్యానాలు వినిపించాయి నలుగురు కలిసిన చోటల్లా.

రామయ్య తనలో తాను నవ్వుతున్నాడు.

నారయ్య కుర్చీలో కూర్చుంటున్నాడు. అతనిముందు ఒక టేబిల్ కూడా ఉంటూంది. అతనిది ఒక ఆఫీసు అయిపోయింది. అప్పుల కోసం వచ్చే జనంతో నిండిపోతూంది. వచ్చిన జనాన్ని ఒకసారి చీదరించుకున్నాడు. ఒక్కొకసారి మంచిగా మాట్లాడుతున్నాడు. ఏదో అధికారం వచ్చేసినట్లయింది అతనికి! అతన్ని జనం వదలడంలేదు.

అప్పులు పెట్టేవాడే ఆపద్బాంధవుడు!

మంగమ్మ ఇంట్లో ఆమె పార్టీవారు సమావేశం అయినారు - యాదగిరి కూడా వచ్చాడు. మస్తాను డబ్బు ముఖాన కొట్టినందుకు మురిసిపోయాడు.

"బాగ చేసినవే మస్తానన్నా! మంచిగ బుద్ధి చెప్పినవ్!" యాదగిరి మెప్పు.

"లేకుంటె ఏమనుకుంటుండో మనమేమన్న బిచ్చ మడుగుతాన్నమా!" మల్లయ్య వ్యాఖ్య.

"బాగనే ఉన్నది గని. ఈ అప్పు లిచ్చేది తెచ్చిండు. అదేంది మళ్ళ" మస్తాను సంశయం.

"దిక్కులేకుండ పోయిండుగద? మంచితనం కొనుక్కుంటాండు" యాదగిరి వ్యాఖ్య.

"సర్కారు డబ్బుతో కొంటున్నడులే" మస్తాను.

"సర్కారంటే మళ్ళ వాండ్లేగద, మనమా?" మల్లియ్య.

మంగమ్మ మౌనంగా కూర్చున్నది. మాట్లాడలేదు. ప్రకాశం నిద్రపోయాడు.

"అట్ల కూర్చున్నరు? మీరేం మాట్లాడరు?" యాదగిరి అన్నాడు.

"ఏం మాట్లాడాలె? నా కేమొ అయోమయం గున్నది! మళ్ళీ ఏదో ఎత్తు వేస్తున్నడు. జాగ్రత్తగుండాలె"

"ఏమేస్తడుండి? పడగ నేలకు కొట్టుకున్నడు. కోరలు ఊడ పెరికినం!" మస్తాన్ ఉత్సాహంగా అన్నాడు.

"ఎట్లనన్న పాము పామే పక్కలున్నది" మంగమ్మ హెచ్చరించింది.

"అట్లనే లేగి. చూస్తంగద ఎట్లెగురుతడో! బలరామయ్యదొర లేదుండి మన పట్టు" అన్న యాదగిరి లేచి నుంచున్నాడు. ముగ్గురూ నిర్గమించారు. మంగమ్మ మంచంలో వాలిపోయింది. ఆమెకు నిద్రమాత్రం రాలేదు. ఏవేవో ఆలోచనలు మునిరాయి. ఎన్నెన్నో ఊహలు తలెత్తాయి! తలలు వంచాయి.

ఒకనాడు అధికారులు జీపులో దిగారు. రామయ్య ఇంట్లో దిగారు. భూములు పంచడానికి వచ్చారనే పుకారు బయల్దేరింది ఊళ్ళో. జనం రామయ్య ఇంటిచుట్టూ కూడారు.

అధికారులు రామయ్య ఇంట విందులు కుడిచారు. గొలుసులతోనూ, కర్రల తోనూ బంజర భూములవైపు సాగిపోయారు. బంజర్లు కొలవడానికివచ్చారనీ ప్రజల కిచ్చేస్తారనీ అనుకున్నారు. జనం గుంపులు గుంపులుగా జీపులవెంట పరిగెత్తారు. రొప్పుతూ పరిగెత్తారు. చమటలు కక్కుతూ పరిగెత్తారు. ఆగకుండా పరిగెత్తారు. జీపును అందుకునేదాకా పరిగెత్తారు.

జీపులు ఆగాయి.

జనం ఆగారు.

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

ఒకడు రామయ్యను అడిగాడు: "భూములు పంచుతారండి! జర నా పేరు రాసుకోండి"

"పంచెటందుకే పిల్చుకొచ్చిన. అందరి పేర్లు రాసుకుంటం. అందరికిస్తం. వీరభద్రాన్ని అనుకున్నార్ర ఊరికె మాటలు చెప్పేటందుకు జర ఓపిక పట్టుండ్రి"

"అట్లనే దొరా! నాకు ఇద్దరు పోరలున్నరు. జర యాది పెట్టుకోండి. బాంచెను" అన్నాడు ఒకడు.

రామయ్య చిరునవ్వు నవ్వాడు.

గొలుసులతో ఈ మూలా, ఆ మూలా కొలవసాగారు అధికారులు. చుట్టూ చేరి చూస్తున్నారు ప్రజలు. కొత్తవారు చేర్తున్నారు. ఉన్నవారు కదలడంలేదు. వరుసలుగా నుంచున్నారు. వింత చూస్తున్నారు. కళ్ళల్లో ఆశతో. గుండెల్లో ఆరాటంతో చూస్తున్నారు. కనురెప్పలు ఆర్పకుండా చూస్తున్నారు.

సూర్యుడు నెత్తిమీదికి వచ్చాడు.

అలసిపోయిన అధికారులు చెట్లకింద చేరారు. రామయ్య ఇంటి నుంచి జీపు వచ్చింది. అది కుర్చీలు, బల్లలు, ఉపాహారాలు, కాఫీలు తెచ్చింది. అధికారులకు వడ్డించారు. సుష్టుగాతిని త్రేన్చారు. కాఫీలు తాగారు. సిగరెట్లు కాల్చారు.

జనం చూస్తూనే ఉన్నారు.

కన్నార్పకుండా చూస్తున్నారు.

అధికారులు మళ్ళీ కొలతలు సాగించారు. ఏమేమిటో రాసుకున్నారు. ఏవేవో గీతలు గీసుకున్నారు. సాయంకాలం కావడంతో బయలుదేరారు.

"భూమి ఇయ్యకపోతిరేముండి?" ఒకడు అడిగాడు.

అధికారి తెల్లముఖం వేశాడు.

"ఇస్తరు. లెక్కలు చేస్తున్నరు. ఎవరెవరికి ఎంతెంత ఇయ్యాల్నో చూస్తున్నరు" రామయ్య అందుకున్నాడు.

"అట్లనా?" అన్నాడు అడిగినతను.

ఆ రాత్రి మళ్ళీ గుసగుసలు, ముచ్చట్లు చర్చలు సాగాయి.

"రామయ్య భూములు పంచుతుడంట" అనేవార్త తెల్లవారి సర్వవ్యాప్తమైంది.

యాదగిరికి తేళ్ళు, జెర్రులు పాకినట్లయింది. మంగమ్మ అన్నమాట గుర్తుకు వచ్చింది. పట్నం పరిగెత్తాడు. శేషయ్యను పట్టుకున్నాడు. శేషయ్య బలరామయ్య దగ్గరికి చేరాడు. బలరామయ్యకూ అర్థంకాలేదు. కాని తనను మించిపోతున్నాడు రామయ్య అనుకున్నాడు. టెలిఫోన్లు గిరగిరా తిప్పాడు. అసలు రహస్యం తెలుసుకున్నాడు.

ఊరు గుప్పెట్లోంచి పోతుందనుకున్నాడు.

ఇసుకలా కారిపోతున్నట్లనిపించింది.

మంచులా కరిగిపోతున్నట్లనిపించింది.

శేషయ్యను అదోలాచూచాడు-"ఏం లాభం నీ కెంత చేస్తే?" అన్నట్లున్నాయి చూపులు.

శేషయ్య గ్రహించాడు. ఊరికి ఉరికాడు. కారు ఊళ్ళో ఆగింది. శేషయ్య, యాదగిరి దిగారు. శేషయ్య ఊరికిరాక చాలాకాలం అయింది. జనం చుట్టూకూడారు. అతడు రావటంతో ఊరి వాతావరణం మారిపోయింది. శేషయ్య దగ్గర చొరవవుంది. అసలు వేషమే వింతగా ఉంది. గ్లాస్గో పంచె, వదులైన సిల్కులాల్చీ, జాలపాలు, మెళ్ళో బంగారు గొలుసు, చేతిలో సిగరెట్ ప్యాకెటు-అగ్గిపెట్టె అన్నీ కలిసి నాటకంలో వేషంలా కనిపించాయి ఊరివారికి. బజారులో సాగుతుంటే బోలెడు జనం అతని వెంట. అందరితో మాట్లాడుతూ కరెన్సీనోటు చిత్తు కాగితాల్లా పారేస్తున్నాడు. సిగరెట్లకు అంతులేదు. పట్నంనుంచి ఊరిదాకా బ్రాందీ ప్రవహిం

చింది. పార్టీలు జరిగాయి. ఎవరు వచ్చినా కాదనలేదు—ఎందరు వచ్చినా అందించాడు.

మంగమ్మ ఇంటికి వెళ్ళాడు. యోగక్షేమాలు తెలుసుకున్నాడు. ప్రకాశానికి బహుమతులు తెచ్చి ఇచ్చాడు.

యలమంద ఇంటికి వెళ్ళాడు. ఓదార్చాడు. డబ్బిచ్చాడు.

మల్లయ్యఇంటికీ మస్తాను ఇంటికి వెళ్ళాడు. కావలసిన వన్నీ సమకూర్చాడు.

అసలు అతను వెళ్ళాల్సిన అవసరం లేకుండా పోయింది. అతని ఇల్లే ఎప్పుడూ జనంతో నిండి ఉంటూంది.

ఈ లోగా కుటీర పరిశ్రమల వ్యాను దిగింది. అది శేషయ్య వెనకే రావలసింది. కాస్త ఆలస్యం అయింది. అయినా వచ్చేసింది. వ్యానులో వచ్చిన అధికారి ఖద్దరుధారి-సౌమ్యుడు. అతడు జనానికి వితమర్చి చెప్పాడు.

"దేశసౌభాగ్యం గ్రామ సౌభాగ్యంమీద ఆధారపడి వున్నదన్నాడు మహాత్ముడు. గ్రామ సౌభాగ్యానికి కుటీర పరిశ్రమలు కీలకం-రాట్నం వడకటం, బట్ట నేయడం, చాప అల్లటం ఇటువంటివి. వీటికోసం ప్రభుత్వం డబ్బు సహాయం చేస్తుంది. ఇంటింటా కుటీర పరిశ్రమ వెలయాలె. మీరంతా దరఖాస్తులు పెట్టండి. మేం సహాయం చేస్తం."

వేలిముద్రలు వేశారనేకమంది. అవి తీసుకొని వ్యాను వెళ్ళిపోయింది. ఇంటింటికీ కుటీర పరిశ్రమ వచ్చినట్లే మురిసిపోయారు పల్లీయులు.

అన్నీ దొంగవేషాలే. కుటీర పరిశ్రమలులేవు. వాళ్ళు డబ్బివ్వరు అని ప్రచారం సాగించారు రామయ్య పార్టీ.

బంజర్లు పంచడంలేదు. బందులు లేదు అని ప్రచారం సాగించారు యాదగిరి పార్టీ.

పంచాయతీ ఎన్నికల విషయం ప్రకటన వచ్చేసింది. ప్రకటనతోనే యలమందను తీసుకొని దిగాడు రామయ్య. తానే విడుదలచేయించి తెచ్చానన్నాడు రామయ్య. యలమందా అదే నమ్మాడు. అలాగే ప్రచారం సాగింది. అసలు రహస్యం ఏమంటే నేరం రుజువుకాలేదు. వదిలేశారు. రామయ్య యలమందకు ఆశ చూపించాడు. పంచాయతి మెంబర్ను చేస్తానన్నాడు. యలమంద రామయ్యకు గులాం అయిపోయాడు. హనుమంతుడు రామచంద్రుణ్ణి పొగిడినట్లు పొగిడాడు. కులం వాళ్ళు పట్టుకున్నారు. నిలదీసి అడిగారు. అడుగుతే అన్నాడు:

"కొట్టినా పెట్టినా రామయ్య దొరేరా! ఎప్పుడైనా నీళ్ళున్న చెరువు కాడికి పోతే దప్పి తీరుతది. ఎండిన చెరువుల ఏముంటదిరా"

ముక్కుమీద వ్రేలేసుకున్నారు జనం. వార్త శేషయ్యదాకా పోయింది. శేషయ్య స్వయంగా యలమంద ఇంటికి వెళ్ళాడు. పొగ వేశాడు. అది పారింది.

యలమంద మారిపోయాడు- "భోగంముండకు పుట్టినోడు. వాని బొంద మనకే మిస్తడు?" అన్నాడు రామయ్యను గూర్చి.

యలమందే కాదు అనేకమంది అలా అటూ, ఇటూ మారుతున్నారు. 'ధన మూల మిదం జగత్.'

ప్రభుత్వానికి అమాంతంగా భక్తి పుట్టింది గ్రామంమీద. మెడికల్ క్యాంపు వచ్చింది. డాక్టర్లు దిగారు. గుడారాలు సిద్దం అయినాయి. నర్సులు వచ్చారు. జనం అంతా అక్కడ కూడింది. అందరినీ పరీక్షించారు డాక్టర్లు. అందరికీ రోగాలున్నా యని తేల్చారు. అందరికీ ఆకలి జబ్బేనని అర్థం చేసుకున్నారు. అయినా ఏవో మాత్రలిచ్చారు. ఇంజక్షన్లిచ్చారు. క్యాంపును ఎత్తుకొని వెళ్ళిపోయారు.

**ఆకలికి మందు వైద్యంలో లేదు. రాజకీయంలో ఉంది.**

సర్కారువారి బుర్రకథ దళం దిగింది. వారు జోరుగా బుర్రకథ చెప్పారు. కడుతున్న నాగార్జునసాగరం కావచ్చిందన్నారు. కాలువలు ఊరిదాకా రావలసిందే నన్నారు. వచ్చేసినట్టే చెప్పారు.

పంచాయతీ ఎన్నికల తేదీ ప్రకటించబడింది.

దాంతో సంచలనం బయలుదేరింది. ఊళ్ళో చాటింపు వేయించాడు రామయ్య. అదేమిటో అర్థంకాలేదు జనానికి.

"ఇకనుంచి కచ్చేరికి, గిచ్చేరికి పొయ్యేడిదిలేదు. మన తగువులన్నీ మనమే తీర్చుకుంటం" ఒకడన్నాడు.

"అన్నా! ఎరకలేక అడుగుత రామయ్య తీరుస్తడా?" మరొకడు అడిగాడు అతన్ని.

అతని విజ్ఞానం అంతవరకే. ఇద్దరూ దారిన పోతున్న యలమంద నడిగారు.

"అట్లకాదె. ఓట్లెయ్యాలె ఓట్లు! ఎవ్వరు గెలిస్తె వారు పెద్దయితరు. రామయ్యెందుకు మంగమ్మనే గెలిపిద్దం"

"అన్నా మా కే మెర్క. మట్టిగాని శేషయ్యా నేనే సర్కారంటాండె. అప్పు లిప్పిస్త మంటాండె. మల్ల రామయ్యా నేనే సర్కారంటాండె. భూము లిప్పిస్త మంటాండె. అసల్ సర్కార్ ఎవరె మళ్ళ?" అడిగాడొకడు యలమందను.

యలమందకు మాత్రం ఏమర్థమయింది? తల గోక్కున్నాడు. "మంగమ్మనే గెలిపించాలె" అని సాగిపోయాడు.

అడిగినవాడు బేలగా చూస్తూ ఉండిపోయాడు.

జనానికి క్రమంగా అర్థంకాసాగింది. దాంతో కాస్త వేడి మొదలయింది. ప్రచారాలు ముమ్మరంగా సాగాయి.

"భోగందాని కొడుక్కు ఓటెయ్యవద్దు" అటునుంచి ప్రచారం.

"మందికి కడుపు చేసుకున్న ముండకు ఓటెయ్యవద్దు" అటునుంచి ప్రచారం.

సిద్ధాంతాలు లేవు. పార్టీలు లేవు. ప్రజలు లేరు. దేశం లేదు. వ్యక్తిగతమైన దూషణలూ, నిందలూ, అపనిందలు ప్రారంభం అయినాయి.

మంగమ్మకు తల కొట్టేసినట్లుంది.

రామయ్యకు నిద్రపట్టడంలేదు. అతని ఆశలు రోజురోజుకూ జారిపోతున్నాయి. శేషయ్య ప్రతిభ ముందు తట్టుకోలేక పోతున్నాడు. అంచనాలన్నీ తల కిందులవుతున్నాయి. ఏంచేయాలో అర్థం కావడంలేదు. ఆలోచనలకు అంతు లేకుండా ఉంది. రోజులు దగ్గర పడుతున్నాయి. ఆరాటం ఎక్కువ అవుతూంది.

ఒకనాటి రేయి బాగా రాత్రి అయింది. ఊరు నిద్రపోయింది. చిమ్మన చీకటి. రామయ్య బయలుదేరాడు ఒంటరిగా. చేతికర్ర వుంది. వీధిలో సాగిపోతున్నాడు. గబ్బిలాలు ఎగురుతున్నాయి. గుడ్లగూబ కూస్తూంది. కీచురాళ్ళు రొద పెడ్తున్నాయి. చుక్కలు మిలమిల లాడుతున్నాయి. రామయ్యను గమనిస్తున్నాయి. రామయ్య సాగిపోతున్నాడు. ఆగకుండా నడచిపోతున్నాడు. చరచరా సాగిపోతున్నాడు. ఆగాడు. అది మంగమ్మ యిల్లు. నిలిచాడు చుట్టూ చూశాడు. ఎక్కణ్ణుంచో కుక్క పరిగెత్తి వచ్చింది. వాసన చూసింది. వెళ్ళిపోయింది. దూరంగాపోయి మొరిగింది. తరవాత ఏడ్చింది.

రామయ్య కదిలాడు, మంగమ్మ ఇంటి ఆవరణలో ప్రవేశించాడు. అటూ ఇటూ తిరిగాడు. తలుపు దగ్గర చెవిపెట్టి విన్నాడు. తలుపు తట్టాడు. మంగమ్మ నిద్రపోయిందా? మేలికతోనే ఉంది! విని ఊరుకుంది. మళ్ళీ తట్టిన చప్పుడు!

"ఎవరు?" అని లేచింది.

ఉలుకులేదు. మళ్ళీ తట్టిన చప్పుడు.

తలుపు తెరిచింది.

రామయ్య!!

క్షణం నోటమాట రాలేదు. తరవాత అరిచింది "ఎందుకొచ్చిన విక్కడికి మళ్ళీ? ఏం చెయ్యటానికి వచ్చినవు? పో ఇక్కణ్ణుంచి"

"గట్టిగ మాట్లాడకు. ప్రకాశం లేస్తడు. బాగుండదు. నేను నష్టం చెయ్యటానికి రాలేదు. ఒక్కమాట మాట్లాడిపోదామని వచ్చిన. జర బయటికిరా"

మంగమ్మ మాట్లాడలేకపోయింది. మంత్రం వేసినట్లు బయటికి నడిచింది. బావి దగ్గరికి తోవతీశాడు రామయ్య. అక్కడున్న చెట్టుకింద నుంచున్నాడు. మంగమ్మ వచ్చి నుంచుంది.

"చెప్పు ఎందుకొచ్చినవో? చంపడానికి వచ్చినవా? చంపు బతికి చేసెడిదే మున్నది?"

"తప్పు ఒప్పుకోటానికి వచ్చిన" తల వంచుకొని అన్నాడు రామయ్య.

"ఇప్పుడు ఒప్పుకొని చేసెడిదేమున్నది? చెయ్యాల్సింది చేసినవు. నువ్వేమి

ఒప్పుకోవద్దు. పో ఇక్కణ్ణుంచి. అంతేచాలు"అని గిరుక్కున వెనక్కు తిరిగింది- ఒక అడుగు వేసింది కూడా.

అడుగు ముందుకువేసి అడ్డుకున్నాడు రామయ్య. కాళ్ళమీద పడ్డంత పని చేశాడు.

"నన్ను నాశనం చెయ్యకు. నలుగురిలో బతకనియ్యి. నిన్ను ప్రకాశాన్ని పూలలో పెట్టి పూజిస్త" అన్నాడు.

"నిన్ను నేనేం నాశనం చెయ్యగలను? నువ్వు నన్ను నాశనం చేసినవు. నన్నేం చెయ్యమంటవు?"

"నువ్వు ఎన్నికల్లో నిలపడొద్దు" ఆ ప్రశ్నకోసమే ఎదిరి చూస్తున్నాడా అన్నట్లు జవాబు చెప్పాడు. తుపాకీలోంచి తూటావచ్చి తాకినట్లు తాకాయి ఆ మాటలు మంగమ్మకు. నిర్విణ్ణురాలై నుంచుంది క్షణం. ఆమెలో దుఃఖం పెల్లుబికింది. కోపం మండింది. మాట పెకల్లేదు.

"కాదంటే ఇక్కణ్ణే బావి ఉన్నది. నీ ఇంట్లోనే చస్తా. నీకే దక్కనియ్యి ఆ పేరు" అని బావివైపు నడిచాడు రామయ్య.

మంగమ్మ మనసు పనిచేయడం మానేసింది. మెదడు మొద్దువారింది. అయినా అడుగు ముందుకువేసి రామయ్యను లాగింది.

"నా ఇంట్ల ఎందుకు చస్తవు? నేను పోటీచెయ్యను. ఇగపో" కళ్ళవెంట నీరు ధారగా ప్రవహిస్తూంది.

"మంగమ్మా! నువ్వెంత మంచిదానివి? నీకే మియ్య మంటవు"

"నువ్వు నాకేమీ ఇవ్వవద్దు. ఇక్కడ్నుంచి పో, అంతేచాలు." ఉద్రేకంగానే అన్నది.

"అట్లనే పోతున్న. ప్రకాశంమీద ఒట్టు పోటీ చెయ్యొద్దు"అని వెళ్ళిపోయాడు. చీకట్లో కలిసిపోయేదాకా చూసింది మంగమ్మ. అక్కడే చితికిలపడి కూర్చుంది. ఆమెలో ఎలాంటి భావాలు రగిలాయో చెప్పడం కష్టం. కన్నీరు మాత్రం ఇగిరిపోయింది. శూన్యంలోకి చూస్తూ కూర్చుంది కొంతసేపు. లేచింది. బావిలోకి చూసింది. సాగిపోయింది. ప్రకాశాన్ని కావిలించుకొని పడుకుంది.

నామినేషన్ల రోజు రానే వచ్చింది.

క్రితం రాత్రినుంచే మొదలైంది రామయ్య దక్కు. అతని పక్షపు గెలుపు సుమారు మంగమ్మ మానుకోవడం మీద ఆధారపడివుంది. మంగమ్మ మానుకుంటుంది. మాట తప్పదు అనే ధైర్యం ఉన్నా రామయ్యగుండె దకదకలాడింది. ఆవిడ మానుకుంటుంది నిజమే ఆవిడను మానుకోనిస్తారా? మానుకోకుంటే తన పని ఏం కాను? తన పరువు ఏ గంగలో కలవను? అప్పుడు ఏంచేయాలి? ఇలాంటి ఆలోచనలే లక్షోపలక్షలుగా వస్తున్నాయి. పోతున్నాయి. వస్తున్నాయి. అయినా తన బలహీనత ఎవరికీ కనిపించనీయలేదు. నారయ్య, సైదయ్య, హుసేన్ మున్నగువారు

వచ్చేశారు. ఇగ బస్తీకి బయలువేరాలి. ''వాండ్లేం చేస్తరో చూద్దాం జర ఆగుండి" లోపలికి వెళ్ళిపోయాడు రామయ్య. ఇంటిముందు అరుగుమీద కూర్చొని తమకు రానున్న పెత్తనాన్నిగురించి చర్చించుకుంటున్నారు నారయ్య వగైరాలు. వారి ముందునుంచే జీపుపోయింది. అందులో శేషయ్య, మల్లయ్య, మస్తాన్ వగైరాలు న్నారు. వారు ఉత్సాహంగా ఉన్నారు. మంచి బట్టలు వేసుకున్నారు. మంగమ్మ ఇంటివైపు సాగిపోతున్నారు. వార్త అందించాడు రామయ్యకు నారయ్య. రామయ్య విసుక్కున్నాడు. కాస్త ఆగమన్నాడు. నారయ్య తల నేలకు వేసుకుని బయటికి వచ్చి కూర్చున్నాడు.

జీపు మంగమ్మ ఇంటిముందు ఆగింది. ఉషారుగా ఉరికారు అందులోని జనం మంగమ్మ ఇంట్లోకి. మంగమ్మ చాపమీద చతికిలబడి కూర్చొని ఉంది. జుట్టు చెదిరివుంది. కళ్ళు ఉబ్బి ఉన్నాయి. చీర మాసి ఉంది- చతికిలబడి కూర్చొని ఉంది.

మంగమ్మను చూశాడు శేషయ్య. లిప్తపాటు గుమ్మంలోనే నుంచుండిపో యాడు. తరవాత ఒక అడుగు ముందుకువేసి "ఇంకతయారుకాలే! జల్ది కానియ్యండి పోదం. అందరు వచ్చిన్రు" అన్నాడు.

"ఎక్కడికి?"

శేషయ్య అదోలా చూచాడు యాదగిరివైపు. చూపులో ఏదో సంశయం కని పించింది.

"అదేందుండి అట్లడుగుతరు? బస్తీకి పోవాలెగద నుండి" యాదగిరి ఆతురత కనబరచాడు.

"ఎందుకు?"

ఏమిటా ప్రశ్న అన్నట్లు మస్తాన్ను చూచాడు యాదగిరి.

''ఏమొ అట్లున్నరు? నామినేషన్లు గద ఇయ్యాళ బస్తీకి పోవద్దు?" మస్తాను అడిగాడు.

మౌనంగా కూర్చుంది మంగమ్మ.

ఇవతలవారు ఒకరిని ఒకరు చూచుకున్నారు. ఏమీ అర్థంకాలేదు. అంతా మంగమ్మను చూచారు.

"ఎళ్ళరేముండి జల్ది. యాళ్లైపోతున్నది" మల్లయ్య అనేశాడు.

''నేను రాను'' తల ఎత్తి మంగమ్మ స్థిరంగా చెప్పింది.

''అదేందుండి" అంతా ఒకసారే అన్నారు. కూర్చున్నారు.

"రాను బస్తీకి. నామినేషన్ వేయను" అందరినీ చూచి అన్నది. స్వరంలో నిశ్చయం వుంది.

శేషయ్య గుండె పగిలింది.

''అట్లంటె ఎట్లనుండి. ఇందాక వచ్చినన్క ఇప్పుడు కాదంటే నడుస్తాదుండి?" మస్తాన్ అన్నాడు.

"నా కట్ల అనిపించింది."

"అనిపించిందంటె అయిపోయినా దుండి? ఇంత చేసి ఇప్పుడు పిట్ల ముంచుత నంటే ఎట్లయితది" మల్లయ్య మాట.

"నేనే మంటున్న. నేను రానంటున్న. మిమ్ములనొద్దంటున్ననా?"

''ఈనకాసి నక్కలపాలు చేస్తారుండి. ఎందుకు రారు? మేమేమన్న తప్పు చేసినాముండి? అదన్న తేల్చుండి"

"నేనా మాట అన్నానా? మీరు వెళ్ళండి. వేసిరాండి."

"అదేందుండి అట్లంటరు? ఏమైంది? ఎందుకు రారు? అదన్న చెప్పండి"

"మల్లయ్యా నన్ను సతాయించకు. రానన్న గద."

"అట్లనా? మీరు రానన్నరుగద. మేం కూడా పోము. ఇంకెందుకు" అని అందరివైపు చూసి స్థిరంగా కూర్చున్నాడు మల్లయ్య.

"అంతే. మేంకూడా పోము" అన్నారందరూ.

శేషయ్యకు అంతా వింతగా కనిపిస్తూంది. గుండె గుబగుబలాడుతున్నది.

మంగమ్మ ముఖంలో అనేక తెరలుతెరలు గబగబా మారుతున్నాయి. మనసులో మధన పెరిగింది. మెదడు అటూ ఇటూ లాగుతూంది. అప్పుడు అర్థం అయింది రామయ్య ఎత్తుగడ. తాను విరమిస్తే అంతా విరమిస్తారని అంచనా వేశాడు, ఘనుడు! తాను మాట నిలుపుకోవాలా? వీరందర్నీ గోతిలోకి తొయ్యాలా? ఏం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? ఆమె మెదడు పెటపెటలాడుతూంది. మనసు కటకటలాడుతూంది.

మౌనంగా క్షణాలు గడుస్తున్నాయి. కాలం జారిపోతూంది. కరిగిపోతూంది.

? ? ? ?

అందరు మనసుల్లో ప్రశ్నార్థకాలే. ఆమె మనసులో అగ్గికొండ రగులుతూంది.

"మల్లయ్యన్నా! నా మాట విను. నన్ను బలవంతపెట్టకు. మీరు వెళ్ళండి. వేసిరాండి."

మల్లయ్యకు కొంత ధైర్యం వచ్చింది. ఆ మాటకు అందరికీ వచ్చింది.

"మంగమ్మక్కా! మంకుపట్టకు. లే. తయారుకా. నువ్వు రాకుంటే మేమూ పోము."

"మల్లయ్యన్నా" మాట బరువుగా ఉంది. దుఃఖపు మూటగా ఉంది. "చెప్పేది విను. నేను కాదంటున్ననా? మీ వెంటనె ఉంటగద. ఒక్కమాట వినండి. బలవంతం చేయకండి. మీరు వెళ్ళండి. నా మాట వినండి" కళ్ళు చెమ్మగిల్లాయి. మాట తడ

బడింది. లేచి లోపలికి వెళ్ళిపోయింది మంగమ్మ. కూర్చున్నవారు లేచి బయటికి వెళ్ళారు. దూరంగా నుంచొని మాట్లాడుకున్నారు.

"ఏమైందంటరు?" శేషయ్య ప్రశ్న.

"జగ్గయ్యన్న యాదికొచ్చి ఉంటది" మల్లయ్యకు అనుకోకుండా వచ్చినమాట అది.

"అట్లనే అయ్యుంటది" మస్తాన్ ధ్వనిలో గౌరవం వ్యక్తమైంది.

"ఎట్ల చెప్పుకుంటది పాపం! ఎంత ఘోష ఉన్నదో మనసుల" సానుతాపం వెల్లడించాడు యాదగిరి.

"ఏం చేద్ద మంటరు?" శేషయ్య ప్రశ్నలో ఆతురత కనిపించింది.

"ఎన్ని చెప్పినా పాయిదలేదు" మల్లయ్య జవాబులో ఆర్ద్రత కనిపించింది.

ప్రశ్నార్థకంగా అందరినీ చూశాడు శేషయ్య.

ఇంటి ముందునుంచే రామయ్య కారు సాగిపోయింది. అందులోని మనుషుల్ని గుర్తించారు వీరు. దాంతో అందరి గుండెలూ దడదడ లాడేయి.

"మనతోని వస్తదేమొ బస్తిదాకా అడుగుదం. వస్తె ఆడికిపాయెటొరుకు మార్తదేమో చూద్దం'' యాదగిరి జవాబు.

"బాగున్నది" అన్నారందరూ.

ఉమ్మడిగా మంగమ్మ నడిగారు. "వస్తా" అంది. అందరికీ ప్రాణాలు లేచి వచ్చాయి. మంగమ్మ నిముషాల్లో తయారైంది. జీపు బయలుదేరింది.

"జగ్గయ్యకు జోహార్. జోహార్
మంగమ్మకి జై జై"

అనే నినాదాలతో బయలుదేరింది జీపు. అంత ఉత్సాహంతోనూ బస్తీ చేరింది. ఆఫీసు ముందు నుంచొని వున్నాడు రామయ్య. మంగమ్మ జీపులోంచి దిగడం చూశాడు. గుండె పగిలింది. ముచ్చెమటలు పోశాయి. "ముంచింది ముండ" అనుకున్నాడు.

"మంగమ్మ నామినేషన్ వేయలేదు" వార్త ఒక్కటే వ్యాఖ్యానాలు అనేకం.

''మంగమ్మ నిలబడ్త లేదట!'' మంచినీటి బావికాడ ఒక మగువ మాట.

''ఏం నిలబడ్తది పాపం! జగ్గయ్య యాదికొచ్చిండట'' మరో తల్లి జవాబు.

''ఇయ్యాళ సభ చెప్పుతదట. అక్కా! జర కుండ ఎత్తు'' మరొక అమ్మ మాట.

రామయ్య ఇంట్లో సుమతి మరోరకంగా వ్యాఖ్యానించుకుంది. రామయ్య కోసమే విరమించుకుంది మంగమ్మ. మంగమ్మ ఉంది కాబట్టే తనను రాచి రంపాన పెడ్తున్నాడు రామయ్య. వాళ్ళిద్దరూ ఒకటె. పోట్లాట పైపైకే — నలుగురికీ చూప టానికి. రామయ్య వెళ్తున్నాడు. మంగమ్మను కలుస్తున్నాడు. అది నిజం. ఇలాంటి

ఆలోచనల అగ్గి తుంపర చిమ్మింది సుమతిలో. ఆమెకు శాంతి లేకుండా అయింది. చిరచిరలాడడం ఎక్కువైంది. ఆ రోజు గుడికి పోలేదు.

ఆ సాయంకాలం బహిరంగసభ జరిగింది. ఊరు బయట స్కూలు దగ్గర. ఆ వార్త ఊళ్ళో సంచలనం కలిగించడాన జనం బాగా వచ్చేశారు. సుమారు ఊరంతా అక్కడే ఉందని చెప్పవచ్చు. సభ ప్రారంభం అయ్యేవరకు చీకటి పడింది. క్రమక్రమంగా చీకట్లు చిక్కపడసాగేయి. చాకళ్ళు దివిటీలు వెలిగించి పట్టుకున్నారు. అయినా ఆ వెలుగు చీకట్లను మింగలేకపోతూంది.

"రామయ్య యాడినుంచి వచ్చిండు?" ప్రశ్నతో ప్రారంభించింది ఉపన్యాసం మంగమ్మ.

"దొంగసొమ్ము నుంచి" ప్రజలనుంచి జవాబు.

"సాయుధ పోరాటం నుంచి పారిపోయి వచ్చిండు. ప్రజల సొమ్ము ఎత్తు కొచ్చిండు. దాంతోటి పెద్దోడైండు. కరణం భూమి కాజేసిండు. కద్దరు కట్టిండు. నాయకుడైండు. గుడిసెలకోసం ఇచ్చిన డబ్బు మింగిండు. మాన్యాలు మింగాలని చూసిండు. మీరంతా ఎదిరించిన్రు. ప్రజారథం నడిపించిండ్రు. గెలిచిన్రు. ఇప్పుడు ఇంకో వేషంతో వచ్చిండు. గెలిపిస్తరా?"

"గెలిపించం. ఓడిస్తం" కేకలు జనంలోంచి.

బయట నుంచి టపటపా రాళ్ళు పడ్డాయి. క్రమంగా రాళ్ళ వర్షం సాగింది. ప్రజలు ప్రతీకారం తీసుకుంటామన్నారు. అరిచారు. కేకలు పెట్టారు. చుట్టూ ఉరి కారు. వెదకారు. ఏమీ కనిపించలేదు. దుండగులు పారిపోయారు. అయినా సభ మళ్ళీ సాగలేదు.

మంగమ్మ మంచంలో పడి ఉందేగాని నిద్ర రావడంలేదు. రామయ్యకు తాను మాట ఇచ్చింది. ఎందుకు? ఒక ప్రాణిని రక్షించడానికి! ఒక మనిషిని కాపా డ్డానికి. రామయ్య మనిషా? రాక్షసుడ్ని కాపాడిందా? పామును చంకన పెట్టుకొన్న ట్లుంది స్థితి. ఒకసారి తాను కాలుజారింది. తప్పే చేసింది. రామయ్య విషం చవి చూసింది. మళ్ళీ వాడు విషం అందించాడు. తాను మనిషి! నమ్మింది. మార్పు వచ్చిందనుకుంది. ఏదీ? తాను విరమించుకుంది. రామయ్య రాళ్ళెందుకు కొట్టిం చాడు. రామయ్య మారలేదు. మారడు. ఇప్పుడు తెలుసుకొని ఏం లాభం? గతజల సేతుబంధనం! తాను నామినేషను వేసిఉండాల్సింది. అది గడచిన విషయం. ఇప్పుడేం చేయాలి? ఏం చేయాలి? ఏం చేయాలి?

ఆలోచనల ఆరాటంలో అర్ధరాత్రి అయింది. ప్రకాశానికి నిండుగా కప్పింది. లేచింది. తలుపు తీసింది. బయటికి వచ్చింది. తలుపు వేసింది. చుట్టూ చూసింది. కీచురాళ్ళ రొదతప్ప ఏమీ వినిపించలేదు. ఆకాశంలో చుక్కలు మాత్రం మెఱుకు వతో వున్నాయి. అడుగులు ముందుకు వేసింది. సాగిపోయింది. చీకట్లను చీల్చు కుంటూ పోతూంది. అయినా అవి వెంటనే వస్తున్నాయి. పోతున్నదే చీకట్లోకి.

రామయ్య ఇల్లు వచ్చేసింది. గుండె దడదడ కొట్టుకోసాగింది. రామయ్యను నిలదీసి అడగాలని బయల్దేరింది. తలుపు తట్టింది. జవాబు లేదు. అదేం మంగమ్మ ఇల్లా వెంటనే వినిపించడానికి. మళ్ళీ తట్టింది. మళ్లీ తట్టింది. ఊహూఁ పలుకులేదు. తప్పు చేస్తున్నానని ఎక్కడో ఎవరో చెప్పుతున్నట్లనిపించింది. మెట్లు దిగింది. ఏదో సాధించాలనుకుంది మళ్ళీ. తేల్చివేయాలనుకుంది. మళ్ళీ మెట్లెక్కింది. తలుపు తట్టింది. ఎక్కడో అడుగుల అలికిడి వినిపించింది. చీకట్లో దర్వాజాకు కరచుకొని నుంచుంది. గుండె గుబగుబ లాడింది. నాలుగు వైపులా చూచింది. ఏమీ కనిపించ లేదు.

తలుపు తెరుచుకుంది.

సుమతి వచ్చింది. మంగమ్మను చూచింది. మండిపోయింది.

''సిగ్గులేదు. ఇంటికి కూడా రావటం మొదలు పెట్టినావు? ఛీ ఎందుకీ బతుకు? ఎందులోనన్న పడి చావరాదూ'' అని కాండ్రించి నేలమీద ఊసి దఢాల్న తలుపు వేసుకుంది.

మంగమ్మ బొమ్మలా నుంచుంది.

ఎక్కణ్ణుంచో ఆ మాటలు ఇంకా వినిపిస్తున్నట్లే ఉంది. ఆమె మనసులో ఎన్ని తుపానులు రేగాయో! ఎన్ని దావానలాలు రగిలాయో? కాని మాట్లాడలేక పోయింది. దుఃఖం పొంగివచ్చింది. ముఖానికి చేతులు అడ్డం పెట్టుకుంది. ఏడవా అనుకొంది. ఏడుపు రాలేదు.

ఎక్కడో అలికిడి వినిపించింది.

గబగబా మెట్లు దిగింది. ఇంటివైపు పరిగెత్తింది. ఇంట్లోకిదూరి తలుపు వేసు కుంటుండగా పిలుపు వినిపించింది.

''మంగమ్మక్కా''

వెనక్కు తిరిగి చూచింది.

మల్లయ్య?!

''మల్లయ్యన్నా'' అని చతికిలపడి బావురుమంది. కళ్ళవెంట ధారాపాతంగా నీరు వస్తూంది.

''చూచినమ్మా! అన్నీ చూచిన- విన్న. నువ్వు పిచ్చిదానివి'' అని తలనిమిరి ఓదార్చాడు.

''వింటడనుకొని పోయిన్నన్నా'' మళ్ళీ ఒక తరంగం పొంగింది.

''పిచ్చితల్లీ, వాడు వింటడా?''

అలాగే తెల్లవారింది.

రాత్రి మంగమ్మ రామయ్య ఇంటికి వెళ్ళింది. ఈ వార్త సుమతి ద్వారా రామయ్యకూ, రామయ్య ద్వారా నారయ్యకూ, అతని నుంచి ఊళ్ళోకి పాకింది. గుసగుసలు సాగాయి. తరవాత బహిరంగంగానే చర్చ సాగింది. శేషయ్యకు కూడా

అనుమానం కలిగింది. మంగమ్మ నామినేషన్ వేయకపోవడానికి కారణం అప్పుడు అర్థం అయినట్లనిపించింది. మంగమ్మను అడిగాడు కూడా. జవాబేం చెపుతుంది? బేలవలె చూసింది. మల్లయ్య వివరించి చెప్పాడు. అయినా అంతగా నమ్మలేదు — అతనే కాదు అనేకమంది.

నిజం నమ్మే జనం తక్కువ!

స్కూలు నుంచి వచ్చిన ప్రకాశం పుస్తకాలు మూలకుకొట్టి అడిగాడు "అమ్మా! రామయ్య ఇంటికెందుకు పోయినవు రాత్రి" అని.

మంగమ్మ బిత్తరబోయి చూసింది. తన కొడుకు చిట్టి ప్రకాశం చిన్ని బాబు కూడా తనను అడుగుతున్నాడు!

"చెప్పవేం ఎందుకు పోయినవు?" అధికారం కనిపించింది ప్రకాశం స్వరంలో.

మంగమ్మకు దుఃఖం ముంచుకొని వచ్చింది. "బాబూ" అని ప్రకాశాన్ని కౌగలించుకుని ఏడ్చేసింది. పెద్దగ ఏడ్చేసింది. ఎక్కిళ్ళు వచ్చేదాకా ఏడ్చింది.

ప్రకాశం పిచ్చివానిలా తల్లిని చూచాడు. "అమ్మా! ఏడవకు" అని అతడూ ఏడ్చేశాడు. మస్తాన్ వచ్చి ఓదార్చాడు.

"మస్తానన్నా! ప్రకాశంకూడా అడుగుతున్నాడు" మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది. పైటచెంగుతో కళ్ళు తుడుచుకొని మస్తాన్ను చూసింది. నువ్వన్నా చెప్పమన్నట్లున్నాయి చూపులు.

"నాయనా ప్రకాశం" అని ప్రకాశాన్ని దగ్గరికి తీసుకొని తొడమీద కూర్చోపెట్టుకున్నాడు మస్తాను. "లోకం విచిత్రం అయింది బాబూ! మంచి చేసిన వాళ్ళను దుర్మార్గులంటుంది. కొంపలు కూల్చేవాడ్ని నమ్ముతుంది. గొర్రె కసాయివాణ్నే నమ్ముతుంది. బాబూ! మీ అమ్మ దేవత నాయనా. ఆమెను అర్థం చేసుకోవడం కష్టం. నిన్న సభలో అల్లరి జరిగింది కదా. అది రామయ్య చేయించిందని తెలుసుగా. రామయ్యకు చెప్పి ఇటువంటి వాటికి దిగవద్దని చెప్పుదామని వెళ్ళింది. ఊరు ఇట్ల ఆడిపోసుకుంటున్నది."

"అమ్మా! నువ్వు దేవతవా? దేవతలు ఆకాశంలో ఉంటరట గద"

బిడ్డ అమాయకత్వానికి నవ్వు వచ్చింది మంగమ్మకు. కొడుకును కావిలించుకొని ముద్దులు కురిపించింది.

ప్రకాశం కొంత వెలుగు రేఖ చూపించిన మాట వాస్తవం. అయినా అది మంగమ్మలోని చీకటిని మింగలేకపోయింది. ఆమె గుండెలో అనంతమైన సాగరాలు పొంగుతున్నాయి. పొర్లుతున్నాయి. అట్టడుగున ఎక్కడో దావానలం రగులుతూంది.

ఏం తప్పు చేసింది తాను? సుమతికి తాను పూచిక పుల్లంత అపకారం చేసిందా? ఎందుకు తానంటే అంత కసి? రామయ్యకు తానంటే అంత పగ ఎందుకు?

ఏం చేసింది తాను? తానే నాశనం అయింది. అతణ్ణి కాపాడింది. అదా తాను చేసిన నేరం? చేయని నేరాలకు ఎందుకిలా శిక్షిస్తాడు? ఎక్కడుంటాడా దేవుడు? నిలదీసి అడుగుతే బావుండును. వాడూ డబ్బులోనే ఉంటాడు. అన్యాయాలనూ, అక్రమా లనే బలపరుస్తాడు. అసలు వాడు ఉన్నాడా? తాను నమ్మింది ప్రజలను. వారు ఉన్నారు. తనను శంకిస్తున్నారు? వారికి తానేం చేసింది? ఎందుకిలా తనమీద దుమ్ముపోస్తారు? ఇలాంటివే అనేక ఆలోచనలు మనసులో మసలాయి. మనసు మసిలిపోతూంది. మనిషి క్రుంగిపోతూంది.

అది గమనించే రంగంలోకి లాగారు మస్తాన్, మల్లయ్యా మంగమ్మను - మనసు మళ్ళించడానికి. కార్యరంగంలోకి దిగిం తరవాత క్రమంగా అన్నీ మరిచి పోయింది మంగమ్మ. ప్రజలను అని లాభం లేదని తెల్సుకుంది. వారి అమాయకత చూసి బాధ పడింది. పూర్తిగా పనిలో మునిగిపోయింది. నడుంకట్టి ప్రచారానికి దిగింది. ఇంటింటికీ వెళుతూంది. పరిస్థితులు విడమర్చి చెపుతూంది. ఉపన్యాసా లిస్తూంది. ఉక్కిరి బిక్కిరి అవుతూంది.

ఎన్నికల రోజు దగ్గర పడుతూంది. ఆ రోజు రాత్రి ఊరేగింపు తీయాలని నిశ్చయం అయింది. కాగడాల ఊరేగింపుతో కదలాలని తీర్మానించారు. రామయ్య గుండెల్లో అగ్గిరువ్వాలని నిర్ణయం అయింది.

జనం మంగమ్మ ఇంటిముందు కూడుతున్నారు. ఒక్కొక్కరి చేతిలో ఒక్కొక్క కాగడా మండుతూంది. వందలు, వేలు జనం కూడారు. ఊరంతా కదిలింది. రామయ్య గుండెలో గునపం గుచ్చుకొంది.

జనం బారులు తీరారు. వెలుగుల బారులు, తెలుగుల బారులు! ముందు పతాకం ధరించాడు మస్తాన్. పక్కన మంగమ్మ. వెనుక మల్లయ్య, యలమంద.

"మంగమ్మ - జిందాబాద్"
"ఇన్కిలాబ్ జిందాబాద్"
"పల్లెలు ప్రజలవి"
"దున్నేవానిదే భూమి"
నినాదాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.
రామయ్య గుండెలో తూట్లు పడుతున్నాయి.

ఊరేగింపు సాగింది. కాగడాలు కదిలాయి. ఉత్సాహం ఉరకలు వేసింది. ఉద్రేకం పొంగులు వారింది. పదం పాడారు.

"ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు.
ఒక నెత్తుటి బొట్టులోనె
విప్లవాగ్ని ప్రజ్వరిల్లు"

వేల గొంతుల్లో పాడుతున్నాయి. వేల అడుగులు పడుతున్నాయి. వేగంగా సాగుతున్నాయి. విలయం వలె, ప్రళయం వలె కదలుతున్నారు జనం.

"రామయ్య దౌర్జన్యం- నశించాలె"

దిక్కులు పిక్కటిల్లాయి.

లిప్తలో జరుగరానిది జరిగిపోయింది.

ఏ మూల నుంచి వచ్చారో మస్తాన్ తలమీద బలంగా బాది పారిపోయారు దుండగులు.

మస్తాన్ తల సగానికి పగిలింది.

మంగమ్మ మీదికి ఒరిగిపోయాడు.

మంగమ్మ వంటినిండా రక్తంతో కూలబడిపోయింది.

కన్నుమూసి కన్ను తెరిచేవరకు జరిగిపోయింది.

మస్తాన్ పలక లేదు. ప్రాణాలు లేచిపోయాయి.

జనం చిత్తరువులా నిలిచి చూశారు. తరవాత హాహాకారాలు చేశారు.

మంగమ్మ మస్తాన్ను చూసింది. రక్తం చూసింది. తనను చూసుకొంది. జండా లాక్కుంది. నివంగిలా లేచింది.

"శాంతికి, సహనానికీ ఒక హద్దున్నది. పదండి. ఇవ్వాళ తేలిపోవాలె. రక్తానికి రక్తం. రామయ్య రక్తం కళ్ళచూడాలె" గర్జించింది మంగమ్మ. ముందు ఉరికింది మంగమ్మ.

"రక్తానికి రక్తం" నినాదాలు పిక్కటిల్లాయి.

జనం ఉరుకుతున్నారు.

కేకలు, పెడబొబ్బలు, అరుపులు కల్లోలంగా ఉంది. రక్తం సలసల కాగిపోతూంది. ముక్తికోసం ఉరుకుతూంది జనం.

రామయ్య ఇంటికి చేరారు.

అరుపులు, కేకలు, హాహాకారాలు అల్లరిగావుంది. కర్ర, రోకలి, గునపం, పార అన్నీ వచ్చేశాయి. తలుపులు బద్దలవుతున్నాయి. ఇంటిముందు కారు కనిపించింది జనానికి. చెత్తగా కొట్టేశారు.

"ఒక వీరుడు మరణిస్తే
పదివేలుర ప్రభవింతురు''

పదంతోపాటు గునపాలు పడుతున్నాయి. తలుపులు కదులుతున్నాయి.

రామయ్య గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకొని కూర్చున్నాడు.

సుమతి బిక్కుబిక్కు మన్నట్లు చూస్తూంది.

గాంధీ పెద్దగా ఏడుస్తున్నాడు. సుమతి అతని నోరు నొక్కి పట్టింది.

బయట కల్లోలం. కేకలు, అరుపులు, నినాదాలు - రక్తానికి రక్తం.

తలుపులు విరిగాయి. కట్ట తెగిన ప్రవాహంలా లోనికి ఉరికింది జనం. మరో తలుపు. అదీ బద్దలవుతూంది. విరిగిన తలుపులు బయటికి లాగారు. నిప్పంటించారు.

కారు తగలబడుతూంది.

తలుపులు తగలబడుతున్నాయి.

మంటచుట్టూ జనం ఎగురుతున్నారు.

"రక్తానికి రక్తం, రామయ్య రక్తం చూస్తాం"

రెండవ తలుపు విరిగింది "కరకరా" అని.

హెూ అని జనం అరిచారు.

వెనుక నుంచి తుపాకులు పేలాయి.

"పోలీసు వచ్చింది. పోలీసు వచ్చింది" ఎవరినోట విన్నా అదేమాట. పోలీసులు లారీలోనుంచి దిగారు. లాఠీ అందుకుని బాదసాగారు. జనం ఉరికారు. సందులు, గొందులు, ఇండ్లు, ఎక్కడున్నా బాదారు పోలీసులు. నిముషాల్లో ఊరు నిర్జనం అయింది.

కారు మండుతుంది.

తలుపులు కాలుతున్నాయి.

దివ్వెటీలు చెల్లాచెదురుగా పడివున్నాయి.

ఊరంతా శ్మశానంలా ఉంది.

ఊరెమఫ్య మస్తాన్ శవం రక్తంలో మునిగి తేలుతుంది. దాన్ని లారీలోవేసి తీసికెళ్ళారు కొందరు పోలీసులు.

ఊరు పోలీసులతో నిండిపోయింది.

రామయ్య ఇల్లు అధికారులతో కళకళ లాడింది.

తెల్లవారింది.

గ్రామం శవాన్ని పారేసిన ఇల్లులా ఉంది.

పోలీసులు గస్తీ తిరుగుతున్నారు.

ప్రజలు బయటికి రావడానికి జంకుతున్నారు. ఒక్కొక్కరే చెంబులు పట్టుకొని పోతున్నారు. అందరి కళ్ళల్లో గుండెల దడలు కనిపిస్తున్నాయి.

ఊరు మెల్లగా ఊపిరి పోసుకుంటూంది.

ఎండ క్రమంగా ఎక్కుతూంది.

పోలీసు జీపు రామయ్య ఇంటి నుంచి బయలుదేరింది. జనం దాని వెంట పోగారు. జీపు మంగమ్మ ఇంటి ముందు నిలిచింది. అధికారులు దిగారు. ఆవరణతో చేరారు. జనం కూడారు.

"మంగమ్మా!" పిలిచాడు అధికారి.

మంగమ్మ బయటికి వచ్చింది. కళ్లు ఉబ్బి ఉన్నాయి. జుట్టు చిందర వందరగా ఉంది. అలసిపోయిన శక్తిలా ఉంది. ఓడిపోయిన దేవతలా ఉంది. వచ్చి చూసింది.

పోలీసులు!

స్థిరంగా నుంచుంది. చిరునవ్వు నవ్వింది.

''మంగమ్మవు నువ్వేనా?''

''మహాశక్తిని. మంగమ్మను నేనే'' గర్జించింది మంగమ్మ.

పోలీసులు బెదిరారు.

ప్రజల ముఖాలు వికసించాయి.

ప్రకాశం వచ్చి తల్లి చేయి పట్టుకొని నుంచున్నాడు.

''నిన్ను అరెస్టు చేయటానికి వచ్చినం''

''ఊఁ కానియ్యండి'' చేతులు ముందుకు చాచింది.

ఎంత నిర్భయంగా అంటూంది అనుకున్నాడు పోలీసు అధికారి.

ప్రకాశం తల్లిచేయి ఓడిచి ఎడంగా నుంచున్నాడు.

అధికారి ఆజ్ఞాపించాడు. పోలీసు ముందుకు వచ్చి బేడీలు వేశాడు.

మంగమ్మ చేతులెత్తి బేడీలను చూసుకుంది.

పక్కకు చూసింది. ప్రకాశం గంభీరంగా నుంచొని ఉన్నాడు - తల్లి చూపులు చూశాడు. బావురు మన్నాడు. పరిగెత్తి వచ్చి తల్లి కాళ్ళను చుట్టేసుకున్నాడు.

మాతృ హృదయం పొంగింది.

''బాబూ'' అని కావిలించుకోబోయింది. సంకెళ్లు గలగలమన్నాయి. వంగి తల ముద్దుపెట్టుకొంది. కన్నీరు టపటప రాల్చింది. తల్లిని చూశాడు ప్రకాశం. ''అమ్మా!'' అని బిగ్గరగా అరిచి మరింత గట్టిగా కాళ్ళు పట్టుకున్నాడు.

''అమ్మా! పోతవా? మరి నేను....'' గుండెలు ముక్కలు చేసే మాటలవి-కేక అది.

''ఎవరికి అప్పగించి పోను....''

మంగమ్మ మాట పూర్తి కాకుండానే మల్లయ్య వచ్చాడు ముందుకు. కండువాతో కన్నీరు తుడుచుకుంటూ-

"మంగమ్మ తల్లీ! అట్లనకు. మేమంతా లేమా అమ్మీ" కష్టంగా మాటలు పెగిలివచ్చాయి. కన్నీరు కాలువ కట్టింది.

శేషయ్య చేతిలోని సిగరెట్టు పెట్టె పడిపోయింది. ముందుకు నడిచాడు. కళ్ళలో నీరు నిండింది.

''మంగమ్మా! అట్లనకు. మేమంతలేమా'' తరవాత మాట పెకల్లేదు.

యలమంద పెద్దగా ఏడుస్తూ ఉరికి వచ్చాడు. మంగమ్మ కాళ్ళమీద పడ్డాడు.

''తల్లీ అట్లనకు. మేమంతలేమా? చచ్చినమా? జగ్గయ్య మా కోసం చచ్చె. నువ్వు మా కోసం జేలుకు పోతుంటివి. బిడ్డను నాకిచ్చిపో తల్లీ! దొరోలె సాదుత పూలల్లో పెట్టి సాదుత'' పెద్దగా ఏడ్చుకుంట అనేశాడు యలమంద.

పోలీసు అధికారికి డ్రెస్సు విడిచి పారేసి వెళ్ళిపోవాలనిపించింది. అయినా అది చేయలేదు. జేబు రుమాలుతో కళ్ళు తుడుచుకొంటూ పెద్ద పెద్ద అంగలు వేస్తూ సాగిపోయాడు. జీపులో కూర్చొని స్టీరింగుకు తల ఆనించాడు.

మల్లయ్య ఏడుస్తున్నాడు.

యలమంద ఏడుస్తున్నాడు.

శేషయ్య ఏడుస్తున్నాడు.

ప్రకాశం ఏడుస్తున్నాడు.

జనం ఏడుస్తున్నది.

ఊరు ఏడుస్తుంది.

మంగమ్మ స్థిరంగా ఉంది. "పదండి" అన్నది పోలీసుల్తో. కదిలింది. ప్రకాశం జరిగి నుంచున్నాడు. ఏడుపు చాలించాడు. గంభీరంగా నుంచున్నాడు.

మంగమ్మ నడిచింది.

పోలీసులు కదిలారు.

జనం కదిలారు.

మంగమ్మ జీపు ఎక్కింది. ప్రకాశం దూరంగా నుంచుని ఉన్నాడు. పది మంది చేతులు అతనిమీద ఉన్నాయి.

మంగమ్మ చిరునవ్వు నవ్వింది.

రెండు చేతులూ ఎత్తి ఊపింది.

ప్రకాశం చేయి ఎత్తి ఊపాడు.

జీపు స్టార్టు కాబోతూంది. ప్రకాశం పది మందినీ విడిపించుకొని ఉరికాడు. పోలీసు అధికారిని అడిగాడు—

"రామయ్యను పట్టుక పోతున్రా?"

జీపు కదిలింది. సాగిపోతూంది.

జనం నిరామయంగా జీపును చూస్తూ ఉండిపోయింది.

రామయ్యా, సుమతి మేడమీంచి చూశారు.

జీపు వెళ్ళిపోతూంది. పోయింది.

సుమతి రామయ్యను చూసింది. రామయ్య ముఖంలో విషాదం కనిపించింది.

"ఎందుకట్లున్నరు?"

''నీకు అర్థం కాదులే....'' పరాకుగా అన్నాడు రామయ్య.

''నా కెందుకు....'' మాట పూర్తికాకుండానే మెట్లమీదనుంచి దొర్లిన చప్పుడు, గాంధీ కేక వినిపించింది.

''అమ్మో! కొడుకో'' అని పరిగెత్తింది.

రామయ్య అనుసరించాడు.

గాంధీ మెట్లమీద నుంచి దొర్లి పడిపోయాడు. తలకు గాయం తగిలింది. రక్తం స్రవిస్తూంది.

రొమ్ము బాదుకొని ఏడ్చింది సుమతి.

బొమ్మలా నుంచున్నాడు రామయ్య.

తరువాత ఎన్నికలు వాయిదా పడ్డాయి. అది అటు బలరామయ్యకూ, ఇటు రామయ్యకూ ఊరట కలిగించింది. శేషయ్య పట్నం చేరాడు. అతని బాదరబందీ తీరింది.

పట్నం చేరిన వీరభద్రానికి ఈ వార్త పిడుగుపాటు అయింది. పల్లెకు పరిగెత్తి ప్రకాశాన్ని తీసుకొని వచ్చాడు. ప్రభుత్వాన్ని కొంత కదిలించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. మస్తాన్ పోలీసు కాల్పుల్లో చనిపోయినట్లు పోస్టుమార్టం సర్టిఫికేటు వచ్చింది! మంగమ్మమీద బలంగా కేసు తయారైంది - రామయ్య ఇంటి మీదికి దొమ్మీకి పోయిందని. మల్లయ్యనూ, యలమందనూ అరెస్టు చేసి వదిలేశారు.

వీరభద్రం ఊరికే అటూ ఇటూ ఉరికాడే కాని ఏమీ చేయలేక పోయాడు. మంగమ్మను కలుసుకొన్నాడు. ఆవిడ తరపున వాదిస్తానన్నాడు. వకీలును పెడ్తానన్నాడు. మంగమ్మ అంగీకరించ లేదు. విచారణ తతంగం సాగింది. మంగమ్మను కోర్టుకూ, జేలుకూ తిప్పుతున్నారు. విచారణ జరిగినప్పుడల్లా కోర్టు ప్రజలతో కిట కిట లాడుతూంది. విచారణ ముగిసింది. మంగమ్మ వాఙ్మూలం ఇవ్వాల్సినరోజు. న్యాయస్థానం ప్రజలతో నిండిపోయింది.

"మీరేమైనా చెప్పాల్సింది ఉందా?" న్యాయమూర్తులు అడిగారు.

"ఉన్నది" మంగమ్మ ప్రారంభించింది.

"న్యాయస్థానానికి కళ్ళు లేవంటరు. చెవులు ఉంటయంటరు. న్యాయస్థానానికి మనసులేదు"

"నిజం చెప్పింది. నిజం చెప్పింది" జనంలో కలకలం.

"అది చూడలేదు. అనుభవించలేదు. తెచ్చిన సాక్ష్యాలు వింటుంది. నమ్ముతుంది. ఒక నిర్ణయానికి వస్తుంది. న్యాయస్థానానికి సమాజంతో పనిలేదు. వచ్చే పరిణామాలను అది గమనించదు. చట్టాలను ఇరుకుచేసి నేరస్తులుగా నిరూపించి అందులో దూరుస్తుంది."

"బాగు బాగు" జనపు మాట.

"ఈ కేసులో మీరు చేసిన విచారణ ఏమి? మేము దొమ్మికి పోయాం అని నిరూపించారు. మస్తాన్ను చంపినవానికి శిక్ష విధించారా? ఒక సర్టిఫికేటు సృష్టిం

చారు. ఎందుకు? అతడు కూటికి లేనివాడు. రామయ్య దగ్గర డబ్బుంది. అతడు న్యాయం సహితం కొనగలడు."

"వాహ్ వాహ్" ప్రజల మెచ్చుకోలు.

"న్యాయస్థానం నేను చెప్పింది వింటుందే కాని అందును గురించి ఆలోచించ లేదు. ఎందుచేత? న్యాయానికి చట్టానికి సంబంధం లేదు. ప్రాణంలేని చట్టాలతో ప్రాణం ఉన్న మనుషుల్ని విచారిస్తున్నారు"

"ఓహో శాన బాగ చెప్పింది. బాగ చెప్పింది" జన వాక్యం.

"ఈ చట్టాలు, న్యాయస్థానాలు ఆస్తులను రక్షించడానికి ఏర్పడ్డాయి. ఇక్కడ మనిషికీ, న్యాయానికీ తావులేదు. కాబట్టి ఇక్కడ విన్నవించుకొని ప్రయోజనం లేదు. ఇక మీ తీర్పు వినిపించండి."

"మంగమ్మగారికీ జై."

"వీరనారి మంగమ్మకు జై" నినాదాలు పిక్కటిల్లాయి.

కోర్టువారు జనాన్ని శాంతింప జేశారు.

"మూడేళ్ళ కఠిన శిక్ష" తీర్పు చెప్పి జేబురుమాలుతో ముఖం తుడుచుకుంటూ విరమించారు న్యాయమూర్తులు.

"అన్యాయం. అన్యాయం" అన్నారు ప్రజలు.

మంగమ్మ బోను దిగింది.

ప్రజల జయ జయధ్వానాల మధ్య సాగిపోయింది.

ప్రకాశం పరిగెత్తి వచ్చాడు. మంగమ్మ కాళ్ళ పట్టుకొని మొక్కాడు. బుద్ధిగా చేతులు కట్టుకుని నుంచున్నాడు.

మంగమ్మ ముద్దులు కురిపించింది.

* * *

విమానం పరుగుడు బాటమీద వాలింది. ఉరికింది. ఆగింది. నిచ్చెన వచ్చింది. తలుపు తెరుచుకున్నది. బలరామయ్య దిగాడు. వెంట మార్వాడీ ఉన్నాడు. వారు సాగారు. ఆశ్రయం దాటారు. ఒక "బ్యూక్" కారు ఎదిరి చూస్తూంది. ఒక పూబోడి ఎదిరి చూస్తూంది. ఆమె మెరుపులా ఉంది, బంగారు తీవలా ఉంది. వెన్నెల మూర్తిలా ఉంది. పిల్లగాలిలా ఉంది.

బలరామయ్య చూచాడు.

ఆమె బలరామయ్యను చూచింది!

మెల్లగా నవ్వింది. సన్నగా నవ్వింది. మల్లెమొగ్గలు కనిపించాయి. దానిమ్మ గింజలు కనిపించాయి.

"ఆదా–బె–అరజ్" వీణ మ్రోగింది. చేతిని తామర మొగ్గలా చేసి సలామ్ చేసింది. తలుపు తెరిచింది. "ఆయియే తషిరిఫ్ లాయియే" అన్నది.

బలరామయ్య కారులో కూర్చున్నాడు. ఆమె కూర్చుంది. తలుపు పడ్డది. మార్వాడీ సాగనంపుతున్నట్టు నుంచున్నాడు.

"మీరు?" అడిగాడు బలరామయ్య.

"మీ వెనుకనే వస్తున్నా – స్సా ...గండి"

కారు స్టార్టయింది. సాగింది. మెత్తగా సాగిపోతూంది.

ఆకాశంలో మబ్బులు మందలు మందలుగా పరిగెత్తుతున్నాయి. మబ్బుల డొక్కల్లోంచి వస్తున్నగాలి చల్లగా మెల్లగా వీస్తూంది. బాట పక్కల పచ్చని చేలు ఏపుగా పెరిగివున్నాయి. చిలకలు గుంపులు గుంపులుగా ఎగురుతున్నాయి. పచ్చని పొలాలు ఎగురు తున్నట్లున్నాయి.

ప్రకృతి ఆనందం పట్టలేక పోతూంది.

బలరామయ్య కిటికీలోంచి చూస్తున్నాడు.

"ఏం చూస్తున్నారు?" ఆమె అడిగింది ఉర్దూలో. తరవాత సంభాషణ సాంతం ఉర్దూలోనే జరిగింది.

"మబ్బులు ఎంత అందంగా ఉన్నాయి. ఎలా పరిగెడుతున్నాయి! ఎంత హాయిగా ఉంది?"

"అలాగా!"

"సియాహీ హై: సఫేది హై షఫఖ్ హై అంబ్రెబారాఁ హై

మజా బర్సాత్ కా చాహోతో ఇన్ ఆంఖోఁ మె ఆ బైఠో"

(నలుపు కలదు. తెలుపు గలదు. సంధ్యా రాగం కలదు. శ్రావణ మేఘం గలదు. వర్షపుహర్షం కావాలంటే రా! ఈ కళ్ళల్లో కాపురం పెట్టు)

"వహ్వా! వహ్వా! చాల బాగ చెప్పావు" అని ఆమె బుజాలు పట్టుకొని ఊపేశాడు బలరామయ్య.

"తస్లీమ్" (స్వీకరించాం)

"మీ పేరు?"

"నన్ను 'మీ' అనాల్సిన పనిలేదు. 'నీ' అనండి. చాలు- పేరు నసీమ్"

"నసీమ్! (పిల్ల తెమ్మెర) యెంత బావుంది. అది ఒక్కటే తక్కువ ఉండె"

"అదీ వుందిగా" ఆమె నవ్వింది.

"జబ్ ఉస్ రుఖె పుర్నూత్ కా జల్వా నజర్ ఆయా

కాబా నజర్ ఆయా నకలీసా నజర్ ఆయా."

(వెన్నెలలు చిమ్ము ఆ మోము చూశాను అంతే.

మక్కా మరచాను. గిరిజాధరమూ కనిపించలేదు)

"బాగా చెప్పారు. చాలా బాగా చెప్పారు" ఆమె.

"ఇంకా వినండి. ఏమంటున్నాడో"

"యహ్ హుస్న్ యహ్ షోఖీ, యహ్ కరిష్మా. యే ఆదాయేం
దున్యా నజర్ ఆయా ముఝే తూ క్యా నజర్ ఆయా"

(ఈ అందము, ఈ చందము, ఈ హొయలు, ఈ ఉలుకు, నాకు నువ్వేమి? నా లోకమే కాన్పించింది)

"ఏదో అంతరార్థంతో అంటున్నారు"

''అంతరార్థం లేదు. ఉన్నమాట అన్నాను. మనసులోని మాట చెప్పాను'' బలరామయ్య.

ఆమె తల వంచుకుంది.

కారు సాగిపోతూంది.

నున్నని ఆమె మెడనూ, మబ్బుల్లాంటి వెంట్రుకలనూ చూస్తున్నాడు బలరామయ్య. అతనికి ఒక పద్యం గుర్తుకు వచ్చింది:

''ప్రతి శిరోజమునను వందల గుండెల
చుట్టివేసెననిన చోద్యమేమి?
ప్రణయ బంధితులకు బందిఖానాయగు
సుందరాంగి కురుల సోయగమ్ము''

చదువలేదు. మననం చేసుకున్నాడు.

''ఏం చేస్తుంటావు?'' అడిగాడు.

ఆమె తల ఎత్తి కళ్ళల్లోకి చూచింది.

''ఇప్పుడేమీ లేదు''

''ఇంతకు ముందు''

''పూర్వం జాగీరుండేది'' ఆమె కళ్ళల్లో నీరు నిలిచింది—ఏ పూర్వ స్మృతులు మసలాయో!

బలరామయ్యకూ వెనుకటి జ్ఞాపకాలు మెదిలినట్లున్నాయి. ఆలోచనలో పడిపోయాడు. కాస్త సేపయిం తరవాత సిగరెట్టు కాల్చాడు - రోడ్డును చూడ సాగాడు. ఆమె కూడా బాటను చూడసాగింది.

కారు సాగిపోతూంది.

కారు ఆగింది. మార్వాడీ చేతులు జోడించి నమస్కరించాడు. కారు తలుపు తెరిచి పట్టుకొన్నాడు. బలరామయ్య దిగాడు. నసీమ్ దిగింది.

''ప్రయాణం సుఖంగా, సాగిందా!'' కుశల ప్రశ్న వేశాడు మార్వాడీ - పళ్ళికిలించి.

''దివ్యంగా'' అని నసీమ్‌ను చూచాడు బలరామయ్య.

నసీమ్ నవ్వింది. ముత్యాలు రాలాయి.

ముందు మార్వాడీ సాగాడు.

వెనుక బలరామయ్య - నసీం - సాగిపోయారు.

అది మహాసౌధం. వైభవోపేతమైన భవనం. పాలరాతి కట్టడంలా కనిపిస్తూంది. పైన గోపురాలు, లోన కమానులు- హిందూ మహమ్మదీయ వాస్తుశాస్త్ర సమ్మేళనంలా ఉంది. పూర్వం ఒక మహారాజుది- ప్రస్తుతం మార్వాడీదైపోయింది.

విశాలమైన ఉద్యానంలోంచి సాగిపోతున్నారు. ఇరువైపులా రంగు రంగుల పూలమొక్కలు కలకలా నవ్వుతున్నాయి. గాలికి తలలు ఊపుతున్నాయి- నమస్కరిస్తున్నట్లు.

వాతావరణం మత్తుగా ఉంది. మస్తుగా ఉంది.

గుండె గంతులు వేస్తూంది.

ఉన్నతమైన మహాద్వారం చేరారు.

యువతుల గుంపు వచ్చింది. స్వాగతం పలికింది. సన్నగా పాడింది. పూల హారాలు బలరామయ్య మెడలో పడ్డాయి. మెడ తిరక్కుండా అయింది. మెత్తని తివాచీమీద అడుగు పెట్టాడు బలరామయ్య. మత్తుగా మెల్లగా సంగీతం వినిపిస్తుండగా సాగాడు. ఆ సుందరహర్మ్యాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. శిల్ప సౌందర్యాన్ని చూస్తు సాగిపోతున్నాడు.

సౌధాంతరంలో విశాలమైన హాలు. పాములాంటి మెత్తని పరిమళోపేతమైన గద్దెమీద ఆసీనుడైనాడు. సుగంధాలు చిమ్ముతున్నాయి. రంగురంగులు వెలుగులు పరచుకుంటున్నాయి. వీణ, మృదంగము, వాయులీనము మున్నగు వాద్యాలు మ్రోగుతున్నాయి. సుందరాంగులతో హాలు చోద్యంగా ఉంది. రంగురంగుల పూలు పరచుకొన్నట్లుంది. గజల్ పాట ప్రారంభం అయింది.

"దిల్ సె ఖయాలె దోస్త్ భులాయా న జాయెగా
సోనేమె దాగ్ హైకి మిటాయా న జాయేగా
తుమ్‌కో హజార్ శర్మ్‌సహీ ముఝ్ కో లాఖ్ జప్త్
ఉల్ఫత్ వో రాజ్ హైకి ఛుపాయా న జాయెగా"
(వలపు తలపులను మనసు మరువగా లేదు
పసిడి పచ్చకు మచ్చగలదు, మాపగారాదు.
నీకు వేల సిగ్గులు నాకు లక్షల నిగ్రహాలు గలవు.
ప్రణయమెట్టి రహస్యమన్న దాచగారాదు)

బలరామయ్య ఉబ్బితబ్బిబ్బైనాడు "వహ్వా వహ్వా" అని తన ఆనందాన్ని ప్రకటించాడు.

అంగనలు తలలు వంచి ప్రశంసల నందుకొన్నారు.

మరికొన్ని గజళ్ళు - పాటలు - పాడారు. వీణ ఒక్కటే మ్రోగింది. వీనుల విందు చేసింది. హృదయం చషకం అమృతంతో నిండింది. తొణికిసలాడింది. ఒలికింది. ఉన్మత్తుడైనాడు బలరామయ్య. పరవశుడైనాడు. పరమపదంలో ఉన్నట్లనిపించింది.

పాటలు ముగిశాయి. అంగనలు లేచారు. సలాములు చేశారు. అణగి, మణగి, ఒదిగి ఒదిగి విరమించారు. బలరామయ్య మనసులో ఇంకా కూనిరాగాలు మసలుతూనే ఉన్నాయి.

తరవాత భోజనాలు. షడ్రుచులు కాదు. షోడశ రుచులు కాదు. లెక్కలేనన్ని రకాలు. బిర్యానీలు - పొలావులు - కబాబులు! మతంజక, సఫేదా - షేర్ బరంజ్. బాకర్ ఖానియా - మురబ్బాలు - పచ్చళ్ళు, మిఠాయిలు - కారాలు - దొగోష్తా - పెగోషా - పెరుగు - వెన్న - మీగడ - ఒకటా రెండా? ఎన్నని. రంగురంగుల బొమ్మలు వడ్డిస్తున్నారు. బలరామయ్య మస్తుగా భోంచేశాడు. త్రేన్చాడు.

పిదప విశ్రాంతి. సాయంకాలానికి లేచాడు బలరామయ్య. మరొక సౌధము. అమరపురిలా ఉంది. గానా బజానా:

"గుర్తులేదు మరణవేళ మృత్యుదేవి
గుర్తువచ్చె పదే పదే అదే చెలిమి.
నీ వలపు వయారాలు గుర్తులేవు
నీవు చేసిన మోసమెల్ల గుర్తుకలదు
విరహరాత్రి గడచిపోయె గుర్తులేదు
కురుల వలల చిక్కుటొకటె - గుర్తుకలదు.
వియోగాన నీ వొకతెవె గుర్తుంటివి
నీవు రానివేళ చావొక్కటె గుర్తువచ్చె
అడుగకు నా వలపు కలత లెన్నిగలవొ?
స్వర్గమందుకూడ అవియె గుర్తువచ్చె"

డోలక్ మోతతో పాట గుమ్ముగా సాగిపోతూంది. రాగాలు - అనురాగాలు విరాగాలు - సరాగాలు సాగాయి.

అర్థరాత్రి అయింది. అందరూ నిష్క్రమించారు. బలరామయ్య నసీం, మార్వాడీ మిగిలిపోయారు. మధువు వచ్చింది. రకరకాలది. గులాబీలది. చమేలీలది. మొగిలిది. నారింజది. నారికేళం, అనేక రకాలవి. రాజుదర్బారులోవి. పది సంవత్సరాల నుంచి పాతిక సంవత్సరాల పాతవి. మట్టిలో పాతి తీసినవి. మహా వైభవమైనవి.

"సర్కారు కోసం తెప్పించాను. లోకంలో ఎక్కడ-స్సా దొరకవు" మార్వాడీ ఉవాచ.

నసీమ్ బలరామయ్యకు పాన పాత్రను అందించింది.

"మరి మీరు?" మార్వాడీని ఉద్దేశించి బలరామయ్య.

"నాకు పని ఉంది. రేపు వేటకు ఏర్పాటు చేస్తున్నాను- స్సా- శలవు తీసుకుంటా" అని విరమించాడు మార్వాడీ.

మిగిలింది ఇద్దరే. పొంగులు వారుతున్న వయసు సొగసు పొంగలేని ముసలి మనసు.

"శాంతమగు రేయి, పున్నమి చందమామ
పిల్లకాల్వలు; మెల్లని చల్లగాలి
ఇంతి నాముందు: నేనుంట నింతిముందు
రాత్రినే ముందు స్వర్గమే ధాత్రిచేరె" అన్నట్లుంది.

బలరామయ్య కనులు ఎర్రవారేయి. నసీమ్ కనుల్లో అరుణిమ చేరింది.

"ఒక పద్యం చిత్తగిస్తారా?" నసీమ్.

"వినిపించు"

"విన్న తరువాత...."

**"తరువాత?"**

"నేనేం చెప్పను"

"అయితే వినిపించు"

"చిత్తగించండి"

"షీషామస్త్, బాదామస్త్. హుస్నమాస్తో ఇష్కమస్త్"

"చషకం" మత్తుగా ఉంది. మద్యం మత్తుగా ఉంది. అందం మత్తుగా ఉంది. వలపు మత్తుగా ఉంది.

"ఓహోహో. చాలా బావుంది. బహుత్ ఖూబ్'' అని నసీమ్‌ను వూపేశాడు.

''ఆగండి. చదివింది ఒకటే పాదం''

''ఒక పాదంతోనే నాకు మత్తెక్కింది''

''రెండోపాదం చిత్తగించండి''

"చంపకు నన్ను''

''వినండి''

''ఆజ్ పీనేకా మజా పీకే బహక్ జానె మె హై''

(నేడు తాగుడులో మజా తాగి తెలివి తప్పడంలో ఉంది)

''ఓహో. హో, బహత్ ఖూబ్, బహత్ ఖూబ్'' అని నసీమ్‌ను కౌగలించుకొన్నాడు బలరామయ్య. ముద్దుపెట్టుకొన్నాడు.

అలా గడిచింది రాత్రి.

తెల్లవారింది. పొద్దు పొడిచింది. ఎక్కింది. ఇంకా మత్తు వదల్లేదు బలరామయ్యకు. నసీమ్ అంతకు ముందే లేచింది. తయారైంది. బలరామయ్యా లేచాడు. తయారైనాడు. కార్లు తయారుగా వున్నాయి, బారులు తీరి వున్నాయి. బలరామయ్య తుపాకి అందుకున్నాడు. కారెక్కాడు. నసీమ్ ఎక్కింది.

కారు సాగింది - వెనుక కార్లు సాగేయి.

నిన్నటి కంటె ఉల్లాసంగా ఉన్నాడు బలరామయ్య. నసీమ్ నిన్నా వెంట ఉంది. కాని ఈనాటి ఆనందం వేరు. నసీమ్ కురులలో గులాబీలు తురుముకుంది. వంగి వాసన చూశాడతను. ఆమె తలతిప్పుకుంది. కళ్ళలోకి చూసింది. కళ్ళు చిలిపిగా నవ్వాయి. బలరామయ్య కళ్ళలో అశక్తత కనిపించింది. ఆమె ఉడికించింది.

"ఏక్ షాతిర్ చోర్ దిల్ చురాకర్ లేగయా

పాస్వాఁ కంబఖ్త్ సబ్ సోతే సోతె రహగయె."

(ఒక చతర చోరుడు, మనసును దొంగిలించాడు. వెళ్ళిపోయాడు - పక్కనే పడుకుని ఉన్నారు సహయాత్రికులు. మూర్ఖులు నిద్రలోనే ఉండిపోయారు)

"ఎవరు?" అడిగాడు బలరామయ్య.

"ఇంకెవరు?"

"నేనా!"

"వేరే చెప్పాలా?" అని నవ్వేసింది.

"నన్ను దొంగను చేశావా?"

"దొంగిలించారు. కాబట్టి విన్నవించాను. మనసుకు కావలసింది దొంగేకదా"

"దిల్ కీ బస్తీభీ అజీజ్ బస్తీహై

జో లూట్నెవాలె పర్ తరస్తీహై"

(మనసు ఒక విచిత్రమైన నగరం అది దోచుకునే వానికోసం తపిస్తుంది)

"చాలా బాగా చెప్పావు నసీమ్"

"ఇక వాసన చూడండి కొప్పులోని గులాబీని" అని వెనక్కు తిరిగింది.

కారు ఆగింది. కార్లు ఆగాయి. బిలబిలమంటూ అమ్మాయిలు దిగారు. ఎగిరారు. గంతులు వేశారు. నవ్వారు, తుళ్ళారు: బలరామయ్య తుపాకి మరచాడు. నసీమ్‌ను అనుసరించాడు.

అది అడవి పచ్చిక మైదానాలు - చెట్లు, తీగలు; పొదరిండ్లు, పూలరాసులు, పిట్టల కిచకిచలు.

నసీం బలరామయ్యను అనేక చోట్లకు తిప్పింది. గుట్ట లెక్కించింది. పొదలో దూర్చింది. కవ్వించింది. నవ్వించింది మురిపించింది-మరిపించింది .

పచ్చని మైదానంలో భోజనాలు జరిగాయి. మధువు సేవించారు - మత్తుగా పొర్లారు-పచ్చిక మైదానాల్లో.

వచ్చింది వేటకు బలరామయ్య. తిరిగి వెళ్ళేప్పుడు తానే గురియైనాడు.

సాయంకాలం అయింది. కార్లుసాగాయి. తిరిగి సౌధాంతరంలో చేరారు బలరామయ్య నసీమ్. మళ్ళీ మధుపాత్రలు వచ్చాయి. మత్తులో నసీమ్‌ను చూశాడు బలరామయ్య.

ఊర్వశిలా ఉంది. మేనకలా ఉంది. రంభలా ఉంది.

"నసీమ్!"

"ఊఁ" మత్తుగా అంది.

"నువ్వు అప్సరసవు"

"ఊఁ హుఁ"

"నసీమ్"

"ఊఁ"

"వస్తావా?"

"ఎక్కడికి?"

"నాతోని - పట్నానికి"

"రమ్మంటావా?"

"ఊఁ"

"రమ్మంటే తప్పుతుందా" కళ్ళలోకి చూసింది. మరీ దగ్గరికి వచ్చేసింది. గుండె చప్పుడుకూడా వినిపిస్తూంది బలరామయ్యకు.

నసీం అతని మెడలో చేతులు వేసింది.

బలరామయ్య దగ్గరికి లాక్కున్నాడు.

అలా కొన్నిరోజులు గడిచాయి. నసీంతో జంటగా ఎగిరి పట్నంలో వాలాడు బలరామయ్య. నసీంను ఒక హోటల్లో ఉంచాడు. రాచకార్యాలు కొన్నాళ్ళు మరచాడు.

* * *

పల్లె మారిపోయింది. మంగమ్మ ఇల్లు పాడుబడింది. అది సుమారు కుక్కల దొడ్డి అయింది. మల్లయ్య ఒంటరి అయిపోయాడు-వెల వెల పోతున్నాడు. ఎన్నో ఏండ్లు మీద పడ్డట్లయినాడు. ఉన్న కాస్త నేల చక్క దున్నుకుంటున్నాడు. అదీ కౌలు భూమి. పంట సరిగ్గా పండడం లేదు. పండింది చాలడం లేదు. ప్రకాశం వెళ్ళిపోవడంతో కోటయ్య చదువు మాన్పించాడు. పశువులు కాయడానికి పెట్టాడు యాదగిరి దగ్గర. యలమంద అప్పుడప్పుడూ వచ్చి తొంగిచూసి వెళ్తున్నాడు. అతడు యాదగిరి ముఠాలో చేరాడు. సారాయి దుకాణంమీద కూర్చుంటున్నాడు.

రామయ్య ఇంటిముందు కారు లేదు. గాంధీకి గాయం తగ్గేదాకా స్కూలుకు వెళ్ళలేదు. ఇప్పుడిప్పుడే వెళ్తున్నాడు. ఊరికె బస్సు వచ్చేసింది. బస్సులో వెళుతున్నాడు. సుమతి రోజూ గుడికి వెళ్ళివస్తూంది. ఆమె పారాయణాలు, సంతర్పణలు, సమారాధనలు జరుగుతూనే ఉన్నాయి. రామయ్య ఏదో పోగొట్టుకున్నట్లు పట్నం నుంచి పల్లెకు, పల్లెనుంచి పట్నానికి ఆసులో గొట్టంలా తిరుగుతున్నాడు. ప్రకాశం పట్నంలో ఉన్నాడు కాబట్టి తిరుగుతున్నాడని సుమతి అనుమానం. తన బిడ్డ విషయంలో పట్టించుకోవడం లేదని కుములుతూంది.

ఒకనాటి రాత్రి అడిగింది-

"ఇగ కారు కొనరా? పిల్లగాడు రోజూ బస్సులమీద పోతున్నడు. వాడు వచ్చే దాకా నా గుండెలు గుబులు గుబులు గుంటది."

"యాడ దొరికెటట్లున్నయి" పరాకుగా జవాబిచ్చాడు రాయయ్య.

"డబ్బు పారేస్తే కరువు పోయినాయి. మీకు శ్రద్ధలేదుగాని"

రామయ్య కొరకొరా చూశాడు. "చూద్దం" అన్నాడు.

"చూద్దమంటే ఎట్ల? కాస్త పట్టించుకోవాలె"

"అయితే నేను పట్టించుకోవటం లేదంటవు?" అని చివాలున లేచి వెళ్ళిపోయాడు.

సుమతి చూస్తూ వుండిపోయింది. ఆమెకు దుఃఖం పొంగింది. గాంధీని కౌగలించుకొని ఏడ్చేసింది.

రామయ్యకూ, యాదగిరికీ స్పర్థలొచ్చాయి. యాదగిరి తనంతవాడు కావడం చూసి ఓర్చలేకపోతున్నాడు. ఈ మధ్యన వచ్చిన తగాదా హెడ్‌మాస్టరును గురించి. పంతులు పంచాయితి ఎన్నికల్లో రామయ్య పక్షం వహించాడు. అలా అంటే పంతులుకు రామయ్యమీద ప్రేమ ఉందని కాదు. రామయ్య పంతులుకు గడిలో గది చూపించాడు. భార్యను తెచ్చుకొని ఉంటున్నాడు. పంతులుమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు యాదగిరి.

యాదగిరి అంటె పూర్వపు యాదగిరి కాదు మరి! బలరామయ్య ఏజెంటు. బలరామయ్య తన భూములన్నీ రామయ్యనుంచి తప్పించాడు. యాదగిరికి అప్పగించాడు. దాంతో యాదగిరి పలుకుబడి గలవాడై పోయాడు. అతనికి కొద్దిగా బొర్ర వచ్చింది. వళ్ళు నిగనిగ లాడుతూంది. ఇల్లు పెద్దదయింది. కొట్టంలో పశువులు చేరాయి. గరిశెల్లో ధాన్యం ఉంది. అతడూ ఖద్దరు ప్రారంభించాడు.

యాదగిరి పంతుల్ని బదిలీ చేయించాడు. పంతులు రామయ్యను ఆశ్రయించాడు. రామయ్య బదిలీ రద్దు చేయించాడు. యాదగిరికి వళ్ళు మండింది. గడీ ఖాళీ చేయమన్నాడు పంతుల్ను. తలలు బద్దలైనా పంతులు గదిలోంచి కదలదన్నాడు రామయ్య. పంతులు ఖాళీ చేస్తాననే అన్నాడు. రామయ్య వద్దన్నాడు. బదిలీ రద్దయినందుకు బాధపడ్డాడు పంతులు పాపం! అడకత్తెరలో పోకలా అయింది అతని పని.

ఇది ఇలా ఉండగా ఒక ఘోరం జరిగింది.

పంతులుకు పాపం భయం భయంగానే ఉంది. ముఖ్యంగా భార్య విషయంతో-రాధ విషయంలో. రాధ కాస్త నాజూగ్గా ఉంటుంది. బస్తీ మనిషి! రామయ్యకు తన మీద ఉన్న అభిమానం ఏమిటో బదిలీ రద్దయిం తరువాత గాని గ్రహించలేదు. రామయ్య రాధను అదోలా చూస్తున్నాడని అతను అంతగా గ్రహించకున్నా రాధ చెప్పింది-ఒకనాడు కంట తడిపెట్టింది. పంతులు గుండె దడదడలాడింది. తరవాత కొద్దో గొప్పో కోపం వచ్చింది. అయితే మాత్రం? ఏం చేయగలడు రామయ్యను? పల్లె బడిపంతులు.

ఒకనాడు సాయంకాలం బడినుంచి వచ్చాడు పంతులు.

రాధ కంటికి కడివెడుగా ఏడుస్తూంది-మంచంలో పడి. బిత్తరపోయి చూశాడు పంతులు. ఏమైందని అడిగాడు.

"మనం ఈ ఊళ్ళో వుండవద్దు. పోదాం పదండి" అని ఏడ్చేసింది.

"ఎట్ల పోతం కొలువు వదిలి, ఏమైంది చెప్పు?"

మళ్ళీ పెద్దగా ఏడ్చేసింది రాధ. యాదగిరి ఏమో అన్నాడని చెప్పింది. ఏమన్నదీ స్పష్టంగా చెప్పలేకపోయింది.

ప్రాణాలు పైపైనే లేచిపోయాయి పంతులుకి. కూలబడ్డాడు. వెర్రిగా చూడసాగాడు. ఏం చేయాలో తోచలేదు. బదిలీకి ప్రయత్నిస్తున్నాడు. బస్తీకి తిరుగుతున్నాడు.

ఒకనాడు బస్తీకి వెళ్ళాడు—సాయంకాలం రావాలనే. రాలేకపోయాడు. బస్సు దాటిపోయింది. ఉదయం మొదటి బస్సుకే వచ్చాడు. ఉరికి ఉరికి వచ్చాడు. ఇల్లు చూస్తే తలుపులు బార్ల తీసి వున్నాయి. ఇల్లు బావురుమంటూంది. రాధ కనిపించ లేదు; ప్రాణాలు పైపైనే లేచిపోయాయి. "రాధా రాధా" అంటూ ఇల్లంతా తిరిగాడు.

అతని మాటలే ప్రతిధ్వనించాయి.

రాధ పలుకలేదు.

"రాధ కనిపించడంలేదు. నా రాధ కనిపించడంలేదు" అంటూ ఊరంతా తిరిగాడు.

ఎక్కడా కనిపించలేదు.

ఊరంతా గడీముందు కూడింది. రామయ్య, యాదగిరి తప్ప.

జనంలో గుసగుసలు బయలుదేరాయి.

పంతులు ఏకాకిగా ఏడుస్తున్నాడు. జుట్టు పీక్కొని ఏడుస్తున్నాడు.

మల్లయ్య వచ్చాడు. "బాయిలగిట్ట పడ్డదేమో చూతాం రాండ్రి" మల్లయ్య బావి వైపు దారి తీశాడు. జనం అనుసరించింది. అది పెద్ద బావి. అందులోకి తొంగిచూచారంతా.

నీరు నిశ్చలంగా వుంది. ఒకొ్కక్క బుడగ పైకి వస్తూంది.

"మనిషి ఉన్నదశె. బుడగ లొస్తున్నయి" అన్నాడొకడు.

"అవు దిగుండి. దిగుండి" అన్నాడింకొకడు.

ఎవరూ దిగడానికి సిద్ధం కాలేదు.

మల్లయ్య కాసె బిగించి బావిలోకి దిగాడు.

శవాన్ని ఎత్తుకొని తేలాడు.

శవాన్ని చూచాడు పంతులు.

"రాధా!" అని కేక పెట్టి విరుచుకు పడిపోయాడు.

జనం ముక్కులమీద వేళ్ళేసుకున్నారు.

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

* * *

సుమతి గాంధీ గది సర్దుతూంది. పుస్తకాలన్నీ చిందర వందరగా పడి వున్నాయి. అన్నీ ఇంగ్లీషువి. ఆమె కా భాష రాదు. అతని చదువు తల్లి భాషలో కాదు. అందువల్ల ఆమె కాభాష అర్థంకాదు. బొమ్మల భాష అందరికీ అర్థం అయ్యేదే. ఆ బొమ్మల పుస్తకం చూచి ముందు విస్తుపోయింది. తరవాత మండిపోయింది.

అది బూతు బొమ్మల పుస్తకం.

గుండెలో కొన్ని గుట్టలు కూలినట్లయింది. చతికిలపడింది. ఇదా గాంధీ చదువుతున్నది! లొడితెడు లేడు. వాడికిప్పట్నుంచి ఈ బొమ్మలా? ఇలా పాడవుతున్నాడా తన కొడుకు? బాగుపడాలని పోరాడి పట్నం పంపింది. వాడికోసం కారు కొనింది. ఇలా తయారవుతున్నాడన్నమాట. ఆనాడు పేకాడి వచ్చాడు. తాను ఏమీ అనలేకపోయింది. నాటి పరిస్థితి అలాంటిది. తండ్రి ఏమీ అనలేదు. తాత మాట్లాడ లేదు. వాడు రెచ్చిపోతున్నాడు. రానీ, వాడి పని పట్టా, అనుకుంది. అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతేనేం? అదే వెన్నాడుతూంది. పని చేసినా, కూర్చున్నా, పడుకున్నా అదే ఆలోచన. అందరూ ఏదో కుట్రపన్నుతున్నారనుకుంది. తన కొడుకుని చెడగొట్టాలని ఏదో పథకం పన్నినట్లనిపించింది. తన కొడుకు గాంధీ అంత వాడు కావాలనుకుంది. గాలి తిరుగుడుగాడైనాడు. రామయ్యకు పట్టలేదు. ప్రకాశాన్ని బాగుచేయాలనే అతని తహతహ. వారి పన్నాగం పారనీయరాదు. తన కొడుకుని బాగుచేయాలి-ఎలా? ఏది మార్గం? తన తండ్రి జీవించి వుంటే? ఆ తలపుతోనే దుఃఖం పొంగి పొర్లింది. మంచంలో పడి ఏడ్చేసింది. కళ్ళు బాగా ఉబ్బిపోయాయి.

"మమ్మీ!" అంటూ పరిగెత్తి వచ్చాడు గాంధీ. అప్పుడే బస్సు దిగి వస్తున్నాడు.

మాట విన్నది సుమతి. ఆమెలో లావా పొంగింది. చండికలా లేచి పరిగెత్తింది. గాంధీమీద పడి చావబాదుతూంది. గాంధీ మొత్తుకుంటున్నాడు. ఏడుస్తున్నాడు. అయినా వదలడంలేదు. వాడు పరిగెత్తాడు. ఆమె చరుస్తూంది. చేతులు నొప్పులు పెట్టాయి. పిల్లవాని వంటినిండా దద్దులు వచ్చాయి. చేతులడ్డంపెట్టి వణికిపోతున్నాడు. పని మనుషులంతా కూడారు. వారిస్తుంటే వాళ్ళమీదికి లేస్తుంది. అడ్డం వచ్చిన వాణ్ణల్లా ఆదరకొడ్తూంది.

"మమ్మీ! కొట్టకే చచ్చిపోతనే" అని ఏడుస్తున్నాడు.

"చావు చస్తే పీడ పోతది" అని పొరకకట్ట అందుకొని బాదుతూంది.

"మమ్మీ చస్తనే. మమ్మీ చస్తనే" అరుస్తున్నాడు గాంధీ.

అందరూ కళ్ళప్పగించి చూస్తున్నారు.

రామయ్య కనిపించాడు. పరుగెత్తాడు గాంధీ. "డాడీ! అమ్మ చంపుతున్నది" అని కాళ్ళకు చుట్టేసుకున్నాడు.

ఇంకా సుమతి రౌద్రం తగ్గలేదు. ఉరికి వచ్చింది.

"ఏమి—మనిషివా? రాక్షసివా? ఆగు" రామయ్య గద్దించాడు.

"మీకు తెల్వదు. మీరు వదలండి" అని లాగుతూంది గాంధీని. బేలగా తండ్రి ముఖం చూచి ఏడుస్తున్నాడు గాంధీ.

"జరుగు-వదులు" అని నెట్టాడు రామయ్య.

సుమతి ఆ తోపుకు వెనక్కు తూలి కూలబడిపోయింది. క్షణం అలా కూలబడి, చివాలున లేచి గదిలోకి పరిగెత్తింది. తాను చూసిన బొమ్మల పుస్తకం తెచ్చి భర్తకు చూపి "ఇదిగో నీ కొడుకు ఘనకార్యం" అన్నది.

రామయ్య ఆశ్చర్యపోయాడు. గాంధీని చూచాడు. అప్పుదర్థమైంది గాంధీకి. తలవంచుకొని ఎక్కెక్కి ఏడుస్తున్నాడు.

"అయితే మాత్రం చంపుకొంటరా?" అని గాంధీని తీసుకొని గదిలోకి వెళ్ళి పోయాడు రామయ్య.

సుమతికి దుఃఖం పొంగింది. చేతులలో ముఖం దాచుకొని, తండ్రిని తలచుకుంటూ ఏడుస్తూ కూలబడిపోయింది.

చూస్తూ నుంచున్న పనివాళ్ళంతా ఒక్కొక్కరే అంతా నిర్గమించారు.

చీకట్లు కమ్ముకొన్నాయి.

"ఎవరు చేసిన పాపానికి ఎవరిని శిక్షిస్తున్నావు ప్రభూ" అని ఆకాశానికి చేతులు జోడించి లేచింది సుమతి. గదిలోకి వెళ్ళి ముడుచుకొని పడుకుంది.

ఆ రాత్రి ఎవరూ అన్నాలు తినలేదు, ముడుచుకొని పడుకున్నారు.

తెల్లవారి తొలుత లేచింది సుమతి. చూస్తే గాంధీ లేడు. గుండె ఆగినంత పనైంది. రామయ్యను లేపింది.

"ఏమండీ! బాబు మంచంలో లేడండి"

"ఉంటడు యాడికిపోతడు? దొడ్లోగిన ఉన్నడేమో చూడు? ఎందుకట్ల పరేషాను అవుతవు" అన్నాడు దుప్పటి సగం తీసి.

"లేడండి నాకెందుకో భయం భయంగా ఉన్నది" అని దొడ్లోకి ఉరికింది. అంతా గాలించింది. గదులన్నీ చూచింది. గట్టిగా పిలిచింది. కేకలు వేసింది. గాంధీ కనిపించ లేదు. కాళ్ళు గడగడ వణికాయి. గుండె దడదడ లాడింది. నాలుక ఆరుకుపోతూంది. గదిలోకి ఉరికి వచ్చింది. అప్పటికి లేచి కూర్చున్నాడు రామయ్య.

"లేడండి. బాబు ఎక్కడ లేడండి. కాస్త లేవండి. ఊళ్ళో చూడండి" గొంతు పూడుకుపోయింది. కళ్ళలోంచి నీరు దుమికేట్టుంది.

రామయ్య చివాలున లేచాడు. ఊళ్ళోకి ఉరికాడు. మంగమ్మ గుమ్మందాకా వచ్చి ఆగిపోయాడు.

ఇల్లు బావురుమంటూంది. ఏదో శూన్యంగా ఉంది. రిక్తంగా ఉంది.

రామయ్య ఊరంతా వెదికాడు. సైదయ్యా, హుసేన్, నారయ్య మొత్తం ఇండ్లు గాలించారు.

చేతులు ఊపుకొంటూ వచ్చేశాడు రామయ్య. రామయ్యను చూచి గుండె గుభేలుమంది సుమతికి. కూలబడింది. వెర్రిగా చూస్తూ అడిగింది. "ఏమండీ కనపడ తేదా?"

"ఊరంత గాలించినం. కనపడలేదు. ఇగ బావులూ చెరువులే..."

మాట పూర్తికాక ముందే "నా కొడుకో" అని పెద్దగా ఏడుస్తూ విరుచుక పడింది సుమతి. రామయ్య ప్రాణాలు పైపైనే లేచిపోయాయి. సుమతిని చూడాలా? బాబును వెదకాలా? కాస్త చిరాకుపడ్డాడు కూడా. వెంట వచ్చినవారిని వెదకడానికి పంపించేశాడు. తాను సుమతి దగ్గర కూర్చున్నాడు. సుమతికి తెలివి వచ్చింది. "వచ్చాడా బాబు" అని అడిగింది. "నువ్విట్ల పడిపోతివి. నేను ఆడికి చావనా? ఈడికి చావనా?" సుమతి మరో రకంగా అర్థం చేసుకుంది. "రండి నేను కూడ వస్త వెదుకుదం" అని బయలు దేరింది. రామయ్య అనుసరించాడు.

విరబోసిన జుట్టు, ఉబ్బిన కళ్ళు, పిచ్చిదానిలా పరిగెత్తుతోంది సుమతి. కనిపించిన వారినల్లా అడుగుతూంది. "అమ్మా! నా బాబు కనపడ్డాడా? అయ్యా! నా బాబు కనపడ్డాడా?" అంతా చూస్తూ నుంచున్నారు.

"మంగమ్మను జైలుకు పట్టించిన్రు. పాపం ఊరికే పోతాది" ఒక తల్లి వ్యాఖ్యానించింది.

"మస్తానన్నను చంపించిండు కాదమ్మా. మల్లి దేవుడు చూడడు గంపంత కన్నుతోని" మరొక అవ్వ గొణుక్కుంది.

వెర్రి దానిలా బావులూ, చెరువులూ తిరిగింది. అన్నింట్లోకి దిగి గాలించి, వడబోశారు. ఇంటికి వచ్చిన సుమతి తలబాదుకొంటూ ఏడ్పు సాగించింది.

రామయ్య కేమీ తోచలేదు. "పట్నం గినపోయిండేమో" నారయ్య సంశయం.

అప్పుడు తోచింది సుమతికి "పాండి. పట్నం పోదం" గబుక్కున లేచి నుంచుంది.

"ఈ వేషంతోనా?" రామయ్య ఆశ్చర్యం.

"నడువుండి" గద్దించినట్టన్నది.

రామయ్య గదిలోకి ఉరికి చొక్కా మార్చుకున్నాడు. జేబులో చూస్తే డబ్బు లేదు. డబ్బు వేసుకుని ఉడాయించాడన్న మాట! రామయ్యకు కోపం పొంగింది.

"చూసినవా డబ్బెత్తుక పోయిండు" అన్నాడు గదిలోంచి వస్తూ.

"పోతే పోయింది. నడవండి" తనమాటే విననట్లు కసిరింది సుమతి. రామయ్య వళ్ళు మండింది.

"ఇట్లచేసే వాణ్ణి చెడగొడుతున్నవు"

"అవును నేనే చెడగొడుతున్న" అని వెటకారంగా అని "అయ్యాన్ని ఇప్పు డెందుకు నడువండి" అన్నది – మీకైతే ప్రకాశం ఉన్నడు అందామనుకొని మాట మింగేసింది.

అధికారం చెలాయిస్తుంది తనమీద అనుకున్నాడు. అయినా అడుగులో అడుగు వేశాడు.

పట్నమంతా తిరిగి గాంధీ దోస్తు ఇల్లు పట్టుకున్నారు. యజమాని ఇంట్లోనే ఉన్నాడు.

"మా గాంధీ వచ్చిండా?" సుమతి తుపాకిలో గుండులా అడిగేసింది.

"వచ్చిండు. కుర్చోండి" అన్నాడు.

ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చుంది. ఆమెకుఆరాటం ఎక్కువ అవుతూంది. కాని వ్యక్తపరచలేకపోతూంది.

"పిల్లలను అంత ఇదిగ కొడ్తారండి? ఎవరు కొట్టింది?" యజమాని అడిగాడు.

రామయ్య, సుమతి ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. "నేనే కొట్టిన-తప్పైంది. మీ కాళ్ళు పట్టుకుంట మా బాబును చూపించండి" సుమతి గబగబా అనేసింది.

"తల్లివిగదా! రాక్షసివెట్లయినవమ్మా?"

ముఖం నేలకు వేసింది సుమతి. తన కొడుకు చేసిన ఘనకార్యం చెపుదామను కుంది. పొట్ట చించుకుంటే కాళ్ళమీద పడుతుంది అని ఊరుకుంది.

"పిల్లల్ను కొట్టకూడదమ్మా, గాంధీ జ్వరంతో వచ్చిండు. దవాఖాన్లో ఉన్నడు. పోదాం పాండి" అని లేచాడు యజమాని. అందరూ ఆస్పత్రికి వెళ్ళారు. గాంధీని చూచి బావురుమంది సుమతి. ఏడ్వవద్దని నోరు మూసింది నర్సు. ప్రతిమలా కూర్చుంది ప్రక్కన. వంటిమీద చేయివేస్తే మండిపోతూంది.

"మమ్మీ! చంపకు. మమ్మీ చంపకు" అని పలవరిస్తున్నాడు గాంధీ. స్పృహలో లేడు.

"కొట్టను నాయనా! ఇంకెన్నడూ కొట్టను నాయనా" అంటూంది సుమతి. ఆమె గుండె పిండి అవుతూంది. మంచం దగ్గరనుంచి మరి కదల్లేదు. గాంధీకి పథ్యం పెట్టేదాకా ఎంగిలిపడలేదు.

గాంధీ కోలుకుంటున్నాడు. జ్వరం తగ్గిపోయింది. నీరసం మాత్రం మిగి లింది. ఇంటికి తీసికెళ్ళొచ్చన్నాడు డాక్టరు. గాంధీతో ఇంట్లో అడుగు పెట్టే పోయిన ముళ్ళె ఏదో దొరికినట్లనిపించింది.

కారు కొనేదాకా కొడుకును స్కూలుకు పంపనన్నది సుమతి. తప్పలేదు రామయ్యకు. కారు కొన్నాడు. మళ్ళీ గాంధీ కారుతో స్కూలుకు వెళుతున్నాడు.

అయినా ఆ సంవత్సరం తప్పాడు. సుమతి మాట్లాడలేదు. రామయ్యను మాట్లాడ నివ్వలేదు: "ఈ ఏడు కాకుంటే వచ్చే ఏడు" అన్నది.

గాంధీ ఆడింది ఆట - పాడింది పాట అయింది.

* * *

నైజాం నవాబూ కొన్ని మంచి పనులు చేశాడు. వానిలో ఒకటి ప్రభుత్వ రంగంలో పరిశ్రమలు ఏర్పరచడం, బస్సు రూట్లు, రైల్వే, బొగ్గు గనులు, పంచదార, బట్టలు, సిల్కు, కాగితం మున్నగు పరిశ్రమలు ప్రభుత్వ పరంగా స్థాపించాడు. కార్మికోద్యమం కూడా కొంతలో కొంత తెలంగాణాలోనే బలపడింది. నైజాం స్టేట్ రైల్వేలో జరిగిన సమ్మె చరిత్రాత్మకమైంది.

నసీమ్‌తో గొప్ప హోటల్లో గడుపుతున్న బలరామయ్య రాచకార్యాలు అంతగా పట్టించుకోవడంలేదు. అయినా అతని దగ్గరికి ముఖ్యమైనవీ, అత్యవసరమైనవీ కేసులు, ఫైళ్ళు వస్తూనే వున్నాయి. వాటిలో ఒకటి ప్రభుత్వరంగపు పరిశ్రమలను ప్రైవేటు రంగానికి మార్చడానికి సంబంధించింది. ఆ ఫైలు చూస్తే అతనికి ఆశ్చర్యం అయింది. ప్రభుత్వ రంగంలో పరిశ్రమలు నష్టంగా నడుస్తున్నాయి. అందుకు సంబంధించిన లెక్కలు, అంకెలు పకడ్బందీగా ఉన్నాయి. ఎక్కడా కాదనడానికి వీల్లేకుండా ఉంది ఫైలు. కింది అధికారులంతా కట్టకట్టుకొని తయారు చేసినట్లుంది కవిలె. అయినా ఎందుకో ఆలోచించాడు బలరామయ్య. తన మీదికి ఏమైనా వస్తుందేమోనని భయపడ్డాడు. అసెంబ్లీని తలచుకొని అదిరిపోయాడు.

నసీమ్ బలరామయ్య ప్రక్కన కూర్చుంది. భుజంమీద చేయివేసింది. "ఏమిటీ అంతగా ఆలోచిస్తున్నారు?" అడిగింది గారాంగా.

"అది రాచకార్యం"

"అయితే చెప్పరాదా?" బుంగమూతి పెట్టింది.

''చెబితే నీకేం తెలుస్తుంది?"

"నేనూ నవాబు బిడ్డనే. చెప్పరాదూ"

చెప్పాడు బలరామయ్య.

కిలకిలా నవ్వింది నసీమ్. "నష్టంవస్తే వదిలించుకోవాలి. దానికి ఆలోచించేదేమి?"

"ఆలోచించాలి"

"సరె. ఆలోచించండి" లేచిపోయింది నసీమ్.

బలరామయ్య సిగరెట్టు కాల్చాడు. అటూ ఇటూ పచార్లు చేశాడు. ఏమీ అర్థం కాలేదు, తోచలేదు. చిరాగ్గా ఉంది. నసీమ్ దగ్గరికి వెళ్ళాడు. "మందేమైనా ఉందా?'' అడిగాడు. అందించింది. తాగాడు. నసీమ్ నవ్వింది. మెడలో చేతులు వేసింది. కరిగిపోయాడు బలరామయ్య.

"పరిశ్రమలు నష్టంతో నడుస్తున్నాయని బుకాయిస్తూంది ప్రభుత్వం. నష్టం ఎందుకు వస్తుంది? ఎలా వస్తుంది? పరిశ్రమల్లో పనిచేసే అధికారులను కొనేస్తున్నారు పెట్టుబడిదారులు. నష్టం వచ్చేట్టు చూపమంటున్నారు. వారు చూపుతున్నారు. వారు ప్రజాద్రోహులు!"

"ప్రజాద్రోహులు నశించాలి" జనసాగర ఘోష.

ప్రభుత్వపు ఈ కుట్రను కార్మికులు విఫలం చేయాలి. అంతగా నష్టం వస్తుంటే కార్మికులకు అప్పగించండి. కర్మాగారాలను కార్మికులే నడిపిస్తారు. లాభాలు చూపిస్తారు."

"పరిశ్రమలు కార్మికులవి.

కార్మికులకు అప్పగించండి" ప్రజావాక్యం.

శ్రామికులు చెమట నెత్తురు ముద్దలు చేసి కర్మాగారాలు స్థాపించారు. వాటిని పెట్టుబడిదారుల పొట్టలు నింపడానికి అప్పగించారు. ఉత్పత్తికి శ్రమ, సంపద రెండు అవసరం. సంపద లేకున్నా శ్రామికుడు ఉత్పత్తి చేయగలడు. శ్రామికుడు లేకుండా పెట్టుబడిదారును ఉత్పత్తి చేయమనండి చూతాం."

"శ్రామిక వర్గానికి జై
సంపద సృష్టించేది శ్రామికుడు
సంపద శ్రామికునికి చెందాలె"

"సంపద సృష్టించే శ్రామికులకే పరిశ్రమలు చెందాలి. అందుకోసం పోరాటం సాగాలి. ప్రభుత్వపు ఆటలు కట్టించాలి. రేపటినుంచి కార్మికులంతా సమ్మె చేస్తున్నారు. పరిశ్రమలు తమవి అయ్యేదాకా విరమించరు.

"ఇన్నిలాబ్ జిందాబాద్"

వీరభద్రం ఉపన్యాసం ముగించాడు. సభలో కరతాళధ్వనులు మిన్నంటాయి.

"సమ్మె చేసి తీరుతాం.
పరిశ్రమలు సాధించి తీరుతాం"

శ్రామికుల్లో పట్టుదల గట్టిపడింది.

తరువాత కొందరు నాయకులు మాట్లాడారు. కార్మికుల గుండెల్లో చిచ్చురగిలించారు. ఆ చిచ్చుతోనే ఇండ్లకు చేరారు శ్రామికులు.

ప్రభుత్వానికి వార్తలందాయి. అది గడగడలాడింది. ఆ రాత్రి మంత్రి మండలి సమావేశం జరిగింది. ఇంతకాలంగా వాయిదాలు పడుతూ వచ్చిన అంశంలో నిర్ణయం జరిగిపోయింది.

పరిశ్రమలు మార్వాడీకి అప్పగించబడ్డాయి.

నిర్ణయమైతే చేశారుగాని నీరసించిపోయారు. రానున్న సమ్మెను గురించీ, జరుగనున్న కల్లోలాలను గురించీ కొంత చర్చించారు. దాన్ని లా అండ్ ఆర్డర్ సమస్య

క్రింద జమకట్టి పోలీసు మంత్రికి అప్పగించారు. కార్మికుల విషయం బలరామయ్యకు అప్పగించి మిగతా మంత్రులు నిద్రలో మునిగిపోయారు.

బలరామయ్యకు భయం అయిన మాట నిజం. కాని అతని ఆశ్రితులు దాన్ని పోగొట్టారు. మిస్టర్ రాబర్ట్ కార్మికులను చీల్చాలన్నాడు. మరొక కార్మిక సంఘం స్థాపించాలన్నాడు. ఎవరు నడిపించాల అనే విషయం చర్చ జరిగింది. శేషయ్యను అధ్యక్షుడుగా ఉండమన్నారు. శేషయ్య జంకాడు. తనకు కార్మికుల విషయం ఏమీ తెలియదన్నాడు. పేకాట తప్ప తనకేమీ రాదన్నాడు. రాబర్ట్ శేషయ్య వీపు చరిచాడు. కార్మిక నాయకునికి తెలియాల్సిందేమీ లేదన్నాడు. తాను అన్నీ చూస్తానన్నాడు. తనకు కార్మికుల్లో ఉన్న చీలికలు తెలుసునన్నాడు. పరిశ్రమ నడిపించే బాధ్యత తనది అన్నాడు. శేషయ్యకు ఇష్టంలేకున్నా అంగీకరించక తప్పలేదు. మార్వాడీ మూట చూపాడు మరి!

అర్ధరాత్రి హోటల్లో కార్మికసంఘం వెలిసింది.

శేషయ్య అధ్యక్షుడైనాడు.

టెలిఫోను డయల్ గిర్రుగిర్రున తిరిగింది. పత్రికలకు వార్తలు అందాయి. అసలు వార్తలు రాసిందీ, అందించిందీ కొంచెం బుద్ధిమంతులైన పాత్రికేయులే. వారు రాసిపెట్టిన ప్రకటనమీద శేషయ్య సంతకం పెట్టాడు.

"కార్మికులను, కార్మికోద్యమాలను పార్టీ ప్రయోజనాలకు వాడుకోవడం ప్రతిపక్షాలవారి లక్ష్యం. కార్మికుల శ్రేయస్సు వారికి అవసరంలేదు. జీతం తెచ్చుకుంటేనే ఇల్లు గడవని కార్మికులతో సమ్మె చేయించి తమ పబ్బం గడుపుకోవడం వారికి అలవాటైంది. కార్మికోద్యమం అని నెత్తిన నోరుపెట్టుకొని అరిచే నాయకులు కార్మికులకు ఏం చేశారు? కార్మిక సంక్షేమం కోసం ప్రభుత్వం అనేక పథకాలు తయారు చేసింది. పరిశ్రమలు ప్రైవేటు రంగానికి అప్పగించింది కార్మిక సంక్షేమం కోసమే. మా కార్మిక సంఘం యజమానులతో సంప్రదింపులు జరుపుతూంది. జీతాలు పెంచడానికి యజమానులు సుముఖంగా ఉన్నారు. కాబట్టి కార్మికులను కోరేదేమంటే వారు సమ్మెకు దిగవద్దు. పనులకు హాజరు కావాలి. ఉత్పత్తి పెంచాలి. దేశాభివృద్ధికి తోడ్పడాలి. దేశద్రోహుల మాటలు వినవద్దు"

ఇదీ పత్రికా ప్రకటన.

ఆ తరవాత శేషయ్యా, రాబర్టూ కార్లల్లో బయలుదేరారు. కార్మిక వాడలకు వెళ్ళారు. రాబర్టుకు విధేయులు కొందరున్నారు. వారితో మాట్లాడారు. డబ్బందించారు. కొందరు గూండాలను సమకూర్చారు. కొందరికి తాగుడు పోయించారు. కొందరికి ముండలను సమకూర్చారు. ఇంకా ఏవేవో చేశారు? తెల్లవారకముందే ఫ్యాక్టరీకి చేరవేశారు కొంతమంది కార్మికులను.

తెల్లవారింది. పత్రికల్లో వార్తలు వచ్చాయి. వీరభద్రం అగ్గి అయిపోయాడు. ఆ అగ్గి నగరమంతటా పాకింది. అయినా బందోబస్తులు గట్టిగానే జరిగాయి. ఫ్యాక్ట

వీరభద్రం మంచంలో విలవిల లాడిపోతున్నాడు. పడిపోయినప్పుడు బాధ తెలియలేదు. ఇప్పుడది ప్రాణం తీస్తూంది. ఎముక విరిగిపోయింది. లోన రక్తం ఏం కారిందో బయటికి చుక్క రాలేదు. వీరభద్రం అంటే అభిమానం ఉన్న డాక్టర్లూ ఉన్నారు. క్షణాల్లో ఆస్పత్రి థియేటర్ తయారైంది. ఆపరేషన్ జరిగింది. విరిగిన ఎముకను సరిచేసి ప్లాస్టరు వేశారు. మళ్ళీ మంచంలోకి వచ్చేశాడు. కాని స్పృహలేదు. పడి ఉన్నాడు.

రెక్కలు విరిగిన పక్షిలా పడివున్నాడు వీరభద్రం.

ఆస్పత్రి ఆవరణ సాంతం జనంతో నిండిపోయింది. నగరం సాంతం తరలి వచ్చినట్లనిపిస్తుంది. అందరి ముఖాలమీద ఏదో ఆరాటం కనిపిస్తుంది. ఆవేదన కనిపిస్తూంది. అంత జనం ఉన్నా నిర్జనంగా ఉన్నట్లే ఉంది. ఆస్పత్రి అంత ప్రశాంతంగా వుంది. అంత గంభీరంగా వుంది. ప్రకాశం కూడా గంభీరంగా ఉన్నాడు. ఆ చిన్నిగుండెలో ఎన్ని తుపానులు రేగుతున్నాయో, అతనిని మాత్రం ఆస్పత్రిలోకి వెళ్ళనిచ్చారు. ప్రకాశం వీరభద్రం మంచందగ్గరికి చేరాడు. వీరభద్రాన్ని చూశాడు. వీరభద్రానికి ఇంకా తెలివి రాలేదు. ప్రకాశం ప్రక్కనున్న స్టూలుమీద కూర్చున్నాడు. మౌనంగా కూర్చున్నాడు. రెప్ప వాల్చకుండా వీరభద్రాన్ని చూస్తున్నాడు.

కొంత సేపటికి బలరామయ్య, శేషయ్య మరికొందరు మంత్రులు, మార్వాడీ వచ్చారు. డాక్టర్లు పరిగెత్తి వచ్చారు.

ప్రకాశం లేచాడు. గోడకు ఆనుకొని నుంచున్నాడు.

బలరామయ్య డాక్టర్లనుంచి యోగక్షేమాలు తెలుసుకున్నాడు.

"జనరల్ వార్డులో ఉంచిన్రేమి?" అడిగాడు బలరామయ్య.

డాక్టర్లెవరూ మాటాడలేదు. ముఖముఖాలు చూచుకున్నారు.

"వీరభద్రమంటే మీకు తెలిసినట్లు లేదు. నైజాం నవాబును గడగడలాడించిన వీరుడు. చూడటంలేదా మంది ఎంతమంది ఉన్నారో అవతల! స్పెషల్ వార్డులో ఉంచుండి. ఇలాజ్ బాగ చెయ్యండి. అతనికేమన్నాయెనా...."

అయినా డాక్టర్లు చూస్తూనే ఉండిపోయారు.

"ఏంది అట్ల చూస్తరు? రూల్సు ఒప్పుకోనంటున్నయా! కిరాయి కడ్తమయా. మార్చుండి"

"స్సాలా, మీరెందుకడ్తారు? డాక్టరుగారూ! బిల్లు నాకు పంపించండి, స్సాలా, డబ్బుకావాలంటే ఇప్పుడే తీసుకోండి. స్సాలా" అని డబ్బు తీశాడు మార్వాడీ!

"ముందర మార్పించండి" శేషయ్య ఆజ్ఞాపించాడు సిగరెట్టు అంటించుకొంటూ.

వార్డుబాయ్‌లు, నర్సులు గునగున ఉరికి వచ్చారు. వీరభద్రాన్ని స్పెషల్ వార్డుకు మార్చారు. ప్రకాశం అనుసరించాడు. మళ్ళీ స్టూలుమీద కూర్చున్నాడు. తన

కక్కయ్యను కొట్టించింది వీరేనని విన్నాడే! వీరేమిటి ఇలా మాట్లాడుతున్నారు? అనుకున్నాడు. అతనికి అర్థం కాలేదు.

మంత్రులు, మంత్రులవెంట బృందం, వారివెంట డాక్టర్ల గుంపు బయటికి వచ్చింది. బయట నిలచిన వేల కండ్లు ప్రశ్నార్థకంగా చూశాయి. "బాగున్నడయా మీ లీడరు. జర్రంత దెబ్బ తగిలింది - బాగైతదన్నరు డాక్టర్లు. స్పెషల్ వార్డుకు మార్పించినం. మీకే కాదు! మాకు హూడా లీడరేనయ్యా ఆయన" అని సాగిపోయాడు బలరామయ్య. శేషయ్య ఉండిపోయాడు. కార్మిక నాయకుడు గదా మరి!

కార్మికులు అతన్ని చుట్టేశారు. అనేక ప్రశ్న లడుగుతున్నారు. విశ్రాంతి కావాలన్నారు డాక్టర్లు. వీరభద్రాన్ని విసిగించడం మంచిది కాదనిచెప్పాడు. ఆమాటా, ఈ మాటా తరువాత ఫ్యాక్టరీ విషయం వచ్చింది. వేతనాలు పెంచడాన్ని గురించి సంప్రతింపులు జరుగుతున్నాయన్నాడు. వివరాలడిగారు కార్మికులు. వివరించి చెప్పాడు. వేతనాలు పెంచడమేకాదు. బోనస్ కూడా అడ్వాన్సుగా ఇవ్వడానికి అంగీకరించారు యజమానులు అన్నాడు.

కార్మికులు శేషయ్యను ఎత్తుకొని ఎగిరారు. "శేషయ్యగారికీ జై" అన్నారు. శేషయ్యను కార్లో కూర్చొపెట్టి పెద్ద ఊరేగింపు తీశారు.

తెల్లవారి కార్మికులు సమ్మె విరమించారు. పనులకు హాజరయినారు. మార్వాడీల యాజమాన్యాన ఫ్యాక్టరీ పని ప్రారంభించింది.

బలరామయ్య నసీమ్‌ను చంకన పెట్టుకొని ఢిల్లీ వెళ్ళిపోయాడు-రాచకార్యం మీద.

వీరభద్రం కళ్ళు తెరిచి చూశాడు. మసక మసగ్గా ఉంది. ప్రకాశం స్టూలు దిగి పక్కకు వచ్చాడు. కక్కయ్యను చూశాడు.

వీరభద్రం ప్రకాశాన్ని చూశాడు.

అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఇక్కడ్నే ఉన్నవా బాబూ?"

తల ఊపాడు ప్రకాశం. కుడిచేయి లేపబోయాడు వీరభద్రం - ప్లాస్టరు ఉంది. కలుక్కుమంది. మూలిగాడు. ఎడమచేత్తో ప్రకాశం తల నిమిరాడు.

"బాబూ! గొంతు ఆరిపోతున్నది. నీళ్ళిస్తవా?"

ప్రకాశం గ్లాసులో నీళ్ళు తెచ్చి తాగించాడు.

"ప్రకాశం! బాబూ! నీకెన్ని కష్టాలు వచ్చినయినాయనా" అన్నాడు. దగ్గరికి తీసుకొన్నాడు. గొంతు బొంగురుపోయింది. కళ్ళలో నీరు నిండింది. ప్రకాశం వీరభద్రం ముఖంమీద ముఖం పెట్టి పెద్దగా ఏడ్చేశాడు. చాలసేపు ఏడ్చాడు. ఎక్కెక్కి ఏడ్చాడు. నర్సులు పరిగెత్తి వచ్చారు. చూస్తే ఏం లేదు. వీరభద్రం బాగున్నాడు. ప్రకాశాన్ని దగ్గరికి తీసుకొని ఓదార్చారు. అతని ముఖం కడిగి కాఫీ ఇచ్చారు. వీరభద్రానికి ఆహారం వగైరా ఇచ్చారు. వెళ్ళిపోయారు.

ప్రకాశం మళ్ళీ స్టూలుమీద కూర్చున్నాడు. కక్కయ్యను చూస్తూ కూర్చున్నాడు.

"కక్కయ్యా! ఒక్కమాటడగనా?"

"అడుగు బాబూ"

"చెప్పుతవు గద"

"చెప్పుతా బాబూ! ఎందుకు చెప్పను?"

"కక్కయ్యా! వాండ్లు మస్తాను మామను చంపిన్రు. అమ్మను జేలుకు పంపిన్రు. నిన్ను కొట్టిన్రు. మనం ఎప్పుడు కొడ్తం కక్కయ్యా వాండ్లను?"

"నాయనా! ప్రకాశం అంతంత ఆలోచనలు రానియ్యకు బాబూ" అని ప్రకాశాన్ని గుండెలకు హత్తుకున్నాడు వీరభద్రం.

సాయంకాలానికి సరస్వతి వచ్చింది.

మంచంలో పడివున్నాడు వీరభద్రం. గుమ్మంలో సరస్వతిని చూశాడు. అతనిలో ఒక వెల్లువ పొంగింది. ఒక మురళి మ్రోగింది. ఒక జలపాతం వాలింది. నమ్మలేకపోయాడు. అయినా అన్నాడు.

"సరస్వతీ!"

సరస్వతి. తన సరస్వతి!! ఎంత మార్పు! సాదా ఖద్దరు చీర. అలంకరణ లేని ముఖం. ఆ ఉద్రేకం లేదు. ఆ ఉత్తేజం లేదు. ముఖం ప్రశాంతంగా ఉంది. ప్రసన్నంగా ఉంది. స్వచ్ఛంగా ఉంది. మసక ఎరుగని వెన్నెలలా ఉంది.

సరస్వతి వీరభద్రాన్ని చూసింది. అంతే. వెనక్కు చూసింది. డ్రైవరు పండ్ల బుట్ట, పూలబుట్ట తెస్తున్నాడు. కనులతో సైగచేసింది. బుట్ట లోన పెట్టాడు డ్రైవరు. వెళ్ళిపోయాడు. సరస్వతి లోనికివచ్చింది.

"భద్రం" గొంతులో మార్దవం ఉంది. కొంతలో కొంత ఆర్ద్రత ఉంది.

వీరభద్రం కన్నార్పకుండా చూస్తూ ఉండిపోయాడు.

ప్రకాశం లేచి నుంచున్నాడు.

సరస్వతీ క్షణం వీరభద్రం చూపును చూసింది.

"భద్రం గులాబులంటే నీకు ఇష్టం కదూ! ఇదిగో తెచ్చా!" అంటూ పూలబుట్ట విప్పి పిడికెడు పూలు తీసి వాసన చూపించింది. బుట్ట పక్కనే పెట్టింది. తన చేత్తో పూలు తీసుకొని వాసన చూశాడు వీరభద్రం.

"సరస్వతీ! పూలెంత కమ్మగా ఉన్నాయి. ఇంక బాధలు మరిచిపోగలను"

సరస్వతి మాట్లాడలేదు.

ప్రకాశం వింతగా చూస్తున్నాడు.

అప్పుడుగాని ప్రకాశాన్ని చూడలేదు వీరభద్రం. "బాబూ! కాస్తసేపు బయట ఆడుకో. పిలిచినప్పుడు రా" అన్నాడు. ప్రకాశం మెల్లగా అడుగులు వేస్తూ గుమ్మం దాటి వెళ్ళిపోయాడు.

"సరస్వతీ! నేనింకా జ్ఞాపకం ఉన్నానా!"

"మన స్నేహం మరచేదేనా వీరభద్రం! ఆనాడు ఊళ్ళో కనిపించావు. నిప్పులు కురిశావు. మాయమైనావు. ఎంతగా చూశానో నీ కోసం! మళ్ళీ కనిపిస్తేనా? మా ఇంటికి ప్రజల్ని తెచ్చిన్నాడు బాల్కనీ మీదనుంచి చూశాను. నన్ను చూస్తావేమో నని ఆశపడ్డాను. చూడలేదు. ఎంత ఉద్రేకంలో ఉన్నావు ఆనాడు! నాటి వీరభద్రాన్ని చూసినట్లనిపించింది. భద్రం! నీ ఉద్రేకం తగ్గదా?"

"సరస్వతీ. నువ్వెంత మంచిదానివి! నా కోసం ఎదురుచూసే వారున్నారని, నన్ను గురించి బాధపడే దానవున్నావని ఇవ్వాళ తెలిసింది. సరస్వతీ! ఇవ్వాళ తెలిసింది. ఇంక నేను బ్రతగ్గలను. ఎంత కాలమైనా బ్రతుకగలను" అని సరస్వతి చేయి అందుకోబోయాడు.

ఆమె చేయి వెనక్కు లాక్కుంది. మంచంమీద కూర్చున్నదల్లా లేచి పక్కన స్టూలుమీద కూర్చుంది.

వీరభద్రం బెదిరి చూశాడు. బేలగా చూశాడు.

ఆమె స్నిగ్ధంగా చూసింది అతన్ని.

"నేనంటే ప్రేమ లేదా సరస్వతీ!"

"ఉన్నది; నువ్వంటేనే ఉన్నది"

"మరి?"

"ప్రేమ త్యాగాన్ని కోరుతుంది. భోగాన్ని కాదు అన్నారు గాంధీజీ"

వింతగా చూశాడు వీరభద్రం.

"అవును భద్రం. నేను బలరామయ్యను పెండ్లాడాను. అతని భార్యను."

"అయితే?"

"ప్రేమ సుఖాన్నిస్తుంది భద్రం సుఖాన్ని. ప్రేమ ఆనందాన్నిస్తుంది. సుఖం, ఆనందం రెండూ మనసుకు సంబంధించినవి. వాంఛలు శారీరకమైనవి. మనసా నిన్ను ప్రేమిస్తున్నాను. భగవంతుడ్ని ఆరాధిస్తున్నాను. నిన్నూ భగవంతుడ్నీ మరచలేను. ఇద్దరినీ నా కోరికలు తీర్చమనను"

"సరస్వతీ! ఎంత మారిపోయావు?"

"మార్పు ప్రకృతి సిద్ధం. నువ్వు మాత్రం మారలేదు. ఆ మంకుతనం, ఆ ఉద్రేకం అలాగే ఉన్నాయ్"

"సరస్వతీ నేను మారలేను. సమాజం మారిన్నాడే నేను మారగలను. సరే సరస్వతీ! ఆ బాంబు కేసు తరవాత మాయం అయినావు ఎటుపోయినావు?"

సరస్వతికి పాత స్మృతులన్నీ మనసులో మసలాయి. అన్నీ వెళ్ళగక్కింది.

వీరభద్రం తన గోడంతా వెళ్ళబోసుకున్నాడు కొన్ని తప్ప. అవి చెప్పరానివి-అతనికి సంబంధించినవి కావు.

సరస్వతి పండువలచి అందిస్తూంది వీరభద్రానికి - "అయితే నువ్వు నన్ను మరిచినట్లేనా?"

"సరస్వతీ! నువ్వు చెప్పిన మాటలే నేను అనాల్సివస్తుంది. ప్రాణంతోపాటు నిన్ను మరుస్తాను. నీవలె ప్రేమను గురించి వ్యాఖ్యానం చెప్పలేను. కాని ఫలితం లేని ప్రేమ....?"

"అక్కడే వుంది వీరభద్రం వ్యత్యాసం. అన్నింటికీ ఫలితం కావాలంటావు నీవు. నీ ఉద్యమానికి ఫలితం కావాలి. నీ పోరాటానికి ఫలితం కావాలి. ప్రతిపనీ ఫలితానికి దారితీయాలంటావు. నేనూ అలాగే అనేదాన్ని. ఇప్పుడు నాకు ఫలితంతో ప్రమేయం లేదు. పనితోనూ ప్రేమతోనే ప్రయోజనం. అందులోనే నాకు ఆనందం ఉంది. కోరిక దుఃఖాలకు కారణం. కోరికలు వదులుకొంటే సుఖాన్ని పొంద వచ్చు."

"మేము నేలనంటిన వాళ్ళం" వెటకారం ధ్వనించింది వీరభద్రం మాటలో.

సరస్వతి మాట్లాడలేదు. పండు ఒలిచి తొనలు అందిస్తూ పోతున్నది. వీర భద్రం ఎక్కడో లోతుగా ఆలోచిస్తున్నట్లున్నాడు. ప్రకాశం గుమ్మంలో దూరంగా నుంచొని కనిపించాడు సరస్వతికి.

"రా బాబూ! ఇలా రా"

ప్రకాశం వచ్చి గుమ్మంలో నుంచున్నాడు. వీరభద్రం ప్రకాశాన్ని పిలిచాడు. సరస్వతి గుమ్మందాకా వెళ్ళి ప్రకాశాన్ని తీసుకొని వచ్చి ఒళ్ళో కూర్చోపెట్టుకొని అడిగింది.

"నాన్న రమ్మనేదాకా రావుకదూ"

"నాన్నకాదు. కక్కయ్య"

సరస్వతి వీరభద్రాన్ని చూచింది. వీరభద్రం చూపు వాల్చుకొన్నాడు.

ప్రకాశానికి పండ్లు ఇచ్చింది. ప్రకాశం ఒళ్ళోనుంచి లేచి కుర్చీలో కూర్చొని పండ్లు తింటున్నాడు.

"భద్రం! ప్రకాశాన్ని ప్రేమిస్తున్నావుకదా! అందువల్ల నీకేం ఫలితం? మేఘాన్ని చూచి నెమలి నాట్యం చేస్తుంది. సూర్యుణ్ని చూచి కమలం వికసిస్తుంది. చంద్రుణ్ని చూచి కలువ నవ్వుతుంది. ఇవి ఎన్నడన్నా కలుసుకున్నాయా? కలు సుకోగలవా? అంతే భద్రం. అంతే. దూరంగా ఉంటేనే ప్రేమ. దగ్గరలో ఉంటే కామం"

"ఎంత ఎదిగిపోయావు సరస్వతీ!"

"ద్వేషంలో దుఃఖం ఉంది. ద్వేషించడం మాను. ప్రేమమార్గాన నడువు. మనస్సుకు శాంతి లభిస్తుంది. శాంతి ఆనందాన్నిస్తుంది, ఆనందమే బ్రహ్మం. బ్రహ్మాన్ని అందుకోగలవు భద్రం! ప్రాణాయామం చేస్తున్నాను. ముందు ముందు ధ్యానంలో నువ్వే కనిపించావు. తరవాత కొండలు, గుహలు, భయంకర రూపాలు కనిపించాయి. భయంకర ధ్వనులు వినిపించాయి! ఇప్పుడిప్పుడే భగవంతుని ధ్యానించే

గలుగుతున్నాను. ఎంత ఆనందంగా ఉందనుకున్నావు! ఇప్పుడు నాకు సుఖ దుఃఖాలులేవు భద్రం - నువ్వంటే ప్రేమతప్ప."

"అర్థమైంది సరస్వతీ! అర్థమైంది. మనం దూరంగానే ఉందాం. ప్రేమించు కుందాం" అని "సరస్వతీ! నాకు ఏదో హాయిగా వుంది. ఆనందంగా ఉంది" అంటూ కళ్ళు మూసుకున్నాడు - ఏదో అనుభూతిలో మునిగిపోయాడు.

సరస్వతి కళ్ళు మూసుకుంది.

వింతగా చూస్తూ కూర్చున్నాడు ప్రకాశం.

మౌనంగా వుంది గది సాంతం.

ఎక్కణ్ణుంచో ఒక రోగి ఆర్తనాదం వినిపించింది. ప్రకాశం పరిగెత్తాడు. వీరభద్రం కళ్ళు తెరిచి చూచాడు. సరస్వతి మాత్రం కళ్ళు తెరవలేదు. కొంత సేపటికి కళ్ళు తెరిచింది.

"సరస్వతీ! నీకేమైనా వినిపించిందా?"

"లేదే!"

"ఒక రోగి కేక పెట్టింది. ప్రకాశం పరిగెత్తాడు! నేను లేవలేక పడివున్నాను. నువ్వు ఆనందంలో మునిగి ఉన్నావు. ఈ కేకల నుంచి దూరంగా ఉండడానికా నీ ధ్యానం"

సరస్వతి వింతగా చూసింది.

"సరస్వతీ! మనం సమాజంలో జీవిస్తున్నాం. కోట్లజనం కూటికి అలమటిస్తుంటే మనం ఆనందంగా ఉందామా? ఎంత మందికి నీవలె వేదాంతం ఆలోచించే అవకాశం వుంది? నువ్వు ఏ క్లార్కుగానో ఉంటే? ఆలోచించగలవా? ఇది పలాయన వాదం కాదా? నలుగురితో కష్టసుఖాలు పంచుకోవటం మంచిదా? ముక్కు మూసుకొని దూరంగా కూర్చోటం మంచిదా? ఆలోచించు"

"కక్కయ్యా! ఆమె చచ్చి పోయింది" పరిగెత్తుకొని వచ్చి చెప్పాడు ప్రకాశం తనుస్తూ.

"పుట్టింది చావడానికే బాబూ" సరస్వతి దగ్గరకు తీసుకొని అన్నది.

సరస్వతిని క్షణం చూశాడు ప్రకాశం.

"కక్కయ్యా! ఒక్కమాట అడగనా ?"

"వద్దు బాబూ! వద్దు" అన్నాడు వీరభద్రం.

"అడుగు బాబూ! అడుగు" అన్నది సరస్వతి.

ప్రకాశం అడగలేదు.

"బాబును నా వెంట పంపించు. నువ్వు బాగయ్యేదాకా మా ఇంట్లో ఉంటాడు." సరస్వతి అడిగింది.

"మంచిది. తీసికెళ్ళు. మంత్రిగారు వస్తే ఏమంటారో?"

"ఏమీ అనరు. తీసికెళ్తా"

"వెళ్ళు బాబూ" అన్నాడు. కంఠం రుద్ధమైంది.

"కక్కయ్యా! ఈమెను ఏమని పిలవాలె?"

ఇద్దరూ ఒకరి కొకరు చూచుకున్నారు.

ఆ చూపుల్లో అనేక ప్రశ్నలున్నాయి.

"అత్తమ్మ" అను వీరభద్రం జవాబు.

"పద బాబూ!" సరస్వతి మాట.

"పా అత్తమ్మా" ప్రకాశం అన్నాడు.

ఇద్దరూ వెళ్ళిపోతుంటే చూస్తూ వుండి పోయాడు వీరభద్రం. శూన్యంలోకి కూడా చూస్తూనే వుండిపోయాడు.

ఒకనాటి సాయంకాలం. ఆస్పత్రి గది. వీరభద్రానికి ఇష్టమని బొబ్బట్లు వండించి తెచ్చింది సరస్వతి. ముగ్గురూ ముచ్చట్లు చెప్పుకుంటూ బొబ్బట్లు తింటు న్నారు. బుజాన సద్దిమూట వేసుకొని మల్లయ్య వచ్చాడు. వెంట కోటయ్య వున్నాడు.

పీక్కొనిపోయిన కళ్ళు, డొక్కుపోయిన చెంపలు, అలసి సొలసినట్లున్న ముఖం, చిరిగిన పంచె మోకాళ్ళ వరకు, తూట్లుపడి మాసిన చొక్కాగల మల్లయ్యను చూసింది సరస్వతి. చాలీ చాలని చెడ్డీ, వదులుగావున్న బనీనూ, సంస్కారం లేని జుట్టూ, బక్కగా, పుల్లలా వున్న కోటయ్య కనిపించాడు. భయపడినట్లు చూసింది.

కోటయ్యను చూశాడు ప్రకాశం. అతని కళ్ళు వెలిగాయి. "కోటయ్యా!" అని కేకవేసి, పరిగెత్తి కౌగలించుకున్నాడు. ఇద్దరూ చెట్టా పట్టా పట్టుకొని బయటికి పరిగెత్తారు.

సరస్వతి ఇంకా మల్లయ్యను చూస్తూనే వుంది.

"అయ్యా! భద్రయ్యా! ఏమిటయ్యా ఈ గతి?" అన్నాడు బొంగురుపోయిన గొంతుతో. కళ్ళు చెమ్మగిల్లాయి. వీరభద్రం చేయి పట్టుకుని నుంచున్నాడు.

"మల్లన్నా! పిచ్చా నీ కేమన్నా. జరుగుతుంటయి ఇట్లాంటివి. నువ్వు కూడా గుండె పగుల్తె ఎట్ల? కూర్చో!" అన్నాడేగాని వీరభద్రం, అతని గొంతూ కొంత జీరబోయింది.

మంచంమీద కూర్చున్నాడు మల్లయ్య. తదేకంగా వీరభద్రాన్ని చూశాడు కొన్ని క్షణాలు.

"ఆదికాదు భద్రన్నా! మస్తానన్న చచ్చె. మంగమ్మను జేలుకు పట్టిచ్చిరి. నిన్ను బొక్కలిరకొట్టిరి. ప్రకాశం దిక్కులేనోడాయె. ఇగ నే నొక్కణ్ణున్న. ఎట్లుంటదో చెప్పు బద్రన్నా! గుండె చెరువైతాంది."

సరస్వతి ధ్యానంగా వింటూంది.

"మల్లన్నా! నువ్వుకూడా అధైర్యపడితే ఎట్ల? మనది పూలదారి అనుకున్నావా? మన దారిలో ముండ్లు, కత్తులు, కటార్లు. వుంటయి మల్లన్నా! ప్రజలను నమ్ము

కున్న వాండ్లంతా ఇంతే. దేవుణ్ని నమ్ముకున్న వాండ్లంతా ఇగో ఇట్లుంటారు" అని సరస్వతిని చూపించాడు.

నమస్కరించాడు మల్లయ్య.

సరస్వతి ప్రతిసమస్కారం చేసింది.

"మల్లయ్య – పోరాటంలో నాతోని పనిచేశాడు" అని మల్లయ్యను పరిచయం చేసి "ఈమె సరస్వతి. ఇప్పుడు దొరసాని. పూర్వం నాతోపాటు పని చేసింది. బాంబులు చేసేది" అని సరస్వతిని మల్లయ్యకు పరిచయం చేశాడు.

"రామయ్య దొరయి కూచోలేదుండి. వాడు మాత్రం మనతోని పని చేయ లేదానుండి. డబ్బుండి - అది అన్ని చేయిస్తది!"

"సరస్వతి అట్ల కాదులే" అని "ఏం విశేషాలు మల్లన్నా ఊరివి?" అడిగాడు వీరభద్రం.

"ఏమున్నాయుండి. సౌరాజ్జం వచ్చిందా - ఉన్నోడు ఉట్టికెక్కుతాండు. లేనోడు నేలకరుస్తాండు. యాదగిరి కూడా మోటర్ కొనుక్కొచ్చిండు. నారయ్యకు సరాలమీద పుండైందనుకోని మిడిసి పడ్తాండు. నా సంగతి చూస్తానుగద! ఎన్నటి కుండి మనం గెలిచేది? ప్రజలు బాగుపడేది?"

"పోరాటాల్లో ఇవన్నీ జరుగుతుంటయి. సమతా రాజ్యం మనమే చూస్తామో, మన పిల్లలు చూస్తరో. పని చేయటం మన విధి. ఫలితం ఆశించరాదు." అని సరస్వతినిచూశాడు.

చివరి వాక్యం తనమీద ప్రయోగం అని గ్రహించింది సరస్వతి.

"ఏమో నుండి నా కంత అయోమయంగా కనబడ్తాంది. చీకటేగాని ఎలుగు తండ్ల పడ్తలేదు" మల్లయ్య మాట.

"ఎప్పుడు తినొచ్చినవో ఏమో! కాస్త ఫలహారం చెయ్యి - సరస్వతి తెచ్చింది నా కోసం" అన్నాడు వీరభద్రం.

"ఎందుకు లేరి. ఇదిగో సద్ది తెచ్చుకున్న" అని మూట చూపించాడు.

వీరభద్రం, సరస్వతి బలవంతం చేయగా తిన్నాడు మల్లయ్య.

"ఎక్కడుంటరు పట్నంలో?" అడిగింది సరస్వతి.

"జాగ కరువైనాది ఇంత పెద్ద పట్నమ? ఏ అరుగు మీదనన్నా, తెల్లారె దవకాన్ల పందనియ్యరా? అడిగాడు మల్లయ్య.

"ఎందుకు మా ఇంటికి రారాదండి, అబ్బాయీ, మీరు. ప్రకాశం అక్కడ్నే వుంటున్నాడు"

మల్లయ్య వీరభద్రాన్ని చూశాడు. వెళ్ళమన్నట్లున్నాయి అతని చూపులు.

"దొర్సాని రమ్మన్నాక తప్పుతాది? పోదం పారి"

"నన్ను దొర్సాని అనకు మల్లయ్యా! నేనూ మీలాంటి దాన్నే" అని లేచి నుంచుంది. ప్రకాశం, కోటయ్యా వచ్చేశారు. అంతా బయలుదేరారు. కారులో

పోతూంటె కోటయ్యకు హుషారుగా వుంది. ఆ వీధులు, ఆ సౌధాలు చూస్తూంటే పొంగిపోయాడు. కేరింతలుపెట్టాడు. ప్రకాశం అతని దగ్గరే కూర్చుని అన్నిటిని గురించి చెపుతున్నాడు.

సరస్వతి ప్రకాశానికీ, కోటయ్యకూ ఎలాంటి భేదం చూపలేదు. మల్లయ్యను బాగానే గౌరవించింది. అందరికీ స్నానాలూ, భోజనాలు, పడక గదులు చూపి-ధ్యానమందిరంలోకి వెళ్ళిపోయింది.

'ధనికులలో కూడా మంచివారుంటారు గాబోలు' అనుకున్నాడు మల్లయ్య.

ప్రకాశం, కోటయ్య ఒకే మంచంలో పడుకున్నారు. ఆ గది, ఆ మంచాలు, ఆ పరుపులు, ఆ లైట్లు, ఆ బట్టలు, ఆ అలంకరణ ఆశ్చర్యాన్ని కలిగించాయి కోటయ్యకు. ఇద్దరూ ఎంతోసేపు ముచ్చట్లు పెట్టుకున్నారు. ఎప్పుడో తెల్లవారు జామున నిద్రపోయారు.

మరుసటి రోజు మల్లయ్యనూ, కోటయ్యనూ పట్నమంతా తిప్పాడు ప్రకాశం. వింతలూ, వినోదాలు చూపించాడు. ముచ్చటగా మూడురోజు లున్నారు మల్లయ్యా, కోటయ్యా పట్నంలో. ఈలోగా ఒకే ప్రాణానికి రెండు దేహాలైపోయారు ప్రకాశం, కోటయ్య.

భోజనాలుచేసి బయలుదేరుతున్నారు కోటయ్యా, మల్లయ్య. ప్రకాశం చిన్న బుచ్చుకున్నాడు. సరస్వతి కొన్ని బట్టలూ, కొంత డబ్బూ పళ్ళెంలో పెట్టి తెప్పించింది - మల్లయ్యకు అందించింది.

"అమ్మా! సరస్వతమ్మా! నేను బిచ్చగాణ్ణి కానమ్మా ! బిచ్చమెత్త లేనమ్మా! నీ దయకు ధన్యవాదాలు తల్లీ! ఆ నేల చెక్కా, ఈ రెక్కలు ఉన్నన్నాళ్ళు ఒకరికి చేయిచాచనమ్మా! వద్దుతల్లీ వద్దు" అని నిరాకరించాడు.

సరస్వతి కళ్ళు చెమ్మగిల్లాయి. ఎలాంటి వారుంటారు లోకంలో అనుకుంది. అయినా ఎన్నో చెప్పింది. మల్లయ్య వినలేదు.

"తల్లీ! దండం. పొయ్యొస్త" అని కోటయ్యను పట్టుకొని సాగిపోయాడు. చెమ్మగిల్లిన అతని కళ్ళను గమనించింది సరస్వతి.

ప్రకాశం, సరస్వతి గుడ్లనిండా నీటితో వారిని చూస్తూ ఉండిపోయారు.

కోటయ్య వెనక్కు తిరిగి చూశాడు. కన్నీరు జాలువారుతూంది. ప్రకాశం పరిగెత్తాడు. కోటయ్యను గట్టిగా కావిలించుకున్నాడు. ఇద్దరూ పెద్దగా ఏడ్చారు-కొంత సేపు.

ఇటు మల్లయ్యా, అటు సరస్వతి చూస్తూ నుంచున్నారు.

బండలు కరుగుతున్నాయి.

మల్లయ్య ఓదార్చాడు. కోటయ్య రెక్కపట్టుకొని తీసుకెళ్ళాడు.

ప్రకాశం చూస్తూ ఉండిపోయాడు.

సరస్వతి వచ్చి అతన్ని తీసికెళ్ళింది.

* * *

మల్లయ్య తన పొలం చూసుకున్నాడు. పొలం ఏపుగా పెరిగింది. పొట్టకు గాలికి ఊయలలూగుతూంది. ఆ పచ్చని పొలం మల్లయ్య మనసులో ఊగింది.వచ్చింది. కనులలో నిండింది. ఆకాశంలోకి చూశాడు. మబ్బులు తరుముకొని వస్తున్నాయి. ఇలా వచ్చే గత సంవత్సరపు పంటను ధ్వంసం చేసింది. ఈ ఏడాది సొంతం కట కట అయింది. మళ్ళీ మోసం చేయడానికి వచ్చాడు మేఘుడు. ఏం చేస్తాడో అర్థం కాలేదు. క్షణంలో ఆశ పొంగించింది. మరుక్షణంలో నిరాశ కుంగదీసింది.

మల్లయ్య తన పొలం నుంచి బయలుదేరాడు - తోవలో పశువులను తోలుకునివస్తున్న కోటయ్య కనిపించాడు.

"కోటిగా! వానొచ్చె టట్లున్నది. జల్ది తోలుకపో. ఇంట్ల గింజల్లేవుగని జరే మన్న ఇస్తడేమొ అడుగు యాదగిరిని. పట్కా రాకపోయినవా మాపటికి ఉపాసమే" అన్నాడు.

"అట్లనే" అని ఆవుదూడను అదిలించాడు - కోటయ్య సాగిపోయాడు.

మల్లయ్య మంగమ్మ పొలం చూశాడు. అదీ బాగానేవుంది. వాన చెడగొట్టకుండా ఉంటే బాగానే రాల్తుంది. ప్రకాశానికి పనికివస్తుంది. మబ్బులు ఏం చేస్తాయో అను కొన్నాడు. మళ్ళీ ఆకాశాన్ని చూశాడు. మబ్బు విడిపోతున్నట్లు కనిపించాయి. గాలి జోరుగా వీస్తూంది.

బయల్దేరాడు మల్లయ్య. గాలికి ఊగిపోతున్నాడు. మబ్బులూ, గాలీ పందెం వేసుకొన్నట్టున్నాయి. మళ్ళీ కూడుకుంటున్నాయి.

"మల్లన్నా! వానొస్తం దంటవా?" వీధిన వెళుతున్న నారయ్య అడిగాడు.

"ఏమొ నారయ్యన్నా! చూస్తున్నవుగద మొగులు వస్తున్నది.పోతున్నది. మళ్ళీ ముంచుతదో, తేలుస్తదో ఎట్ల చెప్పటం?"

"అంతేలే. మనకేం తెలుస్తది. ఆ దేవునికే ఎరక కావాలె" అని సాగి పోయాడు నారయ్య.

మల్లయ్య మళ్ళీ నడక సాగించాడు. దేవునికేం తెలుసు పాపం-తెలిసేవన్నీ వీళ్ళకే అనుకొన్నాడు. ఇంటికి చేరి మంచంలో కూలబడి చుట్టచుట్టుకొని కాల్చు కున్నాడు. మరొకసారి ఆకాశంవైపు చూశాడు. మబ్బులు తేలిపోతున్నట్టు కనిపిం చాయి. చుట్ట ముట్టించి పొగ వదులుతూ పిచ్చమ్మను పిలిచాడు.

కుండలు కడుగుతున్నదల్లా చేతులు కడుక్కొని చీరకు తుడుచుకుంటూ వచ్చింది.

"ఏమొ పిలిస్తివి?"

"మళ్ళ ముంచెటట్లున్నది మొగులు" పరధ్యానంగా అన్నాడు.

పిచ్చమ్మ ఆకాశాన్ని చూసి అన్నది, తేలిపోతాందిగద. పోకుంటె మాత్రం చేసెడిదేమున్నది? అది సర్లేగాని చేతులూపుకుంట వచ్చినవు కుండపొయ్యి కెక్కాల్నా వద్దా?"

మల్లయ్య రానున్న పంటనుగురించి ఆలోచిస్తున్నాడు. కుండ, కూడు తల్చుకునేవరకు గుండె గుభెల్లుమంది. "కోటిగాని తోని చెప్పిన. తెస్తుంటడు" అని చుట్ట పొగ వదిలాడు.

"ఏం తెస్తడో ఏమో!" నిట్టూర్పు విడిచింది పిచ్చమ్మ.

కోటయ్య గింజల మూట నెత్తిన పెట్టుకుని కనిపించాడు వస్తూ.

"వస్తున్నడ్లే పెద్ద మూటే తెస్తున్నడు" పిచ్చమ్మ అంటే హేళనకు అనుకొని చూశాడు.

ఇంతలో కోటయ్య ఇంటిముందుకు వచ్చేశాడు.

"ఎన్నిచ్చిండురా?" మంచంలోంచి లేచి నుంచుని అడిగాడు మల్లయ్య.

"కుంచెడు—అటెన్క లెక్క చూసుకొందం లెమ్మన్నడు"అని తలమీంచి మూట దించి తల్లికి అందించాడు.

"ఎంతన్న యాదగిరి మంచోడు" అనుకుంటూ మూట తీసుకుని లోనికి వెళ్ళిపోయింది పిచ్చమ్మ కొడుకుతో సహా.

మల్లయ్య మొదలు లోనకు వెళ్తున్నవారినీ, తరవాత ఆకాశాన్నీ చూశాడు. మబ్బులు విచ్చుకుపోయాయి. ఆకాశం నిర్మలంగా వుంది. గాలి కూడా ఆగిపోయింది. హాయిగా వుంది.

అన్నాలు తిని పడుకున్నారు మల్లయ్య ఇంట్లోనివారు. కోటయ్య గుర్రుపెట్టి నిద్రపోయాడు. మల్లయ్యకూ పిచ్చమ్మకూ నిద్రరాలేదు. వారికి ఇంటి మీది కప్పు ఎగిరిపోయిన చోటు కనిపించింది.

"చూసినవా. వాన ఎండ ఇంట్లనే ఉంటున్నయి. ఎప్పుడు కప్పుకుంటం?" పిచ్చమ్మ అడిగింది.

"ఇగ చూడు. కోతలయితయి గదా. గడ్డివస్తది కప్పుత. కోటయ్యకు బట్టలుకూడ కొనాలె. పోరడు చినిగిన బట్టలు కట్టుకొని తిరుగుతాండు"

"మళ్ళ నాకుమాత్రం ఏమన్న చీరలున్న యనుకుంటున్నవా? చింపుల చీర ఒక్కటేగద"

"అట్లనే నీకు చీరలు కూడ కొంట. ఒక గొడ్డును కొంటె బాగుండునేమోనని చూస్తున్న"

"కొనాలె మళ్ళ. కొనకుంటె ఎగుసం ఎట్లయితది. మంగమ్మ పొలం పంట ఏంచేస్తవు?"

"మంగక్క పొలంల పంట మనదెందుకైతది? ప్రకాశానికి వప్పచెప్పుత."

"కష్టం చేసింది మనం కాదు?"

"అయితే ఏమైతదే నీ పిచ్చిగని! జగ్గయ్య ఊరికోసం చచ్చిండు.. మంగమ్మ జేలుకు పోయింది. వాండ్లు కష్టపడలేరా?"

ఇలాంటి అనేక మాటలు మాట్లాడుకున్నారు. ముచ్చట్లు పెట్టుకున్నారు.. రానున్న పంటను చూచి మురిసిపోయారు. ఇంత తిండికీ, గుడ్డకూ ఉంటే మురిసి పోతాడు మన రైతు. అతనికి భవనాలు, బంగళాలు, సంపదలు, పదవులు అక్కర్లేదు. అతడు యోగి-భోగాలు కోరడు.

ఒకనాటి ఉదయమే పోలీసు జీపు ఊళ్ళోకి వస్తూంది, ఊరి బయటికి వెళుతున్న మల్లయ్య చూశాడు. జీపు లేసిన దుమ్ము అతని కళ్ళల్లో కొట్టుకుంది. ధోవతి కొనతో కళ్ళు తుడుచుకుని వెనక్కు చూచాడు. జీపు సాగిపోతూంది. అప్పటికే ఊళ్ళో ప్రవేశించింది. ఎందుకో మల్లయ్య గుండె దడదడలాడింది. మళ్ళీ ఏదో ఆపద వచ్చిందనుకొన్నాడు. దబదబా సాగిపోయాడు.

గ్రామంలోకి ప్రవేశించిన జీపు డాక్ బంగళా దగ్గర ఆగింది. అధికారులు దిగారు. అందులో దూరారు. పోలీసులు ఉరికారు. తిరిగి వచ్చారు. రామయ్య ఇంటినుంచి యాదగిరి ఇంటినుంచి ఫలహారాలూ, కాఫీలూ వచ్చాయి. వారు శాంతి భద్రతల రక్షణకు వచ్చారు మరి!

కొంత సేపటికి మరొక జీపు వచ్చింది. రెవిన్యూ ఆఫీసరూ దిగారు. వారికి విందులు ఏర్పాటైనాయి. యాదగిరి కారు డాక్ బంగళా ముందు ఆగింది. యలమంద వచ్చాడు. అధికారులతో సంప్రదింపులు జరిపాడు. రామయ్య కారు వచ్చింది. ఆగింది. అతడు దిగాడు. అతడూ సంప్రదింపులు జరిపాడు. నారయ్య వచ్చాడు. చేతులు పట్టుకొని నిలిచాడు.

అంతా ఒక నిర్ణయానికి వచ్చారు.

ఊరు ఊపిరి బిగపట్టి చూస్తూంది. అక్కడ జరుగుతున్నదేమిటో అర్థం కావడంలేదు. మధ్యాహ్నానికి బయటపడ్డది. భూదానం ఇచ్చిన భూములు పంచడానికి వచ్చారు.

"భూములు పంచుతారట!" ఈ వార్త అగ్గిలా పాకింది ఊళ్ళో. జనం ఒక్కొక్కరే బంగళా దగ్గరికి చేరసాగారు. గుంపు బాగానే చేరింది, డప్పులవాళ్ళను పిలిపించారు. ఊళ్ళో చాటింపు చేయడానికి. ఎవరికి భూములు అందుతాయోనని ఆరాటంగా చూడసాగారు జనం. డప్పుల వాళ్ళను లోనికి పిలిచాడు రామయ్య. చాటింపు వేయవలసిన విషయం చెప్పాడు.

భూదానం బూములు సర్కార్ బట్వాడా చేయించింది. ఇప్పుడు మల్లయ్య దున్నుకుంటున్న కరణం భూమి నారయ్య పేర అయింది. మల్లయ్యకు ఇగ దాని మీద ఎటువంటి హక్కులేదు. ఇప్పుడు మంగమ్మ చేసుకొంటున్న జగ్గయ్య భూమి యలమంద పేర అయింది.

డప్పులవాళ్ళు తెల్లబోయారు.

"ఏందిర అట్ల చూస్తరు?" రామయ్య అడిగాడు.

"మల్లయ్య, మంగమ్మ బూములే దొరికినాయండి మీకు! ఆ సన్నాసాయన వచ్చినప్పుడు మీరేందో దానం చేసినమంటిరి. దొరేందో దానం చేసిన్ననే. బాంచెను. ఆ బూములేమైనయుండి?"

"ఏందిరో ఏమో పెద్ద పెద్ద సవాళ్ళేస్తున్నవు. లంజకొడకా! చెప్పిన పని చేయరా అంటే. డప్పేసినన్క కల్లీల్లు తాగండి" అని డబ్బు అందించాడు రామయ్య.

"అంతేలెండి కాల్మొక్తం మాకేమ్టికుండి. కల్లీల్లకు పైకమిచ్చిన్రు సాటిస్తం బాంచను!" అన్నాడు మరొకడు.

అక్కడే డప్పులు డమడమ మోగాయి. రామయ్య చెప్పిందానికి దగ్గరలో ఉండేటట్లు చాటించారు. చెప్పింది ఇలా ఉంది.

"మల్లయ్య భూమి నారయ్య పేర, మంగమ్మ భూమి యలమంద పేర అయిం దహో"

జనంలో ఉత్సాహం వచ్చింది. కలకలం బయలుదేరింది. భూదానం అంటే ఇదా అనుకొన్నారు. ముక్కుమీద వేలు వేసుకొంది ఊరు. గుసగుసలాడారు జనం. ఊరు అట్టుడికిపోయింది.

చాటింపు మాటకే. అంతకు ముందే పాకిందా వార్త.

బువ్వకు వచ్చిన మల్లయ్య మీద పిడుగు పడ్డది. చెట్టు కూలినట్లు కూలబడ్డాడు. చతికిల పడ్డాడు - అదొక రకంగా చూడసాగాడు. వెర్రివెర్రిగా చూశాడు.

పిచ్చమ్మ ప్రాణాలు పైపైనే పోయాయి. ఒకటి పొలం పోయిన వార్త. ఎదుట భర్త ఎట్లనో చేస్తున్నాడు.

"ఏమయ్యో! ఏమయ్యో!" అని మల్లయ్యను పట్టుకొని ఊపింది. దుఃఖం ముంచుకొని వచ్చింది. అయినా ఏడ్వలేదు.

"ఏమయ్యో! నిన్నే! ఏమో అట్ల చేస్తున్నవు" గట్టిగా ఊపింది.

మల్లయ్య మనలోకి వచ్చాడు.

"పిచ్చీ పొలం పోయిందే" అని ఏడ్చేశాడు.

కోటయ్య పరిగెత్తి వచ్చాడు. "అయ్యా! పొలం పోయిందే" అని తండ్రిమీద పడి ఏడ్వసాగాడు.

పిచ్చమ్మ ఇద్దరినీ చూస్తూ ఉండి పోయింది. ఆమెలో అగ్గికొండ బద్దలైంది. కంటి తడి ఆగిపోయింది. గర్జించింది.

"నాలమా అన్నాలమా? ఇది ఊరా? మసాణమా? చెప్పెటోడు లేడా? నిప్పచ్చరమైనాది? పొలాలు గుంజుకుంటారు? పోదం రారి ఎట్ల గుంజుకుంటరో చూదం" అని నడుంకట్టి బయల్దేరింది. కోటయ్యను లాక్కొనిపోతూనే ఉంది. మల్లయ్య క్షణం

చూశాడు. మహాశక్తిలా ఉంది. మళ్ళీ ఏం ప్రమాదం వస్తుందో అనుకున్నాడు. వెంట నడిచాడు.

వీధుల్లో వీరంగం వేస్తూ బయలుదేరింది పిచ్చమ్మ.

"హోయేనాడు కట్టుకపోతారు? వాండ్లకు పిల్లి జల్లి లేరు. మా ఉసురు తాకి పోరు. వాండ్ల ఇంట్లో ఉప్పల్లి మొల్వదు? వాండ్లు ఊరొదిలిపెట్టి పోరు"

అరుస్తూ, కేకలేస్తూ సుడిగాలిలా సాగిపోతూంది పిచ్చమ్మ కేకలు విన్న సుమతి వీధి గుమ్మంలోకి వచ్చి విన్నది. చెవులు-మూసుకున్నది. పిచ్చమ్మను చూసింది. మహాశక్తిలా సాగిపోతూంది. ఆమె గుండెలు దడదడలాడేయి. గాంధీ గుర్తుకు వచ్చాడు. గబగబా లోనికిపోయింది. దేవుని గదిలోకి వెళ్ళి దండంపెట్టింది. "ఏమిటి ప్రభూ! ఎందుకు చేయిస్తున్నావిట్లి? నా కొడుకును రక్షించవా? నా కాపురం కాపాడవా?" అన్నది. దుఃఖం పొంగింది. మనసేదో కీడు శంకించింది. కళ్ళవెంట నీరు ధారాపాతంగా కారుతుండగా కూలబడిపోయింది. పెద్దగా ఏడ్వలేకపోయింది. కుమిలి కుమిలి ఏడ్చింది.

పిచ్చమ్మకు పిచ్చెక్కిందనీ, కార్చిచ్చులా సాగివస్తూందనీ వార్త అందింది రామయ్యకు. అక్కణ్ణుంచి జారుకొన్నాడు. యాచగిరికి అంత అవకాశం దొరకలేదు. బంగళాలోని గదిలోకి వెళ్ళిపోయాడు.

రువ్విన కాగడాలా ఊడిపడింది పిచ్చమ్మ. జుట్టు చింతచెట్టులా ఉంది. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. కాళ్ళూ, చేతులూ వణికిపోతున్నాయి. వరండాలో అధికారులను చూసింది. చండ్ర నిప్పులు కురిసింది.

"నాలం చేస్తందుకు వచ్చిన్రా? మనుష్యుల్ని మాడ్చుక తినెటందుకు వచ్చిన్రా? నోటి ముందర ముద్ద గుంజుకొంటారు? మనిషి చేసుకొనే పొలాలు గుంజుకుంటారు? ఇందుకే సర్కారు మీకు కొలువులిచ్చిండా? ఎందరి నోళ్ళల్లి మన్ను కొట్టిన్రు. ఇంకెందరి పొట్టల్ల మట్టిపోస్తరు మాకు......"

పోలీసు అధికారి గడగడలాడాడు. వాస్తవంగానే అన్యాయం జరిగిందని అర్థం చేసుకొన్నాడు. దాంతో అతని ధైర్యం చచ్చిపోయింది. రెవిన్యూ అధికారిని చూశాడు. అతనికీ అయోమయంగా ఉంది. అయినా అన్నాడు —

"అమ్మా! నువ్వట్ల అరుస్తె మే మేం చేస్తం? అన్యాయం జరిగిందంటున్నావుగద విచారణ చేస్తం. నీ మొగనితో మాట్లాడ్తం. నువ్వు జర నోరు మూసుకో".

"మాట్లాడెడిదేంది? మా పొలం మాకిప్పించుండి. నోరు మూసుకొనే పడున్నం కద ఇన్నాళ్ళు?"

"అదేనమ్మ విచారించాలెగద. సర్కార్‌నుంచి హుకుం వచ్చినట్లు మేం చేసెటోళ్ళం. మీరు చెప్పింది అక్కడ చెప్పుతం. మాదేంది? అందుకే మల్లయ్యతో మాట్లాడ్తనంటున్న."

"మాట్లాడుండి" అని పక్కనున్న బండమీద కూలబడ్డది పిచ్చమ్మ.

"మల్లయ్యా! భూమి కరణపోరిదిగద నువ్వెట్ల చేసుకొంటున్నవ్?" అధికారి ప్రశ్న.

"ఆ దొర ధర్మాత్ముడు. నా కిచ్చిండు కాదుండి. ఇయ్యాళనా నిన్ననా? ఇరవై యేండ్లాయె దున్నుకుంటాంటిని! ఇయ్యాళ కాదంటె పోతాదుండి?"

"అదికాదు మల్లయ్యా! భూమి నీది కాదాయె. నీపేర లేదాయె?"

"కరణపోరి భూములన్నీ రామయ్య దున్ను కుంటాండు. అవీ ఎందుకు గుంజరు?" పిచ్చమ్మ పిడుగులు కురిపించింది.

నిరుత్తరుడైనాడు అధికారి, అయినా అన్నాడు.

"సర్కారు కాగితాల్ల అయ్యన్నీ రామయ్యపేర ఉన్నయి. ఈ భూమి కూడా ఆయన పేరనే ఉన్నది. మేమేం చేయగలం?"

"కరణీకం చేతుల పట్టుకొని కాయితాలన్నీ మారుస్తాంటె. మళ్ళ సర్కారేం చేస్తున్నది? మీరేం చేస్తున్నరు? సర్కారంటే రామయ్యనా? మీరా?" నిలదీసి అడిగింది పిచ్చమ్మ.

గుడ్లు తేలవేశాడు అధికారి. అతనికి అర్థంకాలేదు. వాస్తవంగా ప్రభుత్వం చేస్తున్నదెవరో?

"మల్లయ్యా! నువ్వేమంటావో చెప్పు"

"అనెడిదేందుండి. గుంజుకొన్న భూమి ఇప్పించండి. రెక్కలు ముక్కలు చేసుకొని పండించిన్నుండి. పంటకూడా పోస్కపోతారా?"

"అట్లన్నవు బాగున్నది. ఈ యాడాది పంటల కౌలుగింజలు నారయ్యకియ్యి, పంట నువ్వు తీసుకో. ఆ ఇంతజాం చేస్త"

"మల్ల పొలం మాచేమంటరు?"

"నేననెడిదేంది? అన్యాయం జరిగిందంటున్నవు. దరఖాస్తియ్యి. విచారణ జరిపిస్తం."

"మా పొలం గుంజుకొంటిరి. మేమే దరఖాస్తియ్యాలె" పిచ్చమ్మ అడిగింది. పంట వస్తుందని తెలిసి కొంత శాంతించింది.

'ఇయ్యాలమ్మ. ఇయ్యాలె. ఇది సర్కారు. సర్కారంటే దరఖాస్తు'

"మళ్ళ పంటన్న మా కిప్పించుండి. మంగమ్మ బూమెందుకు గుంజుకున్న రుండి?" అడిగాడు మల్లయ్య.

"మల్లయ్యా! నీ సంగతి నువ్వుచూసుకో. ఆ బూమి జగ్గయ్యదాయె. మంగమ్మ మళ్ళీ పెండ్లిచేసుకొనె. ఆమె కెట్లుంటది చెప్పు?"

"ఏ అయ్యకు పుట్టిండని కరణం పొలాలు కాజేసిండు రామయ్య? ముంగల మంగమ్మను ముంచిండు. ఆ సెన్క జేలుకు పట్టించిండు. ఇప్పుడు పోరని ముంచిర

ముద్ద గుంజుకొంటాడు. భగవంతుడు గంపెడు కన్ను పెట్టుకొని చూస్తూనే వున్నడు. పురుగులుపడి చావంగ చూడకపోతాం" పిచ్చమ్మ శాపనార్థాలు పెట్టింది.

"ఇగో పిచ్చమ్మా! మితిమీరి పోతున్నవు. నీ పని తీరెందిగద ఎళ్ళిపో" పోలీసు అధికారికి కోపం వచ్చింది.

"ఆ పొలం గూడ మేమే దున్నినం."

"ఒక్కగింజ రాదు. ఊరుకుంటూంటే పురెక్కుతాంది. ఎళ్ళు ఈడినుంచి" పోలీసు అధికారి కండ్లెర్రజేసి కుర్చీలోంచి లేచి నుంచున్నాడు.

మల్లయ్య వణికిపోతున్నాడు. ఏదో అవాంతరం రానున్నదని గమనించాడు. పిచ్చమ్మను లాక్కుపోతూ అన్నాడు:

"పదవే పిచ్చి పద. వీండ్లు మనకు బాగుచేయటానికి వచ్చిన్రనుకొన్నవా? దోచుకునెటందుకు వచ్చిన్రు" అని అధికారివైపు తిరిగి "దరఖాస్తు యియ్యాల్నట- దరఖాస్తు. రక్తం పిండి పండించిన పంట. ఒక్కొక్క గింజల నా నెత్తుటి చుక్కలున్నయి. అయ్యికూడా నారయ్యనే తినమను. నాకు అండ్ల ఒక్క గింజొద్దు. చమటోడ్చి బతుకుత. కష్టంచేసుక బతుకుత. రెక్కలున్నన్నాళ్ళు బతుకుత. మా కాలం రాకపోదు. మేం చూడకపోము" అని వెనక్కు తిరిగి పిచ్చమ్మను లాక్కొని వెళ్ళిపోయాడు.

ఇద్దరు అధికారులూ లేచినుంచున్నారు. చూపందినంతవరకు వారిని చూచారు. ఒకరిని ఒకరు చూచుకొని నిట్టూర్చారు. కుర్చీల్లో నీరసంగా కూలబడ్డారు.

పిచ్చమ్మ ఇంటికి చేరి పెద్దగా ఏడ్చింది. ఇంతసేపు దాగివున్న దుఃఖం పొంగి పొర్లింది. కోటయ్యను పట్టుకొని బావురుమంది. గోడుగోడున ఏడ్చింది.

కూలిగా మారిన మల్లయ్య మంచంలో కూలబడ్డాడు, స్థిరంగా వారిని చూడసాగాడు. పైకి చూచాడు. చెదిరి పోయిన కప్పు కనిపించింది. లోనికి చూశాడు. బోర్లించి ఉన్న కుండలు కనిపించాయి. పొలాన్ని తలచుకున్నాడు. అది అన్ని మూలలనుంచి అంటుకొని తగలబడుతున్నట్లనిపించింది. వీరభద్రం సాధారణంగా చదివే ఇక్బాల్ పద్యం గుర్తుకు వచ్చింది:-

"జిన్ ఖేత్ సె దహఖాఁకొ ముయస్సర్ నహీ రోజీ
ఉస్ఖేత్‌కే హర్ ఖోషలు గందుమ్‌కో జలాదో"

(దున్నువానికి కూడు పెట్టని పొలముండి ఫలమేమి?
మూల మూల అగ్గిపెట్టి కాల్చేయండి) ఆ చిచ్చు మల్లయ్య గుండెలో రగిలింది. మంచంలోంచి లేచి గబగబా పొలంవైపు నడిచాడు. దూరంనుంచే కనిపించింది పొలం - ఏపుగా పెరిగి తల ఊపుతూంది. తనను రమ్మంటూంది అనుకున్నాడు. గబగబా సాగిపోయాడు. అది తన పొలం. నిన్నటిదాకా - కాదు - పొద్దుట దాకా తనది. ఇప్పుడు నారయ్యది అయిపోయింది! అయినా అనుబంధం వదల్లేదు. అది తనను పిలుస్తూంది. పంటను కౌగిలించుకోవాలనుకున్నాడు. పొలంలోపడి ఏడ్వా

అనుకున్నాడు. తన గోడంతా చెప్పుకోవాలనుకున్నాడు. పొలం అర్థం చేసుకుంటుం దనుకున్నాడు. తనతో కన్నీరు కారుస్తుందనుకున్నాడు. పిచ్చివాడు? అనుబంధంతో ఆత్రులు చాచాడు. ఉరికాడు.

"హైరో!" కేక వినిపించిందేగాని ముందున్న హుసేన్ కనిపించలేదు.

"యాడికి పోతున్నవ్? నీ అబ్బదా పొలం? నారయ్యదైంది?"

"ఏంది?" నోరప్పగించి చూచాడు మల్లయ్య.

"నిక్లో యహాఁసే" గర్జించాడు. ఒక తోపు కూడా తోశాడు హుసేన్.

అడుగు వెనక్కువేసి నిలదొక్కుకొని నుంచున్నాడు మల్లయ్య. ఉత్సాహం ఇగిరిపోయింది, ఉద్రేకం క్రమక్రమంగా పొంగుతూంది.

"మల్లన్నా! పొలం నీది కాదాయె. మళ్ళెందుకొచ్చినవ్" అప్పటికి అక్కడికి చేరుకొన్న సైదయ్య అన్నాడు.

"చూసి పోదమని వచ్చిన పొలం గదనే గుంజుతాంది."

"చూసినవు గద. చలో అబ్ నిక్లో" హుసేన్ అన్నాడు.

మల్లయ్య మాట్లాడలేదు, క్షణం పొలాన్ని చూచాడు, అదితనను పిలుస్తూంది. తాను దాన్ని చేరలేకున్నాడు. దుఃఖం పొంగింది. కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. వెనక్కు తిరిగి బారెడేసి అంగలు వేసుకుంటూ ఇంటికి చేరాడు.

"మస్తానన్నా నన్నెందుకు తీస్కపోకపోతివి?" అని బిగ్గరగా ఏడ్చి పడి పోయాడు. పిచ్చమ్మ మల్లయ్యమీద పడి ఏడ్చింది. కోటయ్య వారిద్దరి మీదా పడి ఏడ్చాడు. అసలు ఊరంతా ఏడ్చింది. అంత పెద్దగా కాదు. కుమిలి కుమిలి ఏడ్చింది.

సుమతి కళ్ళు ఉబ్బి వుండడం గమనించాడు రామయ్య.

"ఏమె ఏడ్చినట్లున్నవు! మంచిగుంటె బాగనపిస్తలేదా? ఆడదాని ఏడ్పు ఇంటికి అరిష్టమంటరు. నేను బాగుంటే చూడలేవా?"

సుమతి గుండె దడదడలాడింది. దుఃఖం గుండెలో చేరుకోసాగింది. ఏమనాలో? ఎలా చెప్పాలో అర్థంకాలేదు. ప్రతిదానికి విపరీతార్థాలు తీస్తాడు. అయినా అన్నది డగ్గుత్తుకతో.

"నాకేమీ బాగనిపిస్తలేదుండి. ఆ మల్లయ్య పొలం ఎందుకు గుంజుకోవాలె? అది ఎన్ని శాపనార్థాలు పెట్టింది! నా కొడుకును బతకనీయరా? ఆ పొలం ఇచ్చెయ్యండి. మీ కాళ్ళు పట్టుకొంట" అని కాళ్ళమీద పడిపోయింది.

ఆ మాటలతో రామయ్యలో మరోచిచ్చు రగులుకుంది. అక్షరాభ్యాసంనాడు చేతులు కట్టుకొని నుంచున్న ప్రకాశం కనిపించాడు. తాను మంగమ్మ పొలం లాగే శాడు. అది మంగమ్మను సాధించాలని! ప్రకాశాన్ని గురించి ఆలోచనేలేదు. వాడి నోటిముందరి తిండి లాక్కున్నాడు. ఎవరు? తండ్రి! తనకొడుకు ముందరి తిండి....! మనసులోని ముల్లు కదిలింది, కెలుకసాగింది.

"ఏమండి, మాట్లాడరేమండి. నా కొడుకును బతకనీయండి" సుమతి ప్రార్థిస్తూంది.

"కొడుకు. కొడుకు. కొడుకు! నీకు కొడుకు కావలె. నా అధికారం అక్కర లేదు. నేను అక్కరలేదు" అని కాళ్ళు విడిపించుకొని జరిగాడు.

అతనిలోని మంట ఆవిడకు తెలియదు.

కళ్ళు తుడుచుకొని లేచినుంచొని అన్నది.

"అయితే నా పొలంలోది ఇవ్వండి"

మండిపోయాడు రామయ్య.

"అంత దన్క వచ్చినాది! ఆస్తి ఉన్నదని మిడిసిపడ్తున్నవు. అయితే ఆడనే పొయ్యుండు. నేనెందుకింక?" అని చరచర నడిచి వెళ్ళిపోయాడు రామయ్య.

సుమతి పరుపులో పడి గోడు గోడున ఏడ్చింది!

యాదగిరి భార్య సావిత్రి భర్తతో అంది.

"ఎందుకండి మంగమ్మ భూమి గుంజుకొన్నరు? ఏం పాపం చేసినమో పిల్లల్లే కుండయ్యిను. ఆమె ఉసురు తగలదానుండి. యల్లమందకేం పొలం లేదా? ఇచ్చెయ్యండి. అయ్యో ఇచ్చెయ్యండి" గారాంగా అంది.

యాదగిరి భార్యను దగ్గరికి తీసుకున్నాడు. ముద్దు పెట్టుకున్నాడు. "పిచ్చిదానా! నేను తీసుకున్నానే పొలం. ఇచ్చింది సర్కారు. తీసుకున్నది యలమంద. మనకెందుకు తగుల్తదే పాపం!" అని కౌగలిబిగించాడు.

పొలందగ్గర చుట్ట కాల్చుకుంటూ అన్నాడు సైదయ్య - "హుసేనన్నా! నువ్వేమన్నను. నాకు అన్నాలంగనే కండ్లపడుతున్నదే."

"అరె! సైదూభాయ్! తూ దివానాహై మనం బతికేదే అన్నాలంమీద కదరా!" అన్నాడు హుసేన్.

పట్నంలో ఈ వార్త పిడుగులా పడింది సరస్వతిమీద. వార్త తెచ్చింది శేషయ్య. అతనిమీద అగ్గి కురిపించింది సరస్వతి.

"అన్యాయాలకు, అక్రమాలకు, అధికారాలకు ఒక హద్దుండాలి. అదీ భూదానం భూమి విషయంలోనా! ఉన్నవారి మనసు మార్చి లేనివారికి సహాయం చేయాలని తపస్సు సాగిస్తున్న సుందరరావు యోగీశ్వరుని కళ్ళల్లోనా దుమ్ము కొట్టేది! అదీ మల్లయ్య భూమి లాక్కొని అతన్ని మంట కలుపుతావా? నా గుండె మండిపోతూంది. వెళ్ళు ఇక్కడ్నుంచి ఊరికివెళ్ళు. ఆ భూమి మల్లయ్య కిప్పించి నాకు ముఖం చూపించు. ఊఁ కదులు."

శేషయ్య అదిరిపోయాడు. సరస్వతిలో అంత ఉద్రేకం అతడెన్నడూ చూడ లేదు. అలాంటి మాటలు వినలేదు. తనను శాసిస్తూంది అనుకున్నాడు. వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. శేషయ్యకూ అందులో ఏదో అన్యాయం కనిపించింది. అయితే అతడు

ఏమీ చేయలేక పోయాడు. అతడూ అందులో ఒక భాగమే. అయితే తపన వదల్లేదు. క్లబ్బుకు వెళ్ళి బ్రాందీని ఆశ్రయించాడు.

శేషయ్య వెళ్ళిపోయింతర్వాతగాని తాను ఎంత ఉద్రేకపడిందీ తెలిసిరాలేదు సరస్వతికి. ఇంకా వణికిపోతూనే ఉంది. ఉద్రేకం బలహీనతకో చిహ్నం. అదీ ఆమెకు తెలిసింది. ఏదో పెద్ద తప్పు చేశాననుకుంది. ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకొంది. ప్రార్థనా మందిరంలోకి వెళ్ళింది. గాంధీజీ పటంముందు నుంచుంది. తాను తప్పుచేశానని అంగీకరించింది. చిత్తస్థైర్యం ప్రసాదించమని వేడుకుంది. కళ్ళు మూసుకొని ప్రార్థించాలనుకొంది. మల్లయ్య ప్రత్యక్షం అయినాడు.

"అమ్మా! సరస్వతమ్మా! నేను బిచ్చగాణ్ని కానమ్మా! బిచ్చమెత్త లేనమ్మా! నీ దయకు ధన్యవాదాలు తల్లీ! ఆ నేల చెక్కా ఈ రెక్కలూ ఉన్నన్నాళ్ళు ఒకరికి చేయిచాచనమ్మా! వద్దు తల్లీ వద్దు."

అంటున్నాడు మల్లయ్య. ఎంత మంచివాడు! ఎంత విశ్వాసం ఉంది తన మీద! తాను ఇస్తానంటే వద్దన్నాడు. తన శ్రమను నమ్మాడు. నేల చెక్కను నమ్మాడు. ఏదీ నేల చెక్క? దాన్ని లాక్కున్నారు! అదీ భూదానం పేర! భూదానం! దానం ఇచ్చిందాంతోనా చెలగాటం! దాంతో బేరాలా? దానాలుకూడా దానవుల్ని చేస్తాయా? అదీ దేవతలాంటివారిమీదా! మల్లయ్య ఎంత మంచివాడు! అతని మీదనా ఈ అస్త్రప్రయోగం. బలరామయ్య, రామయ్య, శేషయ్య, యాదగిరి అంతా రాక్షసుల్లా కనిపించారు. వారి కోరలు పొడవుగా కనిపించాయి. వాటినుంచి రక్తం కారుతున్నట్లు కనిపించింది. వారికి కొమ్ములున్నట్లు తోచింది. వాటికి మనుషుల పుర్రెలు కనిపించాయి! మల్లయ్య - ఎముకల పోగు. మల్లయ్యను కుమ్ముతున్నారు - నలుగురు నాలుగు వైపుల నుంచి. పాపం పారిపోలేదు. ఎదిరించలేదు. రక్తం కారుతూంది. బేలగా చూస్తున్నాడు. వారు పొడుస్తూనే వున్నారు.

"వదలండి. వాణ్ణి వదలండి." అని కేకపెట్టింది.

కళ్ళు తెరిచి చూచింది. ఏమీ లేదు. అంతా భ్రమ. మనసు ఎలా చెదితే మనిషి అలా భావిస్తాడు. తాను అలా అనుకొంది. అందుకే అలా అరచింది. ధ్యానం నిలవడం లేదు, మనసు ఉండడంలేదు. మళ్ళీ కళ్లు మూసుకుంది.

నలుగురు రక్కసులు!

రక్తం కారుతున్న మల్లయ్య!!

అంతే. ఇంకేమీ కనిపించలేదు. ధ్యానం చేసుకుంది. గదినుంచి బయటికి వచ్చింది. రాటం వడుకుతూ కూర్చొంది. కొంతసేపు జ్ఞాపకం రాలేదు. అయినా కలవరం వదల్లేదు. నోరు ఆరుకుపోతూంది. నీళ్ళు తాగింది. శేషయ్య వెళ్తాడా? రామయ్య వింటాడా? ఇంతలో ఆవిడకు జ్ఞాపకం వచ్చింది బలరామయ్యకూ - రామయ్యకూ మాటల్లేవు. శేషయ్య రామయ్యతో మాట్లాడడు! తానెందుకు చెప్పినట్లు? తన కవన్నీ గుర్తులేవు. అయినా శేషయ్య సాధించగలడు.

టెలిఫోను తిప్పింది. మ్రోగుతూంది— ఎత్తిన వారు లేరు - విసిగింది - ఎత్తారు - శేషయ్యలేడు.

గడియారం చూచింది. ఒంటిగంటయింది రాత్రి! కాలం తెలిసిరాలేదు. పడక గదిలోకి వెళ్ళింది. తనకోసం తెచ్చిపెట్టిన పండ్లు అక్కడే వున్నాయి. వాటివైపు చూచింది. అంతే తినబుద్ధికాలేదు. మంచంలో మేను వాల్చింది. ఎదురుగా గాంధీజీ-సుందరరావు - పటాల్లో నవ్వుతున్నారు. "బాపూ! ఇందుకేనా బాబూ బలియైనావు!" అనుకుంది. కళ్ళు మూసుకుంది.

నలుగురు రక్కసులు!

రక్తం కారుతున్న మల్లయ్య!!

మనసు చంచలమైంది అంటారు. మరి దేనిమీదికీ పోదేం? అనుకుంది. బహుధా ప్రయత్నించింది. ఎన్నో దృశ్యాలు తలచుకుంది. వీరభద్రం కనిపించాడు. "నీది పలాయనవాదం. పలాయనవాదం అంటున్నాడు. కాదు. కావడానికి వీల్లేదు. తాను మంత్రి భార్య. మల్లయ్యకు పొలం ఇప్పించ లేదూ! ఇప్పించాలి. తప్పదు. ఏంచేయాలి? ఏంచేయాలి?

మెదడు బద్దలవుతూంది. చీలుతూంది.

భగవద్గీత తీసింది. ఒక్కొక్క శ్లోకమూ చూడసాగింది. ఆవిడకా శ్లోకాలన్నీ వచ్చు. మననం చేసుకుంది. మొత్తం మొదటినుంచి చివరిదాకా. మందు కనిపించలేదు.

"భగవాన్! దీనికి మందెందుకు చెప్పలేదు?" అనుకుంది.

ఆలోచనలు దొంతరలు దొంతరలుగా వస్తున్నాయి— పోతున్నాయి. వచ్చేసింది ఒక ఆలోచన- తాను ఊరికిపోతుంది. రామయ్యను ప్రార్థిస్తుంది. పరిణామాలను గురించి లెక్కచేయలేదు. నిశ్చయించుకుంది. నిద్రపోవడానికి ప్రయత్నించింది. కలవరం కొంత శాంతించింది. అయినా నిద్ర రాలేదు.

బాగా తెల్లవారుజామున లేచింది సరస్వతి. స్నానాదులు ముగించుకొని ప్రార్థనా మందిరంలో ప్రవేశించింది. కొంతసేపు ధ్యానించింది. అంతరాయం కలుగలేదు. ప్రార్థనా మందిరం నుంచి బయటకి వచ్చేవరకు ప్రశాంతంగా ఉంది. ఏదో ఆత్మవిశ్వాసం ఏర్పడింది. డ్రైవరు కోసం చూసింది. అత డింకా రాలేదు. పత్రిక చూసింది-అదే వార్త. కాని వివరాలు లేవు. భూదానం భూములు పంచారని ఉంది. ఎంత వంచన? అనుకుంది. ఇంతలో డ్రైవరు వచ్చాడు. అల్మారా తెరిచి డబ్బు తీసుకుంది. కారులో కూర్చుంది. కారు సాగిపోతోంది. వాతావారణం ప్రశాంతంగా వుంది. ఆమె మనసు ప్రశాంతంగా వుంది. కళ్ళు మూసుకుని కూర్చుంది.

కారు చప్పుడైతే బయటికి వచ్చాడు రామయ్య. చూచి ఆశ్చర్యపోయాడు. "చిన్నమ్మ వచ్చింది" అని కేకవేసి మెట్లుదిగి సరస్వతిని తీసికెళ్ళాడు. ఇంతలో సుమతి, గాంధీ కూడా వచ్చేశారు. అంతా కూర్చున్నారు. గాంధీని దగ్గరకు తీసు

కుంది సరస్వతి. "నేను పెట్టమన్న పేరు పెట్టారుకదూ" అని, గాంధీతో "గాంధీజీ అంతవానివి కావాలి" అంది. కుశల ప్రశ్నలు అయిపోయాయి. కాఫీ వచ్చింది. తాను కాఫీ తాగనన్నది సరస్వతి - అది వదిలేసి చాల కాలం అయిందన్నది. మజ్జిగ తెప్పించింది సుమతి. గ్లాసు, టీపాయ్‌మీద ఉన్నది.

"నీతో ఒకపని ఉండి వచ్చా" అన్నది సరస్వతి రామయ్యను ఉద్దేశించి.

ఆశ్చర్యంగా చూచాడు రామయ్య.

"నిజం ఇక్కడికే వచ్చా. నీ దగ్గరకే వచ్చా."

"చెప్పండి"

"చేయాలి. నీ చేతులోదే."

"చెప్పందే అట్లాంటె ఎట్ల"

"మల్లయ్య భూమి మల్లయ్య కిచ్చేయి"

రామయ్య వింతగా చూచాడు.

"నా మాట విను. మల్లయ్య మంచివాడు—అది మనకు శ్రేయస్సు కాదు."

"మీదన్క వచ్చిందన్న మాట. నంగనాచివాడు. ఊళ్ళ ఉన్నట్లే ఉన్నడు. ఆడి దన్క వచ్చిండులే."

ఈ తడవ ఆశ్చర్యపడ్డది సరస్వతి. "నా దగ్గరికి ఎవ్వరూ రాలేదు. నేనే వచ్చాను. భూదానం భూమి విషయంలో అలా చేయడం మంచిది కాదు."

"నేనేం చేయలేదిండ్ల చేసిందంత నాయనే. ఆయనతోనే చెప్పకపోయినారు అడనే."

"రామయ్యా! అక్కడ ఆయన లేరు. కొడుకుగా నిన్ను అడిగే అధికారం లేదా నాకు?" చివరి వాక్యం అనాలని లేకున్నా అన్నది.

"నేను కూడ చెప్పిన అత్తమ్మా వింట లేరు" సుమతి అన్నది. ఇంకా ఆమె లోని అవేదన అణగినట్లు లేదు.

"వంతపాడుతున్నవుగని ఇండ్ల నేను చేసిందేమున్నది? గుంజుకొన్నది సర్కార్, ఇచ్చింది సర్కారు. దర్ఖాస్తియ్యమంటేనే ఇయ్యనని నీలుగుతాండు మల్లయ్య. వాని కక్కరలేంది మీకెందుకుంది."

"రామయ్యా! మనం ఉన్నవాళ్ళం. కొంత ఔదార్యం కనపర్చాలి పేదలు— పాపం వాళ్ళకేం తెలుసు?"

"అయితే నెత్తి నెక్కి తందనాలాడమన్నరా! నాకి సంగతి ఏమీ ఎరకలేదు. నేనేం చెయ్యలేను" అని మౌనం దాల్చాడు రామయ్య.

సరస్వతి, సుమతి ముఖముఖాలు చూసుకొన్నారు. వారూ మౌనమే వహించారు.

"కాస్త ఆలోచించు రామయ్యా!"

"బాగనే ఆలోచించిన".

"అత్తమ్మా! మజ్జిగ తీసుకోండి" సుమతి.

"అంతేనంటావా? నేను వ్యర్థంగా వచ్చినట్లేనా"

"మజ్జిగ తీసుకోండి అత్తమ్మగారూ"

"అయితే వెళ్ళొస్తా" అని లేచి నుంచుంది. రామయ్యా లేచి నుంచున్నాడు.

సుమతి లేచి సరస్వతి చేతులందుకుంది. "అత్తమ్మా? భోజనం చేసి వెళ్ళండి" బ్రతిమలాడింది.

"మళ్ళీ వస్తాలేమ్మా భోజనానికి" కదిలింది సరస్వతి.

"అట్లనకండి అత్తమ్మా! మీరిట్ల పోవటం ఈ ఇంటికి మంచిది కాదు."

"వస్తానమ్మా" పరాకుగా అని సాగి పోతూంది.

సుమతి వెనక్కు చూచింది. మజ్జిగ గ్లాసు అలాగే ఉంది! ఒక్క అడుగులో గ్లాసందుకొని వెనక్కు తిరిగే వరకు కారుతలుపు చప్పుడైంది. "అత్తమ్మా! మజ్జిగన్న...." అని ఉరికింది. చేతిలో గ్లాసు జారిపడి ధన్ మని పగిలింది. మెట్లనిండా మజ్జిగ తెల్లగా చిమ్మి పడి ఉంది.

కిందికి చూచింది సుమతి. కారు స్టార్టయిన చప్పుడు వినిపించింది, పైకి చూచింది, కారు సాగిపోతూంది, మళ్ళీ ఒకసారి కిందికి ఒకసారి పైకీ చూచింది. మజ్జిగ కనిపించింది, కారు కనిపించలేదు, కళ్ళలో నీరు నిండింది. వెనక్కు తిరిగి గబగబా నడిచి పోయింది- దేవుని గదిలోనికి.

కారు సాగిపోతుంటే అరుగుమీద కూర్చున్న యాదగిరి చూచాడు. ఆపాడు—నమస్కరించాడు.

"రామయ్య ఇంటినుంచి వస్తున్నరులే" వ్యంగ్యంగా అన్నాడు. "మా ఇంటికి రాకుండనే పోతారు? దొర పట్నంల లేడేమో?" ఆ ధోరణి నచ్చలేదు సరస్వతికి. ఏదో వెలితితనం కనిపించింది. అయినా అడిగింది. పని ఉన్నవానికి తెలివి ఉండదు అనేది ఉర్దూ సామెత.

"మల్లయ్యకు భూమి ఇప్పిస్తావా?"

"అదంతా సర్కార్ పని. నాదేమున్నదండి. దండం" అన్నాడు. సరస్వతి మనసు నొచ్చింది. కాటిమీద పేలాలు వేపుకునేవారు ఉంటారనుకుంది. సాగి పోయింది కారు. మల్లయ్య ఇంటిముందు ఆగింది. మల్లయ్య ఉరికి వచ్చాడు. సరస్వతి ఇంట్లోకి దారితీసింది. పిచ్చమ్మ కోటయ్య వచ్చేశారు.

"మల్లయ్యా! నీ భూమి పోయిందని విన్నా."

"పోలేదుండి. గుంజుకున్నరు. వాండ్ల మోచేతికింద నీళ్లు తాగాలె. లేకుంటె బతకనియ్యరుస్రని. నా బూమే గుంజుకున్నరు. మస్తాన్ ప్రాణాలు తీసిస్రను కాదుండి. మంగమ్మను జేలుకు పంపిరి."

"మల్లయ్యా! నే నొకమాట చెపుతా వింటావా?" నుంచొనే అడిగింది.

"మీరు మా ఇంటికి రావటమే గొప్ప. కూచోండి. చెప్పండి"

కోటయ్య కళ్లు మిటకరించి చూస్తున్నాడు.

"మల్లయ్యా! ఏమనుకోకు. ఇదిగో డబ్బు. పొలం కొనుక్కో" అని డబ్బు తీసి అందించింది.

"అమ్మా! సరస్వతమ్మా! దండం తల్లీ! నీవు దేవతవు! నాకు బిచ్చం వద్దమ్మా! రెక్కలున్నాయి. ఈ పోరడున్నడు. బతుకుతం తల్లీ! ఎప్పుడూ కాలం ఇట్లనే ఉంటదానమ్మా! వద్దు తల్లీ! నాకు డబ్బువద్దు" అన్నాడు చేతులు జోడించి.

మల్లయ్యకు ఎన్నోరకాల చెప్పింది. మల్లయ్యకూడా ఎన్నోవిధాల చెప్పాడు. డబ్బు ముట్టలేదు.

ఓడిపోయినట్లు ఖాపించింది సరస్వతి. ఆమెలో దుఃఖం పొర్లింది. చరాచరా నడిచి కారెక్కింది. కారు సాగిపోయింది.

ముగ్గురూ కారును చూస్తూ ఉండిపోయారు.

ముగ్గురూ కారుకు దండాలు పెట్టారు.

కారు ఆస్పత్రి ముందు ఆగింది. సరస్వతి కారు దిగి లోనికి పరుగెత్తింది.

"వీరభద్రం! నువ్వన్నా చెప్పు" అని కాళ్ళమీద పడి ఏడ్చింది.

చకితుడై లేచి కూర్చున్నాడు వీరభద్రం.

ప్రకాశం కళ్ళప్పచెప్పి చూస్తున్నాడు. కోటయ్య వెళ్ళిపోయిం తరువాత ప్రకాశం సరస్వతి ఇంటినుంచి వచ్చేశాడు.

"లే! ఏమిటా ఏడ్పు పిచ్చిదానివలె" అని తన కాళ్ళ మీదినుంచి తల తీశాడు. కుర్చీలో కూర్చుంది సరస్వతి. మూర్తీభవించిన దుఃఖంలా ఉంది. ఆ సౌమ్యమూర్తి ఎలా మారింది అనుకున్నాడు.

"భద్రం! మల్లయ్య పొలం లాక్కున్నారు...."తో మొదలుపెట్టి జరిగినదంతా సంక్షిప్తంగా చెప్పింది. "భద్రం! నువ్వన్నా చెప్పు మల్లయ్యతో. రా. పోదాం. కారు సిద్ధంగా ఉంది. లే నడువ్. వెళ్దాం" తొందర పెట్టింది.

"కూర్చో సరస్వతీ" దగ్గరగా జరిగి తల నిమిరాడు భద్రం. కళ్ళల్లోకి చూచాడు. ఇంకా కన్నీరు నిలచి ఉంది. వీరభద్రానికి కళ్లు చెమ్మగిల్లాయి, "సరస్వతీ! నీ నిర్వేదం అర్థంచేసుకోగలను. నీ బాధ గ్రహించగలను. నీ ఆవేదన ఊహించగలను. కాని కష్టజీవుల ఔన్నత్యం కొలువలేను. మల్లయ్యలాంటి వాళ్లు కోట్లమంది ఉన్నారు సరస్వతీ! కోట్లమంది. వాళ్ళ రక్తం త్రాగి వీళ్ళు డొక్కలు పెంచుకుంటున్నారు సరస్వతీ. ఎంతమందికి సహాయం చేయగలవు. ఎంత మంది కన్నీరు తుడవగలవు? ఈ లోపం వ్యవస్థలో ఉంది సరస్వతీ! వ్యవస్థలో. ఇది మారాలి. అంతేగాని మల్లయ్య మారడు. అతడు మనం ఇచ్చింది తీసుకోడు. దేహీ అనడు."

సరస్వతి వీరభద్రాన్ని చూస్తూ ఉండి పోయింది.

"వ్యవస్థను గురించి ఉపన్యాసాలు చెప్పకు భద్రం! మల్లయ్యకు నా సహాయం అందాలి. అందుకు గురించి మార్గం చూపించు."

"నీ విధానం మార్చుకో. విశ్వాసాలు మార్చుకో. కష్టజీవుల కోసం నడుం కట్టి రంగంలో దూకు, కోట్లమంది మల్లయ్యలకు సహాయ పడగలవు."

"విశ్వాసం మారదు భద్రం!" లేచి నుంచుంది. "విధానం మారదు. నేను మారను. మారలేను. క్షమించు భద్రం. క్షమించు" అని వెళ్ళిపోయింది సరస్వతి.

చూస్తూ కూర్చున్నాడు వీరభద్రం- నుంచున్నాడు ప్రకాశం.

"కక్కయ్యా! మల్లయ్య మామ భూమి ఎందుకు గుంజుకున్నరు? మనం ఎందుకు ఇప్పించలేం?" గట్టిగా అడిగాడు ప్రకాశం.

"ఇప్పించాలె బాబూ. ఇప్పించాలె, ఇప్పిస్తం. ఇప్పించే రోజు వస్తుంది. నువ్వే ఇప్పిస్తవేమో?" అన్నాడు ప్రకాశాన్ని కౌగిలించుకొని.

సరస్వతి ఆశ్రమం ముందు దిగింది. ఆశ్రమంలోకి పరిగెత్తింది. సుందర రావుగారు ఉన్నారు. వారి పాదాలమీద పడింది. కన్నీటితో కడిగింది. "స్వామీ! భూదానం విషయంలో అన్యాయం జరిగింది. దరిద్ర నారాయణులకు మోసం జరిగింది. మల్లయ్య భూమి లాక్కొని మందికిచ్చారు" ఏడుస్తూనే కథంతా చెప్పింది. కాళ్ళమీది నుంచి లేవకుండానే సొద వెళ్ళబోసుకుంది. పాదాలు చల్లబడుతున్నట్లు అనిపించింది. ఏడుపుమాని తలెత్తి చూసింది.

యోగి ముఖం గంభీరంగా ఉంది.

ఏదో ఉత్పాతాన్ని సూచిస్తున్నట్లున్నది.

ముగ్ధంగా ఉంది. మౌనంగా ఉంది.

సరస్వతి భయం భయంగా చూస్తూంది.

యోగి ముఖంలో ఎన్నో జ్యోతులు వెలిగినట్లయింది.

చూస్తూ ఉండిపోయింది సరస్వతి.

వెలుగు భగ్గున మండి ఆరిపోయినట్లయింది.

సుందరరావుగారు కళ్ళుమూసుకున్నారు. మాట్లాడలేదు. మౌనం వహించారు. సరస్వతి భయపడిపోయింది. "స్వామీ స్వామి!" అని కేకలు పెట్టింది. ఆశ్రమ వాసులంతా కూడారు అడిగారు. "స్వామి ముఖాన మంటలు మండాయి. కొంతసేపు భగభగ మన్నాయి. ఆరిపోయాయి. నేను కళ్ళారా చూచాను. ఆ తరువాత కళ్లు మూసుకొన్నారు. మరి మాట్లాడ్డం లేదు" గబగబా చెప్పింది.

"ఏదో ఆలోచిస్తున్నారు. భయం లేదమ్మా!" అని ఓదార్చారు ఒకరు. అయినా భయం ఆమెను వదల్లేదు. గుండె దడదడలాడుతూంది. వళ్ళు వణుకుతూంది. ఆశ్రమం నుంచి గబగబా సాగిపోయింది.

ఇంటికి వచ్చి చూస్తే బలరామయ్య ఉన్నాడు.

"యాడికి పోయినవు? ఏందీ వేషం?" బలరామయ్య ప్రశ్నతో దుఃఖం పొంగింది సరస్వతిలో. చిన్నపిల్లలా కన్నీరు రాలుస్తూ కథంతా చెప్పింది. సుందర రావుగారి వృత్తాంతం విని గుండె గుభేలుమన్నది బలరామయ్యకు.

"ఏదో పూజలు చేసుకుంటన్నవని ఊరుకుంటుంటె రాజకీయాల్లోకే దిగినావు! ఆశ్రమంల ఎవరితోనన్న అన్నవా ఈ సంగతి?"

"ఎవ్వరితోనూ అనలేదు - సుందరరావుగారితో తప్ప" ఏదో తప్పు చేసిం దానిలా జవాబు చెప్పింది.

"అయితే సరే. ఇగ ఇల్లు కదలకు. ఎరికైందా?" గర్జించాడు బలరామయ్య.

పిల్లిలా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది సరస్వతి, ధ్యాన మందిరం లోకి వెళ్ళి "ప్రభూ! స్వామిని రక్షించు" అని ఏడ్చేసింది.

గర్జించడం గట్టిగానే గర్జించాడుగాని బెదురు పట్టుకుంది బలరామయ్యకు. సుందరరావు ఉపవాసమంటే అతనికీ బెదురు. మళ్ళీ ఉపవాసాలు చేస్తాడేమో అను కున్నాడు. మల్లయ్య సంగతి పొక్కిపోదుగదా! అసలు అందుకే ఉపవాసాలు ప్రారంభిస్తే తాను ఆరిపోతాడు. పత్రికలే కాదు ప్రభుత్వమూ సుందరరావుకి ప్రాముఖ్యం ఇస్తుంది. సుందరరావులో ఉన్న శక్తేమిటి? ఎందుకు అతడంటే తానిలా వణకిపోతాడు? ఏదో కారణం ఉంది. తనకు తెలియనిది- తెలియలేనిది. బక్కగా ప్రాణం లేనట్టు గుడిసెలో పడి ఉండేవాడు గడగడలాడిస్తాడు! అతనిలో ఏదో ప్రభావం వుంది. దానికి తానే లొంగిపోతున్నట్లున్నాడు! నీరసించి పోతు న్నాడు. బలహీనుడై పోతున్నాడు.

మంచంలో పడిపోయాడు బలరామయ్య. జవసత్వాలు జారిపోతున్నట్లనిపిం చింది. జావకారిపోతున్నట్లనిపించింది. తాను చేసిన అన్యాయానికి ఉపవాసం చేయడు గదా! తనను వేలు పెట్టి చూపడు గదా! సుందరరావు ఆహుతి కాడు గదా! ఆ ఆలోచనతో సుడిపడి పోయాడు- మనసు క్షోభించింది. ఏమో? ఏమి అవుతుందో! మనసు ఏదో అవాంతరం సూచించింది. మనిషి తడబడ్డాడు! నిముషాల్లో మనిషి దిగిపోయాడు. ఆరాటం ఎక్కువైంది. అదురుపాటు పెరిగింది. లేవలేకపోయాడు. చెప్పుకోలేకపోయాడు. దుఃఖం ముంచుకొని వస్తూంది. ఏడ్వలేక పోతున్నాడు. అదీ అతని మానసిక స్థితి. అంతకంటె ఎక్కువ చెప్పలేం.

తెల్లవారి పత్రికలో వార్త బలరామయ్యను మరీ కృంగదీసింది.

"సుందరరావుగారు ఉపవాసం చేస్తున్నారు" అదిరిపోయాడు బలరామయ్య. అవతల అడుగు పెట్టలేకపోయాడు.

సరస్వతి మోష చెప్పలేం.

సుందరరావుగారి మనసు క్షోభించింది. సరస్వతి తెచ్చిన వార్త అలాంటిది. దరిద్ర నారాయణుల సేవకోసం తమ జీవితాన్ని అంకితం చేశారు. స్థిర నిశ్చ యంతో సాగిపోతున్నారు. విజయం లభిస్తూనే ఉంది. అందుకు వారికి గర్వమూ

ఎన్నడూలేదు. తమ సిద్ధాంతం విజయవంతం అవుతూందని ఆనందించారు. నిరంతర యతనంతో మానవుని స్వార్థం పోగొట్టవచ్చని ఆశించారు. దేశంలో హింస నశిస్తుందనీ, ఆనందం తాండవిస్తుందనీ, గాంధీజీ ఆత్మ సంతృప్తి చెందు తుందనీ అనుకున్నాడు. ఈర్ష్యా ద్వేషాలులేని దేశాన్ని చూడవచ్చనుకున్నారు. ఆ ఆశతోనే జీవించారువారు. అందుకు ఆఘాతం ఏర్పడింది. తాను నమ్మినవారు తననే మోసగించారు. పరులను నిందించడం వారి గుణంకాదు. తమలోనే ఏదో లోపం ఉందనుకున్నారు. ఏదో బలహీనత వుందనుకున్నారు. ఆత్మ విమర్శ చేసుకోసాగారు. అందుకే ఉపవాసం సాగించారు. ఆ విమర్శే వారిని క్షోభ పెట్ట సాగింది.

ఎక్కడ ఉంది లోపం? గాంధీజీ కసాయి కత్తులలోకి వెళ్ళారు. నవకాళిలో హింసాకాండను నివారించ గలిగారు. నూలుపోగుతో సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాన్ని కట్టివేశారు. దక్షిణాఫ్రికాలోని కసాయిలను అహింసాయుధంతో ఎదిరించారు. ఆయన ఒకరిని అని ఎరుగరు. అంత ఆత్మశక్తి ఉంది వారిలో! మరి తనకు? తానూ వారి అడుగు జాడల్లోనే నడుస్తున్నాడు. సాధ్యమైనంతవరకు నిగ్రహం వహిస్తున్నాడు. నిలకడలేకుండా నడుస్తున్నాడు. అందరికీ బోధిస్తున్నాడు. ఆ మహాత్ముడు చెప్పినవే చెపుతున్నాడు. మనుషులు మారినట్లే కనిపిస్తున్నారు. మారుతున్నారనుకున్నాడు తాను. తన సంకల్పంలో స్థిరత్వం ఉందనుకున్నాడు. తాను సిద్ధ సంకల్పుణ్ణి అనుకున్నాడు. కాదు? తనది స్థిర సంకల్పం కాదు. తనలో ఎక్కడో లోపం ఉంది. ఏదో లోపం ఉంది. ఎక్కడ ఉంది. ఏది?

క్షోభపడిపోతున్నారు సుందరరావుగారు. వారి మనసుకు శాంతి లేదు. అశాంతిలో తల్లడిల్లి పోతున్నారు.

రోజులు వారాలుగా మారాయి. ఆశ్రమం జనంతో నిండిపోయింది. దేశంలో హాహాకారాలు చెలరేగాయి. పత్రికలు ప్రకటిస్తున్నాయి. రేడియోలు ప్రసారం చేస్తు న్నాయి. నాయకులు దిగుతున్నారు. నానా ప్రశ్నలు వేస్తున్నారు. విదేశాలనుంచి పత్రికల వాళ్లు వస్తున్నారు. టెలివిజన్ కెమెరాలు కదులుతున్నాయి.

సుందరరావుగారి పెదవి కదలలేదు.

వారు శుష్కించి పోతున్నారు.

వారాలు నెలలైనాయి!

వారిలో తపన పెరిగింది. క్షోభ పెరిగింది. తాను ఓడిపోయాననుకున్నారు. గెలువలేననుకున్నారు. తాను చేసిన తపస్సు వృధాపోయిందనుకున్నారు. ఆత్మార్పణకే సంసిద్ధులైనారు.

ఆ వార్త దేశంలో అగ్గిలా పాకింది. వారిని కాపాడాలని దేశం గగ్గోలు పెట్టింది. ప్రభుత్వాన్ని తిట్టింది. దుయ్యపట్టింది. ప్రధాని సహితంగా మహా మహా నాయకులు దిగారు. కారణా లడిగారు. శాసనాలు చేస్తామన్నారు. దీక్ష మాను

మన్నారు. సుందరరావుగారు పలుకలేదు. తాను జీవించి ప్రయోజనం లేదన్నట్లు చూశారు.

సమావేశాలు జరిగాయి. చర్చలు జరిగాయి. ప్రార్థనలు జరిగాయి. పూజలు జరిగాయి. అర్చనలు జరిగాయి. సమారాధనలు జరిగాయి. ఆశ్రమానికి జాతర సాగింది. దేశదేశాలనుంచి జనం వచ్చి సుందరరావుగారిని దర్శించుకొని పోతున్నారు.

ఆశ్రమం పట్నం అయింది. అదెంత క్షోభ పెట్టిందో వారిని!

సరస్వతి శల్యం అయింది. ఆమె నిద్రాహారాలు మానేసింది. స్వామిని రక్షించమని ప్రార్థించడంతోనూ పనిలేకుండా పోయింది. జీవితంలో ప్రధాన వస్తువు కోల్పోతున్నట్లనిపించింది. అనాసక్తిగా ప్రార్థనలో మునిగిపోతూంది. ఆమె లోకంతో పని వదులుకుంది.

బలరామయ్య పిచ్చివానిలా, కాలు కాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఆశ్రమానికి పోతాడు వస్తాడు. వెర్రిగా ఇంట్లో తిరుగుతాడు. సరస్వతిని చూస్తాడు. బయటికి వస్తాడు. దీనంతటికీ ఏదో తనదే బాధ్యత అన్నట్లు కుంగిపోతున్నాడు. అది ఎవరికీ చెప్పుకోలేదు. చెప్పుకోకుంటే గుండె క్రుంగదీస్తుంది. చెప్పుకోవాల్సింది సరస్వతితో. ఆమె ఈ లోకంలో ఉన్నట్లు కనిపించడంలేదు. అలా కృంగి కృశించిపోతున్నాడు బలరామయ్య.

ఒకనాటి ఉదయం టెలిఫోను మ్రోగింది.

బలరామయ్య రిసీవర్ ఎత్తాడు.

"సుందరరావుగారు పరమపదించారు"- అదీ వార్త.

"ఆఁ ఆఁ ఆఁ" అన్నాడు బలరామయ్య. రిసీవర్‌తో సహా పడిపోయాడు బలరామయ్య. రిసీవర్ విరిగింది. టెలిఫోను నేలమీదపడి పగిలింది. ఇంట్లోని వారంతా కూడారు.

బలరామయ్యకు నోరు రావటంలేదు.

ఏదో చెప్పాలనుకొంటున్నాడు. అది వంకరపోయింది. కుడికాలూ చేయీ వణకుతున్నాయి.

గగ్గోలు పెట్టారు జనం.

బలరామయ్య ఏదో చెప్పాలని నోరు తెరుస్తున్నాడు. చెప్పలేకపోతున్నాడు.

సరస్వతిని పిలుచుకొని వచ్చారు.

సరస్వతి చూచింది. నిరామయంగా నుంచుంది.

బలరామయ్య ఏదో చెప్పాలని బాధపడుతున్నాడు.

చూస్తూ నుంచుంది సరస్వతి స్థాణువులా నుంచుంది.

రేడియో పలికింది-అదే వార్త— సుందరరావుగారి జీవిత విశేషాలు చెపుతూంది.

సరస్వతి వెనక్కు తిరిగి సాగిపోతూంది.

నగరం శ్మశానంలా ఉంది.

శ్మశానంలోంచి సాగిపోతూంది.

నిరామయంలోంచి, నీరవంలోంచి, నిశ్శబ్దంలోంచి—

సాగిపోతూంది సరస్వతి.

* * *

"మమ్మీ మమ్మీ" కారు దిగి కేకలేసుకుంటూ ఇంట్లోకి పరుగెత్తాడు గాంధీ. పనిలో ఉంది సుమతి. కేకలు విన్నది. పని వదలి పరిగెత్తి వచ్చింది.

"మమ్మీ, మమ్మీ ! మనీ, మనీ, పార్టీ కావాలెనంటున్నారు ఫ్రెండ్సు. తే. తొందరగ ఇయ్యి, పోవాలె. చెప్పివచ్చిన మనీ తెస్తనని" ఊపిరి సల్పుకోకుండా చెప్పేశాడు.

"ఏందిర? ఏమైంది? ఎందుకొచ్చినవు ఇంత తొందరగ? స్కూలు ఇడిచిన్నా?"

"ఎప్పుడూ స్కూలు, స్కూలు, ఇయ్యాళ స్కూలేమిటి మమ్మీ! తే జల్ది ఇయ్యి పోవాలె."

"ఏమైందిర! ఏందంత ఉబ్బిపోతున్నవ్?"

"ఎరకలేదా? పూర్ మమ్మీ? డాడీ గెలిచిండు. ఎమ్మెల్లే అయిండు. ఫ్రెండ్సంతా చంపేస్తున్నరు. మినిస్టర్ అయితడంట్రను. తే మనీ తే. ఉరకాలె" గుక్క తిప్పుకోకుండా చెప్పేశాడు.

"నిజంగ గెలిచిండా" ఆనందమూ, ఆశ్చర్యమూ కలిసిన స్వరంలో అడిగింది.

"ఇంకా చిన్నగంటనేమి? ఓట్లు లెక్కపెడ్తున్నరు. పెద్ద మెజారిటీ ఉన్నది. సాయంకాలం రేడియో విను. డాడీ పేరు చెప్పుతరు."

సుమతి మనసులో ఏవో చెప్పరాని భావనలు దొర్లాయి – గబగబా స్థిమిత పడి పరిగెత్తింది. మిఠాయి తెచ్చి గాంధీ నోట్లో వేసింది. పనివాళ్ళందరినీ పిలిచి మిఠాయీలు పంచింది.

"మమ్మీ! మమ్మీ! మనీ. గ్రాండ్ పార్టీ కావాలెనంటున్నరు" తొందర పెట్టాడు గాంధీ.

అల్మార తెరిచి డబ్బుతెచ్చి అందించింది సుమతి. లెక్కపెట్టుకున్నాడు గాంధీ. "ఇంతనేనా! చాలదు మమ్మీ! ఎంత ఖుషీ గుండాలె. మమ్మీ! మైడియర్ మమ్మీ! ఇంకొక హండ్రెడ్. అంతే. ఓన్లీ వన్ హండ్రెడ్ మోర్!" అడిగాడు మూతి ముడిచి, బ్రతిమాలుతున్నట్లు.

లేవు, అందామనుకుంది సుమతి. అయినా తీసి అందించింది - యంత్రవత్తుగా.

డబ్బు అందుకొని వెనక్కు తిరిగి పరిగెత్తుతూ అన్నాడు గాంధీ "గుడ్‌నైట్ మమ్మీ! రాత్రికి నాకొరకు చూడకు. వస్తే వస్త" అని కారులో పడ్డాడు.

ఏదో చెప్పుదామని గుమ్మందాకా వచ్చిన సుమతి సాగిపోతున్న కారును చూస్తూ నుంచుండి పోయింది.

నిట్టూర్పు విడిచి లోనికి వెళ్ళిపోయింది సుమతి-ఇంట్లోకి.

కారు కోసం ఎదిరి చూస్తున్నారు కుర్రాళ్ళు. కారు కనిపించగానే కేకలు వేశారు. "గాంధీకీజై" అంటూ తలుపులు తీసుకొని బిల బిల మంటూ లోనికి దూరారు. ఒకరిమీద ఒకరు పడ్డారు. అరుచుకున్నారు. తిట్టుకున్నారు. క్షణాల్లో సర్దుకున్నారు. కారును కదలనీమన్నారు. కారు కదిలిపోయింది. రషీద్ భవనం ముందు ఆగింది.

రషీద్. నవాబ్ కాజిమలీఖాన్ బహద్దుర్ ఏకైక పుత్రుడు. కాజిమలీఖాను మాజీ జాగీర్దారు. తన భవనాన్ని అసమాన వైభవంగా నిర్మింపజేశారు. అనంత సౌందర్యంతో దాన్ని నింపాడు. అతని ప్రభుత్వం ఉన్న రోజుల్లో అతని భవనపు వింతలు, విడ్డూరాలను గురించి నగరం సొంతం చెప్పుకునేది. నవాబుగారి సలహాదారు రూపాయిలు కొట్లల్లో ముక్కిపోతున్నాయి అన్నాడట! మరి ఏం చేయాలి? అని అడిగారట నవాబు. ఆరబోయించాలి అన్నాట్ట సర్దారు-సలహాదారు. హుకుమ్ జారీ అయింది. రూపాయిలు నవాబుముందే కొలిచారు. ఆరబోశారు. ఎండిం తరవాత ఎత్తే నౌకర్లు, చెప్పుల అడుగులకు మైనం పెట్టుకొన్నారట. రూపాయిలు వాటికి అంటుకొన్నాయి. కొలతలో తక్కువ వచ్చాయి. తక్కువ వచ్చినందుకు కారణం అడిగారట నవాబు. సర్దారు వంగి మూడుసార్లు సలామ్ చేసి "హుజూర్ పచ్చిగా ఉన్నప్పుడు ఎక్కువగా ఉండడం ఎండితే తగ్గిపోవడం సహజం కదా!" అన్నాట్ట! సర్దారు తెలివితేటలకు మెచ్చుకొని నవాబు బహుమానాలు ఇచ్చాట్ట!

అలా వెలిగించాడు కాజిమలీఖాన్ ప్రభుత్వం! పోలీసు చర్య జరిగింది. జాగీర్లురద్దు అయినాయి. దాంతో ఆ వైభవం అంతా కర్పూరంలా కరిగిపోయింది. నవాబు భవనం సద్దుమణిగింది. ఆశ్రితు లంతా మంచులా మాయం అయిపోయారు. కొంత కాలం చాల బాధపడ్డారు నవాబు. తరవాత ఖురాన్ పారాయణం ప్రారంభించారు. అయిదు వేళలా సక్రమంగా నమాజు సాగించారు. అల్లామీద భక్తి ఎక్కువైంది. బేగం సహితంగా మక్కాలో మకాం పెట్టారు - రషీద్‌కు భవనం అప్పగించి దావూద్‌ను సేవకునిగా నియమించి.

పూర్వ వైభవానికి మాసిన గుర్తుగా ఉంది ఆ భవనం. ఉన్నతమైన కమానులు, విశాలమైన గదులు, గోడలకున్న మాసిపోతున్న అలంకరణలు ఇప్పుడు బోసిగానూ, వింతగానూ కనిపిస్తాయి. శిథిలాలయం వలె వుంది ఆ భవనం. చిరిగిన చీని చీనాంబరంవలె ఉంది.

ఆ భవనంలోకి అల్లరి చేస్తూ పిల్లలు ప్రవేశించారు. అది ఊపిరి పోసుకొంటు న్నట్టు కనిపించింది. కుర్రాళ్ళు అన్ని గదులూ తిరిగారు. అల్లరి చేశారు. తుదకు రెండో అంతస్తులోని విశాలమైన హాలులో చేరి కుర్చీల్లో కూలబడ్డారు. గాంధీ ఆ

బంగళాను వింతగా చూచాడు. తనకు అలాంటి బంగళా ఉంటే ఎంత బావుండును అనుకొన్నాడు.

ఇంతలో దావూద్ వచ్చాడు. అందరికీ సలామ్ చేసి నుంచున్నాడు. పిల్లలంతా అతన్ని చూచి కిలకిలా నవ్వారు. రషీద్ ఆజ్ఞాపించాడు:

"వీరంతా ఇక్కడే భోంచేస్తారు. గాంధీ తండ్రి ఎన్నిక అయినాడు. ఇవ్వాళ దావతు బిర్యానీ బాగా వండాలి. పేకముక్కలు ఇలా పారేయి. గాంధీ డబ్బిస్తాడు తీసుకో. నాలుగు సీసాలుతే-మంచివి. గ్లాసులూ అవీ తెచ్చి ఇక్కడపెట్టు. తరవాత నీ పని చూచుకో.

గాంధీ డబ్బు అందించాడు.

దావూద్ పేకముక్కలు తెచ్చిచ్చి అలాగే నుంచున్నాడు. పేక ముక్కలు కలిపి వేస్తున్న రషీద్ గమనించలేదు. ముక్కలు అందుకొని చూచాడు.

"కౌను ఖడేహో? జల్దీ కరో" (ఎందుకు నుంచున్నావు? త్వరగా కానివ్వు) అన్నాడు.

"సాబ్ క్యా షరాబ్ లావూఁ?" అడిగాడు దావూద్. దానికి రెండర్థాలున్నాయి. సారాయి తెమ్మంటూరా! అనే ఆశ్చర్యార్థకం ఒకటి. ఏ సారాయి తెమ్మంటారు? అనే ప్రశ్నార్థకం ఒకటి. దావూద్ అడిగింది మొదటి ఆశ్చర్యార్థకంలోనే. రషీద్ జవా బిచ్చింది ప్రశ్నార్థకానికి.

"బీ హైవ్ బ్రాందీలావో. చలో. జల్దీ ఖానా తయార్ కర్నా" అన్నాడు.

అప్పటికీ సంశయంగానే వెళ్ళాడు దావూద్-ఇంత పిల్లలు బ్రాందీ తాగుతారా? అనుకుంటూ. అయితే అతనికి వెంటనే సమాధానం లభించింది—రషీద్ తండ్రి కాజమ్ ఇంతకన్న చిన్నతనంలోనే తాగుడు ప్రారంభించాడు!

పేకాటలో మునిగిపోయారు పిల్లలు. అయినా నవ్వడం, తుళ్ళడం, కేకలు సాగుతూనే ఉన్నాయి. బల్లమీది డబ్బు అటూ, ఇటూ జరుగుతూంది. ద్రవ్యానికి ద్రవ్య స్వభావం ఉంది. అది ఒక చోట నిలవదు. ఎప్పుడూ జారుతూనే ఉంటుంది. మారుతూనే ఉంటుంది.

బ్రాందీ వచ్చింది. గ్లాసులు వచ్చాయి. సోడాలు వచ్చాయి. గ్లాసులు నిండాయి. "గాంధీకీజై" అని గ్లాసులు టక టక లాడించి ప్రారంభించారు. పేకాట సాగింది కొంతసేపు. ఆ తరవాత ఆగింది. పెగ్గుమీద పెగ్గు. ఒకనిపైన ఒకడు. మైకం బాగా కమ్మింది. మనుషులు మనలో లేరు.

"జరా, జరా, గానాబజానా హోనా భాయ్" అన్నా డొకడు.

"ఆఁ సాగిద్దాం మనమే" అన్నాడు గాంధీ.

అందరూ లేచారు. ఆట సాగించారు. పాటసాగించారు. కొందరు బల్లమీద తబలా కొట్టారు.

"ఆఁ ఆఁ ఆఁ" ఒక చేతో చెవి మూసుకొని ఒకడు సాగించాడు.

"ఝుమ్కా గిరారే
ఆఁ ఒరేలీ కెబజార్ మేఁ
ఝుమ్కా గిరారే"
"హే ఝుమ్కా గిరారే"
"హేఁ ఝుమ్కా గిరారే"

ఎగురుతున్నారు. ఆడుతున్నారు. పాడుతున్నారు. తైతక్కలాడుతున్నారు. సోలుతున్నారు. పడిపోతున్నారు. నిలదొక్కుకుంటున్నారు. అయినా పాడుతున్నారు:.

''బిస్తర్ బిఛాదియా హై
తెరే ఘర్ కే సామ్నే''

పాటలు, ఆటలు అన్నీ ముగిశాయి—బ్రాందీ అయిపోయింది. అంతా కూలబడ్డారు. కూనిరాగాలు మొదలుపెట్టారు. బిర్యానీ వచ్చింది-ఘుమ ఘుమ లాడింది. దాని మీదపడ్డారు.

''అన్నీ ఉన్నయిగని ఒక అమ్మాయి ఉంటే''
''ఉష్'' అని ''దావూద్ ఉన్నడు నోర్మూయ్''
అని ఒకటి అంటించాడు రషీద్ అన్నవాణ్ని.
''గానాబజానే కో జే''అన్నాడు ఇంకొకడు.
గాంధీ అప్పటికే పడిపోయాడు-అక్కడే తివాచీమీద.

ఒక్కొక్కడూ సోలిపడి పోతున్నారు. అయినా కూనిరాగాలు తీస్తూనే ఉన్నారు.

కొంతసేపటికి ఎక్కడివారు అక్కడ పడిపోయారు. ఒకని కాళ్ళు ఒకని మెడమీద ఉన్నాయి. ఒకని తల ఒకని పొట్టలో ఉంది. ఒకడు కార్చిన చొల్లు ఒకని ముఖంమీద కారుతూంది. ఒకడు ప్లేటలో తల ఉంచి పడుకున్నాడు. ఒకడు కాళ్ళతో ప్లేటను తన్నేశాడు. ఎవరికీ ఒళ్ళు తెలియదు. అంతా గుర్రులో ఉన్నారు.

దావూద్ వచ్చాడు. ప్లేట్లు తీశాడు. అందరినీ సరిగా సర్దిపడుకోబెట్టాడు. వెళ్ళిపోయాడు.

సుమతి ఆ రాత్రి సాంతం నిద్రపోలేదు. గాంధీ వస్తాడనీ, రామయ్య వస్తాడనీ చూస్తూ కూర్చుంది. రాత్రి పెరిగి పోసాగింది. చీకట్లు సుమతి మనసులో చిక్కబడసాగాయి. ఎటుపోయారు ? ఎందుకురారు? వస్తారు అనుకొంది. ఇల్లంతా తిరిగింది. పుస్తకాలు చదివింది. మనసు నిలువలేదు. వాకిటి తలుపుదాకా వచ్చింది. వెళ్ళిపోయింది. రాత్రి తరుగసాగింది. సుమతి ఆశలు తరుగసాగాయి. నిద్రపోవాలని ప్రయత్నించింది. రాలేదు, ఎందుకీ గెలుపు? ఎవరిదీ గెలుపు? గాంధీ ఏమి అవు

తున్నాడు? రామయ్య ఎటుపోతున్నాడు? ఎంత అన్యాయం జరిగింది! తానేమి అవు తుంది? తనకు మిగిలిన ఆశ—మిణుగు మిణుగుమనేది-గాంధీ. గాంధీ ఏమి అవుతు న్నాడు! తాను ఏం చేయగలదు? ఏం చేయాలి? ఎలా చేయాలి? ఇలాంటివే ఇంకా అనేక ఆలోచనలు వచ్చాయి. సతమతం చేశాయి. పరితపింప చేశాయి. చీకట్లు. చీకట్లు. చీకట్లే వెలుగురేఖ కనిపించలేదు.

తెల్లవారింది. సూర్యుడు వచ్చాడు. గాంధీ రాలేదు. సుమతిలోని చీకట్లు దూరం కాలేదు. నిత్యకృత్యాలు తీర్చుకుంది. గుడికి వెళ్ళివచ్చింది- అయినా ప్రాణంలేని మనిషిలా ఉంది. తిండి సయించలేదు. తినలేదు.

మధ్యాహ్నానికి దిగాడు గాంధీ. కొడుకును చూచి కుంగిపోయింది సుమతి. గాంధీ కళ్ళు పీక్కుపోయాయి. ముఖం ముడుచుకు పోయింది. పేలవంగా ఉన్నాడు. నీరసంగా ఉన్నాడు. తల్లిని చూచాడు. తలవంచుకొని గదిలోకి వెళ్ళి పోయాడు. సుమతి గదిలోకి వెళ్ళింది.

''ఏందిర ఈపాపం? రాత్రి రాకపోతివి ? నన్ను బతకనిస్తవా ? లేదా?'' కొడుకును అడిగింది. అప్పటికే దుఃఖం నిండిపోయింది.

గాంధీ మాట్లాడలేదు. బూట్లన్నా విప్పకుండా మంచంమీద పడి, ముసుగు తన్ని పడుకున్నాడు. సుమతి కాసేపు మంచంమీద కూర్చుంది.

''మాట్లాడవేమిర? ఎందుకు కోస్తవుర ఇట్ల'' రెండు కన్నీటి చుక్కలు రాలేయి.

గాంధీ గుర్రుకొట్టాడు.

జవాబు రాదని తెలుసుకొంది. పుట్టెడు దుఃఖంలోనూ కొడుకు బూట్లు విప్పింది. సరిగా కప్పింది. గదిలోంచి వెళ్ళిపోయింది. తనగదిలోకి వెళ్ళి ''ఎందుకీ పరీక్ష ప్రభూ!'' అని దేవునిముందు దుఃఖం ఒలకబోసుకుంది.

రాత్రికి రామయ్య వచ్చాడు. చీకట్లను వెంటతెచ్చాడు. ఒక మందను వెంట వేసుకొని దిగాడు. కారులోంచి దిగకుండానే కేకలు పెట్టాడు శేషయ్య:—

"వదినమ్మా! అన్న గెలిచిండు. ఇగ మంత్రి అయితడు''

సుమతి పరిగెత్తి వచ్చింది. ఎదురుగా రామయ్యను చూచి బొమ్మలా నుంచుండి పోయింది. రామయ్య ముఖం అదోలా ఉంది. గుడ్లు ఉబికి వచ్చాయి. ఎర్రగా ఉన్నాయి. మోదుగు పూలలా ఉన్నాయి. నిప్పు కణికల్లా ఉన్నాయి.

రామయ్య సుమతిని చూచాడు. జుట్టు చిందర వందరగా ఉంది. కళ్ళు తోతుకుపోయినాయి. అవతారంలో ఆనందం ఎక్కడా కనిపించలేదు.

''ఏమో అట్లున్నవు? ఎందుగ్గెలిచిండని ఏడుస్తున్నవా?'' రామయ్య సూదులు వదిలాడు. వాస్తవంగానే అవి సుమతి గుండెలో గుచ్చుకున్నాయి. అయినా కనిపించ నీయలేదు. ''అదేంటుండి అట్లంటరు'' అని ''ఇక్కణ్ణే ఉండండి'' అని పరిగెత్తి

మంగళహారతి తెచ్చి రామయ్యముందు తిప్పింది. బొట్టుపెట్టి ''ఇగ లోపటికిరాండి'' అని వెనక్కి జరిగింది. ఒక చిరు నవ్వుకూడా నవ్వింది.

రామయ్య లోనికి వెళ్ళలేదు. వరండాలోనే కుర్చున్నాడు. వచ్చిన గుంపు వరండా నిండింది. సుమతి వారందరికి చాయ్ పంపించింది. ఆ రాత్రి భోజనాలు అక్కడే జరిగాయి. ఉత్సాహం ఉరకలు వేసింది.

తెల్లవార్లు ఎవరూ నిద్దర్లు పోలేదు.

* * *

''ప్రజాస్వామ్యం – ప్రజాస్వామ్యం – ప్రజాస్వామ్యం–నమ్ముకున్నారుగద ప్రజల్ను! తెలిసిపోయిందా? ఓటు. ఒక్క ఓటుముక్క వేయలేదు. నమ్ముకోండి. ఇంకా నమ్ముకోండి. ఏం సాధిస్తారు? ఏం సాధించారు ఈ ఓట్లను నమ్ముకొని? ఎందరు అమాయకులు బలి అయినారు? ఎంతమంది బందీలైనారు? ఏమైంది? కొన్నారు డబ్బుపోసి. డబ్బు. డబ్బు. డబ్బు. డబ్బుకు ప్రజలు లొంగుతున్నారు. నాయకులు లొంగుతున్నారు. ప్రభుత్వాలు లొంగుతున్నాయి. మీరు త్యాగాలు చేశారు. గూడలు విరక్కొట్టించు కొన్నారు. జేళ్ళకు వెళ్ళారు. తలలు బద్దలుకొట్టించు కున్నారు. పొలాలు పోగొట్టుకున్నారు. బికార్లయినారు! ఏమైంది ? ఎవడు గెలిచాడు? ఎవడు నలిగిపోతున్నాడు? ఎవడు మొత్తుకుంటున్నాడు? ఎవడు ఏడుస్తున్నాడు? ఎవనిగుండె రగిలిపోతూంది? ఎవని రక్తం సల సల కాగిపోతూంది? వీళ్ళంతా ఏం చేయగలుగుతున్నారు? మీరంతా ఏం చేస్తు న్నారు? ఏం చేశారు? గొర్రెలమందను కసాయివానికి అప్పగించారు. వాడు గొర్రెల్ను చంపి, పుర్రెలు మెడలో వేసుకొని, రక్తం వంటినిండా పులుము కొని రాజ్యానికి వస్తున్నాడు. మీరు గోళ్ళు గిల్లుకుంటూ, మీనమేషాల్లెక్కపెట్టు కుంటూ, ఓట్లకోసం దేబరిస్తూ, ఓడిపోయి, చేసిన తప్పుల్ను గురించి ఆలోచించు కుంటూ తన్నుకుంటున్నారు. ఈ సమాజం మారాలి. ఈ విధానం మారాలి. దీన్ని కూకటివేళ్ళతో పెల్లగించి వేయాలి. ఈ కుళ్ళులో మీరూ ఒక భాగంగానే కనిపిస్తు న్నారు" పుస్తకాలు విస్సిరి మూలకొట్టి, నుంచోనే గుక్కతిప్పుకోకుండా ఉపన్య సించాడు ప్రకాశం!

వీరభద్రం వెర్రిగా చూడసాగాడు ప్రకాశాన్ని. ఎంతవాడు! ఎంతెంత మాటలు మాట్లాడుతున్నాడు! ఎంత తెగింపు! తనముందే తనను తెగడుతున్నాడు. బుద్ధిమంతునివలె వచ్చి, పుస్తకాలు సర్దుకొని హోమ్‌వర్కు చేసుకునేవాడు! నిప్పులు కురుస్తున్నాడివ్వాళ. నిన్నటి ప్రకాశమేనా అన్నట్లుగా చూడసాగాడు. ముఖం కందగడ్డలా ఉంది. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. పెదవి లిప్త ఆగ కుండా కదులుతూంది. అంతవరకు బాగానే ఉంది. వింతగా చూడసాగాడు. కొంత ముచ్చటగా కూడా ఉంది. "ఈ కుళ్ళులో మీరూ ఒక భాగంగానే కనిపిస్తున్నారు"

అనే వాక్యం చెంపమీద చెళ్ళున వేసినట్లయింది. నరాల్లో సురసుర చిచ్చు అంటు కున్నట్లయింది.

"ప్రకాశం!" అని గట్టిగా కేకవేశాడు.

ప్రకాశం నోరు మూతపడింది. మళ్ళీ బుద్ధిమంతునివలె నుంచున్నాడు. కాని ఆ గద్దింపుకు కన్నీళ్ళు దుమికాయి. రాతి బొమ్మలా, దైవ విగ్రహంలా నుంచు న్నాడు. వీరభద్రం చేతులు ఇంకా వణుకుతూనే ఉన్నాయి! అంత గట్టిగా కేకవేశా డతను. ప్రకాశాన్ని చూస్తూ ఉండిపోయాడు. ప్రకాశం నేలను చూస్తున్నాడు.

వీరభద్రం ప్రకాశాన్ని చూస్తున్నాడు.

ప్రకాశం నేలను చూస్తున్నాడు-నువ్వే చెప్పు. నేను అన్నదాన్లో తప్పుందా? అన్నట్లున్నాయి చూపులు. కన్నీటి చుక్కలు నేలమీద రాలేయి. నిగ్రహించుకోవా లనీ, కన్నీటిని నిలిపివేయాలనీ శతధా ప్రయత్నిస్తున్నాడు ప్రకాశం.

మౌనం ముడుచుక్కూర్చుంది.

వీరభద్రం గద్దింపు ఇంకా ఎక్కడో వినిపిస్తున్నట్లే వుంది.

"ప్రకాశం!'' గద్దింపుగాలేదు-హెచ్చరికలా ఉంది.

మౌనం రెక్కలు చాచి రెప రెపమని ఎగిరిపోయింది.

"ప్రకాశం! నువ్వు ఎవరిని అంటున్నావో తెలుసుకున్నావా? ప్రజలకోసం తుపాకిపట్టి, ప్రాణాలకు తెగించి, హోరాహోరి పోరు సాగించి, దొరల గుండెల్లో పిడుగులు కురిపించి, వారికి చెందిన పది లక్షల ఎకరాల భూమి ప్రజలకు పంచిన వారిని! నాజీలను మించిన నైజాం నవాబును గడగడ లాడించిన వారిని! తెలం గాణంలో ప్రజారాజ్యం నిర్మించిన వారిని! ప్రపంచ ప్రజలను కదలించిన ప్రజా ఉద్యమాన్ని! తుపాకి పట్టుకొని తిరగబడ్డ రైతాంగాన్ని! అందుకు బలియైన నాలుగు వేలమంది అమరవీరులను! ఉద్రేకంలో ఒళ్ళు తెలియక వాగడం విప్లవం కాదు. ప్రజల్ని దూషించడం, తిట్టడం, దుమ్మెత్తిపోయడం విప్లవంకాదు. విప్లవం కూకల్తో రాదు. కేకల్తోరాదు. దాన్ని ప్రజలు తేవాలి. వారుతెస్తారు. నువ్వు ఇంకా చిన్నవాడివి. నీకు తెలియదు. తెలుసుకోవాల్సింది చాలా ఉంది. బుద్ధిగా చదువుకో. ఆ తరువాత అన్నింటిని గురించి ఆలోచించవచ్చు. ఉద్రేకంలోపడి కొట్టుకొనిపోతే ప్రయోజనం లేదు. వెళ్ళు.'' ప్రకాశం వంచిన తల ఎత్తలేదు. తన కన్నీరు వీరభద్రానికి చూపడం ఇష్టంలేదతనికి! తల వంచుకునే వెనక్కు తిరిగాడు. పిల్లిలా అడుగులు వేస్తూ గది లోంచి వెళ్ళిపోయాడు.

వీరభద్రం, ప్రకాశాన్ని చూస్తూ ఉండిపోయాడు. ఆ తరువాత సిగిరెట్టు కాల్చాడు. ఎగిరిపోతున్న పొగను చూస్తూ ఉండిపోయాడు. ఆ పొగలోనే ఏవో ఆలోచనలు సుళ్ళు తిరుగుతూ కనిపించాయి. 'ఎంత ఉద్రేకంగా మాట్లాడాడు ప్రకాశం!' అనుకున్నాడు. నవ్వుకున్నాడు. తానూ అంత ఉద్రేకంగా మాట్లాడాడు ఆ వయసులో! కాలేజీలో తానంటే గడగడ లాడేవారు! ఉపన్యాసం ఇస్తే పెంకులు

ఎగిరిపోయేవి! ఇవ్వాళటి తనను తలచుకున్నాడు. తటాకంలోని నిశ్చలమైన నీరులా ఉన్నాడు తాను! రొదపెడ్తూ, పొంగి, గట్లను ముంచి పారే వరదలా ఉన్నాడు ప్రకాశం! మళ్ళీ ఆలోచించాడు. ప్రకాశం చెప్పిందాన్లో వాస్తవం లేదుగదా! అలా అను కునేవరకు అందులో ఏదో సత్యం ఉన్నట్లనిపించింది. సత్యమేపలికిందా? ధర్మమే పలి కిందా? అనిపించింది. ఆ ఉద్రేకం, ఆ ఉత్తేజం, ఆ ఉన్మాదం యువతరంనుంచి వచ్చి నట్లనిపించింది. దేశంలో యువకులు, యువతులు అంతా చేరి ప్రకాశంవలె మాట్లాడు తున్నట్లనిపించింది. ఇది యువవాణి. యువతా నినాదం అనిపించిందతనికి! ఆ తలపురాగానే అతని మనసు క్షోభించింది. యువత సొంతం ఉగ్రరూతలూగుతూంది.. పెడతోవ పడుతూంది. ప్రకాశానికి విడమర్చి చెప్పాలి. తానూ ఉద్రేకపడ్డట్టున్నాడు! చెప్పాలి. మార్గంనుంచి తప్పించాలి. మంచి మార్గంలో పెట్టాలి అనుకున్నాడు. వేళ్ళు సిగరెట్టు అంటుకునికాలాయి. సిగరెట్టును వదిలి వేళ్ళు నోటిలో పెట్టుకున్నాడు.

వీరభద్రం ఆస్పత్రినుంచి వచ్చేశాడు. విరిగిన ఎముక అతుక్కుందన్నారు డాక్టర్లు. అయినా కుడిచేయి అంతగా పనికిరావడంలేదు. బరువు లెత్తలేడు. బలంగా దేన్నీ పట్టుకోలేడు. అవిటివాడు అయినాడనే చెప్పవచ్చు.

ప్రకాశం గది దాటింతరువాత బలంగా నేలను తన్నాడు. బట్టలు విసిరి కొట్టాడు. తువ్వాలు అందుకొని చిరచిరలాడుతూ చరచరా బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. సబ్బు కన్పించలేదని పనిమనిషిమీద ధుమ ధుమ లాడాడు. పనిమనిషి సబ్బు అందించింది. సబ్బును నేలకొట్టాడు. ముఖంమీద నీళ్ళుపోసుకుని తువ్వాలు అందుకొని లోపలికి పరిగెత్తుతూ "గడగడలాడించారట. గడగడలు. ఇప్పుడు గడగడ లాడుతున్నారు'' అన్నాడు. గదిలోకివెళ్ళి దువ్వెన నేలకొట్టాడు - అద్దం కనిపించలేదు! అలాగే కూర్చొని హోమ్‌వర్క్ చేయసాగాడు. కాని అతని మెదడులో వీరభద్రం మాటలే రింగుమంటున్నాయి.

వీరభద్రం ప్రకాశానికి నచ్చచెప్పాలనుకొన్నాడు. ఏం చెప్పాలో, చాలా సేపు గుణించుకొన్నాడు. కాని ఎలా చెప్పాలో, ఎప్పుడు చెప్పాలో నిర్ణయించుకోలేక పోయాడు. ఇద్దరూ భోజనాలు చేస్తున్నారు. అదే సమయం. చెప్పాలనుకొన్నాడు వీరభద్రం. ఎలా ప్రారంభించాలో అతనికి అర్థంకాలేదు. మౌనంగా భోజనాలు ముగించారు-ఇద్దరూ. అది మౌనం అనీ అనలేం. రెండు గుండెల్లో ఏదో గజిబిజి ఉంది. అయినా పెదవులు కదలలేదు. ప్రకాశం గదిలోకి వెళ్ళాడు. పుస్తకం పట్టుకొని మంచంలో కూర్చున్నాడు. అతడు చదువుతున్నట్లు నటిస్తున్నాడనే విషయం స్పష్టం అవుతూంది. వీరభద్రం సిగరెట్టు వెలిగించి గదిలోకివచ్చి తన మంచంలో కూర్చున్నాడు. ప్రకాశాన్ని చూస్తూ ఉండిపోయాడు. సిగరెట్టు ఆర్పి మంచం కింద పడేసి అడిగాడు "ఏం చదువుతున్నావు?"

"చరిత్ర" విసురుగా జవాబు చెప్పాడు.

"ఏమనన్న ధంతులో?"

"మీరు చెప్పిందిమాత్రం లేదు. సాయుధ పోరాటంలేదు. నాలుగు వేలమంది చావులేదు. పదిలక్షల ఎకరాల పంపకం లేదు. గాంధీగారు దేశానికి స్వరాజ్యం సంపాదించిర్రని ఉన్నది" తుపాకిలోంచి తూటాలు బయటపడ్డట్టు వచ్చాయి మాటలు!

వీరభద్రం తెల్లబోయాడు. నోట మాట పెకల్లేదు. అయినా అన్నాడు:

"చరిత్రను గెలిచినవారు రాస్తారు. అది వారి గెలుపునే చెపుతుంది. కౌరవులు గెలిచి ఉంటే భారతాన్ని మరో రకంగా రాసేవాడు వ్యాసుడు. రావణుడు గెలిచి ఉంటే రాముణ్ణి అంత మంచివాడిగా వర్ణించేవాడు కాడు వాల్మీకి."

"అందుకే మనం గెలవాలె. మన చరిత్రలో ప్రజలు, ప్రజల పోరాటాలు ఉండాలె. లేకుంటే చరిత్ర రామయ్యను రాముని అవతారం అంటుంది."

"అవును నిజమే. మనం గెలవాలె. ప్రజారాజ్యం రావాలె. కాదనను. కాని కాలం రావాలె. కాలానికి ఎదురీదలేం. విప్లవం రావాలె. ప్రజలు అందుకు సిద్ధంగా ఉన్నారా అనే విషయం ఆలోచించాలె. నేను ఓడిపోయిన. రామయ్య గెలిచాడు. అందుకు నీ గుండెలో మంటగా ఉన్నది. ఉద్రేక పడుతున్నావు. ఈ క్షణంలో సమాజాన్ని తుడిచి పెట్టాలంటున్నావు. నీకున్న ఉద్రేకం ప్రజలందరిలో ఉన్నదా? అని ఆలోచించినావు? నువ్వొక్కనివీ చిచ్చులోకి ఉరుకుతే ఏమౌతావు? ప్రజలు నీ వెంట లేనప్పుడు ఏం చేయగలవు?

ప్రకాశానికి ఆ మాటలు అంతగా నచ్చలేదు. "మనం గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటె ప్రజలు సిద్ధం అవుతారా?" అందామనుకొన్నాడు. అనలేకపోయాడు. వీరభద్రం గద్దింపు మనసులో ఇంకా మెర మెర లాడుతూనే ఉంది. మాట్లాడలేదు. పుస్తకంలో మునిగిపోయినట్లు నటించాడు. వీరభద్రంకూడా మాట్లాడలేదు. ప్రకాశానికి కొంతవరకు నచ్చచెప్ప గలిగాననుకొన్నాడు. మంచంలో పడిపోయి దుప్పటి కప్పుకున్నాడు. ప్రకాశంకూడా కొంత సేపు చదివినట్లుచేసి పడుకున్నాడు.

తెల్లవారి స్కూల్లో మిఠాయీలు పంచుతున్నారు. అది గాంధీ ద్వారా రామయ్య చేసిన ఏర్పాటు. ఎందుకు పంచుతున్నదీ వివరించి చెప్పాడు మేష్టరు. అది విన్నప్పటినుంచీ ప్రకాశం గుండెలో సెగలు ప్రారంభం అయినాయి. వరుసలుగా నుంచోపెట్టి మిఠాయీలు అందిస్తున్నారు. ప్రకాశం దగ్గరికివస్తే ఆతడు చేతులు చాచలేదు. గంభీరంగా నుంచున్నాడు.

"మిఠాయి తీసుకో" అన్నాడు మేష్టరు.

"క్షమించాలె. నేను తీసుకోను"

పిల్లలందరూ ఆతనివైపే చూచారు. అతడు చెప్పేది వినాలని ఆతురపడ్డారు.

"ఏమి? ఎందుకు తీసుకోవు?"

"రామయ్య దబ్బిచ్చి ఓట్లు కొన్నడు. గెలిచింది డబ్బుగాని రామయ్యకాదు"

మేష్టరు బిత్తరపోయాడు. మరి మిఠాయి తీసుకొమ్మని అనలేదు. పక్క కుర్రాడికి అందించాడు. "నేను తీసుకోను సార్" అన్నాడు వాడు. అలా కొంత మంది తీసుకోలేదు. కొంతమంది తీసుకున్నారు.

మేష్టర్లకు మిఠాయి ఎక్కువ మిగిలింది. అందుకు వారు సంతోషించారు.

స్కూలు వదిలేశారు. పిల్లలంతా వెళ్ళిపోతున్నారు.

గాంధీ గ్రూపు ప్రకాశాన్ని అడ్డగించింది.

"ఏమ్రా. ఏమన్నవు మా నాయన్ను?" గాంధీ అడిగాడు.

"మీ నాయన దొంగ" ప్రకాశం ఉరిమాడు.

"మీ నాయన బడా దొంగ"

"మీ నాయన ఖూనీకోరు. దొంగ. లుచ్చా"

"ఏం బే ఏమో శాన బక్ బక్ చేస్తున్నవు. వాండ్ల నాయన ఎమ్మెల్లే. మినిష్టరు కాబోతున్నడు" రషీద్ అందుకున్నాడు.

"వాండ్ల నాయన మస్తాన్ మామను చంపించిండు. మా అమ్మను జేలుకు పంపిండు. మల్లయ్య మామ భూమి గుంజుకున్నడు. డబ్బు పెట్టి ఓట్లు కొన్నడు. దొంగకాక దొరయితడా?"

"నోర్ముయ్ బే" అని రషీద్ లాగి ప్రకాశం చెంపమీద కొట్టాడు. గాంధీ ప్రకాశాన్ని వెనక్కు తోశాడు. నలుగురూ అతని మీదపడి బాదసాగారు.

గీత లబ లబ మొత్తుకుంది.

మరికొందరు పిల్లలు గాంధీని, రషీద్‌నూ లాగేశారు. వాళ్ళ మీదికి లంఘించాడు ప్రకాశం. ప్రకాశానికి పదిమంది తోడు వచ్చారు. గాంధీ చొక్కా చిరిగి పోయింది. మోకాళ్ళు, మోచేతులూ డోక్కుపోయాయి. ఇంతలో గాంధీకోసం కారు వచ్చింది. డ్రైవరు పరిస్థితి చూచాడు. పిల్లలను విడదీశాడు. గాంధీని కారులో ఎక్కించాడు. కారు స్టార్టైంది. కారు కిటికీలోంచి తలపెట్టి గాంధీ అరుస్తున్నాడు:

"ఒరే ప్రకాశం! రేపు చూపిస్త నీ పని. మా నాయనతో చెప్పి జేలుకు పంపకుంటె చూడు"

కారు కదిలి పోయింది.

పిల్లలు చెదిరిపోయారు.

మిగిలింది గీత-ప్రకాశం. ప్రకాశం దుమ్ము దులుపుకున్నాడు. అతని చొక్కా చిరగలేదు-దెబ్బలు బాగానే తాకాయి. మోచేతులూ, మోకాళ్ళు డోక్కుపోయాయి. చర్మం లేచిపోయింది. అక్కడ అంటిన దుమ్ము దులిపింది గీత. "మా ఇంటికి వెళ్దాంరా" అన్నది.

తన వేషము చూచుకున్నాడు ప్రకాశం.

"ఫరవాలేదు. ప్రధమ చికిత్స మా ఇంటిలో జరుగుతుంది. అవసరం అవుతే డాక్టర్ను పిలిపిస్తా. కారు వస్తూనే ఉంటుంది. కాస్సేపు కూర్చుందాం."

ప్రకాశం మాట్లాళ్ళేదు. కూర్చున్నాడు. గీత అతని పక్కనే కూర్చుంది. "కుండా ఉన్నట్లున్నాడు. దెబ్బలు బాగా తగిలాయా?" అడిగింది.

ప్రకాశం మాట్లాడలేదు.

"నువ్వూ బాగానే అంటించావులే. లేవడు వారం రోజులు"

"మదం ఎక్కింది. దించిన్నంటవా?" తన పౌరుషాన్ని మెచ్చుకోవాలన్నట్లు అన్నాడు.

"చితికాడు. నిజంగానే ఓట్లు కొన్నాడంటావా?"

"కొన్న ఓట్లతోనే గెలిచిందు. లేకుంటే వానికి ఓటెవడేస్తడు. అయ్యికూడ దొంగనోట్లంటున్నరు!"

"నిజంగానా?" గుడ్లు పెద్దవి చేసి చూసింది గీత.

ఇంతలో కారు వచ్చింది. ఇద్దరూ ఎక్కారు. తరవాత ఎవరూ మాట్లాడలేదు. కారు శివరావు ఇంటిలో ఆగింది. శివరావు ఇంటిలోనే ఉన్నాడు.

"ఎవరో అబ్బాయిని తీసుకొచ్చావే! అరెరే దెబ్బలు తగిలినట్లున్నాయి. తీసుకురా అయొడిన్ వేతాం" మెట్లమీద నుంచోనే గబ గబా అనేశాడు శివరావు.

ప్రకాశానికి గాయాలు కడిగి అయోడిన్ వేశారు. కాఫీ తాగారు అందరూ. శివరావు సిగార్ వెలిగిస్తూ అడిగాడు.

"ఎవరీ అబ్బాయి?"

గీత ప్రకాశాన్ని చూచింది.

"మంగమ్మ కొడుకు నండీ"

"ఏ మంగమ్మ? జేలుకుపోయింది. ఆవిడేనా? అంటే వీరభద్రంగారి అబ్బాయి వన్నమాట. మంచివాడు. పాపం ఓడిపోయాడు."

"రామయ్య ఓట్లు డబ్బుపెట్టి, కొని, గెలిచాడంటున్నాడు ప్రకాశం. నిజమేనా డాడీ!" గీత అడిగింది తండ్రిని.

శివరావు నవ్వాడు.

"చెప్పు డాడీ! స్కూల్లో ఏం జరిగిందో తెలుసా?" అని సంక్షిప్తంగా వివరించింది.

శివరావు లేచి ప్రకాశం వీపు చరిచాడు.

"ధైర్యం గలవాడివి బాబూ! ఎంతైనా వీరభద్రం కొడుకువు గదా! వీరభద్రం మీద కేసుపెట్టింది నేనే. అడవిలో దొరుకుతే కాల్చివేసేవాణ్ణేమో కూడా" అని అతని పూర్వ స్మృతులన్నీ ఒకసారి ఏకరువు పెట్టాడు. "కాని ఈ పరిస్థితులూ ఈ ప్రభుత్వానికి వస్తున్న వాళ్ళనూ చూస్తుంటే వీరభద్రం మీద గౌరవం పెరుగు

తూంది. అయినా ఉద్యోగంలో ఉన్నాం. ఏం చేయగలం? ఇక్కడ మేము అను కున్నది చేయడానికి వీల్లేదు. వాళ్ళు చెప్పింది చేయాలి?"

"దొంగనోట్లు అచ్చువేసి పంచిపెట్టున్నరట. నిజమేనాండి" అడిగాడు ప్రకాశం.

శివరావు నవ్వాడు. "ఇంకా చిన్నపిల్లవాడివి బాబూ! నువ్వు తెలుసుకోవాల్సినవి చాలా ఉన్నాయి" అన్నాడు.

"డాడీ! జవాబు చెప్పక తప్పిస్తావేం?"

"మేం పోలీసువాళ్ళమమ్మా! నిజాన్ని దాచిపెట్టడం, అబద్ధాన్ని నిజంలా చూపించడానికి ప్రయత్నించడం మా డ్యూటీ"

"డాడీ! రామయ్య ఎలాంటివాడు?"

"అదక్కు తల్లీ అతడు మినిస్టరవుతాడంటున్నారు!"

"అయితే నిన్ను ఏమడగాలి డాడీ!"

"పుస్తకాలు, బట్టలు, ఓవల్టీను—ఇంకా నీకు అవసరం అయినవి" అని "నాకు అర్జంటు పని ఉంది వెళ్ళివస్తా" అని లేచి గబ గబా మెట్లు దిగి వెళ్ళిపోయాడు శివరావు.

ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

"చూచినవా పోలీసు అధికారులే చెప్పుతున్నరు" ప్రకాశం తన వాదన బల పడిందనే ధోరణిలో అన్నాడు.

"కాల్చెయ్యాలి" అన్నది గీత.

"ఎవరిని?" వెర్రిగా అడిగాడు ప్రకాశం.

"నువ్వన్న దొంగల్ను"

"ఎట్ల? మనదెగ్గర తుపాకు లేవి?"

"అవును. నిజమె. ఎలా కాలుస్తాం?" అన్నదామె అమాయకంగా!

తరవాత వీరభద్రానికీ, తనకూ జరిగిన సంభాషణా, తాననుకొన్న విధమూ వివరించి చెప్పాడు ప్రకాశం గీతకు.

గీత సుదీర్ఘంగా ఆలోచనలో పడిపోయింది.

"ఏమిటి ఆలోచిస్తున్నవు?" ప్రకాశం అడిగాడు.

"ఏం లేదు. మనం పెద్దవాళ్ళం కావాలి. ఇంత చిన్నగా ఉంది! ఏమీ చేయలేం"

"మరి మనం ఎప్పుడు పెద్దవాళ్ళ మవుతం?" లేచి నుంచుని అడిగాడు ప్రకాశం.

"అవుతాం" అని లేచి నుంచుంది గీత.

ఇద్దరూ ఒకరిని ఒకరు చూచుకున్నారు.

అయినా ఇంకా చిన్నగానే ఉన్నారు వారు!

శివరావుకు ఏకైక పుత్రిక గీత. పోలీసు చర్యతో విముక్త హైదరాబాదు రాష్ట్రంలో ప్రవేశించిన శివరావు ప్రమోషనుతో సంయుక్త మద్రాసు రాష్ట్రానికి వెళ్ళిపోయాడు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డంలో మరో ప్రమోషనుతో కర్నూలు వెళ్ళాడు. ఆంధ్రప్రదేశం ఏర్పడ్డంతో భాగ్యనగరానికి వచ్చాడు. అతనికి ప్రమోషన్లన్నీ అయిపోయాయి. అత్యున్నత పదవి అలంకరించాడు. మరో ఆరు నెలల్లో పదవి విరమింపనున్నాడు. పదవీ విరమణ సంవత్సరం ఉందనగానే అతనికి కొంత వేదాంతం అలవడింది. భగవద్గీత ఉపన్యాసాలకు తప్పకుండా హాజరవుతున్నాడు. అవి అతని మీద కొంత ప్రభావాన్నీ వేశాయనే చెప్పాలి. అసలు పరిస్థితులు అతనిలో కొన్ని మార్పులు తెచ్చాయి. అధికారం అతనికి అందగా నిల్వగా తానుచేసిన పాపాల ఫలితంగానే పుట్టిన పాపలందరూ పోయారనుకున్నాడు. అసలు తగిలిన దెబ్బ అతని భార్య గతించడంతో. గీత పుట్టిన యాడాదికే తల్లిని కోల్పోయింది. శివరావుకు మిగిలింది ఏడాది పసిగుడ్డు. తల్లీ, తండ్రీ తానే అయి సాకాడు. ఆ పసిపాప అతని మనసును కొంత మార్చింది-కరిగించింది అనాలి. అందువల్ల అతడు న్యాయం వైపు మొగ్గు చూపుతున్నాడు. ఇప్పుడతను ఎదిరి చూస్తున్నదల్లా ఆరు నెలలు అయిపోవాలని.

ఇక్కడ మరికొంత కధ చెప్పాల్సివుంది.

మంగమ్మ జైలుకుపోవడంతో, వీరభద్రం ఆస్పత్రిలో పడడంతో ప్రకాశం చదువుకు కుంటుపడింది. రెండేళ్ళు ఊరికెనే గడిచిపోయాయి. వీరభద్రం ఇంటికి వచ్చింతరవాతే ఆలోచిస్తే రెండేళ్ళ కింది తరగతి చదవనన్నాడు ప్రకాశం. మిత్రులను సంప్రదించిం తరువాత మెట్రిక్ పరీక్ష ఇప్పించడం మంచిదనే నిర్ణయానికి వచ్చాడు. ఆ పరీక్షకు తయారు చేసే స్కూల్లో చేర్పించాడు ప్రకాశాన్ని. ప్రకాశం చురుకుగా చదువుతున్నాడని మేస్టర్లంతా మెచ్చుకున్నందుకు వీరభద్రం సంతోషించాడు.

గాంధీ చదువుకు ఏమీ అడ్డంకి కలుగలేదు. కాని వరసన రెండేళ్ళు ఫేలైనాడు. సుమతికి అది ఎంతో దిగులుకు కారణం అయింది. ఈలోగా ప్రకాశాన్ని మెట్రిక్‌లో చేర్పించారని తెలిసింది. కావాలనే తన కొడుకు విషయంలో రామయ్య శ్రద్ధ తీసుకోవడం లేదనుకుంది. పైగా ప్రకాశాన్ని చేర్చడానికి బాధ్యత కూడా రామయ్యదే అనుకుంది. భర్తతో తెగపోరింది. ఈ విషయంలో కొంత తగాదా కూడా జరిగింది. రామయ్యకు తప్పలేదు. కుర్రాడు పాకలేడు అన్నారు మాస్టర్లు. అయినా చేర్పించాడు రామయ్య గాంధీని అదే స్కూల్లో.

గీత చురుగ్గానే క్లాసులుదాటుతూంది. అయినా ఆడపిల్ల. తొందరగా మెట్రిక్కిం చాలని శివరావుగారు ఆమెను మెట్రిక్‌లో చేర్పించాడు. స్కూల్లో చేరిన మొదటి రోజునే గీతతో స్నేహం అయింది ప్రకాశానికి. ఇద్దరూ మధ్యాహ్నం టిఫిను కలసి చేసేవారు. కలిసీ చదివేవారు. కారు రావడం ఆలస్యం అవుతే చెట్టుక్రింద కూర్చుని అనేక విషయాలు మాట్లాడుకునేవారు. ప్రకాశం తన ఊరి ముచ్చట్లు చెప్పేవాడు.

కనులు చెమ్మగిల్లగా వింటూండేది గీత! ఒక్కొక్కప్పుడు గుడిసెలు-బంగళాలు, అన్నం లేనివాడు-అజీర్ణంతో బాధపడేవాడూ, ఇవి ఎందుకున్నాయి అని ఆలోచించే వారు. కోటయ్యను గురించి ముచ్చటించుకున్నప్పుడూ ఇద్దరూ బాధపడేవార్లు. కోటయ్య చదువులేకుండా ఎందుకుండాలో, అతడు కూలి ఎందుకుచేయాలో వారికి అర్థం అయ్యేదికాదు. వీరభద్రం ఓడిపోవడం, రామయ్య గెలవడం వారిలో ఒక విచిత్రమైన ఐక్యత కల్పించాయి. ఇద్దరూ అనుకున్నది ఒకటే - వారు త్వరగా పెద్దకావాలి!

ఇదంతా పట్నంలో సంగతి.

అక్కడ ఊళ్ళో గాంధీ కారు దిగి రామయ్య దగ్గరికి పరిగెత్తాడు - ఏడ్పు సాగించాడు. ఏడ్పువిని సుమతి పరిగెత్తి వచ్చింది. కొడుకును చూచి ఖిన్నురాలైంది. తరవాత దుఃఖంతో "ఎవడు నాయనా నిన్నిట్లు కొట్టింది. వాని చేతులు విరిగిపోను"తో మొదలయి ఆవిడకు వచ్చిన నిఘంటువు సాంతం చదివేసింది. కదలకుండా కూర్చు న్నందుకు భర్త మీదకి లేచింది.

"అట్ల కూచుంటరేముండి పోరడిట్లయితే"

"అవును. ఏమైందో చెప్పందే ఎట్ల?"

గాంధీ ఏడ్చుకుంటూనే చెప్పాడు జరిగిందంతా చిలవలు-పలవలు-కల్పించి.

రామయ్య వింటూ కూర్చున్నాడు. ప్రతిమలా కూర్చున్నాడు. వెలవెలబోతూ కూర్చున్నాడు. ఎక్కడో ఉన్నట్టు కూర్చున్నాడు. గాంధీ చెప్పడం చాలించింది కూడా అతనికి తెలియదు.

అది చూచి మండిపడ్డది సుమతి. "ఎవడన్న నా కొడుకును చంపినా ఇంతే. మాట్లాడడు" అని ఏడ్చుకుంటూ కొడుకును తీసుకొని వెళ్ళిపోయింది.

అయినా మాట్లాడలేదు రామయ్య.

రామయ్య ఆలోచిస్తున్నది ప్రకాశం తనను దొంగ అన్నాడు - గాంధీ ప్రకాశం తండ్రిని బడా దొంగ అన్నాడు. గాంధీ ఎవరిని అన్నట్లు? తనను అన్నట్లే! ప్రకాశం ఎవరిని అన్నట్లు? తనను అన్నట్లే! గాంధీ తన కొడుకే అను కొంటున్నాడుగా తాను! ఇద్దరు కొడుకులూ కలిసి తనను తిట్టారు! ఇందులో న్యాయం ఎవరి పక్షాన ఉంది?

ప్రకాశం చెప్పిందే నిజం. అది తన అంతరాత్మకు తెలుసు. శేషయ్యకు తెలుసు. యాదగిరికి తెలుసు. మరి కొందరు అంతరంగికులకు తెలుసు.

మిఠాయి తీసుకోనన్నాడు కదూ ప్రకాశం! ఎంత గొప్పవాడు? ఎంత ధైర్యం! ప్రకాశం తన కొడుకు! అమాంతంగా ఉరికి ప్రకాశాన్ని కౌగిలించుకొని ముద్దులు కురిపించాలనిపించింది. వెంటనే వచ్చిన ఆలోచన - ప్రకాశం మంగమ్మ కొడుకు. మంగమ్మ జైలులో ఉంది. ప్రస్తుతానికి వీరభద్రం ప్రకాశం తండ్రి.

ప్రకాశం తండ్రి వీరభద్రం!

వీరభద్రం కొడుకు ప్రకాశం!

ఆ ఆలోచనే అతని మనసులో సూదులు గుచ్చింది. గునపాలు గుచ్చింది. మెదడును చీల్చింది. భరించలేక పోయాడు. ఆరాటం హెచ్చింది. ఆవేదన హెచ్చింది. నోరు తడి ఆరినట్లనిపించింది. ప్రాణాలు ఎగిరిపోతున్నట్లనిపించింది. చివరిసారిగా 'ప్రకాశం నా కొడుకు' అని కేక వేద్దామనుకున్నాడు — కాని-మంచి నీళ్ళు" అని అరిచాడు.

ఆ కేకకు అదిరిపోయింది సుమతి.

మంచినీళ్ళ గ్లాసు లేకుండానే వచ్చి ముందు నుంచుంది.

* * *

పల్లెకు ప్రగతి వచ్చింది. నాగరకత వెలిగింది. కరెంటు దీపాలు వచ్చాయి. పూర్వపు పాఠశాల భవనం విస్తరించబడలేదు. అయినా దానికి ఉన్నత పాఠశాలల స్థాయి వచ్చింది. పంచాయితీ కమిటీ కార్యాలయం 'పక్కా'గా కట్టారు. ఒక మంత్రసాని వచ్చింది. ఒక గ్రామ సేవకుడు సేవచేయడం ప్రారంభించాడు. అద్దెలకు ఉండే ప్రభుత్వోద్యోగులు ఉన్నందున గడీని గదులుగా విభజించి అద్దెకిస్తున్నారు. మంగమ్మ ఇల్లు గ్రంథాలయంగా మారింది. గ్రంథాలయం నిండా బూతు పుస్తకాలూ, హత్యా గంధాలు నిండాయి. యువతరం వారికి అవి ఉత్తేజాన్ని కలిగిస్తున్నాయి. అందువల్ల బాలికలు బడికి పోవడం మానేస్తున్నారు. వారూ ఆ పుస్తకాలే చదువుతున్నారు. విరుపు చూపులు విసురుతున్నారు. దుకాణాల్లో శృంగార సామగ్రి విరివిగా అమ్ముతూంది. తల్లిదండ్రుల మీద కట్నాల భారాలు పెరుగుతున్నాయి. నాయర్ హోటల్ కాస్త పెరిగింది. అది వలపు వగలకూ-రాజకీయాలకూ రచ్చబండ అయింది. బ్రాందీ వగైరా పానీయాలు కూడా దొరుకుతున్నాయి. పేరుకు పేకాటకు శేషయ్య ఇల్లు క్లబ్బు అయింది. అది ఒక బోగం కొంపగా-అసలు-ఉపయోగపడుతూంది అంటున్నారు. అయితే ఈ విషయం పెద్దలెవరూ తెలియనట్లు మిన్న కుంటారు. గ్రంథాలయంలో ఇంటిలోని ఆటలూ, క్యారమ్స్ లాంటివి వచ్చాయి. టీచర్లు ఊరి బయట 'బ్యాడ్ మింటన్' ఆడుతున్నారు. ఊరి పక్కనుంచి ఒక ఏరు పారుతూంది. దానికి ఒక ఆనకట్ట కడ్తారని ఆ మధ్య పేపర్లల్లో వచ్చింది. ఈ మధ్య రేడియోల్లో కూడా వచ్చింది. అది ఒక ప్రణాళికనుండి మరో ప్రణాళికకు గెంతుతూంది. రామయ్య తాను మంత్రినైతే తప్పక చేయిస్తానంటున్నాడు. చేయించనూ వచ్చు. అందువల్ల అతని పొలాలికే అధికంగా లాభం! అన్నట్లు చెప్పడం మరచాను పంచాయతి కమిటీ వారు గ్రామస్థుల క్షేమం కోసం రేడియో ఏర్పర్చారు. అందులో వచ్చే సినీమాపాటల్ని అందరూ వింటున్నారు. కొన్ని రేడియోలు వచ్చాయి. ట్రాన్సిస్టర్లుకూడా వెలిశాయి! ఎరువుల కొట్టంకూడా వచ్చింది-రసాయనిక ఎరువులు! వ్యవసాయం ఆధునిక పద్ధతులలో సాగుతూందనీ పత్రికలవారూ-రేడియోలవారు ఘోషిస్తున్నారు. పంటల్ని

పోతవుతున్నాయంటున్నారు పాతరకపు జనం. ఒకటి మాత్రం నిజం. ఆత్మహత్యకు విషం విరివిగా దొరుకుతూంది!

ఇదంతా నవ్య నాగరకత కాదంటారా?
ఉఠాకర్ ఫేంకు దో బాహర్ గలీమేఁ
నయీ తహజీబ్ కె అండే హైఁ గందె
ఎలక్షన్, మెంబరీ, కౌన్సిల్, సదారత్
బనాయె ఖూబ్ ఆజాదీకె ఫందె. (ఇక్బాల్)
(విసరివేయుడు బయటి గొందిలో
నవ్య నాగరకత గ్రుడ్లు చివికి పోయె.
ఎన్నికలు, కౌన్సిళ్ళు, అధ్యక్షపదవులు
పెట్టినారు మంచి, స్వాతంత్ర్యపు ఉచ్చులు)

రామయ్య ఇంటికి లైట్లు, పంకాలు వగైరా ఆధునిక వసతులు ఏర్పడ్డాయి. కరెంటు పంపుతో నీళ్ళు ట్యాంకుకు ఎక్కుతున్నాయి. ఇంటికి నీటి గొట్టాలు అమిరాయి. పశువుల కొట్టం ఆధునికంగా తయారైంది. మోటబావులకు ఇంజన్లు అమిరాయి-వాటికి అప్పులు ఇచ్చింది ప్రభుత్వం-కాదు-తెచ్చుకున్నాడు. ఎద్దులు, మోట బొక్కెన్లు మూలపడ్డాయి. జీతగాండ్లు తగ్గారు. బిస తిప్పుతే జుఁయ్యిఁమని నీరు వస్తూంది. వరి మానేసి వ్యాపారపు పంటలు ప్రారంభించాడు. పండ్లతోటలు వేసి దేశసేవ చేశాడు. కృషి పండితుడు కూడా అయినట్లు గుర్తు. సుమతి గుడిపని మూడు పూలకు ఆరు కాయలుగా ఉంది. భజనలు ఎక్కువైనాయి. సంతర్పణలు తగ్గాయి. ఆమె ట్రస్టుబోర్డుకు అధ్యక్షిణి!

యాదగిరి ఇంటికి రామయ్య ఇంటికి వచ్చినన్ని సౌకర్యాలు వచ్చాయి-నీటి పంపులు తప్ప. అతడు కొన్ని కుటీర పరిశ్రమలు నిర్వహిస్తున్నాడు-పేరుకు. అందుకు అనేక అప్పులు రాబట్టాడు. వాటిని అప్పులన్న దానికంటె విరాళాలంటె మంచిది. ఎంచాతంటే వాటిని ఎన్నడూ తిరిగి చెల్లించలేదతను. అసలు కుటీర పరిశ్రమలవారు పిట్టల సంసారాలు చేస్తూ బుట్టలు అల్లుకుంటున్నారు. యాదగిరి అప్పుతెచ్చి గేదెల్ను కొన్నాడు. పాలపరిశ్రమకు అపారమైన సేవచేస్తున్నాడు. అప్పు తిరిగి ఇమ్మంటే ఊళ్ళో చచ్చిన గేదెల్ను చూపించాడు. సర్కారువారు వచ్చి తిందు కుడిచి వెళ్ళిపోయారు. యాదగిరి ఇంటికి కాంక్రీట్ పడింది. అతని బొర్ర మరికొంత పెరిగింది. మెడలోకి ఒక బంగారు గొలుసు వచ్చింది. కోటయ్య యాదగిరి దగ్గరే పనిచేస్తున్నాడు. అతని జీతం గొర్రెతోక లాగే ఉంది.

మల్లయ్య గుడిసె కప్పుకోలేక పోతున్నాడు. అయినా కరెంటు దీపాలకు పన్ను కడ్తున్నాడు. అతడు వాస్తవంగా కూలీ కావలసింది. ప్రణాళిక ప్రకారం జరిగిన అంచనా అది. కాని ప్రణాళిక విఫలం అయింది. అంచనాలు తలక్రిందు

లైనాయి! వీరభద్రం తన భూమిని దున్నుకోవడానికి ఇచ్చాడు - కౌలుకు. కౌలుగింజలు ఇచ్చినా సంతోషంగానే ఉన్నాడు మల్లయ్య-తన ఇంటి ముందు రెండు గొడ్లున్నాయి-తాను కూలీకాదు - రైతు-అదీ అతని గర్వం. అయినా పిచ్చమ్మ కూలికి పోక తప్పడంలేదు. కోటయ్య జీతం చేయక తప్పడంలేదు.

ఒకనాడు కోటయ్య తండ్రిని అడిగాడు :-

"అయ్యా! కరెంటుదీపాలొచ్చె. మనకేం ఫాయిద!"

"మనకేం ఫాయిదుంటదిరా! పన్ను నెత్తినేస్రను బజార్ల దీపాలు పెట్టిన్రు. ఏదొచ్చినా పైనున్నోళ్ళకే ఫాయిదరా పిచ్చోడ!"

"అయ్యా! లైబ్రీల పుస్తకాలు పెట్టిన్రు, తెచ్చి చదువుతాన్న, అన్ని బూతులే ఉన్నయి. మన కష్టాలు ఎరకలేదా రాసెటోండ్లకు?"

"అరే! పెద్ద సవాలడిగినవుర! నేనేం జవాబుచెప్తనని. రాసెటోడు పైసున్నోడేమో! రాసెడిది పైసున్నోడి కోసమేమొ?"

"మళ్ళ మన బతుకులు?"

"మన బతుకుల్లి ఏమున్నదిరా! గొడ్డు పుట్టినట్టు పుడ్తిమి. ఆడీడ ఏర్కతింటిమి. చస్తిమి"

"అంతేనంటవా?"

"అంతకాక ఇంకేంది. యాళైతాందిపో. బువ్వ తాగినవా? యాగగిరి మళ్ళ మీదిమీది కొస్తడు"

* * *

అయ్యా! స్థూలంగా ఇది ఆనాటి పల్లెలో ఉన్న పరిస్థితి!

సూర్యుడు పడమట పొడిచాడు. ఆకాశం కెంపులు నింపుకుంది. సంధ్యా సమయం, పశువులు, మనుషులు ఇండ్లకు తిరిగి వస్తున్నారు. పక్షులు గుంపు గుంపులుగా గూళ్ళకు చేరుకుంటున్నాయి. కొంగలు ఆకాశంలో మల్లెల దండలు కడ్తున్నాయి. ఎసళ్ళయాళ అయింది. గుడిసెల్లోంచి పొగమబ్బులు లేస్తున్నాయి. చీకట్లు కమ్ముకొంటున్నాయి. గబ్బిలాలు విహారానికి బయలుదేరుతున్నాయి. గబ్బిలాలకు వెలుగువచ్చింది. అవి చింతచెట్లలోంచి లేచి రెక్కలు కొట్టుకొంటున్నాయి.

రామయ్య ఇంటిముందు కారు ఆగింది. దిగింది రామయ్య ఒక్కడే. చాలి రోజులకు ఒక్కడు వచ్చాడు నేడు. కాస్త హుషారుగా కనిపించాడు. రావడం రావడం సుమతిని పిలిచాడు. ఆ పిలుపులో ఏదో అనురాగం కనిపించింది. ఆమెకే ఆశ్చర్యం అనిపించింది. చాలకాలం తరువాత అలాంటి పిలుపు విన్నది. లోపలి నుంచి ఉరికి వచ్చింది. అదోరకంగా చూశాడు రామయ్య, సుమతి బుగ్గలు జేవురించాయి. తలవంచుకుంది. ఎవరో గిలిగింతలు పెడుతున్నట్లయింది-ఆమెకు. నుంచో లేకపోయింది.

"ఏమో పిలిస్తేనే?"

"ఏమి? పిలువొద్దా? చూడాల్ననిపించింది. పిలిచిన"

"చాల్లెండి." మరీ సిగ్గుతో కుంగిపోతుందామె "చెప్పండి. ఏం కావాల్నో."

"కావాల్నన్నది ఇస్తవాగని......"

"పోండి. నాకు పనున్నది అవతల...." అని వెళ్ళిపోతూంది.

"సరెలే జర చాయ్ తెచ్చి పెట్టు"

"అట్లనే" అని సుమారు లేడిలా పరిగెత్తిందామె. ఆమెకు ఆనందం పట్టరాకుండా ఉంది. ఉక్కిరి బిక్కిరి అవుతూంది. వాడిన మల్లెలు విరిసినట్లనిపించింది. బొట్టూ, కాటుకా దిద్దుకుంది. కోక మార్చుకుంది. అద్దం చూచుకొంది. తన కళ్ళను తానే నమ్మలేక పోయింది. ఎగిరి పోయిన అందం కళ్ళలోవాలి కాపురం పెట్టినట్లు అనిపించింది. టీకప్పుతో రామయ్య ముందు ప్రత్యక్షం అయింది.

కప్పు బల్లమీద పెట్టింది.

తలవంచుకొని నుంచుంది.

రామయ్యకు కొత్త పెళ్ళికూతురు కనిపించింది. కప్పు అందుకున్నాడు. చాయ్ చప్పరిస్తున్నాడేకాని - చూస్తున్నది సుమతినే!

సుమతి గోళ్ళుగిల్లుకొంటూ నుంచుంది.

గుండెలో చేమంతులు పూస్తున్నాయి. ముద్దబంతులు రాలుతున్నాయి! ఎన్నడూలేని సిగ్గు ముంచేస్తూంది. కుంగదీస్తూంది. కాలి బొటన వేలితో నేలమీద బొమ్మలు గీస్తూంది.

"కూర్చో" కాళీకప్పు టేబుల్ మీద పెడ్తూ అన్నాడు రామయ్య.

ఆమె కూర్చుంది. ముద్దరాలులా కూర్చుంది. ముగ్ధలా కూర్చుంది. మూగ బొమ్మలా కూర్చుంది.

రామయ్య ఆమెను చూస్తూ ఉండిపోయాడు.

"ఎంత అందంగున్నావు!" ఎదలోంచి ఎగిరివచ్చిన పదాలవి!

ఇంక అక్కడ కూర్చోలేకపోయింది సుమతి. "చాల్లెండి..." అని లేచింది. లైటువేసి మెరుపులా మాయం అయింది.

రామయ్య ఆమెవైపే చూస్తూ ఉండిపోయాడు. అప్పుడుగాని తెలియలేదతనికి అంతసేపూ చీకట్లో కూర్చున్నారని!

ఎదురుగా బల్లమీద కొన్ని ఉత్తరాలు కనిపించాయి. అందుకున్నాడు. ఒక్కొక్కటే తీసి చదువుతున్నాడు. చాలవరకు అతనిని అభినందించడానికి సంబంధించినవి. కొన్ని ఏవో అతనితో పని ఉండి రాసినవి. చదువుతున్నది ఉత్తరాలే అయినా తన ముందు కూర్చున్న సుమతి ఇంకా కనిపిస్తూనే ఉంది అతనికి. ఎంత అందం! కొత్త పెళ్ళి కూతురులా వచ్చింది! ఎందుకలా వెళ్ళిపోయింది? ఏదైనా గుర్తుకు

వచ్చిందా? ఎవరైనా గుర్తుకు వచ్చారా? అనుమానం మసిలా చేరింది మనసులో! మసి పెరుగుతూంది. మనసు మసి అవుతూంది.

ఉత్తరం చేతిలో కనిపించింది. అది కవరు - రిజిస్టరు ఉత్తరం - వకీలు దగ్గరినుంచి వచ్చింది! ఎందుకో గుండెలో రాయిపడింది. తెరవకుండానే - తెలియకుండానే - చెమటపట్టింది. ముందు తుడుచుకొన్నాడు - తరువాత కవరు చింపాడు. చేతులు వణుకుతున్నాయి! గుండె దడదడ లాడుతూంది. గొంతు ఆరుకొని పోతూంది. అయినా అతడు కేకవేయలేదు. మంచినీళ్ళు అడగలేదు. వచ్చిన ఉత్తరం చదివాడు. చీకట్లు చుట్టూ ముసురుతున్నట్లనిపించింది. కణతలు దబదబా కొట్టుకుంటున్నాయి. తల-సోఫాకు ఆనించి కూర్చున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. అయినా శాంతిలేదు. అశాంతిగా ఉంది. చిరాకుగా ఉంది. మనసులో చీకట్లు ముసురుకుంటున్నాయి. ముళ్ళపొదలు మొలుస్తున్నాయి. ఎదుగుతున్నాయి. గుచ్చుకుంటున్నాయి. కళ్ళు తెరుద్దామనుకున్నాడు. తెరుస్తే దీపపు వెలుగు! వెలుగంటే భయంగా ఉంది. అది తనను కాల్చివేస్తుందనుకున్నాడు. కరగదీస్తుం దనుకున్నాడు. లైటు ఆర్పేయాలనుకున్నాడు. లేవలేకపోయాడు. ఏదో నీరసం ప్రవేశించింది. నీరసించి పోతున్నాడు.

కళ్ళు మూసుకొనే ఉన్నాడు.

భూమి కదులుతున్నట్లనిపించింది. తాను కూర్చున్న సోఫా కూరుకొని పోతున్నట్లనిపించింది. తాను వెళ్ళిపోతున్నాడు - లోపలికి - లోపలికి - భూమిలోకి. ఎందుకిలా కూరుకొనిపోతూంది సోఫా? ఏమైంది దానికి? తనకేమైంది? దూసుకొని పోదామనుకున్నవాడు కూరుకొని పోతున్నాడు!

కళ్ళు తెరిచాడు!

ఏమీ లేదు. అంతా మామూలే. లైటు వెలుగుతూంది. తన ముందు టీ పాయ్ ఉంది. దానిమీద ఉత్తరాలున్నాయి! చేతిలో ఒక ఉత్తరం ఉంది! చదవాలని ప్రయత్నించాడు. అక్షరాలు గుడ్లగూబల్లా కనిపించాయి. ఎగిరిపోతున్నట్లు కనిపించాయి. తన చుట్టూ తిరుగుతున్నట్లు కనిపించాయి! ఉత్తరం మడిచి పట్టుకున్నాడు. లేచాడు. తాను అనుకోకుండానే లైటు ఆర్పేశాడు. గదిలోకి వెళ్ళి పడుకొన్నాడు. లైటు లేదు. అల్లరిలేదు. గది ప్రశాంతంగా ఉంది. అయినా ఏదో అయోమయంగా ఉంది! అయోమయంలోనే పడుకున్నాడు. గందరగోళంలోనే పడుకున్నాడు. గజిబిజిలోనే పడుకొన్నాడు.

సుమతి ఇంట్లో సంబరపడుతూంది. అంబరాలు అందుకోవాలని ఆశపడుతోంది. చాలకాలం తరువాత తనను అలా చూచాడు రామయ్య. మనసు తామర విచ్చుకొంది. తుమ్మెదను రమ్మని తల ఊపుతూంది. ఆమెకు ఇల్లంతా కొత్తగా కనిపించింది. ఎక్కడ చూచినా అందం కనిపించింది. ఆనందం కనిపించింది. పట్టలేకపోతూంది. మనసు నిండింది. మనలోలేదు. మంచి మంచి వంటలు చేసింది.

చక్కగా అలంకరించుకుంది. సిగలో పూలచెండు తురుముకుంది. అద్దంలో చూచుకుంది. తనకే ఆశ్చర్యం అయింది. తానెంత అందంగా ఉంది! ఎవరో దగ్గరికి వస్తున్నట్లనిపించింది. కౌగిలించుకొని ముద్దులు కురిపించినట్లనిపించింది. మనసు దడదడలాడింది. అద్దం చూచుకుంది తానే! అద్దాన్ని ముద్దుపెట్టుకోవాలనిపించింది. చిరునవ్వు నవ్వింది. అద్దమూ నవ్వింది. "ఛీ" అనుకుంది. అక్కణ్ణుంచి బయలుదేరింది. ఆమెలోని పావురాలు పరుగులు తీస్తున్నాయి. ఆకాశంలో విహరిస్తున్నాయి.

వరండాలోకి వెళ్ళింది!

చీకటి! చీకటి!

అందాలూ, ఆనందాలూ రెక్కలు కట్టుకొని ఎగిరిపోయాయి?

గుడ్లగూబ కూసింది.

లైటువేసి చూచింది. రామయ్యలేడు. దబదబా గదిలోనికి ఉరికింది. రామయ్య ఉన్నాడు. లైటులేదు. లైటువేసింది. చటుక్కున వెలిగినట్లయి కళ్ళు తెరిచాడు రామయ్య. చప్పున మూసుకున్నాడు.

సుమతి కుంగిపోతుంది.

"లేవండి భోజనానికి" ధ్వనిలో దుఃఖపు జీరలు వినిపించాయి.

రామయ్య దిగ్గున లేచి కూర్చున్నాడు.

"ఏడుస్తవెందుకు? ఎందుకు బాగున్నరనా? నీ ఏడుపే ఇంతకాడికి తెచ్చింది" కసిరాడు రామయ్య.

సుమతి మనసు విలవిల్లాడింది! నిజంగానే దుఃఖంపొంగింది. అమృతం నిండిన పాత్రలో హాలాహలం కురిసింది. కన్నీటి చుక్కలు టపటప రాలేయి!

"ఏడవకు. నన్నేడిపించకు. పో ఇక్కడినుంచి. ఈ కొంపకేపో వచ్చింది."

గిరుక్కున వెనక్కు తిరిగి పెద్దపెద్ద అంగలు వేస్తూ గది దాటింది. ఆ తరువాత ఉరికింది. గదిలోకివెళ్ళి సిగలోని పూలు తీసి నేలకొట్టింది. వాటిని కాలితో నలిపేసింది. జుట్టంతా చిందరవందర చేసుకొంది. తెలియని తల్లినీ, తెలిసిన ఇంకెవరినో, ఎవరినో తలుచుకొని ఏడ్చింది. కొంతసేపు కన్నీరు రాల్చింది. అది అయిపోయింది. గుండె ఆరిపోయింది. బీటలు వారింది. ఎడారి అయింది. ఆ ఎడారిలోనే పడిపోయింది. సలసలకాగే ఇసుకను పట్టుకొని పాకుతూంది.

ఎక్కడో ఒయాసిస్సు కనిపిస్తుందని ఆమె ఆశ!

రాత్రి రామయ్యకు అంతగా నిద్రపట్టలేదు. కలత నిద్రలో పడిపోయాడు. పీడకలలు అతనిని పీడించాయి.

తన ఇల్లూ, పొలాలు తగలబడుతున్నాయి. తాను మంటల్లో చిక్కుకున్నాడు. మంటలు దగ్గరపడుతున్నాయి. కేకలేస్తున్నాడు. మొత్తుకుంటున్నాడు. ఎవరూ దిక్కులేరు. విమలమ్మ వికటంగా నవ్వుతూంది.

ఏదో ఒక భూతం వచ్చింది. పళ్ళతో కరిచి పట్టుకుంది. ఆకాశానికి ఎగిరింది. తాను విలవిలా కొట్టుకుంటున్నాడు. కేకవేయ రావడంలేదు. భూతం వదిలేసింది. అక్కణ్ణుంచి పడిపోయాడు. తలబద్దలైంది. తాను ముద్ద అయిపోయాడు.

గుండె దడదడలాడింది రామయ్యకు. కళ్ళు తెరిచి చూచాడు. ఏమీలేదు. అంతా వట్టిభ్రమ! అయినా వాస్తవంలాగే ఉంది. గుండె గుబగుబలాడుతూంది. ధైర్యం తెచ్చుకున్నాడు. పడుకున్నాడు. తెల్లవారుతున్నది. రామయ్యకు ఇంకా పూర్తిగా మేలికరాలేదు.

విమలమ్మ మూసి ఉన్న తలుపులోంచి వచ్చేసింది. చీరా, రవికా తెల్లగా ఉన్నాయి. మనిషి వయసులో ఉంది. కాని వికారంగా ఉంది. జుట్టు విరియబోసు కుంది. కళ్ళల్లో క్రౌర్యం ఉంది. కోరలురెండూ బయటికి ఉన్నాయి. పెదవులు లేవు. కోరలకు రక్తం ఉంది. దడుచుకున్నాడు రామయ్య-దయ్యం కాదు కదా! పాదాలు చూచాడు. వెనక్కు తిరిగి ఉన్నాయి. స్థిరపరచుకున్నాడు-దయ్యమే. వచ్చే సింది. వస్తూంది. తనమీదికే! ఉహుఁ. రావడంలేదు. దూరంగా నుంచుంది. వికటంగా నవ్వుతూంది. తనను రమ్మంటూంది! తలతో పిలుస్తూంది! తానుపోడు. వెళ్ళడు. అదిగో మళ్ళీ పిలుస్తూంది-ఈ తడవ చేతితో! అమ్మో! ఏమిటావేళ్ళు-గోళ్ళు ఎంత పొడవున్నాయి! రక్తం బొటబొట కారుతూంది. తాను వెళ్ళడు. వెళ్ళడు. వెళ్ళడు. గట్టిగా ముసుగు తన్ని ముడుచుకొని పడుకున్నాడు.

విమలమ్మ వస్తున్నది. అడుగులు ముందుకు వేస్తూంది. తనవైపే! ఎంత భయంకరంగా ఉంది! నవ్వుతూంది వికటంగా - అయినా ధ్వనిలేదు. వచ్చేసింది. పడ్డది తనమీద. గోళ్ళతో గుచ్చింది. రక్తం వరదలు కట్టూంది - "అమ్మో!" అరచాడు.

కోరలు మెడలో దిగాయి. కొరికేస్తూంది.

ఆ కేకకు ఉలిక్కిపడి ఉరికి వచ్చింది సుమతి. తలుపులు దబదబా బాదింది. ఆ చప్పుడుకు మరీ భయపడ్డాడు రామయ్య. కళ్ళు తెరిచాడు. ఏమీలేదు! అదిరిపడు తూనే తలుపు తీశాడు.

"సుమతీ! నువ్వా?" అని గట్టిగా కౌగిలించుకున్నాడు.

కాలరాచిన దండను తలచుకొంది సుమతి.

వెదికిన ఒయాసిస్సు దొరికినట్లనిపించింది.

బాగా పొద్దెక్కింతరువాతగాని ఆ గది తలుపులు తెరుచుకోలేదు. సుమతి కళకళలాడుతూ బయటికి వచ్చింది. రామయ్య వెలవెలబోతూ బయటికి వచ్చాడు.

నిత్యకృత్యాలు ముగించుకొన్నాడు రామయ్య. గదిలో కూర్చోలేకపోయాడు. వరండాలో కూర్చున్నాడు. సుమతి స్నానంచేసి జుట్టు వదులుగా ముడివేసుకొని చాయ్ కప్పుతో రామయ్యముందు నుంచుంది.

రామయ్య సుమతిని చూచాడు.

రామయ్య ముఖంలో భయాన్ని గమనించింది సుమతి.
అయినా మాట్లాడలేదు. మళ్ళీ ఏ వికటపు మాట అంటాడో!
ఆమె కప్పు అందించింది. అతడు అందుకున్నాడు. చూపు వాల్చుకొని చాయ్ చప్పరిస్తున్నాడు.
ఆమె కొంత సేపు చూచింది.
అతనిలోని భయం ఆమెలో ప్రవేశించింది.
ఆమె అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది-ఈ ఇంటికి ఏమోవచ్చింది-అని గొణుక్కుంది—ఆమెకు తెలియకుండానే.
ఎదురుగా గాంధీ వస్తున్నాడు-స్కూలుకు తయారై వెళ్తున్నాడు.
గాంధీని గట్టిగా కౌగిలించుకొంది.
గుండెదడ గాంధీకి కూడా తెలిసేట్టుంది!
"ఇయ్యాళ బడికి పోకుంటె ఏమైతది?" అడిగింది గాంధీని వదిలేసి-ఆమె మనసు కీడు శంకించింది!
రెప్పవేయకుండా తల్లిని చూచాడు గాంధీ.
ఆమెలోని భయం అతనిలో ప్రవేశించింది-అయినా అన్నాడు-"టెస్ట్ ఉన్నది. పోవాలె. పోత"
అతన్ని తాను ఆపలేదు-అది తెలుసు ఆమెకు- "పదిలెంగ పో" అని మాత్రం అన్నది.
గాంధీ వెళ్ళిపోయాడు.
ఒక నిట్టూర్పు విడిచింది సుమతి. దేవుని గదివైపు సాగిపోయింది.
గుమ్మం దాటుతున్న గాంధీని చూచాడు రామయ్య. అతనికేదో అమాంతంగా స్ఫురించింది. ఆ విషయం కళ్ళల్లోకూడా కనిపించింది. తళుక్కుమన్నాయి కళ్ళు. గాంధీని పిలిచి డ్రైవరును పంపించమన్నాడు.
డ్రైవరు వచ్చి నమస్కరించాడు.
"శేషయ్యగారిని తీస్కరావాలె."
"మంచిద్దొరా" అని వెళ్ళిపోతున్న డ్రైవరును మళ్ళీ పిలిచాడు రామయ్య.
"ఎక్కడున్నా పట్టుకోవాలె. అర్జంటు పనున్న దన్నడు దొర, అని పట్టుకరావాలె. బాబును దింపి ఆడికే పో"
"అట్లనే దొరా."
"అట్లనే అంటెకాదు. ఆయనకోసమే ఎదిరిచూస్తుంట నేను"
"సరేనుండి"
"ఇగ పో"
వెళ్ళిపోయాడు డ్రైవరు.

శేషయ్య వస్తాడంటే కొంత ధైర్యం వచ్చింది రామయ్యకు. తోడుంటే దడుపు కొంత తగ్గుతుంది.

శేషయ్య రెక్కలు కట్టుకొని వాలాడు. బలరామయ్య బలాదూరైనాక రామయ్యను పట్టాడు శేషయ్య. అలా అనడం సరికాదేమో! బలరామయ్య బలహీనుడు కావటంతో రామయ్యే శేషయ్యను చేరదీశాడనడం బాగనుకుంటా. మొత్తంమీద ఉభయులు పరస్పరాశ్రితులైనారు. శేషయ్య ఎన్నికల్లో రామయ్యకు బాగా ఉపకరించాడు. అలా ఎందుకు చేశాడూ అంటే రామయ్య మంత్రి అవుతే అతనికి కావలసిన పనులు చాల ఉన్నాయి.

"ఏమయ్యా! రామయ్యా! చంపిండు మీ డ్రైవరు. ఇంక లేవనన్నాలేదు పట్టేసిండు. వస్తవా! చస్తవా? అని కూచున్నడనుకో. మరి రాకుంటె ఎళ్ళతాది? చావలేక వచ్చేసిన్ననుకో" అని అంటూనే అడుగు పెట్టాడు గడపలో శేషయ్య.

శేషయ్యనుచూచి ప్రాణాలు లేచివచ్చాయి రామయ్యకు. "పని ఉండబట్టే పిలిపించిన. రా శేషయ్యా కూర్చో" అని ఆసనం చూపించాడు రామయ్య.

"బాగనే ఉన్నది. పరిగడపుతో పట్టుకొచ్చిండు. నీదెగ్గర కూచుంటె ఏమొస్తది? వదినమ్మతో చెప్పివస్త" అని లోపలికి వెళ్తూనే "వదినమ్మా! డొక్కలో ఎలకలు ఉరుకుతున్నయి. ఏం చేసిపెడ్తవో మరి" అంటూనే సుమతి దగ్గరికివెళ్ళి పలకరించివచ్చి కూర్చున్నాడు శేషయ్య-తాను సిగరెట్టు ముట్టించి, రామయ్యకు ముట్టిస్తూ.

"రాత్రి పార్టీ ఇచ్చిండయా మార్వాడీ. ఏం పార్టీ అనుకున్నావు - నువ్వుండాల్సింది—ధూమ్‌గున్నదనుకో. పోరిని పట్టుకొచ్చిండనుకో...." అని నాలుక కరచుకొని అటూ ఇటూ చూచాడు-మరిమాట్లాడలేదు. రాత్రి మురిపెంలోకి దొర్లిపోయినట్లు సిగరెట్టు దమ్ముగట్టిగాలాగి వదిలి పైకి చూడసాగాడు.

"మార్వాడీ ఎందుకిచ్చేపార్టీ?" అడగాలని లేకున్నా అడిగాడు రామయ్య.

"రామయ్యా! రాత్రి స్వర్గంలో ఉన్నమనుకో స్వర్గంలో —యాడ్నుంచి తెస్తడో నయా అప్సర ........"

పనిపిల్ల టిఫిను కాఫీతెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది. శేషయ్య ఆ పిల్లను చూస్తూ ఉండిపోయాడు. అమాంతంగా తెప్పరిల్లి అన్నాడు:

"పార్టీ ఎందుకిచ్చిండని అడిగినవ్‌లే. నేను లేబర్‌లీడర్ను గదనయ్యా! పార్టీ ఇయ్యకుంటె బతుకుతాడు? ఫ్యాక్టరి నడవాల్నాయె, ఫాయదలు రావాల్నాయె. మనకు పార్టీ ఇయ్యకుంటె ఎట్ల? ఇప్పుడెందు కిచ్చిండంటవ్? సమ్మె చేయస్తనన్నలే. భయపడి ఉరికి వచ్చిండు బొంబాయినుంచి"

"పైకమేమన్న ముట్టిందా?"

"అడుగుతావు! అదిలేకుంటె సమ్మెట్ల ఆగుతది? ఈ కూలోండ్లున్నరు చూసి

నవా వట్టి గొర్రెలమంద. పాపం వీరభద్రంగూడ ఇరిగి కూలబడ్డడా మనం ఎట్ల చెప్పుతె అట్ల. అదంత సరేలేగాని పిలిచినమాట చెప్పకపోతివి?"

"చెప్పుతగని తిను"

గబగబా మింగి, కాఫీతాగి, సిగరెట్టు వెలిగించి రామయ్యను చూశాడు "ఇహచెప్పు" అన్నట్లు.

"ఇక్కడకాదు. పైకిపోదాంరా" అని లేచాడు రామయ్య—సాగాడు. శేషయ్య అనుసరించాడు. ఆలోచనలో పడ్డాడు శేషయ్య-మౌనంగానే మెట్లెక్కాడు. గదిలో ప్రవేశించి ఇద్దరూ ఎదురు బదురుగా కూర్చున్నారు.

క్షణం ఇద్దరూ మాట్లాడలేదు.

"పెద్ద ఆపద వచ్చింది" రామయ్య ఉవాచ.

? ? ? ?

"ఎట్ల గట్టెక్కుతమొ తెలుస్తలేదు."

? ? ? ?

"ఎటు తోచక నిన్ను పిలచిన"

"చెప్పు ఏందో?"

"చెప్పుతగని కడుపుల పెట్టుకొని కాపాడాలె"

"అట్లనే"

"అట్లనే అంటెకాదు. పానాలమీదికి వచ్చింది."

శేషయ్య సిగరెట్టు వెలిగించాడు. వ్రేళ్ళకున్న రాళ్ళ ఉంగరాలు ధగధగా మెరుస్తున్నాయి. ఒకసారి ఇంటికప్పునుచూచి రామయ్యను చూచాడు. ఇంతలోనే రామయ్య ముఖం పీక్కుపోయింది. కళ్ళల్లోకాంతి తగ్గింది.

"నువ్వు నమ్మకమైనోనివని నీకు చెప్పుతున్న-యాదగిరికి కూడా ఎరక కానియ్యలే"

శేషయ్య చూపుల్లో ఆలోచన కనిపించింది. ఆతురత కనిపించింది.

"నేను నీకు చెప్పెడిదేంలేదు. ఇగో ఈ నోటీసుచూడు. ఇక బాగ ఆలోచించి చెప్పు" అని కాగితం శేషయ్యకు అందించి సిగరెట్టు వెలిగించాడు రామయ్య. కాగితం చదువుతుంటే శేషయ్య ముఖంలో వస్తున్న మార్పులను గమనిస్తూ కూర్చున్నాడు.

"గిదేంది? ఇదెట్లవచ్చె?" మాటలో ఆశ్చర్యమూ, ఆతురతా కనిపించాయి.

తనకేం తెలుసు? అన్నట్లు చూచాడు రామయ్య.

"ఇన్నాళ్ళనించి యాడ చచ్చిందు? ఇప్పు డిస్తాడు నోటీసు? పదనోండ్లేమన్న చేసిన్నంటవా? అవతల పార్టీ వాండ్లు చేసిన్నంటవా?"

అంతవరకు రామయ్యకు తోచని ఆలోచన అది. వెలవెల పోయాడు. తన

మీద ఎవరో ఉచ్చువేశారనుకున్నాడు. వలపన్నుతున్నా రనుకున్నాడు. తన కలలు కూలాయనుకున్నాడు.

గుండెలోని దడ కళ్ళలో కనిపించింది.

"వీరభద్రం ఏమన్న చేసిందంటవా?" శేషయ్య ప్రశ్న.

"పాపం దేవునసువంటోడు. చేస్తడంటవా?" అతనికి తెలియకుండానే ఆ మాటలు నోటినుంచి వచ్చాయి. అందుకు రామయ్య ఆశ్చర్యపడ్డాడు.

శేషయ్య ఆశ్చర్యంగా చూచాడు.

"అయినా ఆలోచించు నాకేం తెలుస్తలేదు!" మాట సవరించుకున్నాడు రామయ్య.

"మంగమ్మ లేనే లేకపోయె. యాదగిరికి అంతధైర్నముంటాది?" మరొక ప్రశ్న - శేషయ్యది.

రామయ్యకు మరొక అనుమానం!

"ఇగో - నువ్వే ఆలోచించు! నా మెదడు పనిచేస్తలేదు" అని సోఫాకు ఒరిగి తల ఆనించాడు రామయ్య.

శేషయ్య సిగరెట్లతో బూడిదపళ్ళెం నిండిపోయింది.

పల్లెలో ఆలోచనలు ఏమివస్తాయి? పట్నం వెళ్దామనుకున్నాడు శేషయ్య. బండిలేదు. వచ్చిం తరువాత వెళ్దామన్నాడు రామయ్య. అంతే. ఆ తరువాత ఎక్కువ మాటలు జరుగలేదు. భోజనాలు మౌనంగానే చేశారు. ఆ మౌనాన్ని చూచి సుమతి గుండెలో బుగులు పుట్టింది. గుండె గుబ గుబలాడింది. కారణం అడగ లేకపోయింది. ఇల్లింతా ఏదో బావురుమంటూంది. పిట్టపిచు మనడంలేదు. శేషయ్యా, రామయ్య వేరువేరు గదుల్లో నడుములు వాల్చారు. ఉభయులూ ఆలోచిస్తున్నారు. ఉత్పాతాన్ని తొలగించాలను కుంటున్నారు. అయినా సాయంకాలం అయింది. అలా ఆరుబయటికి వెళ్ళిరావడం మంచిదనుకున్నాడు శేషయ్య. మెదడు ఏదో చిరాకుగా ఉంది. ఊరు బయలు కొంత విశ్రాంతిని ఇవ్వగలదేమో అనుకున్నాడు. ఇద్దరు బయలుదేరారు.

కాలవ ఎండిపోయింది. తూముదగ్గర చెరువుకట్ట ఎక్కారు. చెరువులో నీరు కొద్దిగా ఉంది. కొంగలు చెరువుమీద చేపలకోసం తిరుగుతున్నాయి. చెరువు కట్ట మీద మోదుగులు ఇంకా పూయలేదు. కట్టకింద నాగజముడి పొదలు గాలికి బుసలు కొడ్తున్నాయి. పొలాల కోతలు ఆయిపోయాయి. అయినా తడిమట్టివాసన గాలితో కనిపిస్తూనే ఉంది. కొన్ని పొలాల్లో జనుము వేశారు. అది పూసింది. పచ్చగా పసుపు పరచినట్లుంది. పసుపుది నిర్జీవ సౌందర్యం. జనపపూలది సజీవ సౌందర్యం. అది వారి మనసులకు కొంత విశ్రాంతిని ఇచ్చినమాట నిజం.

ఇద్దరూ చెరువుకట్ట దిగారు. సాగిపోతున్నారు. మిరపతోట కనిపించింది. మోటబావి. దానికి కరెంటుపంపు. పాతాళగంగలా నీరు వస్తూంది. అర్జునుడు బాయి కొడ్తే భీష్ముని నోట్లో పడినట్లు పొలంలో ధారపడుతూంది. మిరపచెట్లు పచ్చని

తివాచీ పరచాయి. ఎర్రని పండుమిరపలు పచ్చని తొడిమలతో వ్రేలాడుతున్నాయి. పచ్చల్లో పుష్పరాగల్లా ఉన్నాయి. మధ్య మధ్యన ఉన్న బంతులు గుమ్మటాల్లా ఉన్నాయి. అవి విరగబూశాయి - ముద్దబంతులు!

ఆకుపచ్చని మిరపచెట్లకు ఎర్రని మిరపపండ్లు!

మధ్య మధ్య పసుపు పచ్చని ముద్దబంతులు!

సమయం సాయంకాలం!

దృశ్యం రమణీయంగా ఉంది. ఆహ్లాదకరంగా ఉంది. ఆనందదాయకంగా ఉంది.

ఆ దృశ్యాలూ, ఆ గాలి ఇరువురి మెదడులలోని జిడ్డును కొంత వరకు తొలగించాయి. సాగిపోయారు-పరుపుబండకు. మర్రిచెట్టు-దానికింద పరుపుబండ. మర్రిచెట్టుమీద కాకులు కొట్లాడు కుంటున్నాయి!

శేషయ్యా, రామయ్యా పరుపుబండమీద కూర్చున్నారు. శేషయ్య సిగరెట్టు కాల్చాడు. రామయ్య ఒల్లనన్నాడు. మర్రి ఆకు ఈనెలు తీస్తూ తలవంచి కూర్చున్నాడు. క్షణం తరువాత తల ఎత్తి చుట్టూ చూశాడు.

"చూసినావా! ఈ భూములన్నినాయే!" అని వేలు పెట్టి చుట్టుపట్ల ఉన్న పొలాలన్నీ చూపాడు. మాట పేలవంగా ఉంది. వాటిని ఎవరో లాక్కుంటున్నారన్న వేదన ఉంది.

శేషయ్య రామయ్యను చూచాడు. ముఖంలో దుఃఖం మూర్తీభవించి ఉంది.

"నా కెరకలేదని చెప్పుతున్నవా?"

"ఎరకేగని..........ఏమైెత దంటవా?"

"ఎందుకట్లు అధైర్నపడతవు! యాడపోతయి బూములు? నేనున్న గద నీకెందుకు!" అని ఒకరాయి ఎత్తి లాగి విసిరాడు. అది పరుపుబండకు తాకి నిప్పు మిణుగుర్లులేపి, దొర్లుతూ ధ్వనిచేస్తూ పోయి మరో రాతికి తగిలి నిలిచిపోయింది. దాన్ని చూస్తూ ఉండిపోయాడు శేషయ్య. అమాంతంగా ఏదో స్ఫురించినట్లయింది.

"దొరికింది ఉపాయం" అని చప్పునలేచి నుంచున్నాడు శేషయ్య. అతని కళ్ళు వెలిగాయి.

"ఏందది?" లేచి నుంచొని శేషయ్య భుజాలు పట్టుకొని ఊపుతూ అడిగాడు రామయ్య.

"చెప్పుత నడుఁవ్" హుషారుగా నడిచాడు శేషయ్య. రామయ్య అనుసరించాడు. వేగంగా నడిచి ఇల్లు చేరుకున్నారు.

"వదినమ్మా! చాయ్ కావాలె" గుమ్మంలో అడుగు పెట్టూనే కేక పెట్టాడు శేషయ్య. ఆ కేకతో ఇంటికి మళ్ళీ ప్రాణం వచ్చినట్లయింది. సుమతి గబగబా నడిచింది. చక చక పనిచేసింది. చాయ్ వచ్చేసింది. చాయ్ తాగుతుండగా వీధిలో కారు చప్పుడైంది. కప్పు అక్కడే పెట్టి గుమ్మంలోకి వెళ్ళాడు రామయ్య.

గాంధీ దిగాడు. దిగేటప్పుడు కాస్త తూలాడు. రామయ్యను చూచి నిలదొక్కుకున్నాడు. తలవంచుకొని నడిచి మెట్లెక్కాడు. రామయ్యను తప్పుకొని లోనికి వెళ్ళిపోయాడు.

రామయ్య వీటిని వేటినీ గమనించలేదు. డ్రైవరుతో చెప్పాడు పట్నం వెళ్ళాలని- అంతే! తిరిగివచ్చి శేషయ్యతో అన్నాడు "పోదమా?" అని.

శేషయ్య సిగరెట్టుపెట్టి, అగ్గిపెట్టె తీసుకొని బయలుదేరాడు. కారు కదులుతున్న చప్పుడైతే సుమతి ఉరికివచ్చింది. దర్వాజాలోకి వచ్చేవరకు కారు వెళ్ళిపోతూంది.

గుమ్మం పట్టుకొని వెళ్తున్న కారును చూచింది. కారు వెళ్ళిపోయింది. నిట్టూర్పు విడిచి ఇంట్లోకి వెళ్ళిపోయింది సుమతి. తన ఇంటిని కాపాడవలసిందని దైవానికి మొక్కింది. లోనికివెళితే గాంధీ ముసుగుతన్ని పడుకొని ఉన్నాడు!

రామయ్యా, శేషయ్యా పట్నం చేరుకున్నారు. ఆ రాత్రే శేషయ్య వకీలును పిలిపించాడు. చిన్న పార్టీ ఇచ్చి చర్చలు జరిపాడు. ఆ వకీలుకూ శేషయ్యతో పని ఉంది. శాసనాలను శేషయ్య చెప్పినట్లే తిప్పాడు. శాసనం మైనం లాంటిది. కరిగించి బొమ్మచేసుకునే వానిది ప్రతిభ. ప్రతిభావంతుడు తనకు అనుకూలమైన బొమ్మను మలచుకోగలడు. వచ్చిన వకీలు ప్రతిభావంతుడే మరి!

వకీలు వెళ్ళిపోయాడు. ఆ తరువాత రామయ్య మనసు కొంత కుదుటపడింది. ఆ రాత్రి నిద్రకూడా పట్టింది. అయినా అతనిని మరో సమస్య పీడించింది. అది శాసనాలకు సంబంధించింది. తానడిగిన వకీలు శాసనం తనకు అనుకూలంగా ఉందన్నాడు. ప్రతిపక్షపు వకీలు ప్రతిపక్షాలకు అనుకూలం అనవచ్చుగా. పైగా అపఖ్యాతికి భయపడ్డాడు. తనకిప్పుడు పేరు ప్రఖ్యాతులున్నాయి. ఒకరి భూమి కాజేశాడనే విషయం కోర్టుకు ఎక్కితే ముందు తాను బదనాం అవుతాడు. రానున్న మంత్రి పదవి ఏం కాను?

అదొక పెద్ద సమస్య అయి అతనిని కుంగదీయ సాగింది. మళ్ళీ శేషయ్యతో మంతనాలు సాగేయి. మందు శేషయ్యవద్ద సిద్ధంగా ఉంది. అయినా తేల్చి చెప్పదలచలేదు. ఊరినుంచి హుసేన్ను పిలిపించాడు. తన మనుషులను కూడా తోడు ఇచ్చాడు. తాగుడుకూ తిండికేకాక అన్య విషయాలకూ డబ్బిచ్చాడు. పరాంకుశరావు జాడతీయమని చెప్పాడు. తాగుడుంటే చాలు హుసేనుకు. ఎన్ని తలలు తీయమన్నా తీయగలడు. అందుకే అతనికి అప్పగించాడు ఆ పనిని.

గ్రహించాడు రామయ్య. వేరే గత్యంతరమూ లేదని తెలుసుకున్నాడు. అయినా లోలోన ఎక్కడో గుబులు రగులుతూనే ఉంది. హుసేన్ తన కార్యక్రమంలో మునిగిపోయాడు. రామయ్య పట్నంలో పలుకుబడి పెంచుకోవడంలో మునిగిపోయాడు.

ఒకనాటి రాత్రి ఒక గొప్ప విందు ఏర్పాటుచేశాడు రామయ్య - ఒక గొప్ప హోటల్లో. సందర్భాన్ని చక్కగా వాడుకున్నాడు. కొత్త మంత్రి మండలి గౌరవ సూచకంగా ఆ విందు ఏర్పాటయింది. ఆ విందుకు ముఖ్యమంత్రి సహితంగా మంత్రులేకాక రాజకీయ నాయకులూ, ప్రముఖులూ, అందరూ విచ్చేశారు. రాజ్యాన్ని ఏలే రాజకీయాధికారులూ వచ్చారు. శాంతిభద్రతలను పరిరక్షించే రక్షకభట ప్రముఖులూ విజయం చేశారు. న్యాయాన్ని ఉరికంబాలకు ఎక్కించే న్యాయమూర్తులూ హాజరైనారు. ఎందరిని చెప్పగలం? పట్నంలోని యాగడ అంతా అక్కడే జమ అయింది.

కట్టింది కద్దరైనా విదేశద్రవం తప్ప ముట్టలేదు పెద్దలు. విదేశీ సరుకుకు అక్కడ కొదువలేదు. శేషయ్య ఆ వ్యాపారంలో ధురంధరుడైనాడు. నేర్చుకున్నది మార్వాడీనుండే అయినా అతని తలతన్నాడు. విదేశీ పానీయాలు కావాలన్నా, జపాను ట్రాన్సిస్టర్లు కావాలన్నా, స్విట్జర్లాండు గడియారాలు కావాలన్నా, బంగారు బిస్కెట్లు కావాలన్నా, దిగంబర చలనచిత్రాలు కావాలన్నా, విదేశాలకు సంబంధించింది ఏది కావాలన్నా శేషయ్య పేరు నాలుకమీద ఆడుతుంది అందరికీ. అందుకు సంబంధించిన హంగులన్నీ ఉన్నాయి అతనికి. దేశం నాలుగుమూలలా అతని ముఠాలున్నాయి. విదేశీ దొంగరవాణాదారులతో సంబంధం ఉంది. ఆ విషయం అందరికీ తెలుసు. అయినా అతడు పెద్దమనిషి. కాబట్టే ఆ విందులో పాల్గొనగలిగాడు.

అక్కడ అందిస్తున్నవారు పాలరాతి బొమ్మలు. అందుతున్నది అమృతం. అక్కడ ఉన్నవారంతా దేవతలు, అది స్వర్గం. స్వర్గంలో పాపాలుండవు. అక్కడ పదవులకోసం కుట్రలు జరపడం పాపం కాదు. ఒకే ఆడదాన్ని అందరూ అనుభవించడం నేరం కాదు. అక్కడ అన్నలూ, తమ్ములూ, తండ్రులూ, బిడ్డలూ ఉండరు. వారికి అక్కలూ, చెల్లెళ్ళు, అమ్మలూ, అవ్వలూ ఉండరు. అక్కడ వర్ణవ్యవస్థలేదు. వర్గాలులేవు - వ్యవస్థలేదు. ఆడది అందరిదీ - ఆస్తిమాత్రం కొందరిది.

అలాంటి ఆనందం పొంగులువారుతూందక్కడ. కొందరు తాగి ముచ్చట్లాడుతున్నారు. కొందరు ముద్దులు కురిపిస్తున్నారు. కొందరు వ్యాపారాన్ని గురించి మాట్లాడుతున్నారు. కొందరు కేకలు పెడ్తున్నారు. కొందరు కేరింతలు వేస్తున్నారు. కొందరు ఆడుతున్నారు. కొందరు పాడుతున్నారు. కొందరు రాజకీయాలు చర్చిస్తున్నారు. వారిలో ఉన్నాడు రామయ్య. మంత్రులకు స్వయంగా సేవచేస్తున్నాడు. మంత్రులతన్ని మెచ్చుకుంటున్నారు. ఆ సమయంలో వాగ్దానం అందుకొన్నాడు రామయ్య-ఏకగ్రీవంగా అందరూ రామయ్యను మంత్రిని చెయ్యాలన్నారు-అందుకు తగిన యోగ్యత లున్నా యన్నారు.

అంతటితో విందు ముగియాల్సిందే. అయినా సాగుతూంది-అది తెల్లవార్లూ సాగుతూంది. ఆ కల్లోలం, ఆ ఆనందం, ఆ సంబరం అవదులు దాటుతూంది.

ఆ రాత్రి-అదే రాత్రి-అక్కడ సంబరం జరుగుతున్న రాత్రి-పరాంకుశరావు ఏమైనాడు?

పరాంకుశరావు సినిమా చూడాలనుకున్నాడు. మొదటి ఆటకు తీరిక దొరక లేదు. పైగా పిల్లలు మేలికతో ఉంటారు. అందరికీ పెట్టే పైకం లేదతని దగ్గర. ఆతడు అధమతరగతి గుమాస్తా. అందుకే రెండవ ఆటకు బయలుదేరాడు. భార్యతో ఆ మాట చెప్పలేదు. వకీలు దగ్గరికి వెళ్ళివస్తానని చెప్పాడు. రెండో ఆటకు తేలిగ్గా టిక్కెట్టు దొరికింది-ఇంగ్లీషు చిత్రం-బాగానే ఉంది. దాని నిండా హత్యలూ, దోపిళ్ళూ కాక అర్థ నగ్నపు అంగనలూ ఉన్నాయి. పాపం ఏలోకంనుంచో బయటపడ్డాడు-సినిమా మత్తులో-సైకిలుమీద. ఆతనికి సినిమా దృశ్యాలు తప్ప ఏమీ కనిపించడం లేదు. కొంతదూరం వచ్చాక బాట నిర్మానుష్యంగా ఉంది. వీధి దీపాలు ఈ మధ్య పగలు వెలుగుతున్నాయి. రాత్రి మలుగుతున్నాయి. అదొక ప్రణాళిక-పగలును రాత్రి చేయాలనేది.

పరాంకుశరావుకు ఎందుకో భయం పట్టుకుంది. అర్థరాత్రి దాటింది-నర సంచారంలేదు-రెండు పక్కలా గోరీలగడ్డలు-చీకటి! ఏం చేయగలడు? కొంతసేపు ఈలకొడ్తూ నడచాడు. కాళ్ళలో సత్తువ చచ్చిపోతూంది. దూరంగా-తన ఎదురుగా-ఏవో నీడలు కనిపించాయి.

నీడలు!

ముసుగుల మనుషులు!!

తన వైపే వస్తున్నారు!!!

ఎవరు? యమదూతలా? ఎందుకు వస్తున్నారు?

ఏమో!

భయం పట్టుకుంది. చుట్టుపక్కల చూచాడు. గోరీలు కనిపించాయి. క్షణంలో నిద్రపోతున్న పిల్లలు కనిపించారు-తనను కరచి పట్టుకున్న భార్య కనిపించింది-తరువాత ఏమీ కనిపించలేదు.

రోడ్డుమీద రక్తం మడుగైంది.

పరాంకుశరావు పొట్టచీరింది-పేగులు బయటపడ్డాయి-తల పగిలిపోయింది-మనిషిని గుర్తుపట్టరాకుండా అయింది-సైకిలు శవంమీద పడివుంది.

హుసేన్ వెనక్కుతిరిగి చూడలేదు-చూడలేదు. ఆతడు అసలు స్పృహలో లేడు. అయినా పరిగెత్తాడు. నిలవకుండా పరిగెత్తాడు-దర్వాన్ను దూసుకొని శేషయ్య ఇంట్లోకి దూరాడు. కుర్చీలో కూలబడ్డాడు. మత్తు దిగిపోయింది-మనిషి అయినాడు. అక్కడి రక్తం కనిపించింది. ఆ రక్తం ఆతనిని భయపెట్టింది. సారాయసీసా అందుకొని గటగటా తాగాడు. పడుకొన్నాడు-నిద్రపట్టినట్లయింది.

తెల్లవారకమునుపే రాజుకుంది వార్త.

తెల్లవారింతరవాత పత్రికలు భగ్గుమనిపించాయి.

"హత్య"

"దారుణ హత్య."

"అమానుష హత్య."

"ఘోరహత్య"

"రూపం కనిపించకుండా చితక్కొట్టారు. వార్త అందగానే హుటాహుటిన పోలీసు అధికారులు హత్యా స్థలానికి చేరుకున్నారు. శవాన్ని పోస్టుమార్టమ్‌కు పంపించారు. విచారణ జరుగుతూంది. శివరావుగారు స్వయంగా శ్రద్ధ తీసుకుంటున్నారు. ఇంకా ఎవరినీ అరెస్టు చేయలేదు"

ఇదీ వార్త.

పోలీసులు కుక్కలను వదిలారు. అవి నేరుగా శేషయ్య ఇంట్లోకి దూరాయి. కుక్కలు దూరాయి. కాని పోలీసులు దూరడానికి జంకారు. జంకినా దూరారు. శేషయ్య ఇంట్లో లేడు. నిద్రమత్తులో ఉన్న హుసేన్ను కుక్కలు లేపాయి.

కళ్ళు తెరిచి చూచాడు.

పోలీసులు కనిపించారు.

గుండె కుంగిపోయింది. దిగ్గున లేచి కూర్చున్నాడు. అటూ ఇటూ చూచాడు. ఎవరూ లేరు. ఏడుపు సాగించాడు.

"నేను చంపలేదు."

"నేను హత్యచేయలేదు" అన్నాడు ఏడుస్తూనే.

విషయం గ్రహించారు పోలీసులు. అరెస్టుచేసి కార్లో ఎక్కించారు. ఇంకా ఏడుస్తూనే ఉన్నాడు హుసేను.

సాయంకాలానికి గుర్తులను పట్టి శవం పరాంకుశరావుదని తేల్చారు. ఆ వార్త పట్నంలో అగ్గి అయి రగిలింది. చచ్చిన వాడెవడో, చంపినవాడెవడో తెలిసిపోయింది. ఒక పార్టీ దానికి మతపు మసిపూసింది. ఒక మతంవాడు మరో మతం వాణ్ణి చంపాడు. ఈ మతంవారు రెచ్చిపోయారు-కాదు-రెచ్చగొట్టారు. హైద్రాబాదు మతకలహాలకు అగ్నిపర్వతం లాంటిది. అది ఎప్పుడూ రాజుకుంటూనే ఉంటుంది. ఇప్పుడు బద్దలైంది.

పట్నం తుకతుక ఉడికింది. ఉడికిన 'లావా' ఊరుమీద పడింది.

దెబ్బలాటలు జరిగాయి.

దుకాణాలు లూటీ అయినాయి.

స్త్రీలను చెరిచారన్నారు.

కొన్ని కత్తిపోట్లు జరిగాయి.

పట్నం ఊపిరి గుప్పెట్లో పెట్టుకొని కూర్చుంది. వీధులు నిర్మానుష్యం అయినాయి. రెచ్చిపోయిన జనం చెలరేగారు. గృహదహనాలు జరిగాయి. అంతా

జరిగిపోయాక పోలీసులు శాంతిభద్రతల రక్షణకు దిగారు. 144వ సెక్షను ప్రవేశ పెట్టారు. వందలమందిని పట్టుకున్నారు.

శేషయ్య ఇంటిచుట్టూ గట్టి పోలీసు బందోబస్తు జరిగింది. రామయ్యా, శేషయ్యా లోన విందు చేసుకుంటున్నారు. తెల్లవారి పత్రికలో పురప్రముఖులందరితోసహా రామయ్యగారి పత్రికా ప్రకటన వెలువడింది. మత దురహంకారంనుంచి మనం ఇంకా బయటపడలేదని, అన్ని మతాలూ సహనాన్నే బోధిస్తున్నాయని, అన్ని మతాలవారూ అన్నదమ్ముల్లా మెలగాలనీ ప్రకటించారు రామయ్యగారు.

మతకలహాలను రూపుమాపడానికి శాంతి సంఘాలు స్థాపించారు. రామయ్యకు అందులో ప్రముఖస్థానం లభించింది. రామయ్యకు ఇప్పుడు క్షణం తీరికలేకుండా ఉంది. వారు కల్లోల ప్రాంతాలను దర్శిస్తున్నారు. ప్రజల్ను కలుసుకొంటున్నారు. వారిని శాంతిపచేస్తున్నారు. అంతటా వారికి ఘనస్వాగతం లభిస్తూంది. పత్రికలు వారిని ప్రశంసించాయి. నాయకులు వారిని శ్లాఘించారు.

నగరం కల్లోలంగా ఉండడానస్కూళ్ళు మూసేశారు.

"ఈ హత్యలో శేషయ్య కేదో సంబంధం ఉండాలె. హత్య చేయించి అమాయకునిమీద తోసిండు. మతకలహాలు రెచ్చకొట్టిండు. వాడు మనిషికాదు. రాక్షసుడు. వాణ్ణి కాల్చిపారెయ్యాలె." ప్రకాశం ఉద్రేకంగా అన్నాడు గీతతో.

"అవును అధికారం చేతిలో పెట్టుకున్నారు. అమాయకులను హత్యచేయిస్తున్నారు. ఆడినట్లల్లా సాగుతూంది. అడిగినవాడు లేడు. ఎంత కాలం సాగిస్తారు దౌర్జన్యం? ఎంతమందిని పొట్టన పెట్టుకుంటారు? ఏం చేయాలి దీనికి? ఎలా హతమార్చాలి వీరిని?" గీత సహితం ఉద్రేకంగానే మాట్లాడింది.

"విప్లవం రావాలె విప్లవం. అది మాటలతో రాదు. కేకలతో రాదు. అరుపులతో రాదు. తుపాకిగొట్టంలోంచి పుట్టుతుంది. తూటాలోంచి బయటపడుతుంది. పీడితుల గుండెల్లో రగులుతుంది. వారి రక్తంతో బయట పడుతుంది. రక్తం ప్రవహించాలె. ఈ దోపిడీదారులు కూలాలె. వారి శవాలు రక్తంలో తేలాలె. ఆనాడే ముక్తి గీతా! ఆనాడే విముక్తి".

వడకిపోతున్నాడు ప్రకాశం. కళ్ళు ఎర్రబడ్డాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేడిగా వస్తున్నాయి.

అవి మాటలుకాదు. నిప్పులు కురిపించినట్లయింది గీతకు. ఆమెలోకూడా ఉద్రేకం పొంగింది. కాని అణచుకుంది. ప్రకాశాన్ని చూస్తూ ఉండిపోయింది.

బయట కారుహారను వినిపించింది.

"డాడీ వస్తున్నారు. డాడీ" అన్నది గీత.

ప్రకాశం మామూలు మనిషి కావడానికి ప్రయత్నిస్తూ కూర్చున్నాడు. గీత బయటికి నడిచింది. శివరావు అలసిపోయినట్లున్నాడు. కారు దిగాడు.

"ఏం డాడీ! అలా ఉన్నారు?"

"ఈ ఉద్యోగమే అలాంటిదమ్మా. రా లోపలికి. ఒక్కదానివే ఉన్నావా? కాస్త కాఫీ పెట్టించమ్మా! నేను డ్రెస్సు విప్పివస్తాను" అని లోపలికి దారితీశాడు.

బట్టలు మార్చుకొని వచ్చేవరకల్లా కాఫీ వచ్చేసింది. కాఫీ తాగుతూ ప్రకాశాన్నీ, గీతనూ పరిశీలించాడు శివరావు. కప్పు కింద పెడ్తూ అడిగాడు:

"ఏమిటలా ఉన్నారు? పోట్లాడుకున్నారా?"

"ఏం లేదండీ. ఊరికినే" నసిగాడు ప్రకాశం.

సిగరెట్టు వెలిగించాడు శివరావు.

"డాడీ! హత్య ఎవరు చేశారు?"

"హుసేన్" తేలిగ్గా సమాధానం చెప్పాడు.

"శేషయ్య చేయించాడంటున్నాడు ప్రకాశం"

గంభీరంగా మారింది శివరావు ముఖం. సోఫాలో సర్దుకొని సరిగా కూర్చున్నాడు.

"అమ్మా! గీతా! నేను మీ వయసులో ఉన్నప్పుడు ఇలాంటి విషయాలను గురించి ఆలోచించడం ఎరుగను. మా చదువేమిటో మేమేమిటో. మీరూ రాజకీయాలను గురించి ఆలోచించకపోవడం మంచిది. విద్యార్థులు రాజకీయాల్లోకి దిగతాదనే వాళ్ళలో నేనూ ఒకణ్ణి"

"సార్! హుసేన్ చేసిన హత్యలో రాజకీయాలున్నయంటారా?"

ప్రకాశం ప్రశ్నకు కాస్త బెదిరాడు శివరావు. ముడుచుకున్న గీత ముఖం వికసించింది.

"ప్రకాశం నువ్వు చాలా లోతుగా ఆలోచిస్తున్నావు బాబూ!"

"అదికాదండి. తన స్వార్థం కోసమే గద శేషయ్య ఒకణ్ణి బలిపెట్టింది. మత కలహాలు రెచ్చకొట్టి మరి కొంతమందిని చంపింది!"

"శేషయ్య చే యి ం చా డ ను కో ను. ఇందులో రామయ్య ప్రమేయం ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తూంది" వద్దనుకుంటూనే చర్చలోకి దిగాడు శివరావు.

"విన్నావా? విన్నావా ప్రకాశం! ఓడిపోయావు ఒప్పుకో" అన్నది గీత. ఆమె ముఖంలో గెలుపు చిహ్నాలు కనిపించాయి.

"రామయ్యకున్న ప్రయోజనం ఏమిటి? ప్రకాశం అడిగాడు.

శివరావు సిగార్ వెలిగించాడు. గీత గోళ్ళు కొరుక్కుంటూ కూర్చుంది.

"చూడు బాబూ! రామయ్య విమలమ్మ భూమి కాజేసి తనపేర రాయించుకున్నాడు. ఇది అందరికీ తెలిసిన విషయమే. చనిపోయిన పరాంకుశరావుకూ విమలమ్మకు ఏదో దగ్గర సంబంధం ఉందని నా అనుమానం. పరాంకుశరావు ఏనాటికైనా అడ్డు తగలవచ్చు. అందువల్ల ఆతనిని హత్య చేయించాడని నా అనుమానం"

"అయితే రామయ్యను ఎందుకు అరెస్టుచేయలేదు?" గీత అడిగింది.

"రామయ్యకు ప్రభుత్వపు అండ ఉంది. అతడు పెద్దనాయకుడు. మంత్రి అవుతాడనీ అనుకొంటున్నారు"

"నాయకులు హత్యలు చేస్తే నేరం కాదన్నమాట" కాస్త ఉద్రేకంగానే అడిగాడు ప్రకాశం.

"అంత పెద్ద విషయాల్ను గురించి మీరు మాట్లాడకూడదు" అని లేచి నుంచున్నాడు శివరావు.

ఇద్దరు పిల్లలూ లేచి నుంచున్నారు.

"చదువుకోండి" అని చెప్పి వెళ్ళిపోయాడు శివరావు.

శివరావు మెట్లెక్కి పైకి వెళ్ళిపోయేదాకా చూచా రిద్దరూ.

"విన్నావా? నేను చెప్పలే! ప్రభుత్వం స్వార్థపరులు, నీచులు, దుర్మార్గుల చేతుల్లో చిక్కింది. నేలచెక్కకోసం, సీటిముక్కకోసం నిండు ప్రాణాలు తీస్తున్నారు నీచులు. వీరి దౌర్జన్యాలకూ, అక్రమాలకూ, అన్యాయాలకు హద్దులేకుండా పోతున్నది. అడ్డుకొనేవాడు లేకుండా పోతున్నాడు. చూస్తుంటే వీరు దేశాన్ని నమిలిమింగేట్టు కనపడుతున్నది. యువతరం మేల్కోవాలె. వీరని మొదలంటా నాశనం చేయాలె" ప్రకాశం ఉపన్యసించాడు. గీత ఉక్కిరిబిక్కిరి అయింది.

"నువ్వు చెప్పింది అంతా నిజమే ప్రకాశం. మనం ఏం చేయాలి?"

"తుపాకి పట్టాలె తుపాకి. బందూకుపట్టి వీరందరినీ కాల్చివెయ్యాలె.

శివరావుకోసం ఎవరో వచ్చారు. శివరావును పిలవడానికి వెళ్ళిపోయింది గీత. ప్రకాశం మెట్లు దిగి చరచరా వెళ్ళిపోయాడు.

రామయ్య జైల్లో ఉన్న హుసేన్ను కలుసుకోవడానికి వెళ్ళాడు. హుసేన్ తల వంచుకొని నుంచున్నాడు. ఎవరూ లేరనే విషయం స్థిరపరచుకొని ప్రారంభించాడు.

"హుసేన్! నువ్వు నా పని వేసినవు. నీకేమీ తక్కువకానియ్యను. వకీల్ను పెట్టిన. నిన్ను విడిపిస్త. నా పేరు చెప్పినవనుకో ఇగ నీకు విడుదల లేదు. నీ ఇంట్లో వాండ్లకు తిండి ఉండదు. ఇప్పుడిచ్చే జీతానికి రెండింతలు ఇంట్లో ఇస్త. నువ్వొచ్చేటార్కల్లి ఇంత నేలచెక్క ఇస్త. నువ్వు బయట ఉంటేనేం? జేల్ల ఉంటేనేం? నీకు అన్ని జరిపిస్త గద. సరేనా? ఏమంటవ్?"

హుసేన్ మాట్లాడలేదు.

"ఏమో ! మాట్లాడవు?"

"ఏమ్ మాట్లాడ్తనండి? చెయ్యమన్నపని చేసిన. ఈడికొచ్చి చేరిన. ఎల్లపెట్టోద్దంటున్ను. ఎల్లపెట్టనని బూబమ్మన్నది. అది మీ జమ్మేదారే." గొంతు జీరబోయింది. "గరీబోండ్ల ముండి. ఏం చేస్తం ? బతికుండి-ఏం చేసిన? చచ్చినా వాండ్లకేం చేయగల? మా పానాలకు కరీదేందుండి? పైసకు పది దొరుకుతయి. బూబమ్మ బతుకు చూడండి. ఫాసీ (ఉరి) ఏసినా పోతనుండి. బేఫిక్రుంటుని."

అని ధారాపాతంగా వస్తున్న కన్నీటిని తుడుచుకొంటూ వెళ్ళిపోయాడు హుసేను-గిరక్కున వెనక్కు తిరిగి.

రామయ్య ప్రతిమలా నుంచుండిపోయాడు క్షణం. తరవాత శాంతి పరిరక్షణ సమితి సమావేశానికి వెళ్ళిపోయాడు.

శాంతి సంఘాలు చక్కగా పనిచేశాయి. రామయ్యను పత్రికలూ, ప్రభుత్వం ప్రశంసించాయి.

శాంతికోసం దేవాలయాల్లో, మసీదుల్లో, చర్చిల్లో ప్రార్థనలు జరిగాయి. అన్నిం టికీ హాజరైనాడు రామయ్య. అతని మతసహనాన్ని అందరూ మెచ్చుకున్నారు.

నగరంలో మళ్ళీ శాంతి ఏర్పడింది.

హుసేను మీద నేరం రుజువు చేయలేక పోయింది ప్రభుత్వం-అయినా మూడేళ్ళు శిక్ష విధించారు న్యాయమూర్తులు.

రామయ్య పల్లెకు చేరుకున్నాడు. గుళ్ళో పూజలు చేయించాడు. ఊళ్ళో సమా రాధన చేయించాడు.

సుమతి కొంత సంతోషించింది-రామయ్య మారుతున్నాడనుకుంది. గాంధీని మంచివాణ్ణి చేయవలసిందని దేవునికి మొక్కింది.

ఒకనాటి మాట. రామయ్య పొలాలు చూచుకొని వచ్చాడు. ఇంటి ముందరి అరుగుమీద కూర్చొని ఉన్నాడు. ముందు ఎవరూ లేరు. ఏదో ఆలోచనలో మునిగి ఉన్నాడు.

సైదయ్య వచ్చాడు. నిటారుగా నుంచున్నాడు.

రామయ్య సైదయ్యను చూచాడు-ఎందుకో గుండె గుబేలుమంది.

వాస్తవంగా అతనిలో రౌద్రం లేదు. సౌమ్యత ఉంది.

సౌమ్యతను చూస్తే బెదిరే వాళ్ళూ ఉంటారు!

"ఏమొచ్చినవు - జీతం పట్కపోయినవు గద!" రామయ్య మాటలో ఏదో ఆశ్చర్యం వ్యక్తం అయింది.

"పట్కపోలేదు-ఇగ జీతానికి రానుండి"

"అదేంది? అట్లంటవు?"

"హుసేను పెండ్లం మూసిన కన్ను తెరుస్తలేదు. బూబమ్మ గుటుక్కుమంటె గతి ఏమైతదుండి. వాణ్ని జేలుకు పట్టిస్తిరి - మీరు దొరలైతిరి!"

"అదేంది సైదయ్య అట్లంటవు? పైకమిస్తునే ఉంటిని. ఎం తక్కువ చేసిన వాండ్లకు?"

"పైకముంటె మనుషులొస్తారుండి-మనుషులుంటె పైకమొస్తదిగని. పైస బూబమ్మకు మొగుణ్ణి తెస్తదా? పైసపెట్టె పానాలు దొరుకుతాయండి? పైసపానాల్తీసే టందుకు అక్కరకొస్తది-పానాలు తెచ్చేటందుకు కాదుండి! ఉన్నోండ్లకు పైసంటె పానముండి. గరీబోండ్లకు పానముంటేనే పానముండి. పైసిచ్చి గరీబోండ్లను

కొంటున్రు. గరీబోండ్లతోని గరీబోండ్లనే చంపిస్తున్రు. దేనికైన నాలం అన్నాలం ఉండాల్నండి. ఎల్లకాలం అన్నాలంగ బతకలేముండి. శాన నెత్తిటికూడు తిన్ననుండి. ఇగని కష్టం చేసుక బతుకుత. మందిని చంపి బత్కలేను. కాల్మొక్త. ఇగనీ కాలు కొద్దు-ఇగొ నీకట్టె-ఇగో నీకత్తి-ఇగనన్ను పిలువకుండ్రి" అని కత్తి కర్రా, తలపాగా తీసి అరుగుమీద పెట్టాడు. కనీసం రామయ్య మారు మాటకోసం ఎదిరి చూడకుండా వెనక్కు తిరిగి సాగిపోయాడు సైదయ్య.

రామయ్యకు ఏమీ అర్థం కాలేదు. ఏదో అంతా బోసిగా కనిపించింది. తనలోని ఏదో శక్తి వెళ్ళిపోతున్నట్లనిపించింది. లేచి నుంచొని వెళ్ళిపోయే సైదయ్యను చూస్తూ ఉండి పోయాడు.

బట్టతల - రిక్తహస్తాలతో - పొడవైన చేతులు ఊపుకుంటూ వెళ్ళిపోతున్నాడు సైదయ్య.

* * *

విముక్తిదినం - మంగమ్మ విడుదలరోజు.

శిక్ష మూడేళ్ళు. అయినా మంగమ్మ సత్ప్రవర్తన శిక్షలు కొంత తగ్గించింది. జైల్లో సత్ప్రవర్తనకు విలువవుంది - బయటకంటేను.

విడుదల వార్త వీరభద్రానికి తెలిసింది. అతడు దాన్ని పల్లెకు అందించాడు. మల్లయ్య కూలి వదులుకొని, బస్సు చార్జీలు భరించి పట్నం వచ్చాడు - అంతే పల్లె నుంచి మరెవరూ రాలేదు.

ప్రజకు మరుపెక్కువ - పల్లెలకు - మరీని. మంచినీ చెడునూ త్వరగా మరిచిపోగలరు వారు. ప్రజ అధికారానికి వశం అవుతుంది. ప్రత్యక్ష ప్రయోజనాలకు తలవంచుతుంది.

గీతకూడా వస్తానంది - వచ్చింది - వచ్చేప్పుడు ఒక పెద్ద పూలదండ తెచ్చింది. మంగమ్మను వీరనారిగా ఊహించిందామె. ప్రకాశం చెప్పిన కథలు అలాంటివి. అందుకే ఆమెను చూడాలని మురిసింది. ఆమెను గౌరవించాలనుకుంది. పూల దండ తెచ్చింది. ప్రకాశం ఒక పూల దండ తెచ్చాడు. మల్లయ్య గన్నేరుపూల దండ ఊరినుంచే తెచ్చాడు. వీరభద్రం సహితంగా నలుగురూ టాక్సీలో బయలు దేరారు. జేలు ముందు - చెట్లకింద - నుంచున్నారు.

మంగమ్మను ఆహ్వానించడానికి - ఆమెకు స్వాగతం చెప్పడానికి వేలమంది జనం వస్తారనుకున్నాడు ప్రకాశం. ఆమెకు శిక్షపడినప్పుడూ, జేలుకు వెళ్ళినప్పుడూ అలాంటి దృశ్యాలు చూశాడతడు. అందుకే అనుకున్నాడు. అనుకున్నది జరగలేదు. అక్కడ నలుగురే ఉన్నారు. జనంలేరు. అడావుడిలేదు. జయ జయధ్వానాలు లేవు. ప్రశాంతంగా ఉంది. నిశ్శబ్దంగా ఉంది. మామూలుగా ఉంది. నిరాశచెందాడు ప్రకాశం.

నలుగురిలో ఎవరూ మాట్లాడలేదు.

నలుగురూ ఉన్నతమైన కారాగార ద్వారాలవైపు చూస్తున్నారు.

కాలం భారంగా కారుతూంది.

నిముషాలు గంటలుగా గడుస్తున్నాయి!

పెద్ద తలుపులోని చిన్న తలుపు తెరుచుకుంది. మంగమ్మ బయటికి వచ్చింది. బాగా చిక్కిపోయింది. చెంపలు ముడతలు పడ్డాయి. తలముందు వెంట్రుకలు తెల్లబడ్డాయి. కళ్ళు బాగా లోతుకుపోయాయి. అయినా వాటిలో వెలుగు ఉంది. తెల్లని చీరా, రవికా వేసుకుంది. ఆమె ప్రకాశాన్ని చూచింది - ముందు. ప్రకాశం పరిగెత్తాడు. తల్లిమెడలో దండవేశాడు. తల్లి కొడుకును కౌగలించుకుంది - ఆనందాశ్రువులు రాల్చింది.

గీత పూలదండ వేసింది. ఆమె నిర్మించుకున్న విగ్రహం కాదు మంగమ్మది-మంగమ్మ మామూలు మనిషే.

మల్లయ్య గన్నేర్లదండ వేశాడు.

ప్రకాశం తల్లి పక్కన నుంచుంటే తల్లి అంతవాడుగా ఉన్నాడు.

మిగతా ముగ్గురూ ముందు నుంచున్నారు-మంగమ్మకు ఎదురుగా - ఎవరూ మాట్లాడలేదు.

వెనుకనుంచి జెలు సూపర్నెంటు వచ్చి నుంచున్నాడు. కొందరు ఖైదీలు తెల్లని టోపీలతో వచ్చి నుంచున్నారు.

అందరూ ఆ దృశ్యాన్ని చూస్తున్నారు-ఎవరూ రెప్పవాల్చడంలేదు.

"ఎందుకొచ్చిన్రు మీరంతా?" మంగమ్మే మొదలు మాట్లాడింది.

ప్రతిమలకు ప్రాణం వచ్చింది - అవి కదిలాయి.

సూపర్నెంటు ముందుకు వచ్చాడు. ఖైదీలు మంగమ్మను చుట్టేశారు.

"అట్లంటవేమమ్మా! పట్నం సాంతం కదిలిరావలసింది. నువ్వు దేవతవమ్మా మంగమ్మా!" అన్నాడు సూపర్నెంటు. అతని కండ్లు చెమ్మగిల్లాయి.

"మంగమ్మ తల్లీ! మమ్ముల వదలిపోతవా ? మా కెవరమ్మా లోకం సంగతులు చెప్పెడిది? ఖైదీలలో ఒకడు కన్నీరు కార్చాడు. కాళ్ళు పట్టుకున్నాడు.

"మంగమ్మ తల్లీ! నిన్ను నన్ను జేలుకు పంపినోడు బాగానే ఉన్నడు. వాణ్ణేం చేస్తవో?" హుసేను మంగమ్మ పాదాలంటి అడిగాడు.

మంగమ్మ మాట్లాడలేకపోయింది. అంతమంది ఆదరం, స్నేహం ఆమె గుండెనిండి గండికొట్టాయి. కన్నీరు టపటప రాలింది. సజల నయనాలతో చేతులు జోడించింది-అందరికీ దండం పెట్టింది- "మీరు నాకు చాల విషయాలు నేర్పిన్రు. అనేక అనుభవాలతో ఇవతలికి వచ్చిన. కృతజ్ఞతలు" అన్నది—గొంతువడకింది — మాట తడబడ్డది. 'వస్త' అని కదిలింది. సాగింది కారువైపు.

సూపర్నెంటు — ఖైదీలూ—చూస్తూ నుంచుండిపోయారు.

కారు దగ్గరికిచేరి ఒక్కసారి వెనక్కు తిరిగి చూసింది మంగమ్మ.

తాను ఇంతకాలం గడిపిన కైదు – దాని ఎత్తైన గోడలు–తనతో గడిపిన కైదీలు–జైలు సూపర్నెంటు–చేతులు జోడించింది – జేలుకూ– కైదీలకూ–సూపర్నెంటుకూ.

జేలుగోడలు కదల్లేదు.

కదిలిన జనం చేతులు జోడించారు.

ఇదంతా బొమ్మలా చూస్తూ ఉండిన గీత మంగమ్మ పాదాలంటి దండం పెట్టింది.

"ఎవరమ్మా నువ్వు?" అని కౌగిలించుకుంది మంగమ్మ.

"నా పేరు గీత"

అంతా కారు ఎక్కారు. అది సాగిపోయింది. జేలు ముందు నుంచున్న జనం చూస్తున్నారు. మంగమ్మ వెనక్కు తిరిగి వారిని చూస్తూంది. కారు మలుపు తిరిగింది. వారికి, ఈమెగాని–ఈమెకు వారుగాని కనిపించలేదు.

కొన్ని క్షణాలు గంభీరంగా కూర్చుంది మంగమ్మ–ఆమె మనో ఫలకంమీద ఎన్ని దృశ్యాలు కదలుతున్నాయో. కదిలాయో ఎలా చెప్పడం?

మంగమ్మ మనలోకంలోకి వచ్చింది. రెండుపక్కలకు చూచింది. ఒకవైపు ప్రకాశం గంభీరంగా కూర్చొని ఉన్నాడు – మరోపక్క గీత తననే చూస్తూంది వింతగా–ఇద్దరి బుజాలుమీద చేతులు వేసింది–గీతవైపు తిరిగి అడిగింది– "ఎవరమ్మా నీవు?"

"నా పేరు గీత" మళ్ళీ చెప్పింది.

అర్థం కానట్లు ప్రకాశాన్ని చూసింది మంగమ్మ.

"శివరావుగారి బిడ్డ" ప్రకాశం వివరించాడు.

ఆ పేరు వినగానే ఏదో కంపరం ఎత్తినట్లయింది మంగమ్మకు – చెట్టుకు వ్రేలాడుతున్న జగ్గయ్య-గొడ్లకొట్టం - ఏడుస్తున్న తాను - అమాంతంగా ఎదుట కనిపించినట్లయినాయి. చప్పున గీతమీదనుంచి చేయి తీసేసి "ఏ శివరావు?" అని అడిగింది.

తల్లిముఖంలోని మార్పులను గమనించి గ్రహించిన ప్రకాశం "అప్పటి శివరావు కాదమ్మా ఇప్పటి శివరావు-గీత మంచిది–నాతో చదువుకుంటున్నది" అన్నాడు.

"పోలీసు శివరావేనా?" మంగమ్మ ప్రశ్న.

గీత తలవంచుకుంది.

ప్రకాశం మాట్లాడలేదు.

"అవును" వీరభద్రం జవాబు చెప్పాడు.

"రాక్షసుడు. నా మొగుణ్ణి మింగిండు. ఊరు నాశనం చేసిండు" అన్నది ఉద్రేకంగా.

కారు వీరభద్రం ఇంటి ముందు ఆగింది. అంతా దిగారు. గీత చిన్నబుచ్చుకొని వెళ్ళిపోతానంది. ప్రకాశం వద్దన్నాడు. బ్రతిమిలాడి తీసుకొని వచ్చాడు. అంతా వరండాల్లో కూర్చున్నారు.

గీత ముడుచుకొని కూర్చుంది.

వంటమనిషి చాయ్ తెచ్చి అందించింది అందరికీ.

"అమ్మా!" చాయ్ చప్పరిస్తూనే సంబోధించాడు ప్రకాశం "తండ్రి దుర్మార్గుడైతే బిడ్డను కూడా అట్లనే అనుకోవాలెనా?" ప్రశ్నించాడు.

చెంపచెళ్ళు మన్నట్లు అనిపించింది మంగమ్మకు. ప్రకాశం అడిగింది శివరావూ-గీతను గురించే. మంగమ్మకు స్ఫురించింది రామయ్యా-ప్రకాశం. చాయ్ పూర్తిగా తాగకుండానే, చేతిలో కప్పుతో అదోరకంగా చూచింది ప్రకాశాన్ని. చేతులు వడకుతున్నాయనే విషయం కప్పూ, సాసరు కదలికల ధ్వనితో స్పష్టం అవుతూంది.

"ఎంత వానివి అయినావు ప్రకాశం!" మంగమ్మ ఆశ్చర్యం వ్యక్తపరచింది.

"అదికాదమ్మా! శివరావుగారు చాలా దుర్మార్గాలు చేసిండు. అనేక మందిని చంపిండు. అట్లని ఆయనే చెప్పుతున్నడు. ఇప్పుడు మనిషి మారిండు. చేసిందానికి చింతపడుతున్నడు. గీత చాల మంచిది. తండ్రి చేసిందాన్నిబట్టి నువ్వు ఆమెను ఈసడిస్తున్నవు. అది మంచిదేనా అమ్మా!"

"కాదు నాయనా! కాదు. తండ్రి దుర్మార్గుడైతే బిడ్డ కావలసిన అక్కరలేదు. ప్రకాశం! నేను తప్పుచేసిన, శివరావంటె ఉండే మంటతో అట్లన్న. గీత మంచిది. నాదే పొరపాటు" అని లేచి గీతను తెచ్చి తన దగ్గర కూర్చుండ పెట్టుకొని తల నిమిరింది. "అమ్మా! తప్పైంది. నేను అర్థంచేసుకోలేదు. ఏమో అన్న క్షమించు" అన్నది.

గీత మంగమ్మను చూస్తూ ఉండిపోయింది. ఆ చూపులో గౌరవం ఉంది. ఆరాధన ఉంది. భక్తిలాంటిది ఉంది.

"అట్ల చూడకమ్మా! అట్ల చూడకు" అని గీతను గట్టిగా కౌగలించుకుంది మంగమ్మ. ఆమెలో వాత్సల్యం పొంగింది. కళ్ళు చెమ్మగిల్లాయి. గీతకూ కళ్ళల్లో నీరు నిండింది-ఆమెకు తల్లిప్రేమ గుర్తుకు వచ్చిందేమో!

ముడుతలు పడిన మంగమ్మ చెంపల వెంట కన్నీరు ధారగా కారసాగింది.

ప్రకాశం దిగ్గున లేచి తల్లి దగ్గరికి ఉరికాడు. "ఏడవకమ్మా! ఏడవకు. తప్పులు అందరు చేస్తరు. తెలుసుకున్నోళ్ళు ఏడుస్తరు. తెలుసుకోనోళ్ళు ఏడిపిస్తరు" అని తల్లి కన్నీరు తుడిచాడు ప్రకాశం.

మంగమ్మ కన్నీరు నిలిచిపోయింది. ప్రకాశాన్ని క్షణంలో సగం వింతగా చూసింది. "ఎంతవాడివి అయినావురా! ఎంతెంత మాటలు మాట్లాడుతున్నవు?" అని వళ్ళో కూర్చుండబెట్టుకుని తల ముద్దాడింది.

ప్రకాశం కళ్ళల్లో గర్వం కనిపించింది.

అతడు గీతను చూచాడు.

గీత కళ్ళల్లో ప్రకాశం కళ్ళే కనిపించాయి!

"ఏమనుకున్నవు! నీ కొడుకు ఎంతవాడయిం దనుకున్నవు! విప్లవం తెస్తడట విప్లవం. కూకటేస్తున్నడు. నన్నే ఎక్కిరిస్తున్నడు. ఏమన్నడో ఎవరికేనా? ఈ కుళ్ళుకు మనమే బాధ్యులమట" వీరభద్రం అన్నాడు.

ప్రకాశం కళ్ళల్లో మోదుగుపూలు పూసి రాలిపోయాయి. గీత వింతగా వీరభద్రాన్ని చూసింది.

"తప్పు నాయనా తప్పు. కక్కయ్యను అట్ల అనొద్దు. ఆయన మనకెంతో మేలు చేసిండు" మంగమ్మ ప్రకాశాన్ని హెచ్చరించింది.

ప్రకాశం తల్లి ఒళ్లోనుంచి లేచి తన స్థానంలో కూర్చున్నాడు. "నేనేమి అనలేదమ్మా! ఓట్లతోని సమాజం మారదు. ప్రజల్ను నమ్ముకున్న వాండ్లకు ఓట్లు రావటంలేదు. డబ్బును నమ్ముకొన్నవాండ్లకు ఓట్లు వస్తున్నయి. ఇది ధనస్వామ్యం. దీన్ని కూకటవేళ్ళతో పెరికివెయ్యాలె. అందుకు విప్లవం రావాలె విప్లవం. అది మాటలతోనీ ఓట్లతోనీ రాదు...." ఇంకేదో అనబోయి మాట మింగేశాడు ప్రకాశం. ఎంత అణచుకున్నా కొంత ఉద్రేకం పొంగనేపొంగింది.

మంగమ్మ కొడుకును చూస్తూ ఉండిపోయింది. ఎంతమార్పు! ఆమె మూడేళ్ళ కాలాన్ని ముడివేసుకుంటూంది.

"చూసినవా?" వీరభద్రం మాటతో అతనివైపు చూచింది మంగమ్మ. "విప్లవం - విప్లవం. ఈ యువతరానికి విప్లవపు పిచ్చి పట్టింది. విప్లవం అంటె ఏమిటి? అది ఎట్ల వస్తుంది? ఎవరు తెస్తరు? ఏమన్నా తెలుసా? విప్లవం అని కేకలు వేయగానే విప్లవం వస్తుందా? విప్లవం రావాల్సింది ప్రజల్లోంచి. ప్రజాశక్తిలోంచి. ప్రజల గుండెల్లోంచి. ప్రజలందుకు సిద్ధంగా ఉన్నరా అనేవిషయం గమనించినవా? నువ్వొక్కనివి విప్లవం తెస్తవా? ఎట్ల తెస్తవు?"

ఇంట్లో కూర్చొని నీతులు చెపుతే విప్లవం వస్తుంది, అందా మనుకున్నాడు ప్రకాశం. అనలేదు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేడిగా వస్తున్నాయి. ముఖం కందగడ్డ అయింది. తలవంచుకున్నాడు. నేలను చూస్తూ ఉండిపోయాడు.

మంగమ్మకు అంతా అయోమయంగా ఉంది. ఇద్దరి మాటలూ వింటే నిప్పులో ఉప్పులా ఉంది. చిటపటలాడుతున్నాయి.

వీరభద్రం సిగరెట్టు వెలిగించాడు - మంగమ్మ వైపు చూచాడు - కొడుక్కు చెప్పమన్నట్టు.

"నేను జేల్లా చూసిన" ఏదో ఉపన్యాసానికి వలె ఉపక్రమించింది మంగమ్మ. తల్లి ధోరణి వినడానికి ప్రకాశం తలెత్తి చూచాడు. గీత సర్దుకుని కూర్చుంది. వీరభద్రం దమ్ముగట్టిగా లాగి వదిలాడు.

"అసలు సమాజాన్ని చూడాల్నంటె జేల్లో చూడాలె. అక్కడ దొంగలున్నరు. హంతకు లున్నరు. దోపిడిదార్లున్నరు. ఇంకా అనేక నేరాలు చేసినోండ్లున్నరు. ఇందుల అసలు నేరాలు చేసినోండ్లెందరో లెక్కలు చేసినోడు లేడు. నేరం చేసి నందుకు జేళ్ళకు పంపుతున్నరు. నేరం ఎందుకు చేసిన్రో ఆలోచించినోడు లేడు. నేరాలు చేయటానికి గల పరిస్థితు లేమిటో, వాటికి పూర్వరంగం ఏమిటో గమ నించం. స్వయంగా నేరాలు చేసిన వాండ్లు తక్కువ. తిండికిలేక, సంపాదించటానికి వేరే మార్గాలు దొరకక దొంగతనాలు జరుగుతున్నయి. దొంగలకు వివరించి చెప్పి చూచిన వాండ్లు ఒప్పుకున్నరు. సమాజంలో నేరాలు చేయటానికి అవసరమైన పరిస్థితు లున్నయన్నరు. తమకింత తిండీ గుడ్డా ఉంటే దొంగతనాలు చేయ మన్నరు. సమాజాన్ని మార్చాలెనన్న, దోపిడి అంతం కావాలెనన్న, ధనికుడు, పేదవాడు ఉండ కూడదన్న, ఆస్తి అందరికి చెందాలె. అన్నం లేక చచ్చేవాడు ఉండ కూడదన్న. అందరు సిద్ధపడ్డరు. అటువంటి సమాజం స్థాపిస్తమన్నరు. అందుకు ప్రాణాలిస్తమన్నరు."

"హత్యలెందుకు జరుగుతున్నాయంటరు?" గీత ఆసక్తి కనబరచింది - ఉత్సాహంగా అడిగింది. తాను అడుగ దలచుకున్న ప్రశ్న గీత అడిగినందుకు సంతోషించాడు ప్రకాశం. వీరభద్రం సిగరెట్టు పొగ వదులుతూ వింటున్నాడు.

"గీతా! ఎంత శ్రద్ధ చూపిస్తున్నవమ్మా! మీరే నమ్మా నవసమాజం నిర్మిం చాల్సినోండ్లు. మాదేమున్నది? అయిపోయింది. చూస్తున్నవుగద ఎట్లయిపోయిన్నో! మూడేండ్లు జేల్లి ఉన్న ముప్పయి యేండ్లు మీద పడ్డయి. మేమేం చేయగలము చెప్పు."

"యువకుల్లో ఉద్రేకం ఉరుకులు పెట్తుంటది. వారిది ఉడుకు రక్తం. ఉరుకుతమంటరు. కాళ్ళిరక్కొట్టుకుంటరు. పిల్లకాయకు ఏమెరక ఉండేలుదెబ్బ. వారికి పరిస్థితులు వివరించి చెప్పి సరియైన మార్గంలో పెట్టటం మన బాధ్యత. జేల్లి నలుగురు తిరుగుబాటు చేస్తమంటె దేశమంత తిరుగుబాటుకు తయారుగున్నదని అర్థమా?" వీరభద్రం ప్రశ్నించాడు.

వింతగా చూశారు ప్రకాశం, గీత వీరభద్రాన్ని. ప్రకాశం మనసు ఉరకలు పెట్టింది ఏదో అనాలని:- అతడు అడుగదలచుకున్నది సర్కారు వారి సంఘాల్లో ఉంటే తిరుగుబాటు వస్తుందా? అని. కాని తల్లి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. పూర్వం వీరభద్రం తనమీదికి ఒంటికాలు మీద లేచింది తలచుకున్నాడు. మిన్న కున్నాడు. అయినా తల్లి ఏం చెపుతుందో విందామనుకున్నాడు. గీత సైతం మంగమ్మ చెప్పింది వినాలని కుతూహలం కనబరచింది.

"నేనట్ల అనలేదు. జేల్లో ఉన్నవారు సమాజంలో అట్టడుగున ఉన్న జనం. వారికి చదువులేదు. సంస్కారంలేదు. సమాజాన్ని గురించి ఆలోచించలేరు. అటువంటోండ్లే తయారుగున్నరు. సమాజంలో ఈనాడు ఉన్నంత దోపిడీ ఏనాడు

లేదు. ప్రజలు దాన్ని అర్థం చేసుకుంటున్నరు. అందరూ ఇది దోపిడి అని గ్రహించారు. అగ్నిపర్వతం మండుతున్నది. ఇగ బద్దలు కావాలె. అంతే. అందుకు యువకులు నడుంకట్టాలె. అది నేనన్నది."

"యువకులను తప్పుతోవ పట్టిస్తున్నవు. విప్లవం అంటే చంపటం, చావటం కాదు. మేము సాయుధపోరాటం జరిపిన్నాటి పరిస్థితులువేరు. ఇవ్వాళటి అంతర్జాతీయ పరిస్థితివేరు. ఒకనాడు సూర్యు డస్తమించని సామ్రాజ్యాన్ని పాలించిన బ్రిటన్ తోకముడిచింది. ప్రపంచంలో ఎక్కువభాగం ప్రజాస్వామ్య రాజ్యాలైనాయి. రష్యాలో వచ్చిన శ్రామిక విప్లవం ప్రపంచ ప్రజలను ఉత్తేజపరిచింది. అనేక తూర్పు యూరొపు దేశాల్లో శ్రామిక రాజ్యాలు స్థాపించబడ్డాయి. ప్రపంచ ప్రజలు ఆలోచనల్లో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. పెట్టుబడిదారీ దేశాలు కుంటుతున్నాయి. సమాజవాదం రాబోతున్నది. అది రావాలని అధికారపక్షంలో కొందరు కోరుతున్నారు. ప్రగతి శక్తు లన్నింటినీ కూడగట్టుకొని ముందుకు నడవాలె. మనమే విప్లవం తేగలం అనుకోవటం పాతకాలపు ఆలోచన. నలుగురు తుపాకులు పట్టి పదిమందిని చంపగానే విప్లవం వస్తుందనడం వెర్రి. యువకులు ఉద్రేకంతో వున్నారు. వారిని ప్రగతి శీలులుగా చేయడం మన కర్తవ్యం."

వీరభద్రం ఉపన్యాసం ముగించి అందరి ముఖాల్లోకి చూచాడు. ప్రకాశం తలవంచుకున్నాడు. గీత ముఖంలోని భావాలను చదువలేక పోయాడు. మంగమ్మ ఆలోచనలో మునిగిపోయింది. వీరభద్రం ఇంటి కప్పును చూస్తున్నాడు. ఉక్కపోతగా వుంటే, లేచి పంకావేసి, వచ్చి కూర్చున్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

గదిలో మౌనం వెలిసింది.

పంకా గిరాగిరా తిరుగుతూంది—అది ప్రకాశంలోని ఉద్రేకానికి తోడైంది తప్ప చల్లార్చలేక పోయింది.

"అయితె మనమేం చెయ్యకుండనే విప్లవం వస్తుందంటారు!" మంగమ్మ వీరభద్రాన్ని అడిగింది.

మౌనపు తెర చిరిగిపోయింది. ప్రకాశం, గీత ఇద్దరూ వీరభద్రం వైపు చూచారు.

"నేనట్లు అనలేదు. విప్లవం రావాలె. వస్తుంది. ఇంకా అందుకు సమయం రాలేదు. మీకు తోచేవి అందుకు సరియైన మార్గాలుకావు."

"దొరలు దబ్బుచిమ్మి మంత్రు లవుతున్నరు. పెట్టుబడిదారులు శ్రామికులను దోచి కోటీశ్వరు లవుతున్నరు. అధికారులు లంచగొండులైన్రు. అవినీతి బట్టవిడిచి నాట్యం చేస్తున్నది. హత్యలు ఒకరితో చేయించి జేళ్ళకు పంపుతున్నరు. మల్లయ్యభూమి గుంజుకున్నరు. నన్ను జేలుకు పంపిన్రు. హనేనుతో ఖూనీ చేయించిన్రు. శేషయ్య లక్షాధికారి అయిండు. యాదగిరి బిల్డింగ్లుకట్టిండు. మల్లయ్య కూలోడయిండు.

నేను కూలి దాన్నయిన. ప్రకాశం దిక్కులేనోడయిండు. ఇంతకంటె అన్యాయం ఎక్కడుంటది? ఎట్లుంటది? ఇంతకంటె దౌర్జన్యం ఎక్కడుంటది? ఎట్లుంటది? ఇంతకంటె అక్రమం ఎట్లుంటది? ఎక్కడుంటది? ఇంకా ప్రజలు సిద్ధంగా లేరనటం ఎవరివెర్రి. ఎవరిపిచ్చి?" మంగమ్మ వుద్రేకంగా అడిగింది. అందరి బాధా ఆమెలో గూడుకట్టుకున్నట్లు పొంగింది. ప్రశ్నకు సమాధానం చెప్పమని సవాలు చేస్తు న్నట్లుగా చూసింది.

వీరభద్రం తలవంచుకున్నాడు. కొద్దిసేపు మాట్లాడలేదు. తరువాత అన్నాడు:

"మంగమ్మా! నువ్వు ఉద్రేకంలో వున్నావు. నేను ఎంత వాదించినా నీవు అంగీకరించవు. మన మార్గాలు వేరైనాయి. నీ విశ్వాసం నీది. నా విశ్వాసం నాది. మనం విడిపోయాం. నీ తోవ నీది - నాతోవ నాది. ఎవరిది సరియైన మార్గమో కాలం నిర్ణయిస్తుంది. ప్రజలు నిర్ణయిస్తారు."

అలా అని సిగరెట్టు కాల్చాడు. లేచినుంచున్నాడు. లిప్తపాటు అక్కడ వున్నవారందరినీ చూచాడు. తరవాత గదినుంచి నిష్క్రమించాడు.

అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. అందరి మనసుల్లోనూ ఏవో మాటలు మసలు తున్నాయి. ఆ విషయం చూపుల్లో కనిపిస్తూంది- పెదవులు మాత్రం కదలలేదు.

పంకా గిరగిరా తిరుగుతూనే వుంది.

గుండెల చప్పుళ్ళు సైతం వినిపిస్తున్నట్లుంది గది.

ఏం మాట్లాడాలో ఎవరికీ అర్థంకాలేదు-వ్యాఖ్యానించే ధైర్యం ఎవరికీ లేదు.

గాలి భారంగా వుంది.

గుండెలు బరువుగా వున్నాయి.

ఆ రాత్రి ప్రకాశానికి నిద్రపట్టలేదు. కళ్ళు మూసుకుంటే ఏదో ఆలాపన - ఆలోచన - అంతా కళ్ళముందే జరుగుతున్నట్లుంది - చెట్టుకు కట్టి ఉన్న మస్తాన్ - మంగమ్మ ఉద్రేకం - యలమంద పొలానికి పరుగు - హుసేన్ కర్రతిప్పడం - మంగమ్మ రక్తం రాలడం - తాను ముందు కురకడం - మంగమ్మ తనను లాగడం - జనయాత్ర - నినాదాలు - కాగడాల ఊరేగింపు - పట్నం చేరడం - బలరామయ్య ఉపన్యాసం - వీరభద్రం బలరామయ్య పక్కనుండడం - పల్లెలో రాత్రి ఊరేగింపు - పంచాయతి ఎన్నికల గొడవ - మస్తాన్ తల బద్దలు కావడం - మంగమ్మ అరెస్టు కావడం - విచారణ - జేలుశిక్ష - వీరభద్రం గూడ విరగడం - ఆస్పత్రి - మల్లయ్య కోటయ్య రావడం - సరస్వతి ఇల్లు - సరస్వతి ఆస్పత్రికి రావడం - మల్లయ్య పొలం పోవడం - రామయ్య ఎన్నిక కావడం - గాంధీతో తన పోట్లాట - పరాంకుశరావు హత్య - మతకలహాలు - మంగమ్మ జేలునుంచి విడుదల కావడం - ఉదయం జరిగిన చర్చ.

వీరభద్రం పిరికివాడవు తున్నాడా? అతను చెప్పిందాంట్లో వాస్తవం ఏమైనా ఉందా? అంతర్జాతీయ పరిస్థితి అనుకూలంగా ఉందంటాడు. కావచ్చు. అందువల్ల ఇక్కడేం లాభం? పరాంకుశరావు చావలేదా? హుసేన్ జేలుకు పోలేదా? మత కలహాలు రాలేదా? రామయ్య గెలవలేదా? అతడు మంత్రి కాకుండా ఉంటాడా? మంగమ్మ చెప్పిందే నిజం. జనం సిద్ధంగా ఉన్నారు. ఇంతకంటే అన్యాయాలూ, అక్రమాలూ ఎన్నడూ జరుగలేదు. దేశం విప్లవానికి సిద్ధంగా ఉంది - సిద్ధంగా ఉంది - సిద్ధంగా ఉంది. విప్లవం రావాలి. విప్లవం వర్ధిల్లాలి.

ఇలాంటి ఎన్నో ఆలోచనలతో సతమతం అయింది ప్రకాశం చిన్నిమనస్సు. ముక్కుపచ్చలారని వయసు–మనసులో తుఫానులు - ఎంతో సేపు మధనపడ్డాడు. ఎప్పుడో తెల్లవారుజామున నిద్రపట్టి నట్లయింది. కల వచ్చింది. అతనికి అది కలలా లేదు–వాస్తవంగా ఉంది.

"క్షమించం. కొట్టండి. చీల్చండి. ముక్కలు ముక్కలు చేయండి" అని పలవరిస్తున్నాడు.

మంగమ్మ ప్రకాశాన్ని లేపింది. "ఏమిటి? అట్ల కలవరిస్తున్నవు?"

కళ్ళు తెరిచి చూచాడు ప్రకాశం - ముందు మంగమ్మ - మామూలు ఇల్లు. కల చెదిరి పోయింది - కళ్ళు నల్చుకున్నాడు.

"ఏం లేదమ్మా! ఏదో కల"

"లే. ఎంత పొద్దెక్కిందో చూడు. ఊరికి పోవాలె మనం - మల్లయ్య మామ వెళ్ళిపోయిండు."

ప్రకాశం లేచి నుంచొని ఒళ్ళను విరుచుకొన్నాడు. "కక్కయ్య వస్తున్నాడా?" అని అడిగాడు.

"వస్తననే అంటున్నడు."

"వస్తడటనా?" అని ప్రకాశం పంపు దగ్గరికి వెళ్ళిపోయాడు. ఊరికి వెళ్ళడం అంటే ప్రకాశానికి ఉత్సాహంగానే ఉంది-కాని వీరభద్రం రాకుండా ఉంటే బాగుండు ననిపించింది. గీతను ఊరికి తీసికెళ్ళాలనుకున్నాడు. తన ఊరు అక్కడి పరిస్థితులు ఆమెకు చూపించాలనుకున్నాడు - వివరించాలనుకున్నాడు.

ప్రకాశం ముఖం కడుక్కున్నాడు. తల్లి అందించిన చాయ్ అందుకున్నాడు. కుర్చీలో కూర్చొని చప్పరించాడు–చాయ్ రుచిగా అనిపించింది. వింత మాధుర్యం ఉంది అందులో - మాతృహృదయపు మమత చేరింది అందులో.

"అమ్మా! చాయ్ చాల బాగున్నదమ్మా! నువ్వు చేసినవా?"

"అవున్నాయనా!"

"నువ్వెంత మంచిదానివమ్మా" అని చాయ్ కప్పు అక్కడే పెట్టి తల్లిని కౌగలించుకున్నాడు.

మంగమ్మ కరిగిపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి. కొడుకు తల ముద్దాడింది. చెంగుతో కళ్ళు తుడుచుకొని అన్నది.

"పిచ్చినాయనా! రోజు తాగేదెగదరా చాయ్. వదులు చాయ్ చల్లారి పోతున్నది. తాగు ముందు"

తల్లిని వదిలివచ్చి చాయ్ అందుకున్న ప్రకాశం కళ్ళలో తేమ కనిపించింది. చాయ్ అందుకొని తాగుతూ అన్నాడు ప్రకాశం:

"అట్లనకమ్మా! ఇయ్యాళ చాయ్‌లో రుచి ఉన్నది. ఇందులో మా అమ్మ మనసున్నది."

మాతృహృదయం పొంగింది.

"మానాయనా! ఎంత అమాయకుడవురా!" అని కొడుకును గట్టిగా కావిలించు కొంది. విడిచి వెళ్ళిపోతాడేమో నన్నట్లుగా పట్టుకుంది. పిల్లి తన పిల్లను పట్టు కొన్నట్లు పట్టుకుంది.

* * *

పల్లెకు చేరుకుంది మంగమ్మ. ప్రకాశం, గీతా ఆమె వెంట వచ్చారు. రాస్తైతే వచ్చింది - కాని ఉనికి లేదామెకు! బస్సుదిగి ఊరు చూచింది. ఊరు మారి పోయింది - తనను చూచుకుంది - తాను మారిపోయింది. తాను కుంగిపోయింది - ఊరు పొంగుతున్నది. ఆనందమే కలిగిందామెకు గ్రామం పొంగుతున్నందుకు - అయితే ఆ పొంగు కొందరిదే - పేరు ఊరిది. మల్లయ్య వచ్చాడు. బస్సుదగ్గరికి - కోటయ్యకూడా వచ్చాడు. వాళ్ళిద్దరినీ చూచింది. వాళ్ళస్థితి గ్రహించింది. ఆమె ఆనందానికి గ్రహణం పట్టింది.

కోటయ్యను చూచి కుంగిపోయాడు ప్రకాశం. ఎలా ఉండేవాడు ఎలా అయి పోయాడు! వట్టి ఎముకలగూడు!

"కోటయ్యా! ఎట్లయినవు?" ప్రశ్నలో బాధ నిండి ఉంది.

"యాదగిరి తాన కొలువున్నగద" కోటయ్య జవాబు.

"చూసినవా గీతా! కొలువున్నందు కిట్లయిండు కోటయ్య. కొలువుంచు కున్నోడు బొర్ర పెంచుతున్నడు. వీండ్లు కష్టపడ్తరు. వాండ్లు కండలు పెంచుతరు. వీండు పండిస్తరు, వాండ్లు బంగళాలు కడ్తరు" అని కోటయ్యను గీతకు పరిచయం చేశాడు.

కోటయ్య గీతకు నమస్కరించాడు.

"మనింటికే పోదం నడువురి" మల్లయ్య అన్నాడు - ముందు నడిచాడు. మంగమ్మా మిగతావారు అనుసరించారు. వీధివెంట సాగుతుంటే కొందరు మంగ మ్మను గుర్తించనే లేదు. గుర్తించినవారు "బాగున్నవా" అని కుశల ప్రశ్నలు మాత్రం అడిగారు.

సాగిపోతున్న మంగమ్మకు తన ఇల్లు కనిపిస్తే కాలు కదల్లేదు. నిల్చిపోయింది. అలా ఒకసారి తన ఇంటిని చూచుకుంది - ప్రస్తుతం అందులో గ్రంథాలయం ఉంది. అలా చూచిన క్షణంలో ఆమె మనసులో ఎన్ని జ్ఞాపకాలు మసలాయో! జగ్గయ్య కనిపించి ఉంటాడు—అతనితో గడిపిన రోజులు - రామయ్య రావడం - వీరభద్రం వ్యథ - ప్రకాశం పుట్టుక - తన ఇంటికి పోలీసులు రావడం- తాను పట్టుపడడం.

ఒక్క వస్తువును పట్టుకొని ఎన్ని జ్ఞాపకాలు వ్రేలాడుతుంటాయి!

మంగమ్మ కాలు కదిలించింది. సాగుతే మళ్ళీ మల్లయ్య గుడిసె వచ్చేదాకా ఆగలేదు.

పిచ్చమ్మ మంగమ్మను చూసింది. ఆమె గుండె చెరువైంది. ఉరికివచ్చి మంగమ్మను కావిలించుకుంది.

"ఎనువంటిదానివి ఎట్లయినవమ్మా! మంగమ్మా! సీతమ్మవారి చెరలనుభవించినవమ్మా" అని కంటతడి పెట్టింది.

"పిచ్చమ్మక్కా! ఇంత ఊళ్ళో నాకింత నీడ ఇచ్చింది నువ్వేనమ్మా"

మంగమ్మ తరవాత మాట పెకల్లేదు.

ముంగిట్లో పందిరికింద కూర్చున్నారంతా.

గీతకు అంతా వింతగా ఉంది. ఆ మనుషులు, ఆ గుడిసెలు, ఆ దారిద్ర్యం, ఆ ప్రేమ, ఆ అనుభూతి, ఆ అనురాగం! ఆమె మనసును కదిలించాయి.

ఇంతలో ఇరుగు పొరుగు అమ్మలక్కలు వచ్చారు. మంగమ్మను పరామర్శించారు.

"ఉన్న బూమిపాయె. ఇల్లుపాయె. ఏంచేస్తవమ్మ" ఒక అమ్మ ప్రశ్నించింది.

"పందసువంటి సంసారమమ్మ. ఆ జగ్గయ్య ఏనాడు పోయిండో అదికూడ పోయింది" ఒక అక్క సానుతాపం వ్యక్తపరిచింది.

క్రమంగా రాకపోకలు నిలిచిపోయాయి.

బోజనాలయినాయి. మల్లయ్య ఇంట్లో భోజనం అంటే కారం మెతుకులు - గీతకు మింగుడు పడలేదు. అయినా గొంతులో వేసుకొని నీళ్ళు పోసుకుంది.

ఆ తరువాత పాత కథలన్నీ తవ్వుకున్నారు. మల్లయ్య పొలం పోవడం - పిచ్చమ్మ రౌద్రం అన్నీ ఎన్నో ముచ్చట్లుగా చెప్పుకున్నారు.

ఆ రాత్రి ఆ ముచ్చట్లతోనే గడిచింది. మంగమ్మ తన జేలు ముచ్చట్లు కొన్ని చెప్పింది.

కిర్సనాయిలు దీపం పొగ చిమ్ముతూంది.

వీధిలో కరెంటు దీపం వెలుగుతూంది.

తలా ఒక మాట చెప్పుతున్నారు. దొరలు పారిపోవడం దగ్గరినుంచి

మంగమ్మ జేలునుంచి వచ్చేవరకూ గల అంశాలు అనేక రకాలుగా చెప్పుకుంటు న్నారు.

గీత, ప్రకాశం శ్రద్ధగా వింటున్నారు. ముచ్చట్లన్నీ ముగిసిం తరువాత గీత మంగమ్మను అడిగింది:

"ఆంటీ! హత్యలెందుకు జరుగుతున్నా యంటారు?"

"అవునమ్మా! ఇదివరకు ఇటువంటి ప్రశ్నే అడిగినవు. అప్పుడెందుకో చెప్ప లేకపోయిన. విను. ఆస్తి, అధికారం ఈ రెండు హత్యలకు కారణాలు. హత్యలకే కాదు అన్ని దుర్మార్గాలకు, అన్యాయాలకు ఆస్తి, అధికారాలే కారణాలు. ఈ ఊరికి సంబంధించినంతవరకు రెండు హత్యలు జరిగినయి. మస్తానన్నను చంపింది అధి కారం కోసం. చంపింది హుసేను. చంపించింది రామయ్య. జేలుకు పోయింది నేను. అధికారాన్ని అంటిపెట్టుకొని హత్యలు జరుగుత యనటానికి ఇది ఉదాహరణ. పరాంకుశరావు హత్య ఆస్తికి సంబంధించింది. ఈ హత్యకూడ చేయించింది రామయ్యే. చేసింది మళ్ళీ హుసేను. ఈ రెండు హత్యలవల్ల లాభం కలిగింది రామయ్యకే. అయినా హుసేనుకు జేలు శిక్ష పడింది. చేయించిన రామయ్య సమా జంలో గొప్పవాడు. చేసిన హుసేను నీచుడు! నేరస్తుడు! దుర్మార్గుడు!

"హుసేను ఎందుకు చేసిండు?"

హుసేన్‌కు చదువులేదు. విజ్ఞానం లేదు. సంస్కారం లేదు. అందుకు కారణం అతని దారిద్ర్యం. అయినా అతనికి ఒకపని కావాలె. తిండి కావాలె. పెండ్లి కావాలె. పిల్లలు కావాలె. అతనితో పని ఉన్నవాడు కావాలె. అప్పుడు రామయ్యలు, బలరామయ్యలు, యాదగిరులు, శేషయ్యలు ముందుకు వస్తరు. హుసేను వంటి వారితో, సైదయ్యవంటి వారితో వారికి పని. వారు వీరిని పోషిస్తరు. సోమర్లను చేస్తరు. ఎన్నడో ఒక దుర్మార్గం చాలు—ఏండ్లకొద్ది తినొచ్చు. అందుకు అలవాటు పడ్తరు వీరు. వీరితో హత్యలు చేయిస్తరు. వారు సొమ్ము చేసుకుంటరు. హుసే న్లకు, సైదయ్యలకూ, ఒకనాటికి నిజం తెలుస్తుంది. జేల్లోకి వచ్చి హుస్సేను ఏడ్చిండు. తన తప్పు తెలుసుకున్నడు. మస్తాన్ను, పరాంకుశరావును చంపినందుకు కుంగిపోతున్నడు."

మంగమ్మ ముగించింది. మరి మాట్లాడలేదు. మౌనం వహించింది. ఆమె ఆలోచనలో మునిగిపోయింది.

మల్లయ్యకు అంతగా అర్థంకాలేదు.

పిచ్చమ్మ గుర్రుకొట్టి నిద్రపోయింది.

ప్రకాశం, గీత ఇద్దరూ ఇంటి కప్పును చూస్తూ ఆలోచిస్తున్నారు. కప్పు చెదిరిపోయింది. చుక్కలు కనిపిస్తున్నాయి.

నిముషాలు బరువుగా జారుతున్నాయి.

"ఆంటీ! ఆస్తి, అధికారం లేకుండాచేస్తే?" గీత మౌనాన్ని భంగం చేసింది.

మంగమ్మ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది.

"ఏమిటమ్మ అడిగితివి?"

"ఆస్తీ, అధికారం లేకుండా చేస్తే?"

"అవి లేకుండా పోవమ్మా. మానవసమాజం ఉన్నన్నాళ్లు అవ్వి ఉంటయి. ఆస్తి సమాజపరం కావాలె. అధికారం శ్రామికులకు చెందాలె"

"అది ఎట్ల కుదుర్తది?" ప్రకాశం అడిగాడు.

"విప్లవం రావాలె"

"విప్లవం రావలెకాదు తేవాలె" ప్రకాశం గర్జించినంత గట్టిగా అన్నాడు.

మంగమ్మ అదిరి పడ్డది. "ప్రకాశం..........." అన్నది గట్టిగా దిగ్గున లేచి కూర్చుంటూ.

మంచంలో కూర్చొని ఉండిన ప్రకాశం నడుం వాల్చి దుప్పటి కప్పు కున్నాడు.

మంగమ్మ నిట్టూర్చింది. నడుం వాల్చింది. దుప్పటి కప్పుకుంది.

ఊరు చీకటి గొంగళి కప్పుకుంది. ముడుచుకొని పడుకుంది.

తెల్లవారింది. అంతా వేపపుల్లలు వేసుకొని పండ్లు తోముతున్నారు. ఇంకా వారి ముచ్చట్లు ముగియలేదు—మూడేండ్ల ముచ్చట్లవి! మంగమ్మ వాకిట్లోకి చూచింది. ఆమె నోటిమాట అమాంతంగా ఆగిపోయింది.

వాకిటి గుమ్మంలో సైదయ్య కనిపించాడు ! నిటారుగా నుంచొని ఉన్నాడు. సైదయ్య పూర్వంలా లేడు. అతని చేతిలో దుడ్డుకర్ర లేదు. తలగుడ్డ లేదు. కళ్ళలో ఆ క్రౌర్యం లేదు. మనిషికూడా చిక్కిపోయాడు ! అయినా అతడు సైదయ్యే ! అందుకే మంగమ్మగుండె గుభేలుమంది.

అంతా అతన్ని అదోరకంగా చూస్తున్నారు - వారి చూపుల్లో ఆశ్చర్యమే ఉందో, భయమే ఉందో చెప్పడం కష్టం.

సైదయ్య వాకిట్లోకి అడుగు వేశాడు.

"అమ్మా! మంగమ్మతల్లీ! కాల్మొక్త" అని ముందుకు నడిచి మంగమ్మ కాళ్ళమీద పడిపోయాడు—అతని గొంతు బొంగురువోయింది.

"లే సైదయ్యా! ఏమన్న పిచ్చెక్కిందా? ఎందుకట్ల ఏడుస్తవ్?" అని మంగమ్మ సైదయ్యతలను తన కాళ్ళమీదినుంచి తొలగించింది.

"అమ్మా! మంగమ్మతల్లీ! ఎంతపాపం చేసిన్నమ్మా! కాళ్ళుపట్టుకోనియ్యమ్మా, కాళ్లు. నీకాళ్ళు పట్టుకుంటెనన్న జర పాపాలు పోతయేమో. నేను మనిషిని కానమ్మ సైతాన్ను. సైతానోలెనే పాపాలుచేసిన. క్షమించమ్మా, క్షమించు. నువ్వు దేవతవు" చతికిలాబడి మంగమ్మముందు కూర్చొని, చేతులు జోడించి, కన్నీరు ధారాపాతంగా వస్తుండగా, అన్నాడు నేటి సైదయ్యను — అతడు నిన్నటి సైదయ్యకాదు.

అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు సైదయ్యను – వారి చూపులో ఇప్పుడు భయంలేదు.

"ఏమైంది సైదయ్యా! అట్లయిపోయినవు!" మంగమ్మ అడిగింది. ఆ అడగడంలో సానుభూతి ఉంది. సానుతాపం ఉంది.

"ఏం చెప్పమంటవు తల్లీ" పంచెతో కళ్లు తుడుచుకొని, చేతులు జోడించి "కతంత ఎరికైందేకద. మళ్ళేం చెప్పమంటవమ్మా! హుసేనన్నను జేలుకు తోల్రినా! వాని పెండ్లం మంచం పట్టింది - నవుస్తాంది. ఇయ్యాల్నో, రేపో అనేటట్లున్నది తల్లీ - అది బతుకుతదని నమ్మకం లేదమ్మా! నెత్తుటికూటికి ఆశపడ్డమమ్మా. అనుబగిస్తున్నం తల్లీ - ఇప్పుడు కట్టెలు కొట్టుక బతుకుతాన్న. ఇగ మన్నించు తల్లీ - మమ్ముల మన్నించు" కన్నీటవాన కురిశాడు సైదయ్య.

మంగమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

ప్రకాశం కనుకొనుకుల్లో నీరు నిలిచింది.

గీత చెక్కిళ్ళనుండి బాష్పధార ప్రవహించింది.

మల్లియ్యా, పిచ్చమ్మా ప్రతిమలైనారు.

"సైదయ్యన్నా! హుసేనన్నింటికి పోదమా?" లేచి నుంచుంది మంగమ్మ.

"నువ్వొస్తవా అమ్మా హుసేనన్నింటికి?" ఆశ్చర్యం వ్యక్తపరచి లేచినుంచున్నాడు సైదయ్య.

"నడువు" మంగమ్మ అన్నది.

సైదయ్య నడిచాడు. మంగమ్మ, మంగమ్మ తరవాత మిగతావారూ నడిచారు.

అది హుసేన్ గుడిసె - కాదు - గూడు. అందులో కుక్కి మంచంతో, కొన ఊపిరితో పడి ఉంది బూబమ్మ.

బూబమ్మ కళ్ళు తెరిచింది - ప్రయత్నించి.

ఆమెకు సైదయ్య కనిపించాడు.

"బూబమ్మా! ఎవరొచ్చినోర్రి చూడు. మంగమ్మొచ్చింది. మన దేవతొచ్చింది" అన్నాడు సైదయ్య.

బూబమ్మ ఆశగా చుట్టూ చూచింది. మంగమ్మ కనిపించింది. లిప్తపాటు నోట మాట రాలేదు. తరవాత గునిసినట్లు అన్నది.

"వచ్చినవా మంగమ్మతల్లీ! మా అమ్మా! నీకే గోరం చేసిందమ్మా మా ఆయన. అనుబగిస్తున్నదమ్మా! ఆ పాపం మేమిట్లకుడుస్తున్నం. మన్నించు తల్లీ - మన్నించు" అనలేక ఆయాసంగా అన్నది. ధ్వని నూతిలోంచి వస్తున్నట్లుంది. మంచంలోంచి లేవటానికి ప్రయత్నించింది – లేవలేక పోయింది. చేయి కిందికివేసి మంగమ్మ కాళ్ళకోసం వెదికింది – మంగమ్మ తప్పించుకుంది. మంచం మీద

కూర్చుంది - ఆ దృశ్యం చూస్తుంటే ఆమె గుండె చెరువు అవుతూంది. గొంతు లోంచి మాట పెకలడంలేదు. అయినా అన్నది:

"బూబమ్మా! అట్లనకు. అందరం పరిస్థితులకు బానిసలం. హు సేనన్న ఏమన్న చెయ్యాల్నని చేసిండా? జేల్ల కలిసిండు. నువ్వేడ్చినట్లే ఏడిచిండు. ఇప్పుడు మంచోడైండు. మనిపైండు నువ్వు దిగులు పెట్టుకోకు. బాగుకావాలె" అవి మాటలు కావు — దుఃఖపు మూటలు.

ప్రకాశం మనసులో ఏవో సెగలు రేగుతున్నాయి.

బూబమ్మ కళ్ళల్లో నీరు నిండింది.

"మంగమ్మతల్లీ! నువ్వు మనిషివి కావమ్మా — దేవతవు. మా ఆయన మంచోడైండన్నవు - చాలు. నువ్వు మా ఇంటికి వచ్చినవు అది చాలు - మంగమ్మక్కా! నేను బతకను. చచ్చినా ఇగమంచిగ చస్త - మంగమ్మక్కా మంచిగ చస్త" అని గొల్లుమన్నది బూబమ్మ. మంగమ్మ తొడలిమీద పడి గొల్లుమంది. ఎక్కెక్కి ఏడ్చింది. ఎక్కడుంది ప్రాణం పాపం! దగ్గుపొర వచ్చింది - తెరలు తెరలుగా వచ్చింది - ఊపిరి సలపకుండా వచ్చింది - సతమతం చేసింది. గుడ్లు తేలవేసింది.

"బూబమ్మా, బూబమ్మా!" అని ఊపింది మంగమ్మ.

"అత్తమ్మా!" అని మీదపడి తల రుద్దసాగాడు ప్రకాశం.

గీత గుండె దడదడలాడింది.

మల్లయ్య ప్రతిమలా నుంచున్నాడు.

సైదయ్య బయటకీ - లోనికీ — ఉరుకుతున్నాడు.

బూబమ్మ ఊపిరి సలుపుకొంది. దగ్గు తెరలు లేచి పోయాయి. ఉమిసింది. పుక్కెడు రక్తం! ఎక్కడుందో అది!

"ఇంత జల్దీ పోనమ్మా పోను" అని పడిపోయింది- కళ్ళల్లో లోతున ఎక్కడో ప్రాణం మిణుకు మిణుకు మంటూంది.

అందరి చూపుల్లో గుండెల దడలు కనిపించాయి.

బూబమ్మా కళ్ళుమూసుకొంది — స్పృహ తప్పిపోయింది.

వాతావరణంలో చడీచప్పుడూ లేదు.

అంతా బూబమ్మనే చూస్తున్నారు — కళ్ళే మాట్లాడుతున్నాయి. గుండెలు గుసగుసలాడు తున్నాయి!

బూబమ్మ మంచంలో పడింది.

శల్యావశిష్టంగా ఉంది.

మంచంలో కనిపించడంలేదు.

అయినా ఊపిరి ఆడుతూనే ఉంది.

కనుపాపలు కదలాడుతున్నాయి.

కనురెప్పలు కనబరుస్తున్నాయి.

అదే ఒక ఆశ మిణుకు మిణుకు మంటూంది అక్కడ నుంచున్న వారిలో.

అంతా మౌనంగా నుంచున్నారు. ఎవరి పెదవీ కదల్లేదు. అయినా కాలం కదులుతూంది – మౌనంగా జారిపోతూంది.

మంగమ్మ నిట్టూర్పు విడిచి గుడిసెలోంచి బయటికి వచ్చింది. ప్రకాశం ఒకసారి బూబమ్మను ఆపాదమస్తకం చూచాడు. అతని కనుకొలకుల్లో కన్నీరు నిలిచింది. అది తుడుచుకొని తల్లిని అనుసరించాడు. గీత కన్నీటితో ప్రకాశాన్ని అనుసరించింది. మల్లయ్య వారిని అనుసరించాడు. సైదయ్య గుమ్మందాకా వచ్చి నుంచున్నాడు. చూపందినంత వరకు వారిని చూచాడు. ఆ తరువాత గొడ్డలి బుజాన వేసుకొని అడవివైపు సాగిపోయాడు.

మంగమ్మ మల్లయ్య ఇంటికి చేరుకుంది.

మంగమ్మను చూచి పిచ్చమ్మ అడిగింది.

"ఎట్లున్నది బూబమ్మకు?"

"ఏమో! బతికెటట్లు కండ్లపడ్తలేదు."

"అంతేనా?" అన్నది పిచ్చమ్మ - నిరాశగా చూచింది.

"అంతే" అని మంచంలో కూలబడ్డది మంగమ్మ.

"అమ్మా!" నుంచున్న ప్రకాశం అడుగు తున్నాడు. "మనమేం చెయ్యలేమా అమ్మా! బూబమ్మ చస్తుంటె చూడాల్సిందేనా?"

మంగమ్మ కొడుకును వింతగా చూచింది. అతని ముఖంలో వేదన మూర్తీభవించింది. మాటలు దుఃఖపు మూటలుగా ఉన్నాయి.

"అంతె నాయనా. అంతే – పేదల చావు పుట్టుకలను అడిగేవాడు లేడు. వారు భూమికి భారంగా పుడ్తారు. చావుతోనే వారి దుఃఖాలు అంతరిస్తాయి."

"ఆంటీ నా దగ్గర డబ్బుంది. బూబమ్మకు ట్రీట్‌మెంట్ చేయింతాం" గీత ధ్వనిలో ఆతురత, ఔదార్యం కనిపించాయి.

ఆ మాటలు విని మంగమ్మ గుండె చెఋవైంది. అమాంతంగా లేచి గీతను కౌగిలించుకొని ముద్దు పెట్టుకుంది. "పిచ్చితల్లీ! నీ దగ్గరున్న డబ్బు ప్రాణం కాపాడటానికి చాలదమ్మా! బూబమ్మకు వచ్చింది క్షయ. అది ధనవంతులకు రావలసిన రోగమమ్మా! పేదలను అది పొట్టన పెట్టుకోకుండా పోదు తల్లీ" అని మంగమ్మే గీతను ఒళ్ళో కూర్చోబెట్టుకుంది. గీత కళ్ళు చెమ్మగిల్లాయి.

ప్రకాశం వారిద్దరినీ చూస్తూ నుంచున్నాడు.

"అమ్మా! రామయ్య ఇల్లు లూటీ చేస్తే బూబమ్మ బతకదా."

"అంత మాటనకు నాయనా! అంత మాటనకు" అని కొడుకు నోరు మూసింది మంగమ్మ.

అంతా నివ్వెరపోయి ప్రకాశాన్ని చూచారు.

కొడుకు నోరుమూసిన మంగమ్మ మనసులో మధన ప్రారంభం అయింది.

తెల్లవారి సద్దికట్టుకొని బయలుదేరాడు కోటయ్య – యాదగిరి పశువులను కాయడానికి. అతడు వెళ్తున్నప్పుడు చూసింది గీత-అందులో ఏదో వింత కనిపించింది – మనమూ వెళ్దామంది ప్రకాశంతో. సరేనన్నాడు ప్రకాశం. ఇద్దరూ భోజనాలు చేసి పొద్దెక్కిన తరవాత బయలుదేరారు – అయినా సద్ది కావాలంది గీత. సద్దిమూటతో బయలుదేరారు-ఇద్దరూ.

ఎండాకాలం. అప్పుడప్పుడే మంట మొదలు అవుతూంది. సద్దిమూట చేత పట్టుకొని సాగుతూంది గీత. పక్కనే నడుస్తున్నాడు ప్రకాశం. ఊరు దాటారు. ఎండిపోయిన కాలవ కనిపించింది - చెరువులోసి నీరు పొలాలకు పారించే కాలవ అది. వర్షాకాలం అవుతే చల్లగా, నిండుగా నీరు పారించే కాలువ - ఇప్పుడు తడి లేకుండా ఉంది. ఇసుక కనిపిస్తూంది. అక్కడ నత్తగుల్లలున్నాయి. అది ఎండిన డొక్కలా ఉంది. పగిలిన గుండెలాగుంది. అయినా అందంగా కనిపించింది గీతకు. నత్తగుల్లలు ఏరింది. కాలవ ఇసకలోంచే సాగిపోతున్నారు–ఇద్దరూ. చెరువుకట్ట ఎక్కారు. చెరువు లోతట్టు బీటలు వారింది. కట్ట మామూలుగా ఉంది. కట్టమీద నుంచొని చెరువులోనికి చూచారు ఇద్దరూ. బూబమ్మ వంట్లో ప్రాణాల్లా దూరంగా ఎక్కడో గుంటలో కొద్దిగా నీరుంది. ఆ నీటిని ఆశ్రయించుకొని కొన్ని కొంగలున్నాయి – మల్లెలమాలల్లా. అవి చేపలకోసం చేరాయక్కడికి. కొన్ని ఎగురుతున్నాయి. కొన్ని మడుగు పక్కనే కాపురం పెట్టాయి. అక్కణ్ణుంచి కదిలారు. కట్టకు ఇటుపక్కన నాగజెముళ్లు నోళ్ళు తెరుచుకొని కనిపించాయి. బుసకొట్టలేక ఏడుస్తున్న పాముపడగల్లా ఉన్నాయవి. సాగిపోతున్నారు వారు. కట్టమీద మోదుగులు కనిపించాయి. ఆకులేదు. పూలు నిప్పుకణికల్లా ఉన్నాయి. చెట్లు సాంతం మండిపోతున్నట్లనిపించింది గీతకు. మోదుగుచెట్లు జ్వాలల్లా, కీలల్లా కనిపించాయి.

"ఏమిటది చెట్లు నిప్పులు కక్కుతున్నాయి!" అడిగింది గీత.

"తెలియదా! మోదుగులు. పూలుపూస్తే నిప్పులు కక్కుతాయి."

"ఎంతబావున్నాయి! తెంపుకుందామా!" అడిగింది గీత - ఆమె ధ్వనిలో ఉత్సాహం ఉట్టిపడుతూంది.

"పనికిరావు. వాటికి వాసన ఉండదు. ఏం చేసుకుంటవు?"

"ఎందుకు పనికిరావు? అంత అందంగా ఉన్నాయి పూలు! తలలో పెట్టుకుంటా"

"అవి తలలో పెట్టుకోరు"

"నేను పెట్టుకుంటా. తెంపిద్దూ" యాచిస్తున్నట్లున్నాయి గీత మాటలు.

ప్రకాశం గీతను చూచాడు. పూలు తెంపి ఇవ్వకుంటే ఏడ్చేసేట్లుంది గీత ముఖం.

"సరె – రాల్చుత" అని చెట్టెక్కి పూలు రాల్చాడు ప్రకాశం. పూలు రాలు తుంటే అగ్గి రాలుతున్నట్లనిపించింది గీతకు. ఆమె జాగ్రత్తగా అందుకుంది మొదట పూవును - వేళ్ళు కాలలేదు. తరవాత గబగబా ఏరింది పూలు. ఒళ్ళో నింపుకుంది. ప్రకాశం చెట్టు దిగాడు. ఇద్దరూ కట్ట దిగారు. ఎదురుగా మామిడి తోట కనిపించింది. కాయల బరువుకు వంగి ఉన్నాయి చెట్లు - గాలికి మెల్లగా ఊగుతున్నాయి కొమ్మలు.

"ఆ తోట ఎవరిది?" అడిగింది గీత.

"రామయ్యది"

"ఎంత మంచి తోట!"

"ఈ ఊళ్లో మంచివన్నీ రామయ్యవి. దరిద్రమంతా ఊళ్లోవాళ్ళది. ఒక్క రామయ్య పోతే ఈ ఊరి సంపదంతా ఊరివాళ్ళది అవుతుంది"

గీత ప్రకాశాన్ని చూసింది. ఉద్రేకం ఉరుకులు పెడ్తూంది అతని ముఖంలో.

"రామయ్య ఎలా పోతాడు?"

"పోతాడా! వాడు – పోతాడూ! పంపించాలె. నడిబజార్లో బందూకుతో కాల్చి చంపాలె. చంపాలె గీత చంపాలె. అదే మనం చెయ్యాల్సినపని."

ప్రకాశం వడకి పోతున్నాడు. ఆ ఉద్రేకం ఎదురుగా ఉన్న గీతలో ప్రవేశించింది. పిడికిటితో మోదుగుపూలు పట్టుకొని చేయెత్తింది. "అవును చంపాలె. అదే మార్గం. వేరే మార్గంలేదు" అన్నది గట్టిగా.

ఆమె ముఖాన మోదుగులు పూసినట్లనిపించింది ప్రకాశానికి.

అతని ముఖంలో అగ్ని జ్వాలలు కనిపించాయి గీతకు.

రెండు మంటలూ కలిసి మర్రిచెట్టువైపు సాగాయి –

వారు మర్రిచెట్టుకిందికి చేరారు. ఎండ బాగా ఎక్కింది. వేడి గాడ్పులు వీస్తున్నాయి. పక్షులు మర్రిచెట్టుమీదచేరి, నోళ్లు తెరచుకొని, ఎండను చూస్తూ వగరుస్తున్నాయి. మామిడితోటలోంచి చిలకల గుంపులు ఆకాశంలోకి ఎగిరి, ఎర్రంచువున్న పచ్చచీర వాలినట్లు, మళ్ళీ తోటలో వాలుతున్నాయి.

"ఇంత ఎండలోనూ మర్రినీడ చల్లగా ఉంది" అన్నది గీత.

"అవును" పరధ్యానంగా అన్నాడు ప్రకాశం – అతడు కోటయ్య కోసం చుట్టుపక్కల చూస్తున్నాడు.

"ఈ బండ ఎంత బావుంది!" అన్నది గీత పరుపుబండను చేత్తో రాస్తూ.

"అవును" అన్నాడు ప్రకాశం మళ్ళీ పరధ్యానంగానే – ఈ తడవ అతనికి కోటయ్య కనిపించాడు. దూరంగా తుమ్మచెట్టునీడలో కూర్చొని పశువులను కాస్తున్నాడు.

"కోటయ్యా!" లేచి నుంచొని కేక వేశాడు ప్రకాశం.

కోటయ్యకు వినిపించలేదు.

"ఏడి? వున్నాడా కోటయ్య?" అని లేచి నుంచొని అటువైపు చూచింది. కోటయ్య కోతిపిల్లలా కూర్చొని వున్నాడు.

మళ్ళీ కేకవేశాడు ప్రకాశం. ఈ తడవ బయలు ప్రతిధ్వనించింది. కొండలూ-కోనలూ కోటయ్యను పిలిచాయి.

కోటయ్య విన్నాడు. ప్రకాశాన్ని చూచాడు. ఎగిరి గంతేశాడు. "ఒహ్హో, వస్తి, ఒహ్హోవస్తి" అని సద్దిమూట తీసుకొని పశువులను మళ్ళించుకొని మర్రివైపు సాగాడు.

కోటయ్య వస్తున్నాడు. ప్రకాశం కూర్చున్నాడు. గీత కూర్చొని రాతి ముక్కతో బండమీద గీతలుగీస్తూ అడిగింది—

"మర్రి మనుషులకింత హాయినిస్తుంటే, మనిషి ఇవ్వలేడా?"

ప్రకాశం బిత్తరపోయి గీతను చూచాడు. ప్రశ్న గంభీరమైంది. జవాబు కోసం తడుముకో సాగాడు.

"ఈ బండ చూడు ఎంత బావుందో—ఎవరో పరచిన పరుపులాగ. ఎంత మందికి ఆశ్రయం ఇస్తూందో? ఈ బండ మేలుకాదూ మనిషికంటె!"

మరో ప్రశ్న. ఆలోచనలో పడిపోయాడు ప్రకాశం. బండలూ, చెట్లూ మనుషులకంటే నయమా? నిజమా? ఆలోచనలు దొంతరలుగా వస్తున్నాయి.

జవాబుకోసం ఎదిరి చూస్తూ కూర్చుండి గీత - ఆమె మొదలు పెట్టిన బొమ్మ సగంలోనే ఆగిపోయింది.

ఇంతలో కోటయ్య చేరుకున్నాడు. పశువులూ చేరుకున్నాయి.

"అగ్గో! రానెవచ్చినారు! మీరువస్తరనుకోలె - నేను." అన్న కోటయ్య మాట విని అతనిని చూచా రిద్దరూ.

కోటయ్య ఇద్దరినీ చూచాడు. "ఏమొ శాన ఆలోచిస్తున్నరు?" అని అడుగుతూ కూర్చున్నాడు.

ప్రకాశం గీత అడిగిన ప్రశ్నలు కోటయ్యకు చెప్పాడు—అతడు సమాధానం చెప్పగలడనికాదు—ఏమీతోచక చెప్పాడు.

కోటయ్య పెద్దగా నవ్వాడు. "టస్సే ఇంతేనా! పైసలేదు కాదుండి వాటితాన. పైసిచ్చి చూడుండి—చెట్లు గుట్టలుకూడ మనుషులను మాడపెత్తయి" చాల తేలిగ్గా చెప్పాడు కోటయ్య.

ప్రకాశం అదిరిపోయాడు ఆ జవాబుకు. "కోటయ్యా! ఎంత ఆలోచించినవు! ఎంత ఆలోచించినవు!! నువ్వు గొప్పవానివయ్యా!" అని కావిలించుకున్నాడు ప్రకాశం కోటయ్యను.

కోటయ్యకేమీ అర్థంకాలేదు. తానంత గొప్పవిషయం చెప్పాననీ అనుకోలేదు.

సద్దులుతింటూ కోటయ్య చెప్పిందాన్ని గురించి చర్చించుకున్నారు గీతా - ప్రకాశం. అన్ని అనర్థాలకూ కారణం అర్థం అనే విషయం నిర్ణయించుకున్నాడు. డబ్బుతో కూడినపుడు మనిషి రాక్షసుడు కావడానికి అవకాశం ఉందనీ డబ్బు తొలగించినపుడు ఆ రాక్షసుడే మనిషి అయ్యే అవకాశం ఉందనీ నిర్ణయించు కున్నారు.

సద్ది కలిసి తింటున్నారనేగాని వారి చర్చ వినడం లేదు కోటయ్య. అతని దృష్టి సాంతం పశువులమీద ఉంది. సగం తిని ఎంగిలి చేత్తో ఎగిరి గంతేశాడు కోటయ్య.

ఆశ్చర్యంగా చూచా రిద్దరూ.

పల్లావు పారిపోతూంది. చెంగు, చెంగున గంతులువేస్తూ సాగిపోతూంది.

"ఒసే గంగమ్మ-నీ అమ్మ - ఆగవే" - అని దాని వెంట పరిగెత్తుతున్నాడు కోటయ్య.

ఆవు వేగంగా పోతూంది.

కోటయ్య అందుకో లేకపోతున్నాడు.

ఆవు పోతూంది.

కోటయ్య ఉరుకుతున్నాడు. చమటలు కక్కుతున్నాడు. అయినా పరిగెత్తు తున్నాడు,

ఆవు ఉరుకుతూంది.

కోటయ్య తనుస్తున్నాడు. ఆయినా ఆగడం లేదు. నేలమీద పడి ఉన్న కర్రముక్క అందుకున్నాడు. ఉరుకుతున్నాడు.

ఇటునుంచి ప్రకాశం ఉరికాడు - ఆవును పట్టడానికి సాగాడు.

ప్రకాశం ఆవు ముందుకు వచ్చేశాడు. అతని చేతులో కర్రలేదు - అతడు ఆవుకు పరిచితుడుకాదు.

ఆవు కుమ్మింది.

ప్రకాశం చేయి అడ్డం పెట్టాడు.

కొమ్ము గుచ్చుకుంది.

చేతిలోంచి రక్తం సొడసొడ కారింది.

ప్రకాశం పడిపోయాడు.

పరిగెత్తివచ్చిన కోటయ్య ఆవును అవలీలగా లోబరుచుకున్నాడు. మంద వైపు కొట్టాడు. ఆవు రంకెలు వేస్తూ మందవైపు ఉరికింది.

అప్పుడు చూచాడు ప్రకాశాన్ని కోటయ్య.

వెనక్కు తిరిగి గీతను చూచాడు - ఆమె బండమీద నుంచొని ఉంది. "గీతమ్మా! ప్రకాశం పడిపోయిండు. నెత్తురు కార్తాంది." అని కేక పెట్టి కూలపడ్డాడు.

ప్రకాశం చేతిని పట్టుకొని గాయాన్ని అదిమాడు. మట్టితీసి, చేతితో చెరిగి, గాయం మీద పోశాడు. అయినా రక్తం కట్టలేదు. తలగుడ్డ చీరి కట్టుకట్టాడు. రక్తం కట్టింది.

అప్పటికి గీత పరిగెత్తుకొని అక్కడికి చేరుకుంది. నేలమీద పడిన రక్తాన్ని, చేతికివున్న రక్తాన్ని చూచింది.

"అమ్మో రక్తం !" అని ప్రకాశం చేయి పట్టుకొని కూలబడ్డది. కళ్ళల్లో నీరు నిండింది. దుముకటానికి సిద్ధంగా వుంది. గొంతు జీరపోయింది.

"ఏంలేదు, కాస్త దెబ్బ తగిలింది. అంతే" అని నవ్వాడు ప్రకాశం.

ప్రకాశం నవ్వు చూచి గీత నవ్వింది. ఆ నవ్వుకు రెండు కన్నీటి బిందువులు చెంపలమీద రాలాయి.

"ఇగలేవుండి. ఇంటికిపోండి. మంగమ్మత్త నన్ను తిడ్తది" అని మందవైపు చూచాడు కోటయ్య.

"వెళ్ళమంటావా? ఆడుకుందామని వచ్చాం........" మాట మింగేసింది గీత.

"ఇయ్యాల్టికి పోండి. మళ్ళ రేపు రాండి. మంగమ్మత్త ఏమన్న మందు కడ్తదేమో!" అన్నాడు కోటయ్య.

ప్రకాశం లేచాడు. గీత అతనిని పట్టుకుంది. ఇద్దరూ ఇంటివైపు సాగిపోయారు. వారు సాగిపోతుంటే చూస్తూ నుంచున్నాడు కోటయ్య.

వారిని చూస్తుంటే ముచ్చటగా ఉంది కోటయ్యకు.

ఆ రాత్రికి భోజనాలయి అంతా పడుకున్నారు. ఇంకా నిద్దర్లు పోలేదు. అప్పుడే వచ్చాడు కోటయ్య యాదగిరి ఇంటో పని ముగించుకొని.

"అన్నం తినకుంటే అట్ల ఉరికితివి?" అడిగాడు ప్రకాశం లేచి కూర్చొని.

దీపంబుడ్డి వెలుగుకంటే పొగ ఎక్కువ చిమ్ముతూంది.

"దొంగగొడ్డు. అది పోతే దొర పానం తీస్తడు."

"దొర ఎవరు?"

"యాదగిరి"

"వాడు దొ రెట్లు?"

"ఎట్లేంది? కొలువుకుంచుకున్నోడు దొర. కొలువు కున్నోడు గులాబోడు."

"గొడుపోతే దొరేం చేస్తడు."

"తోళ్ళొలుస్తడు."

"ఎందుకు?"

"కాసెటోనిదేగదనుండి జిమ్మేదారి. కాసెటోడు మంచోడైతె గొడ్డు దొంగ దెట్లయితది అంటడు దొర."

"అట్లనా?" అన్నాడు ప్రకాశం. ఏదో ఆలోచనలో పడిపోయాడు.

పిచ్చమ్మ దీపంబుడ్డి తీసికెళ్ళింది. కోటయ్య ఆమెను అనుసరించాడు. అన్నం తినడానికి వెళ్ళాడు.

ప్రకాశం ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

గీత సైతం ఆలోచనలో మునిగి ఉన్నట్లు కనిపిస్తూంది.

మంగమ్మకు నిద్రపట్టున్నట్లులేదు. పొర్లుతూంది.

క్షణాలు, నిముషాలు జారిపోతున్న జాడ స్పష్టంగా వినిపిస్తూంది. కనిపిస్తూంది.

గుండెల చప్పుళ్ళు వినిపించేట్లుంది.

ఏదో అయోమయంగా ఉంది—చిక్కిరిబిక్కిరిగా ఉంది.

ఒక్క ఉల్క రాలింది.

చింతచెట్టుమీది గబ్బిలాలు రెక్కలు చాచుకొని లేచాయి.

"అమ్మా!" ప్రకాశం మాటలు నిశ్శబ్దాన్ని చీల్చుకొని వచ్చాయి.

"ఏం నాయనా?" పడుకొనే అడిగింది మంగమ్మ.

"అమ్మా! గొడ్డు దొంగదైతే కాసేవాని బాధ్యతట—నిజమేనా?" లేచి కూర్చుని అడిగాడు ప్రకాశం.

మంగమ్మ గుండె దడదడలాడింది. ఈ ప్రశ్న మళ్ళీ ఎక్కడికి దారి తీస్తుందో అర్థం కాలేదు. లేచి కూర్చుంది. మౌనంగా ఆలోచించ సాగింది.

గీత కూడా లేచి కూర్చుంది-ఆ చర్చ వినాలని ఆమె ఉబలాటం.

మల్లియ్యకూడా ముసుగులో కదిలాడు.

భోజనం ముగించి మూతి తుడుచుకుంటూ కోటయ్య ప్రవేశించాడు.

దీపం బుడ్డితెచ్చిపెట్టి పిచ్చమ్మ కూర్చుంది.

"పలికవేమమ్మా!"ప్రకాశం మళ్ళీ అడిగాడు.

"అవున్నాయనా. అది నిజమే. కాసేవాడు మంచివాడు అవుతే గొడ్డు దొంగదెట్లు అవుతుంది?"

"ప్రశ్నకు ప్రశ్న సమాధాన మవుతుందా అమ్మా"

మంగమ్మ మాట్లాడలేదు.

"అయితే గొడ్డు దొంగది కావడానికి కాపరిది బాధ్యత అంటవు అవునా"

"అంతే నాయనా" ఆలస్యంగా సమాధానం ఇచ్చింది మంగమ్మ.

"దేశానికి కాపరి ప్రభుత్వం కదమ్మా"

"అవు. నిజం" ఈతడవ సమాధానం మల్లియ్యనుంచి వచ్చింది. అతడూ లేచి కూర్చున్నాడు.

"దేశంలో దొంగలుంటె బాధ్యత ప్రభుత్వానిది కాదా?"

ప్రశ్న పిడుగులా రాలింది. మంగమ్మ గుండె జల్లుమంది.

"బాగ చెప్పినవు ప్రకాశం. శాన బాగ చెప్పినవు" అన్న మల్లియ్య "అయితే ఏం చేయాల్నంటవ్?" అడిగాడు.

"గొడ్డు దొంగదయినప్పుడు కాపరిని శిక్షించినట్లె మనుషులు దొంగలైతే ప్రభుత్వాన్ని శిక్షించాలె"

మల్లియ్యకు అంతుబట్టలేదు. గుడ్లు తేలవేసి ప్రకాశాన్ని చూడసాగాడు.

"ప్రభుత్వాన్ని ఎవరు శిక్షించాలె?" ఉబుసుపోకకు అడుగుతున్నాననీ తెలిసీ అడిగింది మంగమ్మ.

"ప్రజలు - ప్రజాశక్తి" సమాధానం గీతనుండి వచ్చింది.

అది విని నివ్వెరపోయింది మంగమ్మ.

"విప్లవం వర్ధిల్లాలి" రెండు కంఠాలు మ్రోగాయి—రెండు పిడికిళ్ళు లేచాయి.

అంతా మట్టిబొమ్మల్లా విన్నారు-చూచారు.

ఒకనాడు మర్రికింద-పసుపుబండమీద కూర్చుని ఉన్నాడు ప్రకాశం-పొద్దు పోక అటువచ్చాడతను. సాయంకాలపు చల్లని గాలికని వచ్చాడతను. కోటయ్య పశువులను కాస్తూ దూరంగా ఉన్నాడు. ఏదో ఆలోచిస్తూ మోదుగాకు ఈనెలు తీస్తున్నాడు ప్రకాశం.

"దండం దొరా!" అనే మాట విని అటుచూచాడు. సైదయ్య కట్టెలమోపుతో కనిపించాడు. బుజాన గొడ్డలి ఉంది. ఎందుకో సైదయ్యను చూడగానే పరశురాముడు గుర్తుకు వచ్చాడు ప్రకాశానికి. ఆ తలపుతోనే అతని ఒడలు జలదరించింది.

పరశురాముడు!

ఆ రాముడు - ఒక్కడు - ఒకేగొడ్డలితో భరతవర్షంలోని దుష్టులందరినీ నరికేశాడు. ఇరవై ఒక్కసారి తిరిగి - గాలించి - అక్షత్రియం చేశాడు. అతడు వీరుడు - కాదు-విప్లవకారుడు అనుకున్నాడు ప్రకాశం.

గొడ్డలి బుజాన ఉన్న సైదయ్యలో పరశురాముణ్ణి చూచాడు ప్రకాశం.

"ఏం సైదయ్యా బాగున్నవా?" అడిగాడు ప్రకాశం.

"ఏం బాగుండి, కూటికిలేక గుడ్డకులేక కట్టెలు కొట్టుకబతుకుతాన్న ఇట్ల"

"రా సైదయ్యా! కాస్సేపు కూచో"

కట్టెలమోపుదించి వచ్చి కూర్చున్నాడు.

"ఎట్లున్నది దొరా ఊరు?"

"నన్ను దొరా అనకు సైదయ్యా! నా పేరు ప్రకాశం"

"ఎట్లాంటముండి. ఎంతైనా పెద్దలు పెద్దలే, పేదలు పేదలే"

"ఈ అంతరాలే మనను చీలదీస్తున్నయి సైదయ్యా! అనాదినుంచీ మీరు పనికిరానివాళ్ళని పేదలకు నేర్పారు. మేం గొప్పవాళ్ళం మా కాళ్ళు పట్టుకోండి - మమ్మల్ని అంటుకోకండి - దూరంగా ఉండండి అన్నారు. ప్రభువుల దర్బారులకు చేరి వారిని మీరు ఇంద్రులనీ, చంద్రులనీ పొగిడి తేరకు వచ్చిన తిండి తిని ప్రభువులు చేస్తున్న దౌర్జన్యాలను, దోపిడినీ బలపరచారు. అటు మేధావులూ ఇటు కండబలం కలవారూ కలిసి సమాజాన్ని కొల్లగొట్టారు. "కర్మను ఒకదాన్ని సృష్టించి మన ముఖాన కొట్టారు. ఇక బతకండి ఇది మీ ఖర్మ అన్నారు. వేల సంవత్సరాలుగా ఈ ఖర్మకు బలియై మనం కరిగి, కాలి కూలిపోయాం. ఇప్పుడిప్పుడే మనం

వాస్తవాన్ని గ్రహిస్తున్నాం. దోపిడీని తెలుసుకుంటున్నాం. దోచుకునే వాళ్ళను పసి కడ్తున్నాం. దోపిడీ అంతం కావాలంటున్నాం. కులాలూ, మతాలూ, హద్దుల్లు, సరిహద్దులు, ఎల్లలు, ప్రాంతాలు, దేశాలూ లేవంటున్నాం. ప్రపంచమంతటా రెండే వర్గాలున్నాయి. ఒకటి దోచుకునే వర్గం - ఒకటి దోచబడే వర్గం. దోచబడేవారు మేల్కొనాలి. తిరగబడాలి. దోచేవాళ్ళను అంతమొందించాలి, అప్పుడు అంతా సమానమే. అందరమూ మనుషులమే. పేదలు, ధనికులు ఉండని సమాజాన్ని నిర్మించాలి. ఏమంటవ్ సైదయ్యా!"

సైదయ్య గుండెలో ఎక్కడో ఒక అగ్గిరవ్వ రగులుకుంది. ఎక్కడో ఆవేశం తలెత్తింది.

"నువ్వన్నదంత నిజమేనుండి - నీకాల్మొక్త - ఎంత బాగచెప్పిన వుండి! పేదోళ్ళ కష్టంతోనే బతుకుతాన్రని ఉన్నోళ్ళు మళ్ళ ఈ గరీబోళ్ళ కలుస్తరనుకుంటాన్రా-వీళ్ళ అమ్మల ... మళ్ళపోయి వాండ్ల కాళ్ళేపట్టుకుంటరున్రని. ఈరబద్రమయ్య ఇట్లనే చెప్పె. మందిని లేవగొట్టె. దొరలను ఎళ్ళగొట్టె. మళ్ళ వచ్చిరి వాళ్ళ అమ్మల........అసలు దొరలు పోయిరి. కొత్తదొరలొచ్చిరి. వాళ్ళ అమ్మల...రామయ్య వచ్చె కాల్చుక తింటాండె. సర్కారేమో వాండ్లదే నంటాండిరి. ఇగెట్ల తిర్గపడ్తమున్రని కాల్మొక్త"

"సైదయ్యా! అగో నీ ముందు గొడ్డలి ఉన్నది చూసినవా!" అని గొడ్డలి అందుకొని అతనికి చూపుతూ అన్నాడు ప్రకాశం. "ఈ గొడ్డలి కట్టెల్ను కొట్టినన్నాళ్ళు వాళ్ళు మనను మోసగిస్తారు. గొడ్డలిని ఇటుతిప్పు. గొడ్డలి అందుకో. ప్రళయరుద్రుని వికా. పరశురామునివలె కదులు. వాళ్ళ మెడలు నరుకు. నడుములు విరుచు. తలలు బద్దలుకొట్టు. రక్తం ప్రవహింపజేయి. అంతే. ఇక వారుండరు. మనమే" -

ఆవేశంతో లేచాడు సైదయ్య. గొడ్డలి లాక్కున్నాడు. "అంతేనుండి. అట్లనే చెయ్యాలె. ఇక కట్టెల్నరక. వాళ్ళతలలే నరుకుత" అని గొడ్డలి పట్టుకొని లేచి నుంచున్నాడు సైదయ్య. సైదయ్య రుద్రునిలా ఉన్నాడు. పరశురామునిలా ఉన్నాడు. విశ్వామిత్రునిలా ఉన్నాడు. సీతారామరాజులా ఉన్నాడు. కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. కణతలు అదురుతున్నాయి.

ప్రకాశమే జడుసుకున్నాడు.

"పొండి నరుకుదాం లంజకొడుకుల్ను. వాళ్ళ అమ్మల......" అని గర్జించాడు.

"సైదయ్యా! శాంతించు. ఇప్పుడే కాదు. అందుకు సిద్ధంగా ఉండు. ఏనాటికైనా మనకు గొడ్డలే గురువు. బందూకే బంధువు ఏమంటావు?"

"అంతేనండి. నరికేయాలె వాళ్ళ అమ్మల - - మాటలతో ఇంటారుండి. నువ్వెప్పుడంటె అప్పుడు - కాల్మొక్త. సైదయ్య తయారుగున్నడను కోరి. పానాలిస్తనుండి

పానాలు - బతికి చేసెడి దేమున్నది?" అని బుజానికి గొడ్డలి తగిలించుకొని కట్టెల మోపు ఎత్తుకొని వెళ్ళిపోయాడు సైదయ్య.

వెనకనుంచి సైదయ్యను చూస్తూ ఉండిపోయాడు ప్రకాశం.

పరశురాముని వీపు చూస్తున్నట్లనిపించిం దతనికి!

పరశురాముడూ కట్టెలు కొట్టాడేమో! అనుకున్నాడు.

* * *

"బూబమ్మ చచ్చిపోయింది," వార్త తెచ్చిన సైదయ్య భోరున ఏడ్చేశాడు.

ఇంకా పూర్తిగా తెల్లవారకముందే పిడుగు పడింది ప్రకాశంమీద. "చచ్చిపోయి నాది?" అన్న ప్రకాశం కన్నులు చెమ్మగిల్లాయి.

గీత ఏడ్చేసింది. మంగమ్మ ఏడ్చినంతపని చేసింది. మల్లయ్య స్థాణువులా నుంచున్నాడు. పిచ్చమ్మ "పాపం!" అని సరిపెట్టుకుంది!

"ఏమైంది బూబమ్మకు?" క్రితం రాత్రి వచ్చిన వీరభద్రం వివరాలడిగాడు.

"పొట్టనపెట్టుకున్నడండి రామయ్య పొట్టనపెట్టుకున్నడు" అని వివరాలు చెప్పాడు సైదయ్య.

"పాపం పోయిందా?" అన్నాడు వీరభద్రం. తన విచారం వ్యక్తపరచాడు.

"మీరిట్లనే చేతులు ముడుచుకొని కూర్చోండి. బూబమ్మలు లక్షలు చస్తారు" ప్రకాశం ఉద్రేకంగా అన్నాడు.

"కాదు. విప్లవం అని గొంతులు చించుకొని అరవండి. బూబమ్మలందరూ బతుకుతారు" వీరభద్రం అన్నాడు.

ప్రకాశం ఏదో అనబోతుండగానే మంగమ్మ అన్నది "పోదాం పాండి అక్కడికి" అని.

ప్రకాశం ఉద్రేకాన్ని మింగేశాడు. బయలుదేరాడు. అంతా బయలుదేరి బూబమ్మ ఇంటికి చేరుకున్నారు. అప్పటికే జనం కూడారు ఇంటిముందు. లోపలికి వెళ్ళి చూస్తే దృశ్యం గుండెలవిసేట్లుంచి. ఈగలు ముసురుతున్నాయి. చింకిబట్టల్లో పడి ఉంది శవం! ప్రాణం ఏ రాత్రి పోయిందో తెలీదు. తెల్లవారి తాకిచూస్తే చల్లగా ఉంది. ఇరుగు పొరుగులొచ్చి చెప్పిందాకా తెలీలేదు

ఆ దృశ్యం చూచింది మంగమ్మ. కన్నీరు ఆగలేదు. కూలబడి భోరుమంది. గీతా, ప్రకాశం స్థాణువుల్లా నుంచున్నారు. మల్లయ్య శవం ముఖాన గుడ్డ కప్పాడు.

వీరభద్రం విచారంగా ఒక మూలకు నుంచున్నాడు. అతని చుట్టూ జనం కూడారు. అంత్యక్రియలను గురించిన ఏర్పాట్లు జరుగుతున్నాయి.

మూడు జాములకుగాని శవం లేవలేదు. అంత్యక్రియల్ను చూడలేక అస్తమించాడు సూర్యుడు. అందరూ మల్లయ్య ఇంటికి చేరుకునేవరకు బావురుమంటూంది ఇల్లు. ఈ ఇంట్లోంచే శవం పోయినట్లుంది వాతావరణం. ఇల్లు బిక్క

టిక్కుమంటూంది. అంతా వచ్చి కూలబడ్డారు. ఎవరూ మాట్లాడలేదు. అంతా మౌనం. గప్‌చుప్. చుప్‌చాప్. ఇల్లు సాంతం మౌనంగా ఏడుస్తున్నట్లుంది.

చీకట్లు కమ్ముకున్నాయి.

ఎంగిలి పడి సదుములు వాల్చారందరూ. వారి ముఖాలమీది విషాదచ్ఛాయలు అప్పుడప్పుడే విడిపోతున్నాయి. గీత దీపంబుడ్డి ముందు కూర్చొని పత్రిక చదువుతూంది. ప్రకాశానికి వార్తలేమీ అర్థం కావడంలేదు. అతని గుండెలో అగ్నిపర్వతాలు పేలుతున్నాయి.

బయటినుంచి కోటయ్య ఏడ్పువినిపించింది. కోటయ్య పెద్దగా ఏడుస్తూ పరిగెత్తుకొని వస్తున్న జాడ వినిపించింది. దిగ్గున లేచి కూర్చున్నాడు ప్రకాశం. ఇంతలోనే లేచి ఎదురుగా పరిగెత్తారు మల్లయ్యా, పిచ్చమ్మా. అంతలోకే వాకిట్లోకి వచ్చేశాడు కోటయ్య. తల్లిని పట్టుకొని భోరున ఏడుస్తూ చెప్పాడు కోటయ్య :

"యాదగిరి కొట్టిండు. దొర జబిరిండు"

అప్పటికి అంతా చుట్టుచేరారు.

"ఎందుకు కొట్టిండు? ఏం చేసినవని కొట్టిండు?" ప్రకాశం ప్రశ్నలు బాణాల్లా దూసుకు వచ్చాయి.

"దొంగావు పారిపోయింది. దొరకలే."

"ఆవు పోతే మనుషుల్ని చంపుతారా? మదం ఎక్కింది. ముక్కల కింద నరకాలె" అని వేడి శ్వాసలు వదల్తూ, పక్కనున్న కర్ర అందుకొని ఉరక సాగాడు ప్రకాశం.

పిచ్చమ్మా, మల్లయ్యా, మంగమ్మా పరిగెత్తి పట్టుకున్నారు ప్రకాశాన్ని.

"ఆవు కోసం మనిషిని చంపుతాడు? వాని అంతు చూస్త" అని పట్టు విడిపించుకోవడానికి గింజుకున్నాడు ప్రకాశం.

గీత రెప్పవాల్చకుండా చూస్తూంది.

కోటయ్య ఏడ్పుమాని వింతగా చూస్తున్నాడు.

"వద్దుబాబూ వద్దు. మనకు శక్తి లేదు. వాళ్ళు నిన్ను చంపినా అడిగే వాండ్లు లేరు. ఇప్పటికిరా" బతిమిలాడు తున్నది మంగమ్మ.

"లేదు. పోత. వాని అంతుచూస్త" అని విడిపించుకొని ఉరుకుతున్నాడు ప్రకాశం.

"ప్రకాశం!" మంగమ్మ కేక పెట్టింది. పగ్గం పట్టి లాగినట్టు వెనక్కు తిరిగి చూచాడు ప్రకాశం.

తల్లి పిలుపులో ఆ శక్తి ఉంది.

"ఒక్క అడుగు ముందుకు వేస్తే ఇదిగో తలపగల కొట్టుకుంటున్నా" అని బండ లేపింది మంగమ్మ.

ప్రకాశం చూచాడు.

మంగమ్మ చేతిలో బండ ఉంది.

తల్లి అన్నంత పని చేయగలదే - అది తెలుసు అతనికి.

"అమ్మా" అని తల్లికి ఎదురుగా పరిగెత్తుకొని వచ్చాడు. బండ తల్లిచేతు లోంచి లాగిపారేశాడు.

"నాయనా ప్రకాశం!" అని కొడుకును కౌగిలించుకొని భోరుమన్నది తల్లి.

"అమ్మా! అమ్మా!" అని తల్లి ఒడిలో ఒదిగిపోయి ఏడ్చాడు ప్రకాశం.

ఇద్దరూ ఏడ్చారు.

అందరూ ఏడ్చారు.

* * *

"దొర్సాని వస్తోందట, దేవతై వస్తోందట! మొక్కులు తీరుస్తదట. మన కోసం వస్తోందట."

గ్రామంలో ఎక్కడ విన్నా అదే వినిపిస్తోంది. అందరూ ఆ విషయమే చెప్పు కుంటున్నారు. రానున్న దేవికోసం ఎదురుచూస్తున్నారు. తమ కోర్కెల జాబితా సిద్ధం చేసుకుంటున్నారు.

ఆ వార్త గాలివార్త మాత్రం కాదు. వార్త తెచ్చింది యాదగిరి. అందించింది రామయ్య - శేషయ్య అంతేకాదు అందుకు తగిన ఏర్పాట్లు జరుగుతున్నాయి ఊళ్ళో. రామయ్య పట్నం నుంచి దిగలేదుగాని శేషయ్య వచ్చేశాడు. శేషయ్యా, యాదగిరి భారీ ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నారు. గడీసాంతం బాగుచేయించి సున్నాలు వేయించారు. సుమతి స్వయంగా ఆ విషయంలో శ్రద్ధ తీసుకుంటూంది. గడీ నిండా ముగ్గులు ఆమె దిద్దింది. వంటల కోసం వెనక పందిళ్ళు వేయించారు. సామగ్రి దగ్గర ఉండి శుభ్రం చేయిస్తూంది.

గడీ ముందు లంకంత పందిరి వేయించారు. కొత్తతాటాకు బండలో దిగు తూంది. పందిళ్ళకు తాటాకు వేస్తున్నారు జనం. కుర్చీలు, బల్లలతో లారీ పట్నం నుంచి వచ్చేసింది. మామిడితోరణాలకూ, స్వాగతపత్రాలకూ ఏర్పాట్లు చేయిస్తున్నారు శేషయ్యా, యాదగిరి.

ఊరంతా సతమతం అవుతూంది. ఉక్కిరి బిక్కిరి అవుతూంది. ఏర్పాట్లు శుభకార్యానికివలే ఉన్నాయి. కాబట్టి ఊరు పచ్చపచ్చగా కనిపిస్తూంది. ఉక్కిరి బిక్కిరి అవుతున్నా ఏదో ఉత్సాహం కనిపిస్తూంది. ఊరికి భక్తి ఒలిసింది. సుమతి సరేసరి. విధివిరామం లేకుండా పనులు చేస్తూంది. గడికీ ఇంటికీ ఆసుగొట్టంలా తిరుగుతూంది. నిద్రాహారాల్లేవు. అందుకు కారణం లేకపోలేదు. ఆమెకూ కొన్ని కొరతలున్నాయి - కొన్ని కోరిక లున్నాయి. వాటిలో మొదటిది గాంధీ బుద్ధిమం తుడు కావడం. రెండవది రామయ్య మంత్రి కాకుండడం. మంత్రి అవుతే రామయ్య తన ఇంటి గడపతొక్కడని ఆమెజంకు. అయితే ఏర్పాట్లలో సతమతం అవుతున్న

సుమతి, గాంధీ ఇంటికే రావడంలేదనే విషయం గమనించనేలేదు. రామయ్యా పట్నంలోనే మకాం పెట్టాడు. పల్లెను సుమారు మరచినట్లే!

సుమతి ఆశలన్నీ సరస్వతిమీద ఉన్నాయి.

సరస్వతి దేవత అయింది.

సరస్వతి "అంబ" అయింది - "అమ్మ" అయింది - భక్తుల పాలిటి "భగవతి" అయింది.

సరస్వతి అన్నపానీయాలు మానేసింది. గాలి సైతం పూరని సమాధిలో వారం ఉంటుంది. ఆమె దర్శనం వారానికి ఒక్కరోజే. ఆ రోజే ఆమె పండ్లు తింటుంది. పాలు త్రాగుతుంది. ఆనాటి దర్శనానికే విరగబడుతున్నారు జనం. ఆమె కాళ్ళు కడిగిన నీళ్ళు అన్ని రోగాలకూ ఔషధం అయిపోయింది. ఆమె దర్శనం అన్ని ప్రాణులకూ అమృతం అయింది. ఆమె పెదవి కదపదు. అయినా చిరునవ్వు నవ్వుతుంది. అదే పదివేలు భక్తులకు! ఆమె ఆశ్రమంనుంచి కదలదు. అయినా ఆమె ప్రభావం అమెరికా దాకా వ్యాపించింది. అమెరికానుండి భక్తులు వచ్చారు. ఆమెను అక్కడికి రావలసిందని ప్రార్థించారు. తల్లి చిరునవ్వు నవ్వింది. అంతేకాదు-ఇంగ్లీషులో మాట్లాడింది - అంగీకరించింది-అమెరికా భక్తులు మురిసి పోయారు. తల్లి అమెరికా ప్రయాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి - భారత సంస్కృతి ఇహ అమెరికాలో వెలుస్తుందని మురిసిపోయారు భారతీయ సంస్కృతీ రక్షకులు. అప్పుడుగాని తెలియలేదు అమ్మవిలువ రామయ్యకు. అతని ద్వారా తెలి సింది శేషయ్యకు. శేషయ్యా - రామయ్యా శుక్రవారంనాడు ఆశ్రమానికి వెళ్ళారు- కారులో. అమ్మను ప్రార్థించారు. తమ గ్రామం పునీతం చేయవలసిందని అర్థించారు. అమ్మ అంగీకరించింది. అక్కడికి వస్తానంది. అందుకు ఆ ఏర్పాట్లు ఊళ్ళో.

రామయ్యకు ఉన్న కోరిక తాను మంత్రికావడం!

అయితే సరస్వతిదేవి ఎలా అయింది? తల్లి ఎలా అయింది? ఆమెకు అన్ని మహిమలు ఎలా వచ్చాయి? అంటే:-

సరస్వతి సుందరరావుగారి మరణవార్త విన్నదా! ప్రాణంలేని ప్రతిమలా పరి గెత్తింది ఆశ్రమానికి. అక్కడ సుందరరావుగారి భౌతికకాయాన్ని చూచింది. అక్కడే కూలబడ్డది. అలా చూస్తూ ఉండిపోయింది కొంతసేపు. ప్రతిమలా కూర్చుంది. పాషాణంలా కూర్చుంది. ఆమె చూస్తున్నదో లేదో తెలీదు. కళ్ళుమాత్రం తెరిచి ఉన్నాయి. రెప్పవాల్చడంలేదు. ఆమె ఎటుచూస్తుందో తెలియదు. ఏం చూస్తుందో తెలియదు. ఆశ్రమవాసులకే ఆశ్చర్యం కలిగింది! ఆత్మవలోకనం చేసుకుంటూంది అన్నారు ఒకరు. కాదు-ఆమెకు స్వామి కనిపిస్తున్నారు - ఏదో సందేశం వినిపిస్తు న్నారు - అనుకున్నారొకరు. అదీకాదు ఆమె సత్యాన్ని అవలోకిస్తూంది. సత్య స్వరూపాన్ని దర్శిస్తుంది అన్నారొకరు. సుందరరావుగారి భౌతికకాయంకంటే సరస్వతీ సమాధియే అనేకమందిని ఆకర్షించింది. అలా చూస్తూ ఉండిపోయిన సరస్వతి

అమాంతంగా కళ్ళుమూసుకుంది. అంతే. మరి కళ్ళు తెరవలేదు—వారందాకా. అలా కళ్ళుమూసుకుని కూర్చున్న సరస్వతి చలించని దీపశిఖలా కనిపించింది. మూర్తీభవించిన ధ్యానంలా కనిపించింది. కాంతి స్వరూపంలా కనిపించింది.

ఆశ్రమవాసులు ఆమెను కదిపారు. ఆమె కదల్లేదు. లేపారు-ఆమె లేవలేదు. ఆమె ఊర్ధ్వలోకాల్లో విహరిస్తూంది అనుకున్నారు. ప్రాణత్యాగం చేయడానికి యోగం అవలంబించినట్లుందనుకున్నారు కొందరు. తరవాత ఎవరూ ఆమెను కదిలించలేదు. కదిలించింది సుందరరావుగారి భౌతికకాయాన్ని.

పట్నం కదిలివచ్చింది. బాజాలు మ్రోగలేదు. కాని వేదఘోషలు వినిపించాయి. శవ యాత్ర లక్షల మందితో సాగింది. మంత్రులు, మహానుభావులు, మహాపురుషులుకూడా వచ్చారు. స్వామి దేహం చందనపు చితిలో చిటపుటమని కాలి కూలింది.

స్వామిని అగ్నిదేవునికి అర్పించి తిరిగి వచ్చారు ఆశ్రమవాసులు. అప్పటికి సాయంకాలం అయింది. అయినా సరస్వతి చలించలేదు. విగ్రహంలా కూర్చుని ఉంది. అంతే. వారు ఆశ్చర్యపడ్డారు. స్వామి సరస్వతిని ఆవేశించారనుకున్నారు.

వారు అనుకోక ముందే పట్నం అనుకుంది. దేవి అవతరించిందనుకుంది. ఉన్నవీ లేనివీ అభూతకల్పనలు అనేకం ప్రచారం అయినాయి. ఆమె అగ్గిలో నడుస్తుండగా చూచామని కొందరు, ఆకాశంనుండి అవతరిస్తుండగా చూచామని కొందరూ చెప్పుకున్నారు. పత్రికలవాళ్ళకు చేతినిండా పనిదొరికింది. సుందరరావుగారి అంత్యక్రియలకంటే ఈ వార్తలకు అధిక ప్రాధాన్యత ఇచ్చి ప్రకటించారు. సరస్వతి బొమ్మలు కూడా పెద్దపెద్దవి పత్రికల్లో పడ్డాయి.

జనం వేలం వెర్రిగా ఆశ్రమానికి వస్తున్నారు. ఆశ్రమానికి ఒక జాతర సాగింది. పోలీసులు జనాన్ని కంట్రోల్ చేయాల్సి వచ్చింది. సరస్వతి చుట్టూ ఒక పోలీసు వలయం ఏర్పడింది. సుందరరావుగారు ఉండగా ఆశ్రమానికి ఇంత జనం ఎన్నడూ రాలేదు! ఆశ్రమపు పలుకుబడి దూర దూరాలకు వ్యాపించింది—వ్యాపింపచేశాయి పత్రికలు. వస్తున్న జనంలో కొందరు పండ్లు తెస్తున్నారు. కొందరు పూలు తెస్తున్నారు. కొందరు కానుకలు సమర్పిస్తున్నారు. అంతా ఆమెకు భక్తితో మొక్కిపోతున్నారు.

ఆశ్రమం కళకళ లాడసాగింది.

మళ్ళీ శుక్రవారం నాడు - సరిగ్గా వారానికి-సరస్వతి కళ్ళు తెరిచింది. కళ్ళు తెరచి ఒక్కసారి తేరిపార చూచింది. చుట్టూ చూచింది. కలయ చూచింది.

చుట్టూ జనం!

ఆమె కేమీ అర్థం కాలేదు.

జనం ఆమె చూపుల్ని చూచారు.

మంత్రముగ్ధంగా చేతులు జోడించి చూడసాగారు.

ఆమె చూపుల్లో అలసటలేదు. అవి డస్సిలేవు. బలహీనంగాలేవు. నీరసంగా లేవు. ఆహారం లేనట్లులేవు. ఆ చూపులు విలక్షణంగా ఉన్నాయి. ప్రసన్నంగా ఉన్నాయి. స్వచ్ఛంగా ఉన్నాయి. సామాన్యంగా లేవు—సాధారణంగాలేవు.

ఆమె మాట్లాడలేదు.

ఏం చేస్తుందా? అని జనం వింతగా చూడసాగింది.

ఒకసారి ఆశ్రమాన్నంతా చూచింది.

ఆశ్రమం రిక్తంగా కనిపించింది ఆమెకు. బోసిగా కనిపించింది—విషాదంగా కనిపించింది!

"స్వామి ఏరి?" పక్కనున్న ఆశ్రమవాసి నడిగింది.

జనం ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

ఆశ్రమవాసి జవాబు చెప్పలేదు.

అయినా ఆమె గ్రహించినట్లుంది.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి

తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ" అనే శ్లోకం చదివి కిందకు చూచింది. పండ్లు కనిపించాయి.

ఒకటి తీసుకుంది. తిన్నది.

రెండవది తీసుకుంది. తిన్నది.

మూడు, నాలుగు, అయిదు, గబగబా తినేసింది

ఆమెకు మంచినీళ్ళందాయి - పాలందాయి. తాగింది. కొంగుతో మూతి తుడుచుకుంది లేచింది. స్వామి గదివైపు నడిచింది. సుందరరావుగారి గదిలోకి వెళ్ళింది. తలుపేసుకుంది.

జనమంతా వింతగా చూచారు. వారికి ఆమె ఏమన్నదీ? ఎందుకు పోయింది అర్థం కాలేదు. ఆశ్రమవాసులను అడిగారు. వారు చెప్పారు.

"దేహం నశించేది. ఆత్మ శాశ్వతమైంది. మనిషి పాతపడిన బట్టల్ను వదిలేస్తాడు. కొత్తవానిని వేసుకుంటాడు, అలాగే ఆత్మకూడా. పాత శరీరాల్ను వదిలేస్తుంది. కొత్తవానిని గ్రహిస్తుంది."

"అంటే స్వామి ఆత్మ దేవి శరీరంలో ప్రవేశించినట్లేనా?" ఒకడు అడిగాడు.

"ఆమె అలా అని చెప్పలేదు." ఆశ్రమవాసి అన్నాడు.

"అమ్మ చెప్పుకుంటుందా? ఆ శ్లోకానికి అర్థం అదే" అన్నాడు అడిగినవాడు.

ఆనాటినుంచి "అమ్మ" అయిపోయింది సరస్వతి.

ఆ అడిగినవాడికి మరుసటిరోజు లక్షవచ్చింది లాటరీలో. అతడు సమర్పించిన పండే ముందు అందుకుందన్నాడు అతను. అందుకే తనకు లక్ష వచ్చిందన్నాడు. అదొక పుకారు బయల్దేరింది. అంతటితో అమ్మ మాహాత్మ్యం పెరిగింది. లాటరీ గెల్చిన వాడు ఆశ్రమానికి పాతికవేలు ఇచ్చాడు! డబ్బుకు దూరంగా ఉండాలని ఏర్పడ్డ

ఆశ్రమం అది. ఇప్పుడు డబ్బు విపరీతంగా అందుతుంటూంది. డబ్బుతోనే నడుస్తూంది.

పాతికవేలు ఇచ్చినవాడు ఆశ్రమం ముందు పడిగాపులు కాశాడు అమ్మ దర్శనం కోసం. అయినా దర్శనం కాలేదు. అమ్మ గది వదిలిరాలేదు. జనం తగ్గలేదు. గది గుమ్మానికే దండాలు పెట్టి పోతున్నారు. కానుకలు అద్దెలుగా పడుతున్నాయి. అయినా పరమభక్తుడు - పాతికవేలవాడు కదల్లేదు.

మళ్ళీ శుక్రవారం తెల్లవారుజామున అమ్మ కళ్ళు తెరిచింది. గది తలుపు తెరిచింది. బయటికి వచ్చింది. పరమ భక్తుడు అక్కడే ఉన్నాడు. అమ్మను చూశాడు. అమాంతంగా అమ్మకాళ్ళమీద పడ్డాడు. సాగిల పడి మొక్కాడు. ఇంతలో ఆశ్రమవాసులు చూడారు.

అమ్మకేమీ అర్థం కాలేదు.

వింతగా చూచింది కాళ్ళమీద పడ్డవాణ్ణి.

"ఎందుకలా కాళ్ళమీద పడ్డావు?" అడిగింది అమ్మ.

"నువ్వు అమ్మవు. తల్లివి. దేవివి. ఆదిశక్తివి........" దండకం చదివాడు పరమభక్తుడు.

"నేనేమీ కాను- నా కాళ్ళు వదులు"

"అమ్మ, అమ్మా. అట్లనకు. అనకు అట్లనకు. నువ్వు చెప్పుకోవు తల్లీ చెప్పుకోవు. నువ్వు దేవివే. పరాశక్తివే. నాకు లక్ష ఇప్పించావు. నీ దగ్గర మాహాత్మ్యం ఉంది. నువ్వు రక్షించగలవు. శరణు తల్లీ శరణు"

అప్పటికీ అర్థం కాలేదు అమ్మకు. ఆశ్రమవాసుల్ని చూచింది. వారూ ఆమెను చూచినట్లే చూచారు. ఆ తరువాత ఆమె ఆసక్తి కనబరచలేదు.

"స్వామి సమాధి ఎక్కడ?" అని అడుగు ముందుకు వేసింది తల్లి. అంతే సాగిపోతూనే ఉంది. ప. భక్తుడు ఎదురువచ్చి "కాలినడకన వెళ్తావా తల్లీ! ఆగు ఒక్క క్షణం ఆగు. కారు తెస్తా. కాళ్ళు కందిపోతాయి తల్లీ" అన్నాడు.

ఆమె వినిపించుకోలేదు.

సాగిపోతూనే ఉంది.

ఆమె వేగాన్ని ఎవరూ అందుకోలేకపోతున్నారు.

ఆశ్రమవాసులు వెంట ఉరుకుతున్నారు.

చూచిన జనం వారిని అనుసరించారు.

ప. భక్తుడు పట్నంలోకి ఉరికాడు కారుకోసం.

సరస్వతి సాగిపోతూనే ఉంది. ఆమె ముఖాన అలసటలేదు. బడలికలేదు. కళకళ లాడుతూంది ముఖం. కాలి వేగం హెచ్చుతూంది. విరబోసిన వెంట్రుకల్తో వెళ్తూంది ఆమె.

జనం ఆమె వెంట ఉరికి వస్తున్నారు.

ఆమె శ్మశానం చేరింది.

స్వామిని దహనం చేసిన చోటు గుర్తించింది.

అక్కడ కూలబడ్డది - విరబోసిన వెంట్రుకలు - మాసిన చీర కారులో కూర్చుంది.

అమ్మ కాటిలో కూర్చుంది!

అదీ వింతగానే కనిపించింది జనానికి.

కాటిమట్టి తలకు రాచుకుంది "అమ్మ"

కాస్సేపు మౌనంగా కాటిలోనే కూర్చుంది సరస్వతి.

అక్కడే ఉండిపోతుందేమోనని బుగులుపట్టుకుంది జనానికి!

ఉండలేదు "అమ్మ" అక్కడ లేచింది. ఆశ్రమం వైపు తిరిగింది.

ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు లేవు.

ఏడ్చిన జాడలు కనిపించలేదు.

ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు జనానికి.

ఆమె సాగిపోతూంది ఆశ్రమంవైపు.

ప. భక్తుడు కారు తెచ్చాడు. అమ్మముందు నిలిపాడు. ఎక్కమన్నాడు-కాదు - ప్రార్థించాడు.

అమ్మ ఎక్కలేదు.

కాలినడకనే సాగిపోయింది.

ఆశ్రమం చేరుకుంది.

అది మరింత మాహాత్మ్యాన్ని అంటకట్టింది అమ్మకు.

సరస్వతి ఆశ్రమం చేరింది. స్నానం చేస్తానంది. ఏర్పాట్లు జరిగాయి. స్నానం చేసింది. శుభ్రమైన బట్టలు కట్టుకుంది. ఆమెకు పండ్లు అందించారు కొందరు. ఆరగించింది. పాలు అందాయి. సేవించింది. అప్పుడు ఆమెలో అలసట జాడలు కనిపించాయి. మంచంమీద వాలింది. నిద్రపోయింది. నిద్రంటే వళ్ళు తెలియకుండా నిద్రపోయింది.

అమ్మ గదినుంచి బయటకి వచ్చిందనే వార్త ఉదయమే నగరంలో నగారా మీదిలా మ్రోగింది. జనం గుంపులు గుంపులుగా ఆశ్రమానికి వస్తున్నారు. కార్లు, సైకిళ్ళు, రిక్షాలు, ఆటోలు వగైరా వాహనాలు ఆశ్రమపు బయలు ప్రాంతాన్ని ఆక్రమించాయి. జనం తండోప తండాలుగా అమ్మదర్శనం కోసం పడిగాపులు కాస్తున్నారు. మధ్యాహ్నంనుంచి ఏటికి వరదల్లా ఎక్కువ అవుతూంది జనం.

"అమ్మ ధ్యానంలో ఉన్నారు" ఆశ్రమంనుంచి వార్త.

జనంలో కలకలం తగ్గింది. అమ్మ ధ్యానానికి అంతరాయం కలిగించదలచ లేదు. నిశ్శబ్దంగా ఆశ్రమం బయట గుంపులు తీర్చి కూర్చున్నారు. అమ్మ మాహాత్మ్యాన్ని గురించిన కబుర్లు - చిలవలు, పలవలుగా చెప్పుకుంటున్నారు.

సుమారు సాయంకాలానికి సరస్వతి మేలుకుంది. ఆ వార్త బయట అగ్గిలా పాకింది. జనంలో ఓపిక చచ్చి ఆశ్రమంలోకి చొచ్చుకొని వస్తున్నారు - వచ్చారు-రానున్నారు.

సరస్వతి మేలుకుంది. ముఖం కడుక్కుంది. తల దువ్వలేదు - విరబోసే ఉంది. జనపు కలకలం వింది.

"ఏమి టది?" అడిగింది.

"జనం దర్శనం కోసం తపిస్తున్నారు."

"ఎవరి దర్శనం?"

"మీ దర్శనం చేసుకోవాలనే . ."

"నా దర్శనం ఎందుకూ? నే నేమన్నా . ."

"అలా అనకండి. ప్రజలకు భక్తి ఏర్పడింది. ఏదో శక్తి ఉంది మీలో. అది మీకు తెలియదు. వారికి దర్శనం ఇవ్వాలి. కాదన వద్దు"

"అయితే నేనేం చేయాలి?"

"ఏం లేదు. నా వెంట రండి. అక్కడ కూర్చోండి. అంతే"

"అంతేనా పదండి-"

సరస్వతి వచ్చింది.

జనంలో కలకలం - నమస్కారాలు - దండాలు.

సరస్వతి పుష్పవేదికమీద కూర్చుంది.

జనాన్ని చూచింది.

ఆశీర్వదించడానికి అన్నట్లు చేయి ఎత్తింది.

అది అభయ హస్తంలా నిలిచింది.

కెమెరాలు క్లిక్కు., క్లిక్కు మన్నాయి.

అమ్మ ముఖంమీద మెరపులు మెరిశాయి.

అమ్మ దర్శనం అయింది అందరికీ - పూలు - పండ్లు - కుప్పలు - తెప్పలుగా పడ్డాయి.

దర్శనం అయ్యింది. చాలా. అంతటితో ఊరుకోవాలా? జనానికి తృప్తి కలుగ లేదు. ఇంకేదో కావాలి? ఏం కావాలి? ఏం చేయాలి? అదే అర్థంకాలేదు ఎవరికీ! ప. భక్తుడు ముందుకు వచ్చాడు. వెండి పళ్ళెంలో అమ్మపాదాలు పెట్టించాడు. వెండి. చెంబులోని నీటితో కడిగాడు. శ్రీపాద తీర్థం అందరికి ఉద్ధరణితో అందించాడు. అంతే అంతటితో జనంలో సంతృప్తి కనిపించింది.

అమ్మ లేచినుంచుంది.

చాలమంది సాగిలపడి మొక్కారు.

ఆమె తనగదిలోకి వెళ్ళిపోయింది.

అంతటితో శతంగం ముగిసింది. "మళ్ళీ వారంపాటు అన్నపానీయాలు అందుకోదు అమ్మ. మళ్ళీ శుక్రవారమే చూడాలి. భక్తులంతా శాంతంగా వెళ్ళిపోవాల్సింది" అని – ప. భక్తుడు చేతులు జోడించి ప్రార్థించాడు. జనం నిర్గమించారు.

ప. భక్తుడు ఆశ్రమానికి ధర్మకర్త అయినాడు.

పరమభక్తుడు ఎవడోకాదు మనశేషయ్యే! రాజకీయ వ్యాపారం నుంచి భక్తి వర్తకానికి బదిలీ అయినాడు. పరమ భక్తాగ్రేసరుడైనాడు!!

తెల్లవారి పత్రికల్లో సరస్వతి బొమ్మలు వచ్చాయి. అచ్చం దేవిలాగే ఉందామె. దేవియే అవతరించిందనుకున్నారు ప్రజలు.

ఆ తరవాత మరో పుకారు పుట్టింది:-

"సరస్వతి కాళ్ళు కడిగిన నీరు తాగి, ఒక కుష్ఠురోగి బాగుపడ్డాడు. అతడు సంపూర్ణ ఆరోగ్యవంతుడైనాడు.

దాంతో జనం ఆశ్రమంమీద విరుచుకు పడ్డారు.

ప్రతి శుక్రవారం ఆ కార్యక్రమం మామూలై పోయింది.

శుక్రవారం నగరానికే కాదు - దేశానికి ప్రధాన వారం చేసింది సరస్వతి.

శుక్రవారం నాడు ఆశ్రమం నగరంగా మారుతుంది. అక్కడ దుకాణాలు వెలిశాయి. వ్యాపారం ముమ్మరంగా సాగుతూంది. హోటళ్ళు తెరిచారు. వర్తకం బాగా సాగుతూంది. బండ్లకు గిరాకీ హెచ్చింది. పూలూ, పండ్లూ ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. చాటుగా ఒక బ్రాందీ దుకాణం కూడా వెలిసిందని చెప్పుకున్నారు కొందరు.

ప్రభుత్వం సైతం రంగంలో దూకింది. పోలీసులు మందలు మందలుగా దిగారు. భక్తులను"క్యూ"లో నుంచో పెట్టి దర్శనం చేయిస్తున్నారు. "క్యూ" కిలోమీటర్ల కొద్దీ పెరుగుతూంది. జనాన్ని అదుపులో పెట్టడానికి ఒకసారి మెల్లగా లాఠీచార్జీ కూడా చేయాల్సి వచ్చింది. కాల్పుల వరకూ విషమించనందున అమ్మకు దండంపెట్టుకున్నాడు పోలీసు కమీషనర్ - పేరెందుకు లెండి!

ఇంతలో ఒక వింత:–

సుందరరావుగారు పోయిన్నాడు పడిపోయాడు బలరామయ్య - మంత్రి. మంత్రిగారు పడిపోగా మహామహావైద్యులు – డాక్టర్లు – వచ్చారు. బలరామయ్యను పెద్ద ఆస్పత్రికి చేర్చారు. ఎయిర్‌కూల్డుగది ఇచ్చారు. పరీక్షలమీద పరీక్షలు సాగించారు. విశేష నిపుణులు వచ్చారు. పదిమంది డాక్టర్లు కలిసి ఒక నిర్ణయానికి వచ్చారు - అది పెరాలిసిస్ అని. గుండెరోగాల విశేషజ్ఞుడు గుండెజబ్బుందన్నాడు. రక్తపుపోటు స్పెషలిస్టు బ్లడ్‌ప్రెషర్ చాల ఎక్కువగా ఉందన్నాడు. మధుమేహాల మహావైద్యుడు డయబెటిక్స్ ఉందన్నాడు. విటమిన్ల డాక్టరు విటమిన్లలోపం అన్నాడు. అందరూ కలిసి ఒక కాన్ఫరెన్సు చేశారు - ఆయన ఎలా బతుకుతున్నాడో తమకు అర్థం కావడంలేదని తీర్మానించారు.

ఎవరికీ అర్థం కాలేదు. అయినా సూదులు గుచ్చారు. బిళ్ళలు మింగించారు. మందులు తాగించారు. అయినా బలరామయ్యకు ఉపశాంతిలేదు. చెప్పరానంత అశాం. తితో బాధపడుతున్నారాయన. మంత్రిగా ఆయన అధికారం దాని మీద సాగలేదు. డాక్టర్లమీదా, నర్సులమీదా సాగించారు అధికారం. వారు చాటుగా విసుక్కున్నారు, ముందు చిరునవ్వులు నవ్వారు. చిరునవ్వులతో రోగం తగ్గలేదు.

బలరామయ్యకు అల్లోపతీమీద విశ్వాసం తగ్గింది. ఆయుర్వేద వైద్యులు ప్రతిజ్ఞలు చేశారు. బలరామయ్య ఆయుర్వేద వైద్యశాలకు చేరారు. అక్కడ మందులు మింగారు-మర్దనలు జరిగాయి - గుణం కనిపించలేదు.

యునానీ హకీములు తాము నయం చేస్తామన్నారు. అక్కడికి చేరారు. అదీ అంతంత మాత్రంగానే ఉంది. ఆ తరవాత హోమియోపతి వారు మీసాలు మెలేశారు. అక్కడికీ చేరాడు. అక్కడా అంతే.

బలరామయ్య బాధచెప్పరాకుండా ఉంది. భరించ లేనంతగా ఉంది. ఈ బాధ కన్నా చావే మేలనుకున్నాడు. మనసు గిలగిల తన్నుకుంది. చావు సైతం దూరం నుంచే చిరునవ్వు నవ్వుతూంది. మోషపడుతున్నాడు. గాలిలో దీపంలా రెపరెపలాడుతున్నాడు. అప్పుడతను భగవంతుని ఆశ్రయించాడు. ఆశ్రయించాడే కాని మంత్రి పదవి వదలుకోలేదు.

అలాంటి సమయంలో వచ్చారు శేషయ్య, రామయ్యా, యాదగిరి బలరామయ్య దగ్గరికి. ముగ్గురూ సరస్వతి మాహాత్మ్యాన్ని వర్ణించారు. కుష్టురోగులు సైతం బాగవుతున్నారన్నారు. ఆశ్రమానికి చేరవలసిందన్నారు.

బలరామయ్యగారు ఆలోచించారు. మనసు అటు లాగలేదు. మాట రావడం లేదు. ఏమనాలో అర్థం కాలేదు. తుదకు కష్టంగా అన్నారు:-

"పెండ్లాం కాళ్ళు ఎట్ల పట్టుకుందునయా!" అని.

"అమ్మ - అమ్మ తప్పు - తప్పు అట్లనకండి" అని బలరామయ్య చెంపలు వాయించాడు శేషయ్య.

"దొరవారూ! ఇప్పు డామె పెండ్లం కాదు. అమ్మ. జగదాంబ. మహాతల్లి. సాక్షాత్తు ఆదిశక్తి. ఆమె దర్శనం చేసుకోండి. అంతే చాలు. రోగం చేతితో తీసేసినట్లు పోతుంది. నా మాట నమ్మండి" అన్నాడు.

రామయ్య వంతపాడాడు.

యాదగిరి బలపరిచాడు.

బలరామయ్య అన్నింటికి సిద్ధంగా ఉన్నాడు. సరే నన్నాడు.

బలరామయ్యను ఆశ్రమానికి చేర్చారు పెద్దలు.

శుక్రవారం నాడు సరస్వతిని దర్శించుకున్నాడు బలరామయ్య. ఆమెను చూచి ఆశ్చర్య పడ్డాడతను. ఈ సరస్వతి ఆ సరస్వతి కాదు. అన్నం లేనట్లు లేదామె. అమృతం సేవించినట్లుంది. నిగనిగ లాడుతూంది. వయసు పెరుగుతు

న్నట్లు కాదు. తరుగుతున్నట్లుంది. మళ్ళీ వయసు వస్తున్నట్లుంది. చెక్కిళ్ళు మెరుస్తున్నాయి. కనులలో ప్రసన్నత ఉంది. వదనంలో తేజస్సు ఉంది. అతడు ఉడిపోయాడు.

"అమ్మా!" అన్నాడు. అతడు అనగలిగింది అంతే. తరవాత మాట పెకల్లేదు. లేవని చేతితో దోసిల్లొగ్గినట్లు చూచాడు.

సరస్వతి అతనిని ఆపాదమస్తకం చూసింది. అలా చూస్తూ ఉండిపోయింది. అరచేత్తో తలరాచింది. అంతే.

"అమ్మా! నాకు ఆరోగ్యం ప్రసాదించు" అన్నాడు. మాటలు స్పష్టంగా వచ్చాయి. అదే అలారావడం మొదటిసారి.

జనం చిత్తరువులా చూచారు.

బలరామయ్య ఆశ్చర్యంలో మునిగితేలారు!

బలరామయ్య ఆశ్రమంలోనే ఉండిపోయాడు. అతనికి రోగం అంతగా తగ్గలేదు.

మంత్రిగారు ఆశ్రమంలో చేరడం మహావార్త అయి వ్యాపించింది.

మంత్రులు ఆశ్రమానికి రావడం సాగించారు.

వారు దేవి దర్శనం చేసుకోసాగారు.

ముఖ్యమంత్రికూడా దేవికి భక్తుడైపోయాడని చెప్పుకున్నారు జనం. సమస్యలన్నీ పరిష్కరిస్తున్నది దేవియేననీ, ముఖ్యమంత్రి నిమిత్తమాత్రుడనీ వదంతులు వ్యాపించాయి.

శివరావు ఉద్యోగంనుండి విరమించాడు. దేవి భక్తుడు అయిపోయాడు. ఎక్కువభాగం ఆశ్రమంలోనే ఉంటున్నాడు. గీత విషయం అట్టె పట్టించుకోవడం లేదు. అతనికి ఐహికచింత అడుగంటుతూంది. పారలౌకికచింత పట్టుకుంటూంది. ఆశ్రమంలో హరేనామ సంకీర్తన సంఘం స్థాపించాడు. "రాత్రింబవళ్ళు భజనలోనే గడుపుతున్నాడు. గతం తలచుకుంటే అతనికి ఒళ్ళు జలదరిస్తూంది. చేసిన ఘోరాలు రక్కసుల రూపంలో వెన్నంటుతున్నట్లు అనిపిస్తూంది. భజనలో అతనికి అవి కనిపించటంలేదు. అందుకే భజనను ఆశ్రయించా డతను. రామునీ, కృష్ణునీ ఆశ్రయించాడు.

'హరే రామ, హరే కృష్ణ'లో మునిగిపోతున్నాడు.

బలరామయ్య కూడా భజనలో పాల్గొంటున్నాడు.

శివరావు ఆ బృందానికి నాయకుడైనాడు!

రామయ్య ముఖ్యమంత్రికి సన్నిహితుడైనాడు.

కొన్ని పత్రికలు ఆశ్రమ వైభవాన్ని చూచి సహించలేకపోయాయి. ఆశ్రమం అవినీతికి ఆలవాలం అయిందన్నాయి. ప్రజలకు మత్తుమందు పెట్టడానికి ప్రభుత్వం ఆశ్రమాన్ని వాడుకుంటూందన్నాయి. ప్రభుత్వం తమ తప్పులు కప్పిపుచ్చుకోవడానికి

ఆశ్రమాన్ని ఆశ్రయించిందన్నాయి. ఒక పత్రిక అసలుకే ఎసరు పెట్టింది. సరస్వతి దగ్గర మాహాత్మ్యం లేనేలేదన్నది. చాటుగా ఆమెకు అన్నపానీయాలు అందించబడుతున్నాయని శంకించింది. ఇదంతా బూటకం అంది. ఆ బండారం బయట పెట్టాలంది. దాంతో చిచ్చురేగింది యువకుల్లో. అసలు వ్యవహారం తేల్చుకోవాలనుకున్నవాడు ప్రకాశం. కొందరు కుర్రాళ్ళు అతనికి బాసటగా నిలిచారు. ప్రకాశం బృందం ఆశ్రమానికి చేరింది. కాపలా కాస్తామంది. రామయ్య అడ్డుతగిలాడు. వీల్లేదన్నాడు. అయితే అంతా బూటకమే–నాటకమే అన్నాడు ప్రకాశం. రామయ్య మంత్రి కావడానికి ఆడుతున్న నాటకంలో ఇదొక రంగం అన్నాడు.

రామయ్య తలతిరిగి పోయింది.

రామయ్య బొమ్మలా నుంచున్నాడు.

తన కొడుకే తననిలా అంటున్నాడు. తన కొడుకు కాబట్టే తన రహస్యాలు తెలుసుకుంటున్నట్లున్నాడు అనుకున్నాడు.

ప్రకాశం ఉద్రేకంగా ఇంకా మాట్లాడుతూనే ఉన్నాడు.

రామయ్య ప్రతిరూపంలా ఉన్నాడు ప్రకాశం.

తననే తన ముందు చూస్తున్నాడు రామయ్య.

ప్రకాశం ఉద్రేకంలో ఉన్నాడు. అది గమనించేంత ఓపికలే దతనికి.

"దోపిడికి మరొక రూపం. దొంగనాటకాలకు పరాకాష్ట. మీరు చేయించే హత్యలు, దోపిళ్ళు, మానభంగాలు బయటపడుతున్నాయి. ప్రజలు తెలుసుకుంటున్నారు. మేలుకుంటున్నారు. ప్రజాశత్రువులను కనిపెడ్తున్నారు. విరుచుకు పడ్డానికి సిద్ధంగా ఉన్నారు. మీరు చతురులు, తెలివిగలవాళ్ళు, అది కనిపెట్టారు. ఈ నాటకాలకు దిగారు. ప్రజల్ను మభ్యపెట్ట చూస్తున్నారు. మనిషి తిండీ, నీళ్ళు లేక ఉండలేడు. సరస్వతితో వేషాలు వేయిస్తున్నారు".

ప్రకాశం చెంపజెళ్ళుమంది.

ప్రకాశాన్ని చెంపదెబ్బకొట్టి రామయ్య మెరుపులా ఆశ్రమంలోకి వెళ్ళిపోయాడు.

కుర్రాళ్ళు కేకలుపెడ్తూ అతన్ని వెంబడించారు.

పోలీసులు చకచకావచ్చి కుర్రాళ్ళను అడ్డగించారు.

వారిచుట్టూ వలయం తీర్చినుంచున్నారు.

కురాళ్ళు కేకలు పెడ్తూనే ఉన్నారు.

"ప్రజాశత్రువులు నశించాలె"

"దొంగనాటకాలు నశించాలె"

"ఆశ్రమంగుట్టు బయటపెట్టాలె"

"విప్లవం వర్ధిల్లాలె. ఇన్కిలాబ్ జిందాబాద్"

నినాదాలు ఆశ్రమంలో ప్రతిధ్వనించాయి. అక్కడిశాంతి అశాంతిగా మారింది. శివరావు, రామయ్య, శేషయ్య గుసగుసలాడుకున్నారు – అంటే సంప్రదించుకున్నారు. రామయ్య తాను వెళ్ళలేనన్నాడు-అతడు ప్రకాశాన్ని ముఖాముఖి చూడలేకపోతున్నాడు. అతని మనసులో ఏవో సుడిగాలులు పెనవేసుకుంటున్నాయి. తన కొడుకే తనకు శత్రువు అవుతున్నాడు. అదీ అతని మధన – వ్యధ – బాధ. శేషయ్య ముందడుగు వేయనన్నాడు – అతనికి భయం! శివరావుకు తప్పలేదు. గీత గుంపులో లేదు. అదీ శివరావు ధైర్యం. అందుకే కదిలా డతను.

పిల్లలముందు పిరికివాళ్ళైనారు పెద్దలు!

అయినా ధైర్యంగా వచ్చాడు శివరావు. మొన్నటివరకూ పోలీసు అధికారి.

పోలీసులు అతనికి సలాం కొట్టారు.

అతను కాషాయ వస్త్రాల్లో ఉన్నాడు.

"ఏం కావాలి నాయనా మీకు?"శాంతంగానే అడిగాడు శివరావు.

"మా ప్రకాశాన్ని కొట్టాడు రామయ్య. క్షమాపణ చెప్పుకోవాలి" ఒక కుర్రాడు కేక పెట్టాడు.

"అంతేనా నాయనా కావలసింది" ప్రకాశాన్ని అడిగాడు శివరావు. ప్రకాశం తనను ఎదిరించలేడని తెలుసతనికి.

ప్రకాశం చెంప పొంగి ఉంది.

శివరావును చూచాడు ప్రకాశం.

తలవంచుకున్నాడు. అన్నాడు:-

"అంకుల్! మీరు కొట్టడం మేం పడటం మనిషి పుట్టిన్నాటి నుంచీ ఉంది."

శివరావు గుండెల్లో ఎక్కడో సూది గుచ్చుకుంది.

ప్రకాశం చెప్తున్నాడు. అతని ధ్వనిలో ఉద్రేకం లేదు. మాటలు పోటుల్లా ఉన్నాయి.

"రామయ్య మస్తాన్‌మామను చంపించిండు. మా అమ్మను జేలుకు పంపిండు. మల్లయ్యమామ పొలం గుంజుకున్నడు. ఒక హత్య చేయించిండు. హుసేన్‌మామను జేలుకు పంపిండు. బూబమ్మ చావుకు కారకుడయిండు. ఇప్పుడు ఆశ్రమంలో చేరిండు. నన్ను కొట్టిండు. నన్ను కొట్టిండు ఫరవాలేదు. సరస్వతమ్మ పేర ప్రజల్ను మోసం చేస్తున్నడు. అన్నంతేకుండ ఎవరూ ఉండలేరు. ఇందులో ఏదో నాటకం ఉన్నది. మేం కాపలా ఉంటం."

ప్రకాశం మాటలు విద్యుత్తులా పనిచేశాయి శివరావుమీద. శివరావుకు తన పూర్వ చరిత్ర గుర్తుకు వచ్చింది. అశాంతి చెలరేగింది. గుండెలో ఒక దుమారం లేచింది. ప్రకాశం చెప్పింది వాస్తవం. ప్రకాశం ఎప్పుడూ వాస్తవమే చెపుతాడు. అదే శివరావుకు అతనిమీద గౌరవం. ఇంతకూ శివరావు జవాబు చెప్పలేకపోయాడు. అయినా అన్నాడు:-

"కాపలా ఉంటామంటారు. దేవి మాహాత్మ్యాన్ని శంకిస్తా మంటారు. ఉండండి. కాపలా ఉండండి. మీకే విశ్వాసం కలుగుతుంది"

ఆ తరువాత అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు శివరావు. ఆలోచిస్తే ఆశ్రమం కంటే ప్రకాశమే వాస్తవం అనిపించింది అతని అంతరాత్మకు. ప్రకాశం మహోన్న తుడుగా కనిపించా డతనికి. విశ్వరూపంలా కనిపించాడు. సత్యస్వరూపంలా కనిపిం చాడు. తుదకు కృష్ణపరమాత్మలా కనిపించాడు.

ఆశ్రమాన్ని తలచుకున్నాడు – కాదు – చూచాడు. అది ప్రకాశం ముందు బొమ్మరిల్లులా కనిపించింది. అవాస్తవంగా కనిపించింది. అసత్యంగా కనిపించింది. హ్రస్వరూపంలా కనిపించింది. చీకటిలా కనిపించింది.

ఏది వాస్తవం ?

ఏది అవాస్తవం ?

ఏది సత్యం ?

ఏది అసత్యం ?

ఆలోచనలు అతని మనసును మధనపెట్టాయి. మెదడును చీల్చాయి. ఉక్కిరి బిక్కిరి అయినాడు. తుదకు నిర్ణయానికి వచ్చాడు.

తాను ముదివగ్గు. ఎదిరించే వయసుకాదు తనది. జీవితంలో ఓడిపోయాడు. ఓటమి తన సొత్తు. తనకు ధైర్యం లేదు. అధైర్యాన్ని, ఓటమినీ తనకు గుర్తు రాకుండా కాపాడుతూంది ఆశ్రమం. ఆశ్రమం తప్ప అన్యం దిక్కులేదు తనకు. అదే దిక్కు. ఆశ్రమాన్ని తాను వదలడు.

"వదలను" అనే నిర్ణయానికి వచ్చి లేచాడు. సరస్వతి గది ముందుకు వెళ్ళి మొక్కాడు. కొంత శాంతి లభించింది.

"హరేరామ హరేకృష్ణ" భజనలో మునిగిపోయాడు – అంతే – మళ్ళీ ప్రకాశం తలపుకు రాలేదు.

"హరేరామ – హరేకృష్ణ"

ఆరాత్రి భజనసమాజం వారు సరస్వతి గదిముందే బిరాయించారు–తెల్లవార్లూ భజన సాగించారు.

తెల్లవార్లూ మేలికతో ఉండి కాపలా కాస్తున్నారు ప్రకాశం బృందం.

పోలీసులు జట్లు జట్లుగా రక్షణ విధులు నిర్వర్తిస్తున్నారు – కుర్రాళ్ళు గోలచేయకుండా వారిని నియమించింది ప్రభుత్వం.

ఆరాత్రి గడిచింది.

తెల్లవారి దానికి బాగా ప్రచారం వచ్చింది. ప్రకాశాన్ని తెగడుతూ రాశాయి కొన్ని పత్రికలు. పొగడుతూ రాశాయి కొన్ని. అందరూ అతని ధైర్యాన్ని మెచ్చుకున్నారు.

పట్నంలో ఒక కల్లోలం లేచింది.

వాస్తవం ఏమిటి ? అమ్మకు ఆహారం అందుతుందా ?

అందును గురించి చర్చలు జరిగాయి. కొన్నిచోట్ల చర్చలు తీవ్ర రూపందాల్చి కొట్టుకోవడంకూడా జరిగింది. కొన్నిచోట్ల ఉభయపక్షాల వారు పందాలుకూడా వేసుకున్నారు.

అందరి నాలుకలమీదా ఆశ్రమమే నిలచింది.

ఆశ్రమానికి జనం రావడం ఎక్కువైంది.

మంత్రులనుంచి మామూలు మనుషులవరకూ ఫలితాన్ని గురించి ఆతురతగా ఎదిరి చూడసాగారు.

రోజులు గడుస్తున్నాయి.

ప్రకాశం బృందం కాపలా నిర్విరామంగా సాగుతూంది.

భజన అంతరాయం లేకుండా జరుగుతూనే ఉంది.

ప్రార్థనలు, పూజలు కొనసాగుతూనే ఉన్నాయి.

ఎదిరి చూచిన రోజు రానేవచ్చింది!

శుక్రవారం రానే వచ్చింది.

ఆరు రోజులూ సరస్వతికి ఆహారం అందలేదని ధృవపరచుకున్నాడు ప్రకాశం. అయినా అక్కడే ఉన్నాడు. ఆమెలో వచ్చిన మార్పును చూడాలనుకున్నాడు. ఉన్నాడు అక్కడే.

గది తలుపు తెరచింది సరస్వతి.

అడుగు బయటకు పెట్టింది.

ఆమె బయటికి వచ్చింది.

వేల జనం బయట నిలిచి ఉన్నారు-ఆమెమీద వారికి భక్తి ఇనుమడించింది.

"జై అమ్మకూ" అన్నారు.

జయధ్వానాలు నినదించాయి !

ప్రకాశం సరస్వతిని చూచాడు.

ఆమె నిగనిగలాడుతూంది.

ఇసుమంత వసివాడలేదు.

ప్రకాశం ముఖం వాడిపోయింది-వాలిపోయింది-

అతడు ఆమె ఎదుట నుంచొని నమస్కరించాడు.

సరస్వతి ప్రకాశాన్ని చూచింది-చిరునవ్వు నవ్వింది—అతని తల నిమిరింది.

"ఆంటీ! తెల్లవార్లు మీ కేమయినా గొడవ వినిపించిందా?" వినయంగా అడిగాడు ప్రకాశం.

"లేదే"

"వీళ్ళంతా తెల్లవార్లు భజన చేస్తూ కూర్చున్నారు తెలియదా ?"

"తెలియదే"

ఆశ్చర్యపడ్డాడు ప్రకాశం. మళ్ళీ అడిగాడు:—

"మీ దగ్గర మహాత్యం ఉందా?"

"లేదే. ఎవరన్నారు ?"

చకితుడైనాడు ప్రకాశం.

"వీళ్ళందరూ అంటున్నారు" అని జనాన్ని చూపాడు.

"వాళ్ళకు కనిపిస్తుందేమో ! నాకు తెలీదు."

ఆ తరువాత సరస్వతి మాట్లాడలేదు.

ఆమె సాగిపోయింది సమాధివైపు.

జనం ఆమెవెంట వెళ్ళిపోయారు.

ప్రకాశం అక్కడే నుంచుండిపోయాడు.

పత్రికలవాళ్ళు అతనిని చుట్టుముట్టారు. ప్రశ్నలవర్షం కురిపించారు. అన్నింటికీ అతని సమాధానం ఒక్కటే ఆమెకు మాహాత్మ్యం లేదని.

"అయితే ఏముంది అమ్మదగ్గర?" ఒకతడు ప్రశ్నించాడు.

"ఏదో శక్తివుంది" ప్రకాశం జవాబు.

పత్రికలవాళ్ళకు కావలసిన జవాబు లభించింది.

శక్తికి "పరా" అనేది జోడించి నాస్తికులుకూడా అమ్మను పరాశక్తిగా అంగీకరించారని ప్రకటిస్తూ, ప్రకాశం చరిత్రయుక్తంగా పటాలు ప్రకటించాయి పత్రికలు. తాను అలా అనలేదని పత్రికలకు ప్రకాశం రాసిన ఉత్తరాలు ప్రకటించనే లేదు.

ప్రకాశం శ్రద్ధగా అధ్యయనంచేసి ఒక వ్యాసం రాశాడు. భాష అతనిది అట్టే బాగులేకున్నా అతను రాసిందాని సారాంశం ఇది:—

'అభ్యాసంవల్ల అన్నిటినీ సాధించవచ్చు. ఆహారం మానుకోవడం, పక్కవాణ్ణి గురించి పట్టించుకోక పోవడంకూడా ఒక అభ్యాసమే. అభ్యాసంవల్ల ఊపిరి పీల్చుకోకుండా వున్నవారుకూడా ఉండవచ్చు' అని రాస్తూ వేమన పద్యాన్ని ఉటంకించాడు.

"అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగతినగవేము తీయనగును
సాధనమున పనులు సమకూరుధరలోన
విశ్వదాభిరామ వినురవేమ"

ప్రకాశం వ్యాసాన్ని ప్రచురించిన పత్రికలే ఒకటి - రెండు. వాటిని ఎవరూ చదువలేదు. కాని ఊపిరి పీల్చుకోవడాన్ని గురించి అతడు రాసింది చదవనివాళ్ళకు కూడా తెలిసింది.

"అమ్మ ఊపిరిగూడా పీల్చదంలేదు" అనే వదంతికి బహుళ ప్రచారం వచ్చింది.

"ఇది యోగవిద్యకు ఒక విజయం" యోగవిద్యావేత్తలు ప్రకటించారు.

"ఆయుర్వేదం ఎన్నడో చెప్పింది. ఆంగ్లేయ నాగరకతకు లొంగి మనం మనవైద్యాన్ని వదులుకున్నాం" ఆయుర్వేద భిషగ్వరులు భారతీయ మహాసంఘం ఘోషించింది.

"వేదకాలపు విజ్ఞానం మృత్యువును సైతం జయించింది" వేదపండితులు ఘంట వాయించి చెప్పారు.

"గాలి ఆడకుండా బతకడానికి వీల్లేదు. గుండె ఆడకుంటే బతకడం అసంభవం" అల్లోపతీవైద్యులు ఛాలెంజ్ చేశారు.

వాదోపవాదాలు-చర్చలు-సమావేశాలు-ఘర్షణలు-సెమినార్లు-పోట్లాటలు జరిగాయి. అప్పుడు అందరికీ ఒక సంశయం వచ్చింది.

"అసలు అమ్మ గాలిపీల్చుకుంటుందా?" అని.

పరీక్షలు - పరిశీలనలు జరిగాయి. సరస్వతి గదికి రెండు కన్నాలు పెట్టి వాటికి గ్లాసులు అమర్చారు. అలా చూస్తూ కూర్చున్నారు పరిశీలకులు.

"అమ్మ గాలిపీల్చడంలేదు" నిర్ణయించారు.

"ఆమె గాలికి చలించని దీపశిఖలా ధ్యాననిమగ్నం అయి ఉంది"

ఆ వార్త జగమంతా వ్యాపించింది. అప్పటికి ఏదో పనిమీద వచ్చిన అమెరికా పాత్రికేయులూ-టెలికానీయులూ ఈ వార్త విన్నారు. ఇక్కడికి వాలారు. అసలు కొందరు సైంటిస్టులు అదేపనిమీద భారతదేశం వచ్చారు-నేరుగా ఆశ్రమంలోనే వాలారు.

శుక్రవారంనాడు అమ్మను దర్శించుకున్నారు. వారు ప్రశ్నలడిగారు. సరస్వతి ఇంగ్లీషులో సమాధానాలు చెప్పింది. అది వారికి అత్యంత ఆశ్చర్యం కలిగించింది. 'భారతదేశంలో దేవతలకుకూడా ఇంగ్లీషు నేర్పారు ఆంగ్లేయులు" అని ప్రకటించారు.

"మీరు గాలి పీల్చుకుంటారా?"

"తెలీదు"

"మీరు గదిలో కూర్చొని ఏం చేస్తారు?"

"కాన్సెంట్రెషన్ ఆఫ్ మైండ్"

"దేనిమీద కేంద్రీకరిస్తారు?"

"మొదట ఒక వస్తువుమీద కేంద్రీకరించేవాణ్ని. ఇప్పుడు ఏదీ నా దృష్టిలో లేదు. ఆకాశమే కనిపిస్తుంది."

"మీరు ఆడవారు కదా! వాణ్ణి" అని ఎందుకంటున్నారు. పొరపాటా?"

"కాదు. ఆత్మకు స్త్రీ పురుష భేదాల్లేవు."

అదిరిపోయారు అమెరికన్లు. కొంతసేపు మౌనం వహించి, ఒకరి ముఖాలు ఒకరు చూచుకొని తరవాత అడిగారు.

"మేం మిమ్మల్ని పరీక్షించదలచాం. అమెరికాలోని లక్షలాది ప్రేక్షకులు టెలి

విజనులో మిమ్మల్ని చూచేట్లు చేస్తాం. అనుమతిస్తారా? అందుకు ప్రతిఫలంగా పది వేల డాలర్లిస్తాం- అంటే ఐమీన్-డెబ్బై అయిదువేల రూపాయలు!"

"నాకు డబ్బుతో నిమిత్తం లేదు. కావాలంటే పరీక్షించుకోండి. నాకు అభ్యం తరం లేదు."

డబ్బుతో నిమిత్తం లేదనే సరస్వతి మాటవిని సంభ్రమాశ్చర్యాల్లో మునిగి పోయారు అమెరికావారు—వారికి తెలిసింది డబ్బు మాత్రమే-మరేం లేదు.

"డబ్బు విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?"

"అది మనిషిని రాక్షసుణ్ని చేస్తుంది."

అది వారికి మరీ ఆశ్చర్యం కలిగించింది. చుట్టూచేరి చప్పట్లుకొట్టారు.

"We want your massage- మాకు మీ సందేశం కావాలి" అన్నారు.

తరవాత సరస్వతి మాట్లాడలేదు.

ఆ ఇంటర్వ్యూ సాంతం రికార్డుచేసి ఒక వ్యాపార సంస్థ అమెరికాలో టెలీ కాస్టు చేసి, వచ్చే వారం అమ్మ పరీక్షను డైరెక్టుగా టెలికాస్ట్ చేస్తామని ప్రకటిం చింది- అందుకుగాను భారత ప్రభుత్వంతో ఒప్పందాలు జరిగాయని కూడా ప్రకటిం చింది.

అమెరికాలో అందువిషయమై ఆసక్తి పెరిగింది - వచ్చేవారం కోసం ఎదిరి చూడసాగారు జనం.

ఇక భారతదేశంలో భారతీయ సంస్కృతి పరిరక్షణకు కంకణం కట్టుకున్న మహామహులు ఎగిరి గంతువేశారు. భారతీయ సంస్కృతిని విదేశాలకు పరివ్యాప్తం చేస్తున్నందుకు అభినందిస్తూ సరస్వతికి వేలకొలది టెలిగ్రాములు అందాయి.

ఆశ్రమంలో అమెరికన్లు అట్టహాసం చేస్తున్నారు. గ్లాసుతో ఒక పెద్దబోను తయారైంది - అమ్మ కూర్చోవడానికి అనువైనంతది, దానికి రకరకాల యంత్రాలు అమర్చారు. స్వయంగా గుండె నడక చూపేదీ, రక్తపుపోటు కొల్చేది, నాడి నడక లెక్కించే యంత్రాలు అమర్చారు. భారతీయులు, అభారతీయులు అనేకమంది విజ్ఞానవేత్తలు పరికించి, పరీక్షించి, అన్నీ సరిగా ఉన్నాయని సర్టిఫై చేశారు. డైరెక్ట్ టెలికాస్టింగ్‌కు సెటులైట్స్ ఏర్పాటయినాయి.

శుక్రవారం రానే వచ్చింది. మామూలు కార్యక్రమం ముగిసింతరవాత గాజు బోనుతో ప్రవేశించింది సరస్వతి.

సరస్వతి బోనులో కూర్చుంది.

టెలికాస్టు మొదలైంది. అమెరికాలో లక్షలమంది ఆసక్తితో చూస్తున్నారు.

కొన్ని నిముషాలు ధ్యానించింది.

పెద్ద ధ్వనులు చేశారు బయట-ఆమె చలించలేదు. అప్పుడు గాజు బోను మూసేశారు. సీలు వేశారు.

"ఇప్పుడందులో గాలిలేదు. మదర్ కూర్చొనే ఉంది" వ్యాఖ్యాత చెప్పాడు.

ప్రేక్షకులు-అంటె అమెరికన్ టెలివిజన్ ప్రేక్షకులు-ఊపిరి బిగపట్టి చూస్తు న్నారు.

ఏమౌతుంది?

ఎలా జీవిస్తుంది?

చనిపోదుగదా?

ఆతురత పెరుగుతూంది.

ఇక్కడ ఆశ్రమంచుట్టూ సాయుధ పోలీసులను కాపలా పెట్టారు. మంత్రులు, మహామహులు మాత్రం నిర్దేశ స్థలాల్లో ఆశీనులై ఉన్నారు.

బయట జనం ఎంతో ఆతురతగా ఉన్నారు.

కంప్యూటర్లు హార్ట్‌బీట్స్ కౌంట్ చేస్తున్నాయి.

శాస్త్రజ్ఞులు జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు.

పెద్ద పెద్ద డాక్టర్లు మందుల సీరింజిలతో సిద్ధంగా ఉన్నారు-ఎలాంటి అవాంతరాన్నైనా ఎదుర్కోవడానికి.

కెమెరా కంప్యూటర్లవైపు తిరిగింది.

"మీకు కనిపిస్తూనే ఉంది. హార్ట్‌బీట్స్ నార్మల్‌గా ఉన్నాయి. బ్లడ్‌ప్రెజర్ నార్మల్. పల్స్ రేట్ నార్మల్. మదర్ గాలి పీల్చడంలేదు. గ్లాస్‌కేజ్‌లో గాలిలేదు. అదే ఆమె శక్తి. అందుకే ఆమెను భారతీయులు దేవి అంటున్నారు, మదర్‌ను చూడండి. దేవిని చూడండి" వ్యాఖ్యాత చెపుతున్నాడు.

కెమెరా సరస్వతివైపు తిరిగింది.

అమ్మకు అమెరికాలో దండాలు పెట్టారు అనేకమంది. ఆమెను గురించి అక్కడివారికి ఆతురత ఎక్కువైంది.

టెలివిజనులో అమ్మ - అమ్మ తరువాత కంప్యూటర్లు—ఆ తరువాత అమ్మ-ఈలోగా భారతీయ సంస్కృతిని గురించీ, యోగశాస్త్రాన్ని గురించీ వ్యాఖ్యానం. అలా గంట నడిచింది.

"మళ్ళీవారం తరువాత కలుసుకుందాం" అన్నాడు వ్యాఖ్యాత.

కెమెరాలు ఆఫ్ అయినాయి.

అమెరికాలో ఆతురత ఎక్కువైంది. ప్రజల కోరికమీద వారంపాటు ప్రతి రోజూ పదినిముషాలు ఈ కార్యక్రమం చూపించారు.

మళ్ళీ శుక్రవారం నాడు గాజుబోనునుండి బయటికి వచ్చింది సరస్వతి. ఆమె లక్షా ప్రజలకు నమస్కరించింది. వారికి తన సందేశం ఇచ్చింది:-

"జీవితం దుఃఖాల పుట్ట. దుఃఖాలనుంచి దూరంగా ఉండాలంటే యోగం చేయాలి. నాకు ఎంతో ఆనందంగా ఉంది. మీకు భగవానుడు ఆనందం ప్రసాదించు గాక."

ఇంగ్లీషులో ఆమె తన సందేశం విని ఎగిరి గంతేశారు చాలమంది. అక్కడ ఆమెకు చాలమంది భక్తులు తయారైనారు. అమెరికానుండి "అమ్మకు ఉత్తరాలూ, పార్సెళ్ళూ అనేకం అందుతున్నాయి. కాని వాటిని చూడ్డానికి అమ్మకు తీరికలేదు. శివరావు వాటిని అందుకున్నాడు. అమెరికాలోని భక్తులు అనేక సంశయాలు వ్యక్త పరుస్తున్నారు. శివరావు స్వయంగా తికమకపడేట్టు ఉంటున్నాయి ప్రశ్నలు. అయినా ఓపిగ్గా వాటిని పరిష్కరించే ప్రయత్నం చేస్తున్నా డతను. అందుకోసం కొన్ని పుస్తకాలు చదువుతున్నాడు. అతనికి కొన్ని పడికట్టు సంస్కృత పదాలు వచ్చే శాయి. ఆత్మ, పరమాత్మ, మోక్షం, భక్తి, మనశ్శాంతి, ఆనందం-లాంటివి. వాటిని ఇంగ్లిషులో అలాగే రాస్తున్నాడు. అవి అమెరికా భక్తులమీద అపారమైన ప్రభావం వేస్తున్నాయి. శివరావు శివానందస్వామి అయిపోయాడు. ఇక్కడే ఉండే అతను అమెరికాలో భక్తసమాజం ఏర్పర్చాడు. హరేనామ సంకీర్తన సంఘాలు చాల ఏర్పడ్డాయి. అమెరికా భక్తజనుల బృందాలు శివానందస్వామిని ఆహ్వానించాయి. అమ్మను అమెరికాలో అవతరించమని వేడుకున్నాయి. సరస్వతి అంతగా పట్టిం-చుకోలేదు. శివరావు ఆమెను వదల్లేదు. అతనికి భారతదేశంనుండి బయటపడాలనే ఆతురత ఎక్కువయింది. శివరావు పట్టుదలకు సరస్వతి లొంగక తప్పలేదు. బలరామయ్య సరస్వతికి దూరంగా ఉండలేని దశకు వచ్చాడు. అతడూ ప్రయాణం అయినాడు. సరస్వతి పలుకుబడి విదేశాలదాకా పాకినందుకు సంతోషించాడు. రామయ్య. అంతకంటె అతనికి సంతోషం కలిగించిన విషయం సరస్వతి, బల రామయ్యా దేశం విడిచిపోవడం. ఇక అతనికి ఎదురులేదు. ఊరికి తానే రాజు-రారాజు. బలరామయ్య కొడుగ్గా రాజకీయాల్లో ప్రాబల్యం సంపాదించవచ్చు. అందుకే భక్తి ఎక్కువయింది రామయ్యకు. శేషయ్య అందుకు తాళం వేశాడు. ఉభయులు చేతులు జోడించి "అమ్మ"ను ప్రార్థించారు - "అమెరికా వెళ్ళేముందు మా ఊరు పావనం చేయమ"ని. బలరామయ్యకూ తన ఊరు చూడాలనే ఉబలాటం కలిగింది. ప్రాణంతో భారతదేశానికి తిరిగి వస్తాననే నమ్మకం పోయిందతనికి. బలరామయ్యకూడా "అమ్మ"ను అర్థించాడు. శివరావుకు ఆ వూరిని తలచుకుంటే గుండె గుభేలుమంది. ఆ ఊరిలో జరిగిన ఎన్నో హత్యలకు కారణం తాను. జగ్గయ్య కళ్ళముందు మసలాడు. వీరభద్రం ఇల్లు తగలబడ్తూ కనిపించింది. మంగమ్మ మూర్తి కనిపించింది! మంగమ్మ-ఎంత సాధ్వి! అన్నీ తెలిసి గీతంటే ప్రాణం పెట్టింది. మంగమ్మ గుర్తుకు వచ్చేవరకు గీత జ్ఞాపకం వచ్చింది. గీతను ఎవరికి అప్పగించాలి? అని ఆరాటపడుతున్నాడు ఇంతకాలంగా. ఇప్పుడు ఆశ్రయం దొరికింది. మంగమ్మను మించిన మాత మరొకతె లేదనుకున్నాడు. ప్రకాశం గుర్తుకు వచ్చాడు-అతని మాటలు ప్రతిధ్వనించాయి. గీత-ప్రకాశం కనిపించారు. ఆ తరువాత అతడు ఆలోచించలేదు. అతడు నిర్ణయించిందల్లా గీత యోగక్షేమాలు మంగమ్మ చూడగలదని. అందువల్ల శివరావుకూడా సరస్వతిని బలవంత పెట్టాడు.

ఊరిపేరు వింటే సరస్వతికి ఒక వింత అనుభూతి కలిగింది. ఈమధ్య ఎన్నడూలేని భావాంకురం ఆమె ఎదలో మొలిచింది-అది వీరభద్రానికి సంబంధించిన జ్ఞాపకం - స్మృతి - ఆలోచన-ఆలాపన - ఎందుకో మళ్ళీ వీరభద్రం ఆమె మనసులో కదలాడసాగాడు. విప్లవం-వీరభద్రం - బాంబులు చేయడం - ఇరువురూ కలుసుకోవడం - విడిపోవడం - ఆస్పత్రి - వీరభద్రం - మల్లయ్య - అలా స్మృతులు ఒకదాని తరవాత ఒకటి వెంటాడేయి. ఇలాంటివి పూర్వమూ వెంటాడేయి. వాటినుంచి విముక్తికే ఆమె యోగం అవలంబించింది. యోగం ఫలించింది - ఆమె జయించింది. విముక్తురాలయింది. అన్నిటినీ వదలుకుంది - అందరినీ త్యజించింది. లోకానికి అతీతంగా ప్రవర్తించింది. ఎన్నడూ ఆమెకిలాంటి ఊహ రాలేదు. బలరామయ్యను సహితం పరాయివాడిగా పరిగణించింది. కాని ఇప్పుడు వీరభద్రం ఆమె మనసులో మసలసాగేడు. ఈ తడవ అతన్ని తొలగదోయడానికి యత్నించలేదు. ఆ అనుభూతిలో ఏదో తీయదనం ఉంది-మధురిమ ఉంది - ఉత్సాహం ఉంది - ఉద్రేకం ఉంది - ఉత్పాతం ఉంది!

సరస్వతి వీరభద్రాన్ని చూడాలని నిశ్చయించుకుంది. చివరిసారిగా చూచి వెళ్ళిపోవాలని నిశ్చయించుకుంది. తిరిగి ఈ దేశం వస్తాననే నమ్మకం ఆమెకు నశించింది. అక్కడ వీరభద్రాన్ని చూడ్డం అసాధ్యమని నిర్ణయించుకుంది. ఈ కోర్కె కొనసాగడం ఆమెకు ఇష్టం లేదు. ఈ కోర్కెను ఇక్కడ బూడిదచేసి అక్కడికి పోవాలనుకుంది. అందుకే అందరి ప్రార్థనలను మన్నించింది. "ఊరికి వస్తాన"న్నది.

అది విన్నవారందరూ ఆనంద కందళిత హృదయారవిందులయిరి.

"అమ్మ" గ్రామప్రయాణంబునకు సిద్ధంబయ్యె.

ఊళ్ళో ఉత్సాహం ఉరకలు వేసింది.

"దొర్సాని వస్తున్నది. దేవతయి వస్తున్నది" ఊరంతా చెప్పుకున్నారు. చుట్టు పట్లకూ పాకిం దావార్త.

సరస్వతికి స్వాగతం పలకడానికి సిద్ధం అవుతూంది ఊరు. శేషయ్య అడ్వాన్స్‌గా దిగాడు. యాదగిరి ఉండనే ఉన్నాడు. సుమతి, సావిత్రి నిర్విరామంగా పనులు చేయిస్తున్నారు. మహిళా భక్తబృందం తయారయింది. రిహార్సల్ భజనలు సాగిస్తున్నారు రాత్రిళ్ళు - గడిలో.

గడీ కలకాలం తరువాత కళకళ లాడింది. గడిగోడలకు సున్నాలు వేశారు. తలుపులకు రంగులు వేశారు. గోడలమీద సూక్తులు రాశారు. గడీ ముందు లంకంత పందిరి వేశారు. తోరణాలు కట్టారు. ట్యూబ్ లైట్లు వెన్నెల పరుస్తున్నారు.

శేషయ్య, యాదగిరి పరకు భక్తులయి పోయారు. వారి మెడల్లో తులసిపూసల మాలలు వెలిశాయి. సిగరెట్ల దమ్ములు లాగుతూనే భజనలు చేస్తున్నారు. మధ్యమధ్య మత్తు పానీయాలూ సేవిస్తున్నారు.

హార్మని మోగుతూంది.

భజనలు సాగుతున్నాయి!

ఇదంతా రిహార్సల్.

ముహూర్తం రానేవచ్చింది.

ఆనాడు శుక్రవారం.

ఊరి బయట సన్నాయి మోగింది.

ఊరిజనం అక్కడే కూడింది.

పట్నం నుంచి "అమ్మ"ను తీసుకొని కారు చేరింది. ఆగింది. జనంలో కలకలం చెలరేగింది. కొందరు దండాలు పెట్టారు. కొందరు సాగిలిమొక్కారు. కొందరు భజనలు చేశారు. అన్నీ కారుకే. అమ్మ ఉందో లేదో తెలీదు.

"అమ్మ" కారు దిగలేదు.

మిగతావారంతా కార్లు దిగారు - బలరామయ్య తప్ప.

సన్నాయి మోగుతూంది.

భజనలు సాగుతున్నాయి.

సుమతి పూర్ణకుంభంతో ముందు కదిలింది - సావిత్రి ఆమెను అనుసరించింది. ఊరేగింపు సాగింది - ఉత్సాహంగా కదిలిపోతూంది.

సరస్వతి కార్లో కిటికీ దగ్గిర కూర్చుంది.

బారులు తీరిన జనపు దండాలు అందుకుంటూంది.

అందరి కోర్కెలు తీరుస్తుందనుకున్న సరస్వతి తానే ఒక కోర్కెతో ఈ ఊరికి వచ్చింది. ఆమె చూపు దేన్నో వెదుకుతూంది - ఎవరినో అన్వేషిస్తూంది - ఏదో గవేషణ సాగుతూంది.

ఊరేగింపు మల్లయ్య గుడిసె ముందు దాకా వచ్చింది.

గుడిసె ముందు వీరభద్రం నుంచున్నాడు - ప్రకాశం నుంచున్నాడు - గీత నుంచుంది - మంగమ్మ నుంచుంది - మల్లయ్య నుంచున్నాడు - పిచ్చమ్మ నుంచోలేదు - ఆమె ముందే ఊరి బయటికి పోయి ఊరేగింపులో కలిసింది.

కారు మెల్లగా వస్తూంది.

సన్నాయి మోగుతూంది.

భజనలు సాగుతున్నాయి.

అవేవీ వినిపించలేదు సరస్వతికి - మరేమీ కనిపించలేదు "అమ్మకు".

ఆమెకు కనిపించింది నిటారుగా నుంచున్న వీరభద్రం.

వీరభద్రంమీద ఆమె చూపు నిలిచింది.

వీరభద్రం చేతులు జోడించలేదు.

అతడు శిలా ప్రతిమలా నుంచున్నాడు — అతనికి కనిపిస్తున్నది సరస్వతి- "అమ్మ"కాదు.

సరస్వతి చేతులు జోడించింది.

వీరభద్రం సరస్వతి చేతులను గమనించలేదు — అతడు సరస్వతినే చూస్తున్నాడు.

సరస్వతికి చిరుచెమట పట్టింది - కారు అక్కడే నిల్చిపోవాలనుకుంది. అలా చూస్తూ ఉండిపోవాలనుకుంది - గంటలు కాదు రోజులు - యుగాలు!

అయినా కారు కదిలింది - సాగిపోయింది - వీరభద్రం జరిగిపోయాడు- మరో ఇల్లు వచ్చింది - జనం దండాలు - నమస్కారాలు. అంతా మామూలు.

క్షణం మరో లోకంలో ఉన్నట్లనిపించింది సరస్వతికి. వెనక్కు తిరిగి చూడాలనుకుంది. మరి మరీ చూడాలనుకుంది. అది మనసనుకున్న మాట. మెదడు చెప్పింది - "నువు అమ్మవు" "నువ్వు దేవతవు".

సరస్వతి చూపు ముందుకే ఉంది - చేతులు యంత్రాల్లా నమస్కరిస్తున్నాయి.

మనసు మల్లయ్య ఇంటిదగ్గరే నిలిచిపోయింది.

కారు సాగుతూంది.

సన్నాయి మోగుతూంది.

భజనలు జరుగుతున్నాయి.

మల్లయ్య ఇంటిముందు నుంచున్న గీతకు తండ్రి కనిపించాడు - శివరావు ప్రస్తుతం శివానందస్వామి - తలబోడిదయింది - కాషాయ బట్టలు కట్టుకొని కమండలం పట్టుకొని ఒక మూలగా ఒదిగి సాగిపోతున్నాడు - గీతను చూచినా చూడనట్లు!

గీత తండ్రిని చూచింది - కేకపెట్టింది - కదల్లేదు అక్కణ్ణుంచి.

గీతకేక శివానందస్వామి గుండెలో సముద్రాలు పొంగించాయి - తన కూతురు - తన రక్తంలో రక్తం - తల్లిలేనిపిల్ల - గీత!

శివరావుగుండె వడివడి కొట్టుకుంది - అతడు గీత వైపు అడుగు వేయలేదు. చూపు మరొక పక్కకుతిప్పి కమండలం ఉన్న చేతిని గీత వైపు చాచి "వస్తానమ్మా-వస్తా" నని అరుస్తూ పెద్దపెద్ద అంగలు వేస్తూ సాగిపోయి గుంపులో కలిసిపోయాడు.

"ఆంటీ!" అని మంగమ్మను కరుచుకొని ఏడ్చేసింది గీత!

ప్రకాశం సాగిపోతున్న శివరావును చూస్తూ నుంచుండిపోయాడు. అతడు తనుచూపు దాటిపోతే వెనక్కు తిరిగి "దొంగలు!" అన్నాడు.

గీత మంగమ్మను పట్టుకొని ఏడుస్తూంది - ప్రకాశానికి ఏమీ అర్థం కాలేదు.

వీరభద్రం ఇంకా సరస్వతి పోయిన దిశనే శూన్యంగా చూస్తున్నాడు.

మల్లయ్య అందరినీ వదిలేసి పనికివెళ్ళి పోయాడు.

సన్నాయిమేళం నిలిచిపోయింది.

భజనలు చప్పబడ్డాయి.

"అమ్మ" ను ఉన్నతాసనం మీద కూర్చోబెట్టారు. కాసంత కుంకం బొట్టు. కళకళలాడే ముఖంతో, ఠీవిగా కూర్చుంది సరస్వతి. ఆమెకాళ్ళు పళ్ళెం లోపెట్టి కడిగాడు రామయ్య - సుమతి చెంబుతో నీళ్ళుపోస్తుండగా. ఆ నీళ్ళు సుమతి తలపై చల్లి తాను చల్లుకొని, యాదగిరికి అందించాడు. యాదగిరి "పాదోదకం" అందరి తలమీదా చల్లాడు. జనసందోహం కొట్టుకొని, గుద్దుకొని వచ్చి చల్లించుకున్నారు.

వరండాలో వాలుకుర్చీలో కూర్చోబెట్టారు బలరామయ్యను. ఒక కాలూ ఒక చేతీూ పడిపోయిన బలరామయ్య కుర్చీలో పడి నిరామయంగా చూస్తున్నాడంతా. అది తన ఇల్లు-తన గడీ. ఇక్కణ్ణుంచే తాను ప్రభుత్వం చేశాడు! జనాన్ని గడగడ లాడించాడు. గడీ గేట్లో అడుగు పెట్టాలంటే అదిరిపోయేవారు జనం! ఎవడైనా వచ్చినా బోనులోనికి పోయినట్లు నక్కుతూ, నసుగుతూ, ముడుచుకొని ప్రవేశించే వాడు. ఆ వచ్చిన వాడికి తాను కనిపిస్తే సింహాన్ని చూచినట్లు దడుచుకునేవాడు. చేతులు జోడించి తన ఆజ్ఞకోసం అలా నుంచునేవాడు! ఈనాడు! ఎంత మారిపోయారు జనం !!! తానున్న విషయమే ఎవడూ గుర్తించడంలేదు. కాలం ఎంతగా మారిపోయింది! అనుకొని తనను తాను చూచుకున్నాడు. కాలులేవదు. చేయిరాదు. మాట్లాడలేడు. ఎంత అశక్తుడయినాడు తాను! ఎందుకీబతుకు? పులిలా బతికినవాడు పిల్లిలా బతుకుతున్నాడు! తన కొడుకును కాల్చి చంపాడు వీరభద్రం. తననూ ఆనాడే కాల్చేస్తేపోయేది! నేటికి ఈ ఖర్మ పట్టేది కాదు!

"దొరా! కాళ్ళు పట్టు దండం పెడ్తం" ఆ మాట విని ముందుకు చూచాడు బలరామయ్య. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. జనం గుంపులు గుంపులుగా వచ్చి నుంచున్నారు. తన కాళ్ళు పట్టుకొని దండాలు పెట్టడానికి. అంతా వింతగా తోచింది. అటు చూచాడు. సరస్వతి కాళ్ళు పట్టుకొని దండం పెట్టిన వాళ్ళంతా తన దగ్గరికి వస్తున్నారు. ఏమీ అర్థం కాలేదు. చాచగల కాలు చాచి ఒరిగి కూర్చున్నాడు.

సరస్వతి చెప్పిందా తన కాళ్ళు పట్టుకొమ్మని. సరస్వతి ఎంత మంచిది-తన భార్య ఎంత మంచిది అనుకున్న బలరామయ్యకు బుగులు పుట్టింది— "అమ్మ"ను భార్య అనుకున్నందుకు మనసులోనే లెంపలేసుకున్నాడు.

జనం దండాలు పెట్టి సాగిపోతున్నారు.

అలా జనం రావడం, పోవడం నిరంతరాయంగా జరుగుతూనే ఉంది. సరస్వతి నిశ్చలంగా కూర్చుంది. బలరామయ్యకు నడుం లాగుతూంది. కూర్చోలేక పోతున్నాడు.

మధ్యాహ్నం విరామం ప్రకటించాడు యాదగిరి.

"అమ్మ" లేచి లోనికి వెళ్ళిపోయింది. మంచంమీద విశ్రమించింది.

బలరామయ్యను వేరే గదిలో పడుకోబెట్టారు.

ఏకాంతంగా వచ్చాడు రామయ్య సుమతిని - గాంధీని తీసుకొని సరస్వతి దగ్గరికి. తన ఇంటికి వస్తే సరస్వతిని వెళ్ళగొట్టిన రామయ్య భార్య, బిడ్డతో వచ్చి నేలమీద చతికిలబడి కూర్చున్నాడు. సరస్వతి పడుకునే ఉంది. లేవలేదు. ఇటు పక్కకు తిరిగింది. సుమతి గాంధీని తీసుకొని సరస్వతి కాళ్ళవైపు కదిలింది. గాంధీతో కాళ్ళంటి మొక్కించింది.

"అమ్మా! వీడు మంచివాడు కావాలె. బుద్ధిమంతుడు కావాలె. గాంధీజీ అంత వాడు కావాలె. ఆశీర్వదించు" అన్నది - ప్రార్థించింది.

సరస్వతి గాంధీని పిలిచింది. దగ్గరకు తీసుకుంది. తల నిమిరింది. వదిలేసింది. అంతేచాలు. పొంగిపోయింది సుమతి. పదిసార్లు సరస్వతి కాళ్ళంటి మొక్కింది.

నేలమీద కూలబడ్డ రామయ్య వింతగా చూస్తున్నాడు. రామయ్యకు వళ్ళు మండింది. సుమతికి గాంధీతప్ప తాను లెక్కలోలేడు. గాంధీకోసం ప్రార్థించింది సరే తనకోసమూ ప్రార్థించగూడదూ! తననూ ఒక చిన్న మంత్రిని చేయమని "అమ్మ"ను ప్రార్థిస్తే తప్పా!!

సుమతి గాంధీతో నేలమీద కూలబడ్డది—సరస్వతి ఏమైనా చెపుతుందేమో విందామని.

సరస్వతి పెదవి కదపలేదు.

"అమ్మా!" చేతులు జోడించి రామయ్య అంటున్నాడు "నువ్వు అందరికీ అమ్మవయినవు. నాకు నిజంగ నువ్వు అమ్మవు. ఈ కొడుకును కనికరించాలె. దయతలచాలె. నువ్వనుకుంటె కానిదిలేదు"

సరస్వతి ఏమిటి అన్నట్లు చూచింది.

"ఆశ్రమం నేనే చూస్త. నాజిమ్మేదారి. నువ్వు ఫికరుపెట్టుకోకు. శేషయ్యను అక్కడ్నే వప్పజెప్పత. ఇవ్వన్ని చెయ్యాల్నంటె కాస్త అధికారం కావాలెగద! నన్ను ఒక చిన్నమంత్రిని చేయి - నువ్వు దల్చుకుంటె కానిది లేదు. ఇగో నీకాళ్ళు పట్టుకుంట" అని దిగ్గునలేచి సరస్వతి కాళ్ళమీద తలపెట్టి పట్టుకొని "నువ్వు ఊఁ అనేదాక విడువను" అని పట్టుకున్నాడు.

సుమతి చిరచిరలాడింది - ఎంత స్వార్థపరుడు అనుకుంది మనసులో. సరస్వతి "ఊఁ" అనకుండా వుండాలని కోరుకుంది.

సరస్వతి "ఊఁ" అంది.

కాళ్ళు వదిలేసి దండకం చదివాడు రామయ్య.

సుమతి గాంధీ బుజంమీద చేయివేసి గుమ్మంవైపు కదిలింది - రామయ్య ఆమెను అనుసరించాడు.

"రాముడూ!" సరస్వతి పిలుపు విని వెనక్కు తిరిగాడు రామయ్య.

సుమతి వినీ విననట్లు గుమ్మందాటి పోయింది.

"జనం నిరాశ చెందేట్లున్నారు. ఈ వారం సొంతం విశ్రాంతి. రోజూ దర్శనం ఇస్తాం. ఇంతే. వెళ్ళు."

అమ్మ పలికింది.

రామయ్య ఉత్సాహంతో పరిగెత్తి ప్రకటించాడు.

సరస్వతి గదిలోనే ఉంది. చిందరవందరగా ఉంది. చిరాకుగా ఉంది. చెదిరిపోతూంది. ఎక్కడా నిలవడంలేదు. ఎంతో ప్రయత్నిస్తూంది-కేంద్రీకరించాలని. అది పరిగెత్తుతూంది-మల్లయ్య గుడిసెముందుకు-నిటారుగా నుంచున్న వీరభద్రం దగ్గరికి.

వీరభద్రం! భద్రం!! వీరభద్రం!!! పలవరిస్తూంది మనసు. కేక వేస్తూంది మనసు. అరుస్తూంది మనసు. ఆరాట పెడ్తూంది మనసు!

వీరభద్రం! సరస్వతి మనసులో నిండిపోయాడు! నిండిపోయిన వీరభద్రం మనసు బద్దలు కొట్టేట్టున్నాడు! బయటికి వచ్చేట్లున్నాడు. బహిరంగంగా నుంచునేట్లున్నాడు. అందరికీ కనిపించేట్లున్నాడు. మనసును తీసి అవతల పారేద్దామనుకుంది. వీరభద్రాన్ని విసిరి ఆవల వేద్దామనుకుంది సరస్వతి!

తాను అమ్మ. ప్రజలకు దేవత! దేవి! తన కేమిటి ఈ కోరిక! కోరికలకు తాను లొంగరాదు. లొంగగూడదు ! నిజమే లొంగకుండా ఉండగలదా ! కోర్కెలెంత గట్టివి ! ఎంత విశాలమైనవి ! ఎంత విస్తారమైనవి !

తానెవరు? అమ్మ! కోర్కెలను జయించిన దేవత! కోర్కెలను జయించడం! అది మానవాతీతమయింది! అందుకే తాను అమ్మయింది. అమెరికా వెళ్తూంది! కాని ఈ వీరభద్రం ఈ కోరిక!! తానే కోరికలయినంతగా బలిసిపోయాయి! ఎవరు జయించగలరు వీటిని ? ఎవరు జయించారు ! విశ్వామిత్రుడు - వ్యాసుడు !!! అంతా లొంగాల్సిందేనా ? అసలు మనిషి కోరికల కుప్ప. కోరికలు పోయిన్నాడు మనిషిలేడు — అవును మనిషిలేడు. మనిషే కోరికలు - కోరికలే మనిషి !

తాను! కోరికలను జయించింది. అవును. వాస్తవంగా జయించింది. అందులో నటన లేదు. నాటకం లేదు. ఇంత కాలంగా ఏదీ కోరలేదు. తనకేదీ అక్కరలేదు. తన కెవరూ అక్కరలేదు. తానే తనలో లీనం అయింది. తనను తానే చూచుకుంది - ఆత్మ దర్శనం! అవును. అందులో ఎంత హాయి ఉంది. దూరంగా - ప్రపంచానికి దూరంగా గూడు కట్టుకొని అందులో కూర్చుంది. అది దాటి ఎన్నడూ బయటికి రాలేదు. బయట ప్రపంచం ఉందనే విషయం గ్రహించ దలచలేదు.

ఊరు పేరు విన్నది. తాను మారిపోయింది. అది చిన్న కోరిక! ఎందుకు వచ్చిందో తెలీదు. ఎలా వచ్చిందో తెలీదు - ఎక్కణ్నుంచి వచ్చిందో తెలీదు. దాన్ని అక్కడే అణచివేయాల్సింది. తనలో బలహీనత ప్రవేశించింది. ఇక్కడికి వచ్చి బూడిద చేతామనుకుంది. తానే బూడిద అయ్యేట్లుంది.

వీరభద్రాన్ని బయటికి గెంటెయ్యాలని చూచింది. తొలగదోయాలని ప్రయత్నించింది. వీరభద్రాన్ని నెట్టెయ్యాలని యాతన పడింది.

వీరభద్రం కదలడు.

నిటారుగా నుంచున్నాడు—నవ్వుతున్నాడు.

గట్టిగా కేక పెట్టాలని ప్రయత్నించింది- కేక వేయలేకపోయింది— అలసి పోయింది.

వీరభద్రం చేతులు చాచుతున్నాడు — తనను రమ్మంటున్నాడు - కౌగిట్లో ఒదిగి పొమ్మంటున్నాడు.

తాను దూరంగా పరిగెత్తాలని ప్రయత్నిస్తూంది - ప్రయత్నమే - కాళ్ళు రావడం లేదు - కాళ్ళు ఆడడంలేదు - తడబడుతూంది - వీరభద్రం వెంటాడ్డం లేదు - అక్కడే నుంచున్నాడు - చేతులు చాచి నుంచున్నాడు. వీపుకు కళ్ళున్నట్లు తన కంతా కనిపిస్తూంది.

తాను అలసిపోయింది! ముందడుగు వేయలేదు - వెనక్కు పోలేదు - వీరభద్రం ముందుకు రాడు - తాను వెనక్కుపోదు.

తాను నీరసించిపోయింది.

కదలదు—కదల్లేదు.

ఏమి గతి? ఎవరు దిక్కు!!

తలుపు తట్టిన చప్పుడయింది.

సరస్వతి తలుపు తీసింది.

రామయ్య లోనికి ప్రవేశించాడు— "ధ్యానంలో ఉన్నరా? ఎన్నిసార్లు తలుపు కొట్టినా తీయకపోతిరి?" అని లైటువేశాడు. సరస్వతిని చూచి నిర్ఘాంతపోయాడు - "ఎట్లయిన్రు" అన్నాడు. అంతే చిత్తరువులా నుంచున్నాడు.

సరస్వతి అలసినట్లుంది. వేల మైళ్లు పరిగెత్తినట్లుంది. పరిగెత్తీ పరిగెత్తి - ఓడిపడిపోయినట్లుంది. అలసట-ఓటమి-ఆమె కళ్ళలో కనిపిస్తూంది. ముఖంలో కనిపిస్తూంది. వంట్లో కనిపిస్తూంది - అణువణువునా కనిపిస్తూంది.

సరస్వతి తనను తాను చూచుకుంది. తనకే అసహ్యం కలిగించేట్లుంది తాను. కాస్త సిగ్గుపడ్డది. "ఏంలేదు" అని మాత్రం అన్నది.

"సుస్తీగున్నట్లున్నరు. జనం వచ్చిన్రు దర్శనానికి - పొమ్మందునా?"

"వద్దు. ఉండమను వస్త" సరస్వతి నోటినుంచి దూసుకు వచ్చాయి పదాలు. రామయ్య వెళ్ళిపోయాడు.

బయట భజన మొదలయింది.

ఇంతకంటే విముక్తిలేదనుకుంది సరస్వతి. ఈ నరకం నుంచి బయట పడ్డానికి జనమే శరణ్యం అనుకుంది. అలంకరించుకొని బయటికి వచ్చింది.

సరస్వతి అడుగులకు మడుగులెత్తే జనం కనిపించారు. ఒక్కసారి జనాన్ని చూచింది - వారి కళ్ళలో ఎన్ని ఆశలున్నాయి! తాను వారి ఆశలు తీర్చగలదా? తానే ఓడిపోతూంది! ఓడిపోయింది. తానేమి తీర్చగలదు!!

మోసం చేయడంలేదు గదా తాను!

మోసం. మోసం మోసం!!!

తాను నిజంగా మోసం చేస్తున్నట్లున్నది!

తాను మోసం చేస్తున్నానని చెప్పేస్తే!

"తాను మోసం! జనం మోసం! లోకం మోసం! అన్నీ మోసం! అంతా మోసం!!!" కేక వేతామనుకుంది.

కేక వేయలేదు.

తన కింతకంటే శరణ్యం లేదనుకుంది.

పులిని ఎక్కడం తేలిక! ఇంతవరకు ప్రాణాలతో పులిని ఎవడూ దిగలేదు!!

అమ్మ గద్దెపీటమీద కూర్చుంది.

జనం ఆమెకు దండాలు పెడ్తున్నారు-ఏమేమిటో కోరుకుంటున్నారు. వెళ్ళిపోతున్నారు ఒకరి తరవాత ఒకరు.

చూస్తూ కూర్చుంది "అమ్మ".

* * *

ఇల్లు నిద్రపోయింది.

ఊరు నిద్రపోయింది.

వీరభద్రం నిద్రపోలేదు—కాదు అతనికి నిద్రరాలేదు.

వీరభద్రం ఉదయం సరస్వతిని చూచాడు - అంతే—చూచిం తరవాత మారిపోయాడు. కారులో సరస్వతి వింతగా కనిపించింది - విచిత్రంగా కనిపించింది. చూచింది క్షణాలు మాత్రమే-అయినా ఆమె అతణ్ణి వదలలేదు.

వీరభద్రం సరస్వతిని చూడ్డం ఇది తొలిసారి కాదు. ఇప్పటికి అనేకసార్లు చూచాడు — అతి దగ్గరగా చూచాడు. చాలసేపు చూచాడు. మాట్లాడాడు. పోట్లాడాడు. కాని ఇలాంటి అనుభూతి ఈ మధ్య ఎన్నడూ ఎక్కడా-ఎప్పుడూ కలగలేదు.

వీరభద్రంలో ఏదో అగ్గిరవ్వ అంటుకుంది. అది సరస్వతి చూపుతో ప్రవేశించింది. సరస్వతి అలా ఎందుకు చూచింది? ప్రశ్నించుకున్నాడు వీరభద్రం. సౌమ్యంగానూ, శాంతంగానూ ఉన్న చూపుల్లోకి చిచ్చు ఎలా వచ్చింది. ఈ చిచ్చు పూర్వం ఒకసారి అంటుకుంది తనకు. అది వేరు. ఆ కాలం వేరు. అది ఉరుకులు పెడుతున్న పరువపు కాలం. అప్పుడు సరస్వతి ఒక అగ్గిపిడుగు.

ఇద్దరూ గదిలో కూర్చొని బాంబులు చేస్తున్నారు. తన పని అయిపోయింది. సరస్వతి ఇంకా పనిలో మునిగి ఉంది. తాను సరస్వతిని చూస్తున్నాడు. ఆమె తనలో అగ్గిరవ్వ రగిల్చింది. వక్షమండుతూంది.

"సరస్వతీ!" తాను పిలిచాడు.

ఆమె తలెత్తి చూచింది. ఆ చూపులో చిచ్చుంది. దహించి వేయసాగింది.

"జాంబు పేలితే ఏమౌతుంది?" తాను అడిగాడు.
"మాడ్చివేస్తుంది"
"పేలకుండానే మాడ్చేస్తున్నవు నువ్వు నన్ను"
విచిత్రంగా చూచింది సరస్వతి.
ఆ చూపులో అగ్గి ఉంది.
"ఏం చేయమంటవు?"
"మాడిపోతున్న. ఒక ముద్దిస్తవా?" అడిగాడు తాను.
నవ్వింది సరస్వతి.
"ముద్దు ఇస్తరా? తీసుకోవాలె"
అంతే. తాను ఆమెను బిగువుగా కావిలించుకున్నాడు — ముద్దుల వర్షం కురిపించాడు.
ఆ అనుభూతి! ఎంత ఆనందం ఉంది!
ఆ స్మృతులే వీరభద్రాన్ని కలచివేశాయి. ఆ సన్నివేశం ఇక్కడే ఇప్పుడే తన కళ్ళ ముందే జరుగుతున్నట్లనిపించింది.
దశాబ్దాలు గడిచిపోయాయి.
కాలం వారి ఎడ కర్కశంగా ప్రవర్తించింది.
ఉభయుల మధ్య అగ్గికొండల్ను నిలిపింది.
అయినా అది ఈనాటి అనుభూతిలా ఉంది వీరభద్రానికి.
అనుభూతికి కాలంలేదు - కాలదోషం లేదు - అది నిత్యనూతనం - నిత్య యవ్వనం!!
వయసు తిరిగి వచ్చి మనసులో మంటలు రేపుతున్నట్లుంది వీరభద్రానికి! ఆ సన్నివేశం తలచుకుంటే వళ్ల జలదరించింది. వంటిలో సెగ మొదలయింది. వళ్ల వేడెక్కింది. కళ్ల మండుతున్నాయి. నిశ్వాసాలు వేడిగా వస్తున్నాయి. రక్తంలో ఏదో చిచ్చు రగిలినట్లుంది. అది వేడిగా వేగంగా ప్రవహిస్తూంది.
వేడి ఎక్కువవుతూంది-వేగం ఎక్కువవుతూంది.
కళ్ళలోంచి పొగలు సెగలు వస్తున్నాయి.
పడుకున్న పడక చూచాడు - అదీ వేడిగా ఉంది. ఉడికిపోతూంది. ముళ్ళ మీద పడుకున్నట్లుంది. పొర్లాడు. వేడి తగ్గుతుందనుకున్నాడు - తగ్గలేదు. కప్పు తీసేశాడు. వంటికి చెమట పట్టూంది. కప్పు తడిసింది. చెమటలు కారుతున్నాయి.
గాలి ఆడడంలేదు.
మంటలు మండుతున్నాయి.
కళ్ళు తెరచి చూచాడు-చుట్టూ.
అంతా నిద్రపోతున్నారు - అర్ధరాత్రి అయింది. లేచాడు. తలుపు తీశాడు. బయటపడ్డాడు.

వెన్నెల విరుస్తూంది.

చుక్కలు వెల వెల పోతున్నాయి.

చల్లనిగాలి వీస్తూంది-అదీ వేడిగానే ఉంది వీరభద్రానికి!

అగ్గి కురుస్తున్నట్లుంది.

ఆకాశం మండుతున్నట్లుంది.

వేడిగాలులు వీస్తున్నట్లుంది.

వీరభద్రం బయల్దేరాడు. సాగిపోతున్నాడు. గమ్యంలేదు. గమనం వేగంగా ఉంది. ఊరి బయటికి చేరాడు-చెరువు కట్ట ఎక్కాడు.

చెమటలు కారుతున్నాయి.

చొక్కా తడిసింది.

రాతిమీద కూలబడ్డాడు.

స్నానం చేతామను కున్నాడు.

చెరువులోకి చూచాడు-ఎండిపోయింది-చారెడు నీళ్లులేవు. బీటలు వారి ఉంది చెరువు లోదట్టు.

చెరువు కట్టను చూచాడు-మోదుగులు కనిపించాయి. విరగబూసి ఉన్నాయి. నిప్పు కణికల్లా ఉన్నాయి.

మోదుగుపూలు చిచ్చుకు చిచ్చుపెట్టాయి.

తలపట్టుకొని కూర్చున్నాడు వీరభద్రం.

వీరభద్రం నరాల్లో వేడి పెరుగుతూంది-అవి బిగుసుకుంటున్నాయి. నరాలు చిట్లి రక్తం బయట పడేట్టుంది. ధమనులు ధనధన మంటున్నాయి. నాడి వేగం పెరుగుతూంది. గుండె వేగంగా వేవేగంగా కొట్టుకుంటూంది. ఊపిరిలో అగ్గిమంటలు కనిపిస్తున్నాయి.

వీరభద్రానికి ఏమీ తోచడంలేదు.

అతని మెదడు పనిచేయడంలేదు.

మనసు పనిచేయడంలేదు.

మనిషి మాత్రం మసలుతున్నాడు.

వీరభద్రం ఒక నిర్ణయానికి వచ్చాడు - లేచాడు - చెరచెరా సాగిపోయాడు గడీవైపు.

గడీవైపు సాగిపోతున్నాడు వీరభద్రం.

నడచిపోతున్నాడు. ఉద్రేకంలో ఉన్నాడు - వివేకం చచ్చింది. వివేచనలేదు. పోతున్నాడు. ఉద్రేకంలో నడుస్తున్నాడు. వేగంగా నడుస్తున్నాడు. వెన్నెల్లో నడుస్తు న్నాడు. కాదు - చూడండి - ఉరుకుతున్నాడు. ఉద్రేకం ఉరుకులు పెట్టిస్తూంది. అతని కంటికి ఏమీ కనిపించడంలేదు. మెదడు ఆలోచించడంలేదు. మనసు ఖావిం

చడంలేదు. గుండె దడదడ లాడుతూంది. అతని సర్వేంద్రియాలకూ కనిపిస్తున్నది ఒకే మూర్తి — సరస్వతి!!

వీరభద్రం వెనక ద్వారం నుండి గడీతోటలో ప్రవేశించాడు.

ఎందుకు ప్రవేశించాడో తెలియదు!

అక్కడ ఏముంటుందో తెలీదు!

ఏదో ఉంటుందని ఆశ ఉంది!!

చెట్టుచెట్టుకూ వెదుకుతున్నాడు - ఉరుకుతున్నాడు.

కనిపించింది సరస్వతి - నిండువెన్నెల్లో - మామిడిచెట్టు నీడలో - రాతిమీద కూర్చొని ఉంది.

వీరభద్రాన్ని చూచింది - అతనికోసమే అక్కడ వేయికళ్ళతో ఎదిరి చూస్తున్నట్లుంది!

వీరభద్రాన్ని చూచింది. లేచి నుంచుంది.

"భద్రం! కాలిపోతున్నా. మాడిపోతున్నా. చూడు — నా వళ్ళు చూడు మండిపోతూంది — రా.... రా.... నన్ను కావిలించుకో.... నేను బతకలేను. రా.... రా...."

"సరస్వతీ! నేను వస్తానని నీకెలా...."

"మాటలకు సమయం కాదు........"

వీరభద్రం సరస్వతిని గట్టిగా కావిలించుకున్నాడు........ సరస్వతి ముద్దుల వర్షం కురిపించింది.

ఇద్దరూ పెనవేసుకున్నారు - పాముల్లా చుట్టుకు పోయారు.

నిండు వెన్నెట్లో - మామిడిచెట్టు నీడన వారు ఏదో ఆనందంలో మునిగి పోయారు.

వారికి లోకం ఉన్నదీ తెలియదు.

వారెక్కడ ఉన్నదీ తెలీదు.

పక్కన గడీ ఉందని తెలీదు.

గడీలో భక్తులున్నారని తెలీదు.

ఊరుందని తెలీదు—ఊళ్లో మనుషులున్నారని తెలీదు.

లోకమంతా తామేనను కున్నారు.

లోకంలో మరొకరు లేరనుకున్నారు.

తామే ఒకలోకం — తమదే ఒకలోకం అన్నట్లు ప్రవర్తించారు — అనుభవించారు — అనుభవిస్తున్నారు.

"పాము!!!" ఎగిరి గంతేసింది సరస్వతి - బట్టల్లేవు - వెన్నెల - ఏదీ గమనించలేదు - వణికిపోతూంది.

వెనక్కు జరిగి చూచాడు వీరభద్రం!

పాము - నాగుబాము - పడగవిప్పి - పడగ ఎత్తి ఉంది.

వీరభద్రం పామును చూచాడు - వెన్నెట్లో సరస్వతిని చూచాడు - ఉద్రేకం ఉద్వేగం పొంగాయి. భయం వచ్చింది.

ఆ దశలో ఏ కిరాతకానికైనా ఒడిగట్టగలడు మనిషి!

వీరభద్రం ఒక పెద్దబండ తీసి పాము పడగమీద వేశాడు.

పడగచితికింది - రక్తం కారింది - పాము తోక ఆడిస్తూంది.

సరస్వతి పామును చూచింది.

రాతికింద నలిగిన పడగను చూచింది.

చిక్కనిరక్తం బండకిందినుంచి వ్యాపించడం చూచింది.

ఒడలు జల్లుమంది.

ఉద్రేకం చిగజారిపోయింది.

తనను చూచుకుంది-బట్టల్లేవు-బట్టబయట నుంచుంది-తనకు తానే అసహ్యం అనిపించింది-సిగ్గుతో కుంగిపోయింది. ఉరికింది - బట్ట అందుకుంది-మీద వేసుకుంది-వెనక్కు తిరిగి గడిలోకి పరిగెత్తుతూంది.

వీరభద్రం నిర్విణ్ణుడై చూచాడు లిప్తపాటు.

ఉరికాడు ఆమె వెంట - "సరస్వతీ! సరస్వతీ!" అంటూ.

చీర భుజాలమీదనుంచి జారవేసుకున్న సరస్వతి వెనక్కు తిరిగి నుంచుంది.

వీరభద్రం ఆమె ఎదుటికి వచ్చి ఆగిపోయాడు.

"భద్రం! నన్ను నాశనం చేశావు-బూడిద చేశావు-నన్ను వెంటాడకు. నన్ను బతకనీ-నువ్వే గెల్చావు-సరేనా! గెల్చావు భద్రం! గెల్చావు - బతకనీ నన్ను-ఇదిగో చేతులు జోడిస్తున్నా" చేతులు జోడించి ఏడుస్తూ అన్నది సరస్వతి.

వీరభద్రం సమాధానానికి చూడలేదు - వెనక్కు తిరిగి ఏడుస్తూ వేగంగా పరిగెత్తింది గడిలోకి సరస్వతి.

వెన్నెల కాస్తూనే ఉంది.

మామిళ్ళకింద చీకట్లు మగ్గుతూనే ఉన్నాయి.

ఊరు నిద్రపోతూనే ఉంది.

వీరభద్రం నిర్విణ్ణుడై సరస్వతి పోయినవైపు చూస్తూ నుంచున్నాడు.

"గెల్చావు భద్రం - గెల్చావు" సరస్వతి మాటలు ఇంకా వినిపిస్తున్నాయి. ఏమిటి తనగెల్పు! ఎక్కడ తనగెల్పు? గెల్చాడా తాను? ఓడిపోయాడు - పూర్తిగా-చిత్తుగా. తనకు గెలుపులేదు. ఓటమితప్ప! బ్రతుకంతా పరాజయాలే! అంతా ఓటమి! తన బతుకే ఓటమి!! తాను ఓటమి!!! సరస్వతికి అన్నింటా గెల్పు.... అంతా గెలుపు-అసలు సరస్వతే గెలుపు!!!

ఈ లోకంలోకి వచ్చాడు భద్రం! తానెక్కడున్నాడో గ్రహించాడు. వెనక్కు తిరిగి చరచరా నడిచిపోయాడు. చప్పున ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఆగిపోయాడు.

వెనక్కు నడిచాడు - మామిడిచెట్టు కిందికి! అక్కడ సరస్వతి బాబతు బట్టలు మరి కొన్ని పడివున్నాయి. అందుకున్నాడు. పక్కకు చూచాడు.

పడగచితికిన పాము కనిపించింది.

అప్పటికి రక్తం ముద్దపారింది. కారడంలేదు. చచ్చిన పామును సరస్వతి అంగాలో మూటకట్టాడు. మూట తీసుకొని సాగిపోయాడు.

అది తరతరాలుగా గడిలో ఉంటున్న పాము-అది అక్కడ చచ్చిపడి ఉంటే ఎలాంటి పరిణామాలు వస్తాయో గ్రహించాడు వీరభద్రం!

సరస్వతి "అమ్మ!" "మాత!!" అన్నీ నిజమే-ఇలాంటి వాటిదగ్గర జనం సహించరు. అందుకే ఆమె బట్టలూ తీసుకొని బయల్దేరాడు.

వీరభద్రం చెరువు కట్ట ఎక్కాడు-దిగాడు. నడిచాడు-చాలదూరం నడిచాడు. ఒక గోతిలో ఆ మూటవేశాడు. పైనుంచి రాళ్ళువేశాడు-ఒకటి-రెండు-మూడు - చాలి వేశాడు. పైనుంచి మట్టికప్పాడు. అక్కడే రాతిమీద కూర్చున్నాడు.

ఆకాశం చూశాడు—నిర్మలంగా ఉంది.

రాతిని చూచాడు—నున్నగా ఉంది.

గోతిని చూచాడు—మట్టిలా ఉంది.

ఒక నిట్టూర్పు విడిచాడు వీరభద్రం! జేబు తడుముకుంటే సిగరెట్టు పెట్టె కనిపించింది. అప్పుడుగాని అతనికి సిగరెట్టు కాల్చాలనే ఆలోచన రాలేదు.

సిగరెట్టు వెలిగించాడు.

పొగ వదిలాడు.

అక్కడే కూర్చున్నాడు.

సరస్వతి ఉరికి ఉరికి గదిలోకివచ్చి గడియవేసి, మంచంలో పడిపోయింది. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఆమె గుండె చప్పుళ్ళు ఆమెకే వినిపిస్తున్నాయి! ఏదో భయంభయంగా ఉంది. దొంగతనంచేసి పారివచ్చినట్లుంది. హత్యచేసి పరారయినట్లుంది. ఆమె అలసినట్లుంది - ఆరాటంలో ఉంది. ఆవేదనలో ఉంది.

సరస్వతి మనసు నీరుబాసిన చేపలా కొట్టుకుంటూంది. మెలి పెడ్తూంది — మెలికలు తిరుగుతూంది. ఏం చేసింది తాను? ఎవరు తాను? తాను 'అమ్మ'. తనను దేవతగా చూస్తున్నారు జనం? ఏం చేసింది తాను? తానేం చేసింది? హీనకార్యానికి-నీచకార్యానికి దిగింది. దిగిపోయింది. కూరుకొని పోతూంది. పోతూంది తాను - మట్టిలోకి పోతూంది. భూమిలోకి దిగి పోతూంది! ఎంత హీనమైన పనిచేసింది!

సరస్వతికి పాతాళంలో పడిపోయినట్లనిపించింది. చీకటి - కటిక చీకట్లో కొట్టుకుంటున్నట్లుంది. బురద — గలీజు — అసహ్యం. అందులో కూరుకుపోయింది. వంటినిండా మురికి - కుళ్ళు. అందులోంచి తప్పుకోవాలని చూస్తూంది. పైకి ఎగబాకాలని చూస్తూంది. పాకుడు. కాళ్ళు జారుతున్నాయి — మనిషి అలసిపోయింది.

చెమటలు కక్కుతూంది. శక్తి సొంతం జారిపోయింది. అరంగుళం ఎక్కలేదు. రొప్పుతూంది. తనుస్తూంది. ఆయాసపడ్తూంది. అయినా జరగడంలేదు.. కూరుకు పోయింది మురికిలో - కుళ్ళలో - కుళద్దంలో!

ఆకాశంలో ఉరిమింది. ఆ ఉరుము సరస్వతి గుండెలో పలికింది. దడుచుకుంది. ఎవరో తనను బెదిరిస్తున్నట్లనిపించింది. భయపెట్టినట్లనిపించింది. కళ్ళు తెరిచి చూచింది. తాను మంచంలో పడి ఉంది. తలుపు మూసి ఉంది. ఉక్క పోస్తూంది. బయట వాన చప్పుడు వినిపిస్తూంది. కిటికీ తెరచింది. ఆకాశంలో తటిల్లత మెరిసింది. అది ఆమె కళ్ళల్లో మెరిసింది. కళ్ళు మూసుకుంది. చీకట్లు కమ్మినట్లయింది. కళ్ళు తెరిచి చూచింది. జోరున వాన పడుతూంది. కాలవలు పారుతున్నాయి. తోటలోంచి వచ్చిన కాలవ బయటిదాంట్లో పడి పారిపోతూంది. ఎంత వేగం నీటిది! ఎక్కడా ఆగదది!! ఉరికిపోతూంది. ఊరవతల చెరువులో పడాల్సిందే!! గమ్యం చేరేదాకా నిలవదు నీరు. మరి తాను! తన గమ్యం ఏది? ఎక్కడ? ఎటు!!

మెరుపు మెరిసింది-ఆమె రూపులో తోటలోని మామిళ్ళు కనిపించాయి! సరస్వతి మనోఫలకంమీద ఒక దృశ్యం మెరిసింది.

నిండు వెన్నెల!

మామిడిచెట్టు నీడ!

తనను పెనవేసుకున్న వీరభద్రం!!!

ఉరుమువిని అదిరిపడ్డది సరస్వతి - వానను చూడలేకపోయింది. కిటికీ తలుపుమూసి మంచంలో పడిపోయింది.

తలుపుతట్టిన చప్పుడయింది. విన్నది సరస్వతి. విననట్లే నటించింది. తలుపు తట్టేది రామయ్య అని ఆమెకు తెలుసు. కాని ఈ స్థితిలో రామయ్యకు కనిపించదలచలేదు. తట్టిన చప్పుడు చాలసార్లు అయింది. సరస్వతి ఉలకలేదు పలకలేదు.

సరస్వతి సమాధిలో ఉందనుకున్నాడు రామయ్య. ఆమెకు అంతరాయం కలిగించదలచలేదతను - వెళ్ళిపోయాడు. సరస్వతి పడేయాతన అతనికి తెలీదు. ఆరోజంతా వానకురిసింది. వానవల్ల అమ్మ దర్శనం కాలేదనుకున్నారు జనం!

సాయంకాలానికి వాన తగ్గింది.

సరస్వతిని చూచిన బలరామయ్య, రామయ్య చకితులయినారు.

సరస్వతి కళ్ళుపీక్కుపోయాయి - వాటిల్లో కాంతిలేదు.

ముఖం వెలవెలబోతూంది - దానిలో కళలేదు.

బలరామయ్యకు అమ్మ కాళ్లు పట్టుకోబుద్ధి కాలేదు. అయినా పట్టుకున్నాతను - పట్టుకోకుంటే ఏం జరుగుతుందోనని భయం అతనికి! అయినా సరస్వతి

ముఖంలో ఆ సౌమ్యత కనిపించలేదతనికి! శాంతి లభించలేదు. ఏదో అశాంతిగానే చక్రాలకుర్చీని దొర్లించుకొని వెళ్ళిపోయాడు.

రామయ్యకేదో అనుమానం కలిగింది. అతను సరస్వతిని రెప్పవాల్చకుండ చూచాడు. సరస్వతి ఆ చూపు తట్టుకోలేకపోయింది - రెప్పలు వాల్చుకుంది. భయం దిగంబరంగా కనిపిస్తూంది ఆమె ముఖంలో!

రామయ్య అనుమానం బలపడ్తూంది-గట్టిపడ్తూంది!

"అమ్మా! రాత్రి......." తరవాత మాట్లాడలేదు రామయ్య.

ఆ మాటకే అదిరి పోయింది సరస్వతి. కళ్ళల్లో భయం కాల్వలు కట్టింది.

"అమ్మ" ఏడ్వడం! రామయ్య కేమీ అర్థంకాలేదు. క్షణం చలించినట్లయినాడు. స్థిరపడ్డాడు.

"ఎవరికీ చెప్పను. ఎరకకానివ్వను" రామయ్య అన్నాడు.

సరస్వతి ముఖంలో మబ్బులు విడిపోయినట్లయినాయి. అయినా గుండెల దడలు కళ్ళలో కనిపిస్తున్నాయి.

"ఒక్క సహాయం చేయాలె" రామయ్య ఏదో షరతు పెడ్తున్నాడు. గ్రహించి సరస్వతి చెప్పమన్నట్లు కళ్ళతో చూచింది.

"నన్ను మంత్రిని చేయాలె" రామయ్య తుపాకిగుండు పేల్చాడు.

అది సరస్వతి గుండెలోంచి దూసుకుపోయింది. గుండె విలవిలలాడింది. రామయ్యను చూస్తే అసహ్యం అనిపించింది. ఇందుకోసమే రామయ్య ఇంతకాలంగా తనకు సేవచేస్తున్నా డనిపించింది. రామయ్య ముఖంమీద కాండ్రించి ఊయాలనిపించింది. కాని తానిప్పుడు రామయ్య వలలో చిక్కిన పక్షి. అతని చేతి కీలుబొమ్మ. అతడు ఎటు తిప్పితే అటు తిరగాలి. తాను నిస్సహాయురాలు - అందుకే అడిగింది - "ఎలా" అని.

"మీరు చెప్పితే ముఖ్యమంత్రి వింటడు - ఇది పొక్కనియ్యను. మీరు ఈ పని చేసిపెట్టాలె"

"అలాగే. ఇహ ఇక్కడ ఉండను. రేపే ప్రయాణం" ఆమె పలుకుల్లో ఏదో ఆదేశం - ఆజ్ఞ వినిపించాయి రామయ్యకు.

"అట్లనే" అని రామయ్య వెళ్ళిపోయాడు.

అనుకోకుండా "అమ్మ" ప్రయాణం కావడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది - ముఖ్యంగా శివరావుకు. శివరావు సన్యాసిగా మారాడు. నిజమే కాని మిగిలిన ఒకే ఒక గీత విషయంలో అతడు మమకారం చంపుకోలేకపోయాడు — అమెరికా వెళ్ళిపోయేముందు గీతను మంగమ్మకు అప్పగించి వెళ్ళాలనుకున్నాడు. ఆ పని వెళ్ళిపోయేరోజు చేయాలనుకున్నాడు. మంగమ్మను అర్థించడం రోజురోజుకూ వాయిదా వేయడంలో అంతర్యం శివరావు మంగమ్మకు ముఖం చూపించలేకపోవడం. మంగమ్మ భర్త జగ్గయ్యను తన ముందున్న చెట్టుకే వేలాడదీయించి కొట్టించాడు.

ఉరుకుతున్న జగ్గయ్యను తుపాకితో కాల్చి చంపాడు! శవాన్ని ఈ ఊరికే తెచ్చారు. అప్పుడు తాను కిరాతకుడిగా ప్రవర్తించాడు. మంగమ్మకు తీరని ద్రోహం చేశాడు. అందుకు ఫలితం అనుభవించాడు. అందరినీ పోగొట్టుకున్నాడు. మిగిలింది ఒక్క గీత. ఆమెకోసం మంగమ్మను అర్థించాలి. మంగమ్మ తన ముఖం చూస్తుందా? పలకరిస్తే పలుకుతుందా? తన విన్నపం మన్నిస్తుందా? ఇన్ని ఆలోచనలతో ఇంత కాలం మిన్నకున్నాడు. ఇంక సమయంలేదు. అందుకే బయల్దేరాడు.

మధ్యాహ్నం. మండు టెండ. కావి బట్టల్తో కమండలధారియై బయల్దేరాడు శివానందస్వామి. గడీదగ్గర తప్ప ఊరంతా సందడి లేకుండా ఉంది. కాకులు - పక్షులు చెట్లమీద కూర్చొని నోళ్ళుతెరిచి తనుస్తున్నాయి. శివానందుడు ఒంటరిగా సాగిపోతున్నాడు - ఎడారిలాంటి వీధుల్లోంచి. మల్లయ్య ఇల్లు కనిపెట్టి కాస్త దూరంగా చింతచెట్టుకింద నుంచున్నాడు. వాకిలిముందు ఎవరూ కనిపించలేదు. ఇంట్లో ఎవరైనా ఉన్నారో లేరో అనుమానంగా ఉంది. ఒక్క మనిషికూడా వీధిలో కనిపించలేదు. ఎలా మంగమ్మను పిలిపించడం? ఆలోచిస్తూ నుంచున్నాడు శివానందుడు. చెట్టుమీది పిట్ట రెట్టవేసింది- శివానందుని తలమీద. వెచ్చగా తలమీద పడడంతో తల పైకెత్తి చూచాడు. పిట్టలు కిచకిచమంటున్నాయి — కాకులు కావు కావు మంటున్నాయి. కోపం వచ్చింది స్వామికి. ఆ కోపంలో బోడితలమీంచి మెడ మీదికి కారినరెట్ట కనిపించలేదు. క్షణంలో అర్థం అయింది. పైపంచెతో తల తుడుచుకుంటుండగా గీత కేక వినిపించింది.

"డాడీ" అని కేక పెట్టి తండ్రివైపు గంతువేసింది గీత.

శివానందుడు పైపంచెతో తల తుడుచుకొని చూచేవరకు గీత దగ్గిరకి వచ్చేసింది-మీదపడేట్టుంది. అడుగు వెనక్కువేసి "ఆగమ్మా! అక్కడే ఆగు" అని చేయిచాచాడు.

చప్పున నిలిచిపోయింది. గీత చేతులు చాచి "డాడీ" అన్నది. ఆ ధ్వనిలో దుఃఖం ఉంది. గొంతు పూడుకొనిపోతూంది.

గీత పెరిగింది తండ్రి ఒడిలో - ఆమెకు మాతృప్రేమ తెలియదు. అలాంటి తండ్రి ఆమెను దూరంగా ఉండమంటున్నాడు! ఆ పసిగుండెలో ఎన్ని తుపానులు రేగాయో! ఎంత దుఃఖం పొంగిపొర్లిందో ఎలా చెప్పడం? నిశ్చేతనంగా చేతులు చాచుకుని కన్నీరు కారుస్తూ నుంచుండి పోయింది.

శివానందస్వామి గుండె చెరువైంది.

"అమ్మా! నేనిప్పుడు సన్యాసిని — నువ్వు దూరంగానే ఉండాలి" గొంతు పెకిలించుకొని వచ్చిన శివరావు మాటలవి.

"డాడీ!" కేకవేసి బావురుమంది గీత.

గీత కేకకు పరిగెత్తుకొని వచ్చారు - మంగమ్మా - ప్రకాశం - పిచ్చమ్మా!

పరిగెత్తి వచ్చిన వారు చింతచెట్టు కింద దృశ్యంచూచి నిర్విణ్ణులై నుంచుండి పోయారు.

మంగమ్మ శివానందుని చూస్తూంది.

శివానందుడు మంగమ్మను చూస్తున్నాడు.

కొన్ని లిప్తలపాటు మౌనం వెలిసింది.

చెట్టుమీద కాకులు కాట్లాడు కుంటున్నాయి.

"మంగమ్మ తల్లీ! మీ ఇంటి ముందుకు భిక్ష అడగడానికి వచ్చాను" అని కొంగు చాచాడు శివానందుడు.

మంగమ్మ మండిపడ్డది "నా మగణ్ని కాల్చి చంపినవు. నా కుంకుమ కాలి రాచినవు. నా కొంపకు చిచ్చుపెట్టినవు. నా గుండెలో అగ్గిపెట్టినవు. ఈ ఊరిని బూడిద చేసినవు. ఊది గాలికి ఎగరేసినవు. మళ్ళ ఎందుకొచ్చినవు ఇక్కడికి? ఇంక ఎంత మందిని మింగుతవు. పో ఇక్కణ్ణుంచి."

"మంగమ్మ తల్లీ నేను ఆ దుర్మార్గుడు శివరావును కానమ్మా! సన్యాసిని శివానందుణ్ణి. నన్ను మన్నించు నాకు భిక్ష పెట్టు"

"వేషాలు మార్చుకుంటున్నారు. దొంగవేషాలు వేస్తున్నారు. ఏ వేషంతో పలుకుబడి కలుగుతే ఆ వేషం వేస్తున్నారు. పోలీసుగా ఉండంగ ఎందుకు సన్యాసి కాలేదు. పింఛను తీసుకొని తీరికగా సన్యాసి కావలసివచ్చిందా? నా దగ్గర ఈ వేషాలు సాగవు. ఈ జీవితం అడుగడుగునా దెబ్బలుతిని కాయలు కాసింది. మనసు నిండా గాయాలు ఇంకా పచ్చిగనే ఉన్నయి. రక్తం ఒడుస్తునే ఉన్నది. నన్ను మోసం చేయలేవు. చేయలేవు" మంగమ్మ మాటల్లోంచి పొగలు శగలు లేస్తున్నాయి.

శివానందుడు తలవంచుకున్నాడు. పైపంచె తలమీంచి ముఖం మీదికి జార విడిచాడు.

మౌనం.

అందరూ మౌనంగా ఉన్నారు - అందరి మనసుల్లో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. ఆలోచనలు శబ్దాలుగా మారలేకపోతున్నాయి.

"అంకుల్" ప్రకాశం మాటవిని తలమీద గుడ్డతీశాడు శివానందుడు – తుడిచినట్లున్నాయి అతని కళ్ళు. కనురెప్పలు ఇంకా పచ్చిగానే ఉన్నాయి - ప్రకాశాన్ని చూచాడు.

"బిడ్డను దగ్గరికి తీయలేని సన్యాసం ఎందుకు అంకుల్?"

ప్రకాశం ప్రశ్న బల్లెంలా గుచ్చుకుంది శివానందునికి. నిరుత్తరుడయినాడు. కళ్ళు ఎండిపోయాయి.

"ప్రకాశం!" అని ప్రకాశం బుజంమీద తలపెట్టి పెద్దగా ఏడ్చింది గీత.

శివానందుడు ఒక అడుగు ముందుకు వేశాడు – చప్పున రెండడుగులు వెనక్కు వేశాడు. తన ముందున్న దృశ్యం చూడలేక పోయాడు. తల పైకెత్తాడు–

ఆకాశంతో ఉన్నవాడికి చెప్పుకుందామని - చింతచెట్టు దానిమీద కాకులు కనిపించాయి.

వడగాలి వేగంగా వీచింది.

సుడిగాలి దుమ్మును తీసుకొని సుళ్ళు తిరుగుతూ ఆకాశం వైపు ఎగిరిపోయింది.

అలాగే ఉంది శివానందస్వామి మనసుకూడా — పెద్దపెద్ద అంగలు వేస్తూ కొన్ని వలయాలు తిరుగుదా మనుకున్నాడు. సాహసించ లేకపోయాడు.

"దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః

వీతరాగ భయక్రోధః స యోగీ మునిరుచ్యతే." గీతలోని శ్లోకం మననం చేసుకున్నాడు. పెదవుల కదలిక సహితం కనిపించలేదు. పాషాణంలా నుంచున్నాడు శివరావు.

గీత ఎక్కెక్కి ఏడుస్తూంది.

కొండలు కరిగేట్టుంది ఆమె ఏడ్పు-గుండెలు కరగడం గొప్పా!

"ఏడవకు తల్లీ" అని దగ్గరకు తీసుకుంది మంగమ్మ. "వీళ్ళు రాళ్ళు. మనుషులుకారు. పోలీసులైనా, సన్యాసులయినా అంతే గీతా! నీకు తండ్రి లేడనుకో! ఇవ్వాళనుంచి తల్లినయినా తండ్రినైనా నీకు నేనే" అని గీతను దగ్గరికి తీసుకుంది.

"అమ్మా!" అని మంగమ్మను పెనవేసుకొని ఏడ్చింది గీత. తల నిమురుతున్న మంగమ్మ కన్నీరు గీత తలమీద రాలింది.

మంగమ్మ శివానందుని చూసింది.

ముఖంమీద గుడ్డకప్పుకొని నుంచుని ఉన్నాడు.

"ఎందుకున్నవు ఇక్కడ ఇంక పో" మంగమ్మ గర్జించింది. గీత తండ్రి వైపు చూచింది.

శివానందుడు ముఖం మీంచి గుడ్డతీశాడు - ముఖం కన్నీటితో తడిసి ఉంది.

"మంగమ్మ తల్లీ! నిన్ను ఈ భిక్ష అడగడానికే వచ్చానమ్మా? గీతను నీకు అప్పగించి వెళ్తున్నాను" అని చేతులు జోడించి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ గడీవైపు సాగిపోతున్నాడు శివానందుడు.

చకితురాలై చూడసాగింది మంగమ్మ.

"డాడీ" అని పెద్ద కేకవేసి రెండడుగులు ముందుకు వేసి వెనక్కు తిరిగి మంగమ్మను కావిలించుకుని భోరుమంది గీత.

శివరావు తిరిగిచూడలేదు.

సాగిపోయాడు.

* * *

"అమ్మ" అలా తొందరపడి వెళ్ళిపోవడం సుమతికేమంత బాగనిపించలేదు. "అమ్మ" మరికొన్నాళ్ళుంటే ఆమే సేవలు చేయాలనుకుంది. తానూ కొన్ని "వరాలు"

అడగాలనుకుంది. తన కోరికలు తీర్చుకోవాలనుకుంది. గాంధీని చూస్తే ఆమె కెందుకో భయంగా ఉంది. గాంధీకి గాలి తిరుగుళ్ళు ఎక్కువయినాయి. శలవు లయినా ఇంటిపట్టున ఉండడంలేదు. గాంధీకి స్కూటరు వచ్చింది. అతడు సుమారు పట్నంలోనే ఉంటున్నాడు. ఎప్పుడో వచ్చినా ధుమధుమలాడ్డం - డబ్బుతీసుకొని వెళ్ళిపోవడం తప్ప అతడు సుమతి కొడుకులా కాక పరాయివాడిలా ప్రవర్తిస్తున్నాడు. సుమతి ఎంత దగ్గరికిపోతే గాంధీ అంతదూరం అవుతున్నాడు. రామయ్య మాట సరేసరి. గాంధీ తన కొడుకు కానట్లే ప్రవర్తిస్తున్నాడు. గాంధీని కాస్త మందలించమంటె సుమతి మీదకే "ఖస్సు" మని లేస్తున్నాడు. రామయ్యకు రాజకీయం తప్ప మరేమీ కనిపించడంలేదు. భార్య ఉందనికాని బిడ్డ ఉన్నాడనిగాని గుర్తే ఉన్నట్టులేదు. ఏదో పూనకం పూనినట్టు ప్రవర్తిస్తున్నాడు. తనవాళ్ళనేవాళ్ళు లేక పరితపించి పోతూంది సుమతి. అంత పెద్ద ఇంట్లో తానొక్కర్తే బిక్కు-బిక్కుమంటూ ఉంటూంది. పైగా ప్రకాశం విషయంలో రామయ్య శ్రద్ధ తీసుకుంటున్నాడనే అనుమానం హృదయంలో శల్యంలా పనిచేస్తూంది. ఈ శరపంజరంనుండి తనకు విముక్తి కలిగించమని రోజూ శివుని గుడికి వెళ్ళి ప్రార్థిస్తూంది. భజనలు, పూజలు చేయిస్తూనే ఉంది. అయినా ఫలితం కనిపించలేదు. ఆ ఫలితం, "అమ్మ" వల్ల కలుగుతుందని ఆశించింది - ఎన్నో ఆశలు పెంచుకుంది. హటాత్తుగా "అమ్మ" వెళ్ళిపోతూందంటే పెంచుకున్న ఆశలన్నీ కుప్పగా కూలిపోతున్నట్లనిపించింది. అయినా నిరాశ చెందలేదు. ఏదో విధంగా ఏకాంతంగా "అమ్మ"ను కలుసుకోవాలనుకుంది. గాంధీని అమ్మదగ్గరికి తీసికెళ్లాలనుకుంది.

ఆ రోజంతా సుమతి గడీలోనే ఉంది. ఉరుకులు పరుగులతో "అమ్మ"కు సపర్యలు చేసింది. గడీలో ఉన్నా గాంధీ రాకను వేయికళ్ళతో కనిపెడ్తూనే ఉంది. పొద్దుకుంకి పోతూంది. గాంధీ జాడలేదు. ఆమె మనసులో ఆరాటం మొదలయింది. ఈ రాత్రికూడా రాడేమోనని భయం పట్టుకుంది. మనిషిని పట్నం పంపించింది. ఇంటికివచ్చి కళ్ళలో వత్తులు వేసుకొని చూడసాగింది.

సాయంకాలం అయింది.

చీకట్లు కమ్మాయి.

దీపాలు పెట్టారు.

గాంధీ రాలేదు.

తెల్లవారి "అమ్మ" వెళ్ళిపోతూంది.

సుమతి కాలుకాలిన పిల్లిలా ఇంట్లోంచి బయటికి, బయటినుంచి ఇంట్లోకి తిరుగుతూంది. ఆమె గుండె దడదడ లాడుతూంది. దుఃఖం ముంచుకుని వస్తూంది. వాకిట్లో కారు ఆగిన చప్పుడయింది. వాకిటిదాకా పరిగెత్తింది-గాంధీ దిగాడు. తాను పంపినవాడు వెంట ఉన్నాడు - మనసు కొంత స్థిమితపడింది.

గాంధీ కారుదిగాడు-తూలుతున్నాడు. తూలుతూనే మెట్లెక్కాడు. గుమ్మంలో నుంచున్న సుమతి పక్కకు ఒదిగింది. తల్లిని చూచినట్లేలేదు గాంధీ-ఇంట్లోకి వెళ్లిపోయాడు. సుమతి అలాగే నుంచుండి పోయింది. ఆమెలో దుఃఖం పొర్లిందో-సంతోషం చిగిరించిందో చెప్పలేం కాని ఒక చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వుకు అర్థా లెన్నో!

సుమతికి రామయ్య రావడం కనిపించింది. గుమ్మం పట్టుకుని చూస్తూ నుంచుంది. రామయ్యా వచ్చాడు. కారెక్కాడు. కారు సాగిపోయింది. చూస్తూ నుంచుంది. కారు గడీవైపు సాగలేదు. పట్నం దోవ పట్టింది. ఆమె కేదో ఉత్సాహం పొంగింది. ధైర్యం వచ్చింది. "అమ్మ" తన మార్గం సుగమం చేసిందనుకుంది. గబగబా లోనికి వెళ్ళిపోయింది.

గాంధీ మంచంలో పడివున్నాడు. నిద్రపోవడంలేదు. కాని చిరాగ్గా ఉన్నాడు. సుమతి సమీపించింది.

"ఎందుకు పిలిచినవ్?" చిరాగ్గా అడిగాడు గాంధీ.

"అమ్మ దర్శనం చేసుకుందువుగాని లే" సుమతి తలనిమురుతూ అనునయించింది.

"నువ్వు అమ్మవు కావా?"

"మీ నాయనమ్మ "అమ్మ" అయింది. అందరికి వరాలిస్తున్నది. పోదాం పా"

"నా కేమీ వద్దు. నేను రాను"

గాంధీ వచ్చేటట్లులేదు - రామయ్య వచ్చినట్లున్నాడు. సుమతిలో ఆతురత పెరుగుతూంది. తుదకు గాంధీకి డబ్బు ఆశ చూపి తన వెంట తీసుకొని బయల్దేరింది. గడీ ప్రశాంతంగా ఉంది. అంతా నిద్రపోలేదు. కొందరు మేలికగా ఉన్నారు. లైట్లుమాత్రం వెలుగుతునే ఉన్నాయి. సుమతి గాంధీని తీసుకొని గబగబా సరస్వతి గది దగ్గరికిపోయింది. వేరే ఆలోచించకుండా తలుపు తట్టింది. లోన సరస్వతికి నిద్రపట్టలేదు కాబట్టి తలుపు తీసింది. మామూలుగా నయితే సమాధిలో ఉండాల్సిన సమయం.

సరస్వతి చిరునవ్వు నవ్వింది.

సుమతి గాంధీని తీసుకొని లోన ప్రవేశించింది. గాంధీని "అమ్మ"కు మొక్కమన్నది. వెనక ముందాడాడు గాంధీ. చివరకు అంటీ అంటనట్లు కాళ్ళు తాకి దండం పెట్టాడు.

"అమ్మ" పలకలేదు.

"వీడు గాంధీ-మీరే పేరు పెట్టింది" సుమతి అన్నది.

"అలాగా?" అన్నట్లు చూచింది "అమ్మ".

"వీడు బాగుపడాలె. మీరు బాగుచేయాలె. దీవించాలె"

"బాగుపడు బాబూ!" అమ్మ పలికింది.

తృప్తికలుగలేదు సుమతికి. "తలమీద చేయిపెట్టి దీవించండి" దీనంగా అడిగింది.

"అమ్మ" అలాగే చేసింది.

"ఇగ నేను పోత" అని గాంధీ లేచాడు. ఎవరినీ అడక్కుండానే గుమ్మం దాటి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ గుమ్మంవైపు చూస్తూ ఉండిపోయారు.

"పేరు తప్పు పెట్టినట్టున్నాం. వీడు గాంధీ పేరుకు మచ్చ తెచ్చేస్తున్నాడు" "అమ్మ" అన్నది.

"అట్లేంకాదు. మీరు దీవించిన్రుకద" సుమతి పలుకుల్లో ఏదో దృఢవిశ్వాసం గోచరించింది - అది "అమ్మ"కే ఆశ్చర్యం కలిగించింది.

సుమతి లేచి గది తలుపువేసి వచ్చింది. తనగోడు సాంతం వినిపించింది - తొలిరేయినుండి నేడు గాంధీని తీసుకురావడం వరకు - సంక్షిప్తంగా.

"అమ్మ" అన్నీ విన్నది. పలకలేదు. ఉలకలేదు. ప్రశ్నించలేదు.

"మస్తాన్ను చంపించిండు. మల్లయ్య బూమి గుంజుకున్నడు-కరణపోణ్ని చంపించిండు. హుస్సేన్ను జేలుకు పంపిండు. వాని పెండ్లం నవిసి నవిసి చచ్చింది. ఇన్ని పాపాలు ఊరికే పోతాయియుండి. కట్టి కుడుపుతున్నాయి. పోరడట్లయిండు. నా గతి ఇట్లయింది. ఆయనకు అనుమానం వదుల్తలేదు. ఉన్నది చాలదా? కట్టుకు పోతమా అంటే ఇనడు. అందరు పగోండ్లయితే ఎట్ల బతుకుతం మీరే చెప్పండి. ఇప్పుడేమొ మంత్రి పూనకం పూనింది. ఈన మంత్రయితె తల్లికొడుకులం నాశనం అయినట్లే. మీరు నన్ను రక్షించాలె. ఆయన మంత్రి కాకుండా చూడాలె" సుమతి ముగించింది. అమ్మ ముఖం చూస్తూ కూచుంది.

"అమ్మ" ఆలోచనలో పడిపోయింది. రామయ్య పనులు ఒక్కొక్కటి కళ్ళ ముందు తిరగసాగేయి. భూదానం భూమిని గురించి తాను యాచించింది. తిరస్కరించాడు రామయ్య. సుమతి చెప్పిందాంట్లో న్యాయం ఉంది. సరే. ఆమెను తనను గురించి ఆలోచించుకుంది-కాని రామయ్య మంత్రి అవుతే దేశాన్ని నాశనం చేస్తాడు!! కాని వాడి చేతిలో కీలుబొమ్మ తానిప్పుడు. వాడు చెప్పినట్లు వినాలి. త్వరలో ఈ దేశం విడిచిపోవాలనుకుంది. ఎంత తొందరగా అవుతే అంత మంచిది.

"కొంగు చాచి అడుగుతున్న" అమ్మ మాట్లాడక పోవడం చూచి దీనంగా అన్నది సుమతి. "ఇట్లచేస్తే ఆయన్ను బతకనీయరు. నా పసుపు కుంకుమ కాపాడండి".

సుమతి దగ్గుత్తుక విని లోకంలోకి వచ్చింది సరస్వతి. "ఏం చేయమంటావు నన్ను?" అడిగింది.

"ఏది చేసినా మీరే చేయాలె. మీ మీద నమ్మకం ఉన్నది నాకు. ఆయన

మంత్రి కాకుండ చూడుండి. అంతేచాలు. మీరు ముఖ్యమంత్రితో చెప్పండి. ఆయన మీ మాట తప్పడట. ఈ మేలు చేసిపెట్టండి. ఇంకేం వద్దు. ఏమంటరు?"

"అలాగే" అని కళ్ళు మూసుకుంది సరస్వతి. మాట్లాడ దలచక కళ్ళు మూసుకుంది. మల్లియ్య కనిపించాడు. చేతులు జోడించుకుని అంటున్నాడు. "అమ్మా! సరస్వతమ్మా! దండం తల్లీ! నువ్వు దేవతవు. నాకు బిచ్చం వద్దమ్మా! ఈ రెక్కలున్నయి. ఈ పోరడున్నడు. బతుకుతం తల్లీ" మల్లియ్య దేవునిలా కనిపించాడు. తన దర్శనానికి ఎంతోమంది వచ్చారు. ఎన్నో వరాలు అడిగారు. కాని మల్లియ్య కనిపించలేదు. మల్లియ్య ఎందుకు వస్తాడు? అతడు స్వయంగా దేవుడు. ఆశలను జయించిన అగ్నిహోత్రుడు! మరి రామయ్య???

సరస్వతి మరి ఆలోచించలేక పోయింది.

సరస్వతి ధ్యానంలో ఉందనుకుంది సుమతి-లేచి వెళ్ళిపోయింది.

ప్రయాణానికి సన్నాహాలు జరిగాయి. బాజాలు వచ్చాయి. మేళతాళాలు మ్రోగాయి. జీపులు వచ్చాయి. కార్లు వచ్చాయి. జనలు సాగాయి. భజనం తండోప తండాలుగా గడీ ముందు కూడారు.

"అమ్మ" వచ్చేసింది. అలంకరించుకుంది. నొసట ఎర్రని కుంకుమ బొట్టుతో వెలిగిపోతూంది. భజనలకు జోరు హెచ్చింది. మేళతాళాలు బాగా మ్రోగాయి. జనం పూలదండల్లో "అమ్మ"ను ముంచెత్తారు. ఆమె మెట్లమీద నుంచుంది. చిన్నా, పెద్దా అంతా ఆమె పాదా లంటి మొక్కుకున్నారు. "అమ్మ" కదిలింది. కారెక్కింది. కారుసాగింది.

బలరామయ్యను తెచ్చి జీపులో కూర్చోపెట్టారు. బలరామయ్య తన గడీని చూచాడు. అది లంకలా కనిపించింది. ఆ మహాసౌధాన్ని తానే కట్టించాడు. ఆ స్థలంలోనే తాను పుట్టాడు - పెరిగాడు - పెద్దవాడయినాడు - రాజభోగాలు అనుభవించాడు. రాజ్యం చేశాడు! ఇవ్వాళ గడీ బోలుగా కనిపిస్తూంది - బోసిగా కనిపిస్తూంది. రిక్తంగా కనిపిస్తూంది. బోనులా కనిపిస్తూంది. వంటరిగా నుంచొని ఏడ్చే విధవగా కనిపిస్తూంది. ఆనాడు తన భార్య, ఆడబాపలు, బిడ్డలు, దాసదాసీలు! ఎందరుండేవారు తనకు. ఇవ్వాళ! తాను వంటరిగాడు – అశక్తుడు! అవిటివాడు. తనకు ఎవరూ లేరు. ఎవరున్నారు తనకు? ఎవరూలేరు. బొందిలో ప్రాణం ఉంది అంతే. సరస్వతి తనకు భార్యగా వచ్చింది "అమ్మ" అయిపోయింది! ఆమె తనకేమవుతుంది? ఏమీకాదు. ఆమె దేవత. ఎవరికీ ఏమీకాదు. ఆమె రక్షణలోనే తాను ఈమాత్రం ఉన్నాడు.

జీపు కదిలింది. గడీ కదిలింది. జీపు సాగుతూంది. గడీ దూరం అవుతూంది. గడీనే చూస్తున్నాడు బలరామయ్య. తన ప్రాణం తనకు దూరం అవుతున్నట్లనిపిస్తూంది. విలవిల లాడాడు. మళ్ళీ ఈ గడీని చూస్తానా? ఈ నేలను తాకుతానా? అనుకునేవరకు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. తన బాధ ఎవరితోనైనా చెప్పుకుందా మను

కున్నాడు. పక్కకు చూచాడు. ఎవరూ లేరు. అవును తాను వంటరిగాడు. అనాధ. దిక్కులేనివాడు. తన కెవరున్నారు? పడిపోయిన కాలూ చేయీ చూచుకున్నాడు. దుఃఖం ముంచికొని వచ్చింది. కుమిలి కుమిలి ఏడ్వసాగాడు.

ఊరేగింపు సాగిపోతూంది. అమ్మ కారు సాగిపోతూంది. "అమ్మ" మల్లయ్య ఇంటివైపు చూచింది. అక్కడెవరూలేరు. తలుపువేసి ఉంది. ఈ అడావుడి ఆ ఇంటికేమీ పట్టినట్లులేదు. "అమ్మ" మనసు కుంగింది. ఆ ఇల్లు ఆమె మనసులో నిలిచింది.

శివరావు మల్లయ్య ఇంటి ముందు కొన్ని క్షణాలు నుంచున్నాడు. తలుపు తెరవలేదు. ఎవరూ బయటికి రాలేదు. గబగబా నడిచి భజన బృందంలో చేరి భజన సాగించాడు.

"అమ్మ" పట్నంచేరింది. ఆశ్రమంచేరింది. మళ్ళీ మామూలు అడావుడి సాగింది. "అమ్మ"ను తీసికెళ్ళడానికి అమెరికానుంచి భక్తులు వచ్చారు. దాంతో ప్రచారం మరింత సాగింది. ఇసుకవేస్తే రాలని జనం కూడారు. రేయింబవళ్ళు నిర్విరామంగా జనసందర్షం సాగింది. మంత్రులు, అధికార్లు, సంపన్నులు అక్కడే మకాం వేశారు — ఎంచాతంటె అమ్మ ఎన్నోరోజులు ఇక్కడ ఉండడంలేదు.

"అమ్మ" విమానాశ్రయానికి చేరింది. "అమ్మ"కు వీడ్కోలు చెప్పడానికి పట్నం అక్కడికి తరలింది. రామయ్య అడావుడిలో ఉన్నాడు. ముఖ్యమంత్రిని కలిసి ఏదో మాట్లాడాడు. అతన్ని "అమ్మ" దగ్గరికి తీసికెళ్ళాడు. అంతా రహస్యంగా జరిగిపోయింది.

విమానం వాలింది. "అమ్మ" ఎక్కింది. బలరామయ్యను ఎక్కించారు. శివానందస్వామి, ఇతర అమెరికా భక్తులు ఎక్కారు.

విమానం కదిలింది. ముందు ఉరికింది — లేచింది. ఎగిరిపోయింది.

భక్తులంతా విమానం పోయినదిశకు దండం పెట్టారు.

చాలసేపు దండం పెట్టినవాళ్ళలో రామయ్య ఒకడు.

* * *

రామయ్య మంత్రి కావడంతో శేషయ్య సంతోషానికి అంతులేదు. శేషయ్య చేసిన సంబరాలకు లెక్కలేదు. తొలుత అతడు చేసిన పని "అమ్మ" పటాలకు బంగారు ప్రేమువేయించి ఒకటి మంత్రి ఇంట్లో మంత్రి కూర్చునే చోట - అతనికి ఎదురుగా ఉండేట్లు తగిలించడం. రెండోది తన ఇంటి డ్రాయింగురూములో పెట్టించాడు. ప్రత్యేకంగా దండలల్లించాడు పటాలకోసం — పట్టుదారాలతో — వాడిపోకుండేట్లు. రంగు రంగుల దండ అది. లావైన దండ అది. మెరిసిపోతున్న దండ అది. హారం 'అమ్మ' మెడలో వేస్తుంటే పొంగిపోయాడు రామయ్యమంత్రి. శేషయ్యను కౌగిలించుకొని కృతజ్ఞత తెలియ పరిచాడు. శేషయ్య సలహా మేరకు ఒక పెద్ద మొత్తం అమెరికా పంపించాడు రామయ్యమంత్రి — అమ్మకు కానుకగా.

శేషయ్య అంతటితో ఊరుకోలేదు — కనీవినీ ఎరుగని విందులు ఏర్పాటుచేశాడు రామయ్య గౌరవార్థం. I. A. S. అధికారులే అలాంటి విందు అంతవరకు కుడువ లేదని ఆశ్చర్యంగా చెప్పుకున్నారు ఆఫీసుల్లో. రామయ్య మంత్రికి శేషయ్య మంత్రి అయినాడు. మంత్రాంగం సాగించాడు. రామయ్యకు శేషయ్య మరో ప్రాణం అయినాడు.

రామయ్య మంత్రి కావటంతో మిక్కిలి దుఃఖించింది సుమతి. రేడియోలో వార్తవినగానే ముందు రేడియో కట్టేసింది. ఆ వార్త ఆమెకు నెత్తిన బండ పెట్టిన ట్లనిపించింది. కళ్ళవెంట టపటపా కన్నీరు రాలింది. కన్నీరు వేడిగా ఉంది — అది తొడమీద రాలినపుడు తెలిసింది సుమతికి. సుమతి లేచింది. ఆమె జుట్టు విడివడింది - ముడివదిలింది - జుట్టు చెదిరింది. విరిసింది. ఆమె కన్నీరు ఆరి పోయింది - ఇంకిపోయింది. కళ్ళు ఎర్రవారేయి - చింతనిప్పుల్లా ఉన్నాయి. సుమతి గోడను చూచింది - గోడనున్న పటంచూచింది - పటంలోని "అమ్మ"ను చూచింది. చరచరా నడిచి గోడదగ్గరికి వెళ్ళింది. పటాన్ని లాగాలనుకుంది - చేతికి అందలేదు ఎత్తుగా ఉంది. మునికాళ్ళమీద లేచింది. అయినా అందలేదు.

"అమ్మ" నవ్వుతూంది.

సుమతి మండిపడింది. మూలన వున్న కర్ర అందుకొంది. పటాన్ని బద్దలు కొట్టింది. అద్దం పగిలి ముక్కలు ముక్కలయి 'కణకణ' మని నేలరాలింది. ఆ చప్పుడుకు పనివాళ్ళంతా పరిగెత్తుకు వచ్చారు. సుమతిని చూచి బొమ్మల్లా దూరంగా నుంచుండి పోయారు.

సుమతి కర్రదెబ్బకు అద్దం పగిలింది - కాని పటం చిరగలేదు. మరోదెబ్బ కొట్టింది - ఇంకోదెబ్బ కొట్టింది - పటం తిరగటంలేదు - నేలకూలడంలేదు.

అలసిపోయింది సుమతి.

ముఖం నిండా చెమటలు పట్టాయి.

ముఖం తుడుచుకొని పక్కకు చూచింది. పనివాళ్లు ప్రతిమల్లా నిలిచి ఉన్నారు. మండిపడింది.

"చూస్తరేం. ఊడపీకండి" గర్జించింది.

పని మనుషులు ఒకళ్ళ ముఖాలు ఒకరు చూచుకున్నారు.

"మీకే చెప్పేడిది ఊడపీకండి పటాన్ని" గాండ్రించింది.

ఒక్కడూ—ఒక్కతె—అడుగు ముందుకు నేయలేదు.

"అట్లనా?" అని కర్ర తీసుకొని పటంమీద దబీ, దబీ బాదింది. పటం ఊడి నేలమీద పడింది. కర్ర పారేసింది సుమతి. పటాన్ని అందుకొని పరపరా చించే సింది. ఆ ముక్కలు ఒక నౌకరుకు ఇచ్చి "తీస్కపోయి పొయిల పడెయ్యి" అన్నది.

పనివాళ్ళు తలలు వంచుకొని వెళ్ళిపోయారు.

సుమతి తలపట్టుకొని పరిగెత్తి, తన గదిలో దూరి తలుపు వేసుకుంది.

"చూసిన్నా ఎటువంటోండ్లు మంత్రులవుతున్నారో" పత్రిక తల్లి ముఖానకొట్టి ఉరిమాడు ప్రకాశం. మంగమ్మ నివ్వెరపోయి, గుడ్లప్పచెప్పి కొడుకును చూడ సాగింది. ప్రకాశం ఊగిపోతున్నాడు. మాటలు కాదు — మంటలు కక్కుతున్నాడు. "కూచోండి గోళ్ళుగిల్లుకుంటూ. కూచోండి నేలకంటుకొండి. కూచోండి జేళ్ళల్లో - కూచోండి హత్యలు లెక్కిస్తూ — కూచోండి చుక్కలు లెక్కిస్తూ — కూచోండి ఓట్లు లెక్కిస్తూ. వస్తుంది విప్లవం. ఊరికోసం ప్రాణాలర్పించిన జగ్గయ్యకేం దక్కింది? దేశంకోసం ప్రాణాలొడ్డి తుపాకిపట్టి పోరిన వీరుల కేందక్కింది? ఎన్ని కల్లో గెలుస్తామని పోరిన మస్తాన్ ఏడి? అన్యాయంగా జేలుకుపోయి ప్రజలపక్షాన నిలిచిన మంగమ్మకేం దక్కింది? నేలనూ న్యాయాన్నీ నమ్ముకున్న మల్లియ్య ఏమై నాడు? తిండిలేక, చేసుకోవడానికి పనిదొరక్క డొక్కలుమాడి జనం చస్తుంటే నోటిముందరి తిండి కొట్టేసిన జనం నాయకులవుతున్నారు — మంత్రులవుతున్నారు. పేకాటను నమ్ముకున్న శేషయ్య ఇవ్వాళ కార్మిక నాయకుడు! సారాయిని నమ్ము కున్న యాదగిరి లక్షాధికారి! ప్రజల్ను నమ్ముకున్న మంగమ్మ కుంగిపోతూంది. నేలను నమ్ముకున్న మల్లియ్య కూటికి అలమటిస్తున్నాడు. ప్రజలసొమ్ము దొంగ తనంగా తెచ్చి, కరణం ఆస్తి కాచేసి, ముసలమ్మ ప్రాణాలు తీసి, పరాంకుశరావును హత్యచేయించి, హుసేన్ను జేలుకుపంపి, బూబమ్మను పొట్టను పెట్టుకున్న రామయ్య మంత్రి అయినాడు."

"ఏమీ! రామయ్య మంత్రి అయిండు!" దిగ్గున లేచింది మంగమ్మ. నడుం కట్టుకట్టి గుమ్మం దాకా ఉరికింది. ఎదురుగా వస్తున్న మల్లియ్య తాకాడు—"రామయ్య మంత్రయిండట" అన్నాడు.

"అవును. అయిండట" అని కూలబడ్డ మంగమ్మ రెండుచేతుల్తోనూ నేలను అణచసాగింది. ఆ బలానికి నేల కుంగిపోతుందనుకుంది — పిచ్చి మంగమ్మ.

యాదగిరికి భయం పట్టుకుంది. అతడు చేసుకుంటున్నది బలరామయ్య భూములు. రామయ్య ఆ భూములు లాక్కుంటాడేమోనని భయం అతనిది. రామయ్యంటే చాలాకాలం నుంచి చుక్కెదురే యాదగిరికి. కాని ఇప్పుడు రామయ్య మంత్రి రామయ్య. అందుకే ఊళ్లో రామయ్య మంత్రికి సన్మానానికి ఏర్పాట్లు చేస్తున్నాడు.

ఊళ్ళో గుసగుసలు బయలుదేరాయి. అంతా ప్రాణాలు గుప్పెట్లో పట్టు కున్నారు. ఏదో అవాంతరం రానున్నదని ఎదిరి చూడసాగారు.

యలమంద, సైదయ్య మంగమ్మ దగ్గరికి వచ్చారు. అందరూ ఒక చిన్న సమావేశం చేశారు—అది సంతాప సభలా జరిగింది. సమావేశం ముగిసింది. ఎవరి ముఖాల్లోనూ తెలివిలేదు. అంతా తలలు వంచుకొని వెళ్ళిపోయారు.

పరీక్షా ఫలితాలు వచ్చాయి. ప్రకాశం, గీత ఫస్టులో పాసైనారు. గీత పత్రికలో నెంబరు మూడు నాలుగుసార్లు చూచుకుంది. తలవంచుకుంది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"డాడీ ఉంటే.... ..." మాటమింగేసింది గీత – గొంతు బొంగురుపోయింది.

"గీతా!" అన్నారు మంగమ్మ, ప్రకాశం ఒకేసారి.

"అవును అత్తమ్మా! మానాన్న ఉంటే........" అని మంగమ్మను కావిలించు కొని భోరుమంది గీత. మంగమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

ప్రకాశం చూస్తూ నుంచున్నాడు.

మంగమ్మ గీత తల నిమురుతూ అన్నది "వాళ్ళు రాక్షసులమ్మా! మను షుల్ను చంపి పాపాలు చేస్తారు. వాటిని కడుక్కోటానికి సన్యాసులవుతరు. దేశం విడిచి వెళ్ళిపోతారు. వాండ్లకు మమత, మమకారం ఏం తెలుస్తయి?"

"మా నాన్న అలాంటివాడుకాడు అత్తమ్మా" అని కళ్ళు తుడుచుకొని దూరంగా జరిగి నుంచుంది గీత.

ప్రకాశం ఏదో అనబోయాడు. తల్లి కళ్ళతో వారిస్తే మానేశాడు.

సాయంకాలం అయింది. నిప్పులు కురిసిన సూర్యుడు నీల్గిపడమటి కౌగిట్లో ఒదిగిపోతున్నాడు. గీతా, ప్రకాశం చెరువువైపు బయల్దేరారు. గాలిలో కొంత చల్లదనం ఏర్పడింది. చెరువుకట్ట ఎక్కిదిగారు. రామయ్య మామిడితోట విరగ కాసింది. బాగా పండిన పండ్లు కనిపిస్తున్నాయి.

"పళ్ళు బాగా ముదిరిపోయాయి. ఏమౌతాయి?" తోటవైపు చూపించి అడిగింది గీత.

"పండుతే రాల్తయి" ప్రకాశం జవాబు చెప్పాడు.

"రాలాలంటే పండాల్సిందేనా?"

"అవసరం లేదు. రాళ్ళుకొడ్తే రాల్తాయి."

గీత రాయి అందుకుంది. కాని తోటను చూచి వదిలేసింది - అది దూరంగా ఉంది - అందులోనూ రామయ్యది.

ప్రకాశం నవ్వాడు "ఏం కొట్టవేం?" అడిగాడు.

"దూరం ఉంది–గురి దొరకదు"

"దూరం ఉన్నా గురి కుదరాలె" అని ఒక రాయి అందుకున్నాడు ప్రకాశం. "అదిగో చూసినవా ఆ దూరాన ఉన్నరాయి! దాని చివరన మచ్చ కనిపిస్తూందా?– దానికి కొడ్తా చూడు" అని గురి చూచి లాగి విసిరాడు రాతిని ప్రకాశం. రాయి సరిగ్గా ప్రకాశం చూపిన చోటనే తగిలి నిప్పురవ్వలు లేచాయి.

"బాగా కొట్టావు ప్రకాశం" అని చేతులు పట్టుకొని ఊపింది గీత.

ఇద్దరూ పరుపుబండమీద కూర్చున్నారు. గురిచూసి రాళ్ళు కొడ్తున్నారు. పశువుల్ను తోలుకు పోతున్న కోటయ్య వారిని చూచి ఉరికి వచ్చాడు. "పెద్ద

చదువులకు పోతున్నరటగద – డాక్టర్లయితరా! ఇంజనీర్లయితరా?" ఉత్సాహంగా అడిగాడు.

"ఏం కమ్మంటావు కోటయ్యా" చేతితో రాతినిరాస్తూ అడిగింది.

"మీరు డాక్టర్లు కావాలె"

"అయితే?" ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"అయితే మీదగ్గర కొలువుంట. యాదగిరి దెబ్బలు తప్పతయి!"

"కోటయ్యా!" గీత స్వరంలో ఆవేదన గోచరించింది.

"అంతేనుండీ! అట్లకాకుంటే ఎన్నడో యాదగిరి చేతుల్నే చస్త" అని వెనక్కు చూస్తే పల్లావు పరిగెడుతూంది. కర్ర ఎత్తి కేకలేస్తూ పరిగెత్తాడు కోటయ్య.

"విన్నావా ప్రకాశం!" గీత గొంతులోని ఆవేదన దుఃఖంగా మారింది – ఆమె కర్ర ఎత్తి పరిగెత్తుతున్న కోటయ్యను చూస్తూనే ఉంది. కోటయ్య పల్లావును మళ్ళించాడు – మందలో కలిపాడు. మందతో కోటయ్య సాగిపోయాడు.

"గీతా! కోటయ్యలు ఈ దేశంలో కోట్లకొద్ది ఉన్నారు. పొట్టకూటి కోసం పశువుల్లా అమ్ముడు పోయినవాళ్ళు, కూటికోసం తిట్లుతిని, తన్నులుతిని, తుదకు ప్రాణాలను బలిపెట్టినవాళ్లు, రోజూ హింసలకు గురియై పెదవి కదపలేక గుండెల మంటలారక ఎదురుతిరిగి హత్య చేయబడ్డవాళ్ళు, తిండి అడిగినందుకు, జీతాలు పెంచమన్నందుకూ తుపాకి గుళ్ళకు గురియై కూలినవాళ్ళు, వీళ్ళే గీతా భారత ప్రజలు – వీళ్ళే భారతీయులు! వీళ్ళకోసం మనం ఏం చేయగలం?"

"ఏదైనా చేయాలి"

"విప్లవం రావాలె గీతా విప్లవం – సాయుధ విప్లవం. ప్రజలు తుపాకులు ధరించి రామయ్యలను, శేషయ్యలను, యాదగిరులను వెంటాడి కాల్చిచంపాలె. వారు కుక్కల్లా చావాలె. వారిని ముక్కలు ముక్కలుగా కోసి కాకులకు గద్దలకు వేయాలె. ఆనాడే కోటయ్యలకు విముక్తి. భారతజాతికి విముక్తి. మనకు విముక్తి."

గీత లేచి పిడికిలి బిగించి "విప్లవం వర్ధిల్లాలి. సాయుధ విప్లవం వర్ధిల్లాలి" కేక పెట్టింది.

గీత ముఖం ఎరుపెక్కింది. కళ్ళు ఎరుపెక్కాయి. పెదవి అదురుతూంది. కాళ్ళుచేతులు కదిలిపోతున్నాయి.

గీతను చూచి ఉద్రేకం పెరిగింది. తన చేతిని గీత చేత్తో కలిపి ఎత్తి "చైర్మన్ మావో జిందాబాద్" గట్టిగా కేక పెట్టాడు ప్రకాశం.

"విప్లవం వర్ధిల్లాలి. సాయుధ విప్లవం వర్ధిల్లాలి"

జంటగొంతులు నినాదా లిచ్చాయి.

కొండలూ, కోనలూ మారుపలికాయి.

కట్టెలమోపు ఎత్తుకొనిపోతున్న సైదయ్య మోపు కిందపడేసి, గొడ్డలి ఎత్తి "జిందాబాద్" అన్నాడు.

"గొడ్డలి ఎత్తాల్నానుండి?" అడిగాడు సైదయ్య.

"ఎత్తాలి, సైదయ్యా, ఎత్తాలి" గీత గట్టిగా అన్నది.

"చెప్పండి ఎవర్ని నరకాల్నో. నరికి జేలుకు పోతా"

"సైదయ్యా! నీకు తుపాకి కొట్టవస్తుందా?" ప్రకాశం అడిగాడు.

"వస్తదుండి – జరజర"

"నేర్పుతవా?"

"తుపాకులేయుండి?"

"వస్తాయిగాని నేర్పగలవా?"

"నేర్పుతగని మల్లయ్యకు బాగ కొట్టొస్తదుండి – దళంలో పనిచేసింతు కాదుండి"

"అట్లనా?" అని లేచాడు ప్రకాశం. గీత అనుసరించింది. కట్టెలమోపు నెత్తిన పెట్టుకొని, గొడ్డలి బుజానికి వేసుకొని బయల్దేరాడు సైదయ్య.

చీకటిపడింది. చుక్కల వెలుగుమాత్రం ఉంది. ముగ్గురూ సాగిపోతున్నారు – ముందు సైదయ్య మధ్యన గీత వెనుక ప్రకాశం. ఎవరూ మాట్లాడలేదు. మౌనంగా నడిచారు. ఇద్దరినీ ఇంటిదగ్గర వదిలి వెళ్ళిపోయాడు సైదయ్య.

* * *

కాలేజీలో ప్రవేశించడానికి పట్నం చేరుకున్నారు గీత, ప్రకాశం. మంగమ్మ వారి వెంట రాలేదు. పల్లెలోనే ఉండిపోతానంది.

రామయ్యమంత్రి కాక ముందు గాంధీ పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేదు – మంత్రి అయిం తర్వాత పాసైనాడు!

కాలేజీ అడ్మిషన్ కోసం క్యూలో నుంచున్నాడు ప్రకాశం. 'క్యూ' హనుమంతునితోకలా పెరుగుతూంది. గుమాస్తా నత్తగుల్లలా పనిచేస్తున్నాడు. నుంచున్న వారి కాళ్ళు పీక్కోపోతున్నాయి. ఎండ మండిపోతూంది. చమటలు పడ్తున్నాయి. దాహానికి సహితం వరుసలోంచి కదిలేట్లు లేదు. క్యూ మెల్లిగా కదులుతూంది. నుంచున్న వారికి విసుగు కలుగుతూంది. గునుస్తున్నారు. లోలోన కొందరు, బయటికి కొందరు తిట్టుకుంటున్నారు.

ఒక కారు వచ్చి నిలిచింది. దానికి సర్కారు జండా ఉంది. చప్రాసీ ముందు సీటు లోంచి దిగాడు. వెనక తలుపు తెరిచాడు. గాంధీ దిగాడు. గాంధీ వెంట శేషయ్య దిగాడు. ఉభయులూ గదివైపు నడిచారు.

"మేం ఇక్కడ నిలుగు తున్నాం – వాళ్ళు పోతున్నారు" ఒకతను గునిశాడు.

"వాళ్ళకూడా క్యూలోకి రావాలి" ప్రకాశం కేక పెట్టాడు.

గాంధీ క్షణం నుంచొని చూచాడు. వెక్కిరించాడు. సాగిపోయాడు.

శేషయ్య గదితలుపు తెరుచుకొని లోన అడుగు పెట్టాడో లేదో ''ఆగండి'' కేక వినిపించింది. శేషయ్య వినిపించుకోలేదు.

''మేమూ మనుషులమే. ఉదయంనుంచి నిలుగుతున్నాం. మీకేం కొమ్ములొచ్చేవు. బయటికి రండి — రాకుంటె లాగుతాం'' కేకపెట్టాడు ప్రకాశం.

విద్యార్థుల్లో ఉత్సాహం పొంగింది. ఉద్రేకం పొర్లింది.

''రాండి బయటికి — గుంజుతాం బయటికి'' కేకలు పెట్టారు.

వీళ్ళ కేకలు పెడ్తునే ఉన్నారు. గుమాస్తా గాంధీకి సంబంధించిన కాగితాలు రాస్తూనే ఉన్నాడు.

యువకుల్లో ఆరాటం ఎక్కువవుతూంది.

"చూస్తారేం — గుంజండి" ప్రకాశం గదివైపు లంఘించాడు. క్యూ చెదిరిపోయి గుంపు గది తలుపుమీద పడింది.

వెంటనే గది గడియ వేసుకున్నాడు శేషయ్య.

గాంధీ గుడ్లు మిటకరించి చూస్తున్నాడు.

గుమాస్తా కాగితాలన్నీ గట్టిగా పట్టుకొని "పోలీస్ — పోలీస్" అని కేకలు పెడ్తున్నాడు.

"రాండి—గుంజుతాం" అని కుర్రాళ్ళ తలుపుల మీద గుద్దుతున్నారు.

"దొంగలు—వెళ్ళండి బయటికి" అరుస్తున్నారు కొందరు.

తలుపులు బద్దలయ్యేట్లున్నాయి.

లోని వారు వణికి పోతున్నారు.

బయటి వారి ఉద్రేకం పెరుగుతూంది-విజయోత్సాహంతో కేరింతలు పెడ్తున్నారు.

తలుపులు ఊడుతున్నాయి—ఊగుతున్నాయి—విరుగుతున్నాయి.

పోలీసు లారీలు వచ్చాయి. పోలీసుల లాఠీలు విద్యార్థులమీద పడ్డాయి. విద్యార్థులు చెదిరిపోయారు. కాని దూరంగా పోయి గుమికూడారు.

"న్యాయం కోరితే లాఠీలు పడ్తాయా? వాళ్ళ ఫీజుకట్టే విడిచేదిలేదు. తలలు పగిలినా ఫరవాలేదు" అన్న ప్రకాశం "పదండి ముందుకు" అని కదిలాడు.

గుంపు కదిలింది.

పోలీసులు అటకాయించారు.

"దొంగల్ను పట్టడానికా—మీరు మమ్మల్ని పట్టడానికా?" ప్రకాశం పోలీసు అధికారిని సూటిగా ప్రశ్నించాడు.

అధికారి కాస్త తత్తర పడ్డాడు. ప్రకాశాన్ని చూచాడు. ఏదో గౌరవం ఏర్పడింది. చిరునవ్వు నవ్వాడు. జవాబు చెప్పలేదు - భుజం చరిచాడు.

శేషయ్యా—గాంధీ గదినుంచి బయటపడ్డారు- వెంట పోలీసులున్నారు.

"ఫీజు కట్టిపోతున్నారు - దొంగలు" కుర్రాళ్ళు కేకలు వేశారు. ఉద్రేకం పెరుగుతూంది-దూసుకు వచ్చేస్తున్నారు.

పోలీసు అధికారి ముందుకు సాగాడు - శేషయ్యతో ఏదో మాట్లాడుతున్నాడు-సంజ్ఞలు మాత్రం కనిపిస్తున్నాయి ప్రకాశానికి – కుర్రాళ్ళకు – గోలచేసూనే ఉన్నారు.

గాంధీ-శేషయ్యా కారెక్కారు.

ఫీజు కట్టలేదని చేతులెత్తి ఊపి చూపాడు అధికారి.

విద్యార్థుల్లో ఉత్సాహం వెల్లివిరిసింది.

ప్రకాశాన్ని ఎత్తుకొని ఎగిరారు - గంతులు వేశారు - ఈలలు వేశారు.

"ప్రకాశానికీ జై" అన్నారు.

"ప్రకాశం జిందాబాద్" అన్నారు మరికొందరు.

"ఇన్కిలాబ్ జిందాబాద్" అన్నాడు ప్రకాశం.

"విప్లవం వర్ధిల్లాలి" ప్రకాశం నినాదం ఇచ్చాడు.

తెల్లవారి ఫీజు చెల్లించే కౌంటర్లు పెంచారు. విద్యార్థులకు కొన్ని సౌకర్యాలు కూడా చేశారు.

ప్రకాశం దగ్గరికి గుంపులు గుంపులుగావచ్చి విద్యార్థులు అభినందిస్తున్నారు. అతని ధైర్యాన్ని మెచ్చుకుంటున్నారు.

మెచ్చుకోవాలో, నొచ్చుకోవాలో తెలియంది రామయ్యకు. రామయ్య "బాపూజీ కసాయిదుకాణం" ప్రారంభోత్సవం చేసి వస్తుండగా శేషయ్య వివరించాడు. ప్రకాశం అంటే పట్టరాని ఆగ్రహం పట్టింది శేషయ్యకు. లొడితెడులేడు తననే ఎదిరించాడు! ఏమనుకున్నాడో తనను గురించి వాడు! కనీసం తన ఊరివాణ్ణని అయినా గ్రహించ లేదు. కుర్రకారును వెంటేసుకుని తనను అవమానించాడు. మంగమ్మా అంతే – అన్నింటికీ కస్సుమని లేస్తుంది. తల్లిపోలికలే వచ్చినట్లున్నాయి! నాడు తాను మంగ మ్మను బలపరచాడు – అవును. అది రాజకీయ చదరంగం! రామయ్య బలరామయ్య మాట వినలేదు–అప్పుడు బలరామయ్య మంత్రి. ఊళ్ళో బలరామయ్య పార్టీ బల పడాలని ఆదేశించాడు బలరామయ్య. అందుకు మంగమ్మ బలాన్ని ఆశ్రయించాడు-కాని ఇప్పుడు పరిస్థితులు తారుమారయ్యాయి. తనకిప్పుడు మంగమ్మతో పనిలేదు. ఏరు దాటిం తరవాత తెప్ప ఉంచకూడదు – కాల్చెయ్యాలి. అదీ రాజకీయం. ప్రకాశం తలబిరుసుదనం పెరిగిపోతూంది. దాన్ని అరికట్టాలి అనుకున్నాడు శేషయ్య. కారులో వస్తూనే అంటించాడు.

"పోరనికి శాన పొగరు పెరిగిందుండి. విద్యార్థులను మన చేతులో లేకుండ చేసేటట్లున్నడు. వాండ్లతో మనకు శాన పనులుంటయి. వీడుంటె వాండ్లు వినెటట్లు లేరు. సీటు దొరకకుండ చేస్తేగాని రోగం కుదరదు."

శేషయ్య చెప్పిందంతా వింటున్నాడు రామయ్య. కాని పెదవి కదపలేదు. ఇల్లు రావడంతో దిగిపోయాడు రామయ్య. మౌనంగా మెట్లెక్కి లోనికి వెళ్ళిపోయాడు. శేషయ్య దిగాలుపడి చూడసాగాడు—కార్లో కూర్చొని గట్టిగా తలుపేశాడు. కారు సాగిపోయింది.

రామయ్యకు ఎవరెవరి దగ్గర్నుంచో టెలిఫోన్లు వచ్చాయని చెప్పాడు పి. ఏ. లేరని చెప్పమని పై అంతస్తుకు వెళ్ళిపోయాడు. పడకగదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు. మంచంలో వాలిపోయి కళ్ళుమూసుకున్నాడు. ప్రకాశం కనిపించాడు – చేతులు కట్టుకొని నుంచున్నాడు—మంగమ్మ కనిపించింది—ఈనాటి మంగమ్మకాదు—ఆనాటి మంగమ్మ—తన ఇంట్లో మంగమ్మ. తానేం చేశాడు మంగమ్మను! ఆ చేసిన ఫలితమే ఈ ప్రకాశం!

ప్రకాశం తన కొడుకు!

తన కొడుకు ప్రకాశం!!

తాను ప్రకాశం తండ్రి!!!

ప్రకాశం రామయ్య కొడుకు!

శేషయ్య ఏమన్నాడు? ప్రకాశానికి సీటులేకుండా చేయమని! చేయగలడు తాను! అదొక పనికాదు తనకు! ఒక్క టెలిఫోను చాలు—ప్రిన్సిపాల్‌ను పిలిపించి చెప్పొచ్చు—తాను మంత్రి ఇప్పుడు!

కాని ఎవరికి సీటు లేకుండా చేయడం? తన కొడుక్కే—తన రక్తం పంచుకొని పుట్టినవాడికి! ఇదేనా తాను చేయవలసిన ఘనకార్యం!

ప్రకాశాన్ని పిలిచి తన దగ్గర ఉంచుకుంటే! రహస్యాలన్నీ చెప్పేస్తే! కుదరదు! కూడదు!! తన తప్పు వీరభద్రం మీద నెట్టాడు! జనం నమ్మారు—వీరభద్రం మంగమ్మను పెండ్లాడాడు! ప్రకాశం వీరభద్రం కొడుకు! వీరభద్రం తనకు ప్రత్యర్థి—మంగమ్మ తనకు ప్రత్యర్థి! ప్రకాశాన్ని ఎలా తెచ్చుకుంటాడు తాను! తన గోత్రాలు బయట పడ్తాయి! తన రంగు వెలిసిపోతుంది!

ప్రకాశం వీరభద్రం కొడుకు!

ఆ మాట తల్చుకునే వరకు రామయ్య కళ్ళలో నీళ్ళు నిలిచాయి. తన కొడుకును కొడుకు అనుకోలేని ఈ సంపద, ఈ పదవి, ఈ అధికారం ఎందుకు? ఎందుకు! ఎందుకు!!!

తలుపు తట్టిన చప్పుడయింది. తలుపు తెరిచాడు – వంటమనిషి! భోజనానికి పిలవడానికి వచ్చింది. రానన్నాడు. గాంధీ వచ్చి కూర్చున్నాడని చెప్పింది. 'వాణ్ని తినమను' అని తలుపేసుకున్నాడు.

తలుపేసుకుని సిగరెట్టు కాల్చాడు! గాంధీ కనిపించాడు – గాంధీ! వీడెవడు? వీడు తన కొడుకేనా వాస్తవంగా! తొలిరేయి కళ్ళలో మసిలింది – సుమతి వాంతి

చేసుకుంది! తరవాత జరిగినవన్నీ ఒకదాని తరవాత ఒకటి మనోఫలకంమీద వెలిసి మాయం అయినాయి.

సుమతి!

సుమతికి తానంటె అభిమానంలేదు — గౌరవంలేదు — ప్రేమలేదు. తాను సుమతిని ప్రేమించలేదు — ఆమె ఆస్తిని కట్టుకున్నాడు. ఆ మాట అడుగుతే కన్నీరు కారుస్తుంది — వాస్తవం చెప్పదు. రమ్మంటే రానన్నది - పట్నంలో మకాం పెట్టనన్నది. తానంటే ఈర్ష్య ఆమెకు. ఆమె రాకపోవడం తనకు తలవంపులుగానే ఉంది. అయినా తనేం చేయలేడు. సుమతి విషయంలో అనుమానం ఉంది తనకు - కొండంత.

గాంధీ తన కొడుకుకాడు - ముమ్మాటికీ కాడు.

గాంధీ తన ఇంట్లో ఉన్నాడు - తన కొడుకుగా చలామణి అవుతున్నాడు. వాడికోసం తన కొడుక్కు సీటులేకుండా చేయాలా? జీవితం ఎంత వింత అయింది! విచిత్రం అయింది!! తాను అనుకుంటున్న దేమిటి? చేస్తున్నదేమి? ఎన్ని బంధాలు - ఎన్ని నిర్బంధాలు - ఎన్ని దిగ్బంధాలు!!

జీవితానిది ఏం తప్పు? తానే అన్నీ చేశాడు - చేసుకున్నాడు - చేసుకుంటు న్నాడు.

ప్రకాశం కనిపించాడు - తనవైపు వేలెత్తి చూపుతున్నాడు.

"నువ్వు హంతకుడివి — దొంగవు - నీచుడివి - దుర్మార్గుడివి" కేకలేస్తు న్నాడు.

"నిజం నాయనా! నిజం! ఆ మాటలు నువ్వంటె ఎంత బాగున్నాయి — అను. ఇంకా అను. మళ్ళీ అను. రా. ఒక్కసారి కావిలించుకుంటాను — ఏమైనా అను. ఒక్కసారి దగ్గరికి రా. దగ్గరికి రా. ఇంకా. ఇంకా...."

కళ్ళు తెరిచి చూచాడు రామయ్య!

శూన్యం!

అంతా శూన్యం!

ఏమీ లేదు.

రామయ్యకు దుఃఖం ముంచుకొని వచ్చింది.

గొంతు నిండింది. కళ్ళు నిండాయి.

రామయ్య ఏడ్చాడు!

అవును. ఏడ్చింది రామయ్యే!!!

* * *

తెల్లవారింది.

రామయ్య బంగళాకు కార్లు వస్తున్నాయి. స్కూటర్లు వస్తున్నాయి. టాక్సీలు వస్తున్నాయి. మనుషులు దిగుతున్నారు. పొడవైన కద్దరు లాల్చీలవారు దిగారు.

ఋఫ్షరులవారు వస్తున్నారు. సూట్లవారు వచ్చారు. వచ్చిన వారందరికీ అంతస్తులను బట్టి నమస్కరిస్తున్నారు బంట్రోతులు. హోదాలను బట్టి కూర్చుండ బెడ్తున్నారు - వరండాలో - గదుల్లో. పి. ఏ. లు వచ్చారు. టెలిఫోన్లు వస్తున్నాయి - పోతున్నాయి. రామయ్య రావడంలేదు. జనం ఇంకా వస్తూనే ఉన్నారు. హాలు నిండిపోయింది. గదులు నిండిపోయాయి. సిగరెట్ల పొగలేస్తూంది. చర్చలు సాగుతున్నాయి.

రామయ్య రాలేదు.

పొద్దు ఎక్కుతూంది.

గడియారాలు చూసుకుంటున్నారు - వచ్చినవాళ్ళు.

తొమ్మిది దాటింది - పది కావస్తూంది.

వచ్చినవారు విసుక్కుంటున్నారు.

చప్రాసీ రామయ్య ఆఫీసుగది తెరిచాడు. చప్రాసీ వచ్చిన వాళ్ళకు దేవుడయినాడు. అందరూ అతనిచుట్టు కూడారు. అతను ఠీవిగా చెప్తున్నాడు - దొరవచ్చే సమయం అయిందని. మళ్ళీ అందరు తమతమ స్థానాల్లో కూర్చున్నారు. అందరి కళ్ళూ స్టెయిర్ కేస్‌వైపు కేంద్రీకరించారు.

పోర్టికోలో జండా ఉన్నకారు వచ్చి ఆగింది. అందరూ అటువైపు చూచారు.

"రాగానే వెళ్ళిపోతారా?" ఒక లాల్చీ చప్రాసీని అడిగింది.

"ఎట్లెరికయితది?" చప్రాసీ జవాబు.

"వెళ్తున్నారా" ఒక సూటుడ్రైవర్ను అడిగింది.

"అవ్. పోతున్నరు" డ్రైవరు జవాబు.

అందరూ పి.ఏను చుట్టు ముట్టారు. అందరినీ అదిలించి అతడు మెట్లెక్కి వెళ్ళిపోయాడు.

నిరాశ వ్యాపించింది. అయినా ఎవరూ కదల్లేదు. అంతా లేచి నుంచున్నారు- అందరూ వరండాలోకే వచ్చేశారు.

మెట్లమీద రామయ్య కనిపించాడు - వదులయిన కద్దరుధోవతి కట్టాడు- బిరుసైన పొడవులాల్చీ వేసుకున్నాడు - ఆకు చెప్పులతో దిగుతున్నాడు.

అందరూ నమస్కరించారు.

రామయ్య కృత్రిమపు చిరునవ్వు నవ్వాడు - అది రాని వాడు నాయకుడు కాలేడు.

కిందికి వచ్చి నుంచున్నాడు రామయ్య.

అందరూ గుమికూడారు.

చిరునవ్వు నవ్వాడు రామయ్య. ఒకరి బుజంమీద చేయివేశాడు - ఒకరితో తీయగా మాట్లాడాడు - ఒకరిని క్షమాపణ కోరాడు - ఒకరిని కోపగించాడు - ఒకరిని కసిరాడు.

"ఏడీ పి. ఏ. ఇంకా ఏం చేస్తున్నాడు?" చప్రాసీని అడిగాడు రామయ్య.

చప్రాసీ ఉరికాడు. పి. ఏ. ఉరికి వచ్చాడు.

"కాగితాలన్ని తీసుకున్నవా?.... ఆ స్పీచు"

"Yes Sir. అన్ని తీసుకున్నాను"

"ఏంలేదండీ — సాహిత్య సభ ప్రారంభించాలె. మాకేం తెలుస్తది సాహిత్యం అంటె వినరండి. మినిస్టరంటె అన్ని తెలియాల్ననుకుంటరు - పదింటికన్నరు మీటింగు — అగో అప్పుడే పదింబావయింది. వస్తమరి కూచుంటరా? మళ్ళొస్తరా? ఎందుకులేండి మళ్ళరాండి" అని అందరికీ నమస్కరించి కారువైపు నడిచాడు రామయ్య.

అటునుంచి మరోకారు వచ్చి ఆగింది. శేషయ్య దిగాడు - అతని వెంట ఒక కద్దరుధారి తోలుసంచి పట్టుకొని దిగారు. శేషయ్య గబగబా పరిగెత్తివచ్చాడు రామయ్య దగ్గరికి. అప్పటికి కారు తలుపు తెరుచుకుంది - రామయ్య కూర్చోబోతున్నాడు. శేషయ్య రామయ్య చెవిలో ఏదో చెప్పి తనవెంట వచ్చినవాణ్ణి చూపించాడు.

వచ్చినవాడు వంగి వినయంగా నమస్కరించాడు.

రామయ్య కారులోంచి దిగి తలుపువేశాడు.

రామయ్య ఇంట్లోకి మెట్లెక్కాడు.

నుంచున్న వాళ్ళంతా తెల్లబోయారు.

శేషయ్య మెట్లెక్కాడు - అతని వెంట వచ్చినవాడుకూడా.

రామయ్య పైకి వెళ్ళి గదిలో కూర్చున్నాడు - శేషయ్య వచ్చి అతని వెంట కూర్చున్నాడు. వచ్చినవాడు బయటనే ఆగిపోయాడు.

రామయ్య టెలిఫోను తీసి పి. ఏ. తో మాట్లాడుతున్నాడు.

"ఆ పిలిచిన వాళ్ళ పేరు తెలుసునా?"

"తెలుసు సార్"

"వాళ్ళతో చెప్పు ఆలస్యంగ వస్తనని"

"వాళ్ళకు టెలిఫోను ఉన్నట్లు లేదు సార్"

"టెలిఫోను లేనివాదు మినిస్టర్ల నెందుకయా మీటింగులకు పిలవడం?"

రిసీవర్ పెట్టేశాడు రామయ్య. ఏదో బరువు దిగిపోయినట్లు కుర్చీలో వాలి కూర్చొని "చెప్పు" అన్నాడు.

శేషయ్య, రామయ్యకు సిగరెట్టు అందించి తాను తీసుకున్నాడు - వెలిగించి, వెలిగించుకున్నాడు.

"చా తాగుతవా? తెప్పించమంటవా?" రామయ్య అడిగాడు.

"ఇప్పుడు వద్దులే. కాస్తాగి చూతం"

"పట్నంలో మన గ్రూపు గట్టిగున్నదా?"

"అడుగుతారు-శానగట్టిపడేసిన—మెసుల్తలేరు నా కొడుకులు"

''వీరభద్రం ఏమంటాడు?''

"ఇంకేమంటడు - చచ్చినట్లు పడివున్నడు. కార్మిక సంగం నా కొచ్చింది గద - ఇంకేం చేస్తడు. ఏవో మీటింగులంటున్నడు - నలుగురైదుగురు వస్తున్నరు - నాకే జాలేస్తున్నది చూస్తుంటే''

''నువ్వు కార్మిక నాయకుడివి!'' పెద్దగా నవ్వాడు రామయ్య. ''పేకాడే టోండ్లు, క్లబ్బులు పెట్టుకునేటోండ్లు కార్మిక నాయకులైతాన్రు-బాపూజీ! ఇక చెప్పు మన దేశం కత!''

వెలవెలపోయాడు శేషయ్య. 'మీలాంటివాళ్ళు మంత్రులు కాగా నేను కార్మిక నాయకుణ్ని కావడం తప్పా' అందామనుకున్నాడు. కాని అనలేదు-మింగేశాడు.

టెలిఫోను మోగింది. శేషయ్య ఎత్తాడు. ''సభవాండ్లు మాట్లాడ్తరట'' అన్నాడు.

''తే'' అని అందుకున్నాడు ''మాట్లాడమను'' అన్నాడు పి. ఏ. తో.

''ఆఁ. నమస్కారం.... జనం ఎదిరి చూస్తున్నరా? ఏం చేయమంటరు.... అర్జంటు పని వచ్చింది.... రాజకీయాలు మీకేం తెలుస్తయి.... పద్యాలు రాసుకోవటం తప్ప.... గంటలో వస్తనో రానో చెప్పలేను.... మరొకరితో చేయించండి.... ఏమంటారు.... సరే.... పి.ఏ.తో పంపిస్తా మీరే చదవండి.... వస్తాలెండి ఎప్పుడో ఒకసారి.... వస్తా తప్పక.... ఏమంటారు దయ ఉంచాలా? దానికేమండి.... మాకూ సంతోషమే.... కాని ఏం చేయమంటరు.... తీరికలేదు.... మంచిది నమస్కారం.... సాయంకాలంరాండి'' రిసీవర్ పెట్టేశాడు.

"చెప్పు ఎందుకు వచ్చావో.... ఊరికే రారు మహాత్ములు.... మీటింగు చెడగొట్టుకున్న.... అక్కడందరూ మినిస్టర్లను తిడ్తరు. మీవంటి వాళ్ళే మమ్ముల నిట్ల జేస్తున్నది. చెప్పు ఏం పనిమీద వచ్చినవో?"

"చాయ్ తెప్పిస్తనంటిరిగద!"

"తాగుతవా?"

"తాగెటందుకే గద"

"అచ్చా" అని బెల్లునొక్కాడు రామయ్య. బంట్రోతు వచ్చాడు. రామయ్య చెప్పాడు. చప్రాసీ చాయ్ తెచ్చాడు.

చాయ్ చప్పరిస్తూ "పని చెప్పక పోతివి?" అడిగాడు రామయ్య.

"నా వెంట వచ్చిండు చూసిన్రా?"

"చూసిన గద"

"ఆయన సంకటయ్య. ఎనిమిదిమంది ఎమ్మెల్లేలున్నరు చేతుల"

''చేతుల్నా? జేబుల్నా''

"ఎట్లనుకున్నా సరెగాని నిజంగానే ఎనిమిదిమందిని పట్టిండు. పట్టిండేంది - ఎలక్షన్ల కయిన కరుచంత పెట్టిండు. కావల్నంటె అప్పుడు కాస్త ఇప్పుడు కాస్త

ఇస్తునే ఉన్నడు. ఆ ఎనిమిదిమంది ఎమ్మెల్లేలు సంకటయ్య చావమంటె చసరు బత్కమంటె బతుకుతరు"

"ఇంతకు నువ్వేమంటవు చావమంటవా? బత్కమంటవా?"

"అబ్బబ్బ! ఎంతమాటుండి - చావమని ఎందుకంటం? మీరు బతికుండాలె - పచ్చగుండాలె - మినిస్టర్లు గుండాలె - అందుకే తెచ్చినుండి సంకటయ్యను."

"అసలు కత చెప్పవు. సాగదీస్తూ పోతవు" టెలిఫోను మ్రోగింది. లేదని చెప్పమన్నాడు పి. ఏ. తో రామయ్య.

"చెప్పెడిదేమున్నది ఎనిమిదిమంది ఎమ్మెల్లేలు మన గ్రూపులోకి వస్తున్రు."

"ఎనిమిదిమందే?"

"అవు. ఎనిమిదిమంది ఏకంగ వస్తే మనం ఎంత గట్టిపడ్తమో చూసిన్రా?"

"అసాధ్యునివి శేషయ్యా"

"నాదేమున్నదుండి - అంత మీ చలవే

"ఇంతకు ఏమంటడు?"

"ఏమనెడి దేమున్నది? ఆశ్రయించెటందుకు వచ్చిండు"

"అయితె పిలుద్దమా లోపటికి?"

"ఆగుండి, జర. ఆయనకు కూడ పనుండి వచ్చిండు - ఊరికెందుకొస్తరుండి మనకాడికి"

"ఏం పని?"

"అంత పెద్ద పని కాదులెండ్రి"

"చెప్పరాదు. పన్లన్ని చెడగొట్టుకొని కూచున్న నీకోసం"

"నా కోసమేనంటరా?"

"కాదు లేవయ్య. నా కోసమే. చెప్పు"

"ఏంలేదు - సంకటయ్య ఒక పరిశ్రమ పెడ్తున్నడు. పైకంగిట్ట అన్ని తయారుగున్నయి. లైసెన్సిచ్చే టందుక్కు తిప్పుతున్నరు"

రామయ్య గంభీరంగా వింటున్నాడు.

"ఆ లైసెన్సు దొరకుతె పరిశ్రమ మొదలయితది. పెద్ద ప్లానున్నది లేండి. అసలు ఆ ఎమ్మెల్లేలనే పట్టిండు - వాండ్ల మినిస్టర్ చేయలేకపోయింది. అందుకని ఇప్పుడు మన దగ్గరికి వచ్చిండు. పనిచేసి పెడ్తే పైకమొస్తది – ఎమ్మెల్లేలొస్తరు."

రామయ్య పలకలేదు. సిగరెట్టు తీసి తానే కాల్చుకున్నాడు. శ్రద్ధగా వింటున్నట్లు కూర్చున్నాడు.

"లైసెన్సంటె లైసెన్సేకాదు, మీ మద్దతు పూర ఉండాలె. పారెన్ నుంచి ఏమో కావాల్నట - వాటికి కూడ లైసెన్సు ఇప్పించాలె. ఇంక అట్లనే చిల్లర మల్లర పన్లుంటె చేసిపెట్టాలె."

రామయ్య తాపీగా సిగరెట్టుపొగ వదులు తున్నాడు.

శేషయ్య సిగరెట్టుతీసి కాల్చాడు. పెట్టె టేబుల్‌మీద వేశాడు.

ఉభయులూ మాట్లాడలేదు.

సిగరెట్టుపొగ పైకిలేచి వెంటిలేటరులోంచి సాగి పోతూంది – వయ్యారంగా.

ఇద్దరి గుండెల్లోనూ ఏదో మసలుతూంది - మరుగుతూంది - ఇద్దరూ మాట్లాడలేదు.

"మాట్లాడరు?" సిగరెట్టు ఆష్ ట్రేలో నలిచి అడిగాడు శేషయ్య.

"ఏం మాట్లాడమంటవ్" తాపీగా సిగరెట్టు పొగ దులిపి, కుర్చీలో వాలి ''అన్ని నువ్వే మాట్లాడినవుకద'' అన్నాడు రామయ్య.

"అయితే నన్నే చెప్పమంటరా?"

"అదే మంచిదిగద!"

"లక్ష ఇస్తనంటున్నాడు" - అన్న శేషయ్య రామయ్య ముఖాన్ని గమనించ సాగాడు - సంఖ్య తెచ్చే మార్పులను గమనించడానికి.

రామయ్య వాలిన కుర్చీలోంచి వంగి ట్రేలో సిగరెట్టును నలిచి పేపర్ కటర్‌ను రెండుచేతుల వేళ్ళతో పట్టుకొని పరిశీలించ సాగాడు.

శేషయ్య రామయ్యనే చూస్తున్నాడు.

రామయ్య శేషయ్యను చూడ్డంలేదు. పేపర్‌కటర్ బల్లమీద పెట్టి, పేపర్ వెయిట్ అందుకొని తిప్పసాగాడు.

"ఏమో ఉలకరు. పలకరు" శేషయ్య పలికాడు.

"నన్ను కొనెటందుకు వచ్చినవా?"

ఉలిక్కిపడ్డాడు శేషయ్య. "అట్లనకుండి - బాంచెను – నాశనమైపోత. ఎంత కావాల్నో చెప్పుండి" అని లేచి రామయ్య చేతులు పట్టుకున్నాడు.

రామయ్య పెద్దగా నవ్వాడు – "అసలు రూపానికొచ్చినవు – 'బాంచెను' అన్నవులే" వెకిలిగా అన్నాడు.

శేషయ్య ముఖం వెలవెలబోయింది "అంతేగద నుండి మల్లి–బాంచెలమేగద మేం మీకు!" శేషయ్య చేతులు జోడించి అన్నాడు.

"మొదలు మనమంత బాంచెలమే" మళ్ళీ నవ్వాడు రామయ్య.

"అట్ల నవ్వకుండి భయమైతది" కుర్చీలో కూర్చుంటూ అన్నాడు శేషయ్య.

"సరె. నవ్వన్లే చెప్పు."

"మీరే చెప్పాలె. నేనేం చెప్పుత. చెప్పేడిది చెప్పిన."

"పని పెద్దది పైకం కొద్దిది అంటె ఎట్ల నడుస్తది"

"ఫ్యాక్టరీలో భాగం ఇస్తనంటున్నడు"

"సరె. ఇంక?"

"ఇంకేమి ఇయ్యమంటరు?''

నాలుగువేళ్ళు చూపించాడు రామయ్య – అది నాలుగు లక్షలకు సంకేతం.

"అట్లయితె అడిగి రావాలె'' శేషయ్య.

"అడిగిరా. నాకు పనులున్నయి అవతల''

"అట్లనే?'' అని శేషయ్య వెళ్ళిపోయాడు - సంకటయ్యను గదిలోకి తీసి కెళ్ళాడు. చాలసేపు మాట్లాడాడు. అతనితో వప్పించాడు నాలుగు లక్షలకు. తిరిగి వచ్చేవరకు పేపరు చదువుతున్నాడు రామయ్య. శేషయ్యను చూచి సర్దుకొని కూర్చున్నాడు.

''ఏమొ అట్లున్నవు?'' రామయ్య అడిగాడు.

''వప్పుకునేటట్లులేడు-ముండకొడుకు''

''ఏమంటడు?''

''మూడు దాటనంటున్నడు''

''భాగం ఇస్తడుగద!''

''ఇస్త నన్నడు''

''ఎవరి పేర పెద్దమంటువు?''

''మీరే చెప్పాలె''

''సుమతి వప్పుకోదు''

''మిగిలింది గాంధీయే గద నుండి''

గాంధీ పేరు వినగానే గొంతులో ఏదో పడ్డట్టయింది రామయ్యకు. ఇంత పెద్దలోకంలో తన కెవరూ లేరనుకున్నాడు. సుమతి దూరదూరంగా ఉంటుంది. గాంధీ ఎవడు? తల్చుకుంటే లోకం సొంతం శూన్యంగా కనిపించింది - పెద్ద ఎడారిలా కనిపించింది. తాను వంటరి. ఎటు చూచినా ఎవరూలేరు. అంతా నిరా మయం. ఎవరూలేరు తనకు - తాను ఎవరికీలేడు.

''ఏమంటరు మల్లి - గాంధీ పేరనే చేయమంటరా?''

''చెయ్యాలె మరి-ఇంకెవరున్నరు గనక'' ధ్వనిలో ఏదో అయిష్టత, నిరాశా గోచరించాయి. గ్రహించాడు శేషయ్య. అయినా ఆ విషయం మాటాడలేదు.

"సంకటయ్యను కలుస్తరా?" శేషయ్య అడిగాడు.

"అట్లనే" అని సవరించుకొని కూర్చున్న రామయ్య బిజీగా ఉన్నట్లు పైళ్ళు చూడసాగాడు.

శేషయ్య వెళ్ళి సంకటయ్యను తీసుకొని వచ్చాడు.

సంకటయ్య నమస్కరించాడు.

"నమస్కారం. రాండి కూర్చోండి"

సంకటయ్య కూర్చున్నాడు.

"మీరు పరిశ్రమలు ప్రారంభిస్తరని విన్న"

"మీ దయ ఉంటే"

"దానికేంగాని.... పారిశ్రామికంగా దేశాన్ని అభివృద్ధి పరచటానికి ప్రభుత్వం కంకణం కట్టుకున్నది. పారిశ్రామిక అభివృద్ధి లేకుంటే భారతదేశానికి విముక్తిలేదు. మీవంటి వారు ముందుకు వస్తే సహాయం చేయటం మా కర్తవ్యం. శేషయ్యగారు చెప్పిన్రు. మీకు అన్ని విదాల సహాయం చేస్తుంది ప్రభుత్వం.''

"మీదయ అంతమాత్రం ఉంటే చాలు. మాకు కూడ దేశభక్తి ఉంది. పరిశ్రమలు దేశం కోసమే పెడ్తున్నం - మా కోసం కాదు - మీరు కాస్త ఢిల్లీదాక రావాలె. మీరు ఒక్కసారి వస్తే తక్కిన పనులు నేను చూసుకుంట - ఏమంటరు?"

"ఎప్పుడు పోదమంటరు?''

"మీ ఇష్టం - రేపైతె మంచిది. టిక్కెట్టు కొంటాను.''

''సరే. రేపే వెళ్దాం — టిక్కెట్టు మీరెందుకు కొనటం? మా పనిమీదనే వస్తం — సర్కారే కొంటుంది.''

సంకటయ్య ముఖం అదోలా పెట్టి సంచీలో చేయి పెట్టాడు.

''శేషయ్య చూసుకుంటడు - నాకు అర్జంటు పని ఉంది'' అని లేచి నుంచున్నాడు రామయ్య.

సంకటయ్య, శేషయ్య నమస్కరించి బైటపడ్డారు. ఇద్దరూ చేతులు పట్టుకొని మెట్లు దిగారు. వరండాలో ఇంకా కొంతమంది కూర్చొనే ఉన్నారు. వారు శేషయ్యను చూచి లేచి నుంచున్నారు. వారిని శేషయ్య గమనించలేదు—గమనించనట్లు నటించాడు. కారువైపు నడిచాడు. కూర్చున్నవారు కారు దగ్గరికి వెళ్ళారు. శేషయ్య కారులో కూర్చొని తలుపువేసుకున్నాడు. వచ్చినవారు ఏదో దేబరిస్తున్నట్లు శేషయ్యను చూచారు.

''ఇక్కడేందయా - ఇంటికి రాండి'' అని ఈసడించాడు శేషయ్య.

కారు-జెర్కు ఇచ్చి సాగిపోయింది.

* * *

పల్లెకు ప్రగతి పరుగున వచ్చింది!

రామయ్య ఇంటికి టెలిఫోను వచ్చింది!!

రామయ్య మంత్రి కావడంతో పల్లెను నారయ్యకు అప్పగించాడు. నారయ్య పరపతి సంఘానికి ప్రెసిడెంటు కావడంతోనే పెంకుటిల్లు వేశాడు. ఇప్పుడేమో రామయ్య వ్యవసాయం, రామయ్య పెత్తనం రక్షించే బాధ్యత నారయ్యమీద పడింది. నారయ్య మెడ బలిసింది — తిరగడంలేదు. వేళ్ళకు ఉంగరాలు వచ్చాయి. కద్దరుసిల్కు లాల్చి వేస్తున్నాడు. అతనికి అధికారం వచ్చింది — ఆ గర్వం కళ్ళల్లో తొణికిస లాడుతూంది. వీధులవెంట నడవ డతను — రంకె వేస్తాడు.

యాదగిరికి నారయ్యను చూచి కళ్ళుమండాయి. అడుక్కు తినేవాడు అధికారానికి వచ్చాడే అని మంట! తాను అక్కణ్ణుంచి వచ్చినవాడే — కాస్త వెనకా ముందులు. యాదగిరి బలరామయ్య వ్యవసాయం చేపట్టాడు — నారయ్య రామయ్య

వ్యవసాయం. ఇద్దరూ ప్రతినిధులే! అందుకే ఇద్దరికీ ఉప్పు నిప్పులాంటి స్నేహం. ఇద్దరికీ ఊరి పెత్తనం కావాలని ఉబలాటం! ఇద్దరూ 'దొరలు' కావాలని తహతహ. అయితే నారయ్య మంత్రి ప్రతినిధి. యాదగిరేమీ తక్కువవాడు కాడు - అతనూ మరో మంత్రిని పట్టాడు. దాంతో కుమ్ములాట పెరిగింది.

ఆ ఊరికి మరియమ్మ వచ్చింది. మరియమ్మ గ్రామసేవిక. వచ్చింది ఊరికి సేవచేయడానికి – కాని నారయ్య దగ్గరికి వెళ్ళకుండా తప్పలేదు. నారయ్య మరియమ్మను చూశాడు. మరియమ్మ రంగు నలుపే – వయసు తెచ్చిన వయారం ఉంది. గుండ్రని ముఖంలో పెద్ద కళ్ళు – కళ్ళు కాస్త చిలిపి. కళ్ళు బాగా ఎరుపు. ఆమె చెంపలు వేయిస్తంభాలగుడి స్తంభాలు – ముఖాలు కనిపిస్తాయి. ఆమెది ఉంగరాల జుట్టు. ఎంత బిగదీసినా ముఖంమీద ముంగురులు పడుతుంటాయి. ఆమె ముక్కు చిన్నది. ఆమె పెదవులకు రంగు వేస్తుంది – కాబట్టి ఎర్రగా ఉంటాయి.

నారయ్య ఇవన్నీ చూచాడు-కాదు చూస్తూనే ఉన్నాడు.

మరియమ్మ నారయ్యను చూచింది. బుసకొడుతున్న కళ్ళను చూచింది. నారయ్య వేళ్ళ ఉంగరాలను చూచింది. నారయ్య ముందున్న దస్తరాన్నిచూచింది.

మరియమ్మ నవ్వింది–ఆ నవ్వు తెల్లగా లేదు–ఎర్రగా ఉంది.

చుట్టూ చూచి మరియమ్మ చేయి పట్టుకున్నాడు నారయ్య. మరియమ్మ చేయి విడిపించుకోలేదు. తల తిప్పుకొని సిగ్గుపడింది. "ఎవరన్న చూస్తరు" అని నవ్వింది.

నారయ్య, మరియమ్మ నవ్వును పట్టుకున్నాడు - ఆమె చేతిని వదిలాడు.

"ఇల్లు చూపిస్తరా? ఎక్కడుండాలె?" మరియమ్మ మాట్లాడింది - గొంతు రూపంలా అందంగాలేదు.

ఆమె కళ్ళు నవ్వాయి.

నారయ్య కరిగిపోయాడు-చూస్తూ ఉండిపోయాడు.

మరో లోకం కనిపించడం లేదతనికి-మరియమ్మ తప్ప.

"ఏం దిదంత? ఎవ్వరిది?" గర్జన విని ఇద్దరూ ఈ లోకంలోకి వచ్చారు.

సుమతి కనిపించింది.

నారయ్య లేచి నుంచున్నాడు.

అర్థంకాక బిత్తరపోయి చూచింది మరియమ్మ.

"ఎవ్వరిది? ఎందుకొచ్చిందిక్కడికి?" సుమతి అగ్గి కురిపించింది- గుడికి బయ ల్దేరితే ఈ దృశ్యం కనిపించింది!

నారయ్య తడబడ్డాడు. నారయ్య సుమతికి తప్ప ఎవరికీ భయపడడు. పరవ శంలో మరిచాడు అది సుమతి ఇల్లని! నారయ్య వ్యవహారాలన్నీ రామయ్య ఇంటి నుంచే నడిపిస్తాడు. తన ఇల్లు తిండికే - అప్పుడప్పుడూ పడక్కు.

"గ్రామసేవిక - మరియమ్మ" తడబడుతూ జవాబు చెప్పాడు నారయ్య.

"ఇంటిని బోగం కొంప చేద్దమనుకున్నా? నడువుండి బయటికి" గద్దించింది సుమతి.

"నే...నే" ఏదో చెప్పబోయింది మరియమ్మ.

"ముందు అవతలికి నడుప్-ఈ ఇల్లు నాది"

మరియమ్మ నారయ్యను చూచింది. నారయ్య బయటికి నడిచాడు-మరియమ్మ వెంబడించింది.

సుమతి బయటికి నడిచి తలుపులువేసి, తాళం బిగించి గుడికి వెళ్ళి పోయింది.

మరియమ్మను తీసుకొని నారయ్య డాక్ బంగళావైపు నడిచాడు. ఊరిబయట యాదగిరి కనిపించాడు. తప్పించుకోవాలనే చూచాడు నారయ్య. కాని యాదగిరి పలకరించాడు.

"నారయ్యన్నా! యాడికే పోయెడిది-పట్నం సరుకా?"

"గ్రామసేవిక" అని సాగిపోయాడు నారయ్య.

"గ్రామసేవికంటే గ్రామానికి సేవచేస్తదా? నీకొక్కనికేనా?"

నారయ్య వినిపించుకోకుండా సాగిపోయాడు.

వెనుకవస్తున్న మరియమ్మ తిరిగి చూచింది రెండు మూడుసార్లు యాదగిరిని-యాదగిరి సైతం ఆమె చూపుల్ను చూసినట్లే ఉన్నాడు.

డాక్ బంగళాకు చేరిన నారయ్య బంట్రోతును నాయర్ హోటల్‌కు పంపించాడు—కాఫీ టిఫిన్లు తెమ్మని.

బంట్రోతు బయటికి పోగానే తలుపులు వేశాడు.

మరియమ్మ అద్దంలో తనను చూచుకుంటూంది-తలుపులు వేసింది గమనించినట్లు లేదు.

నారయ్య మరియమ్మ దగ్గరికి వచ్చాడు.

"అద్దంల ఏం చూసుకుంటవు? నన్ను చూడనియ్!" అని ఆమెను తన వైపు తిప్పుకున్నాడు.

"ఏం బాగలేనా?" అడిగిందామె.

"పిచ్చోణ్ణి చేసినవ్-ఏది ఒక్క ముద్దు!"

"ఆగండి-టిఫిన్లు రానివ్వండి" విడిపించుకోవడానికి యత్నించింది మరియమ్మ.

"ఆగలేను" అని పైటలాగి కౌగిలించుకున్నాడు నారయ్య.

టిఫిన్లు తెచ్చిన బంట్రోతు బయటనే కూలపడ్డాడు.

మరియమ్మ మకాం డాక్ బంగళాలోనే వేసింది కొంతకాలం. కాని అక్కడే ఉంచడం ఇష్టం కాలేదు నారయ్యకు. ఆమెను గడీలో ఉంచాలనుకున్నాడు. గడీ

శుభ్రం చేయడానికి మనుషుల్ని పంపాడు. గడీ యాదగిరి ఆధీనంలో ఉంది. యాదగిరి మనుషులు యెదిరించారు. నారయ్య మనుషులు వచ్చి షికాయతు చేశారు.

"గడీ యాదగిరి దొరదంటున్రను. సాఫువేయనిస్తలేరు"

"వాని అయ్యదా గడీ-వాడేమన్న దొరకు పుట్టిండా?" అని కోపంతో లేచాడు నారయ్య. యాదగిరి ఇంటికి పోయిగాని ఆగలేదు.

"ఏమో కూసినవట!" నారయ్య ఉరిమాడు.

"ఎవరు కూస్తున్నరో ఎరకైతున్నదిగద" యాదగిరి.

"మాటలెట్లనో మాట్లాడ్తున్నవు?"

"కుస్తీపట్ల కొస్తేరా. దంగల్లో దిగు. చూపిస్త తడాఖా."

"కుస్తీ నీతోనేం పట్టాలేగాని, ఏమో అన్నవట. గడీ సాఫ్‌చేయనియ్యనని-గడీ నీ జాగీరనుకున్నవా? నీ అయ్య సంపాయించిందనుకున్నవా? నీ అయ్య బిచ్చమెత్క బతికిండు నాకెర్కలేదనుకున్నవా?"

"అవు. నాకెరకలేదా? మీ అమ్మ దొరతాన పండె-గడీ నీదే అయితదను చెన్నవు."

"ఇగో అమ్మ గిమ్మ అంటె ఊరుకునెడిదిలేదు - మరియమ్మ నుంచాలె తాళం చేతులు పారేయి" అని అడుగు ముందుకు వేశాడు నారయ్య.

"బజారు లంజెల్నుంచ......." యాదగిరి మాట పూర్తికాకుండానే చెంప చెళ్ళుమంది.

యాదగిరి వూరుకున్నాడా? యాదగిరీ అంటించాడు.

ఇద్దరూ కొట్టుకున్నారు.

జుట్లు పట్టుకున్నారు.

చొక్కాలు చించుకున్నారు. ఇద్దరివీ కద్దరు చొక్కాలే - త్వరగా చిరిగాయి.

దోవన పోయేవాళ్ళొచ్చి ఇద్దరినీ విడిపించారు.

నారయ్య ముక్కులోంచి వస్తున్న రక్తాన్ని తుడుచుకుంటూ నీ రక్తం—చూస్త ఏమనుకున్నవో లంజకొడక!" బెదిరించాడు.

"బజారు లంజకోసం తన్నులు తిన్నోడు-రక్తం చూస్తడట - ఆ లంజ ఊళ్ళ ఎట్టుంటదో చూస్త" పళ్ళు కొరికి పలికాడు యాదగిరి.

"ఏం చేస్తవుర బాడ్‌ఖావ్!"

"దాన్ని ట్రాన్స్‌ఫర్ చేయించి ఊళ్ళనించి ఎళ్ళ కొట్టకుంటె నా పేరు యాదగిరే కాదు."

"ఎట్ల చేస్తవో - చూస్త. దాన్ని ఈ ఊళ్ళో ఉంచకుంటె నా పేరు నారయ్య కాదు" అని పెద్ద పెద్ద అంగలువేస్తూ వెళ్ళిపోయాడు. నాటినుంచి ఇద్దరూ పట్నం

తిరగడం సాగించారు. మంత్రుల్లో తగాదా లొచ్చాయి. ప్రభుత్వమే పడిపోయేదశకు వచ్చింది.

మరియమ్మకు ట్రాన్స్‌ఫర్ అయింది.

మరియమ్మ డైరెక్టుగా మంత్రిగారి దగ్గరకే వెళ్ళింది - సొగసుగా పోయింది- సోయగం ఒలకబోస్తూ పోయింది-హొయలుగా నిలిచింది.

"నన్ను ట్రాన్స్‌ఫర్ చేసిన్రట!"

"చేసిన - నిజమే - కాని రాజకీయాలు అట్లాంటివి - అయినా నేం చెయ్య లేదు - గుమాస్తాలు చేశారు-సర్కారు నాదికాదు వాండ్లది"

"ఇప్పుడు ఈడనే ఉందమని వచ్చిన -ఏమంటరు?"

"అంత కంటెనా! రా పోదాం" అని మరియమ్మ నడుం మీద చేయి వేసి నడిపించుకు పోయారు మంత్రివరేణ్యులు - గదివైపు.

తరవాత తలుపులుపడ్డ చప్పుడు వినిపించింది.

మరియమ్మ కార్లోవచ్చి ఊర్లో దిగింది - డాక్ బంగళాలో - సామాను తీసి కెళ్ళాలనే మిషతో.

నారయ్య ఉరికురికి వచ్చాడు. మరియమ్మను చూచాడు—ఆమె వేషం చూచాడు- ఆమె ఠీవి చూచాడు - ఆమె కారు చూచాడు - అడుగు వెనక్కు వేశాడు - దండం పెట్టాడు.

మరియమ్మ చిరునవ్వు నవ్వింది.

"అట్ల చూస్తరేం! సామాను డిక్కీల పెట్టించుండి" పురమాయించింది.

నారయ్య తేరుకున్నాడు. మనుషుల్ని పురమాయించాడు.

"చూస్తరేంద్రమ నిలబడి-ఏమన్న బొమ్మలాడ్తాన్రా - సామాను మోటర్ల పెట్టుండి" అన్నాడు.

సామాను గబగబా డిక్కీలోకి ఎక్కింది.

మరియమ్మ కార్లోకి ఎక్కి తలుపేసుకుంది.

నారయ్య దండం పెట్టి సాగనంపాడు.

కారు సాగిపోయింది.

నారయ్య చూస్తూ నుంచున్నాడు-అతని మనసులో ఎన్ని తలపులు మసలాయో.

నారయ్య ఈ లోకంలోకి వచ్చి చూస్తే దూరంగా వస్తున్న యాదగిరి కనిపించాడు.

గబగబా డాక్ బంగళాలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు.

మరియమ్మ రభసకాలంలో రామయ్య పల్లెకూ-పట్నానికి ఆసులో గొట్టంలా తిరగాల్సి వచ్చింది. అన్నింటికీ అలా తిరగడం అసాధ్యం అనుకున్నాడు.

అందుకే టెలిఫోను పెట్టించాడు తన ఇంట్లో!

మంగమ్మ ఊరు బయట గుడిసె వేసుకొని ఉంటూంది. సాయంకాలం మల్లయ్య, యలమంద, సైదయ్య వచ్చారు.

"ఏం ధుండి ఇదంత - లంజముండకోసం కొట్లాటలు పుట్టెగదనుండి?" అఁటి గాడు సైదయ్య!

"ఒకనాడు భూమికోసం, భుక్తికోసం పోరాటం జరిపినం. దొరల నెదిరించి వాండ్లను ఊళ్ళనుంచి ఎళ్ళగొట్టినం. పొలాలు పంచుకున్నం. గ్రామరాజ్యం స్థాపించుకున్నం. స్వరాజ్యం వచ్చింది. అన్ని ఊడగుంజుకున్నరు. ప్రజల్లో శక్తి చంపేసిను. ఓటు చేతికిచ్చిన్రు-పడుండమన్నరు"

"ఇగ మనమేం చెయ్యలేమానున్రి?" మల్లయ్య నిరాశగా అడిగాడు.

"ఏం చెయ్యగలం చెప్పు? వీరభద్రం పోయి పట్నంల కూచునె. ప్రజల్ని వదిలిండు నాయకుల్ను పట్టిండు. వాండ్లేం గుసగుసలాడ్తున్నరో వాళ్ళకు తెలుస్తలేదు. మనకు తెలుస్తలేదు."

"మీరన్న ఏమన్న చేయాల్నుండి" యలమంద.

"చేస్తానే ఉన్నంకద. ప్రభుత్వం చేసే తప్పులు బయటపెడ్తున్నం. పోరాటాలు నడిపిస్తున్నం"

"అట్లయితె సర్కారు మారదంటరు?" మల్లయ్య.

"సంఘటిత పోరాటంద్వారా బూర్జువా ప్రభుత్వాన్ని కూలద్రోసి ప్రజా ప్రభుత్వం ఏర్పరచాలి."

"ఏమో! నాకు నమ్మకం కలుగుతలేదుండి!" యలమంద నిరాశ వ్యక్త పరచాడు.

"ప్రకాశమయ్య చెప్పిందే బాగనిపిస్తున్నదుండి" సైదయ్య.

"ఏం చెప్పిండు ప్రకాశం?" మంగమ్మ ఆతురత వ్యక్తపరచింది.

"గొడ్డలి తీసుకొని ఒక్కొక్కణ్ణి నరికి కుప్పలు పెట్టాలన్నడుండి!"

"ప్రమాదం! అట్ల చెయ్యకూడదు. వాడు పిల్లవాడు. వాడికి తెలియదు. అట్ల మనం గెలువలేం. మనకు ప్రజాబలంలేదు.

ప్రజాబలం ఉండగానే లొంగిపోయినం. తుపాకుల్తో ఈ ప్రభుత్వాన్ని ఎదిరించలేం. వట్టిది - తప్పు - తప్పుమార్గం అట్ల చేయటానికి వీల్లేదు. చేయవద్దు" ఆవేశంగా అరిచినంత పెద్దగా అన్నది.

వచ్చిన ముగ్గురూ ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు.

పట్నంలో శివరావు ఇంట్లో విద్యార్థుల చిన్న సమావేశం జరిగింది.

"మరియమ్మలు మంత్రిత్వాలు మార్చడం కంటే కుళ్ళిన ప్రభుత్వం ప్రపంచంలో ఉండదు. నిజాం నవాబును ఎదిరించి ఓడించిన ప్రజలు గాజులు వేసుకొని కూర్చున్నారు. అన్నం అడిగేవాడి నోట్లో మట్టికొట్టి కుట్రలతోనూ కుతంత్రాలతోనూ ప్రభుత్వం నడిపిస్తున్నారు. బడా పెట్టుబడిదార్లు బొర్రలు పెంచుకొని పరిశ్రమల్ను

పుక్కిట పెట్టుకొంటే కూలివాడు కూటికిలేక కుంగి కృశిస్తున్నాడు! స్వరాజ్యం ఎవరికి వచ్చింది? నల్లదొరలకు - జమీందార్లకు - భూస్వాములకు — టాటాలకు-బిర్లాలకు. సామాన్యునికి ఒరిగిందేమిటి ? ఈ దొంగలు, బటాచోర్లు జాతిని నిర్వీర్యం చేశారు. ప్రజల శక్తిని జలగల్లా పీల్చేశారు. ప్రజలు శక్తివంతులవుతారనటం వట్టిమాట. ఇందుకు మనమే పూనుకోవాలి. ఇందుకు సాయుధ విప్లవం తప్ప మార్గాంతరం లేదు," ఉద్రేకంగా మాట్లాడింది గీత. ఆమె రక్తం సొంతం ముఖంలో చేరి ముఖం మోదుగుపూలుగా మారిపోయింది.

సమావేశంలో ఉత్తేజం - ఉద్రేకం పొంగి పొరాయి.

"సాయుధ పోరాటం వర్ధిల్లాలె" అనే నినాదం చేశాడు ప్రకాశం.

అందరి నినాదాలతో శివరావు ఇల్లు ప్రతిధ్వనించింది.

అది శివరావు ఇల్లు! ! !

* * *

గీతకూ, ప్రకాశానికీ స్కాలర్‌షిప్ వచ్చింది - మెట్రిక్యులేషన్‌లో ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణు లయినందుకు. ఆ నిర్ణయం ప్రకటించడానికే చాలకాలం పట్టింది. ఆ పరిస్థితికి వచ్చేవరకు రాజ్యం సాధించినంత పని అయింది.

'గుమాస్తాలంతా ఒక పేజాతి. వారు జీతం తీసుకొని పనిచేస్తున్నా మనుకోరు. తమ దగ్గరికి వచ్చినవాడికి మెహర్బానీ చేస్తున్నా మనుకుంటారు. పని త్వరగా చేయడం వారి మనస్తత్వానికి విరుద్ధం. తిప్పడం వారి మతం. ఏదీ తేలనివ్వరు. ఎటూ తేలనివ్వరు. విసుగు పుట్టించడం - విసుగులోంచి లాభం పొందడం వారి సిద్ధాంతం' అని తెలియవచ్చింది ప్రకాశానికి - ఆ కాగితాలు కాలేజీకి వచ్చేవరకు.

కాలేజీకి వచ్చిం తరవాత ఘర్షణ ప్రారంభం అయింది. ప్రకాశం ఒక్కడే కాదుగా స్కాలర్‌షిప్స్ పుచ్చుకునేవాడు. విద్యార్థుల సహితంగా కాలేజీ కార్యాలయానికి వెళ్ళాడు. తీరిగ్గా కూర్చొని బీడీలు పీకుతున్న పెద్ద గుమస్తా నడిగాడు:-

"మా స్కాలర్‌షిప్పులొచ్చినాయాండి?"

"ఎవరయ్యా మీరు?"

"కళ్ళు కనిపించటంలే-మేం విద్యారులం"

"ఓహో! మీరు విద్యార్థులా! స్టూడెంట్సూ టీచర్స్ ఒకేరకంగా ఉంటున్నారు-మీరు టీచర్లనుకున్నా"

"ఇప్పటికైనా తెలిసిందా?"

"తెలిసిందిగానీ, విద్యార్థులు కాలేజీల్లో ఉండడంలేదే - ఈ మధ్య - టీచర్లే ఉంటున్నారు"

"మీతో చర్చలు జరపడానికి రాలేదు. మా స్కాలర్‌షిప్పులు వచ్చాయా చెప్పండి" కాస్త తీవ్రంగా అన్నాడు ప్రకాశం.

"ఏం గట్టిగా మాట్లాడుతున్నావు-కొడ్తావా? కొడ్తే పడేవాళ్ళు టీచర్లు. గట్టిగా మాట్లాడే పోలీసులకు అప్పగిస్తా ఏమనుకున్నావో!"

"మేం అడిగేది మా స్కాలర్‌షిప్పుల గురించి. పోలీసులంటే భయపడ్తమను కున్నరేమో-వాళ్ళే మాకు భయపడ్తారు"

అంతా గొల్లున నవ్వారు.

"అడిగేదేదో మెల్లగా అడగండి - 'అయ్యా-అప్పా!' అంటె అన్ని పనులూ అవుతాయి. బెదిరించి అడుగుతే మా సంగతి మీకు తెలియదేమో చెప్పులరిగే దాకా తిప్పుతాం"

"మే మేం బిచ్చం అడగటానికి రాలేదు - అయ్యా-అప్పా, అనడానికి. ఇది మా హక్కు. బెదిరించడం మా హక్కు. సాధించడం మా కర్తవ్యం. చెప్పండి అడిగిందానికి సమాధానం."

"చెప్పుమయ్య ఏం చేస్తవు?" అని జేబులోంచి బీడీ అగ్గిపెట్టె తీశాడు వెలిగించడానికి. అతని చేతిలోంచి బీడీ అగ్గిపెట్టె లాక్కొని కిటికీలోంచి విసరివేశాడు.

గుమాస్తా తెల్లబోయి చూచాడు.

"మేమంత పరేషానై తిరుగుతుంటే తాపీగా కూర్చొని బీడీ పీకుతావా? బుద్ధి లేదూ-మేం మా హక్కులకోసం - స్కాలర్‌షిప్ కోసం వస్తే ఉపన్యాసం ఇస్తావా? సిగ్గులేదూ-వెంట్రుకలు నెరిశాయి. చెప్పు స్కాలర్‌షిప్పులు వచ్చాయా లేవా?"

తడబడ్డాడు గుమాస్తా - నోట మాటరాలేదు.

"కూర్చున్నావేం? లేచి నిలబడు. మేమందరం నిలబడ్తే మీరు కూచుంటరా? లే. లేచి నిలబడు."

గుమాస్తా లేచి నుంచున్నాడు. చెమటలు పడ్తున్నాయి.

"ఇప్పుడు చెప్పు. స్కాలరుషిప్పులు వచ్చినయా? లేవా?"

"వచ్చినట్లే ఉన్నాయి."

"వచ్చినట్లే ఉన్నయేమిటి? ఆఫీసులో పనిచేస్తున్నవా? గడ్డి పీకుతున్నవా? తెప్పించు."

"తెప్పించేవాణ్ణే - కాని గుమాస్తాలేడు - శలవుమీద ఉన్నాడు."

"వస్తే నోటీసుబోర్డు మీద ఎందుకు పెట్టలేదు"

"పెట్టలేదు - ఏదో........"

"ఏదో ఏమిటి నోటీస్‌బోర్డుమీద పెట్టక వచ్చిన వాళ్ళ దగ్గర డబ్బు గుంజుదామని - అంతేగా"

"అబ్బే! అదేం లేదండీ-"

"ఎప్పుడు పెట్టిస్తావు?"

"రేపు. రేపు తప్పకుండా పెట్టిస్తా"

"పెట్టించకుంటే మాట దక్కదు. విన్నారా?" ప్రకాశం గర్జించాడు.

"మాట దక్కదు" విద్యార్థులంతా ఉరిమారు.

గుమస్తా నివ్వెరపోయాడు.

విద్యార్థులు వెళ్ళిపోయారు.

తెల్లవారి పెద్దగుమాస్తా రాలేదు - శెలవు పెట్టాడన్నరు. అసలు గుమాస్తా వచ్చాడు. పెద్దగుమాస్తాలేంది తానేం చేయలేనన్నాడు.

ఒకటి, రెండు, మూడు రోజు లయినాయి. నోటీసుబోర్డుమీద పేర్లులేవు. పెద్దగుమాస్తా పత్తాలేడు. విసుగుపుట్టి విద్యార్థులు ప్రిన్సిపాల్ దగ్గరికి వెళ్ళారు. ప్రిన్సిపాల్ గుమాస్తాను పిలిపించాడు.

"ఏమిటయ్యా స్కాలరుషిప్పుల విషయం?"

"నాకేం తెలీదండీ"

"ఎవరికి తెల్సు మరీ?"

"ఆ హెడ్ క్లార్కు గారికే తెల్సండి?"

"అత నెక్కడ?"

"తెలీదండి. ఇదిగో అప్లికేషన్ పంపించారండి"

"మూడు రోజుల క్రితం ఇచ్చింది ఇప్పుడిస్తున్నా వేమయ్యా?"

"అది హెడ్ క్లార్కుగారి ఆర్డరండి"

"సరేగాని స్కాలర్‌షిప్పుల సంగతి ఏమంటావ్?"

"నాకేం తెలీదండీ - హెడ్‌క్లార్క్ గారే చెప్పాలండీ"

"అది నిజమేనయ్యా. ఆయన రావటం ఎట్లా?"

"పిలిపించండి"

"సరే పిలుస్తా" అని "మీరు వెళ్ళండి. నేను ఈ విషయం చూస్తా" నన్నారు ప్రిన్సిపాల్.

విద్యార్థులు వెళ్ళిపోయారు.

మరో వారం గడిచింది. స్కాలరుషిప్పుల్లేవు. నోటీసు బోర్డు లేదు. హెడ్ క్లార్క్ పత్తాలేడు. విద్యార్థులు రెచ్చిపోయారు. వారి కోపానికి పారం లేదు. ఉమ్మడిగా కదిలారు. గుంపులుగా సాగారు. తండోప తండులుగా ప్రిన్సిపాల్ గది దగ్గరకు వెళ్తున్నారు.

"హెడ్‌క్లార్కు దొంగ"

"స్కాలర్‌షిప్పు లివ్వాలె"

"లంచగొండితనం నశించాలె"

"విప్లవం వర్థిల్లాలె"

నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయి. లోన ఉన్న ప్రిన్సిపాల్ గుండెల్లో గుండ్లు కురిశాయి. అతడు అదిరిపోయాడు. ఏం అవాంతరం జరుగుతుందో అర్థం

కాలేదు. తలుపువేసి, గడియ బిగించి వచ్చి కుర్చీలో కూర్చొని, పోలీసులకు టెలి ఫోను చేశాడు.

అల్లకల్లోలంగా గుంపులు వచ్చేశాయి. ప్రిన్సిపాల్ గది తలుపులు వేసి ఉంటడం చూసి రెచ్చిపోయారు.

"ప్రిన్సిపాలు బయటికి రావాలె"

"ప్రిన్సిపాల్ తలుపులు తెరవాలె"

నినాదాలు చేస్తున్నారు. తలుపులు గుద్దుతున్నారు. గొడవ చేస్తున్నారు. గోల పెడ్తున్నారు.

ఒకడు గునపం తెచ్చాడు.

తలుపుమీద కొట్టాడు.

"తలుపులు బద్దలు కావాలె" నినాదం.

"లంచగొండులు నశించాలె"

"విప్లవం వర్ధిల్లాలె"

తలుపుమీద గునపపు దెబ్బలు పడ్తున్నాయి.

ప్రిన్సిపాల్ గుండెలో తూట్లు పడుతున్నాయి.

విద్యార్థుల ఉద్రేకం హెచ్చిపోతూంది.

తలుపులు విరిగి పడిపోయాయి.

కట్ట తెగిన ప్రవాహంలా గదిలోకి దూసుకుపోయారు విద్యార్థులు.

చెమటలు పట్టిన ప్రిన్సిపాల్ లేచి నుంచున్నాడు.

"ఎందుకిలా దాక్కుంటారు-దొంగల్లా?" పిడికిలి బిగించి చేయెత్తి గట్టిగా కేకవేసింది గీత.

"ప్రిన్సిపాల్ దొంగ"

"ప్రిన్సిపాల్ దొంగ" అంటూ ఆటలాడ్డం ఈలలు కొట్టడం మొదలు-పెట్టారు.

"హింసకు దిగుతున్నారు" ప్రిన్సిపాల్ పలికాడు.

"హింసకు దిగేట్టు చేస్తున్నది మీరు. న్యాయంగా మాకు చెందాల్సిన హక్కు-హరిస్తున్నారు. అడుగుతే ఉలకరు పలకరు. మా విన్నపాలు మీ చెవికెక్కవు. మా కేకలు మీదాకా రావు. అన్నిటికీ "చూతాం" "ఆలోచింతాం" అంటారు సహనం చచ్చి, కోపం పొంగి ఐక్యంగా అడగటానికి వస్తే హింస అంటారు. మీరంతా కలిసి కుట్రపన్ని మా హక్కుల్ని హరిస్తున్నారు. మాకు హింస తప్ప గత్యంతరం లేదు. హింసమీద నమ్మకం కలిగేటట్లు చేస్తున్నది మీరు. దొంగలు బయటపడేదాకా మా ఉద్యమం సాగుతుంది. ప్రపంచంలోని ఏ శక్తి మిమ్మల్ని రక్షించలేదు" గీత ఉద్రేకంగా మాట్లాడింది.

"కుట్రదారులు నశించాలె"

"ప్రిన్సిపాల్ ముర్దాబాద్"

"విప్లవం వర్థిల్లాలె"

"మా స్కాలర్‌షిప్పుల సంగతేమి? న్యాయంగా ప్రభుత్వం మాకిచ్చిన సదుపాయాలను కూడా హరిస్తున్నారు! బంగళాలు సంపాదించి మీ పిల్లల్ను విదేశాలకు పంపడం తెలుసు. ఉట్టికట్టుకొని ఊరేగడం తెలుసు. కార్లల్లో తిరగడం, బార్లలో విహరించడం తెలుసు. ఫీసు కట్టలేక అలోలక్షణా అని ఏడ్చే తలిదండ్రులు తెలియరు. తిండికి లేక రిక్షాలు తొక్కే విద్యార్థులు తెలియరు. ఉండడానికి స్థలంలేక వీధి లైట్ల కింద చదువుకునే పిల్లలు తెలియరు. క్షయరోగంతో బాధపడే తల్లులు తెలియరు. పడుపు వృత్తులకు దిగే అక్కలు, చెల్లెండ్లు తెలియరు. మీకేదీ తెలియదు. తెలుసుకునే కాలం దగ్గరపడ్డది. ఆ అన్నార్తులు, అనాధలు, శ్రామికులు, రైతులే మీకు గుణపాఠం నేర్పుతారు. వస్తుంది విప్లవం-వారి గుండెల్లో ఉన్న అగ్గికొండలు బద్దలయి, లావా పెల్లుబికి, దవాగ్ని రగిలి దోపిడీదార్లను కాల్చికూలుస్తుంది. వస్తుంది. అదెంతో దూరంలేదు" ప్రకాశం ఊపిరి సైతం పీల్చుకోకుండా ఉపన్యసించాడు.

"ప్రకాశం జిందాబాద్"

"ఇన్క్విలాబ్ జిందాబాద్"

నినాదాలు పిక్కటిల్లాయి.

ఆవరణ సాంతం విద్యార్థుల్తో నిండిపోయింది.

పోలీసు లారీలు వచ్చాయి. చిప్పపోలీసులు లారీలలో దిగారు.

వారిని చూచి కుర్రాళ్ళలో ఉద్రేకం హెచ్చింది.

"పోలీసు జులుం ముర్దాబాద్"

"పోలీసులూ-వెళ్ళిపోవాలె"

"వెళ్ళిపోవాలె-పోలీసు కుక్కలు"

"ఖట్మల్ ఆయా-మారుదో"

రెచ్చిపోయిన విద్యార్థులు నినాదాలు చేశారు. కేకలు వేశారు. గొంతులు చించుకొన్నారు. గంతులు వేశారు.

పోలీసులు ఆగలేదు.

విద్యార్థులు రాళ్ళు కురిపించారు.

పోలీసులు లాఠీలు కురిపించారు.

చెల్లాచెదరయిపోయారు పిల్లలు. బల్లలు బద్దలు కొట్టారు. కుర్చీలు విరక్కొట్టారు. తలుపులు నుసి చేశారు.

లాఠీ ఛార్జికి పారిపోయిన విద్యార్థులు చాటున చేరి రాళ్ళు విసిరారు. కనిపించిన విద్యార్థినల్లా పట్టుకొని చావగొట్టారు పోలీసులు.

ఎవరో ఒక క్లాసురూంలో మంట పెట్టారు.

ఫర్నీచర్ అంటుకొని మంటలు లేచాయి.

విద్యార్థులు చాటునుండి దాడిచేస్తునే ఉన్నారు.

పోలీసులు కొడ్తునే ఉన్నారు.

రాళ్ళు, లాఠీలు రణరంగంగా ఉంది కాలేజీ ఆవరణ.

పోలీసులు టియరు గ్యాస్ వదిలారు.

విద్యార్థుల కళ్ళవెంట నీరు కారింది.

వారు చెదిరిపోయారు.

ఫైరుబ్రిగేడ్ వచ్చింది-బూడిదమీద నీళ్ళు చల్లింది.

కాలేజీలో స్మశాన ప్రశాంతి ఏర్పడింది.

సాయుధులయిన పోలీసులు బండ్లకొద్ది దిగారు.

తెల్లవారి పత్రికలు విద్యార్థుల దౌర్జన్యాన్ని గురించి పతాకశీర్షికలు ప్రకటించాయి. స్కాలరుషిప్పుల విషయం ఎక్కడా ఉటంకించలేదు. విద్యార్థుల్లో క్రమశిక్షణా రాహిత్యాన్ని గురించి వాపోయాయి.

కాలేజీకి వారంరోజులు శలవులు ప్రకటించారు.

రామయ్యకు కాలేజీ గొడవ విషయం తెలిసి బాధపడ్డాడు-అతడు ప్రకాశాన్ని గురించి పరితపించాడు. గాంధీని పిలిపించాడు. వివరాలడిగాడు. తనకేమీ తెలియదన్నాడు గాంధీ-తాను కాలేజీకే వెళ్ళలేదన్నాడు. ఎందుకు వెళ్ళలేదని గాంధీమీద కేకలు వేశాడు రామయ్య. గాంధీ సమాధానం చెప్పలేదు. తలవంచుకొని వెళ్ళిపోయాడు. తనను నిర్లక్ష్యం చేస్తున్నాడు గాంధీ అనుకున్నాడు రామయ్య. చీవాట్లు పెట్టాడు. కేకలువేశాడు. గాంధీ అప్పటికే వెళ్ళిపోయాడు-అవేవీ వినలేదు.

గాంధీ చేయిజారి పోతున్నట్లు గమనించాడు రామయ్య. గాంధీ విషయంలో తా నెన్నడూ శ్రద్ధ తీసుకోలేదు. ఎందుకో పుత్రవాత్సల్యం లేదు తనకు వాడిమీద! ఇంట్లో ఉంటున్నాడనే కాని హాస్టలువలె భావిస్తున్నాడు ఇంటిని గాంధీ. వీణ్ణి ఇంట్లోంచి వెళ్ళగొట్టలేదు. వీడు తన కొడుకుగా చలామణి అవుతున్నాడు. సుమతి వాడంటే పడిచస్తుంది - తన విషయంలో ఆదరంలేదు. టెలిఫోను చేసి సుమతికి చెపుదామనుకున్నాడు-నీ కొడుకు "ఆవారా" అవుతున్నాడని. సుమతిని ఉడికించాలనుకున్నాడు-ఉరికించాలనుకున్నాడు. తానంటే లెక్కచేయంది అది ఒక పెళ్ళామా? తనను నిర్లక్ష్యం చేసే వీ డొక కొడుకా? అసలు వీడు కొడుకేనా తనకు? తనకు కొడుకా వీడు?? గాంధీ తనకు కొడుకా??? కొడుకే! కొడుకా!!!

రామయ్య మనసులో మంగమ్మ మసలింది.

కాలం గిర్రున వెనక్కు తిరిగింది.

కరణం ఇల్లు-ప్రస్తుతం తనది. మంగమ్మ భోంచేస్తూంది- రాత్రి-తాను వడ్డిస్తున్నాడు- తాను మంగమ్మను చూచాడు - ఆమె తనను చూడలేదు-తింటూంది- అది తాను రచించిన పథకమే - ఎంత సొగసుగా ఉండేది మంగమ్మ! - ఇప్పుడిలా

ఆయిపోయింది! ఇందుకు తానేకారకుడు కాకేం? అవును ఆనాటి మంగమ్మ - ఇంకా చేయి సైతం కడుక్కోలేదు - తాను కౌగలించుకున్నాడు - ఆమెను ఉక్కిరి బిక్కిరి చేశాడు!

మనోఫలకం మీద మెరిసిన దృశ్యానికే చలించిపోయాడు రామయ్య! రక్తంలో చిచ్చురగిలిందనిపించింది. వళ్ళు వేడెక్కింది. ఎయిర్‌కండిషన్ రూమ్‌లోనూ చెమటపట్టింది.

రామయ్య లేచి నుంచున్నాడు.

గదిలో పచార్లు చేశాడు.

నిలువుటద్దంలో తన ప్రతిమ కనిపించింది.

ప్రతిమ ముందు వీరభద్రం కనిపించాడు.

ఉడుసుకున్నాడు-అదిరిపడ్డాడు!

వెనక్కు తిరిగి చూచాడు - తలుపు తీసి ఉంది.

వీరభద్రం లేడు—ఆలాపనే అనుకున్నాడు - అయినా కామ్రేడ్ వీరభద్రం తనను వదలడం లేదు. అద్దం ముందునుంచి కదిలాడు. గది తలుపు వేశాడు-గడియ బిగించాడు. సోఫాలో చేరగిలబడి సిగరెట్టు వెలిగించాడు.

వీరభద్రం తన ముందు కూర్చున్నాడు.

అవును. అది ఒకనాటి స్మృతి.

మంగమ్మను పెళ్ళిచేసుకోవలసిందని తనను కోరాడు - మంగమ్మ కడుపుతో ఉందని చెప్పాడు - అందుకు తనదే బాధ్యత అన్నాడు - అప్పుడు తానేం చేశాడు? ఆ అభాండం వీరభద్రం నెత్తినే రుద్దాడు! వీరభద్రం! ఎంత మంచివాడు! ఎన్ని త్యాగాలు చేశాడు!! తనను మనిషిగా మార్చిందతనే! కాకుంటే తాను దాసీ కొడుకుగానే ఉండేవాడు! అమృతవాణి కొడుకని వేలెత్తి చూపేవారంతా! ఆనాడు వీరభద్రం మాట విని ఉంటే మంగమ్మ తనకు భార్యగా ఉండేది! ప్రకాశం తన కొడుకయ్యేవాడు!

ప్రకాశం!

ప్రకాశం!!

ప్రకాశం!!!

ప్రకాశం ఏమైనాడో - కాలేజీ గొడవల్లో! అది తెలుసుకుందామనే గాంధీని పిలిచింది! చెప్పలేకపోయాడు వెధవ!! ఎన్ని ఆలోచనలు వచ్చాయి ప్రకాశాన్ని పట్టుకొని! ప్రకాశాన్ని గురించి తెలుసుకోవాలి. అప్పటిదాకా తనకు మనశ్శాంతి లేదు. ఎవరికోసమో కాదు-తనకోసం తెలుసుకోవాలి-తనకు మనశ్శాంతికోసం తెలుసుకోవాలి!

ప్రిన్సిపాలుకు ఫోన్ చేశాడు.

రామయ్య పేరు విని అదిరిపడ్డాడు ప్రిన్సిపాల్ - జరిగిందంతా వివరించి చెప్పాడు.

"ఇందుల ప్రకాశం తప్పేమిటి?" అడిగాడు రామయ్య.

"జనాన్ని వెంటేసుకొచ్చి గడబడ చేసింది ప్రకాశమేనండీ!"

"అయితే మీదేం తప్పులేదంటరు?"

"అంత మాటంటానా? మీరే చెప్పండి మాదేం తప్పో?"

"స్కాలరుషిప్పులు దాచిపెట్టటం ఎందుకు?"

"ఏదో హెడ్ క్లార్కు-?"

"అదే ఎవరో చేసేతప్పు మా మీద పడుతుంది. అందరు ప్రభుత్వం మీదనే దుమ్మెత్తి పోస్తరు. మీవంటి అధికార్లుంటేనే మేం బద్నాం అయ్యేది. గోళ్ళతో పొయ్యేదానికి గొడ్డళ్ళదాకా తెస్తరు. నాకు ఇందులో ప్రకాశం తప్పేమీ కనిపించటం లేదు. సరే జరిగిపోయింది-జరిగిపోయింది. ఆ హెడ్‌క్లార్కును పిలిచి పరిష్కారము చేయించండి. ఏమిటి చిన్నిచిన్న విషయాలకు....మీరు పెద్దగా చదువుకున్న వారు..."

"అట్లనేనండి. నేనూ అదే అనుకుంటున్నా. ఇంతలో మీరు ఫోను చేశారు..... ఒక్కమాట..."

"చెప్పండి"

"నా ప్రమోషను విషయంలో మీరు కాస్త శ్రద్ధచేయాలె...సీనియర్నంటూ ఒక సాయెబు ముందుకు వస్తున్నాడు-వాడికి ఇంగ్లీషు ముక్కరాదు. నైజాం కాలపు వాడు..."

"సరేలేండి. మీ రొకసారి రాండి మాట్లాడదాం...ఒక్కమాట...ప్రకాశాన్ని కూడా పిలిచి పరిష్కారం చేసుకోండి. ఎందుకైనా మంచిది...."

"అట్లనేనండి-మంచిసలహా ఇచ్చారు–Thanks."

"మరొక మాట"

"చెప్పండి"

"ఈ క్రెడిట్ మీకే దక్కనివ్వాలని ఉన్నది నాకు - నా జోక్యం ఉన్నట్లు ఎక్కడా అనకండి"

"ఎంతమాట - ఎంతమాట! ఎందుకంటనండి? ఇంత దయ ఉంటే చాలు మామీద - చాలా చాలా థాంక్సండీ"

"సరే ఉంటామరి" టెలిఫోను పెట్టేశాడు.

మరో కాల్ వచ్చింది - శేషయ్యగారు Wait చేస్తున్నారనీ-పార్టీకి టయమై పోతూందనీ.

రామయ్య ఆతురతగా బయటపడ్డాడు.

శివరావు ఇంటిముందు టాక్సీ నిలిచింది-దిగినవారు ప్రిన్సిపాల్, హెడ్‌క్లార్కు. వారు లోన ప్రవేశిస్తే ప్రకాశం, గీత మరికొంతమంది విద్యార్థులు కనిపించారు. అప్పటికి మంగమ్మకూడా వచ్చేసింది. వారు ఈ విషయమే చర్చిస్తున్నారు.

ప్రిన్సిపాల్‌ను చూచి ప్రకాశం లేచి నుంచున్నాడు - నమస్కరించాడు-వారిని ఆహ్వానించాడు. ప్రిన్సిపాల్ ప్రకాశం పక్కన కూర్చున్నాడు. హెడ్‌క్లార్కు తల వంచుకొని దూరంగా కూర్చున్నాడు.

గీత మంగమ్మను పరిచయం చేసింది - "వీరు ప్రకాశం తల్లి - మంగమ్మ గారు. వీరవనిత. చేయనినేరం మోపి ఈమెను జేలుకు పంపించాడు మీ ఇప్పటి మంత్రి రామయ్య. ఊరంతా కదిలించి పట్నానికి జైత్రయాత్ర తెచ్చింది. ఈమె కిప్పుడు ఇల్లులేదు-పల్లెలో గుడిసెలో ఉంటూంది. రామయ్య మంత్రి అయినాడు - మహాసౌధాల్లో ఉంటున్నాడు - మందిని ముంచుతున్నాడు. న్యాయాన్ని అన్యాయం, అన్యాయాన్ని న్యాయం చేస్తున్నారు నాయకులు. ఈ దేశంలో దేశభక్తులకు ఉండ డానికి నీడలేదు-తినడానికి తిండిలేదు. దేశద్రోహులు అన్ని సౌకర్యాలూ ఆర్జించు కుంటున్నారు. ఇదీ ఈ దేశపు గతి -దౌర్భాగ్యం" గీత కాస్త ఉద్రేకంగానే మాట్లా డింది - ఆమె శ్వాసలో వేడి కనిపించింది.

ప్రిన్సిపాల్ ఒకింత తడబడ్డాడు - అయినా అన్నాడు:- "పులికడుపున పులే పుడుతుంది. ప్రకాశం ధైర్యస్తుడు-సాహసి"

మంగమ్మ పులకించింది.

"మాస్టరుగారూ! ఇంత చిన్న చిన్న విషయాలకోసం సమ్మెలు చేయిస్తుంటే ఎట్ల చెప్పండి?" మంగమ్మ అడిగింది.

"ఏదో పొరపాటయింది. ఆ విషయం మాట్లాడ్డానికే వచ్చా. మాకు మాత్రం ఇదేమైనా సరదా అనుకున్నరా! పరిస్థితులు అలా వస్తాయి - ప్రకాశంగారూ! కాస్త అలా గదిలోకి వస్తారా?" అని లేచి నుంచున్నాడు. ప్రకాశం, ప్రిన్సిపాలు గదిలోకి వెళ్ళారు - వారి వెనక హెడ్‌క్లార్కు సాగాడు.

గదిలో ముగ్గురూ కూర్చున్నారు.

నిముషంలో సగం మౌనం.

ప్రిన్సిపాల్ హెడ్‌క్లార్కును అదోలా చూచాడు.

హెడ్‌క్లార్కు కుర్చీలోంచి లేచాడు. అమాంతంగా ప్రకాశం కాళ్ళమీద పడ్డాడు.

ప్రకాశం లేచి ప్రక్కకు జరగడంతో హెడ్‌క్లార్కు తల నేలకే కొట్టుకుంది.

"ఏమిటిదంతా? ఇదొక నాటకమా?" ప్రకాశం గద్దించాడు.

ప్రిన్సిపాల్ నాటకం చూస్తున్న ప్రేక్షకునిలా కూర్చున్నాడు.

"ప్రకాశంగారూ!" రెండుచేతులూ నేలకానించి తలపైకెత్తి దీనంగా అన్నాడు

హెడ్‌క్లార్కు. "నన్ను మన్నించండి. నా నోట్లో మన్ను కొట్టకండి - నేను పిల్లలు గలవాణ్ణి - నాశనం అవుతాను."

"నా కంతా అయోమయంగా ఉంది. నేను నాశనం చేయడం ఏమిటి? ముందు మీరు లేవండి - ఆ కుర్చీలో కూర్చొని మాట్లాడండి" ప్రకాశం అన్నాడు.

"నాకు కుర్చీలో కూర్చొనే అర్హతలేదు. నేను నీచుణ్ణి - దుర్మార్గుణ్ణి. కాలేజీ డబ్బు కాజేశాను-నన్ను నేలమీదనే పడి ఉండనివ్వండి."

"కాలేజీ డబ్బు కాజేస్తే చక్కగా జేలుకు వెళ్ళాల్సింది - ఇక్కడి కెందుకు వచ్చారు."

"ప్రకాశంగారూ!" హెడ్‌క్లార్కు కళ్ళల్లో నీరు నిలిచింది. "మీరు మన్నించ కుంటే పిల్లల కింత విషం పెట్టి నేనింత విషం తింటా, నా ముఖం లోకానికి చూప లేను. రేపు నా శవాన్నే చూస్తారు" కన్నీరు చెంపలమీద ప్రవహించింది.

ప్రకాశం కరిగాడు. "ఎందుకు? ఏమైంది చెప్పండి?" అని కూర్చున్నాడు కుర్చీలో.

ప్రిన్సిపాల్ ప్రతిమలా కూర్చున్నాడు.

నేలమీద కూలబడే చెప్తున్నాడు హెడ్‌క్లార్కు.

"నా భార్యకు కేన్సరు. కేన్సరు అంటే తెల్సుగా ప్రకాశంగారూ! అది మని షికి కాదు, కుటుంబానికే కేన్సరు. ఎక్కడి డబ్బూ చాలదు. ఆమె ఆస్పత్రిలో-మేము ఇంట్లో. తుదకు ఇక్కడ సాధ్యపడదన్నారు. రాయ్‌వెల్లూరు వెళ్ళమన్నారు. చూస్తూ చూస్తూ ఎలా చంపడం చెప్పండి నిండుప్రాణిని! డబ్బులేదు. వచ్చేది తిండికి చాలదు. దరిద్రం. నరకం అనుభవిస్తున్నాం. రాయవెల్లూరు వెళ్ళాలె. కాలేజీ డబ్బుంది. ప్రాణందక్కితేపదివేలనుకున్నా. బతికి ఉంటే బలుసాకు తినవచ్చనుకున్నా. రాయ్ వెల్లూరు తీసికెళ్ళా. మీరు నమ్మండి నమ్మకండి. రాయవెల్లూరులో డబ్బుకు తప్ప ప్రాణానికి విలువలేదు. డబ్బు లిమ్మాను. ఆపరేషన్లన్నారు. అధ్వానం అన్నారు. ఇంటికి తిరిగి వచ్చేవరకు మరో అవాంతరం.

నాకు ఇద్దరు కూతుళ్ళు. పెద్దది కాస్త గడుసుది. బి. ఏ. చదువుతూంది. ఎవరినో ప్రేమించింది. మేం తిరిగి వచ్చేవరకు లేచిపోయింది. కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని వచ్చిన నా భార్యకు ఇది అశనిపాతం అయింది. దేశమంతా వెతికి వాళ్ళను తీసుకొచ్చాను. కులగోత్రాలు, ఆస్తులు అంతస్తులు చూడలేదు. వాళ్ళకు పెళ్ళిచేస్తే సంతోషంగా కన్ను మూస్తానంది నా భార్య! చనిపోయేదాని కోర్కె తీర్చలేక పోతా నేమోనని నా హృదయం తల్లడిల్లింది. పిల్లవాడి తలిదండ్రులను అడిగాను. పెద్ద మొత్తం కట్నంగా అడిగారు. పిల్లవాణి అడిగాను. ప్రేమించడం వరకే తన వంతనీ కట్నం విషయం తన తలిదండ్రులే నిర్ణయించాలనీ అన్నాడు."

"దుర్మార్గుడు" అన్నాడు ప్రకాశం. ప్రిన్సిపాల్ ప్రకాశాన్ని చూచాడు.

ప్రకాశంలో వేదన కనిపించింది. పరుల బాధలకు వేదనపడే ప్రకాశాన్ని చూచిన ప్రిన్సిపాల్‌కు గౌరవం ఏర్పడింది.

"దుర్మార్గుడైనా, సన్మార్గుడైనా వేరే గత్యంతరంలేదు" హెడ్‌క్లార్కు మళ్ళీ ప్రారంభించాడు. అతనిగొంతు జీరవోయింది. వాతావరణం బరువుగా ఉంది. అతని ధ్వని తప్ప ఏమీ వినిపించడంలేదు. "ప్రాణాలు కొసకొచ్చిన దాని కోర్కె తీర్చాలి. కాళ్ళూ, కడుపులూ పట్టుకున్నా విన్నారుకారు పిల్లవాడి తలిదండ్రులు. స్కాలర్ షిప్పుల డబ్బుంది. వేరే గత్యంతరం లేదు. నాకు తెలుసు నేను అన్యాయం చేస్తున్నానని. నాకు తెలుసు ఇందువల్ల నా ఉద్యోగం పోతుందని. ఏం చేయను? పరిస్థితులు బలీయం అయినాయి. విధి నన్ను బలవంత పెట్టింది. నా భార్య జీవించే ఆశలేదు. ఆమె కోరిక తీర్చాలనుకున్నా. ఆ తరువాత ఆలోచించలేదు. కట్నం ఇచ్చాను. పెండ్లి చేశాను. పెండ్లినాడే నా భార్య కన్నుమూసింది ప్రకాశం బాబూ! నన్ను వంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయింది బాబూ! నన్ను చీకట్లోముంచి తనదారి తాను చూచుకుంది నాయనా!" అని బావురు మన్నాడు హెడ్‌క్లార్కు. కన్నీరు ధారాపాతంగా కారసాగింది. తల బాదుకొని ఏడ్చాడు.

ఏడుపు విని బయట ఉన్న జనం ఉరికి వచ్చారు.

వారిని చూచి కన్నీరు తుడుచుకొని లేచినుంచున్నాడు హెడ్‌క్లార్కు.

కళ్ళు తుడుచుకొని ప్రకాశం లేచినుంచున్నాడు.

ప్రిన్సిపాల్ నుంచున్నాడు. వచ్చినవారు నుంచున్నారు. అంతా చిత్తరువుల్లా చూస్తున్నారు.

ప్రకాశం మనసు క్షోభిస్తూంది. ఈ అవాంతరాలన్నిటికీ ఎవరు బాధ్యులు? హెడ్‌క్లార్కా? పరిస్థితులా? సంఘమా? సమాజమా? వ్యవస్థా? ప్రశ్నల పరంపరలు అతని మెదడును గుచ్చసాగాయి.

అంతా మౌనం.

అంతా నిశ్శబ్దం.

ఎవరూ పలకడం లేదు.

అంతా అయోమయంగా ఉంది.

"ఈ వ్యవస్థే ఈ అన్యాయాలకు, అక్రమాలకు మూలకారణం" ప్రకాశం గొంతు కంగుమంది. నిశ్శబ్దం రెక్కలు చాచుకొని ఎగిరిపోయింది. "రోగానికి డబ్బు, చదువుకు డబ్బు, పెండ్లికిడబ్బు, మంచికి డబ్బు, చెడుకు డబ్బు, బ్రతుక్కు డబ్బు, చావుకు డబ్బు. ప్రతిదానికీ డబ్బుతో ముడిపడివున్న వ్యవస్థ ఇది. డబ్బున్న వాడికి అన్నీ చెల్లుతాయి. అది లేనివాడికి చావడానికికూడా స్వేచ్ఛలేదు. ఈ వ్యవస్థ మారాలె - కాదు - మార్చాలె. అప్పుడుగాని మనిషి మనిషిగా మనలేడు."

"అంత పెద్దమాటలు నాకు తెలియవు బాబూ" హెడ్‌క్లార్కు దీనంగా ప్రార్థిస్తున్నాడు. "నాకీ ఉద్యోగం దక్కించాలి బాబూ! ఉద్యోగం పోతే నేనింత

విషంతిని, పిల్లలకింత విషం పెట్టాలి" అతని కంఠం మళ్ళీ రుద్ధం అయింది. చావు అతని కంటిముందు ఆడుతున్నట్లు కనిపించింది.

"నన్నేం చేయమంటారో చెప్పండి ..మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం వేయడానికి సిద్ధం" అంతకంటే అనలేక పోయాడు ప్రకాశం.

"స్కాలర్‌షిప్పుల డబ్బు తెచ్చి కడ్తానంటున్నాడు" ప్రిన్సిపాల్ వివరించాడు. "మీరు వత్తిడి చేస్తే ఉద్యోగం వదులు కోవాల్సివస్తుంది. విచారణ జరుగుతే అతని ఉద్యోగం ఉండదు. నా దగ్గరికి వచ్చి ఏడిస్తే నీ దగ్గరికి తెచ్చాను. మీరు పట్టుపట్టకుండా ఉంటే అన్నీ సర్దుబాటు చేయగలను"

"మేమేం మనుషులమా? రాక్షసులమా? మీరు సర్దుబాటు చేయండి. మేం అడ్డురాం. నాకు స్కాలర్‌షిప్పు డబ్బు అవసరం లేదు. అందినట్లుగా రశీదిస్తాను"

"నాకూ అక్కర్లేదు" గీత పలికింది.

"బాబూ! మీరెంత మంచివారు! మీమేలు జన్మజన్మలకు మరచిపోలేను. మీరు మనుషులు కారు - దేవతలు" హెడ్‌క్లార్కు గొంతు కృతజ్ఞతతో నిండిపోయింది. తరవాత పలుకులు రాలేదు. కళ్ళల్లో కాలవలు నిలిచాయి.

"మేం మనుషులమే. కాబట్టి కరిగాం. దేవుళ్ళు రాళ్ళు. వాళ్ళు కన్నీళ్ళకు కరగరు"

గీత పలుకులకు మంగమ్మ ఉబ్బిపోయింది. "గీతా! ఎంత గొప్ప మాటన్నావమ్మా! మనం మనుషులం తల్లీ! మనసున్న మనమే కరగాలి. రాళ్ళేం కరుగుతాయి! రప్పలేం కరుగుతాయి!" అని గీతను కావిలించుకుంది.

అక్కడ చేరిన విద్యార్థులు మోహన్, మురళి చకితులయి చూచారు.

ఇంటికి చేరిన ప్రిన్సిపాలు రామయ్యకు ఫోన్ చేశాడు - ప్రకాశాన్ని ఎంతగానో పొగిడాడు.

రామయ్య పొంగిపోయాడు - రెండు పెగ్గులు కొట్టాడు.

కాలేజీ ఆవరణ. సమ్మె ముగిసిన తొలిరోజు. విద్యార్థులు చెట్లకింద చేరి ముచ్చట్లు పెట్టుకుంటున్నారు.

"రాత్రి డాన్సెట్లున్నదంటవ్?" గాంధీ అడిగాడు.

"మజా వచ్చిందనుకో" అన్న రషీద్ "ఆ జరంత గుడ్డపీకేస్తే పిల్ల ఎంత బాగుండెదనుకున్నవ్!" అన్నాడు.

"నా వళ్ళు మండిపోయిందనుకో అది వచ్చి మీదపడ్డప్పుడు."

"సిగరెట్టుకూడా ముట్టించింది నాకు"

"వా రెవా ఏమిదాని వయ్యారం. అట్లనే గలేలగ్ జానా అనుకున్న"

"వట్టి పిరికి ముండకొడుకువు. అనుకున్నంత చెయ్యాలె"

"అట్లనే అంటవా? చూడు ఇయ్యాళ రాత్రికి నా తడాఖా!"

"మగవీరుడయ్యిండయ్యో" అందరూ గొల్లున నవ్వేశారు - రాత్రికి మేము

వస్తామంటే మేము వస్తామన్నారు కుర్రాళ్ళు. అనుకోకుండానే చెమటపట్టింది రషీదుకు.

"ఏమిటీ కాలేజీ వెధవది. అప్పుడే సమ్మె ముగిసిందెందుకు?" ఒకడు విచారం ప్రకటించాడు సిగరెట్టు ముట్టించి.

"అసలు సమ్మె ఎందుకు జరిగిందంటవు?" గాంధీ అడిగాడు.

"ఎరకలేదా?" అని తనకు తెలిసినంతవరకు వివరించాడు రషీద్.

"అయితె హెడ్‌క్లార్కును కొలువులోంచి తీసేసిన్రా?"

"ఎట్ల తీసేస్తరు? ప్రకాశం మెహర్బానీ చూపిండట"

"మెహర్బానీకాదు-లంచం తిన్నడు. లంచం తిని వాణ్ని కొలువులో ఉంచిండు. వాణ్ని ఊడపీకే దాక క్లాసులకు హాజరయ్యేదిలేదు. ప్రకాశం చేతుల్నే ఉన్నదా అంత - సమ్మె సాగాల్సిందే" సిగరెట్టు లాగి నేలకొట్టి అన్నాడు గాంధీ.

"ప్రకాశం లంచం తిన్నడు"

"పెద్దగుమాస్తా కొలువు ఊడాలే"

ఈ నినాదాలు అక్కడక్కడా వినిపించాయి. కొన్ని నిముషాలు ఇందును గురించే గుసగుసలు సాగేయి.

మురళి పరిగెత్తి వచ్చి ప్రకాశంతో చెప్పాడు.

"ఏమంటారు ప్రకాశం లంచం తిన్నాడా? దుర్మార్గులు-నిప్పుకు చెదలు అంటుతుందా? పేదవాడని పెద్దగుమాస్తాను కనికరిస్తే ఇంత నీచమైన అభాండం వేస్తారా? కాలేజీ ఎక్కొట్టడానికి ఇదొక నెపం. నిష్కారణంగా చదువులు పాడుచేస్తున్నారు. వీళ్ళ కుట్ర బట్టబయలు చేస్తా" అని ఎందరు వారిస్తున్నా వినకుండా శక్తిలా ఉరికింది గీత.

అప్పటికి నినాదాలు బలం పుంజుకున్నాయి. స్టూడెంట్సంతా గాంధీ చుట్టూ చేరారు. గాంధీ జోరుగా ఉపన్యసిస్తున్నాడు.

"ప్రకాశం లంచం తిన్నడు." లేకుంటె దబ్బెట్లవస్తది. తప్పు చేసిండుగద హెడ్‌క్లార్కు! కాలేజీపైస మింగిండుగద! ఇంక వాణ్ణి కొలువులెట్ల ఉంచుతం? అవినీతి పెంచుతాండు ప్రకాశం . దాన్ని మనం తుంచాలె. ఏమంటరు?"

"ప్రకాశం లంచం తిన్నడు" నినాదం దద్దరిల్లింది.

"తినలేదు" పరిగెత్తి వస్తున్న గీత గర్జించింది. జనం అటు చూచారు. గీత వీరావేశంతో పరిగెత్తి వస్తూంది. వచ్చి వగరుస్తూ అరుస్తూంది-"ప్రకాశం నిప్పులాంటివాడు. నిప్పుకు చెదలు పట్టదు. అతన్ని లంచం అంటలేదు"

"అయితే హెడ్‌క్లార్కు నెందుకు మాఫ్ చేసిండు?"

"బాగుంది అలా అడగండి చెపుతా" ఉపక్రమించబోయింది గీత.

"ప్రకాశం ప్రియురాలు గీత" గాంధీ అరిచాడు.

"అది వాని పక్కల పంటది" రషీద్ అరిచాడు.

"గీతనే అంటావురా - గూండా గాంధీ - నీ రక్తం చూస్తా" అని ప్రకాశం గుంపులోకి దూరి గాంధీ చెంపమీద లాగి కొట్టాడు-మెడపెట్టి నెట్టి నేలకొట్టాడు.

క్షణం చికితులై చూచారు జనం!

రషీద్ ప్రకాశంమీద పడ్డాడు. మురళి రషీద్‌ను లాగివేశాడు.

స్టూడెంట్స్‌లో రెండు వర్గాలయి పోయినాయి.

బాహాబాహి కచాపిచి యుద్ధం సాగింది.

రెండు వర్గాలూ తన్నుకున్నాయి.

కాలేజీ రణరంగంగా మారింది.

పోలీసులారీలు దిగాయి. లాఠీచార్జి జరిగింది. పిల్లలు చెల్లాచెదరయి పోయారు. మిగిలింది గాంధీ, రషీద్, ప్రకాశం, గీత, మురళి, కృష్ణ మాత్రమే.

గాంధీ ముఖం పొంగింది. బట్టలు చిరిగిపోయాయి.

రషీద్ బట్టలు మాసిపోయాయి.

ప్రకాశం చొక్కా చిరిగింది - నోట్లోంచి రక్తం కారుతూంది.

గీత చీర వూడిపోయింది. లంగాతో, చేతులతో రొమ్మును దాచుకుంటూ నిలిచింది. ఆమె జుట్టు చెదిరింది. ఆమె ఏడవడం లేదు. ఆకలిగొన్న సివంగిలా ఉంది. ఆమె సబిన్‌స్పెక్టర్ను చూచింది. అగ్గి కురిపించింది. ఆ అగ్గిని చూడలేకపోయాడ తను. తల తిప్పుకున్నాడు. పోలీసుల కేదో ఆజ్ఞాపించినట్లు చేశాడు.

గాంధీ తనను చూచుకున్నాడు. తన వేషాన్ని చూచుకున్నాడు. "వీణ్ణి అరెస్టు చేయండి" అని ఆకాశానికి చెప్పి చరచరా సాగిపోయాడు. రషీద్ అనుసరించాడు. ఇద్దరూ కారెక్కారు. రషీద్ స్టీరింగ్ పుచ్చుకున్నాడు. "హరామ్జాదే" అని స్టార్టు చేశాడు. కారు సాగిపోయింది.

"నడవండి పోలీసుస్టేషనుకు" సబిన్‌స్పెక్టరు కరకుగా అనలేదు.

"మేమెందుకు నడవాలి? నేరం చేసినవాణ్ని వదిలి నిర్దోషుల్ని పట్టుకోవడమేనా మీ న్యాయం? వెధవ మాటని ఇంత కల్లోలానికి కారకుడైన గూండాలు కారెక్కిపోతుంటే నోరు కదపరేం? కారున్నవారికి ఒక న్యాయం-మాకొక న్యాయమా? ఇదేనా మీరు నిర్వర్తిస్తున్న విధి? ఇదేనా మీ ప్రభుత్వం చేస్తున్న రాచరికం? నిర్దోషుల్ని హింసించటానికేనా ఇంత ప్రభుత్వ యంత్రాంగం?" గీత గర్జించింది. సబిన్‌స్పెక్టర్ ఊపిరి సలుపుకోలేకపోయాడు.

"అతను మంత్రికొడుకు. అతనిమీద ఈగ వాల్తే మా ఉద్యోగాలు నిలవ్వు-మేం జీతం కోసం పనిచేస్తున్నాం."

"మంత్రికొడుకు మందిని చంపి మారణహోమం చేసినా-మీరు మాట్లాడరన్నమాట. మావంటి మామూలువాళ్ళు మాట్లాడకున్నా మారణహోమం చేశామని నానా హింసలు పెడ్తారన్నమాట. జీతంకోసం ఈ ఉద్యోగం ఎందుకు చేయాలె-గుగ్గిళ్ళు అమ్ముకోవచ్చుగదా?" ప్రకాశం పలికాడు.

"షటప్. మీ లెక్చర్లు వినడానికి రాలేదు. పదండి వ్యానెక్కండి. ఇంత కల్లోలం జరిగినపుడు ఎవర్నీ పట్టుకోకుంటే ఏమన్నట్లు?" సబినస్పెక్టరు మాట.

"మేం వ్యానెక్కం. ఏం చేస్తారో చేసుకోండి" ప్రకాశం అరచాడు. నలుగురూ ఒకచోటికి వచ్చి నుంచున్నారు - బలం పెంచుకోవడానికా అన్నట్లు.

సబినస్పెక్టర్ తికమకపడ్డాడు. లిప్తపాటు అతనికి ఏమీ తోచలేదు. వాళ్ళను చూస్తూ నుంచున్నాడు. వాళ్ళలో పట్టుదల కనపించింది - ప్రకాశం కనిపించింది - విప్లవాగ్ని గోచరించింది. క్షణంలో సగం బెదిరాడు. బూటుకాలు వెనకడుగు వేయబోయింది-వేయలేదు - నిలదొక్కుకుని నుంచున్నాడు. కుర్రాళ్ళు మళ్ళీ గుమికూడుతున్నారు - గేటుదగ్గర - వరండాలలో - దూరంగా చెట్లకింద.

"వాళ్ళను తరమండి" ఆజ్ఞాపించాడు కర్కశంగా పోలీసు అధికారి స్వరంలో. పోలీసులు అటు పరిగెత్తారు.

"వాళ్ళేం తప్పు చేయలేదు. వాళ్ళను తరిమేహక్కు మీకులేదు." అని "సోదరులారా! కదలకండి - బెదరకండి ఈ పోలీసుకుక్కలు మననేం..."

"షటప్" అని ప్రకాశం చెంప ఛెళ్ళుమనిపించాడు సబినస్పెక్టర్.

గీత సబినస్పెక్టర్‌మీద లంఘించింది. మురళి - కృష్ణ ముందుకురికారు. దూరంగా విద్యార్థులు పోలీసులతో ఘర్షణపడుతున్నారు. ప్రకాశం సహితంగా నలుగుర్నీ పట్టి ఎత్తి వ్యానులో పడేశారు పోలీసులు.

"మీరు మానోరు నొక్కగలరు. జనం నోరు నొక్కలేరు. విప్లవం నోరు నొక్కలేరు. విప్లవం వస్తుంది-మిమ్మల్ని భస్మం చేస్తుంది" అన్నాడు ప్రకాశం.

"విప్లవం" గీత కేక పెట్టింది.

"వర్థిల్లాలి" విద్యార్థులు నినదించారు.

"ఇన్క్విలాబ్ జిందాబాద్" నినాదాలతో వ్యాను సాగిపోయింది. కొందరు విద్యార్థులు వ్యానువెంట కొంతదూరం పరిగెత్తి నిలిచిపోయారు. కాలేజీ ఆవరణలో పోలీసులు కాపలా కాస్తున్నారు. వారికి వినిపిస్తున్నాయి నినాదాలు.

"అవును. విప్లవం వర్థిల్లాలె" అని గునిశాడొక జవాను.

వ్యాను పోలీసుస్టేషను చేరింది. ప్రకాశం బృందాన్నిదింపి లోనికి పంపించారు. సబినస్పెక్టరు టోపీతీసి, బల్లమీద పెట్టి సిగరెట్టు ముట్టించాడు. టెలిఫోన్ డయల్ చేయసాగాడు - ఒకటి - రెండు-మూడు - ఎన్నో. కొన్ని గొంతులు అభినందించాయి. కొన్ని చీదరించుకున్నాయి. కొన్ని విసుగుదలగా మాట్లాడాయి. మొత్తంమీద ఉత్సాహంగా లేడతను.

అధికార్ల కార్లు వచ్చాయి. మోటర్ సైకిళ్ళు నిలిచాయి. సంరంభం ఎక్కువైంది. సంభాషణలు సాగుతున్నాయి. Tactfullగా ప్రవర్తించ లేదన్నాడు సబినస్పెక్టరును పై అధికారి. సబినస్పెక్టరు తలవంచుకున్నాడు.

"విద్యార్థులతో చాకచక్యంగా ప్రవర్తించాల్సింది. ఈ కల్లోలం ఇంతటితో ఆగక అంతటా వ్యాపించి మన నెత్తిమీదికే వస్తుంది. ఈ స్టూడెంట్స్ ఉన్నారు చూచావా వాళ్ళు చిచ్చులాంటివాళ్ళు. వాళ్ళతో దూరంగా ఉండాలి గాని దగ్గరికి వెళ్తే చేతులంటు కుంటాయి. ప్రభుత్వం, మంత్రులు ఎప్పుడూ వాళ్ళపక్షానే ఉంటారు. వాళ్ళకు వీళ్ళతో ఎంతోపని. వీళ్ళను తీసుకొచ్చి చాల తప్పుపని చేశావు. అక్కడే అదిరించి బెదిరించి పంపించాల్సింది. ఇప్పుడేం చేయాలో అయోమయంగా ఉంది."

"విప్లవం, గిప్లవం అని వాగుతున్నారు సార్"

"అరుస్తే విప్లవం వస్తుందయ్యా నీ పిచ్చిగాని. ఏదో కుర్రాళ్ళు - ఆ పదం గమ్మత్తుగా ఉంటుందని అనేస్తుంటారు-దాన్ని గురించి అంతగా పట్టించుకోవద్దు. అయినా చూతాంరా వాళ్ళెంత మొనగాళ్ళో! ఇదంతా ఒక అమ్మాయి విషయంలో వచ్చిన తగాదా - I am sorry you should have been more tactfull. అయినా Comeon చూతాం"

"విప్లవం ఎక్కణ్ణుంచి వస్తుంది?" అడిగాడు అధికారి.

"విప్లవం నాలోంచి వస్తుంది. మీలోంచి వస్తుంది. పీడితప్రజానీకంలోంచి వస్తుంది. అది వారందరి, మా అందరి గుండెల్లో మండె కార్చిచ్చు - అగ్నిజ్వాల - బడబాలనం-దవాగ్ని. అది అందరి గుండెల్లో వేరువేరుగా రగులుతూంది. అవన్నీ కలిసినాడు మీ అధికారం — మీ బూర్జువారాజ్యం కాలి కూలి బూడిద అవుతుంది. అప్పుడు ఒక వెలుగు ప్రసరిస్తుంది. చీకట్లు అంతరిస్తాయి. దౌర్జన్యం మటుమాయం అవుతుంది. మానవత వెల్లివిరుస్తుంది. సమతారాజ్యం అవతరిస్తుంది. విన్నారా? ఇంకేమన్నా వివరించాలా??" ప్రకాశం శ్వాసలో అగ్గిచేరింది.

అధికారి ముఖం మాడిపోయింది. సబిన్స్పెక్టర్ నవ్వాడు - చిరునవ్వు. అది అధికారికి కనిపించలేదు. తన తడబాటు వ్యక్తపరచ దలచలేదు. "Very good my boy" అని ప్రకాశం వీపు చరిచి సబిన్స్పెక్టర్‌తో సాగిపోయాడు.

"విప్లవ సాహిత్యం బాగా చదివినట్లున్నాడు. అయినా I don't think he is any danger. పిల్లవాడు మంచివాడుగా కనిపిస్తున్నాడు. He is a nice boy. ఆ అమ్మాయి ఎవరో తెలుసా? మన శివరావు బిడ్డ."

సబిన్స్పెక్టర్ మాట్లాళ్ళేదు.

ఇద్దరూ కుర్చీలో కూర్చున్నారు.

ఆలోచనలో మునిగిపోయారు.

సుడిగాలిలా వచ్చింది మంగమ్మ.

"ఏం చేసిన్రనని పట్టుకున్నరు పిల్లల్ను? దొంగతనాలు చేసిన్రా? ఖూనీలు చేసిన్రా? భూములు మింగిన్రా? హత్యలుచేసి, భూములు మింగి, మోసాలుచేసి మంత్రి అయిందది చాలక పిల్లల్ను పట్టిస్తడా? నాశనం చేసిండు. ఇంక ఎనక పడుతున్నడు. హత్యచేయించి నన్ను జేలుకు పంపిండు. హత్యచేయించి మా నేన్ను జేలుకు

పంపిండు – మల్లయ్యను బికారిని చేసిండు. పసిపాప ప్రకాశాన్ని పట్టిస్తడా? మీరు పట్టుకుంటరా? ఏం చేస్తరో చెయ్యండి - నేను ప్రకాశాన్ని తీసుకుపోత" మంగమ్మ శక్తిలా ఉంది - ఆదిశక్తిలా ఉంది. మహిషాసురుణ్ని మర్దించేట్లుంది.

అధికారులు నివ్వెరపోయి చూస్తున్నారు.

ఆమె లోనికి ఉరికింది - ప్రకాశాన్ని తీసుకొని రావడానికి!

ఇద్దరు పోలీసులు గుమ్మానికి అడ్డం నుంచున్నారు.

కారు డోరువేసిన చప్పుడయింది -శేషయ్య దిగాడు. మెట్లెక్కుతూనే పోలీసు లతో కలియబడుతున్న మంగమ్మను చూచాడు.

"మంగమ్మతల్లీ!" కేకవేశాడు.

మంగమ్మ వెనక్కు తిరిగి చూచింది- శేషయ్య!

గుమ్మానికి అటుపక్క ప్రకాశం బృందం–ఇటుపక్క మంగమ్మ-గుమ్మంలో పోలీసులు-దూరంగా అధికారులు-అంతా అయోమయంగా ఉంది.

"నువ్వెందుకొచ్చినవు? నన్ను పట్టించెటందుకా? రా! పట్టించు. ఇంకేం చేయ గలరు? జంగయ్యను చంపిచ్చిన్రు. నన్ను జేలుకు పంపిన్రు. ఇల్లు గుంజుకున్నరు. నీడలేకుండ చేసిన్రు. ప్రజల్ను ముంచిన్రు. గద్దెలెక్కిన్రు. ప్రజలు నిద్రపోతున్న రనుకుంటున్నరు. కాదు. వాళ్ళలో నిప్పు రాజు కుంటున్నది. లేస్తరు. మిమ్మల్ని మట్టిపాలు చేస్తరు. వచ్చినవుగద. ఊఁ కానియ్యి. ఇదిగో చేతులు - సంకెళ్ళు వేయించు"

"మంగమ్మా! ఎందుకట్ల ఉద్రేక పడ్తవు? కాస్త ఆగు. జరసేపుండు. ఆ తరువాత అను. నన్ను తిట్టు. కొట్టు. నోట్లో ఉమ్మెయ్యి. నేను పడ్త. నేనెందు కొచ్చినో్న తెలుసుకో. అయిదు నిముషాలు శాంతం వహించు"

మంగమ్మ మాట్లాళ్ళేదు. పక్కనున్న బెంచీమీద కూర్చుంది.

పోలీసులు-అధికారులు శేషయ్యకు సలాం పెట్టారు-అతడిపుడు పెద్ద నాయ కుడు మరి!

పోలీసులధికారులతో శేషయ్య గదిలో ప్రవేశించాడు.

చాలసేపు ముచ్చట్లు సాగేయి - అక్కడికి టీ వచ్చింది – సిగరెట్ల పొగతో గది నిండింది. చాలసేపు జరిగాయి మంతనాలు! మనకేం తెలుస్తాయి-అవి రాజ కీయాలు!!

ఇవతల ఉన్నవాళ్ళకు విసుగు కలుగుతూంది.

టెలిఫోను మ్రోగింది - అవి శేషయ్యకు - శేషయ్య పోలీసు అధికారికి ఇచ్చాడు. అధికారి చాల వినయంగా మ్లాట్లాడాడు-సార్ అన్నాడు-ఎస్ అన్నాడు- అయ్యా అన్నాడు. రిసీవరు పెట్టేసి సలాం కొట్టాడు. ముగ్గురూ సిగరెట్లు పీకుతూ బయటికి వచ్చారు. "వదిలెయ్యండి-వారిని" సబిన్స్పెక్టరు జవానులకు తాకీదు

ఇచ్చాడు. గుమ్మానికి అడ్డంగా నుంచున్నవారు జరిగారు. ప్రకాశం, గీత వచ్చి మంగమ్మకు యిరుప్రక్కల నుంచున్నారు. ఆమె ఇద్దరిమీద చేతులు వేసింది.

ఎవరూ మాట్లాడలేదు.

తలెత్తి యిద్దరూ మంగమ్మను చూచారు. తలవంచి మంగమ్మ ఇద్దరినీ చూచింది.

"మంగమ్మా! కారెక్కు. ఇంటి దగ్గర దించివస్తా"

మంగమ్మ కారెక్కింది. మిగతా నలుగురూ ఎక్కారు. కారు సాగిపో యింది.

వెళ్ళిపోతున్న కారును చూస్తూ నుంచున్నారు పోలీసు అధికారులు. "ఇలా ఉంది. మనమేం చేయగలం?" అంటూ కారెక్కాడు అధికారి. చేతికర్రను పిక్కల మీద ఆడించుకుంటూ గదిలోకి వెళ్ళాడు సబిన్స్పెక్టరు.

ఆ రాత్రి-బార్లో-గాంధీ రషీద్ మరికొందరు స్టూడెంట్స్ - మెత్తని వెలుగు-మందమందంగా పాశ్చాత్య సంగీతం-అందరి ముందూ ఎర్రగా రమ్ గ్లాసులెత్తారు. "గాంధీ గెలుపుకు-ప్రకాశం ఓటమికి" అని గుటకలు వేశారు.

"మంచి పనైంది వెధవకు-పోలీసులు బాగా తన్ని ఉంటారు" సిగరెట్టు కాలుస్తూ ప్రవచించాడు రషీదు.

"దమ్ములేదు పోలీసులకు - వదిలేశారు. తెలియదా?" గాంధీ కసి కనబర చాడు.

"నిజంగా వాడే మన్నా చేస్తాడంటావా గీతను?"

"వాడేం చేస్తాడు కొజ్జాగాడు....నేనైతేనా...."

అంతా చప్పట్లు కొట్టారు.

"లంచం తిన్నడంటవా....నిజంగ?"

"వాడి బొంద వాడేం తింటాడు? అయినా తిన్నడనే చెప్పాలె. గీతతో సంబంధం ఉన్నదనే చెప్పాలె. సమ్మె చేయిస్తాడు లుచ్చా! రేపటినుంచి మనం చేయించాలె. పెద్దగుమస్తా. ఉద్యోగం ఊడేదాకా సమ్మె ఏమంటారు?"

"సమ్మెచేస్తాం-గాంధీ జిందాబాద్" గ్లాసులు గలగలమన్నాయి.

"రేపణ్ణుంచి సమ్మె"

"చేసి తీర్తాం-చేయించి తీర్తాం"

వాద్యం మొదలైంది-స్టేజీమీద అమ్మాయి ఆట మొదలైంది. అంతా అటు చూచారు. సమ్మె రేపు-అమ్మాయి ఆట ఇప్పుడు-అందులో మునిగిపోయారు.

తాగుతున్నారు. సిగరెట్లు కాలుస్తున్నారు. చప్పట్లు చరుస్తున్నారు.

అమ్మాయి ఆడుతూంది-ఎగురుతూంది-గంతులు పెడ్తూంది.

వీళ్ళు కేకలేస్తున్నారు. ఈలలు వేస్తున్నారు. ఆటలు ఆడుతున్నారు. రషీదు సీసాతో కొట్టేశాడు. లేచాడు. గంతులు మొదలుపెట్టాడు. ట్విస్ట్ చేస్తున్నాడు.

"హేయ్...హేయ్" అని చప్పట్లు చరుస్తున్నారు. చప్పట్ల దరువుకు అడుగు లేస్తున్నాడు రషీద్. ముందుకురుకుతున్నాడు. సీసాతో రమ్ కొట్టేస్తున్నాడు. వెనక్కి వస్తున్నాడు. ఆడుతున్నాడు.

"చప్పట్లు"

"చప్పట్ల దరువు"

రషీద్ ఆట తారాస్థాయిలో ఉంది. రంజుగా ఉంది. రమ్మగా ఉంది.

గాంధీ లేచాడు. మరికొంచరు లేచారు. ఆట సాగించారు.

ఆట—ఈలలు-చప్పట్లు.

బారు సొంతం గోలగా ఉంది. మిగతా వాళ్ళకు చిరాగ్గా ఉంది-అమ్మాయి ఆట మానేసింది!

"బంద్‌కరుబే" ఎవడో కేకవేశాడు.

"కోన్ హైబే బక్నేవాలా?" స్టూడెంట్స్‌లోంచి ఒకడు అరచాడు. మేనేజరు వచ్చాడు. వాళ్ళిద్దర్నీ సవరించాడు.

ఆట సాగుతూంది. సీసాలు కాళీ అవుతున్నాయి-స్పృహలోలేరు ఎవరూ.

"లక్కీ నాచ్నా" ఎవడో అరచాడు.

అది గాంధీ విన్నాడు. స్టేజీమీదికి చూచాడు. అమ్మాయి నుంచొని ఉంది. ఆడడంలేదు-లేదు - ఆడడంలేదు—వాస్తం-వయ్యారంగా నుంచుంది. నుంచుంది. వయ్యారంగా ఆడదు! ఎందుకాడదు! ఆడది-ఆడదా!!

స్టేజీమీదికి వెళ్ళాడు-చేయిపట్టి లాక్కొచ్చాడు.

"ఆడు"

ఆడలేదామె.

"ఆడు"

ఆడలేదామె.

"ఆడ్తావాలేదా?"

ఆటసాగించిం దామె.

ఆమె చుట్టూ వీళ్ళ ఆట.

ఆట! ఆట! ఆట!

పాట! పాట! పాట!

రమ్ అన్ కోకాకోలా...కో....కో....కో....లా!

రషీద్ అమ్మాయిని చుట్టేసుకున్నాడు.

గట్టిగా అదుముకున్నాడు.

గాంధీ ఆమెమీద పడ్డాడు-స్టూడెంట్స్ పడ్డారు.

కల్లోలం - అరుపులు - కేకలు - హాహాకారాలు - పోట్లాటలు - తన్నుకోటాలు-గుద్దుకోటాలు.

పోలీసు వచ్చేసింది - ఎవరు పిల్చారో తెలియదు - అంతా సర్దుమణిగింది. అంతా వెళ్ళిపోయారు. చూస్తే గాంధీ పడి ఉన్నాడు - గాంధీమీద రషీద్ పడి ఉన్నాడు - దెబ్బలు వాటంగానే తాకేయి - మూలుగుతున్నారు. పూర్తిగా స్పృహ రాలేదు.

రాత్రి పన్నెండయింది - రామయ్య ఇంటిముందు కారాగింది. పోలీసు అధికారి రామయ్యకు సలాం కొట్టాడు. గాంధీని ఎత్తుకుని వస్తూంటే చూశాడు రామయ్య - కుంగిపోయాడు.

"ఎక్కడ జరిగింది?"

చెప్పాడు అధికారి.

"ఆ బారు బంద్ చేయించండి"

"అచ్చా సర్కార్"

అధికారి వెళ్ళిపోతుంటే మళ్ళీ పిలిచాడు.

"కెబెరాజు బంద్ చేయించండి - మొత్తం సిటీలో — పూరే షహర్ మేం... తెలిసిందా? ...రేపట్నుంచే...."

"అచ్చా సర్కార్"

"పోరలు పాడయిపోతున్నరు ... ఖానూన్‌గీనూన్ నైజాన్తే .... రేపటి నుంచి బంద్ కావాలే .... పోతే .... కోర్టులకు పోతడు పోనియ్ .... ఏమంటవ్?"

"ఠీక్‌హై సర్కార్ ... అచ్చా సర్కార్" సలామ్‌కొట్టి వెళ్ళిపోయాడు పోలీసు అధికారి. వ్యాను భుర్రుమని సాగిపోయింది.

రామయ్య గాంధీ గదిలోకి వెళ్ళాడు గాంధీ మంచంలో పడి ఉన్నాడు. బట్టలు చిరిగాయి. ముఖం వాచిపోయింది. స్పృహలోలేడు.

గాంధీని చూచాడు - రామయ్య వళ్ళుమండింది - గుండె మండింది - కళ్ళు మండాయి. లాగి లెంపకాయ కొట్టాడు - గాంధీ మూలిగాడు. పక్కకు తిరిగాడు- రామయ్య ఇంకొకటి వేశాడు — గాంధీ మూలిగాడు — కదిలాడు — కాస లేవలేదు. రామయ్య గ్రహించాడు. లాభం లేదనుకున్నాడు. చరచరా వెళ్ళిపోయి తన గదిలో ప్రవేశించాడు. సిగరెట్టు వెలిగించాడు.

రామయ్య మనసు మనసులో లేదు. ఎవడు వీడు? ఎందుకిలా బాధపెడ్తున్నాడు? వీణ్ణి వదిలించుకోలేడా? ఎలా? వీడు తన కొడుకుగా చెలామణి అవుతున్నాడు- ఎలా? సుమతిని వదిలేస్తే? ఇప్పుడా? ఈ దశలోనా? పెళ్ళాన్ని వదిలేశాడనరు? తన ప్రతిష్ఠ ఫలుకుబడి!!! రామయ్య మెదడులో సూదులు గుచ్చుకుంటున్నాయి. గుండెలో గునపాలు దిగుతున్నాయి. మధన పడుతున్నాడు — మెలికలు తిరుగుతున్నాడు. ఏం చేయాలి? ఎలా చేయాలి? ఎవరితో చెప్పాలి? ఎవరున్నారు తనకు? ఎవరు? ఎవరు? ఎవరు? తనకుడబ్బుంది - అధికారం ఉంది - పదవి ఉంది. కాని తనవాళ్ళు - తనవాళ్ళు - తనవాళ్ళులేరు....లేరు....లేరు.

ఎడారి – సహారా ఎడారి.

ఇసుక మండిపోతూంది – కాలిపోతూంది.

కనుచూపుమేరలో ఏమీలేదు – ఇసుక – ఇసుక-ఇసుక. ఇసుక గాడ్పులు–ఇసుక తెప్పలు. ఇసుక తిన్నెలు! ఒక్క గడ్డిపరకలేదు ... ఒక్క పచ్చని ఆకు లేదు .... పైన ఆకాశం ... చుట్టూ ఆకాశం ... కింద ఎడారి .... ఇసుక.

ఒక్కడు తాను!

తాను ఒక్కడు!!

ఒక్కడే రామయ్య!!!

ఏం చేస్తాడు? ఏడుస్తాడు? ఏమో ఎలా చెప్పడం? అదిగో లేచాడు. టెలి ఫోను తిప్పుతున్నాడు. పెట్టేశాడు. మళ్ళీ మోగింది. టెలిఫోను మోగింది – అర్థ రాత్రి ... రిసీవర్ ఎత్తాడు.

"ఎవరు మాట్లాడేది ... సుమతేనా? ... నీ సుపుత్రుడు ఉద్ధరించిండు.... వచ్చిచూడు...." పెట్టేశాడు ఫోను – మంచంమీద పడుకొని పొర్లుతున్నాడు. ఎప్పుడో నిద్రపట్టింది.

తెల్లవారే వరకు సుమతి పరిగెత్తుకొని వచ్చింది. చూస్తే గాంధీ లేవలేదు. చొల్లుకారుస్తూ నిద్రపోతున్నాడు. గాంధీని చూచింది. ఆమెకు దుఃఖం ముంచుకొని వచ్చింది. పక్క గదిలోకిపోయి ఏడ్చింది - ఎక్కెక్కి ఏడ్చింది. నీటిలో మునిగే వానికి చేతికందిన పూచిక పుల్లకూడా దూరంగా - దూరదూరంగా – పోతున్నట్లని పించింది. ఏడ్పు ఎంతసేపని ఉంటుంది? ఏడ్చేమనిషి ఎంతసేపని ఏడ్వగలదు? ఓదార్చేవారుంటే ఆ మాట వేరు–మరికొంతసేపు ఏడ్వవచ్చు! వంటింట్లోకి వెళ్ళింది. వంటమనిషి గాంధీని గురించి ఎన్నెన్నో వివరించింది - అతని ప్రతాపాలు విడ మర్చి వివరించింది. ఈతడవ సుమతికి దుఃఖం రాలేదు. కోపం వచ్చింది – తన కొడుకు వంటమనిషికి కూడా లోకువా? వంటమనిషిని గద్దించింది–కోప్పడ్డది. గాంధీ గదికి వచ్చింది. అతడు అప్పుడే లేస్తున్నాడు. కళ్ళు నులుముకుంటున్నాడు. తల్లిని చూచాడు.

"అమ్మా! నువ్వు వచ్చినవా? పిలిపించారా?"

"నువ్వు చేసిన ఘనకార్యాలకు నేనింత విషం తినాల్సొచ్చేటట్లున్నది?"

"నేనేం చేసిన్నని? నన్ను వీళ్ళు బద్నాం ..."

"బద్నాం చేస్తున్నర్లే" అప్పుడే గదిలో అడుగుపెట్తున్న రామయ్య వెటకా రంగా అన్నాడు "చేసేవి లుచ్చాపనులు. రాత్రి నీకు తెలివి ఉంటె గొంతు పిసికి పాతిపెట్టెటోణ్ణి. బుద్ధిమంతుడ వవుతవని గాంధీ పేరు పెట్టుకున్నం. ఇట్లాంటి లుచ్చావయితవని తెలుస్తే గోడ్సే పేరు పెట్టెవాళ్ళం. గాంధీ పేరుకు మచ్చ తెస్తి న్నవు గాడ్దికొడక. చూడు నీ కొడుకు ప్రతాపం. తాగి తందనాలాడి పొల్లల్ను పట్టి

గుంజుతుంటె పట్టుకొచ్చిన్రను పోలీసోళ్ళు. లొడితెడులేదు గాడ్డికొడుక్కు పొల్లలు కావాలె. నా పరువు గంగలో కలపటానికి వచ్చిండు - యాణ్ణించి తెచ్చినవోగని?"

"ఎందుకట్ల తిడ్తరు వాణ్ణి? చిన్నతనం బుద్ధి చెప్పాలె గని?"

"ఏం చేసిన్నని బుద్ధి చెపుతరు? నేనేం తప్పుపని చేసిన? ఒక పెగ్గు ఎక్కువ తాగటం తప్పా? అమ్మాయిని అంటుకోవటం తప్పా? ఛీ...ఛీ... ఈదేశమే ఇంత. No freedom. No liberty. స్వేచ్ఛ లేదు. స్వాతంత్ర్యంలేదు. అందరూ బానిసలే. నాలుగు ముద్దల్తిని మూలకు పడుంటం నాకు చేతకాదు. నేను యువకుణ్ణి. ఆధునిక యువకుణ్ని. అమ్మాయి లెందు కోసం ఉన్నారు - మా కోసం. తాగు డెందుకోసం ఉంది? మా కోసం. మీకిష్టం లేకుంటే చెప్పండి. వెళ్ళిపోతాను. అమెరికా వెళ్ళిపోతాను. అక్కడ నైట్ క్లబ్బులో అమ్మాయి వళ్ళోకూచొని తాగు తాను. ఇది బిచ్చగాళ్ళదేశం — సన్నాసులదేశం - ఇక్కడ నేను ఉండలేను. మీరే ఉండండి" అని బయల్దేరాడు గాంధీ. గుమ్మంలో రామయ్య ఉన్నది గమనించ లేదు. సుమతి దారినుంచి తొలగింది. రామయ్య జరగలేదు. గాంధీ గుమ్మందాకా వచ్చాడు. రామయ్య గాంధీని రెండు చెంపలూ గట్టిగా వాయించాడు. గాంధీకి అది అనుకోని పరిణామం.

గాంధీ చెంపలు పొంగాయి.

అతడు రామయ్యను చూచాడు.

రామయ్య నిప్పులు కురుస్తున్నాడు.

గాంధీలో ప్రతీకార జ్వాల రగిలింది.

చేయెత్తాడు రామయ్య మీదికి!

సుమతి చూచింది - "గాంధీ నాయనా!" అని పరుగునపోయి గాంధీని వెనక్కు నెట్టింది. గాంధీ పడిపోయాడు. ఆ ఊపుకు గాంధీమీద సుమతి పడి పోయింది.

"ఇగా! నీ కొడుకున్నడు. నువ్వున్నవు. వాణ్ని బాగుచేసేవంతు నీది. వాడు బైటికెళ్ళినా నీ ప్రాణాల్మీస్త. నేను టూరుకు పోవాలె. పోతున్న. మల్లేమన్న చేస్తే ఇగ చూడు" బూట్లు చప్పుడుచేస్తూ చరచరా వెళ్ళిపోయాడు రామయ్య.

గాంధీ లేచి గబగబా సాగిపోయాడు. సుమతి కేకలు పెడ్తూ వెంట పరి గెత్తింది - కాని గాంధీ బయటి గుమ్మంవైపు నడవ లేదు - లోని గుమ్మంలోకి వెళ్ళిపోయాడు.

సుమతి నిట్టూర్చింది.

నేలమీద కూలబడ్డది.

నిరామయంగా చూచింది.

ఆమె కిది ఇల్లుగా కనిపించలేదు - లంకగా కనిపించింది.

అక్కడ మనుషులు కనిపించలేదు-రక్కసులు.

సుమతి సీతలా కూలబడ్డది-ఏడ్చింది — దైవాన్ని దూషించింది. దేవుణ్ని నిందించింది. ఆమె ఎవరికీ మొక్కలేదు - ఎవరినీ వేడుకోలేదు-అందరినీ తిట్టింది అందరినీ సాపించింది. ఆ దశ అంతే. ఆ అవస్థే అంత. ఆ పరిస్థితి ఆలాంటిది. అది ఎవరినీ ప్రార్థించనివ్వదు. వేడుకోనివ్వదు. పడిగాపులు కాయనివ్వదు. అన్ని జరిగినా, అన్నీచేసినా ఏమీ కాలేదు. అప్పుడు క్రోధం పెల్లుబుకుతుంది. కోపం అవధులు దాటుతుంది. తిరుగుబాటుకు దారితీస్తుంది. సుమతి తిరగబడ్డది! ఎవరిమీద? దేవుళ్ళమీద! ఆమె నమ్ముకున్నది వాళ్ళను. వాళ్ళేమీ చేయలేకపోయారు. అందుకే తిరుగుబాటు - తిరుగుబాటు-తిరుగుబాటు.

కాలేజీలో సమ్మె విజయవంతంగా సాగింది. గాంధీ మనుషులు గేట్లదగ్గర కాపలా కాశారు. ఒకింత దౌర్జన్యంకూడా జరిగింది. అయితేనేం హెడ్‌క్లార్కును తొలగించేదాకా కొనసాగింది. హెడ్‌క్లార్కు ఉద్యోగం ఊడగానే సమ్మె విజయ వంతంగా ముగిసిందని ప్రకటించారు. గాంధీకి జయధ్వానాలు పలికారు. ఎత్తుకొని ఎగిరారు కుర్రాళ్ళు. ఆ రాత్రి మద్యం మంచినీటిలా పారింది. విజయోత్సవం చేసు కున్నారు యువకులు-యువతులు. ఆ విందు జరిగింది రషీద్ ఇంటో. ఆ విందుకు ఒక ప్రత్యేకత ఉంది-ఆనాటి రాత్రి **L.S.D.** ప్రవేశపెట్టాడు రషీద్.

ఆ రాత్రి గాంధీ ఇంటికి రాలేదు. రామయ్య రాలేదు. మరుసటి రోజు మధ్యాహ్నం చేరుకున్నాడు గాంధీ. గాంధీని చూచి సుమతి గుండె పగిలింది. అవ తారం పూర్తిగా మారిపోయింది-కళ్ళు పీక్కుపోయాయి-వాటిలో తేజస్సులేదు. జుట్టు చెదిరి ఉంది. చెంపలు డొక్కుపోయాయి-మనిషి అదోరకంగా తయారయినాడు.

గాంధీని చూచి దుఃఖం పొంగింది-పొర్లింది. కొడుకును కావిలించుకొని భోరుమని ఏడ్చింది.

గాంధీకి ఏదో అయోమయంగా ఉంది. ఏమీ అర్థం కావడంలేదు.

సుమతి గాంధీని గదిలోకి తీసికెళ్ళింది. మంచంమీద కూర్చోపెట్టింది. తాను కుర్చీలో కూర్చుంది. పైటచెంగుతో కళ్ళు తుడుచుకుంది "బాబూ! ఎందుకిట్ల మారిపోతున్నవు? ఎందుకు నన్నిట్లు రోజుకింత చంపుతున్నవు? చూడు ఆ మంగమ్మ ఎంత బాగున్నదో! దాని కొడుకు ఎంత బాగ చదువుకుంటున్నడో!" చిన్నపాపకు చెప్పినట్లు తల నిమురుతూ చెప్పింది.

"ఛీ! ఆ ప్రకాశంగాడా! వాణ్ణి ఓడించానమ్మా! నిన్న సమ్మెలో గెలిచింది నేనే! వాడు ఓడిపోయాడు. నన్ను ఎత్తుకొని ఎగిరారంతా - జైజై అన్నారు. ఏమను కున్నావు? రాత్రంతా అదే లొల్లి. అందుకే రాలేదు. ఏమనుకున్నవ్?"

"నిజం! నిజమా బాబూ! నువ్వు గెలుస్తున్నవా ప్రకాశం మీద చాలుబాబూ! చాలు. నాకు కావలసిందదే! నువ్వుగొప్పోనివి కావాలె - ప్రకాశంకంటె - మీనాయ్న కంటె. నాకిప్పుడు శాన సంతోషం గున్నది. శాన సంతోషంగున్నది నాయ్నా!"

"డాడికి సంతోషం లేదమ్మా - కావాలంటే దబ్బియ్యాడు - ఎట్లా గెలుస్తా వాడిమీద?"

మంగమ్మకు మరోరకంగా అర్థం అయింది - రామయ్య ప్రకాశం పక్షం వహిస్తున్నాడు - కావాలనే గాంధీని చెడగొడ్తున్నాడని.

"అట్లనా ? అయితే నాయ్న నడగకు - నేనిస్త పైకం. నువ్వు ప్రకాశంకంటె గొప్పోనివి కావాలె - ఇన్నవా?"

"అమ్మా నువ్వు దబ్బియ్యి - ఎంత గొప్పవాణ్ని అవుతానో చూడు-ప్రకాశం పేరుకు గూడా ఉండదు"

"అట్లనా నాయ్నా!" సుమతి సంతోషంతో పొంగిపోయింది. కొడుకు తల ముద్దాడింది. గాంధీకి తలంటి స్నానం పోసింది. దగ్గర కూర్చొని భోజనం పెట్టింది. చేతినిండా డబ్బిచ్చింది. కారెక్కింది. ఊరికి పోయింది. పోవడం పోవడం దేవుని గదిలోకి పోయింది. తిట్టినందుకు క్షమించమని దేవుళ్ళను వేడుకుంది. పూలతో వారిని పూజించింది.

రషీద్ ఇంటో విజయోత్సవం జరిగిన్నాటి రాత్రి - శివరావు ఇంటో:-

"రియాక్షనరీ సమ్మెలు గెలుస్తున్నాయి. స్వార్థపరులు — దేశద్రోహులు వీరులై పోతున్నారు. జనం గొర్రెల మందల్లా వారివెంట పోతున్నారు! నాకు దేనిమీదా నమ్మకంలేకుండా పోతూంది - ఒక్క తుపాకి మీద తప్ప!"

"ప్రకాశం!" కేక పెట్టింది మంగమ్మ.

ఆరాత్రి శివరావు ఇంట్లో చిన్న సమావేశం ఏర్పాటయింది. కొందరు విద్యార్థులు వచ్చారు. మంగమ్మను పిలువలేదు - ఇంట్లో ఉంది కాబట్టి వచ్చి కూర్చుంది.

"అమ్మా! నువ్వు భయపడ్తావు. నాకు తెలుసు. తల్లిగా నీకు నామీద ఉన్న వాత్సల్యం నిన్ను భయపెడ్తుంది. కాని ఆలోచించు - ఒక్కసారి ఆలోచించు. పరిస్థితులకు లొంగి తప్పుచేసిన పెద్ద గుమాస్తా మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాలా? అతని ఉద్యోగం ఊడింది. పిల్లలతో ఇప్పుడతను ఏంకావాలి? ఏనుయ్యో గొయ్యో చూచు కోవాల్సిందేగా! ఈ సమాజం అతనికి కల్పించిన రక్షణ ఏమి? చెప్పమ్మా చెప్పు"

మంగమ్మ మాట్లాడలేదు - ఆలోచిస్తూంది

"రామయ్య తప్పులు చేయలేదా ? నిన్ను నాశనం చేయలేదా ? మల్లయ్య మామను నాశనం చేయలేదా ? హత్య చేయించి హుసేన్ను జేలుకు పంపించలేదా? వాళ్ళ కుటుంబాన్ని సర్వనాశనం చేయలేదా? వాడు మనుషుల్ని కాదు - దేశాన్ని నాశనం చేశాడు - ఇప్పుడు మంత్రి అయినాడు - అతనికి అన్ని రక్షణలూ కల్పిస్తూంది సమాజం!!! అతన్ని ఊడపీకడానికి సమ్మెలు చేయరేం? సత్యాగ్రహాలు చేయరేం? ఊరేగింపులు తీయరేం? ఊడపీకరేం? ఏం ఎందుకు చేయరు? ఏం ఎందుకు ఆలోచిస్తూ కూర్చుంటారు? అవును నాకు తెలుసు. వాళ్ళ మీలోవున్న బలాన్ని పీల్చేశారు. ప్రగతి శక్తుల్ని నాశనం చేశారు. - చచ్చు

పీనుగుల్ని చేశారు. ఏవో సంస్కరణ అంటారు - ప్రణాళికలంటారు - జనాన్ని ఉద్ధరిస్తామంటారు. మీరు సోషలిజం అంటే వాళ్ళు ఏకంగా కమ్యూనిజం అంటారు. ఇంక మీరు చేసేదేమిటి? వాళ్ళు పెద్దవలపన్నారు. ఈ వలలో అందరూ చిక్కుకున్నారు. ఈ వలను ఛేదించాలి - ముక్కలు ముక్కలు చేయాలి. కాల్చేయాలి- బూడిద చేయాలి. అందుకు తుపాకి కావాలి - హింస కావాలి - రక్తపాతం జరగాలి - విప్లవం చెలరేగాలి.

విప్లవం వర్ధిల్లాలె

"సాయుధ విప్లవం వర్ధిల్లాలె"

గట్టిగా నినాదాలిచ్చాడు ప్రకాశం.

ఇల్లు నినాదాలతో ప్రతిధ్వనించింది.

"అరవండి—బాగా అరవండి—గొంతులు చించుకోండి. వస్తుంది విప్లవం. తుపాకి పట్టుకోగానే దేశం మారిపోతుంది. తుపాకిపేరు జపిస్తే విప్లవం వస్తుంది. దొరికిన నలుగుర్ని చంపండి-రక్తం పారించండి-వచ్చేస్తుంది సోషలిజం దేశంలో-కుర్రకుంకల కేకలకే...!"

"కక్కయ్యా!" ప్రకాశం కేక పెట్టాడు. అతని కళ్ళు మండుతున్నాయి - వళ్ళు వణుకుతూంది.

ఇంట్లోకి ప్రవేశిస్తున్న వీరభద్రానికి నినాదాలు వినిపించాయి. వినిపించి మొదలు పెట్టాడు. వీరభద్రం కూర్చున్నాడు-అందరూ వీరభద్రాన్ని ఆకలిగొన్న సింహాల్లా చూస్తున్నారు.

"మమ్మల్ని కుర్రకుంకలన్నారు — కేకలేస్తున్నామన్నారు — మీరేం చేస్తున్నారు? మీ లేబర్ ఫీల్డు ఏమయింది. ఒకనాడు కార్మికులందర్నీ కదలించిన - పోరాటానికి ఉసికొల్పిన మీ కార్మిక సంఘాలేమైనాయి? తాగుబోతు, జూదరి, బ్లాక్ మార్కెట్‌దారూ, స్మగ్లర్ శేషయ్య కార్మికనాయకుడై కార్మికరంగంలో మీకు నిలువనీడ లేకుండా చేస్తే మీరేం చేశారు? ఏం చేస్తున్నారు? అతనితో కాకుంటే అతని పార్టీతో చేతులు కలిపి కమిటీల్లో, సంఘాల్లో చేరి భజన చేస్తున్నారు-ఇదేనా విప్లవమార్గం - చెపితే వింటాం - శలవీయండి" గీత గట్టిగా అడిగింది.

అక్కడ కూడినవారంతా చప్పట్లు కొట్టారు.

వీరభద్రం ముఖం వెలవెల పోలేదు-మంగమ్మ ముఖం వెలుగులు చిమ్మింది.

"అగ్గో! అక్కణ్ణే ఉన్నది కిటుకంతా. మేం మొదటినుంచి చెపుతున్నాం. వీండ్లు వినటంలేదు. ప్రభుత్వ పక్షంలో కూడ ప్రగతి వాదులున్నరంటరు. వారి చంకల్లో దూరి విప్లవం తెస్తమంటరు. వీండ్లు ప్రజలను ఎప్పుడో మరిచిపోయిన్రు. పల్లెల్ను వదిలిన్రు. అట్లనే విప్లవం వస్తదంటరు. వస్తనే ఉన్నది. ఒక సమ్మె చేయిస్తరు. ఊరుకుంటరు. ఒక ఊరేగింపు తీస్తరు. ఊరుకుంటరు. ప్రభుత్వంమీద వత్తిడి

తెస్తమంటరు. ఇది దొంగల రాజ్యం. దొంగల ప్రభుత్వం. వాళ్ళు వింటరా? వీళ్ళ సాయుధ విప్లవానికి ద్రోహం చేసిన్రు." మంగమ్మ.

"ద్రోహం చేసింది మీరు. ఆపవలసినప్పుడు ఆపక ప్రజల ప్రాణాలు తీశారు" వీరభద్రం.

"1942లో ద్రోహం చేసింది మీరు"

"ప్రజాయుద్ధం అని మసిపూసింది మీరు"

"సుబాస్‌బోసును ద్రోహి అన్నది మీరు"

"మీవల్ల పార్టీ నాశనం అయింది"

"మీవల్ల దేశం నాశనం అయింది"

"మీవల్లనే" అంటే "మీవల్లనే" అనే మంగమ్మ - వీరభద్రం లేచి సుమారు కొట్టుకోవడానికి తయారైనారు.

ప్రకాశం, గీత చూస్తూ నుంచున్నారు.

"ఇదిగో ఒక మాట చెపుతున్నాను. విప్లవం ప్రజల్లోంచి రావాలె – ప్రజలు తేవాలె. ప్రజలు అందుకు సిద్ధంగాలేరు. వ్యక్తిగత హింస విప్లవం అనిపించుకోదు. నలుగురు భూస్వాముల్ను చంపగానే సమాజం మారదు. తుపాకిగొట్టంలోంచి మాత్రమే విప్లవం వస్తుందనడం అశాస్త్రీయం–మూర్ఖత్వం. తుపాకులుపట్టి నలుగురు బలికావలసిందేతప్ప ప్రయోజనం వుండదు. ఇది చరిత్ర చెప్పిన సత్యం. మంగమ్మా! పిల్లల్ను ఉసిగొల్పుతున్నావు – ఇది మంచిదికాదు" అని వీరభద్రం చరచరా వెళ్ళిపోయాడు.

మంగమ్మ కుర్చీలో కూలబడ్డది.

"గాజులు తొడిగించుకొని ఇంట్లోకూర్చుంటే వస్తుంది విప్లవం–మహావిప్లవం" మురళి అన్నాడు. అతడు పదాలు వత్తిపలికాడు. కుర్చీలో గట్టిగా కూలబడ్డాడు.

మంగమ్మ తలమీద చేయివేసుకొని ఇంటి కప్పును చూడసాగింది.

ఎవరూ మాట్లాడలేదు.

అంతా గప్‌చిప్‌గా ఉంది.

ఫ్యాన్ గిరగిరా తిరుగుతూంది.

"అవును. తప్పే" మంగమ్మ మౌనాన్ని భంగంచేసింది.

అందరూ వినడానికి సిద్ధపడ్డారు.

"తుపాకికి తరుణం రాలేదు. అది నిజం. ప్రజలు అందుకు సిద్ధంగాలేరు. పార్లమెంటులోనూ బయట పోరాటాలు జరపాలె - బందూకుతో ప్రయోజనం లేదు. బందూకుతో విప్లవంరాదు. ప్రకాశం! నువ్వు బలి అవుతుంటే చూడలేను." మంగమ్మ గొంతు జీరపోయింది.

"ప్రజలు సిద్ధంగాలేరు. ప్రజలు సిద్ధంగాలేరు. ఇదొక నినాదంగా మారింది మీకు. పరిస్థితుల్ను గురించి మాట్లాడరు. ఇంతకంటే నీచమైన, నికృష్టమైన పరిస్థి

తులు చరిత్రలో ఎప్పుడైనా వచ్చినవా? వీటన్నింటికీ కారణం ఈ నికృష్ట ప్రభుత్వం కాదా? కాలదోషం పట్టిన కేపటిలిజం కాదా? తిండి దొరక్క, ధరలు పెరిగి, చదువు లేక, చదువుంటే ఉద్యోగంలేక, ఉద్యోగం దొరికితే తిండికిచాలక ప్రజలు పరిత పించి పోతున్నారు — సమ్మెలు చేస్తున్నారు. ఊరేగింపులు తీస్తున్నారు. దోపిడీలు చేస్తున్నారు. ఈ ప్రభుత్వం పోవాలనీ, ఈ విధానం నశించాలనీ ప్రతివాడూ కోరు కుంటున్నాడు. ప్రతి భారతీయుని గుండెలో మంటలు రాజుకుంటున్నాయి—మండు తున్నాయి. వారికి నాయకత్వం వహించేవాడు కావాలి. ఓట్లతో సమాజం మారదు. మారదు. మారదు. అలా ఎక్కడా జరగలేదు. తుపాకిలోంచే విప్లవం రావాలె. వస్తుంది. ఇది నా దృఢవిశ్వాసం. నేను బలి అవుతానా? మరో నలుగురు-పదిమంది-వందమంది బలి అవుతారా కానీ. ఈ సమాజాన్ని మార్చడానికి చచ్చామనే సంతృప్తి అయినా ఉంటుంది. బతికి ఈ సమాజంలో జీవించలేను - లేము"

"విప్లవం వర్ధిల్లాలి"

"సాయుధ విప్లవం వర్ధిల్లాలి" గీత పిడికిలి బిగించి నినాదం చేసింది.

శివరావు ఇల్లు ప్రతిధ్వనించింది.

మంగమ్మ లేచి మెట్లెక్కి చరచరా మేడమీదికి వెళ్ళిపోయింది.

"చాతకాని వాళ్ళు - నీతులు చెప్పగలరు"

"వీళ్ళా విప్లవం తెచ్చేది - నీరసించిపోయారు"

"విప్లవద్రోహులు వీళ్ళే - విప్లవానికి అడ్డుపడుతున్నారు"

ఇలా అనుకుంటూ వెళ్ళిపోయారు - విడిపోయారంతా. ప్రకాశం తలుపువేసి వెళ్ళిపోతుంటే తలుపుతట్టిన చప్పుడయింది. తలుపు తీసి చూశాడు — మెట్లమీద నుంచొని ఉన్నాడు - కొత్తమనిషి.

"మీరు ప్రకాశమా?" అడిగాడు వచ్చినవాడు.

అవునన్నట్టు తల ఊపాడు ప్రకాశం.

"పెద్దవానివైనవు! గుర్తు పట్టలేదా?"

ప్రకాశం కాస్త తికమక పడ్డాడు.

"నేను హుసేన్ను"

"ఎవరు హుసేనా! ఎక్కణ్ణుంచి? జేలునుంచి రావడం? మారిపోయారు. గుర్తించలేదు. రాండి లోపలికి." అని లోనికి వచ్చి కూర్చున్నాడు ప్రకాశం.

హుసేను వచ్చి ఎదురుగా నుంచున్నాడు. అతడు నుంచున్నాడనే విషయం సైతం గమనించకుండా ప్రకాశం ఎగాదిగా చూస్తున్నాడు.

"ఎంత మారిపోయాడు హుసేన్ - హంతకుడు! హత్యచేసి జేలు శిక్ష ముగించుకొని వచ్చాడు! ఎంత సౌమ్యంగా ఉన్నాడు! ఎంత మార్పు వచ్చిందితనిలో! కాస్త నల్లబడ్డాడు. లావెక్కాడు. గడ్డం పెంచాడు. తల గొరిగించాడు. నిత్యం నమాజు చేస్తున్నట్లు నొసట మచ్చ ఉంది. వింతగా మారిపోయాడు. విచిత్రంగా

మారిపోయాడు!! అసలు ఆ హుసేనేనా ఈ హుసేన్! మనిషి మరోజన్మ ఎత్తినట్లు న్నాడు!!!" ప్రకాశం ఇంకా ఏవేవో ఆలోచిస్తున్నాడు.

"ఏం మారాజ్! నన్ను నమ్మటంలేదా? నేను పాత హుసేనుకాను. మనిషిని! మారాజ్ మనిషిని!! ఇన్సాన్‌హూఁ సాబ్ ఇన్సాన్! నన్ను సైతాన్ చేసినోడు రామయ్య. కండ్లు తెరిచిన ప్రకాశం సాబ్. కండ్లు తెరిచిన! నాతోని హత్యలు చేయించిండు-వాడు పెద్దోడయిండు. నా పెండ్లం పోయింది. పోరలు పోయిన్రు. నేను మిగిలిన-ఇన్ఖిలాబ్ మిగిలింది. లాల్ సలామ్ ప్రకాశం సాబ్. లాల్ సలామ్ కామ్రేడ్ ప్రకాశం" మరి మాట్లాడలేక పోయాడు హుసేన్. అతని కళ్ళు ఎర్రవారేయి-చెమ్మగిల్లాయి.

"లాల్ సలామ్ కామ్రేడ్" అని ప్రకాశంలేచి హుసేన్ను కావిలించుకున్నాడు.

"విప్లవం ఇక్కణ్ణుంచి రావాలె. పతితుల్లోంచి, భ్రష్టుల్లోంచి, బాధాసర్ప దష్టుల్లోంచి. మనం గెలుస్తాం. విప్లవం గెలుస్తుంది." ప్రకాశం ఉద్రేకంగా అన్నాడు.

"గెలుస్తం. మనం గెలుస్తం. ఇన్ఖిలాబ్ జిందాబాద్" అన్నాడు హుసేన్.

ప్రకాశం పొంగిపోయాడు - పొర్లిపోయాడు.

తెల్లవారి మంగమ్మ ఊరికి వెళ్ళిపోయింది - హుసేన్ ఆమె వెంట వెళ్ళిపోయాడు.

* * *

మంగమ్మ ఊరు బయట గుడిదగ్గర బస్సుదిగింది. సంచితో తన గుడిసెకు బయల్దేరింది. వెంట హుసేన్ ఉన్నాడు. హుసేన్ను ఎవరూ గుర్తించలేదు.

"మంగమ్మక్కా! ఎవల్నో తీసుకొస్తున్నవు - పట్నం కెల్లా?" గడ్డిమోపు ఎత్తుకొస్తున్న పిచ్చమ్మ అడిగింది. మోపులో కొడవలి ఉంది.

"హుసేనన్న కాదు - ఎరకపట్టలే?"

"ఏందీ! హుసేనా! జేలుకెల్లి వచ్చినాడు!" పిచ్చమ్మ మాటల్లో బుగులు కనిపించింది.

"అవు. పిచ్చమ్మొదినా హుసేన్నే. జేలుకెల్లే వచ్చిన. పాత హుసేన్ను కాదు. మంగమ్మతల్లి మనిషిని చేసింది. బుగుల్పడకు" అని చిన్ననవ్వు నవ్వుకున్నాడు హుసేను.

పిచ్చమ్మ నుంచోలేదు. చరచరా వెళ్ళిపోయింది. దూర దూరంగా జనం గుంపులుకూడి చూడసాగారు హుసేన్ను.

మంగమ్మ సాగిపోయింది - మంగమ్మ వెంట హుసేనూ సాగిపోయాడు.

మంగమ్మ ఇంటి తాళం తీశాడు హుసేను. మంగమ్మ వంగి లోన ప్రవేశించి లాంతరు వెలిగించింది. గుడిసెలో వెలుగు వ్యాపించింది. హుసేన్ బయట కూలబడ్డాడు. ఊరిని చూచేవరకు అతనికి భార్య గుర్తుకువచ్చింది. బూబమ్మను తల్చుకునే వరకు గుండె చెరువైంది. తనకు తెలియకుండానే కన్నీరు రాలింది. చీకట్లో అతని

ఎద ఏడ్చింది. తాను సర్వనాశనం అయినాడు. ఎవరు దీనికి కారణం? రామయ్య! రామయ్య అతని ముందు నుంచున్నాడు – వికటంగా నవ్వుతున్నాడు. హుసేన్ గుండె మండింది. కళ్ళు మండాయి.

"హుసేనన్నా!" మంగమ్మ లాంతరు పట్టుకొని బయటికి వచ్చింది. లాంతరు వెలుక్కు హుసేన్ను చూచింది. హుసేను కూర్చునే తల ఎత్తాడు. ఇంకిపోతున్న కన్నీటి చారలు కనిపించాయి.

"మంగమ్మతల్లీ! ప్రకాశమయ్య చెప్పిందే నిజమనిపిస్తాంది" ధ్వనిలో ఏదో దృఢనిశ్చయం వినిపించింది.

మంగమ్మ చేతిలో లాంతరు వణికింది.

"నాకు సుత అట్లనే అనిపిస్తాంది" మరో గొంతు వినిపించింది. మంగమ్మ లాంతరు ఎత్తిచూచింది - యలమంద.

"ఏంది యలమందన్నా!"

"నా కొంప ముంచిండు గాడ్దికొడుకు.... వాని అమ్మ.... వాని నెత్తి పగల కొత్త.... వాని అక్క...."

హుసేన్ లేచి యలమంద నోరు మూశాడు. "ఉష్ ఎవరన్న ఇంటరు!" అని.

"ఇంటె ఏంచేస్తరు? పానంతీస్తరు. బతికిమాత్రం చేసిడిదేంది మానంపోయి నెన్క" నోటిమీంచి హుసేన్ చేయిలాగి అన్నాడు యలమంద.

మంగమ్మకు ఏమీతోచలేదు. అంతా అయోమయంగా ఉంది. "అన్నా! లోపలికిరా" అని గుడిసెలో దూరింది. యలమంద లోనికి దూరి "మంగమ్మక్కా! నా పరువు తీసిండు యాదగిరిగాడు." అని భోరుమన్నాడు. "ఏం చేసిందన్నా! చెప్పు" లోనికి ప్రవేశిస్తూ హుసేన్ అడిగాడు.

"ఏం చెప్పుకోనన్నా! నా బద్రిమానం తీసిండు. నా బిడ్డను చెరిచిండు. ఏం చెప్పుకోను? ఎట్ల చెప్పుకోను?" తలబాదుకొని ఏడుస్తున్నాడు యలమంద.

మంగమ్మ కొయ్యబారి పోయింది. రామయ్యతో తన అనుభవం మెదడు లోంచి ఉరికింది ఒక్కసారి.

"నీ బిడ్డ మానం తీసిండులే.... వాని గొంతు పరపర కొయ్యాలె. ఎంత మంది కొంపలీసరు లంజకొడుకులు" పళ్ళు పటపట కొరికాడు హుసేను.

మంగమ్మ అదిరిపడ్డది. "ఉద్రేకపడొద్దు హుస్సేన్! ఏం జరిగిందో చెప్పనీ"

"ఇంకేం చెప్పుత నా బొంద. బద్రిని చెరిచిండు. అదిప్పుడు బాయిల పడ్త నంటాంది. కడుపు చింపుకుంటె కాళ్ళమీద పడ్తది. ఎవనికి చెప్పుకునెటట్లులేదు - దానికేమొ లగ్గం చేస్తిని. అది చస్తె నేను బతుకుతనా? చస్తే ఊరికే చస్తనా వాణ్ని చంపి చస్త" తరవాత మాట్లాళ్ళక పోయాడు-మాటల్లో వేడి ఎక్కువయింది.

మంగమ్మకు తనకు సంబంధించిన దృశ్యాలు కొన్ని మనసులో మసలాయి- ఆ రాత్రి తాను బావిలో పడబోవడం-వీరభద్రం చెంపదెబ్బ కొట్టి లాక్కొరావడం- తాను గదిలోపడి ఏడవడం. స్త్రీజాతి గతి ఇంతేనా? అనుకుంది. ప్రకాశం ఆడపిల్ల అయ్యుంటే?" ఏవేవో పిచ్చి ఆలోచనలు వచ్చాయి.

"ఏమో ఆలోచిస్తున్నరు?'' హుసేను అడిగాడు.

''ఏంలేదూ భద్రమ్మ ఎక్కడున్నది?''

''ఇంట్లనే ఉన్నది. అర్రలపెట్టి తాళమేసి వచ్చిన''

''పోదాం పాండి'' మంగమ్మలేచి బయల్దేరింది. ఇద్దరూ అనుసరించారు. యలమంద ఇంటికి చేరుకున్నారు. తలుపు తీశారు. చాపచుట్టలా పడివుంది భద్రమ్మ- మంగమ్మను చూచింది. మంగమ్మ మీదపడి భోరుమంది ''అత్తమ్మా! నేను నాశనం అయిన. బతికి ఏంచేస్త బాయిలపడ్త'' గుండెలు అవిసేట్టు ఏడుస్తూంది భద్రమ్మ. మంగమ్మ గుండె నీరయింది. తన కూతురే ఏడుస్తున్న ట్లనిపించింది. కంట తడి పెట్టింది. తల నిమిరి ఓదార్చింది. ఓదార్చిన కొద్దీ ఏడుపు ఎక్కువవుతూంది భద్రమ్మకు. హుసేను, యలమంద చూస్తూ నుంచున్నారు - నిస్సహాయులుగా నుంచున్నారు - నిశ్చేతనులుగా నుంచున్నారు - భద్రమ్మ ఏడుస్తుంటె వారూ ఏడుస్తున్నారు - ఎదల్లో!

మంగమ్మ ఓదార్చగా ఓదార్చగా ఊరుకుంది భద్రమ్మ. "ఏమైందో చెప్పు" మంగమ్మ అడిగింది.

"బట్టలేస్తనంటె పోయిన. పోతనే ఉంట అప్పుడప్పుడు. ఇంట్ల సావిత్రమ్మ లేనట్లున్నది-నాకే మెరక - బట్టలేసుకుంటనే తలుపులు పెట్టిండు. లోపలికి గుంజక పోయిండు. అరుస్తనని నోట్లగుడ్డలు కుక్కిండు" ఇంక చెప్పలేకపోయింది.

ఎవరూ మాట్లాడలేదు.

నిశ్శబ్దంగా ఉంది.

అందరూ ఏదో ఆలోచనల్లో పడిపోయారు.

"నరికెయ్యాలె లంజకొడుకును" హుస్సేను మాట విని ముగ్గురూ తలలెత్తారు.

"ఎందుకు నరికిన్రంటె ఏమంటవ్.... భద్రమ్మను చెరిచిండు గనుక నరికి న్నంటవ్. జేలుకుపోయి నువ్వు బాగనే ఉంటవ్. భద్రమ్మ బతుకేమైతది? తల్లిలేని పిల్ల-మగడు తీస్కపోడు.... ఏమంటవ్?" మంగమ్మ ప్రశ్నించింది.

"అవ్. అదికూడ నిజమేనండి. మల్ల ఏం చేస్తమంటరు?"

"భద్రమ్మా! పానం తీస్కుంటె ఏం లాభం? నువ్వు బాయిల పడ్తవు పానం తీస్కుంటవ్. వాని కేమయితది. చచ్చిన వంటే ముందే మంటరు? ఏదో తప్పు చేసింది కాబట్టి చచ్చిందంటరు. నువ్వు చస్తే మీ అయ్య చస్తడు. మీ అయ్యకెవరున్నరు చెప్పు. ఇగ ఇల్లు పాడయితది. మంది పాలయితది. మల్ల యాదగిరే ఇల్లు గుంజుకుంటడు"

"ఏం చెయ్యమంటవత్తమ్మ" భద్రమ్మ అడిగింది. భద్రమ్మ పసిపిల్ల-కాకుంటే పద్దెహేడు పద్దెనిమిదేళ్ళుంటాయి. తల్లిలేని పిల్ల అని పొలం యాదగిరి దగ్గర తాకట్టు పెట్టి పెళ్ళిచేశాడు యలమంద. భద్రమ్మ అమాయకంగా చూస్తుంటె మంగమ్మ గుండె తరుక్కుపోతూంది.

"ఏం చెయ్యొద్దు. అది మరిచిపో. ఈ ఊరు మరిచిపో. అత్తగారింటికి ఎళ్ళిపో-మీ అయ్య వస్తుంటడు-నువ్వు రావద్దీడికి?"

"అత్తమ్మా!" అని బావురుమంది భద్రమ్మ. ఇది తాను పుట్టి పెరిగిన ఊరు. తల్లిని మింగిన ఊరు. తన తండ్రి ఉన్న ఊరు. తాను రాలేదు. రాకూడదు. అవును. ఇక్కడ ఒక రాక్షసుడున్నాడు. రాకూడదు. రాకుంటమే మంచిది.

"అంతేనంటరా?" యలమంద అడిగాడు.

"నా కదే బాగనిపిస్తున్నది. ఇగ ఈసంగతి ఎవరికి తెల్వకుండాలె. పొద్దున్నే పోయి అత్తగారింట్లో దించిరా"

"అదే బాగనిపిస్తాంది" హుసేన్ పలికాడు.

మంగమ్మలేచి భద్రమ్మ తల ముద్దాడి బయల్దేరింది. ఇంటికి వచ్చి పడుకుందనేగాని నిద్రరాలేదు. ఇంత కిరాతకం జరుగుతే చూస్తూ ఊరుకోవడమేనా? దీనికి ఉపాయం లేదా? లేదా? లేదా? లేనట్లే ఉంది. తాను బలహీనురాలయింది. వీరభద్రం బలహీనుడయినాడు. జనం బలం లేకుండా ఉంది. రామయ్య బలవంతుడు. శేషయ్య బలవంతుడు. యాదగిరి బలవంతుడు. వీళ్ళు బలవంతులయింది ఎప్పుడు? స్వాతంత్ర్యం వచ్చిం తరవాత. తాము బలహీనులయిం దెప్పుడు? స్వరాజ్యం వచ్చిం తరవాత! పోలీసుచర్య జరిగిం తరవాత! స్వరాజ్యమూ, పోలీసుచర్యా ఎవరికోసం వచ్చాయి? వారికోసం - వారికోసమే - జనంకోసం కాదు - మన కోసంకాదు - కాదు మనకోసం అసలేకాదు. ఎంత గొప్ప సత్యం తెలిసింది ఈనాడు? ఇది భద్రమ్మ పతనంలోంచి బయల్వెడలిన సత్యం! ఈ సత్యానికి మసిపూశారు - మారేడుకాయ చేశారు. అది నిజమే ఏం చేయాలిప్పుడు? ఏం చేయాలి? ఏమిటి చేయటం? ఏం చేయగలం మనం? జనం సిద్ధంగాలేరు. జనంలోని జవసత్వాలు చచ్చిపోయాయి - చంపేశారు. పిల్చి పిప్పిచేశారు. అసలు నేనేం చేశానని? రామయ్య నన్ను చెరిచాడు— జేలుకు పంపించాడు. ఏం చేశాను నేను? ఏం చేశారు జనం? ఓటమి! ఓడిపోయాన్నేను. ఓడిపోయారు జనం!! గెలుపు వారిదేనా? ఎప్పుడూ వారిదే గెలుపా? కాకేం? ఎప్పుడు ఓడారువారు! ఓడిందెపుడు వారు! వారిలో ఏదో మంచి ఉందంటాడు వీరభద్రం! కాదు. తప్పు. ఇదంతా వీరభద్రం వల్లనే జరిగింది. ఓడించాలి వీరభద్రాన్ని! ఓడిస్తాం. ఓడించి తీర్తాం! ఓడించాలి వీరభద్రాన్ని! ఓడించి తీర్తాం వీరభద్రాన్ని! మరి ప్రకాశం! మార్గం తప్పు! తప్పు! తప్పు!! తుపాకితో సాధించలేం. సాధించలేం! సాధించలేం! ప్రకాశాన్ని ఓడించాల్నా? ఓడించాల్సిందే! మంగమ్మకు కునుకు పట్టింది.

తెల్లవారి భద్రమ్మను అత్తవారింటికి పంపించి వచ్చాడు యలమంద. భద్రమ్మ కనిపించకుంటే మండిపడ్డాడు యాదగిరి. యలమందను పిలిపించాడు. బాకీ తీర్చా ల్సిందని బలవంతం చేశాడు. పొలం తాకట్టులో ఉంది యాదగిరి దగ్గర. పాపం యలమంద విలపించాడు. విలవిల్లాడాడు. తండ్రి తాతలనుంచి వచ్చిన పొలం పోయే ట్లుంది. కన్నతల్లిలా చూచుకున్నాడు పొలాన్ని. తల్లిపోయింది - భార్యపోయింది - కూతురుగతి అట్లా అయింది. ఇప్పుడు తనపొలం ఊడుతూంది.

"వచ్చేసాలుకు పంటమీద ఇస్తనుండి"

"వచ్చేసాలుకు జాగీర్లొస్తయను కుంటున్నవా? రొండేండ్లయింది. వడ్డీ అసల్ను మించింది. ఇగ ఆగెడిదిలేదు. ఇస్తవా పైస ఇయ్యి– లేకుంటె పొలం వదులుకో - ఏమంటవ్?"

"ఏమంటనుండి, కాల్మొక్త, పైస పూరకట్ట. జర ముద్దతియ్యండి" ప్రార్థిం చాడు యలమంద.

''నీ అయ్య సొమ్మనుకున్నవా ముద్దతిచ్చేటందుకు? పొలంల కాలు పెత్తె కాళ్ళిరక్కొడ్త ఏమనుకున్నవో–బేఇమాన్ లంజకొడుకులున్నరు. అక్కరున్నప్పుడు కాళ్ళు పట్టుకుంటరు. పనితీరినంక బొండిగ పట్టుకుంటరు-మీ కులమే అట్లరా?''

''కులాన్నెందు కంటరుండి? ఎక్కొడ్తనంటున్ననా? మల్లి మా అయ్య సొమ్ముకాకుంటే బూమి మీ అయ్య సొమ్మానుండి?''

''మాటలేమొ శాన మీర్తాన్నవ్. కండ్లు నెత్తికెక్కినయి. సర్లేగనిపో. ఇగపో. పొలంల కాలుపెత్తె పానాల్దక్కవు. ఇగ అయ్యను తెస్తవో అమ్మను తెస్తవో తెచ్చుకో'' అని లేచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు యాదగిరి సిగరెట్టు ముట్టించి.

''గుంజుకోండి బూమి-ఇంకో బంగ్ల కట్టుకోరి. మేమేం చస్తాముండి- రెక్కలు చల్లగుంటె అయిపాయె'' అని వెళ్ళిపోయాడు యలమంద.

పొలంలో అడుగు పెట్టె ధైర్యం ఎవరికీ లేకపోయింది.

యలమంద కూలీగా మారిపోయాడు.

యాదగిరి నాగళ్ళు యలమంద పొలం దున్నాయి.

చలికాలం వచ్చేసింది. సూర్యుని వడితగ్గింది. నిప్పుకు కూడా చలి పెడ్తూంది. ఊళ్ళోనూ, పొలాలదగ్గర చలినెగళ్ళు మండుతున్నాయి- పొలాలు పంటకు వచ్చే శాయి. గింజకు కటకటలాడి పోతున్నారు కూలి నాలి జనం - ఊళ్ళో సుమారు ప్రాంతం కూలిజనమే-యాదగిరి, రామయ్య తప్ప. పంట కోతకు వచ్చింది. కూలి జన్నాన్ని పిలిపించాడు యాదగిరి - నారయ్య కూడ అక్కడికే వచ్చాడు. పంట దేశానికి చాల అవసరమనీ, కూలీలంతా వళ్ళు దాచుకోకుండా త్వరత్వరగా కోతలు ముగించి దేశభక్తి చాటుకోవాలని చిరు ఉపన్యాసం ఇచ్చాడు యాదగిరి - సర్పంచ్ అయినాక ఉపన్యాసం ప్రాక్టీస్ చేస్తున్నాడు - ఇదొక ప్రయోగం!

"పొట్టకు చాలలేదుండీ! కూలి పెంచాలె" మల్లయ్య కూర్చునే అన్నాడు - ఉపన్యాసం లేచి నుంచొని ఇవ్వాలని అతనికి తెలీదు. డొక్కలోని మాట బయటికి వచ్చేసింది.

"మల్లన్న అన్నమాట నిజమేనుండి. ఏది చూచినా మండిపోతాంది. పొట్టకు చాలతలేదు-బాంచెను" సైదయ్య విన్నవించుకున్నాడు.

"అంతేనుండి కూలి పెంచాలె - బతికిటట్టులేరు గరీబోళ్లు" అంతా ముక్త కంఠంగా అన్నారు.

యాదగిరి, నారయ్య ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

"అరే! పొట్టెంతరా జానెడు" నారయ్య సాగించాడు. "దానికి ఎంతైనా చాలదు. ఊళ్ళన్ని దోచుకొచ్చి పోసుకున్నా చాలదంటది. ఉన్నకాడికి సుఖపడటం నేర్చుకున్నోడే గొప్పోడు. పెంచమంటె యాడికని పెంచుతం! ఈ కూలికి చచ్చేటోళ్ళు కోటిమందున్నరు. కో అంటే ఉరికొస్తరు. ఎందంటె ఉన్న ఊరోళ్ళకు ఒక్కడు బువ్వ పెట్టాల్నని. పెంచుడు గించుడు పెట్టుకోకుండి. పోయినేడాది ఇచ్చినంతిస్తం - ఏమంటవు యాదగిరన్నా!" యాదగిరిని చూచి చిరునవ్వు నవ్వాడు నారయ్య.

"సరె ఇస్తంలె. ఎరువులు గిరాకయినయి - దొరుకుతలేవు. కర్చులు పెరిగినయి. అంత ఇస్తమా అని ఆలోచిస్తుంటి నేను-సరె ఇగ నారయ్యన్నడు-తప్పుతాది? అట్లనే ఇస్తంలేరి. పని సురుచెయ్రి" యాదగిరి గునిశాడు.

"అదేందుండి అట్లంటరు? ఎరువులేస్తే పంటలెక్కువ పండుతలేవుండి - ఏమైన కూలోండ్ల నోట్ల మట్టికొట్టెతందుకు చూస్తరు. మేం లేకుంటె కోతయితాయుండి. జరంత కూలి పెంచమంటె నీతుల్చెప్పుతరు? మల్లి మీకెందుకుండి అంత ఆశ. పొట్ట జానెడేనాయె. తలా ఇంత పంచిపెట్టరాదుండి" హుసేను లేచి నుంచొని అన్నాడు. అతని ధ్వనిలో ఏదో పట్టుదల కనిపించింది. మాటలు వాడిగా ఉన్నాయి-సూటిగా తగిలాయి.

"జెల్లమాగనే నేర్చుకొచ్చిండయ్యో - మా కెంతుంటె మీ కెందుకుర - కూలి చేసేటందుకు వచ్చిన్రు? నిరుడిచ్చినంత ఇస్తం. కోతలకు వస్తరో రారో చెప్పండి - మీరు కాకుంటె మీ అయ్య ఇంకోడొస్తడు" లేచినుంచొని సిగరెట్టు వెలిగించాడు యాదగిరి — గోచి ఊడ్తే సర్దుకున్నాడు.

"కూలి పెంచకుంటె కొయ్యముండి" యలమంద లేచి నుంచొని అన్నాడు.

"కొయ్యరట - లంజకొడుకులు - పొరుగూళ్ళనుంచి పిలిపిస్త. కోతలాగుతయనుకుంట్రేమో!" నారయ్య యాదగిరి చేతులోంచి సిగరెట్టు తీసుకొని కాల్చాడు.

"మేమేం గాజులు తొడిగించుకొని కూచున్న మనుకుంట్రా! ఎట్లొస్తరో ఆ ఊరోళ్ళు చూస్తం. తలకాయలు పగలాలె. మా పీనిగలమీంచి నడిచిరావాలె.

వాండ్లు మాత్రం కూలోండ్లు కారా? మా పొట్టలు మట్టికొడ్తరా" మల్లయ్యలేచి అరచాడు.

"అట్లనా. చూస్త. పోలీసోళ్ళను పెట్టి కోయిస్త. పదివేలు కర్చుపెడ్త. మీ కొక్క గింజ రాలనియ్య" యాదగిరి చరచరా లోనికి వెళ్ళిపోయాడు. చూస్తే ముందు జనం ఉన్నారు. భయమైంది నారయ్యకు. యాదగిరి ఇంట్లో దూరాడు.

"ఎట్లొస్తరో మేం చూస్తాముండి. పోలీసోళ్ళొచ్చి గొంతులు కోస్తరుగని - పంటలు కోస్తరా? నడువుండి - నడువుండి మంగమ్మ తానికి పోదాం" అని దారి తీశాడు హుసేను.

జనం మంగమ్మ ఇంటికి చేరారు.

"ఉన్ననేల చక్కలు గుంజుకున్నరు. ఇప్పుడు పొట్టకు చాలిన కూలికూడా ఇయ్యనంటున్నరు. కూలిచేసి ఉపాసాలుండే కాడికి కూలెందుకు చెయ్యాలె. ఉపాసా ఉండే చస్తం" పిచ్చమ్మ గుండె మాటల్లో వ్యక్తపరిచింది.

మంగమ్మ నివ్వెరపోయి చూచింది - మాట్లాడుతున్నది పిచ్చమ్మేనా అని.

"ఏదో ఒకటి తేల్చుకోవాల్నుంది. వీండ్లు బతక నిచ్చేటట్టులేరు" హుసేన్ ఉరిగాడు.

జరిగిందాన్ని సంక్షిప్తంగా వివరించాడు సైదయ్య.

"ఈ భూములు ప్రజలవి. చెమటోడ్చి భూమిని దున్ని, నాట్లువేసి, కంటికి రెప్పోలె కాపాడి పంటలు పండిస్తున్నది మనం. పంటనంత అమ్ముకొని గింజ లేకుండ చేస్తున్నది వాళ్ళు. భూములు గుంజుకున్నరు. కూలీలను చేసిన్రు. కూలి ఇచ్చి కూలీలు చేయిస్తున్రు. ఆడపిల్లల్ను ఉండనియ్యటంలేదు ఊళ్ళో. దౌర్జన్యం ఎక్కువయింది ఊళ్ళో. ఈ పంట పండించి వారి గాదెలు నింపుతున్న మనకు సోలెడు గింజలు ఎక్కువియ్యమంటె ఇయ్యమంటాన్రు. ఈ ఇండ్లు కట్టింది కూలీలు. వారు కాలు కింద పెట్టకుండా చాకిరి చేస్తున్నది కూలీలు. వారు తింటున్న తిండిలో కూలీల చమట - రక్తం ఉన్నాయి. మనం లేకుంటే వాళ్ళు క్షణం నిలువలేరు. మననే దోపిడిచేస్తరు. వంచిస్తరు. హింసిస్తరు. పిచ్చమ్మ చెప్పింది నిజం. ఇంత కంటె ఉపాసాలుండి చస్తేనే మంచిది. మనదగ్గరేముంది పోవటానికి. పోతే దాస్యమే పోతుంది. చూతాం ఎప్పుడు కోస్తడో పొలాలను! ప్రాణాలు అడ్డువేస్తాం - కాని కోతలు కానియ్యం."

"మంగమ్మకీ జై"

"పాణాలు అడ్డువేస్తం - కోతలు కానియ్యం" నినాదాలు చేశారు జనం.

"అందరం కట్టుగుండాలె. అటెన్క ఏమైతదో చూస్తం. చస్తే చస్తం - వీండ్లు బతక నిచ్చేటట్లున్నరా మనల" యలమంద పట్టుదల కనబర్చాడు.

జనం వెళ్ళిపోయారు. యలమంద, హుసేను, సైదయ్య, మల్లయ్య మిగి

లారు. పొరుగూళ్ళకు వెళ్ళి ఇక్కడి పరిస్థితి వివరించాలనీ వారిని ఇక్కడికి రాకుండా చూడాలని చెప్పింది మంగమ్మ.

"వస్తె బతుకుతారుండి. తలలు ఎగిరిపోవాలె" హనుమేను పలికాడు.

"మనం దౌర్జన్యానికి దిగరాదు. అందరికీ చెప్పిరావటం వివరించటం మన విధి". మంగమ్మ వివరించింది.

అదేవిధంగా తలా ఒక ఊరికి వెళ్ళిపోయారు.

ఊరు ఉడికి పోతూంది. పొలాల్లో పంట నిల్చుతూంది. ఊళ్ళో కూలీలు ఉపాసాలుంటున్నారు. యాదగిరి నీలుగుతున్నాడు. ఎప్పుడో దిగిరాక పోతారా అని చూస్తున్నాడు. నారయ్యకు బుగులుగా ఉంది పంట రాలి పోతుందని - చేతికి రాదని. ఆ మాటే అన్నాడు యాదగిరితో. "నీలుగుడు లంజకొడుకులకు - ఈ రంకుముండ మంగమ్మ దొరికింది పీండ్లకు - ఇదిలేకుంటె ఇంత దైర్నం చేసెటోండ్లు కారు."

"మరి ఏంచేస్త మంటవు?"

"చేసెడిదేంది. నాలుగొద్దులుంటే వాండ్లే కాళ్ళకాడి కొస్తరు."

"ఏమో నాకట్లనిపిస్తలేదు"

"నీకెట్లనిపిస్తదిగని.... రొండు రోజులుసూచి పొరుగూళ్ళనుంచి పిలిపిస్త - కూలి రొండింతలిస్త"

"అట్లయితె మనకేం లాభమయితది?"

"నీకిదంత తెల్వదులే ఇగపో...."

నారయ్య రామయ్య ఇంటికి వెళ్ళాడు. సుమతి కుర్చీలో కూర్చొని భాగవతం చదువుకుంటూంది. ఆమె చదువుతున్నది రంతిదేవుని కథ. నలభై ఎనిమిదిరోజులు రంతిదేవుడు అతని పరివారం ఉపవసించారు. నలభై తొమ్మిదోనాడు కొంత నేయి, పాయసము, నీరు దొరికాయి. తినడానికి కూర్చుంటే బాపడు వచ్చాడు. అతనికి కొంత పెట్టాడు. తరవాత శూద్రుడు వచ్చాడు. అతనికి పెట్టాడు. తదుపరి కుక్కలను తీసుకొని మరో అతిథి వచ్చాడు. మిగిలిన ఆహారం అతనికి ఇచ్చేశాడు. మిగిలింది నీరు. అది తాగుదామనుకుంటె మరొకడు వచ్చి "రాజా! నేను నీచజాతి వాణ్ణి. దాహంతో ప్రాణాలు పోతున్నయి. నీరు పోసి రక్షించు" అన్నాడు. రంతిదేవుని గుండె కరిగింది. "భగవంతుడా! నాకు సకలైశ్వర్యములు అక్కరలేదు. మోక్షము కూడ అర్థించను. నేను కోరునది ఒకేకోర్కె. జీవులందరి హృదయము లందు నేను నిండిపోవలె, వారి దుఃఖమంతయు నేను భరించవలె. వారికి ఏమాత్రము దుఃఖము లేకుండవలె. దీనులైన జీవులు నీరు త్రాగియైనను జీవించవలెనని పరితపించుచున్నారు. నేను వారికి ఇంతమాత్రము నీరు ఇవ్వగలిగినచో నా ఆకలి దప్పులు, శ్రమ అన్నియు వదిలిపోవుదును. నేను సుఖముగా ఉందును" అంటూ మిగిలిన కొద్దినీరూ నీచజాతివానికి ఇచ్చాడు. కథలో లీనం అయిపోయింది సుమతి-

నారయ్య వచ్చింది గమనించలేదు. పుస్తకం మూసి పక్కన పెట్టి కళ్ళద్దాలు తీసి చూచింది. నారయ్య కనిపించాడు. ప్రశ్నార్థకంగా చూచింది.

"రామంటున్నుండి. పొగరెక్కింది గాడ్డికొడుకులకు"

"అవు. మనకెక్కలే పొగరు! వాండ్లింత చేసిపెడ్తె మనం కాలుమీద కాలేస్క తింటాన్నం. వాండ్లు చల్లగుంటెనే మస భోగాలు. వాండ్లకింత కూలి ఎక్కువిస్తె ఏమైతది? ఇప్పటికే వాండ్ల ఉసురుకొట్టి ఇట్లయింది. మల్లయ్య భూమి గుంజుకున్న నాటినుంచే లత్తు కొట్టింది. ఇయ్యాల్ని ఎక్కువకూలి-మనమేం బిచ్చ మెత్తుకుంటమా?"

"అట్లెట్లయితదుండి? యాదగిరె వద్దంటుండు. ఉన్నోండ్ల కలిసుంటెనే బాగుంటది. లేకుంటె వాండ్లు మనను కొరికి తింటరు?"

"నీతులు చెప్పొద్దు. ఈ భూములు మావి. నేను చెప్పుతున్న. ఇయ్యి."

"అట్ల కుదురుతాదుండి.... దొర నడుగకుండ...."

"అంత దొరేనా! దొర.... దొర.... దొర.... నాకేంలేదా ఈ ఇంట్ల.... నేను దాసీ ముండనా?.... దేవుడా నన్నెందుకు పుట్టించినవయ్యా.... ఆగు దొరతోనే చెప్పిస్త.... ఎట్ల చెప్పడో చూస్త.... నాశనం చేసిందిచాలు...." అని చరచరా లేచి టెలిఫోన్ చేసింది. "కాల్" కోసం కాలు కాలిన పిల్లిలా తిరిగింది. టెలిఫోను మోగింది. ఆశగా ఎత్తింది. అటునుంచి జవాబు రామయ్య లేడని! విసుగ్గా రిసీవర్ పెట్టేసింది. గబగబా దేవుని గదిలోకి ఉరికింది - చేతులు జోడించి "ఎందుకు ప్రభూ! హింసిస్తవు? ఏనేరాని కీ శిక్ష?" అని దేవుణ్ణి ప్రశ్నించింది. జవాబు రాలేదు. గబగబా గదిలోకి వెళ్ళి మంచంలో పడి ఏడ్చింది. "తన కీమాత్రం స్వాతంత్ర్యం లేదా?" అని. ఆ రోజంతా ఏడ్పుతోనే గడిచింది సుమతికి.

యాదగిరి వ్యూహం రచించాడు. తాను లొంగిపోదలచలేదు. డబ్బు చిమ్మాడు. పట్నంనుంచి పహల్వాలను పిలిపించాడు. పొలావులు ఉడికాయి. కల్లు, సారాయి నీళ్ళలా పారింది. పొరుగూళ్ళకు తనమనుషుల్ను పంపించాడు-ఎక్కువ కూలీ ఇస్తానని ఆశ చూపాడు. మంగమ్మ మనుషులూ ప్రచారం చేశారు. వారి ప్రచారం పనిచేయలేదు. పొట్టచేతపట్టుకొని సద్దిమూటలతో కూలీలు గుంపులు గుంపులుగా బయల్దేరారు. ఈ ఊరి కూలి నాలి జనం ఊరి శివార్లమీద కూడింది. వచ్చేవారిని బతిమిలాడుతున్నారు. తమ నోట్లోమట్టి కొట్టవద్దని వేడుకుంటున్నారు—ప్రార్థిస్తున్నారు. వచ్చిన వారు ద్వైవిధలో పడ్డారు. అడుగు ముందుకు వేస్తున్నారు-అడుగు వెనక్కు వేస్తున్నారు.

"కూలి ఎక్కువ ఇయ్యమంటే మిమ్ముల్ని పిలుచుకొచ్చిన్రు. మా మీద కపి సాధించాలని కక్షకట్టిండు యాదగిరి. ఆ ఇచ్చేడిది మాకిస్తె పోయెడిదిగదా! ఊళ్ళోళ్ళ నుపాసాలుంచి మీరు కూళ్ళు తీస్కపోతరా! మేం చస్తుంటె మీరు తింటరా? మా పీనిగలుమీద పొయ్యిలు పెట్టి వండుకుంటరా? మా కాటిమీద పేలాలు వేపుకుంటరా?

షున మంత కూలోండ్లం. ఈ పంట పండించినోళ్ళం. ఈ పంట కోసెటోళ్ళం. ఈ పంటను వాండ్ల గుమ్మాల కెత్తెటోల్లం. మనం లేకుంటె వాండ్లులేరు. మనలో చీలికలు పెట్టి మన నెత్తినే చేయవెట్టాల్నని చూస్తున్నరు. జర ఆలోచించండి. ఇయ్యాళ మేం కూలి గెల్చుకుంటె రేపు మీ ఊళ్ళల్ల కూడ వస్తది. ఇయ్యాల్టి కూలి కోసం ఆశపడితె ఎప్పటికి మనందరికి ఎనకటికూలే ఉంటది. ఒక్కనాటి బాగోతానికి మూతి మీసాలెందుకు గొరిగించుకుంటరు? నెత్తుటి కూటికి ఆశపడకుండి. వెనక్కు తిరిగి పోండి" మంగమ్మ మాటలు వచ్చిన వారిలో కొంత ఆవేశం, ఆవేదన కలిగించాయి. గుసగుసలు బయల్దేరాయి.

"బతికున్నంత కాలం పెట్తాడే ఈడు.... నీ అక్క.... పోదాంపారి"

"వాండ్ల నోట్ల మట్టి కొట్టి తినెడిదేందెహె— పోదంపారి"

"అయ్యొ వీండ్లిసువంటోండ్లె వాండ్లనుచంపి మనకు బువ్వ పెత్తరట"

మొత్తానికి చాలమంది వెనక్కు తిరిగిపోవడానికే సిద్ధం అయినారు.

యాదగిరికి చెమటలు పట్టాయి. తన పథకం పారకపోయే వరకు వెర్రివాడయినాడు. పహల్వాన్లను లారీల్తో ఊరి సివారుకు దౌడాయించాడు. లాఠీలూ, బరిశలు పట్టుకొని వస్తున్న వాళ్ళను చూచి జనంలో ఉద్రేకం పెరిగింది. పొరుగూళ్ళ నుంచి వచ్చిన వాళ్ళకుకూడా ఆవేశం హెచ్చింది - "కూలెక్కువియ్యమంటె పానాలీస్తడా గాడ్దికొడుకు" అనుకున్నారు.

హుసేను, సైదయ్య లారీల్తో సిద్ధంగా ఉన్నారు. సైదయ్య చేయెత్తి అరచాడు పహల్వాన్లను చూచి "మేమూ ఒకనాడు వస్తాదులమే- వాండ్లు చెప్పిన పన్లన్ని చేసి జేళ్ళకు పొయ్యొచ్చినం. వాండ్లు మనతోని కూనీలు చేయిస్తరు. వాండ్లు బాగుంటరు. మేం కూలి పెంచమని అడుగుతున్నం. మాతో కొట్లాడితే మీకే మొస్తది?"

"కుచ్ నైజాత్తే సర్ ఉడాదేంగే" వచ్చి విరుసుకు పడ్డారు దాదాలు - వారు మైకంలో ఉన్నారు. వారి కేమీ వినిపించడంలేదు. వారికి తెలిసిందల్లా దౌర్జన్యం జరపాలి అంతే.

హుసేన్ సైదయ్య లారీల్తో అడ్డుకున్నారు. కఱ్ఱమీద కఱ్ఱపడుతూంది. పదిమందితో పోట్లాడుతున్నారు ఇద్దరు. సతమతం అవుతున్నారు పదిమంది. తుదకు ఒక లాఠీదెబ్బ హుసేను బుజంమీద పడింది. "యా అల్లా" అని పడిపోయాడు. అది చూచిన జనం రెచ్చిపోయారు - పొరుగూళ్ళనుంచి వచ్చినవాళ్ళు అది చూడలేకపోయారు. ఉన్న ఊరిజనంతో కలిశారు. దాదాలమీద విరుచుకు పడ్డారు. కఱ్ఱలతోనూ, రాళ్ళతోనూ దాడి సాగించారు. ఉక్కిరి బిక్కిరి అయినారు దాదాలు. ప్రజాబలం పెరిగింది. నిలువలేకపోయారు. కఱ్ఱలు అక్కడే వదిలి వాలికి బుద్ధిచెప్పారు. వెనక్కు చూడకుండా పారిపోయారు.

"మళ్ళొస్తే లంజకొడుకుల పానాలీస్తం" అని అరచారు జనం.

జనంలో ఉత్సాహం వెల్లివిరిసింది. ఆవేశం ఆవహించింది.

"మంగమ్మకి జై" "హుసేనుకి జై" అని నినాదాలు చేస్తూ గంతులు వేశారు-ఈలలు కొట్టారు. ఎగిరారు. ఆడారు.

ఊళ్ళ హద్దులు చెరిగాయిప్పుడు.

అంతా ఒక్కరే - కూలీలు - శ్రామికులు.

ఊళ్ళోంచి డప్పులు వచ్చేశాయి.

బంతిపూల దండలు వచ్చాయి - మంగమ్మకూ, హుసేనుకూ, సైదయ్యకూ వేశారు.

ముందు డప్పులు సాగేయి.

వెనక జనం సాగింది.

నినాదాలు-అరపులు-కేకలు-కేరింతలు-ఈలలు-ఆటలు -పాటలు—కల్లోలంగా ఉంది.

యాదగిరి ఇంటిదగ్గరకి వచ్చేవరకు జనంలో ఉద్రేకం మరీ పెరిగింది.

"యాదగిరి నశించాలె"

"దౌర్జన్యం నశించాలె"

నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయి.

అక్కడే సభ జరిపారు. మంగమ్మ ఆవేశంతో మాట్లాడింది. సైదయ్యా, హుసేన్, యలమంద, మల్లయ్యకాక పొరుగూళ్ళనుంచి వచ్చినవాళ్ళు కూడా మాట్లాడారు. అన్ని ఊళ్ళలో కూళ్ళు పెంచాలని నిర్ణయించారు.

సాయంకాలానికి సభ ముగిసింది.

విజయోత్సాహంతో ఎక్కడి వారక్కడ వెళ్ళిపోయారు.

చీకట్లు కమ్ముకున్నాయి - యాదగిరి గుండెలోనూ - బయటా దెబ్బతిన్న బెబ్బులిలా దాదాలమీద కేకలువేశాడు. తన వ్యూహం సాంతం చెడగొట్టారన్నాడు-నాలుగు తలలు పగలాల్సి ఉండెనన్నాడు. నానా హంగామా చేశాడు. అరచాడు. గొంతు చించుకున్నాడు. దాదాలు తలలు వంచుకొని నుంచున్నారు - ఉలకలేదు - పలుకలేదు. తుదకు ఒకడన్నాడు.

"సర్కార్! జనంమీద మాదేం సాగుతది? ఒకణ్ణి ఇద్దర్ని చూపించండి - చూపిస్తం తడాఖా!"

"గాజులు వేయించుకొండి...." అని పోతుంటే "సర్కార్! పైసా. షరాబ్ నైహై" అన్నాడొకడు.

వెనక్కు తిరిగి చూచాడు యాదగిరి.

యమభటుల్లా కనిపించారు పదిమంది - తన మీదకే వస్తున్నట్లనిపించింది. తన ప్రాణాలు తీస్తారేమో అనుకున్నాడు — కద్దరులాల్చి జేబులోంచి నోట్లు తీసి వాళ్ళ ముఖాన కొట్టి గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు.

వాళ్ళు వికటంగా నవ్వుతున్నట్లు వినిపించింది.

అతని గుండెలో చిల్లులు పడ్డాయి. గుండె దడదడ లాడసాగింది - సిగరెట్టు కాలుద్దామని తీసుకున్నాడు. కాల్చలేకపోయాడు. మంచంలో పడిపోయాడు. కొన్ని భయంకరమైనవి, కొన్ని క్రూరమయినవి, కొన్ని అపాయకరమైన దృశ్యాలు కనిపించాయి. పాముతో ఆటలాడుతున్నట్లనిపించింది. పెద్దపులిని ఆడిస్తున్నట్లనిపించింది. సింహం జూలు పట్టుకున్నట్లనిపించింది.

ఎవరూ లేరు గదిలో!

తాను ఒక్కడు! వాతావరణంలో భయం ఉంది. భీతాహం ఉంది. బీభత్సం ఉంది. సావిత్రి గుర్తుకు వచ్చింది. సావిత్రి దగ్గర ఉంటే బాగుండు ననుకున్నాడు. సావిత్రిలేదు. ఇతని పనులకు విసిగి, వేసారి పోట్లాడి తల్లిగారింటికి వెళ్ళిపోయింది. మళ్ళీ రానని చెప్పి వెళ్ళిపోయింది. మంచిదే అయిందనుకున్నాడు యాదగిరి. తనకు అడ్డులేదు. అడ్డంకిలేదు. ఇవ్వాళ గుర్తుకువచ్చింది. వంటరితనం భరించలేకపోతున్నాడు.

బయట తలుపు తట్టిన చప్పుడయింది.

యాదగిరి గుండెమీద కొట్టినట్లనిపించింది. గుండె దడదడ లాడింది. ప్రజ అంటే బెదిరిపోతున్నాడు. ఎవరో వచ్చారు. ఎందుకు వచ్చారో తెలియదు. బయట తలుపు తట్టిన చప్పుడు అవుతూనే ఉంది. యాదగిరి తలుపు తీసుకొని గది బయటికి వచ్చాడు. చూచాడు. దాదాలు నిద్రపోతున్నారు. వారిని లేపాడు. వాళ్ళు కళ్ళు నలుచుకొని లేచారు. వాళ్ళను హెచ్చరించి వాకిటివైపు నడిచాడు. కిటికీ తలుపుతీసి చూచాడు.

వచ్చింది నారయ్య!

నారయ్య ఎందుకు వచ్చాడింత రాత్రి!! ఏమో! ఎందుకో? అర్థంకాలేదు ఆయినా తలుపు తీశాడు. నారయ్య లోనికి వచ్చాడు. వెంటనే తలుపు వేశాడు. యాదగిరి "ఏంది?" అడిగాడు.

"దొర టెలిఫోన్ల చెప్పిండు"

"ఏమని చెప్పిండు?"

"కూలీ పెంచమని చెప్పిండు"

"ఎవరు? రామయ్య చెప్పిండా?"

"అవ్. రామయ్య దొరే చెప్పిండు. సుమతమ్మ దొరసాని అడిగిందట. టెలిఫోను వచ్చిందని లేపుతెపోయిన. నాతోనే చెప్పిండు. బద్నామయితనన్నడు. కూలీ ఎక్కువ చెయ్యమన్నడు. నిజంగ చెప్పుతున్న - ఇప్పుడే ఇనొచ్చిన"

తన చెవులను తానే నమ్మలేకపోయాడు యాదగిరి. కాళ్ళకింద భూమి జరిగిపోతున్నట్లనిపించింది. తల గిర్రున తిరగసాగింది. అయినా సంబాళించుకున్నాడు. స్థిరపడ్డాడు.

"ఎవరికన్న చెప్పినవా?"

"ఈడికే వస్తాంటిని. ఇనంగనె ఉరికొచ్చిన. కూలి పెంచుతె వీండ్లు మన మాటింటరు?" నారయ్య తన కొంపేదో కూలిపోతున్నట్లు మాట్లాడాడు.

"సరె. ఎవరికి చెప్పలేదుగద! చెప్పకు. గప్‌చిప్‌న పోయిపండుకో. మాట్లాడకు. తెల్లారిసంక చూద్దం"

"తెల్లారిసంక...." ఏమో అనబోతుంటే నారయ్యను బయటికి పంపించి తలుపేశాడు యాదగిరి.

యాదగిరి మళ్ళీ గదిలో చేరాడు. ఈతడవ గదితలుపు వేయలేదతను. మంచంలో కూర్చుని సిగరెట్లు కాల్చడం మొదలుపెట్టాడు. రామయ్య ఈ ఎత్తు ఎందుకేశాడు? వెనక ఏదో నాటకం ఉంది. తనను వంటరిగాణ్ణి చేయదలచుకున్నాడు. బలహీనుణ్ణి చేయదల్చుకున్నాడు. బద్నాం చేయదలచుకున్నాడు. తాను మంచివాడనిపించుకోవాలని చూస్తున్నాడు. అంతే అంతకు మించి ఏంలేదు. ఏం చేయాలిప్పుడు? తెల్లవారుతుంది. కూలి పెంచానని ప్రకటిస్తాడు నారయ్య. జనం రామయ్యను నెత్తికెత్తుకుంటారు. తన పనికిరారు. తనను హీనంగా చూస్తారు. నీచంగా చూస్తారు. తాను ఓడిపోయినట్లవుతుంది. అలా జరగడానికి వీల్లేదు. తాను ఓడటానికి వీల్లేదు. ఏం జరిగినా ఈరాత్రే జరగాలి. తెల్లవారకముందు జరిగిపోవాలి. ఏం జరగాలి? ఏం జరిగిపోవాలి? అదే అర్థం కావడంలేదు. అందుకే సిగరెట్లు అనేకంగా కాలుస్తున్నాడు. అటునుంచి ఇటు, ఇటునుంచి అటు తిరుగుతున్నాడు – కాలుకాలిన పిల్లిలా.

పహల్వాన్లు నిద్రపోలేదు. బీడీలుపీకుతూ కూర్చున్నారు. యాదగిరి ఆరాటాన్ని గమనిస్తున్నారు. అతడు ఏం చెపుతాడోనని సంసిద్ధంగా ఉన్నారు.

యాదగిరికి చప్పున ఏదో ఆలోచన వచ్చింది. గబగబా బయటికి వచ్చాడు. గుండాలను లెమ్మన్నాడు. తనవెంట రమ్మన్నాడు. కిర్సనాయిలు డబ్బాలు చూపించి వాటిని తీసుకొని బయల్దేరమన్నాడు. ముందు యాదగిరి, వెనుక గుండాలు సాగిపోతున్నారు.

వెన్నెల పుచ్చపువ్వులా ఉంది.

అది వారికి కష్టంగా ఉంది.

చెట్ల నీడల్లో - గోడచాటుల్లో నక్కినక్కి బయల్దేరారు.

కుక్క మొరిగింది. దడుచుకున్నారు. వెనక్కునక్కారు. కుక్కను అదిలించారు. అది మరీ మొరిగింది. వెనక్కు ఒదిగారు. తప్పుకున్నారు. మరో గొందిలోంచి సాగారు.

కుక్క మొరుగుడుకు మల్లయ్య లేచాడు. బయటికి వచ్చిచూచాడు. ఎవరో నక్కినక్కి సాగిపోతున్నట్లనిపించింది. కళ్ళనల్చుకొని చూచాడు. మనుషులు సాగిపోయారు. నీడలు కనిపించాయి – అవీ కనుమరుగైనాయి. మల్లయ్య ఇంట్లోకి

పోయాడు. పిచ్చమ్మ, కోటయ్య మంచి నిద్రలో ఉన్నారు. వారిని లేపదలచలేదు. చేతికర్ర అందుకున్నాడు. బయటికి వచ్చాడు. తడక పెట్టి బయల్దేరాడు. నీడలు పోయినవైపు బయల్దేరాడు. అతని కేమీ కనిపించలేదు. నక్కుతూ, నక్కుతూ ఊరుదాటాడు. ఆకారాలు కనిపించాయి - వెన్నెట్లో - అవి దూరంగా సాగిపోతు న్నాయి. వీపులు కనిపిస్తున్నాయి. గుర్తుపట్టరావడంలేదు. వాళ్ళు సాగిపోతున్నారు. మల్లయ్య నీడలకు నక్కి వెంబడిస్తున్నాడు. ఎవరువారు? ఎక్కడికి యాత్ర? ఏమిటి వారి చేతుల్లో తళతళా మెరుస్తున్నాయి? ఏమో? తెలీదు. దగ్గరికి పోలేకపోతున్నాడు. నీడలు దొరకడం లేదు. వారు నిలిచారు. మల్లయ్య మర్రినీడలో నిలిచాడు. వారు చాల దూరంలో ఉన్నారు. మర్రి తరవాత అంతా బయలు! మల్లయ్య ముందుకు పోలేదు. చూస్తున్నాడు:—

అది పూర్వం తన పొలం - భూదానంలో నారయ్య దయింది. దాన్ని అంటి ఉన్న పొలం పూర్వం కరణంది - ఇప్పుడు రామయ్యది. అక్కడ వారికేం పని? ఏం చేస్తున్నా రక్కడ వారు? ఏదో చల్లుతున్నారు పంటమీద! డబ్బాల చప్పుడవు తూంది. ఇక్కడేం పనివారికి? ఎవరువారు? క్షణంలో అగ్గిపుల్ల వెలిగింది. కాగడా వెలిగింది. దివ్విటీ కాలింది - పంట అంటుకుంది - భగ్గుమంది. పొలాలు అంటు కున్నాయి! భగభగ మండుతున్నాయి.

మంటలు మల్లయ్య కళ్ళల్లో మండాయి - గుండెలో మండాయి. అర్థంచేసు కున్నాడు. ముందుకు ఉరుకుదాం అనుకున్నాడు. ఉరక లేకపోయాడు — ధైర్యం చాలలేదు. వాళ్ళు వెనక్కి తిరిగారు. వస్తున్నారు. తనను చూస్తే బతకనివ్వరు. గుండె దడదడ లాడింది. గబగబా చెట్టెక్కాడు. నక్కి కొమ్మల్లో కూర్చున్నాడు. వాళ్ళు వెనక్కి తిరిగి ఉరుకుతున్నారు. మర్రికిందినుంచే పోయారు. వాళ్ళ ముఖాలు స్పష్టంగా కనిపించాయి. వారి చేతుల్లో కాళీ డబ్బాలు కనిపించాయి.

యాదగిరిని చూచి అతని గుండె మండింది.

పొలాన్ని చూచాడు - పంట కాలిపోతూంది—మంటలు నాల్కలు చాచి మండుతున్నాయి. మంటలమీద పొగ మబ్బుల్లా తేలిపోతూంది.

పంట! పొలం పంట!! అది ప్రజలది. దేశానిది! జనపు డొక్కలు నింపేది. దేశాన్ని బతికించేది. ఉత్పత్తి చేయించేది. దేశాన్ని రక్షించేది. ఆహుతి అయిపో తూంది. మంటల పాలైపోతూంది. ఎండుగడ్డి అంటుకొంది. వడ్లు చిటపటమని పేలాలవుతున్నాయి.

మల్లయ్య చూడలేకపోయాడు. పొగ అక్కడి దాకా వచ్చింది. అతని కళ్లు ఎర్రబడ్డాయి. కళ్ళు మూసుకున్నాడు. తెరిచి చూచాడు ఊరివైపు. వాళ్ళింకా ఉరుకు తున్నారు. ఊళ్లో ప్రవేశించారు. మల్లయ్య చెట్టు దిగాడు. నక్కుతూ నక్కుతూ ఊరికాడు. మంగమ్మను లేపాడు.

"పొలాలకు అగ్గిపెట్టిన్రు. పంట కాలిబూడిదైతాంది?"

"ఎవరు పెట్టిన్రు? ఎక్కడ పెట్టిన్రు?"

"రామయ్య పొలానికి, నారయ్య పొలానికి పెట్టిన్రు - పంట కాలిపోతున్నది. చల్లార్చాలె. లేవండి. ఉరకండి."

మంగమ్మకేమీ తోచలేదు. ఉరికి బయటికి వచ్చింది. యలమంద, హుసేన్, సైదయ్య, పిచ్చమ్మ, కోటయ్య లేచారు — కాదు — ఊరు సాంతం అదాట్న మేలుకున్నది. ఉరుకుతున్నది పొలాలవైపు.

ఊరు ఉరిసింది.

జనం ఉరికింది.

కూలీలు ఉరికారు.

కుర్రకుంకలు ఉరికారు.

మండుతున్న పొలాల్నుచూచి అంతా నిలిచిపోయారు.

పొలాలు మండుతున్నాయి.

పొగ కమ్ముకుంటూంది.

జనం నిశ్చేతనంగా నుంచుంది - ఇంతలో ఏవో గుసగుసలు బయల్దేరాయి.

"ఎవరు చేసిన్రు?" అడిగాడొకడు.

"యాదగిరి" చెప్పాడొకడు.

"మందినోట్ల మట్టికొడతడా? చూద్దాం పారి?" హుసేన్ కదిలాడు. హుసేన్ వెంట జనం కదిలింది-జనం-జ్వలించే జనం. మంది-మండుతున్న మంది-యాదగిరి ఇంటిమీద పడ్డారు.

యాదగిరి బోనులోపడ్డ ఎలుకలా తలుపులు బిగించుకొని లోపల కూర్చున్నాడు.

నారయ్య సుమతి ఇంటికి ఉరికాడు "పంట తగలపెట్టిన్రు మంగమ్మ మనుషులు. యాదగిరి ఇంటిమీద పడ్డరు. చంపుక తినెటట్లున్నరు. జర ఫోనుచేయండి" వగరుస్తూ చెప్పాడు.

సుమతినోట మాటరాలేదు ముందు. "ఇదంత ఏదో అనర్థానికే వచ్చింద"న్నది. తరవాత ఫోనుచేసింది - నారయ్య చెప్పిన మాటలు చెప్పేసింది.

యాదగిరి ఇంటిముందు కల్లోలంగా ఉంది. తలుపులు బాదుతున్నారు. అరుస్తున్నారు. కేకలు వేస్తున్నారు. యాదగిరిని బయటికి రమ్మని పిలుస్తున్నారు. జనం ఉద్రేకంగా ఉన్నారు. ఉత్పాతంగా ఉన్నారు. తలుపులు బద్దలయ్యేట్లున్నాయి. యాదగిరి తలపగిలేట్టుంది.

యాదగిరి ఇంటిముందు దాదాలను తెచ్చిన లారీ ఉంది. కొందరు దానిమీద పడ్డారు. రాళ్ళతో కొట్టారు. గునపాలతో బాదారు. ఎవడో కిర్సనాయిలు తెచ్చి పోశాడు - ఒకడు నిప్పంటించాడు. భగ్గున అంటుకుంది లారీ. భగభగ మంటలంట్టుకొని మండసాగింది. జనం దానిచుట్టూ చేరి గంతులేయసాగారు.

ఇటు యాదగిరి ఇంటి తలుపులు పగుల్తున్నాయి. మంగమ్మ అవాంతరం గుర్తించింది. "ఆగండి" కేకపెట్టింది మంగమ్మ. అది మంగమ్మ కేక కాబట్టి అందరూ ఆగారు. ఆమె మీద దృష్టి కేంద్రీకరించారు. పుచ్చపూవులాంటి వెన్నెల - లారీమంటల వెలుగు ఆమె ముఖంమీద పడుతూంది.

"పొలానికి నిప్పంటించినోడు యాదగిరి. ఈయన వేషం చూస్తే మనమే నిప్పంటించిన మంటరు. యాదగిరి ఇల్లు దోచటానికి వచ్చిన మంటరు. లారీ తగుల పెట్టనే పెట్టిన్రు. ఈ నేరాలన్నీ మన నెత్తిన్నే పడ్తయి. ఇదివరకు పడ్డయి. మస్తాన్ను చంపింది రామయ్యే. నన్ను జేలుకు పట్టించిన్రు. కరణపాయన్ను చంపించింది, హుసేన్ను జేలుకు పంపించింది రామయ్యే. ఈ సర్కారు మనం చెప్పింది వినదు - న్యాయం చూడదు. వాండ్లు చెప్పిందే సర్కారుకు వేదం - కాబట్టి ఈ కల్లోలం మానండి. ఎవరిండ్లకు వాండ్లు పోండి" మంగమ్మ మాటలు పూర్తికాక ముందే జనం కాళీ అయింది.

క్షణం క్రితం కల్లోలంగా ఉన్న స్థలం నిర్మానుష్యం అయిపోయింది. మిగిలిన వారు మంగమ్మ, సైదయ్య, హుసేన్, కోటయ్య మాత్రమే.

వెన్నెల కాస్తూంది.

లారీ మండుతూంది.

మంగమ్మ ఇంటివైపు నడిచింది.

అంతా కలలా ఉంది ఆమెకు.

మిగిలినవారు ఆమెను అనుసరించారు.

కొంతసేపటికి జీపు వచ్చి యాదగిరి ఇంటిముందు ఆగింది. పోలీసు అధికారులు దిగారు. ముందు మండుతున్న లారీని చూచారు. తరవాత యాదగిరి ఇంటి తలుపు తట్టారు. వచ్చినవారు పోలీసులని ధృవపర్చుకొని తలుపులు తీసి బయటికి వచ్చాడు యాదగిరి. "కాపాడిన్రు. ఇయ్యాళ ప్రాణాలు పోయేడియే" అని చేతులు కలిపాడు. లైట్లు వెలిగాయి. కుర్చీలు వచ్చాయి. అంతా కూర్చొని సిగరెట్లు వెలిగించారు. ఇంతలో లారీలు వచ్చాయి. లారీల నిండా పోలీసులు దిగారు. యాదగిరి వాకిలి పోలీసులతో నిండిపోయింది.

లారీ తగల బడ్తూనే ఉంది.

"కూళ్ళు పెంచమన్నరుండి. పెంచనన్న. అదే నేను చేసిన పాపం. పొలం తగల బెట్టిన్రు-నా పొలం తగలబెట్టినా బాగుండు-రామయ్య దొర పొలం తగల బెట్టిన్రు - నేరం నా మీద నూకాల్నని. చూస్తున్రు కద లారీ తగల బెట్టిపోయిన్రు. ఇంటిమీదికి దొమ్మికొచ్చిన్రు. జరసేపైతె నన్ను ఖూనీ చేసెటోండ్లే"

"రాజ్యమే వాళ్ళకొచ్చిందుండే - ఎట్లబడ్తె అట్ల చేస్తాను. ఏమన్నంటె కూలోండ్ల మంటరు. సంఘాలంటరు. ఏం చెప్పెటట్లున్నది లేండి. పొలంకాడికి పోయి చూసొద్దమా?" అధికారి అన్నాడు.

జీపు కదిలింది—లారీలు కదిలాయి. అన్ని హంగామాలతో తగలబడ్తున్న పొలం దగ్గరికి చేరారు.

పొలం తగలబడ్తూనే ఉంది.

పోలీసువారు సాక్షుల్ని ఏర్పర్చుకుంటున్నారు.

గంటలు కొట్టుకుంటూ ఫైరింజన్లు వచ్చాయి.

నీళ్ళగొట్టాల్లోంచి నిప్పుమీద కురుస్తున్నాయి.

పోలీసు జీపు ఊళ్ళోకి వచ్చింది - మంగమ్మను, సైదయ్యను, హుసేన్ను ఎక్కించుకొని పట్నందోవ పట్టింది.

పోలీసు లారీలు కదల్లేదు.

తెల్లవారేవరకు ఊరు పోలీసుల్తో నిండిపోయింది.

పట్నంలో వార్తపొక్కింది - పోలీసులు అందించిన వార్తను పత్రికలు ప్రచు రించాయి.

ప్రకాశం, గీతా పోలీస్ స్టేషనుకు పరుగు తీశారు.

"ఈ బూటకపు ప్రజాస్వామ్యంమీద నమ్మకం పెట్టుకోవద్దంటే విన్నావుకాదు. ఇక్కడ న్యాయం బతకదు. సత్యం నిలవదు. ఉద్యమాలు ఎదగవు-ఎదగ నివ్వరు- విరక్కొడ్తారు - తుంచేస్తారు. నాశనం చేస్తారు. నాకైతే బం...." "బాబూ!" అని ప్రకాశం నోరుమూసింది మంగమ్మ.

"భయమూ అంటీ మీకు?" గీత అడిగింది.

"గీతా!" అని గట్టిగా అరిచింది మంగమ్మ.

గీత మాట్లాళ్ళేదు. తలవంచుకుంది. ప్రకాశం తల్లిదగ్గరనుంచివచ్చి గీత ప్రక్కన నుంచున్నాడు.

"చిచ్చులోకి ఉరుకుతున్నరు మీరు" మంగమ్మ హెచ్చరించింది.

అక్కడే నుంచున్న పోలీసువానికేమీ అర్థం కాలేదు. అతడు నివ్వెరపోయి చూస్తున్నాడు.

"అమ్మా! ఈ దేశమే - ఈ వ్యవస్థే పెద్ద చిచ్చు" ప్రకాశం మాటలు విన్నది మంగమ్మ - మాట్లాడలేదు. గీతా, ప్రకాశం కూడా మాట్లాడలేదు. పెదవులు కదల్లేదు. కాని ముగ్గురి గుండెల్లో బడబానలం రగులుతూంది.

మౌనం విసుగనిపించింది పోలీసుకు. "చలో అబ్ నిక్లో" అన్నాడు.

ప్రకాశం తల్లిని చూచాడు. ఆ చూపులో ఆదరం ఉంది. అనురాగం ఉంది. ప్రేమ ఉంది. భక్తి ఉంది. ఇంకేమేమి ఉన్నాయో చెప్పడం కష్టం! ప్రకాశం కళ్ళు చెమ్మగిల్లాయి.

మంగమ్మ కొడుకును చూచింది. ఆ చూపులో వాత్సల్యం ఉంది. మాతృ

ప్రేమ ఉంది. తల్లిగుండె ఉంది. గుండె కరిగిన నీరుంది. ఇంకేమేమి ఉన్నాయో రాయడంరాదు. మంగమ్మ కళ్ళలో నీరు నిండింది. రెండు చుక్కలు రాలేయి.

గీతనోట మాటరాలేదు. ఆమె మంగమ్మకు నమస్కరించింది. వెనక్కు మళ్ళింది-సాగింది. ప్రకాశం ఆమెను అనుసరించాడు.

చూపందినంతసేపు మంగమ్మ వారిని చూచింది. కొంగుతో కన్నీరు తుడుచుకొని కూలబడ్డది.

"చేతికి వచ్చిన పంటను తగలబెట్టడం దేశద్రోహం" అని ప్రకటించాడు వీరభద్రం.

యాదగిరి ఊరికి కోతకోసే యంత్రాన్ని తెచ్చాడు. కూలీలంతా ఎండు డొక్కల్తో, నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తుండగానే, ఆ యంత్రం పంటను కోసేసింది! నూర్చింది! పంటను ఇంటికి చేర్చింది!

మనిషి నోట మట్టి కొట్టింది మర! మానవ శ్రేయస్సుకోసం, మానవ కళ్యాణం కోసం, మానవాభ్యుదయం కోసం మరను కనిపెట్టాడు మనిషి. ఆ మర మానవత లేని నరులచేతబడి కష్టించే వాని నోటముందరి ముద్ద లాక్కుంటున్నది!!

న్యాయం పేర విచారణ జరిగింది. మంగమ్మకు జేలు శిక్షవిధించిన న్యాయస్థానం హుసేన్ను, సైదయ్యను నిర్దోషులుగా ప్రకటించి విడుదల చేసింది.

"ఇప్పుడెట్లనంటరు?" శేషయ్య అడిగాడు.

శేషయ్య ఇంటి ఎయిర్‌కూల్డ్ రూమ్‌లో కుర్చున్నారిద్దరూ. అందంగా అలంకరించబడిన ఆ గదిలో సోఫాల మధ్యనున్న టీపాయ్‌మీద విదేశీ మద్యపు రెండు గ్లాసు లున్నాయి. శేషయ్య ఈమధ్య విదేశీవస్తువులు తప్ప వాడడంలేదు. అతనికి 'బారకాసు' లోని కొందరు అరబ్బులతో దగ్గరి సంబంధం ఏర్పడింది. 'బారకాసు' లోని అరబ్బులకు అరబ్బు దేశాలతో రక్తసంబంధాలున్నాయి. అందుకు వారు తరచూ అరబ్ దేశాలకు వెళ్తుంటారు. వారితో విదేశీ సరుకులు దిగుమతి చేయించి ప్రచ్ఛన్న వ్యాపారం సాగిస్తున్నాడు శేషయ్య. అందువల్ల అతనికి విదేశీవస్తువుల కొరతలేదు. ఆ కొరత మరికొందరికి లేకుండాచేసి 'దేశభక్తి' ప్రదర్శిస్తున్నాడు.

రామయ్య గ్లాసు అందుకొని 'సిప్' చేశాడు. సిగరెట్టుకాల్చి ఎదురుగా ఉన్న బెల్జియం గ్లాస్‌లో చూసుకున్నాడు. తాను లావెక్కాడు. కొంత కొవ్వు పెరిగింది. మెడతిరిగేట్లులేదు. అయినా అందంగానే ఉన్నాడు తాను. సిగరెట్టు పొగ గుప్పుమని వదిలాడు. తన ముఖంమీద కప్పుకుంది పొగ. పొగలో మసగ్గా తన ముఖం బాగానే ఉన్నట్లుంది! పొగ చాటుముఖం!!

"మాట్లాడరు?" మళ్ళీ శేషయ్య అడిగాడు సోడా మూత తీస్తూ.

"ఏమంటవు?" రామయ్య ఈ లోకంలోకి వచ్చి అడిగాడు. అప్పటికే తల కెక్కింది రామయ్యకు.

"అదే ఆ లాటరీ సంగతి?"

రామయ్య తలకెక్కింది సగం దిగిపోయింది. మళ్ళీ ఎదురుగా ఉన్న అద్దం లోకి చూచాడు.

జరిగిందేమంటే శేషయ్య ఒక లాటరీ నడిపించాడు. ఒక పారిపోయిన నవాబు ఇంటిని లాటరీకి పెట్టాడు. రూపాయి టిక్కెట్లు పదిలక్షలమ్మాడు. రూపాయికి మేడ వస్తుందని కొన్నవాళ్లుండవచ్చు కాని ఎక్కువ టిక్కెట్లు రామయ్య పలుకుబడిని వినియోగించి అమ్మాడు. లాటరీ చీట్లుకూడా రామయ్యతోనే తీయించాడు-బహిరంగసభలో. లాటరీ టిక్కెట్లు నెంబరు చెప్పారుకాని పేరు చెప్ప లేదక్కడ! తీరాచూస్తే ఆ నంబరు శేషయ్యదే అయింది. అంతవరకు బాగానే ఉంది. అసలు ఆ బంగళా ప్రభుత్వ ఆస్తి అనీ అది వేలంవేయడం నేరమనీ కొందరు కుర్రకుంకలు గోల ప్రారంభించారు.

"నా కొంప ముంచినవు. నీకేం నువ్వు బాగనే ఉన్నవు. అన్ని నాతోనే చేయించినవు. రేపు అసెంబ్లీలో వచ్చేటట్లున్నది. అక్కడ నా ప్రాణం తీస్తరు. ఇక్కడ నువ్వు ఏ ముండతోనో కులుకుతుంటవు. అక్కడ నాప్రాణం మీదికి వస్తది" చిరాకుపడ్డాడు రామయ్య.

"ఎందుకడిగిన్నను కుంటున్నరు మళ్ళ, మీ పాసం ఒకటి నా పానం ఒకటి అయితదా? ఏదైనా ఉపాయం కనిపెట్టాలె - మీ మీదికి రావధు-నామీదికి రావద్దు - అట్లుండాలె" శేషయ్య లేచి రేడియోగ్రాంమీద రికార్డువేసి వచ్చి కూర్చున్నాడు - బిస్మిల్లాఖాం షెహనాయి మంద్రంగా వినిపిస్తూంది. వాతావరణంలో మైకం కమ్ముకుంది.

"నాకు తోచడంలేదు. మనం సర్కారును ముంచుతున్నం. ఇందుకేనా నేను మంత్రినయింది. నువ్వు లుచ్చావు. నేను నీ చేతిలో కీలుబొమ్మనయిన. నేను మునిగి నట్లే" అంత మైకంలోనూ గొంతు వణికింది రామయ్యది - గ్లాసందుకొని గటగటా తాగేశాడు.

"నేను లుచ్చానే - కాదనటంలేదు. చేతులు కాల్చుకున్నంగద బయట పడాలె. ఇద్దరం మునుగుతంగద - మల్లి జేల్లికే పోవాలె. ఇగ గతి ఉండదు" గ్లాసు నింపుతూ అన్నాడు శేషయ్య.

రామయ్య అద్దంలోకి చూచాడు - పాతరామయ్య కనిపించాడు. బలరామయ్య ముందు భక్తిగా నుంచున్న రామయ్య కనిపించాడు. అమృతవాణి కనిపించింది-అమృత వాణి గుడిసెకనిపించింది. గుండె జల్లుమన్నది. స్ప్రింగ్‌డోర్ తెరుచుకున్న చప్పుడు వినిపించింది. అటు చూచాడు. పరువం పరుగులు పెడుతున్న పడతికనిపించింది. ఆమె గదిలో ప్రవేశించింది. తలుపు మూసుకుంది. అందం మూసలో పోసి తీసినటుంది అమ్మాయి. అక్కడే నుంచుంది. ఆమెనే చూస్తున్నాడు రామయ్య. శేషయ్య సంజ్ఞ అందుకొని ఆమె ముందుకు నడిచింది - మెల్లగా నడిచింది. పూలమీద నడిచినటు

నడిచి వచ్చింది. అమాంతంగా ఆకాశంనుంచి దిగివచ్చిన అప్సరసలా ఉందామె. వచ్చి పక్కగా కూర్చుంది.

పక్కన పడతి.

ముందు మద్యం.

వెనుక వాద్యం.

వింతగా ఉంది స్థితి. రామయ్య మైమరచాడు.

"ఈమె సుకుమారి. మీకోసం పిలిపించిన" శేషయ్య పరిచయం చేశాడు.

సుకుమారి విచిత్రంగా చూచింది.

రామయ్య గుటకలు వేశాడు.

"ఉపాయం ఆలోచించిన. మీ మీదికి రాకుండ నా మీదికి రాకుండ చూచిన" శేషయ్య అన్నాడు. సుకుమారికి గ్లాసు నింపి అందించాడు. ఆమె చిరునవ్వు నవ్వి 'చీర్స్' చెప్పి మద్యం చప్పరించింది.

"ఏం దది?" రామయ్య విసుగ్గా అడిగాడు.

"ఆ యిల్లు నా పేర అంతకు ముందే రిజిష్టరు అయినట్లు రాయించాలె. అడిగిననుకో - శేషయ్య ఇల్లు శేషయ్యే అమ్ముకున్నాడని చెప్పొచ్చు. మీరు జర చెప్పుతె ఇద్దరం బయటపడ్తం"

"సరె. అట్లనే చెప్పుతలే" విసురుగా అన్నాడు రామయ్య - శేషయ్యను వదిలించుకోవడానికి అన్నట్లు అన్నాడు.

"అంతమాత్రం చేస్తే చాలు. మరి నేను వస్త. క్లబ్బులో పార్టీ ఉన్నది" అని వెళ్ళిపోయాడు శేషయ్య.

రామయ్య సుకుమారి బుజంమీద చేయివేశాడు.

సుకుమారి గ్లాసులోని ద్రవం గటగట తాగి రామయ్య ఒడిలో వాలిపోయింది.

శేషయ్య క్లబ్బుకు వెళ్తే గాంధీ కనిపించాడు - తన భక్తులను కూర్చుకొని తాగుతున్నాడు- పేకాడుతున్నాడు- పేలుతున్నాడు. కేరింతలు కొడుతున్నాడు.

శేషయ్య గాంధీ బృందాన్ని చూచాడు - గాంధీ శేషయ్యను చూడలేదు. శేషయ్య గాంధీవైపు నడచాడు. వెనుకనుంచి గాంధీ బుజంమీద చేయివేశాడు.

గాంధీ వెనక్కు చూచాడు.

శేషయ్య.

గాంధీ ఉలిక్కిపడలేదు.

శేషయ్యకు ఒక నిండుగ్లాసు అందించాడు - పేకముక్కలు మూశాడు. శేషయ్య గ్లాసందుకొని కూర్చున్నాడు.

"ఎందుకీ పార్టీ ? ఎవరిది?" గ్లాసు ఎత్తుతూ అడిగాడు శేషయ్య.

"పార్టీ మనదే. మనమే ఇస్తున్నాం. స్టూడెంట్స్ యూనియన్ ఎలక్షన్లో కంటెస్టు చేస్తున్నాం - ప్రెసిడెంటుకు" గాంధీ అన్నాడు ఉత్సాహంగా.

"చీర్స్" అని గ్లాసులెత్తారంతా. "ప్రెసిడెంట్ గాంధీకీజై" అన్నాడు రషీద్. అందరూ అతనితో నినాదం చేశారు.

"ఎలక్షన్లు ఇక్కణ్ణే అయితున్నట్లున్నదే!" శేషయ్య అన్నాడు.

"ఏం గెలవననుకున్నవా? ప్రకాశంగాణ్ణి ఓడించి తీర్తా. ఏమంటరు ?" అని సహచరుల్ను అడిగాడు.

"ప్రకాశం ముర్దాబాద్" అంతరూ కేకలువేశారు.

"ప్రకాశం పోటీ చేస్తున్నడా?" శేషయ్య ప్రశ్నలో ఏదో ఆశ్చర్యం ఉంది-కొంతలో కొంత భయం ఉంది.

"ఏం? భయమవుతున్నదా? హడ్డీ నరమ్ కర్ దేఁగే హరామ్జాదేకి" రషీద్ గ్లాసు పట్టుకొని లేచి నుంచున్నాడు.

శేషయ్య ఆలోచనలో పడ్డాడు.

అందరూ మౌనంగా శేషయ్యను చూస్తున్నారు.

"ప్రకాశం నిలబడ్తడంటె జరగట్టిగ పనిచేయాలె" సిగరెట్టు వెలిగించి అగ్గిపుల్లి ఆర్పివేస్తూ అన్నాడు శేషయ్య.

"ఏం? వాడేం మొనగాడా?" అడిగాడు గాంధీ సిగరెట్టు వెలిగిస్తూ.

"మేం మొనగాళ్ళకు మొనగాళ్ళం" అన్నాడు రషీద్ గట్టిగా గ్లాసు ఎత్తి.

"హడ్డీ నరమ్ కర్ దేఁగేఁ. ఎముకలు విరక్కొడ్తాం" అన్నాడు మరొకడు.

"మంచిదే. మీరు గెలుస్తరు. అయినా నన్నడుగుతుండండి అప్పుడప్పుడు. అక్కరబడ్తె నా దగ్గర చిన్న బండి ఉన్నది తీసుకొండి. నేను రామయ్యతో కూడ మాట్లాడ్త. పైకం కావలిస్తె అడుగున్రి. ప్రకాశానికి పలుకుబడి శాన ఉన్నది స్టూడెంట్లల్లో. జర హుషారుగ పనిచెయ్యాలె."

"మీరు మా వెంట ఉంటె మేం ఇప్పుడే గెలిచినట్లు - జై గాంధీకి" అని గటగటా తాగేశారందరూ.

శేషయ్య లేచి వెళ్ళిపోయాడు.

"అరె. నికాల్ రె ఎల్. ఎస్. డి." అన్నాడు గాంధీ రషీద్తో. రషీద్ జేబులోంచి పాకెట్ తీశాడు. అంతా సేవించారు. మళ్ళీ తాగారు. స్పృహ లేకుండా పడిపోయారు. వారి కీలోకం మీద ధ్యాసలేదు - ఏ ధ్యాసా లేకుండడానికే ఎల్.ఎస్.డి. ప్రపంచాన్ని మరిచిపోవడానికే ఎల్.ఎస్.డి. లోకం నుంచి తప్పుకోవడానికి - తన చుట్టూ ఒక గోడ కట్టుకోవడానికి - ఒక గూడు కట్టుకోవడానికి ఎల్.ఎస్.డి. అది అమెరికన్ డ్రగ్. అక్కడా దొంగచాటుగా తయారవుతుందట - ఇక్కడికీ చాటుగానే రవాణా అవుతుంది. మందు మాత్రమే రవాణా కావడం లేదు-మనుషులు కూడా — అమెరికా ఆర్థిక విధానపు వత్తిడికి తట్టుకోలేని యువకులు, యువతులు

నిస్సహాయులై ఆ దేశంనుంచి పారివస్తున్నారు. వారికి సమాజం సాంతం అంధ కార బంధురంగా కనిపిస్తూంది. చీకట్లో గోరంత వెలుగు వెలిగించలేక సమాజానికి దూరంగా పారిపోయి సమాజం మీద స్పృహ లేకుండా బతకాలనేవాళ్ళు హిప్పీలు. వీళ్ళు మందలు మందలుగా మన దేశానికి దిగుతున్నారు. గంజాయి, సరచ్, ఎల్.ఎస్.డి., సారాయి సేవించి సర్వదా మత్తులో ఉండడం - స్వేచ్ఛాప్రణయం వీరి సిద్ధాంతం. భారతీయ యువకులను వీరు బాగా ఆకర్షిస్తారు - ముఖ్యంగా సంప న్నులను. వారి పరిచయంతోనే ఎల్.ఎస్.డి. దొరికింది గాంధీకి.

తెల్లవారి శేషయ్య త్వరగా లేచాడు. సాధారణంగా అతడు అంత త్వరగా మేల్కొనడు. అతనికి రాత్రిళ్ళు రమ్యమైనవి. ఇవ్వాళ అంత తొందరగా లేచాడంటే ఏదో రాచకార్యంమీదే. లేచి రామయ్య కోసం ఎదిరి చూస్తూ కూర్చున్నాడు- రేడియో సుప్రభాతం వినిపిస్తూంది - అతనికి ఏడుకొండలవాడంటే ఎనలేని భక్తి. సుప్రభాతం అయిపోయింది. పేపరు అటూ ఇటూ చూచి పడేశాడు. ఇంకా రామయ్య లేవలేదు.

రామయ్య త్వరగా లేచేవాడే - ఇవ్వాళ ఆలస్యంగా లేచాడు. స్నానం చేసి పూజచేసుకొని బయటికి వచ్చాడు. సుకుమారికి ఇంకా మత్తు వదల్లేదు-మంచంలోనే పడి ఉంది. రామయ్యను చూచి లేచి నుంచున్నాడు - నమస్కరించాడు. ఇద్దరూ కూర్చు న్నారు - ఎదురు బదురుగా - రామయ్య పత్రికలన్నీ చూచి మడిచి పడేశాడు. రామయ్య తాజాగా ఉన్నాడు. చెట్టుమీద వికసించిన గులాబిలా ఉన్నాడు. తీగ మీద విచ్చుకున్న మల్లెలా ఉన్నాడు. శేషయ్య రామయ్యను చూచాడు. సంతోషిం చాడు. టీ వచ్చింది. టీ కప్పు అందుకుంటూ అన్నాడు శేషయ్య.

"కాలేజీలో ఎన్నికలట"

"ఎన్నికలయితయి కాకుండా ఉంటయా?"

"ప్రకాశం పోటీ చేస్తున్నడట!"

విడిచిన ఉండేలుదెబ్బ తగిలినట్లయింది రామయ్యకు. అతని ముఖం వెల వెలబోయింది. అయినా అన్నాడు "వానికే మున్నది? మంగమ్మను జేలుకు పట్టిస్తిమి. వీరభద్రం వాణ్ణి వదిలిపెట్టె. ఎట్ల నిలబడ్తడు"

"అదంత నాకెరికలే. ప్రకాశం నిలబడ్తుండట. స్టూడెంట్లు వాణ్ని గెలిపించె టట్లున్నరట"

"నాకు నమ్మకం లేదు. ప్రకాశం ఎట్ల గెలుస్తడు? వాని దగ్గర పైసేది?"

"పైస గీస లెక్క పెట్టెటట్లు లేరు పోరలు. స్టూడెంట్లు మనచేతుల లేకుంటె కష్టం. స్టూడెంట్ల యూనియన్ మన చేతులుండాలె. మనం సమ్మె చేయమన్నప్పుడు చేయాలె. వద్దన్నప్పుడు ఊరుకోవాలె. అట్ల కాకుంటె మీకెరకలే స్టూడెంట్లు రెచ్చి పోయిన్రంటే మన కొంపలకు నిప్పు పెడ్తరు. నిలబెట్టి తగలబెడ్తరు"

రామయ్య ఎడద వడకింది. శేషయ్య చెప్పిందాన్లో నిజం ఉందనిపించింది. రామయ్యకు ఆ మాత్రం తెలియదనికాదు. ప్రకాశం విషయంలో అతనికి ఏర్పడు తున్న వాత్సల్యం అటు ఆలోచించ నివ్వలేదు. 'నిలబెట్టి తగలబెడ్తరు' అనే మాటతో వాత్సల్యం కాలిపోయింది. పదవిని రక్షించుకోవాలనే పన్నగం పడగలు విప్పి బుసలుకొట్టింది. విసపు బుసలు కస్సు కస్సు మన్నాయి.

"అట్లయితె ఏం చేస్తమంటవ్?" ఆతురతగా అడిగిన రామయ్య నిటారుగా కూర్చుని సిగరెట్టు అందుకున్నాడు.

"గాంధీని నిలబెట్టాలె"

"గాంధీనా! వాడు లుచ్చా. లఫంగా. నాకు బద్నాం తెస్తున్నడు. వాడు వస్తె కాలేజీ బాగుపడ్డట్టే! వద్దు-వాడు వద్దు" ఆవేశంలో అన్నాడు రామయ్య. సిగరెట్టు కాల్చకుండానే టేబిల్ మీద వేశాడు.

"సిగరెట్టు ముట్టించుకోండి" అని లైటరుతో వెలిగించాడు శేషయ్య. సిగరెటు అంటించుకొని పొగవదలి చేరగిలబడి కూర్చున్నాడు రామయ్య.

"మీరన్నది నిజమే. కాని లుచ్చాలే మన చేతులుంటారు - మంచోళ్ళుంటరా? ప్రకాశం మన చేతిలోకి వస్తడా? రాడు. కాలేజీలు ఎవడు వచ్చినా బాగుపడవు. మనం బాగుపడాల్నంటె గాంధీ రావాలె. విన్నరా మనం ఎక్కింది పులిని. దిగితె అది మనను చంపుకుతింటది. దాని మీదనే ఉండాల్నంటె గాంధీని పట్టుకోవాలె. తప్పదు. ఏమంటరు?"

రామయ్య తల గిర్రున తిరుగుతూంది. మనసు మనసులో లేదు. ఆలోచ నలు అనూంతంగా వెనక్కు పోతున్నాయి-ముందుకు వస్తున్నాయి. ప్రకాశం కనిపి స్తున్నాడు. గాంధీ కనిపిస్తున్నాడు. మంగమ్మ కనిపిస్తున్నది. సుమతి కనిపిస్తున్నది. పల్లె కనిపిస్తున్నది. పట్నం కనిపిస్తున్నది. పదవి కనిపిస్తున్నది. పదవి వినిపిస్తున్నది. అంతే. అక్కడికి వచ్చి ఆగిపోయాడు రామయ్య.

రామయ్య ముఖం వాడి రాలిన గులాబీలా ఉంది - నలిగి నేలరాలిన మల్లెలా ఉంది. ముఖమంతా చెమర్చింది. వళ్ళంతా చెమట పట్టింది. లేచి నుంచు న్నాడు. "సరె. కానియ్యి. అట్లనే కానియ్యి. నేను ఎనక ఉన్ననని ఎరక కాని య్యొద్దు. నాకు పిచ్చెక్కేటట్లున్నది" అని పెద్దపెద్ద అంగలువేస్తూ సాగిపోయాడు రామయ్య. రామయ్య కార్లో పోతుంటే అతని మనసులో ప్రకాశమే మసలసాగాడు- కాని ప్రకాశించలేకపోయాడు.

కాలేజీలో ఎన్నికల సంరంభం ఎక్కువయింది. కాలేజీ ఆవరణ సాంతం రక రకాల బేనర్లతో నిండిపోయింది. విద్యార్థులకు చదువుమీద ధ్యాసలేదు. అయినా క్లాసులు జరుగుతున్నాయి. విద్యార్థులు, విద్యార్థినులు గుంపులు గుంపులుగా చేరి ప్రకాశాన్ని గురించీ, గాంధీని గురించీ చర్చించుకుంటున్నారు.

ప్రకాశం మూల సమస్యల్ని లేవనెత్తి చర్చలు జరుపుతున్నాడు. ప్రస్తుత విద్యా విధానం బానిసల్ని తయారుచేసేదన్నాడు. విద్యావిధానం నిర్ణయించడంతో విద్యార్థుల పాత్ర అవసరం ఎంతైనా ఉందన్నాడు. కాలేజీలో జరిగే అన్యాయాలను, అక్రమాలను ఒక్కొక్కటె ఎత్తి చూపుతున్నాడు. హాస్టళ్ళలో పెట్టే తిండి, లైబ్రరీ లలో అరువిచ్చే పుస్తకాలు, రాకున్నా వేసే అటెండెన్సు ఈ సమస్యలు విద్యార్థుల్ని బాగా ఆకర్షిస్తున్నాయి.

గాంధీకి సమస్యలు తెలియవు. కార్ల నిండా విద్యార్థులను బార్లకు చేరుస్తున్నాడు. రామయ్యతో చెప్పి ఉద్యోగాలిప్పిస్తానంటున్నాడు. ఇతర పనులు చేయించి పెడ్తానంటున్నాడు. అతని వెంటా జనం ఎక్కువగానే తిరుగుతున్నారు.

జనం ప్రకాశంవైపు మొగ్గుతున్నట్లు గమనించాడు శేషయ్య. గాంధీని ఉసికొల్పాడు. డబ్బు అందించాడు. మరికొన్ని కార్లు ముందుకు నెట్టాడు. గాంధీ చెప్పింది వేదం అయింది. గాంధీకి ఆవేశం ఎక్కువయింది. గోడలమీదికి గీతనూ, ప్రకాశాన్ని ఎక్కించారు. బూతులన్నీ రాశారు. బొమ్మలన్నీ వేశారు. ప్రకాశం ప్రిన్సిపాల్‌తో చెప్పాడు. జరిగింది తప్పేనని ఒప్పుకున్నాడు ప్రిన్సిపాల్. గోడలు బాగుచేయిస్తానన్నాడు. దాంతో గాంధీ ఆగ్రహం ప్రిన్సిపాల్ మీదికి మళ్ళింది. గాంధీ బృందం ప్రిన్సిపాల్‌మీద పడ్డది. బతికి బయట పడాలంటే అలాంటివాటికి పూనుకోవద్దని హెచ్చరించారు. విద్యార్థుల ఎన్నికల్లో జోక్యం కలిగించుకోవద్దని రామయ్య నుండి తాకీదులందాయి. దాంతో గాంధీ గెలిచినట్లు గంతువేశాడు. అక్కడే అతని బృందం ఎగిరింది, గంతులు వేసింది. కేరింతలు వేసింది. క్లాసు జరుగుతుంటే క్లాసులో ప్రవేశించాడు గాంధీ. లెక్చరర్ ముందుకు వెళ్ళి అతని టేబిల్ మీద నుంచొని ఉపన్యసించాడు-ప్రకాశం లంచం తిన్నాడనీ - గీతతో కులుకుతున్నాడనీ. అంతమంది విద్యార్థుల్లో ఒక్కడూ ఉలకలేదు-పలకలేదు. లెక్చరర్ నోరు మూసుకొని వెనుక నుంచున్నాడు. మూలనున్న ఒక విద్యార్థి లేచి "ప్రకాశంమీద చాడీలు చెపుతున్నావు. నువ్వు చూచావా?" అని అడిగాడు. గాంధీకి వళ్ళు మండింది. "ఎవడ్రా వాడు?" అన్నాడు. "కూచో...కూచో" అన్నారు గాంధీ మనుషులు. "ఎందుకూర్చోమంటారు-చెప్పండి నేనడిగిందానికి సమాధానం" అన్నాడు మూలవిద్యార్థి. "వీనికి మస్తి ఎక్కిందిరా" అన్నాడు గాంధీ. "దింపుతం" అని మూలవిద్యార్థిమీద పడ్డారు అనుచరులు. నాలుగు లెంపకాయలేశారు. చేయిపట్టి బయటికి లాక్కుపోయారు. అందరూ చూస్తుండగానే చితక్కొట్టారు. నోట్లోంచి రక్తం వస్తుంటే నేలమీద పడిపోయాడు మూలవిద్యార్థి. అతడు పడిపోయినా, రక్తం స్రవిస్తున్నా ఊరుకోలేదు గాంధీముఠా. సైకిల్ చైన్స్‌తో బాదసాగారు. కిక్కురు మనడంలేదు మూలవిద్యార్థి. దెబ్బలకు చర్మం లేచిపోతూంది. రక్తం కారుతూంది. మాంసపు ముద్దలా పడివున్నాడు. అయినా దెబ్బలు పడుతూనే ఉన్నాయి

వార్త అగ్గిలా పాకింది.

ప్రకాశం పరిగెత్తి వచ్చాడు. చూచాడు. నిర్విణ్ణుడయినాడు "ఆపండి దౌర్జన్యం" అరచాడు. సైకిల్ చైనులు క్షణం చకితమైనాయి. నిలిచాయి. ఊపిరి పీల్చుకున్నాయి.

"ఆయారే తీస్‌మార్‌ఖా౯. పక్డో. మారో" రషీద్ హెచ్చరించాడు. సైకిల్ చైన్లకు చైతన్యం వచ్చింది. ప్రకాశంమీద అకస్మాత్తుగా దాడిసాగింది. నాలుగు వైపుల్నుంచి గొలుసులు పడ్డాయి. చర్మం చైన్లతో లేచివచ్చింది. తలమీద బలమైన దెబ్బ తగిలింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. లోకం అంధకారంగా కనిపించింది. నేలమీద పడిపోయాడు ప్రకాశం. అయినా దెబ్బలు పడుతూనే ఉన్నాయి. ప్రకాశం గుండె తప్ప మరే అవయవమూ పనిచేస్తున్నట్లులేదు. నిశ్చేతనంగా పడి ఉన్నాడు.

గుమిగూడిన విద్యార్థులంతా చెదిరిపోయారు.

అక్కడ ఎవరూలేరు-గాంధీ మనుషులు తప్ప!

రెండు జీవులు నేలమీద పడి ఉన్నాయి. రక్తంలో తేలియాడుతున్నాయి. రక్తం పరచుకుంటూంది. నేలలోకి ఇంకుతూంది. సమాజాన్ని వెక్కిరిస్తూంది. సమాజాన్ని సవాలుచేస్తూంది.

జీవులు కనీసం మూలగడంలేదు.

సైకిల్ చైన్లు నిలిచాయి. వాటి ఆట ఆగింది. అవి రక్తంతో ఎర్రవారేయి. అవి రక్తపు గొలుసుల్లా ఉన్నాయి.

అక్కడ నుంచున్న ముఖాలు ఆ జీవులను చూశాయి. పరచుకుంటున్న రక్తం చూచాయి. ఎర్రవారిన గొలుసుల్ని చూచాయి. నవ్వాలనుకున్నాయి. వికటంగా నవ్వాలనుకున్నాయి. అనుకున్నాయిగాని నవ్వలేకపోయాయి. ముఖాలు మాడిపోయాయి. గొలుసులు వ్రేలాడపడ్డాయి. గుండెలు దడదడలాడేయి! ఎడద చప్పుళ్ళు వినిపిస్తున్నాయి!

ఎక్కడా చప్పుడు లేదు.

అంతా గప్ చిప్ చుప్ చాప్.

దూరంగా ఒక ఆక్రందన వినిపించింది. గీత గేట్లోంచి ఉరికి వస్తూంది. ఒక్కతి ఒంటరిగా "పశువుల్లారా! ప్రకాశం ప్రాణం తీస్తారా?" ఎలుగెత్తి అరిచి ఉరికి వస్తూంది. ఉద్రేకం మూర్తీభవించినట్లుంది. కండ్లు నిప్పులు కురుస్తున్నాయి. ముఖం అగ్ని జ్వాలలా ఉంది. మనిషి మొత్తం మంటలా కదిలి వస్తూంది.

గాంధీ కళ్ళల్లో మంట మండింది.

రషీద్ కళ్ళు బుసలు కొట్టాయి.

ఇద్దరూ ముందుకురికారు-అనుచరులు అనుసరించారు. అంతా గీతమీద పడ్డారు. గీత గిలగిల కొట్టుకుంటున్నది-అయినా ఎదిరించింది-ఎదిరించి ఓడిపో

యింది. నలుగురూ కలిసి పట్టుకున్నారు. నోరు మూశారు. నోరు గుడ్డతో మూసేశారు. గీతను కార్లోపడేశారు. కారు కదిలేప్పుడు రషీద్ అన్నాడు "గీతా! ప్రాణంతో పనిలేదు మాకు. నీ మానంతోనే పని."

కారు సాగిపోయింది - నడిపట్నంలోంచి-రాజవీధుల్లోంచి-మహాజనం మధ్య నుంచి.

అప్పుడు చేరుకున్నారు పోలీసులు కాలేజీకి-తాపీగా. పోలీసులు లారీల్లోనూ, వ్యాన్లలోనూ వచ్చారు. అంతా అడావుడిగా దిగారు. కర్రలు పట్టుకొని కదిలారు. అక్కడ ఏమీ కనిపించలేదు. అంతా నిర్మానుష్యంగా ఉంది. అయినా వ్యాపించారు ఆవరణలో. అప్పుడు కనిపించాయి వారికి రెండు జీవులు-రక్తంలో తడిసిఉన్నాయి. అడుగు వెనక్కువేసి చూచారు. ప్రాణం ఉన్నట్లే కనిపించాయి ముఖాలు-శవాలు కావని నిర్ణయించారు - నిర్ణయించగానే వ్యాను వచ్చింది. వ్యాను రాగానే జీవులను ఎక్కించారు. ఎక్కించగానే వ్యాను ఆస్పత్రికి చేరింది. చేరగానే స్ట్రెచర్లు వచ్చాయి. వచ్చిన స్ట్రెచర్లు జీవులను ఆస్పత్రిలో చేర్చాయి. జీవులను డాక్టర్లు పరీక్షించారు. వెంటనే చికిత్సకు ఏర్పాటు చేశారు. నర్సులు వచ్చారు. గాయాలు కడిగారు-కట్లు కట్టారు. ఇంజక్షన్లు-మందులూ అన్నీ చకచకా సాగాయి. ఎక్సరేలో ఫ్రాక్చర్లు లేవని తేలింది. డాక్టర్లు నిట్టూర్చారు. ప్రమాదం లేదని తేల్చారు. మెడల్లోని స్టెత్తులు చేతుల్లో పట్టుకొని సాగిపోయారు.

ప్రకాశం, మూలవిద్యార్థి స్పృహలేని దశలో మంచాల్లో పడి ఉన్నారు తెల్లవారి ఇద్దరికీ స్పృహ వచ్చింది. ప్రకాశం పరిసరాల్ను చూచాడు. గుర్తించాడు. తనను తాను చూచుకున్నాడు. పక్కకు తిరగాలనుకున్నాడు. నొప్పులుగా ఉంది. తిరగలేకపోయాడు. పైకి చూచాడు. పంకా తిరుగుతూంది. పక్కన చూచాడు-మూలవిద్యార్థి కనిపించాడు. ప్రకాశం చిరునవ్వు నవ్వాడు. మూలవిద్యార్థి నవ్వలేక పోయాడు-అతని ముఖంలో గూడుకట్టుకున్న బాధ కనిపించింది. ప్రకాశం అతన్ని ప్రసన్నం చేయాలని ప్రయత్నించాడు-మూలవిద్యార్థి నవ్వలేదు-మూలిగాడు. కాని చిరునవ్వు నవ్వుతూ డాక్టర్లు, నర్సులూ వచ్చారు ప్రకాశం దగ్గరికి. ప్రకాశం చిరునవ్వుతో స్వాగతం చెప్పాడు.

"How are you Mr. Prakasham! దెబ్బలు బాగా తగిలాయా?" డాక్టరు అడిగాడు.

"డాక్టర్! ఇదేమీ కొత్తకాదు. న్యాయం కోసం నిలిచిన ప్రతివానికీ దెబ్బలు తగుల్తాయి. బాగానే ఉన్నాను డాక్టర్. thanks. నేను బతుకుతాను. నా కింకా చాలా పని ఉంది"

డాక్టరు ఒకింత ఆశ్చర్యపడ్డాడు. అడిగాడు - "న్యాయానికి దెబ్బలు తప్పవంటారా?"

నర్సులు వింతగా చూస్తున్నారు ప్రకాశాన్ని-సమాధానం వినాలని చెవులు రిక్కపొడుచుకుని నుంచున్నారు. తెల్లని దుస్తుల్లో నిశ్చలంగా నుంచున్న నర్సులు అనిమిషల్లా ఉన్నారు.

"డాక్టర్! న్యాయం, సత్యం త్యాగాన్ని కోర్తాయి. వాటి కోసం దెబ్బలు, హత్యలు, రక్తపాతాలూ జరిగాయి-జరుగుతున్నాయి - జరుగుతాయి. న్యాయం ఎప్పుడూ పూలమీద నడిచిరాదు - పుర్రెలమీద నడిచి వస్తుంది. న్యాయం, సత్యం, సమత వీటికోసం బలిదానాలు కావాలి డాక్టర్. అవి రక్తంలోంచి వికసించే కమలాలు - బురదలోంచి పుట్టవు"

"మీరు చెప్పింది నిజం మిస్టర్ ప్రకాశం. కాని మీరు అంతగా ఆలోచించ కూడదు. విశ్రాంతి అవసరం. ముందు మీరు బాగుపడాలి. ఆ తరువాత చర్చించు కుందాం - నాకూ ఇంటరెస్టే ఇలాంటి విషయాలంటే-ప్లీజ్ టేక్ రెస్ట్" అని పరీక్షలు చేసి చికిత్సరాసి వెళ్ళిపోతూ "ప్లీజ్ టేక్ కంప్లీట్ రెస్ట్. ఉయ్ ఆర్ హియర్ టు హెల్త్స్ యూ" అని వెళ్ళిపోయాడు డాక్టరు-మూలవిద్యార్థిని చూచి.

కొంత సేపటికి పళ్ళరసం ఉన్నగ్లాసుతో ఒక నర్సు వచ్చింది ప్రకాశందగ్గరికి. ఆమె పొడవైంది కాదు-పొట్టిది. ఆమె అందమైంది కాదు-అందవికారీ కాదు. ముఖం మామూలుగా ఉంది. ఆమె రంగు ఎరుపుకాదు - కారునలుపూ కాదు. చామనచాయ. ఆమె కళ్ళలో ఆనందంలేదు - విషాదమూ లేదు! బాధ ఉంది. వ్యధ ఉంది. ఆమె చిరునవ్వు నవ్వుతుంది. నవ్వు వెన్నెల్లా ఉండదు - వెలిగే కొవ్వొత్తిలా ఉంటుంది.

పొట్టినర్సు ప్రకాశానికి పళ్ళరసం తాగించింది. గ్లాసు కాళీ అయింది. గ్లాసు పట్టుకుంది కాని కదల్లేదు. ప్రకాశం పక్కనే నుంచుంది. కదల్లేదు. ప్రకాశాన్ని చూస్తూంది. కన్నార్పలేదు. ప్రకాశం ఆమెను చూచాడు. ఆమె చూపులు చూచాడు. ఎందుకో అతనికి సిగ్గనిపించింది. ప్రశ్నార్థకంగా చూచాడు-పొట్టినర్సు చూపు మళ్ళించుకోలేదు. "మీరు చాల గొప్పవారు" అంది. అవి గొంతులోంచి కాదు-గుండెలోంచి వచ్చిన పదాలు. ఊపిరిపోసుకుని వచ్చాయవి. ఆ పదాలలోనే ఉచ్ఛ్వాస నిశ్వాసాలూ - గుండెల చప్పుళ్ళూ వినిపించాయి.

ప్రకాశం తబ్బిబ్బైనాడు. లిప్తలోసగం ఊపిరి నిల్చినట్లయింది. చూపు వాల్చు కున్నాడు. అన్నాడు "నేను గొప్పవాణ్ణికాను. నా ఆదర్శాలు గొప్పవి."

"అందుకే మీరు గొప్పవారు" ఆమె గొంతు పూడుకు పోతూంది. ఎక్క ణ్ణుంచో పిలుపు వినిపిస్తే చరచర వెళ్ళిపోయింది పొట్టి నర్సు.

వెళ్ళిపోతున్న నర్సు నడకను చూస్తూ ఉండిపోయాడు ప్రకాశం.

మూలవిద్యార్థి తలిదండ్రులు వచ్చారు. వాళ్ళు ప్రకాశాన్ని చాటుగా తిట్టు కున్నారు. తమ కొడుకు చికిత్సకు ఏర్పాట్లు చేసుకున్నారు.

ఆ సాయంకాలం ప్రకాశాన్ని స్పెషల్ వార్డుకు మార్చారు.

గీత ఇంట్లోపడి ఏడ్చింది-కళ్ళు ఉబ్బేట్లు - గుండె పగిలేట్లు ఏడ్చింది. ఆమెకు లోకం అంధకారం అనిపించింది - అయోమయం అనిపించింది. తాను తనకే అసహ్యం అనిపించింది. తన సర్వస్వం ఎవరో దోచుకున్న ట్లనిపించింది. ఆత్మ హరించినట్లనిపించింది. ప్రాణం పోయినట్లనిపించింది. ఇంకా ఎందుకు బతుకు తూందో అర్థం కాలేదు. ఆత్మహత్య ఆలోచనకూడా వచ్చింది. చావు ఎదురుగా వచ్చి నిలిచింది. పిలిచింది. గీతకూడా వెళ్ళడానికి సిద్ధపడ్డది కాని ప్రకాశం వచ్చి చావును తరిమాడు? ప్రకాశాన్ని చూచింది. ఉరికిపోయింది చావు. చావు ఉరికింది. కనిపించకుండా పారిపోయింది. ప్రకాశం ప్రకాశవంతంగా కనిపించాడు. ప్రకాశంలో వెలుగు కనిపించింది-వెన్నెల కనిపించింది-విప్లవం కనిపించింది. గీత ఏడ్పు మానింది. ఆమె కళ్ళు పీక్కుపోయాయి. చెంపలు గుంతలు పడ్డాయి. ముఖం కళ తప్పింది. గీత ఆస్పత్రికి పరిగెత్తింది. గీత ప్రకాశాన్ని చూచింది. అతడు ప్రశాంతంగా ఉన్నాడు. మంచంలో పడుకొని ఉన్నాడు. పుస్తకం చదువుతున్నాడు. ప్రకాశాన్ని చూచింది గీత - ఆమెలో దుఃఖం పొంగి, పొరలి, కట్టలు తెంచుకుంది. ప్రకాశం మీదపడి భోరుమంది "ప్రకాశం! నా శీలం చెడింది. నేను నాశనం అయి నాను" గుండెలు అవిసేట్లు ఏడుస్తూంది.

పొట్టినర్సు మందివ్వడానికి వచ్చి చేతులో గ్లాసుతో గుమ్మంలో నిలిచి పోయింది.

"గీతా! ఏమిటా పిచ్చి! మనం విప్లవకారులం. మనకు శీలాలూ అవి చెడటాలూ ఏమిటి? శీలం అనేది కలవారు సృష్టించిన పదం. ఆడదాన్ని పట్టి పరదాల్లో బంధించి ఉంచడానికి ఏర్పడిన పడికట్టు. విప్లవకారులకు శీలం చెడేదికాదు. దాన్నెవరూ చెరచ లేరు. మన శీలం విప్లవం-దాన్నెవరూ చెరచలేదు-చెరచలేరు. కార్చిచ్చును కావిలించు కునే వారున్నారా ?"

"కాని?........" ఏదో అనబోయింది గీత - ఆమె ఏడ్పు ఆగిపోయింది- అణగిపోయింది.

"ఈ సమాజంలో మంచికి దేనికి రక్షణలేదు. ఇక్కడ సామాన్యులంతా ఏదో రకంగా చెరచబడ్డవాళ్ళే. ఎన్నికలను నమ్ముకునేట్లుచేసి నన్నూ ఒకరకంగా చెరిచిందీ సమాజం. గీతా! ఈ వ్యవస్థలో ఆస్తికి ఆస్తిగల వాళ్ళకు తప్ప దేనికి రక్షణలేదు. ఒక్కసారి ఆలోచించు. ఇంత పోలీసు బలగం - ఇన్ని శాసనాలూ ఆస్తిని రక్షించడానికి కాక నిన్నూ, నన్నూ రక్షించడానికి ఏర్పడ్డాయనుకుంటు న్నావా? సమాజాన్నీ, వ్యవస్థనూ అర్థం చేసుకో గీతా! అన్నీ స్పష్టంగా కనిపిస్తాయి! విప్లవం తేవాలె గీతా విప్లవం! ఈ వ్యవస్థను సమూలంగా నాశనంచేసి అరుణారుణ సమాజాన్ని సృష్టించాలి. అప్పుడు మంచికే రక్షణ - ఆస్తి ఉండదు-అంతస్తులుండవు అక్కడ"

గీత లేచి నుంచుంది - మంచం పక్కన. ఆమెలో దుఃఖం లేదు. ఉద్రేకం ఉందిప్పుడు.

ఉభయులూ మాట్లాడ్డంలేదు.

పొట్టినర్సు మంచం దగ్గరికి వెళ్ళి అంది:-

"ప్రకాశంగారూ! మీరు చాల గొప్పవారు"

"సిస్టర్! మందు తెచ్చావా ?" అని గ్లాసందుకొని గటగటా తాగేశాడు ప్రకాశం.

పొట్టినర్సు ప్రకాశాన్ని చూస్తూ నుంచుంది. "ప్రకాశంగారూ! నేనూ చెరచబడ్డదాన్నే! అది తలచుకొని కుంగి క్రుశించి చస్తున్నాను. నా కళ్ళు తెరిచారు. నాకు ఆశ చూపించారు. ఇందులో నా తప్పేముంది? నేను కావాలని చేశానా ? ఈ చిన్న విషయం ఇంతవరకెవరూ చెప్పలేదు నాకు. అంతా నేనేదో చేయరాని పనిచేసినట్లు ఈసడిస్తారు. పురుగును చూచినట్లు చూస్తున్నారు. మీరెంత మంచివారు ప్రకాశం ! మీరు మనుషులు కారు దేవత...."

"సిస్టర్ ఈమె గీత ......." అని పరిచయం చేశాడు ప్రకాశం.

గీత ప్రకాశాన్ని చూచింది - ఆ చూపులో మున్నెన్నడూ ఎరుగని అభిమానం ఉంది–గౌరవం ఉంది – ఆదరం ఉంది.

గీత నర్సును చూచింది – నర్సు గీతను చూచింది–ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి.

తరవాత గీత కాలేజీకి వెళ్ళలేదు. ప్రకాశం అస్పత్రిలోనే ఉన్నాడు. కాలేజీలో ఎన్నికల ప్రచారం అడుగంటింది-పార్టీలు ఎక్కువయినాయి. గాంధీ, రషీద్ మున్నగువారు స్వైర విహారం చేస్తున్నారు. ఒకరకపు భీతాహం వ్యాపించింది. అట్టుడికినట్లు ఉడుకుతూంది కాలేజి. చాల మందిలో ఆలోచన బయల్దేరింది. పెదవి కదలడం లేదు. మనసు నిలవడంలేదు. అంతర్వాహినిగా పనిచేస్తున్నారు మురళి, చంద్ర, కృష్ణ లాంటి విద్యార్థులు. గాంధీ డబ్బు గుమ్మరిస్తున్నాడు. కార్లు కాలేజీ చుట్టూ గిరగిరా తిరుగుతున్నాయి. బ్రాందీ, విస్కీ, సరచ్, గంజాయి, ఎలెస్డీ విరివిగా ప్రసారం అవుతున్నాయి. విదేశపు హిప్పీలతో స్నేహం అయింది. వారిలో అందమైన అమ్మాయిలున్నారు - వారి ప్రణయానికి హద్దుల్లేవు. వారి ఆనందంలో మునిగితేలుతున్నాడు. ఎన్నికల కోలాహలంలో కొట్టుమిట్టాడుతున్నాడు. గాంధీకి ఎన్నికలంటే మోజు చచ్చింది. అయినా వెనకనుంచి తరుముతున్నారు - అతడు ఉరుకుతున్నాడు. అతని ఆనందమార్గాలువేరు -ఎన్నికలు అందుకు అనుబంధం అయినాయి-వాటిని బంధంగా భావించడం లేదతను.

అనుకున్నా, అనుకోకున్నా ఎన్నికల రోజు రానేవచ్చింది. గాంధీ, రషీద్, తదితరులు ఆనాడు స్పృహలోలేరు. అయినా ఏర్పాట్లు బాగానే జరిగాయి–చేయించినవారు తెరచాటువారు.

ఓట్లుపడ్డాయి. లెక్కింపు సురు అయింది. గాంధీ, రషీద్ ఆనాడు స్పృహలోనే ఉన్నారు. ఉండవలసిందని బతిమాలారు. లెక్కింపు దగ్గర కూర్చున్నారు. లెక్కింపు సాగుతూంది. చీమలు పారుతున్నాయి రషీదుకు. గాంధీకి లేని పౌరుషం పొడుచుకు వచ్చింది. ఓట్ల లెక్కింపు సాగిపోతూంది. తేళ్ళు జెర్లు పారినట్లు అవుతూంది.

"ఎన్నికలలో గందరగోళం జరిగింది - దొంగ ఓట్లు వేయించుకున్నారు" రషీద్ లేచి నుంచొని కేకపెట్టాడు.

"అవును. దొంగలు. భయపెట్టి వేయించుకున్నారు" గాంధీ అరచాడు. అతడు లేవలేదు. కూర్చునే ఉన్నాడు. వణికిపోతున్నాడు.

"మీరే దొంగలు. దౌర్జన్యం చేసి ఓట్లువేయించుకున్నారు" మురళి.

"క్యాబే! క్యాబక్తాహై" మురళిమీదికి ఉరికాడు రషీద్—ఒక చెంపదెబ్బ కూడా వేశాడు.

అటువైపు వాళ్ళు ఊరుకోలేదు. వాళ్ళూ సిద్ధంగానే ఉన్నారు.

చేతులు చేతులు కలిశాయి. కల్లోలం జరిగింది.

ప్రిన్సిపాల్ చూస్తూ కూర్చున్నాడు — కళ్ళుమిటకరిస్తున్నాడు — కదల్లేదు.

అటు కల్లోలం జరుగుతూంది—ఇటు గాంధీ అగ్గిపుల్లగీరి ఓట్లల్లో వేశాడు. ఓట్లు భగ్గుమన్నాయి - కల్లోలపు దృష్టి ఇటు మళ్ళింది. కొందరు ఆర్పడానికి - కొందరు కాల్చడానికి ఎగబడ్డారు. మంటలు ఆరలేదు - మండుతూనే ఉన్నాయి. ఆ మంటలకు ప్రిన్సిపాల్ ముఖం వెలుగుతూంది. ఆ కళ్ళల్లో వెలుగులేదు. ఆ ముఖంలో కాంతిలేదు. ఆ మూర్తిలో చలనంలేదు. ప్రతిమలా ఉన్నాడతను. రాతి బొమ్మలా ఉన్నాడతను. దైవ విగ్రహంలా ఉన్నాడతను. అన్నీచూస్తున్నాడు. అయినా ఏమీ చేయలేడు. అతడున్నాడనే విషయం ఎవరూ గ్రహించలేదు. గమనించలేదు. హోరాహోరి పోరు జరుగుతూనే ఉంది పోలీసులు వచ్చి చెదరగొట్టేవరకు. గాంధీకి అక్కడక్కడా దెబ్బలు తగిలాయి. రషీద్ గూడమీద బలమైన దెబ్బ తగిలింది. ఇద్దరూ కార్లో ఎక్కి పారిపోయారు.

ఆ రాత్రి గొప్ప పార్టీ జరిగింది-గాంధీ గెలిచినందుకుకాదు—ప్రకాశం ఓడినందుకు. అలాంటి విందు ఎన్నడూ జరగలేదు. విదేశీ జనం పాల్గొన్నారు. వాద్యాలు మ్రోగాయి. పాటలు సాగేయి. ఆటలు ఆడేయి. తాగేవాళ్ళు తాగుతున్నారు. గంజాయి కొట్టేవాళ్ళు కొడ్తున్నారు. ముద్దులాడేవాళ్ళు ముద్దులాడుతున్నారు.

గాంధీ మైకంలో ఉన్నాడు. మనలోలేడు. ఆ వాతావరణమే అలా ఉంది. అక్కడ సభ్యతలేదు. నాగరకతలేదు. నియమాల్లేవు. హద్దులులేవు.

గాంధీ ఒక అమ్మాయి చేయిపట్టుకున్నాడు. ఆమె విదేశీ. బంగారం రంగు వెంట్రుకలు ముఖం మీద పడుతున్నాయి. నల్లని పెద్ద అద్దాలతో కళ్ళు కనిపించడంలేదు. ఆమెది పసిడిరంగు. ఆమె కోలముఖంలో అమాయకతలేదు. ఆనందం ఉంది. ఆమె పెదవులు సన్నగా ఉన్నాయి. ఎర్రగా ఉన్నాయి. గద్దువ ముద్దొస్తూంది.

ఆమె గొట్టంతో గంజాయి పీలుస్తూంది. గాంధీ పట్టు చూచింది. లేచింది. గంజాలు అందించింది. గాంధీ కాదనలేదు. ఆమె నడుముచుట్టూ చేయివేశాడు గాంధీ. ఆమె గాంధీ నడుం మీద చేయివేసింది. గంజాయి గొట్టం పడిపోయింది. వారి ఇద్దరి అడుగులు కలిశాయి. కలిసి ఆడారు. ఆటకు వాద్యం జోడించారు మైకంలోనే జనం.

ఆట సాగుతూంది-డ్యాన్సు నృత్యం చేస్తూంది.

తాళానికి తగినట్లు అడుగు పడుతూంది.

పడుచు జంట - పరువంలో ఉంది - పరువం ఆడుతున్నట్లుంది. పరువం పాడుతున్నట్లుంది. చూడముచ్చటగా ఉంది - ముద్దుగా ఉంది. అందుకే అంత మైకంలోనూ అరుస్తున్నారు జనం-కేక లేస్తున్నారు. లోకాన్ని మరిచినవారు లోకం లోకి వస్తున్నారు.

"డార్లింగ్" అత డన్నాడు.

"డియర్" ఆమె అన్నది.

పెదపి అందించింది.

అతడు అందుకున్నాడు.

ఆమె గుసగుసలాడింది- Forget the world this is the bliss."

"అవును లోకాన్ని మరుద్దాం - ఇదే ఆనందం" గాంధీ అన్నాడు.

చుట్టూ వున్నవాళ్ళు చప్పట్లుకొట్టారు - అంతే ఆ తరవాత మనకు తెలీదు- లైట్లు ఆరిపోయాయి. చీకట్లు కమ్మాయి.

చీకట్ల తెరలు జారేయి.

మిణుగురు సైతం లేదక్కడ.

అటు చూడకండి-మనకేమీ కనిపించ దక్కడ - కటికచీకటి తప్ప!

అర్థరాత్రి దాటింది. ట్యాంక్‌బండ్ ప్రశాంతంగా ఉంది. నియాన్‌లైట్ల వెలుగుకు రోడ్డు మెరిసిపోతూంది. కారు శరవేగంతో వస్తూంది- అప్పటికే మూడుసార్లు పట్టుతప్పింది. ప్రమాదానికి ఎప్పుడో గురికావలసింది - కాలేదు. అయినా సాగుతూనే ఉంది. కారు నడుపుతున్నవాడు రషీదు — అతడు మనలో లేడు - అయినా కారు నడుప గలననే ధీమా అతనిది. లోన ఉన్నవాడు గాంధీ — అతనికి తెలివిలేదు. అయినా హుసేన్‌సాగర్‌లో నీరు - ఫుట్‌పాత్‌మీది బెంచీలు కనిపిస్తూనే ఉన్నాయి. గాంధీ కేకపెట్టాడు కారాపమని - చప్పున బ్రేకువేశాడు రషీదు. కారు ఒక్క ఊపు ఊగి - ఫుట్‌పాత్‌కు కొట్టుకొని ఆగిపోయింది.

ఆ ధ్వనికి వెనక్కు తిరిగి చూచింది చెరువులోకి చూస్తూ ఉండిన యువతి - ఆమె అక్కడికి ఎందుకు వచ్చిందో ఆమెవెంత విషాదగాథో తెలీదు - గాంధీ కంట బడ్డది.

గాంధీ కారు దిగి ఉరికి ఆమెను పట్టుకున్నాడు. లాగాడు - ఆమె గింజు కుంది-చెరువులో పడబోయింది-రషీద్ దిగివచ్చి పట్టుకున్నాడు. ఇద్దరూ ఆమె

పైట లాగారు - అంత వెలుగులో. ఆమె కేకలు పెట్టింది. పక్కనే పోలీసుస్టేషనుంది. పోలీసులు ఉరికి వచ్చారు. చూస్తే దృశ్యం ఘోరంగా ఉంది. లాఠీలతో గాంధీని, రషీదునూ బాదారు. అప్పుడుగాని వారామెను వదల్లేదు. పోలీసులు ముగ్గురునీ పోలీసుస్టేషనుకు ఈడ్చుకు పోయారు. గాంధీని, రషీదును గదిలోవేసి చితక్కొట్టారు. లాఠీదెబ్బలకు ఒళ్ళు చిట్లిం తరవాత తెలివి వచ్చిందిద్దరికీ. అప్పుడు అరచాడు రషీదు "మినిస్టర్‌కా బచ్చాహై" అని. లాఠీలు వెంటనే నిలిచాయి. పోలీసులు బొమ్మల్లా నిలిచారు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. ఏదో చేయరాని నేరం చేశామన్నట్టున్నాయి-వారి చూపులు. ఆ చూపులలో భయం ఉంది - బాధలేదు. లాఠీలు అక్కడే పడేసి చరచరా బయటికి వెళ్ళిపోయారు.

"అరె. మర్‌గయారే" అని గాంధీ రషీదును చుట్టుకొని ఏడ్చేశాడు - రషీద్ గాంధీని చుట్టుకొని ఏడ్చాడు. ఇద్దరూ ఏడుస్తున్నారు - వారిని గుర్తించేట్లు లేరు. జుట్టు చెదిరిపోయింది. ముఖాలు ఉబ్బాయి-చెంపలు కన్నీళ్ళతో తడిశాయి. బట్టలు చిరిగాయి. దెబ్బలకు వళ్ళు వాచింది. నొప్పులుగా ఉంది—సలుపుతూంది.

గదిలో అడుగు పెట్టిన చప్పుడయితే ఇద్దరూ తలెత్తి చూశారు. పోలీస్ కమీషనర్ వచ్చాడు. వెనుక కొందరు పోలీసు అధికారులున్నారు. వారిని చూచి రషీద్, గాంధీ లేచి నుంచున్నారు. కమీష్నరు దగ్గరికివచ్చి గాంధీ వీపు నిమిరాడు. "దెబ్బలు బాగా తగిలాయా? పోలీసు వెధవలకు బుద్ధి ఉండదు. వారిని నేను శిక్షిస్తా. మీరేమీ అనుకోకండి. రాండి వెళ్దాం" గాంధీ బుజంమీద చేయివేసి నడిపించి తీసికెళ్ళాడు బయటికి.

కమీషనరు కారు రామయ్య ఇంటిముందు నిలిచింది.

అప్పుడే రామయ్య కారు కూడా వచ్చి ఆగింది - అతడు ఒక పార్టీకి వెళ్ళి వచ్చాడు. కమీషనర్ రామయ్యకు నమస్కరించాడు.

"ఏమిటి? ఇంతరాత్రి?" రామయ్య అడిగాడు.

"ఏం లేదు...మీ అబ్బాయి....ఏదో...మా పోలీసులు పొరబడ్డారు"

"మళ్ళీ ఏం వెలగబెట్టిండు? ఏమిటి వాడు చేసింది?"

కమీష్నర్ సంక్షిప్తంగా వివరించాడు.

రామయ్య మండిపడ్డాడు. "ఏడివాడు? ఎక్కడున్నడు? నా పేరు చెరచ పుట్టిండు"

గాంధీ కార్లోంచి దిగాడు, గాంధీ వేషం చూచి మరీ మండిపోయాడు రామయ్య. "ఛీ పుండాకోరు ముండాకొడక. ఎట్ల పుట్టినవురా?"

"అది నాకేం తెలుసు?"

"ఓరి గాడ్దికొడక! ఎందుకురా ఇట్లాంటి లుచ్చాపనులు చేసి బతకటం. చావరాదు ఎందన్నన్నపడి-నా పీడ విరగడయితది"

"నేను మీ కొడుకును. గాడ్దికొడుకు నెట్లయిత. నేను చేసిన తప్పేమి? ఊళ్లు దోచుకోలేను. హత్యలు చేయించలేదు. స్వేచ్ఛగా బతకాలనుకున్న. ఒక అమ్మాయిని పట్టుకోవడం తప్పు. ఒక పెగ్గు తాగడం తప్పు. ఆడడం తప్పు. ఎగరడం తప్పు. జుట్టు పెంచుకోవడం తప్పు. మంచి బట్టలేసుకోవడం తప్పు. సినీమాలు చూడ్డం తప్పు. నాటకాలు వేయడం తప్పు, ఈలవేయడం తప్పు. ఇగిలించడం తప్పు. ఛీ-ఛీ అన్నీ తప్పులే ఈ దేశంలో. వెధవముండ లుండాల్సిన దేశం. చాటుగా కడుపులు చేయించుకునే దేశం. చాటుగా తాగేదేశం. చాటుగా హత్యలు చేసేదేశం. చాటుగా దోచుకునేదేశం. ఈ చాటు నాకు గిట్టదు. ఈ ఇరుకు సమాజంలో నలిగి, నలిగి నేను చావలేను. నాకు స్వేచ్ఛకావాలి. స్వేచ్ఛ. నేను అన్నీ బహిరంగంగా చేయగలగాలి. చేయలేను. చేయనివ్వరు. నాకీ లోకంతో పనిలేదు. మీతో పనిలేదు. మీ అధికారంతో పనిలేదు. మీ సమాజంతో పనిలేదు. ఈ కుళ్ళుకు, ఈ కుట్రలకు, ఈ బంధనాలకు దూరంగా ఉండే చోటికి పోతాను. నాకు ఆనందం కావాలి. హాయి కావాలి. సౌఖ్యం కావాలి. నాకు జనం అక్కరలేదు. దేశం అక్కరలేదు. మీరు అక్కరలేదు"

గాంధీ చెంప ఛెళ్ళుమంది.

"గాడ్దికొడక! ఏమి అక్కరలేదంటున్నవుగద! పో ఇక్కణ్ణుంచి పో. ఇంట్లోకి అడుగు పెట్టె కాళ్ళిరక్కొడ్త. అసలు నువ్వు నాకు కొడుకువేకాదు. పామును తెచ్చి ఇంట్లపెట్టుకొని పెంచిన. నువ్వు నా కొడుకువు కాదు. నేను నీ తండ్రినికాదు. పోరా. పో. ఎక్కడికి పోతవో. ఈ ఇంటి తలుపులు ఎప్పుడు బందే ఉంటయి. ఇవి తెరుచుకోవు. పో. పో నీకు నాకు రుణం తీరింది" అని దడదడా లోనికి పోయి దఢాల్న తలుపులు మూశాడు రామయ్య.

రామయ్య ఇంటి తలుపులు మూసుకున్నాయి.

గాంధీ, లైలా లేని మజ్నూవలె నుంచున్నాడు. రషీద్ కారు దిగివచ్చి గాంధీ బుజంమీద చేయివేసి నుంచున్నాడు. గాంధీ ఉలకలేదు - ఇద్దరూ చూచారు. మూసుకున్న తలుపులను- పెద్ద తలుపులను - అందమైన తలుపులను.

"ఆ తలుపుల వెనుక చెరసాల ఉంది. అందులో నేను ఉండలేను. పద భాయ్ పోదాం" గాంధీ వెనక్కు తిరిగి నడిచాడు. రషీద్ వెళ్ళిపోతున్నాడు.

కమీష్నర్ కారు ఎప్పుడు పోయిందో గమనించలేదు వారు.

గాంధీ, రషీద్ సాగిపోతున్నారు.

సాగిపోతున్నవారిని, కాపలా ఉన్న పోలీసు చూస్తున్నాడు. అతనికి అంతా అయోమయంగా ఉంది. "ఈ కాలపు పిల్లలే అంత. వారు ఎవరికీ అర్థం కారు" అని గొణుక్కున్నాడు.

గాంధీ రషీద్ చూపుకు అందడంలేదు. సాగిపోయారు - కనిపించడంలేదు. ఒక నిట్టూర్పు విడిచి స్టూలుమీద కూలబడ్డాడు పోలీసు—బీడీతీసి అంటించుకున్నాడు.

ఆతని కంతా గందరగోళంగా ఉంది. గాంధీ రషీద్ వెళ్ళిపోయారు. రామయ్య లోనికివెళ్ళి తలుపేసుకున్నాడు. తండ్రీ కొడుకుల బంధం పచ్చిదారంలా తెగిపోయింది. ఏమిటిదంతా? ఎవరు దీనికి బాధ్యులు? అనే ప్రశ్న అతని మనసును కుమ్మరి పురుగులా తొలచసాగింది.

గాంధీ, రషీద్ కాలినడకనే గోలకొండ చేరుకున్నారు. వారిని చూచిన హిప్పీలబృందం హ...హ....హీ...హీ....హలో...హలో అని స్వాగతం పలికారు. వారిద్దరు ఉరికి వచ్చారు. వీరిని కావలించుకున్నారు. వారు వీరిని, వీరు వారిని.... కేకలు, కేరింతలు, అరుపులు పెడబొబ్బలు. ఆటలు....ఎగురుళ్ళు. గాంధీ ఎలెస్డీ కావాలన్నాడు. అందించారు. మింగాడు. సరచ్—గంజాయి దమ్ములాగాడు. అంతా గుమ్మగా ఉంది. లోకం కనిపించడం లేదు. తానే కనిపిస్తున్నాడు. లోకంలో ఉండే లోకానికి దూరంగా ఉన్నాననుకున్నాడు. సమాజంలో ఉండే సమాజానికి దూరంగా ఉన్నాననుకుంటున్నాడు. భ్రమలో పడిపోయాడు. తన చుట్టూ ఒక గూడు కట్టుకున్నాడు. ఆ గూటినే అనంతం అనుకున్నాడు. అందులోనే పడి ఉంటున్నాడు. అతనికి ఒంటిమీద ధ్యాసలేదు. వళ్ళు మురికి పేరింది. అతనికి బట్టలమీద ధ్యాస లేదు. అవి బస్తా చింపులైనాయి. అతనికి వెంట్రుకలమీద ధ్యాసలేదు. అవి జడలు కడ్తున్నాయి. అతనికి గడ్డంమీద ధ్యాసలేదు. అది బాగా పెరిగిపోయింది. అసలు అతనికి దేనిమీదా ధ్యాసలేదు. మత్తులో, మైకంలో నేలమీద పడి ఉంటున్నాడు.

ఒకనాటి ఉదయం ఒక అంబాసెడర్ ఆగింది అక్కడ. అందులోంచి ఒక స్త్రీమూర్తి దిగింది. గుర్తించారుగా! ఆమె సుమతి! నలిగిపోయింది. గుర్తించరాకుండా ఉంది. సుమతి ఆ వాతావరణం చూచింది - తన కొడుకును చూచుకున్నది. ఆమె గుండె చెరువైంది. కలతపడింది. కలకలం అయింది. "నాయ్నా! గాంధీ!" అని చేతులుచాచి ఉరికింది. తోవలోపడి వున్న జనం లేచి కూర్చున్నారు. గాంధీ లేవలేదు. చేరలపడి, తల ఎత్తి, చేతితో ఉరికివస్తున్న సుమతిని ఆగమని సంజ్ఞ చేశాడు.

సుమతి ఆనకట్ట తాకిన నదిలా నిలిచిపోయింది.

"ఎవరు నువ్వు?" అడిగాడు గాంధీ. ఆ ప్రశ్నలోనే పిడుగులున్నాయి. అవి సుమతిమీద కురిశాయి!

"నాయ్నా గాంధీ! నేను రా! నేను - నీ తల్లిని - తొమ్మిది నెల్లుమోసి కన్నదాన్ని - పెంచి పెద్దచేసినదాన్ని. నా రక్తం పంచుకొని పుట్టినవ్వురా నువ్వు. నా పేగులో పేగువు. నేనే నువ్వురా! నువ్వే నేను. అనరా. అను నన్ను అమ్మా! అను"

"నువ్వు అన్నదంతా తప్పు. మీ ఆనందం కోసం ఏదో చేస్తే మేం బయటపడ్డాం. దానికి ఇంత కథ కల్పించడం బూటకం. నాకు మీమీద, మీ లోకంమీదా నమ్మకం లేదు. మీరంతా దొంగలు. ఏదీ వాస్తవం చెప్పరు. అన్నింటికీ ముసుగు

వేసి రంగులు పూసి చూపిస్తారు. మాకు ముసుగులు పనికిరావు. జీవితం నగ్నంగా, దిగంబరంగా కనిపించాలి. నువ్వు అలా కనిపించగలవా?"

"ఛీ దుర్మార్గుడా! ఏమిటిరా నువ్వంటున్నది. నీ తల్లిని - నన్ను - బట్టలిడిచి బరివాత నిలపడమంటావు. నీకేం పాయే కాలం వచ్చిందిరా! నాయ్నా గాంధీ! తప్పురా అట్లనగూడదు. తప్పులు అందరు చేస్తరు. నువ్వు చేసినవు. నేను తల్లినిరా! అన్ని కడుపులో పెట్టుకుంటరా! రా రా నాయ్నా రా రా." అని కొడుకుమీద పడ పోయింది. గాంధీ పక్కకు జరిగి లేచి నుంచున్నాడు. సుమతి నొసలు దుమ్ములో పడ్డది. ముఖంనిండా మట్టి అయింది. మట్టిలో కుంకుమ మెరుస్తుండగా తలెత్తి చూచింది. గాంధీ నుంచొని ఉన్నాడు. ఆమె గుండెలో అగ్గిమండింది. అయినా భగ్గు మన నివ్వలేదు. లేచి గాంధీకి ఎదురుగా నుంచుంది. తన కొడుకు తనకంటే పొడవైనాడు. ఆపాదమస్తకం చూచింది. సన్యాసిలా కనిపించాడు.

"నాయ్నా! గాంధీ! రారా పోదం. ఈ వైసుల సన్యాసివెందుకయితవు? నీకేం తక్కువైందిర! రార. నీకు తల్లినిర. నాయ్న ఏమనకుండ చూస్త. నీక్కావల సిందిస్తరార. ఎవ్వరి మీదర అలక. తల్లిమీదనార! రార! రానాయ్నా! నేం తీస్క పోత" ఆమె గొంతు బొంగురుపోయింది. దుఃఖం పొంగుతున్నది.

గాంధీ నిశ్చలంగా నుంచున్నాడు.

"నీకూ నాకూ సంబంధంలేదు. నేను రాను. వెళ్ళిపో" అన్నాడు. ఒక అమ్మాయి అతని పక్కగా వచ్చి నుంచుంది.

మండిపోయింది సుమతి "నువ్వు రాయివా? రాక్షసునివా? తల్లి వచ్చి కొంగు చాచి ఏడుస్తుంటే ఆ పోరి వలలో పడి కుళుకుతవా! ఛీ! నాకడుపున చెడపుట్టినవ్! నువ్వు బాగుపడవు. ఇగో నేను పోతున్న. నువ్వు నాశనం అవుతవ్" అని అగ్గికురిసి కారెక్కింది సుమతి. కారు కదలగానే ఏడుపు వచ్చింది. సీటును పట్టుకొని వలవలా ఏడ్చింది.

కారు ఊళ్ళో ఇంటి ముందు ఆగింది. కార్లోంచి శివంగిలా దూకింది సుమతి. శివంగిలా ఉరికింది. మెట్లెక్కింది. సింహద్వారం దాటింది. మరికొన్ని దర్వాజాలు దాటింది. గదులు దాటింది. దేవుని గది తలుపులు తన్నింది. అవి బార్లా తెరుచుకున్నాయి. దేవుని పటాల ముందూ, విగ్రహాల ముందూ నుంచుంది. ఆ నుంచోవటంలో క్రోధం ఉంది. భక్తిలేదు. ఆవేశం ఉంది. అనురాగంలేదు.

"నిన్ను నమ్ముకున్నవాండ్లను ఉద్ధరిస్తనన్నవే. నన్ను నమ్ముకో చాలు. అన్ని చేస్తనంటివే. నిన్నే నమ్ముకున్ననే. ఏం చేసినవ్ నన్ను, చెప్పు. నువ్వేం చెప్పుతవ్! బొమ్మవు! పటానివి! నిన్ను నమ్ముకోటం నాదే తప్పు. రా నిన్ను అవతల పారేస్త" అని పటాలు, విగ్రహాలు తీసుకొని దొడ్లోకి ఉరికింది. బావిదగ్గరకు పోయింది. విగ్రహాలను, పటాలను బావిలో వేసింది. చూసింది. విగ్రహాలు మునిగి పోయాయి. పటాలు ఇంకా తేలుతున్నాయి. కాస్సేపు చూచింది. వెనక్కు తిరిగి

మళ్ళీ ఉరికింది. సింహద్వారం దాటింది. మెట్లు దిగింది. వీధుల్లోపడి సాగిపోతూనే ఉంది. వెర్రిగా సాగిపోతూంది. బాణంలా దూసుకు పోతూంది - ఊరిబయట గుడి దగ్గరికి చేరింది. గుళ్ళోకి పోయింది. పూజారి హారతి ఇస్తున్నాడు. పూజారి చేతి లోంచి లాగి పళ్ళెం పారేసింది. పళ్ళెం పెద్ద చప్పుడు చేసింది. హారతి కర్పూరం ఎగిరి నేలమీదపడి ఇంకా మండుతూనే ఉంది. పూజారి సుమతిని చూచాడు. నివ్వెర పోయాడు. సుమతి శక్తిలా ఉంది.

"ఇవతలికిరా" ఆజ్ఞాపించింది సుమతి.

పూజారి ఇవతలికి వచ్చాడు.

"దర్వాజలు బంద్‌చెయి"

తలుపులు వేశాడు పూజారి.

"గొళ్ళెం పెట్టు"

పెట్టాడు.

"తాళం వెయ్యి"

వేశాడు.

"ఇయ్యాళి నించి పూజ గీజ బంద్. ఇన్నావా."

"అట్లనేనుండి"

గుళ్ళోంచి బయల్దేరింది సుమతి. ఇంట్లో దూరి, గదిలో ప్రవేశించి మంచం మీద పడి వలవలా ఏడ్చింది సుమతి మాతృమూర్తి.

*   *   *

అడవిలో మోదుగులు అగ్గిపూలు పూశాయి. పూసినప్పుడు మోదుగువనం చూస్తే రక్తం పుక్కిలించి నట్లుంది. ఇది వసంతానికి సంకేతం. రానున్న వసంతా నికి కేతనం.

వసంతం వస్తుం దనడానికి ఒక పండుగ ఉంది. అది కాముని పున్నమి. శివుడు తన ముక్కంటి మంటతో కాముని కాల్చిన రోజుకావచ్చు. శరత్కాలపు మచ్చలేని వెన్నెల పరుచుకున్న రాత్రులలో జరుపుకుంటారు పడుచువాళ్ళు ఈ పండుగ. నాగరికత పేర వచ్చిన నిర్బంధాలనూ, దిగ్బంధాలనూ మరచి ఒకరోజు స్వేచ్ఛగా విహరించడానికి అన్ని జాతులకూ ఒక్కొక్క పండుగ ఉన్నట్లుంది. అలాంటిదే కాముని పున్నమి. అంతరాలూ - అంతస్తులూ మరిచి వసంతం చల్లుకునే పండుగ కాముని పున్నమి.

వసంతం తయారు చేయడానికి కోటయ్య బయల్దేరాడు - తోటివారితో అడవికి. అడవిలో మోదుగుపూలు ఏరడం ఒక సరదా. కోటయ్యగుంపు మోదుగు వనంమీద పడ్డది. కొందరు మోదుగులు ఎక్కారు. దులిపారు. కొందరు పూలు ఏరారు. తట్టల కెత్తారు. పదాలు పాడారు. ఆటలు ఆడారు. మోదుగుపూల తట్టలు

నెత్తుల మీద పెట్టుకొని ఊళ్ళోకి వచ్చేవరకు పొద్దుకుంగింది. పశువుల సహితంగా వారు ఇండ్లకు తిరిగి వచ్చారు.

ఆ రాత్రి - ఊళ్ళో నాలుగు బాటలు కలిసేచోట కాముణ్ణి నిలబెట్టారు. అంటె ఒక కర్ర పాతారు. అడ్డంగా పుల్లకట్టి దానికో చొక్కా తొడిగారు. నిలిచిన పుల్లచివరన మనిషి ముఖంలా చేసి దానికి బొట్టు పెట్టారు.

కామునిపున్నం అంటే కోటయ్యకు మహా సరదా. కోటయ్య కుర్రాళ్ళను కూడదీశాడు. పదాలు పాడుతూ ఊళ్ళోకి బయలుదేరారు. అలా ప్రతి ఇంటిముందూ పదాలు పాడారు. ప్రతి ఇంటివారు పిడకలూ, కట్టెలూ ఇచ్చారు. అవన్నీ కాముని చుట్టూ పేర్చి కాడు తయారు చేశారు.

ఆ తరువాత కోలాటాలు వేశారు. ఒకవైపు యువకులతో కోటయ్య బృందపు కోలాటం — మరొకవైపు యువతుల బృందం వేసే కోలాటం. నిండువెన్నెల. చల్లనిగాలి. కమ్మని పాటలు - శ్రావ్యమైన కోలాటం. ఊరుసాంతం అక్కడే చేరింది.

హోలీహోలీర రంగహోలి చెమ్మకేళిరహోళి
యాడాదికొక్కసారి హోళి
నాతురాం వచ్చినాడె హోళి
కొత్తచీర తెచ్చినాడె హోళి
పసుపురయిక తెచ్చినాడె హోళి

సంబరాల్లో సమయం తెలియడంలేదు. అర్థరాత్రి దాటినా అక్కణ్ణుంచి ఎవరూ కదల్లేదు. ఊరూ, నాడూ, పాటలతో ప్రతిధ్వనించింది. కోడి కూసే దాకా కోలాటం సాగింది. కోడికూతలో కోలాటం నిలిచింది. కోటయ్యను చూచి మురిసి పోయారు ఊరి వారు - ముఖ్యంగా మల్లయ్యా, పిచ్చమ్మ. కోటయ్య కోలలు పట్టుకొని వస్తుంటే అంతా అభినందించారు. పిచ్చమ్మ కొడుకును కావిలించుకుంది.

"ఎప్పుడు నేర్చిన వుర ఇయన్ని?" పక్కనే నుంచున్న మల్లయ్య అడిగాడు-ఆ ప్రశ్నలో ఏదో ఆదరం ఉంది. గర్వం ఉంది, వాత్సల్యం ఉంది.

"నేర్చెడి దేమున్నదే అండ్ల-అయ్యే వస్తయి" జవాబులో వినయం ఉంది - ఉత్సాహం ఉంది.

జనం సాంతం మెచ్చుకుంది కోటయ్యను. మెప్పుకోలు చూచి కుర్రకారుకు ఉత్సాహం పొంగింది. కోటయ్యను ఎత్తుకొని ఎగిరారు. గంతులేశారు. ఊరేగారు. కోలాటం చూడ్డానికి రానివాడు ఒక్క యాదగిరి మాత్రమే. యాదగిరి ఊరేగింపు చూచాడు. ఊరేగింపులో కోటయ్యను చూచాడు. కోటయ్యకు కలుగుతున్న గౌరవాన్ని చూచాడు. కుర్రకారుకు అతని విషయంలో ఉన్న ఆదరం చూచాడు. ఆ ఉత్సాహం చూచాడు. ఆ ఉద్వేగం చూచాడు. ఎందుకో అతని కళ్ళుమండేయి. కోటయ్య తన జీతగాడు. కాళ్ళకాడ పడి ఉండాల్సినవాడు. వాడి కేమిటి ఇంత

ఆదరం! వాడికేమిటి ఇంత గౌరవం!! రాత్రికి కాలబోయే కాముని కాదు యాదగిరి ఎదలో కాలింది. అతను కొరకొరలాడాడు. చిరచిర లాడాడు.

ఊరేగింపులో ఎవరూ యాదగిరిని గమనించలేదు. మల్లయ్య ఇంటిదగ్గర నిలిచిపోయింది ఊరేగింపు. ఊరేగింపు కర్మాగారంగా మారింది. పొయ్యిలు వెలిగించారు. పొయ్యిలమీద కుండలు ఎక్కించారు. కుండల్లో నీళ్ళు పోశారు. నీళ్ళల్లో మోదుగుపూలు పోశారు. పొయ్యి మంటకు నీరు మరిగింది. ఆ నీరు రంగుగా మారింది. కుండలు దింపారు. పూలుతీసి వసంతం తయారు చేశారు. చల్లార్చటానికి చెట్లకింద చేర్చారు. ఆ రోజు ఇక దాంతో పనిలేదు. ఆ రాత్రి కాముడు కాల్తాడు. తెల్లవారి రంగులు చల్లుకుంటారు. కుర్రకారు చెదిరి పోయింది. కోటయ్య ఇంట్లోకి వస్తే పిచ్చమ్మ 'దిష్టి' తీసింది. వేణ్ణీళ్ళు కాగబెట్టి తలంటి పోసింది. వేడి వేడి బువ్వలో మిరపపచ్చడివేసి పెట్టింది. ముందు కూర్చొని 'ఇంతే' 'ఇంతే' అని తినిపించింది. కంచంనిండా మజ్జిగపోసి తాగించింది. చేయి కడుక్కొని వస్తున్న కొడుకును చూచి మురిసిపోయింది పిచ్చమ్మ. కండలు తిరిగిన దండల్తో ఎంత వాడైనాడు! అనుకుంది. ఎంత ఉండేవాడు! ఎంతలో ఇంతవాడైనాడు. ఎందుకో తెలీదు పిచ్చమ్మ ఎంతో మురిసిపోయిందారోజు - రోజూ చూస్తున్నవాడే అయినా కోటయ్యను చూచి - కొడుకును చూచుకొని.

కోటయ్య అలసి ఉన్నాడు-కడుపు నిండా తిండి తిన్నాడు. నిద్ర ముంచుకు వచ్చింది. చాప పరుచుకొని పడుకున్నాడు. కన్ను మలిగింది. వళ్ళు మరచి నిద్ర పోయాడు.

కష్టించే వానికి నిద్రకేం కరువు?

మల్లయ్య వచ్చి చూచాడు - నిద్రపోతున్న కొడుకును. తనలోంచి ఊడి పడ్డట్లున్నాడు. తానూ వయసులో ఇలాగే ఉండేవాడు. తనను చూచుకున్నాడు. శరీరం ముడతలు పడిపోయింది. తన యవ్వనం తలుచుకున్నాడు. బంతిపూలు సిగలో తురుముకొని వచ్చిన పిచ్చమ్మ కనిపించింది. తాను తుపాకి పట్టుకొని దొరలను ఎదిరించింది తలచుకున్నాడు. వీరభద్రం మనసులో మసలాడు, కొండలు, కోనలు, పోరాటాలు మనసులో మెదిలాయి. కొన్ని లిప్తలు తనను మరచాడు - ఏ లోకం లోనో విహరించాడు.

"ఏందో అట్ల చూస్తవు? దిష్టి తగుల్తది" పిచ్చమ్మ ధ్వనివిని అటు చూచాడు. పిచ్చమ్మ ముఖం నవ్వుతున్నది.

"ఏమో అట్ల పండ పెట్టినవు కొడుకును - పనికి పోడా ఏమి?" ఈ లోకం లోకి వచ్చిన మల్లయ్యకు యాదగిరి గుర్తుకు రాగా వచ్చిన మాటలవి.

"అలిసి సొలిసున్నడు కొడుకు. ఒక్కదినం పనికి పోకుంటె ఉరి తీస్తరా?"

"ఉరి తీస్తారుగని - యాదగిరికి మొదలే మనమంటె మంటగున్నది

ముంగమ్మ పట్టున్నమని - ఏమను కుంటడోనని - ఇన్ని గంజినీళ్ళయితె కావాలె గద్ద బత్కటానికి?''

"ఇయాళరేపు పండగే గద - పోతడుతేగని - కోటయ్య పెద్దోడయిండు చూస్తున్నవా మల్ల ఏమన్న........"

"లగ్గం చేయాలె.... ఎరకైతనే ఉన్నది" అన్న మల్లయ్య కూలబడ్డాడు. ఎదురుగా పిచ్చమ్మ కూర్చున్నది. కొడుక్కు చేయబోయే పెండ్లిని గురించి రంగు రంగుల ముచ్చట్లు చెప్పుకున్నారు.

ఆ రోజు ఒక విచిత్రం జరిగింది. కోటయ్యలాగే కుర్రకారంతా నిద్ర పోయారు. ఆ ఊరి పశువులు ఆ రోజు అడివి చూడలేదు. ఇది యాదృచ్ఛికంగా జరిగిందే. దీని వెనుక ఏదో కుట్రను ఊహించాడు యాదగిరి. కోటయ్యమీద అతనికి కోపం వచ్చింది. పళ్ళు పటపట లాడించాడు. ఏదో ఆలోచిస్తూ కుర్చీలో కూలబడ్డాడు. లాల్చీ జేబులోంచి సిగరెట్టుపెట్టె తీసి వెలిగించాడు. పొగ వదులు తుండగా "ఆదాబ్ సర్కార్" అన్నమాట వినిపించింది. చూస్తే దుడ్డుకర్రతో అమర్‌సింగ్ కనిపించాడు. అమర్‌సింగు యాదగిరి భృత్యవర్గానికి నాయకుడు - పట్నం నుంచి వచ్చాడు.

"ఏమో వచ్చినవు?"

"హోలీ ఇనాం కోసం సర్కార్"

"మల్ల ఒక్కనివే వచ్చినవు?"

"పనుంటె అందరం వస్తం. ఎవరినన్న చావు పిలుస్తున్నదా సర్కార్!"

"అట్లేంలేదు గని. మాపటికి కాముణ్ణి కాలపెత్తరుగద! ఊళ్ళ పోరలంత జర ఎగురుతున్రు. ఎందుకైన మంచిది తీస్కరా అందర్ని" రాని నవ్వు తెచ్చుకొని నవ్వాడు యాదగిరి.

"అచ్ఛా సర్కార్" అని చేతులు నిలిపాడు అమర్‌సింగ్.

లాల్చీ జేబుల్లోంచి పచ్చకాగితాలు వచ్చి అమర్‌సింగు చేతులో పడ్డాయి. అమర్‌సింగు తెచ్చుకున్న చిరునవ్వు నవ్వాడు. సలాంచేసి వెళ్ళిపోయాడు.

కుర్చీలో వాలిన యాదగిరికి మెరుపులా ఏదో ఆలోచన వచ్చింది. అతని ముఖం వెలిగింది. మెరుపు చప్పున మాయం అయింది. మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. విసుగ్గా లేచి, మెట్లు దిగాడు. వీధినపడి సాగిపోయాడు. అతనితో మాట్లాడగల వారెవరూ లేరా వూళ్ళో - ఆలోచన ఎవర్ని అడుగుతాడు? చెట్లయినా ఆలోచన చెపుతాయేమోనని పోతున్నట్లున్నాడు ఊరు దాటి!

కోటయ్య మేలుకొనేవరకు సాయంకాలం అయింది. అప్పటికి యువకులంతా కోటయ్య ఇంటిముందు చేరారు. కోటయ్య కాళ్ళు చేతులు కడుక్కున్నాడు. తల్లితో అన్నం పెట్టించుకు తిన్నాడు. కోటయ్య మిత్రులతో కలిసి బయలుదేరాడు. ఊరు బయటికి పోయి కట్టె, కంప తెచ్చారు. ఊరిమధ్య నిలబెట్టిన కామునిబొమ్మమీద

వేశారు. అప్పటికి రాత్రి అయింది. వెన్నెల విరిసింది. కాముని కాటికి నిప్పు పెట్టారు. అంటుకొని బరబర మండసాగింది మంట. మంట చుట్టూచేరి డబ్బాలు కొడ్తూ, డప్పులు వాయిస్తూ ఎగిరారు. ఆడారు.

"కాముడు కాలె, కరిబొగ్గాయె
కాముని పెండ్లం, నాపాలాయె"

అని పాటలు పాడుతూ గంతులు వేశారు. అప్పుడు మొదలయింది మరొక కార్యక్రమం. ఏదో ఒకటి తెచ్చివేసి ఆ మంట ఆరకుండా చేయాలి. ఆ రాత్రి ఎవరింటినుంచి ఏది తెచ్చినా, మంటలో వేసినా ఎవరూ ఏమనరు. అది ఆచారం. కాకుంటే తిడ్తారు. చేతికి దొరికింది మంటల్లో వేస్తారని జనానికీ తెల్సు. అంతా జాగ్రత్తపడే ఉంటారు.

"ఇగపోదమా?" అడిగా డొకడు.

"అందరిండ్లల్లనుంచి తెచ్చెయ్యాలె ఏమంటవ్" ఇంకొకడన్నాడు.

"అట్లనే చేద్దం" కోటయ్య అన్నాడు.

"యాదగిరి ఇంటినుంచి ఎవరు తెస్తరు?" ఒకడు ప్రశ్న వేశాడు.

"నేంతెస్త" కోటయ్య ముందుకు వచ్చాడు.

"అయితె ఎళ్ళుండి మల్ల" అని అందరూ తలా ఒకవైపు వెళ్ళిపోయారు.

కాముడు కాలుతూనే ఉన్నాడు.

అక్కడెవరూ లేరు. ప్రదేశం నిర్మానుష్యంగా ఉంది.

బయల్దేరిన యువకులు చేతికి దొరికిన పీటచెక్క, కుర్చీముక్క అందుకొని వస్తున్నారు. చూచినవారు కొందరు తిడ్తున్నారు. కొందరు నవ్వి ఊరుకుంటున్నారు.

కోటయ్య యాదగిరి ఇంటికి వెళ్ళాడు. ఇంటి ముందు ఎవరూ లేరు. వసారాలో కుర్చీలు పడివున్నాయి. యాదగిరిని పిలుద్దామనుకున్నాడు. చెప్పి తీసి కెళ్దామనుకున్నాడు. చెపితే ఇస్తాడని నమ్మకంలేదు. పైగా ఈ రోజు పనిలోకి రాలేదు తాను. ఆవు తప్పి పోయినపుడు చావచితక్కొట్టాడు తనను. అది గుర్తుకు వచ్చింది. చెప్పకుండడమే మంచిదనుకున్నాడు. కుర్చీ లన్నింటినీ పరిశీలించాడు. కాలు విరిగిన కుర్చీ కనిపించింది. అది గోడకు ఆనించి ఉంది. కదిలిస్తే పడిపోతుంది. జాగ్రత్తగా తీయాలను కున్నాడు. కదిలించగానే అది మరో కుర్చీమీదపడి చప్పుడు అయింది. చప్పుడు కావడం, వసారాలో లైటు వెలగడం, తలుపు తెరుచుకోవడం, "ఎవడ్రా దొంగ లంజకొడుకు" అని యాదగిరి బయటికి రావడం లిప్తలో జరిగాయి. ఏదో చేయరాని పని చేస్తున్నట్లు కాళ్ళు వణికాయి కోటయ్యకు. చేతులు వణికాయి. అయినా కాలు విరిగిన కుర్చీ నెత్తిన పెట్టుకొని ఉరికాడు. మెట్లు దిగి వెన్నెట్లో పారిపోతున్నాడు. తలమీద కుర్చీ ఉంది. ఉరుకుతున్నాడు. "దొంగ. దొంగ" అని కేకలు పెట్టాడు యాదగిరి. స్పృహలోలేచి అమర్‌సింగు ఉరికి వచ్చాడు. అతని అనుచరులు వచ్చారు. కోటయ్యను వెంబడించారు. కొన్ని గజాల్లోనే పట్టుకున్నారు.

కర్రల్తో బాదారు. కోటయ్య పడిపోయాడు. కాలు విరిగిన కుర్చీ దెబ్బలకు విరిగి పోయింది. ఎవరిని బాదుతున్నారో తెలియని దశలో ఉన్నారువారు. యాదగిరి కిరసనాయిలు డబ్బాపట్టుకొని ఉరికి వచ్చాడు. కోటయ్యమీద గుమ్మరించాడు. అగ్గిపుల్ల అంటించాడు. కోటయ్య వళ్ళు అంటుకొని భగ్గుమంది. కోటయ్య కెవ్వున కేక పెట్టి లేచి ఉరికాడు. డబ్బా అక్కడే పారేసి కాలికి బుద్ధిచెప్పాడు యాదగిరి, అతని భృత్యవర్గం.

కోటయ్య వీధిలోపడి ఉరుకుతున్నాడు. మంటలు ఉరుకుతున్నట్లుంది. జ్వాలలు ఉరుకుతున్నట్లుంది. ఆర్తనాదాలు ఉరుకుతున్నాయి.

"కోటయ్య చచ్చె. చచ్చె" అని ఊరివాళ్ళంతా ఉరికారు అతని వెంట. ఎవరికీ ఏమీ తోచలేదు. అందరూ ఉరుకుతున్నారు.

కోటయ్య మంటలలో ఉరుకుతున్నాడు. మంటలు గాలికి ఎక్కువవు తున్నాయి. బరబరమని మండుతున్నాడు కోటయ్య.

కోటయ్య వెంట జనం ఉరుకుతున్నారు.

ఇక్కడ కాముని కాడు కదలకుండా కాలుతూంది. కోటయ్య ఉరుకుతూ కాలుతున్నాడు.

కోటయ్య తన ఇంటిదగ్గరికి వచ్చి పడిపోయాడు. మంటలు పడిపోయాయి. నిలిచి కాలుతున్నాయి. మండుతున్నాయి.

పిచ్చమ్మ లోపలినుంచి ఉరికివచ్చింది. మంటలు చూచింది. మాటలు విన్నది. తన కొడుకు కాలుతున్నాడని తెలుసుకుంది. క్షణం నోటమాట రాలేదు. లిప్తపాటు నిశ్చేష్టురాలయింది.

"కొడకా!" అని కేకపెట్టి మంటల్లోకి ఉరికింది. పది చేతులు ఆమెను పట్టు కొని వెనక్కు లాగేయి. కూలబడి తల బాదుకొని "నా కొడుకో! కోటయ్యో" అని ఏడవసాగింది.

మొత్తం ఊరు కూడింది.

మధ్యన కోటయ్య మంటలో చస్తున్నాడు.

మల్లయ్య కుండలో ఉన్న వసంతం తెచ్చి గుమ్మరించాడు. అది చూచి చాలమంది కదిలారు. కుండల్లో ఉన్న వసంతం సాంతం కోటయ్య మీద గుమ్మ రించారు.

మంటలు చల్లారేయి.

చర్మంకాలిన కవురువాసన వ్యాపించింది.

పిచ్చమ్మ కొడుకుమీదపడి తల బాదుకొని విలపిస్తూంది. గుండెలు అవిసేట్లు ఏడుస్తూంది. కొండలు కరిగేట్లు ఏడుస్తూంది.

మల్లయ్య కాలిన కొడుకును చూస్తున్నాడు.

కోటయ్యకు స్పృహలేదు. తలవెంట్రుకలు, కనురెప్పలు, వంటి వెంట్రుకలు

కాలిపోయాయి. చర్మం సాంతం మాడి మసిబొగ్గయింది. కోటయ్యని గుర్తించేట్లు లేదు. కాలి చల్లారిన కొరకంచులా ఉన్నాడు.

మల్లయ్య కంటివెంట చుక్క నీరు రాలేదు - అది ఎండిపోయింది - ఇగిరి పోయింది. రాతి ప్రతిమలా నుంచున్నాడు.

ఘోరం జరిగిపోయింది.

ఊరిగుండెలు అవిసిపోయాయి.

ఊరు సాంతం కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

ఒకడు బండి కట్టి తెచ్చాడు. "చూస్తరేం ఎయ్యండి బండిమీద తీస్కపోదం పట్నం దవాఖానకు" అన్నాడు. పదిమంది కలిసి కాలిన కోటయ్యను బండిమీద వేశారు గడ్డిలో. పిచ్చమ్మ బండెక్కింది. మల్లయ్య బండివెంట నడిచాడు - మరి కొందరూ నడిచారు.

పిచ్చమ్మ కోటయ్య ముక్కుదగ్గర వేలు పెట్టి చూచింది. గాలి ఆడుతూంది. "ఊపిరున్నది. నా కోటయ్య బతుకుతాడు - ఉరికించుండి ఎద్దుల్ని" "ఆ యాదగిరి గాడే కంట్లపోసిండు. వాడే నా కొడుకును కాలబెట్టిండు. వాని పెండ్లం ముండ మొయ్యా" అని ఏడుపు సాగించింది – సాపెనలు మొదలు పెట్టింది.

ఎడ్లు ఉరుకుతున్నాయి.

"యాదగిరి కాలబెట్టిండు" అనే వార్త ఊళ్ళో భగ్గుమంది. ఊరంతా యాద గిరి ఇంటిమీదికి ఉరికింది. యాదగిరి ఇంటికి తాళంవేసి ఉంది. దాంతో చర్చలు బయల్దేరాయి. కొందరు తాము కళ్ళారా చూచామన్నారు. కొందరు ఊళ్ళలేనోడు ఎట్ల తగలబెట్తాడు అని ప్రశ్నించారు. మొత్తానికి కోటయ్యను గురించిన చర్చ ఊరు సాంతం సాగించింది.

బండి తారురోడ్డుమీద సాగిపోతూంది.

పట్నం పోతున్న కా రొకటి కనిపించింది. కారును ఆపారు బండివెంట వస్తున్నవారు. విషయము వివరించారు. కారు యజమాని సానుభూతి కనబరచాడు. కోటయ్యను కార్లో వేశారు. పిచ్చమ్మా, మల్లయ్యా ఎక్కారు. కారు వేగంగా సాగి పోయింది. ఆస్పత్రికి చేరింది. కారు యజమాని పలుకుబడితో కోటయ్యను వెంటనే ఆస్పత్రిలో చేర్చుకున్నారు.

వార్త ఆస్పత్రిలో 'భగ్గు' మంది. ప్రకాశం మండి పడ్డాడు - "నిండు ప్రాణాలను కాల్చి చంపుతున్నారు దుర్మార్గులు. వీళ్ళను నిలువునా కాల్చి చంపాలె" అని పళ్ళు పటపట కొరికాడు. కోటయ్య దగ్గరికి ఉరికాడు. కోటయ్యను చూచాడు. దుఃఖం పొంగి పొర్లింది. కోటయ్య మీద పడి పెద్దగా ఏడ్చేశాడు. పిచ్చమ్మ ప్రకా శాన్ని పట్టుకొని ఏడ్చేసింది. "కుంటి కుర్చీకోసం నా కొడుకును తగల బెట్టిండు యాదగిరి" అని ఏడ్చేసింది. పొట్టినర్సువచ్చి ఓదార్చింది. డాక్టర్లు వచ్చారు. ప్రకాశం వారిని బ్రతిమిలాడాడు. "భూస్వాముల దౌర్జన్యానికి బలి అయిన వీరుడు కోటయ్య.

డాక్టర్! కోటయ్యను బతికించాలె. డాక్టర్! కోటయ్య బతకాలె. మీరు బతికించాలె. కోటయ్య పిరికిపందగా చావడానికి వీల్లేదు" పిచ్చమ్మ వాళ్ళ కాళ్ళమీదపడి ఏడ్చింది.

"మాకు సాధ్యమైనంత చేస్తాం" అన్నారు డాక్టర్లు. చికిత్స ప్రారంభించారు.

కోటయ్యకు తెలివి రాలేదు.

తెల్లవారి దేశానికి తెలివి వచ్చింది.

పత్రికలు ఈ ఘోరాన్ని గూర్చి పతాకశీర్షికలు వేశాయి.

"భూస్వాముల దౌర్జన్యం" "అమాయకుని బలి" "ఈ అత్యాచారాలకు అంతు లేదా?" "ఎంతమంది కోటయ్యలు బలికావాలి?" లాంటి శీర్షికలే కాక పత్రికలు సంపాదకీయాలు రాశాయి.

ఆసేతు హిమాచల పర్యంతం భారతీయ ఆత్మ చలించింది - క్రుంగింది. కృశించింది. మండింది. ఏడ్చింది.

అనేకమంది నాయకులు ఈ ఘోరాన్ని ఖండించారు.

వీరభద్రం తీవ్రంగా ఖండించాడు.

రామయ్య సంతాపం వ్యక్తపరచాడు.

శాసనసభలో పెద్ద కల్లోలం చెలరేగింది. జరిగింది రామయ్య ఊళ్ళో కాబట్టి రామయ్య రాజీనామా చేయాలన్నారు. నేరస్తులను శిక్షిస్తామని వాగ్దానం చేసింది ప్రభుత్వం. ప్రభుత్వంమీద నమ్మకంలేని ప్రతిపక్షం బల్లలు గుద్దింది. కేకలు పెట్టింది. అయినా వారి వాయిదా తీర్మానంమీద చర్చ జరుగలేదు.

దేశం మొత్తానికి కోటయ్య విషయంలో శ్రద్ధ ఏర్పడింది. మంత్రులు, మహా నాయకులు, ప్రజలు ఆస్పత్రికి వచ్చిపోతున్నారు. వూరినుంచి కూడా యలమంద, హుసేన్, సైదయ్య మున్నగువారు వచ్చేశారు. వారు గీత ఇంట్లో విడిశారు. గీత ఆస్పత్రికీ ఇంటికీ విధీవిరామం లేకుండా తిరుగుతూంది. ప్రకాశం, పొట్టినర్సు నిద్ర, ఆహారాలు లేకుండా కోటయ్య దగ్గరనే ఉంటున్నారు. అయినా కోటయ్యకు స్పృహ రాలేదు. మల్లయ్య, పిచ్చమ్మ ప్రాణంలేని ప్రతిమల్లా మంచం పక్కనే నుంచొని ఉంటున్నారు.

యాదగిరిని అరెస్టుచేసిన వార్త పత్రికలో వచ్చింది.

ఆ మరుసటిరోజు సాయంత్రం కోటయ్యకు స్పృహ వచ్చింది.

కోటయ్య కళ్ళు తెరిచాడు.

అతనికి పంకా కనిపించింది.

పక్కకు చూచాడు.

తల్లీ, తండ్రీ కనిపించారు.

కోటయ్య చూపులు పిచ్చమ్మ చూపుల్తో కలిశాయి.

పిచ్చమ్మ ముఖం చేటంతయింది.

మల్లయ్య స్థిరంగా నుంచొని ఉన్నాడు – అతని ముఖంలో మార్పులేదు.

"ప్రకాశంరాలే?" కోటయ్య తండ్రి నడిగాడు. కోటయ్య ధ్వనిలో బలంలేదు. మాట నీరసంగా ఉంది. నూతిలోంచి వచ్చినట్లుంది.

"వచ్చిండుగద" కొడుకు తల ప్రకాశంవైపు తిప్పాడు తండ్రి.

"ఇక్కడనే ఉన్నా" అని వంగాడు ప్రకాశం.

"నా కెరికే నువ్వొస్తవని. ఎరకైందా నీకు? కుంటి కుర్చీకోసం గ్యాసునూనె పోసి నిప్పుపెట్టిండు నాకు. ఇన్నవా?........" మళ్ళీ మాట రాలేదు కాస్సేపు. ఏదో వెతుక్కున్నట్లు చూచాడు.

ప్రకాశం గుడ్లలో నీరునిండింది.

గీత చెంపలమీంచి కన్నీరు కారింది.

పొట్టినర్సు నోట్లో గుడ్డపెట్టుకొని పక్కకుపోయి ఏడుస్తూంది.

"ఇన్నవా?" మళ్ళీ పలికాడు కోటయ్య. ధ్వని మరీ నీరసం అయింది. "బతికి ఉంటె పగతీర్చుకుంట. వాణ్ణి చంపి చస్త. నేను బతక. నాకెరికే........" కోటయ్య మాట్లాడలేక పోయాడు - ఎక్కిళ్ళు వస్తున్నాయి.

పిచ్చమ్మ కోటయ్యమీద పడి హోరుమంది.

ఎవరూ ఆమెను వారించలేదు.

అందరి గుండెల్లోనూ దుఃఖం నిండివుంది.

డాక్టరు, మెజిస్ట్రీటు చరచరా వచ్చారు.

డాక్టర్ స్టెత్ పెట్టి చూచాడు.

ముఖంమీద బట్టకప్పి వెళ్ళిపోయాడు.

"కోటయ్యా!" అని శవం మీద పడ్డాడు ప్రకాశం. ఆ కేకకు ఆస్పత్రి దద్దరిల్లింది. ఎగిరిపోతున్న ప్రాణం ఆ కేక విని వెనక్కు మళ్ళిందా అన్నట్లు అందరూ పైకి చూచారు.

ప్రాణం మళ్ళలేదు.

పైకే వెళ్ళిపోయింది - పై పైకి.

పోస్టుమార్టం చేసి శవాన్ని అప్పగించారు. శవాన్ని జీపులో ఊరికి తీసి కెళ్ళారు. పట్నంనుంచి రామయ్య వీరభద్రం యుక్తం అందరూ పల్లెకు వచ్చారు. శవయాత్ర వెంట ఊరు సాంతం కదిలింది.

కోటయ్య చితి చిటపటమని కాలింది.

కాలి కూలింది - బూడిద అయింది.

కోటయ్యను బూడిదచేసి అంతా వెళ్ళిపోయారు.

"గీతమ్మా! మా కోటయ్యను చేసుకుంటవా? పెండ్లీ డొచ్చె పోరనికి - ఉలకడు పలకడు మల్లయ్య మామ" అన్నది పిచ్చమ్మ గీతను పట్టుకొని.

గీత గుడ్లలో నీరునిండింది.

ప్రకాశం పక్కనే ఉన్నాడు. పలకలేదు. అతని గొంతు పూడుకుపోయింది.

"ఒసే! పిచ్చీ! పోరడు బువ్వకొచ్చిండు.. పెడ్తవాలేదా?" అన్నాడు మల్లయ్య. అతని గొంతూ భారంగానే ఉంది.

"వచ్చిండా? నా కెరికె వస్తడని - ఎంత ఆకలిగున్నదో పోరనికి" అని లోనికి పోయి కంచాలు సర్దసాగింది పిచ్చమ్మ.

ప్రకాశం దుఃఖం ఆగలేదు.

గీత ప్రకాశాన్ని చుట్టుకొని ఏడ్చేసింది.

జామీను ఇచ్చి శేషయ్య విడిపించాడు యాదగిరిని.

యాదగిరి జీపులో ఊళ్ళోదిగాడు.

ఈ వార్త పత్రికల్లో రాలేదు - ఊరు విస్తుపోయింది.

* * *

"దౌర్జన్యాన్ని సహించడం పిరికిదనం. అమాయకుల హత్యలు జరుగుతుంటే చేతులు ముడుచుకొని కూర్చుందామా? తుపాకి చేతబూని అధికారాన్ని వశపరచుకొని దేశంలో సామ్యవాదాన్ని స్థాపింతామా? అనే విషయం తేల్చుకునే సమయం ఆసన్నం అయింది" ప్రకాశం ఉద్రేకంగా ప్రశ్నించాడు.

"మేం పిరికిపందలం కాము. ఎదిరిస్తాం" సమావేశం లోంచి జవాబు వచ్చింది. ధ్వనిలో స్థిరనిశ్చయం ఉంది. ఉద్రేకం ఉంది. ఉద్వేగం ఉంది.

శివరావు ఇంట్లో చిన్న సమావేశం ఏర్పాటయింది. ఊరినుంచి హుసేన్, సైదయ్య, యలమంద, మల్లయ్య వచ్చారు. మురళి, కృష్ణ వంటి విద్యార్థులే కాక పొట్టినర్సు వంటి వాళ్ళు కూడా వచ్చారు.

"అవును మనం పిరికిపందలం కాము. ఈ సమాజాన్ని మార్చడానికి, మార్చడానికి ఉద్భవించిన రుద్రులం. పరశురాములం. పరాశక్తులం. ఇలా చూస్తూ, చూస్తూ కూర్చోలేం. ఈ హత్యలకు జవాబు చెపుతాం. ఈ దోపిడీని అంతం చేస్తాం. ఈ వ్యవస్థను కూకటి వేళ్ళతో కాల్చి కూల్చేస్తాం. ఇందుకు సాధనం ఆయుధమే - మరోటి కాదని మన ఛైర్మన్ మావో సిద్ధాంతపరంగా నిరూపించి చూపాడు. అంతేకాదు ఈ సమాజం రక్తాక్షరాలతో రాసి మనకు చూపుతున్నది. కోటయ్య చేసిన తప్పేమి? ఒకసారి ఆలోచించండి. సుదీర్ఘంగా ఆలోచించండి. శాంతంగా ఆలోచించండి. అతనికి సమాజం చదువు చెప్పించలేదు. సంస్కారం నేర్పలేదు. అయినా అందును గురించి అతను ఆలోచించలేదు. అడవిలో జంతువులా పెరిగాడు. ఎముకలు నుసిచేసి, రక్తం ఒడిసి యాదగిరికి పంటలు పండించి పోశాడు. అతనికింత కూలిపడేసి యాదగిరి బంగళాలు కట్టాడు. పంచాయతికి ప్రెసిడెంటయినాడు. కోటయ్య చేసిన నేరం ఏమి? కుంటి కుర్చీ తీసుకున్నాడు. యాదగిరి కిర్సనాయిలు పోసి నిలువునా నిండు ప్రాణాన్ని తగలబెట్టాడు. కుంటి కుర్చీ దొంగిలించినందుకా శిక్ష. అవుతే కోటయ్యను, కోటయ్య లాంటి అనేకుల రక్తం పీల్చిన యాదగిరికి, యాదగిరి లాంటి వాళ్ళకు ఏం శిక్ష విధించాలో ఆలోచించండి."

"ఉరితీయాలె. కండకండలు నరికి కాకులకు, గద్దలకు ఎయ్యాలె" హుసేన్ మాటల్లో రక్తపు వేడి ఉంది. కరవాలపు వాడి ఉంది.

"కోటయ్య ఒక వ్యక్తి మాత్రంకాడు. ఈ దేశంలో కోట్ల కొద్ది పతితులకు ప్రతినిధి. కొవ్వెక్కిన భూస్వాములు కోట్లమందిని బలిగొంటున్నారు. అమాయకు లను పట్టపగలు బట్టబయట కోసి చంపుతున్నారు. వారి ఇండ్లు తగలబెట్తున్నారు. వారి భార్యలను బిడ్డలను చెరుస్తున్నారు. రాక్షసులయి రక్తంతాగి, వంటినిండా నెత్తురు బూసుకొని నాయకులుగా పెద్దలుగా వీరవిహారం చేస్తున్నారు. వీరు అహింస పేరు జపిస్తున్నారు. హింసను ఖండిస్తున్నారు. వీరు జరిపేదేమిటి? మస్తాన్ మామ ప్రాణం తీసిందెవరు? కోటయ్యను పొట్టనపెట్టుకున్న దెవరు? హుసేన్‌తో హత్య చేయించిం దెవరు? మల్లియ్య భూమిగుంజుకొని బికారిని చేసిం దెవరు? యల్లమంద భూమి స్వాహా చేసిం దెవరు? హుసేన్ భార్య ప్రాణాలు తీసిం దెవరు? గీతను చెరిచిం దెవరు? పొట్టినర్సు మానం హరించిం దెవరు? మా అమ్మ మంగమ్మను జేలుకు పంపిం దెవరు? నన్ను కొట్టి ఆస్పత్రిలో పడేసిం దెవరు? ఏది దౌర్జన్యం? ఏది హింస? ఇంతకాలంగా మనం ఏం చేశాం? అహింసనే అవలంబించామే? పల్లెత్తు మాట అన లేదే? మరి సమాజం ఎందుకు మారలేదు? ఇలా కూర్చొంటె సమాజం దానంతట అదే మారుతుందనే పెద్దలు కొందరున్నారు. వారు పిరికిపందలు. పని చేతకానివారు. త్యాగం చేయలేనివారు. తుపాకిని చూస్తే బెదిరే రకం — వారూ సామ్యవాదం తెస్తా మంటున్నారు"

"దొంగసామ్యవాదులు నశించాలె" సమావేశంలో నినాదాలు.

"హింస వద్దనేవారి నొక సవాలు అడగదలచాను. రామరావణ యుద్ధంలో ఎంత రక్తం ప్రవహించింది? అక్కడ ధర్మం గెలిచిందనే కాదా మీరంటున్నారు! భారతయుద్ధంలో పద్దెనిమిది అక్షౌహిణులు జనం హతం కాలేదా? పరశురాముడు తన గండ్రగొడ్డలితో మదాంధులైన రాజులను నరికి వారి రక్తం చెరువుల్లో నింపి తర్పణం ఇవ్వలేదా? ఇది హింస కాదా?

విప్లవం జపంచేస్తే రాదు. విప్లవం రక్తంలోంచి పుడుతుంది - రక్తంలోంచి పెరుగుతుంది. విప్లవం సాయుధం. నిరాయుధం అయిన విప్లవం ఏనాడూ రాలేదు. రాదు. ఫ్రెంచి విప్లవంలో రక్తం పారింది. అమెరికా స్వాతంత్ర్య సమరంలో రక్తం పారింది. రష్యా మహా విప్లవంలో రక్తం పారింది. చైనా జనవిప్లవంలో రక్తం పారింది. భారతదేశంలో మాత్రం విప్లవం రక్తరహితంగా వస్తుందనడం బూటకం- నాటకం - మోసం - దగా.

విప్లవం రక్తంలోంచి పుడ్తుంది. అధికారం తుపాకి గొట్టంలోంచి వస్తుంది - కాబట్టి కామ్రేడ్స్! రక్తం అర్పించడానికి సిద్ధపడ్డవాళ్ళు, తుపాకికి అంకితం కావ డానికి తయారయినవారూ రక్తంతో సంతకాలు చేయాలె. ఇదిగో నేను చేస్తున్నా" బ్లేడుతో బొటనవేలుకోసి కాగితంమీద అంటించాడు ప్రకాశం.

"సాయుధ విప్లవం వర్ధిల్లాలె"

"చైర్మన్ మావో జిందాబాద్"

హాలు నినాదాలతో ప్రతిధ్వనించింది.

మల్లయ్య తప్ప మిగతా వాళ్ళంతా రక్తంతో సంతకాలు చేశారు.

"ఇవ్వాళ్టినుంచి మావో మన నాయకుడు. బందూకు మనకు బంధువు" గీత పిడికిలి బిగించి గట్టిగా అన్నది. ఆమె ముఖం రక్తరాగ రంజితం అయినట్లుంది.

"కత్తిపెట్టి కొరకొర కొయ్యాల్నండి లంజకొడుకుల్ని" హుసేన్ అన్నాడు-పళ్ళు పటపట కొరుకుతూ-చేత్తో కోస్తున్నట్లు సంజ్ఞచేస్తూ.

"ఒక్కొక్క బుల్లెట్‌తో పదిమందిని చంపాలె" మురళి గట్టిగా పలికాడు.

"బండమీద ఒక్కొక్కణ్ణే బలి ఇవ్వాలనిపిస్తున్నది" ఆ దృశ్యం ఏదో కళ్ళకు కనిపించినట్లే అన్నది పొట్టిసర్సు.

"మల్లయ్యమామ ఏమీ మాట్లాడ్తంలేదు" గీత అన్నది.

"అమ్మా! ముసలోణ్ణయిన. ఏం మాట్లాడి ఏం ఫలితం?" అన్నాడు-మల్లయ్య నీరసంగా ఉన్నాడు.

"మల్లయ్యమామతో మనకు చాల పనివుంది" అని ప్రకాశం మల్లయ్యను తీసుకొని మేడమీదికి వెళ్ళాడు. గదిలో ఇద్దరూ కూర్చున్నారు. ఎవరి నోటివెంటా మాటరాలేదు. ఎలా ప్రారంభించాలో అర్థం కావటంలేదు ఇద్దరికి.

"మామా? నీ అభిప్రాయం ఏమి?" ప్రకాశం అడిగాడు.

"నాయ్నా ప్రకాశం. నా కేమో భయంగున్నది. మీ మాట లింటుంటె బాగున్నయి. తరువాత తల్చుకుంటె బుగులుగున్నది. మీరు ఉన్నదెందరు? ఇంత పెద్ద సర్కారుతో ఎట్ల యుద్ధం చేస్తరు? వాళ్ళు మిమ్ముల బతకనిస్తరా? ముద్దుగున్నరు.... పాపం పిల్లలంత........" తరవాత మాట మింగేశాడు మల్లయ్య.

"అలా అనుకోకు మామా! ఇక్కడున్న మేమేకాదు - భారతదేశంలో అన్ని ప్రాంతాల్లోనూ ఇలాంటి దళాలు తయారవుతున్నాయి. ఈ ప్రభుత్వానికి అంత్యదశ వచ్చింది. ప్రజలు మావెంట ఉన్నారు. ఈ ప్రభుత్వపు పతనం తథ్యం. అధికారం శ్రామికులపరం అవుతుంది."

"వీరభద్రం సరిగ్గ ఇట్లనే చెప్పెటోడు. తుపాకులు పట్టినం. దొరల వెళ్ళ గొట్టినం. భూములు పంచినం. ఏమైంది? మల్లయూనియం మిలిట్రొచ్చింది. పంచిన భూములు గుంజుకున్నరు. నాకు ఉన్న నేలచెక్క గుంజుకునిరి. పోరణ్ని చంపిరి. గిదంత ఎట్లనో ఉన్నది. నాకు అంతుపడ్తలేదు"

"విప్లవాలు విఫలం అవుతాయి. అది రష్యాలో జరిగింది. చైనాలో జరిగింది. తెలంగాణాలో జరిగింది. వీరభద్రం విప్లవానికి వెన్నుపోటు పొడిచాడు. సాయుధ పోరాటం విరమించడమే పెద్ద తప్పు. ఇప్పుడేమో విప్లవం ఇప్పుడేరాదని సిద్ధాంతాలు వల్లిస్తున్నాడు. విప్లవద్రోహి అయినాడు. ఈనాటి పరిస్థితి వేరు. యువతరం గుండె

లలో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి. ఈ అన్యాయాన్నీ, అక్రమాన్నీ, దౌర్జన్యాలనూ చూచి సహించలేకుండా ఉన్నాడు. మావో మహాశయుని నినాదం ప్రతి గుండెలో గర్జిస్తూంది. ఈ వ్యవస్థ కుళ్ళిపోయింది. ఇది యువత కోపపు మంటకు కాలి, కూలి, బూడిద కావలసిందే. నీకు వయసు మళ్ళింది మామా! మా ఉద్రేకాలు నీకు అర్థంకావు. అయినా మేమంటే నీకు సానుభూతి ఉంది."

"అవు. మీరు గెలుస్తే నేను సంతోషిస్త"

"అందుకు నీ సహాయం అవసరం"

"ఏం చెయ్యమంటవు?"

"మీరు తుపాకులు ఎక్కడ దాచారు?"

"ఆ తుపాకుల్తో యుద్ధం చేస్తరా?" ప్రశ్నలో బెదురుంది.

"అవును. వాటితోనే మొదలుపెడ్తాం. తరవాత శత్రువునుంచే లాక్కుంటాం ఆయుధాలు"

"అట్లనా?"

"అవును చెప్పు. నీకేం భయంలేదు. నువ్వు తుపాకి పట్టనవసరంలేదు. ఈ ఒక్క సహాయం చేయి. చాలు. ఈమాట ఎవరికీ తెలియనివ్వను"

"నాయ్నా! ప్రకాశం! మీ రంటె నాకు నమ్మకం ఉన్నది. మీ మాటలు నన్నే ఉసికొల్పుతున్నయి. ఎటుబడీ ఇంత సర్కారుముందు మీరేం గెలుస్తరని! మీరు గెలుస్తె మంచిది. అట్లకాదు. మీరు గెలవాలె. గెలుస్తరు. గెలువుండి. పేదోండ్లకు రాజ్యం కట్టుండి. నేను బందూకు పట్టలేను. కాని మీరేం చెయ్యమంటె అది చేస్త. చావెట్లయిన దగ్గర పడ్డది. అట్లనే చస్త. ఏమంటవ్?" మల్లయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆ నీళ్ళు చూచి ప్రకాశానికి ఉద్రేకం పొంగింది.

"మామా! ఇక మేం గెలిచినట్లే! మీవంటివారి దీవనలుంటే గెలిచి తీరుతాం మామా! గెలిచి తీర్తాం. చాలు. నువ్వు మా వెంట ఉంటే – పులి ఉన్నట్లే - సింహం ఉన్నట్లే. ఆయుధాలు ఎక్కడ దాచారు?"

"గుళ్ళో - లింగంకింద!"

"ఏగుళ్ళో?"

"మన ఊరి బయటలేదు - చింతల్ల - ఆ గుళ్ళో!"

"ఆ గుళ్లోనా?"

"అప్పుడా గుడి పాడు బడుండె. పూజ, గీజ లేకుండె. సుమతమ్మ వచ్చి పూజ సురు చేసింది."

"ఇప్పుడు?"

"ఇప్పుడుకూడ పూజ గిట్టలేదు - సుమతమ్మ బంద్ చేయించింది. పూజారి ఆదనే పంటడు తెల్లిందనక."

"ఎట్లామరి?"

"జర పూజారిని కట్టుకోవాలె."

"వింటాడా?"

"ఇనకుంటె ఆడనే సురుచేయాలె" మల్లియ్య కళ్ళు వెలిగాయి.

"అంతే నంటవా?" ప్రకాశం పొంగిపోయాడు. మల్లియ్య బుజాలు పట్టుకొని ఊపాడు.

గీతను పట్నంలో ఏర్పాట్లకు వదిలి ప్రకాశం ఊరికి చేరుకున్నాడు. అతని వెంట పల్లె వారంతా వచ్చేశారు.

రాత్రికి గుడికి చేరుకున్నారు మల్లియ్య, ప్రకాశం. పూజారి చిన్న పంచె పరచుకొని ద్వారానికి అడ్డంగా పడుకొని ఉన్నాడు. ప్రమిద వెలుగుతూంది. వెలుగు సన్నగా ఉంది. అడుగుల సవ్వడి విని లేచి కూర్చున్నాడు పూజారి. దగ్గరికి వచ్చినా వచ్చినవారిని గుర్తించ లేదతడు – చూపు సరిగా ఆనదు అతనికి. ప్రకాశం నమస్కరించాడు. వెయ్యేళ్ళు వర్ధిల్లమని దీవించాడు పూజారి.

"పూజలెలా జరుగుతున్నాయి?" ప్రకాశం ప్రశ్న - అది ఉబుసుపోకకు అడిగింది.

"ఎక్కడి పూజలు నాయనా! శివుడు వట్టి ఉపవాసాలుంటున్నడు. సుమ తమ్మకు కోపం వచ్చింది దేవునిమీద - ఆమె కొడుకు సన్నాసుల్లో కలిసిండట - పూజలు బంద్ చేయించింది. నేనే దేవుణ్ని వదల్లేక ఇక్కడ్నే పడి ఉంటున్నాను."

"వాళ్ళకు దేవుడుకూడ గులాంగిరీ చేయాల్సిందే తాతగారూ! - అతడు చేయనంటే వదిలేస్తారు – ఏమంటారు?"

"నిండ నూరేళ్ళు జీవించు నాయ్నా – ఉన్నమాటన్నవు – నీకు దేవుడు ఎంత తెలివిచ్చాడు నాయ్నా!"

"ఊళ్ళో కోటయ్యను కాలబెట్టింది విన్నారా?"

"వినటం ఏమిటి నాయ్నా – కళ్ళారా చూసిన - రాక్షసుడు నాయ్నా యాద గిరి పచ్చి రాక్షసుడు."

"రాక్షసుల్ని ఎదిరించాలి తాతగారూ! అలా వదిలేస్తే ఎలా?"

"మనం ఏం చేయగలం నాయ్నా - మానవ మాత్రులం - ఆ నారాయణుడు కల్కి అవతారం ఎత్తి వస్తాడు. ఈ రాక్షసు లందరినీ సంహరిస్తాడు."

"ఎలా సంహరిస్తాడు తాతగారూ?"

"ధవళాశ్వమునెక్కి, చేత దగద్ధగాయమానముగ మెరయు కరవాలము బూని, చండప్రచండ వేగమున వచ్చి, వీరినందరిని సంహరించి ధర్మమును స్థాపించును."

"రక్తం ప్రవహింపచేసి, మొండెముల గుట్టలు పడేసే గదా, తాతగారూ, ధర్మం స్థాపించేది."

"ఆహా కాకేమి? పురాణముల్లో అట్లే చెప్పి ఉన్నది."

"ఆపని మేం చేస్తే – మాకు సహాయం చేస్తారా?"

ముసలివాడు అదిరిపడ్డాడు - బెబ్బే - మెమ్మె అన్నాడు.

ప్రకాశం తమ ప్రణాళికను సవివరంగా చెప్పాడు. మల్లియ్య మరింత వివరించి పూజారికి అర్థం అయ్యేట్లు చెప్పాడు.

"నాయ్నా! భగవంతునికి మీ కార్యం సమ్మతం అయినట్లు కనిపిస్తున్నది. లేకుంటే సుమతితో పూజ ఎందుకు మాన్పిస్తడు? మిమ్ముల నాదగ్గరికి ఎందుకు పంపుతడు? ఈశ్వరుడు మీకు సహాయపడమని నన్ను పురికొల్పుతున్నట్లున్నాడు. కానివ్వండి ఈశ్వరేచ్ఛ! మీది ధర్మకార్యంగ కనపడ్తున్నది. చేసుకోండి. నేను నిమిత్తమాత్రుణ్ణి. ఎప్పుడు వస్తరు?"

"తాతగారూ! మీరు చాల గొప్పవారు. మంచివారు - ధర్మకార్యానికి సహాయపడుతున్నారు. కృతజ్ఞులం. ఎప్పుడు వచ్చేదీ ఇప్పుడు చెప్పలేం. వచ్చి మిమ్ముల లేపుతాం. శలవా మరి."

"వెళ్ళిరా నాయ్నా! క్షేమంగ వెళ్ళి లాభంగ రా" అని సాగనంపాడు పూజారి.

మరుసటిరోజు రాత్రి - కటిక చీకట్లో బయల్దేరింది ప్రకాశం బృందం - మల్లియ్య, యలమంద, హుసేన్, సైదయ్యలు - గునపాలు, పారలు, తట్టలు అందుకొని.

గుడిచుట్టూ చింతచెట్లు దయ్యాల్లా ఉన్నాయి - చీకటి గుంపుల్లా - ఆకటి మబ్బుల్లా - గుడ్లగూబలు అరుస్తున్నాయి. కీచురాళ్ళు రొదపెడుతున్నాయి. గబ్బిలాలు ఎగురుతున్నాయి. దూరంగా నక్కలు ఊళ పెడ్తున్నాయి. మిణుగుర్లు అక్కడక్కడా మెరుస్తున్నాయి.

మనుషులు కదుల్తున్నారు. మౌనంగా సాగిపోతున్నారు - అడుగుల చప్పుడు సైతం కావడం లేదు. సైగలే - మాటల్లేవు. మౌనం కదిలి పోతున్నట్లుంది. నిశ్శబ్దం నడిచి పోతున్నట్లుంది - చేతుల్లో లాంతర్లున్నాయి - కాని వెలగడం లేదు.

గుడిదగ్గరికి వచ్చారు. నలుగురూ నాలుగు వైపులకు వెళ్ళారు. మళ్ళీ అంతా ఒకచోట కూడారు. ఎవరూ లేరని స్థిరపరుచుకున్నారు.

ప్రకాశం గుళ్ళో ప్రవేశించాడు. పూజారి పడుకొని ఉన్నాడు. తట్టి లేపాడు. అదిరిపడి లేచాడు పూజారి. వెలుగు లేదు. వచ్చినవాణ్ణి గుర్తించలేదు. తడుముకున్నాడు.

"నేనే ప్రకాశాన్ని"

"వచ్చిన్రా! చెప్పనన్న లేదే?"

"చెప్పడంకాదు - చెయ్యడమే మాపని. త్వరగా లేవండి - తాళం తీయండి"

"ఇంత చీకట్లో - ఎట్లా? ఒక్కనివే వచ్చినవా? ఎట్ల చేస్తవ్?" పూజారి గుండె దడదడలు మాటల్లోనే వినిపిస్తున్నాయి.

"ఒక్కణ్ణికాదు - ఇంకా ఉన్నారు. వెలుగు వస్తుంది – ఉండండి" అని నాలుగడుగులువేసి పిలిచాడు ప్రకాశం.

మిగతావాళ్ళు వచ్చారు. లాంతర్లు వెలిగించారు - వెలుగు వచ్చింది. పూజారి తాళం తీశాడు – గొళ్ళెం తీశాడు - తలుపులు బార్లా తీశాడు. లాంతరు పట్టుకొని లోనికి పోయేవాళ్ళను ఒక్కొక్కళ్ళనూ చూస్తున్నాడు. హుసేన్ కనిపించాడు.

"ఆగు నాయ్నా! నీ పేరు?"

చెప్పాడు హుసేన్.

"నీకు పుణ్యముంటుంది. నువ్వు లోపల అడుగుపెట్టకు - నాకు పాపం చుట్టుకుంటుంది." అన్నాడు పూజారి. అతని మాటల్లో అదురు కనిపిస్తూంది. అప్పటికే చమటపట్టింది.

"అట్లనా? అయితే రా. మనం కాపలా ఉందం" అని గుంజాడు హుసేన్.

"వస్త ఉండు. ఒక్కమాట - శివలింగానికి దెబ్బతగల నియ్యకండి" అని హుసేన్ వెంట సాగిపోయాడు పూజారి.

పూజారి ఒకవైపు - హుసేన్ ఒకవైపు కాపలా కాస్తున్నారు. పూజారి గుండె గుబగుబలాడ్తూంది. నోరు ఆరుకొని పోతూంది. అయినా నుంచొనే ఉన్నాడు. అక్కణ్ణుంచి కదల్లేదు.

గర్భగుళ్ళో గాలి ఆడడంలేదు–అందరికీ చెమటలు కారుతున్నాయి. లాంతర్ల వెలుక్కు గునపాలు పడుతున్నాయి. రాళ్ళు కదిలేవరకే ఘనం అయింది. రాళ్ళు తీసి ఒక పక్కకు పెట్టారు. మట్టి తవ్వుతున్నారు. తట్టల్తో ఎత్తిపోస్తున్నారు. ఊపిరి అడ్డంలేదు. అయినా గునపం ఆగడంలేదు. పార ఆగడంలేదు. తట్ట ఆగడంలేదు. అర్ధరాత్రికి శివలింగపు పునాది కదిలింది. దాన్ని లేపాలి. అప్పటికే అలసిపోయారు. బలం సన్నగిలింది. శివలింగం లేవడంలేదు. అయినా ప్రయత్నం వదులుకోలేదు. పట్టుదల పెరుగుతూంది. అందరూ కలిసి లాగుతున్నారు. పళ్ళబలంతో లాగుతున్నారు. ఉహుఁ కదలడంలేదు. కదలడంలేదు. సైదయ్య గునపం వేశాడు- మల్లయ్య గునపం వేశాడు. యలమంద వేశాడు. ప్రకాశం వేశాడు. బలం సాంతం కేంద్రీకరించి పెళ్ళగించారు - ఒరిగింది - ఒరిగింది - లింగం ఒరిగింది. అదిగో లేచింది - లేచింది. పడిపోయింది. ప్రక్కకు నెట్టేశారు.

మల్లయ్య లాంతరు పెట్టి లోనికి చూచాడు. "వచ్చింది - ఇంక జర తవ్వితె చాలు" అన్నాడు.

యలమంద, సైదయ్య గోతిలోకి దిగారు. తవ్వి, తట్టల్తో మట్టి అందిస్తున్నారు. అందుకుంటున్నారు ప్రకాశం, మల్లయ్య. గునపానికి ఏదో తాకింది. తాకిన చప్పుడు స్పష్టంగా వినిపిస్తూంది.

"అగ్గో అదె. అగ్గో అదె. వచ్చింది. వచ్చింది" అన్నాడు మల్లయ్య. అంటుండగానే పెట్టె బయటపడింది. దాన్ని బయటికి లాగారు. మట్టి దులిపారు. మూత తీశారు.

తుపాకులు కనిపించాయి!

తూటాలు కనిపించాయి!!

ప్రకాశం ఎగిరి గంతేశాడు!!!

అప్పటికి కోడికూసింది.

"ముందు వీటిని మీ ఇంట్లో దాచిరండి. మేం ఇక్కడ పనిచేస్తుంటాం" అని యలమందనూ, మల్లయ్యనూ పంపించాడు ప్రకాశం.

వారు పెట్టె మోసుకొని వెళ్ళిపోయారు.

ప్రకాశం, సైదయ్య మట్టి పూడ్చసాగారు. తెల్లవారేవరకు లింగాన్ని సరిచేసి, మట్టిపూడ్చేసి, రాళ్ళు సరిచేశారు. పూజారి ఉరికివచ్చి చూశాడు. అంతా మామూలుగానే ఉంది. ఏమీ జరగనట్లే ఉంది - అక్కడక్కడా మట్టి తప్ప.

"బతికించిన్రు. ఇహ మీరు ఎళ్ళండి - ఎళ్ళండి ఇక్కణ్ణుంచి" అని వాళ్ళను వెళ్ళగొట్టాడు. గర్భగుడి తలుపులు వేసి, తాళం వేశాడు.

ఆ తరవాత పూజారి అక్కడ కనిపించలేదు.

ఊళ్ళో ఎవరూ పట్టించుకోనేలేదు.

గుడి తాళం మళ్ళీ తీయనేలేదు.

ప్రకాశం పట్నం వెళ్ళాడు. అనుచరుల్తో తిరిగి వచ్చాడు. ఆయుధాలందుకున్నాడు. గుట్టలమీదికి చేరుకున్నాడు.

మల్లయ్య మాత్రం ఊళ్ళోనే ఉన్నాడు.

"కోటయ్యకు పిల్లను చూడవులే?" అడిగింది పిచ్చమ్మ.

"అందుకే పట్నం పొయ్యొచ్చిన" అన్నాడు మల్లయ్య.

* * *

చీకటికాలం. నడిరేయి. ఊరు మాటుమణిగింది. వీధిలైట్లు లేవు. ఆరిపోయాయి. అవి వెన్నెల కాలంలో వెలుగుతాయి. చుక్కల వెలుగు కొద్దిగా ఉంది. అదీ హరించి పోతూంది. మబ్బులు మెల్లగా కమ్ముకుంటున్నాయి. గాలిలేదు. బిగపట్టింది. ఊరు నిశ్శబ్దంగా ఉంది. చీమ చిటుక్కుమంటే వినిపించేట్లుంది. ఊరకుక్కలు చీకటి గుంపుల్లా ఉరుకుతున్నాయి. ఎక్కడో ఒక కుక్క ఏడుస్తూంది. దూరంగా మరోకుక్క పనిలేక మొరుగుతూంది.

ఊరు మొగదలలో ఒక మనిషి నుంచున్నాడు. ఎదిరి చూస్తున్నట్లున్నాడు. అతడు మల్లయ్య. అంతరాత్రి అక్కడ నుంచున్నాడు-వేచి ఉన్నాడు. విసుగ్గా కూడా ఉన్నటుంది. అటువైపే చూస్తున్నాడు. ఏం కనిపిస్తుంది? కన్ను చీల్చుకున్నా కనిపించని చీకటి.

మబ్బు మెరిసింది.

దూరంగా ఎవరో వస్తున్న జాడ కనిపించింది.

మల్లయ్య సచేతనుడైనాడు. నాలుగు దిక్కులూ చూచాడు. ముందడుగు వేశాడు.

మబ్బు ఉరిమింది. ఉరుము సాగుతూనే ఉంది - గడగడగడా అని దొర్లి పోతూంది.

మల్లయ్య వారిని కలుసుకున్నాడు.

మబ్బు మళ్ళీ మెరిసింది. ఈ తడవ మెఱుపు తీగపొదవుగా మెరిసి వంకర టింకరై మాయం అయింది.

మెఱుపుకు కనిపించారు వచ్చేవారు - ముందున్న వాడు ప్రకాశం. నిక్కరు షర్టు వేసుకున్నాడు. బుజానికి బందూకు వ్రేలాడుతూంది. నడుముకు తూటాలు న్నాయి. పక్కనున్నది గీత. వారి వెనుక హుసేన్, సైదయ్య, యలమంద, పొట్టి నర్సు, కృష్ణ, మురళి మున్నగువారున్నారు. అందరి బుజాలకూ తుపాకు లున్నాయి. అందరి చేతుల్లో టార్చిలైట్లున్నాయి. టార్చీలు వెలగడంలేదు.

మల్లయ్య సహితంగా ఊళ్ళో అడుగుపెట్టారు. వీదుల్లోంచి సాగిపోతున్నారు. నిశ్శబ్దంగా-అడుగుల చప్పుడు తప్ప ఏమీ వినిపించడంలేదు. కుక్కలు వారిని చూచి మొరిగాయి. మొరుగుతూ వెంట ఉరికి వచ్చాయి. కొంతదూరం వచ్చి నిలిచి పోయాయి. మోరలెత్తి మొరుగుతున్నాయి.

వారు సాగిపోతున్నారు.

మల్లయ్య ఇల్లు వచ్చింది. ఇంటి ముందు చింతచెట్టుమీది గుడ్లగూబ కూసింది భయంకరంగా.

నడుస్తున్నవారు అదిరారు.

అందరూ పైకి చూచారు.

ఒక టార్చి వెలుగు చింతమీద పారింది—చక్రాల్లాంటి కళ్ళు - కదల్లేక కూర్చుంది - రెప్పలు వాలుస్తున్నది - తెరుస్తున్నది. టార్చి వెలుగుకు కాకులు కావు మని కదిలాయి. టార్చి ఆరిపోయింది. కాకులు కూలబడ్డాయి-గుడ్లగూబ రెక్కలు విచ్చుకొని చప్పుడుచేస్తూ ఎగిరిపోయింది.

వారు ముందుకు కదిలారు.

కొంతదూరం వెళ్ళి నిలిచారు.

కృష్ణ ముందుకు వచ్చాడు-స్తంభం ఎక్కాడు-తీగలు తెంపాడు—దిగాడు దాంతో ఇళ్ళల్లో ఉన్న లైట్లు పోయాయి. ఇప్పుడు అంతటా అంధకారమే-లోన బయట.

గాలి మొదలైంది.

మబ్బులు దూదిపింజాల్లా విడిపోతున్నాయి.

చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి.

వారు కదిలారు-ముందుకు సాగారు.

యాదగిరి ఇంటిముందుకు వచ్చి నిలిచారు. కొందరు ఒక పక్కకు, మరి కొందరు మరో పక్కకు తప్పుకొని చీలిపోయారు. ప్రకాశం, యలమంద ఇంట్లో ప్రవేశించారు. ముంగిలి దాటారు. దర్వాజా దగ్గరికి చేరుకున్నారు. టార్చి వేసి చూశారు. గొళ్ళెం వ్రేలాడుతూంది. గొళ్ళెం కొట్టారు - జవాబులేదు. మళ్ళీకొట్టారు. కొడ్తూనే ఉన్నారు. జవాబులేదు.

మల్లయ్య గునపాలు తెచ్చిపెట్టాడు.

"ఉన్నాడా?" ప్రకాశం ప్రశ్నించాడు.

"ఉన్నడు-ఊతంగ నిద్రపోతున్నట్లున్నడు"

గుమ్మంమీద గునపం పడ్డది.

ఆ దెబ్బకు ఉలికిపడి లేచాడు యాదగిరి - గునపపు దెబ్బలు వినిపిస్తూనే ఉన్నాయి. చప్పునలేచి స్విచ్చివేశాడు. లైటు వెలగలేదు. గునపపు దెబ్బలు గుండెలో పడుతున్నాయి యాదగిరికి. టార్చి వెలిగించాడు. ఊడే గోచిని పట్టుకొని ముందుకు ఉరికాడు. కిటికీలోంచి ఆకారాలు కనిపిస్తున్నాయి. ముఖాలు కనిపించడం లేదు. కిటికీలోంచి తుపాకి పేలింది. కిటికీ దగ్గర్నుంచి తప్పుకున్నాడు-మూత్రం పోసుకున్నాడు. పెద్దగా కేకలు పెట్టాడు—"దొంగలు - దొంగలు" అని లబోదిబో మొత్తుకున్నాడు.

ఆ కేకలకు, గునపం దెబ్బలకు చుట్టుపట్ల జనం మేలుకున్నారు. ఉరికి వచ్చారు. జనాన్ని చూచి జనం వైపు తిరిగారు ప్రకాశం, యలమంద. ప్రకాశం యలమంద ముఖం కనిపించేట్లు టార్చి వేశాడు.

జనానికి కనిపించింది యలమంద - మల్లయ్య. యలమంద చేతులో తుపాకి ఉంది.

జనం నిర్విణ్ణులై నిలిచిపోయారు.

"మేం మీ ప్రాణాలు తీసేటందుకు రాలేదు. యాదగిరి అంతు కనుక్కునెటందుకు వచ్చింది. ఊరందరి నెత్తురుపీల్చి ఆస్తి సంపాదించిండు. ఇది అందరికి పంచెటందుకు వచ్చినం. ఈ ఆస్తి మీది. మీరుకూడ రాండి తలుపులు ఇరక్కొడ్దం" అన్నాడు యలమంద.

"దొంగలంజకొడుకు. కోటయ్యను కాల్చి చంపిండు. నరుకుండి" జనంలోంచి ఒకడు అరచాడు.

"నా పోరిని చెరిచిండు. ముండకొడుకు బొండిగ పిసుకుండి" అన్నాడు మరొకడు.

అందరూ తలుపులమీద పడ్డారు.

తలుపులు అదుర్తున్నాయి. ఊగుతున్నాయి. ఊడుతున్నాయి.

యాదగిరి ప్రాణాలు ఎగిరిపోతున్నాయి. బోనులోపడ్డ ఎలుకలా అటూ ఇటూ పరిగెత్తుతున్నాడు.

బయట జనం ఎక్కువవుతున్నారు.

వారి కేకలు, పెడబొబ్బలు ఎక్కువవుతున్నాయి.

ఒక నిశ్చయానికి వచ్చాడు యాదగిరి. తలుపులన్నీ తీసుకొని ఇంటి వెనక్కు ఉరికాడు. దొడ్డి దాటాడు. దొడ్డిగోడ ఎక్కాడు.

తలుపులు విరిగిపడ్డాయి.

జనం "హెలో" మని లోనికి ఉరికారు.

గదులన్నీ వెతికారు.

"పారిపోయిండు, పారిపోయిండు" అని అరచారు.

యాదగిరి దొడ్డిగోడమీదినుంచి దభాల్న అటుపక్కకు దునికాడు.

"ధన్" మని తుపాకి పేలింది.

యాదగిరి ముఖంమీద రెండు టార్చిలైట్ల వెలుగుపడింది. నివ్వెరపోయి నుంచున్నాడు.

"కదుల్తే ప్రాణాలు పోతాయి" గీత అరవడమూ, హుసేన్ యాదగిరిమీద పడి పట్టుకోవడమూ లిప్తలో జరిగాయి.

అప్పటికే జనం దొడ్డిగోడమీదికి గుంపులు గుంపులుగా ఎక్కారు.

క్రింది దృశ్యం చూచారు.

గోడమీంచి దూకారు. గుంపులు గుంపులు యాదగిరి మీదపడ్డారు. కొందరు రక్కారు. కొందరు గిచ్చారు. కొందరు బాదారు. కొందరు గుద్దారు. కొందరు తిట్టారు. కొందరు సాపించారు.

"చంపకుండి బాంచెను. కాపాడుండి కాల్మొక్త" ఏడుస్తున్నాడు యాదగిరి.

"చావు గాడ్దికొడక. చావు లంజకొడక మింగినప్పుడు బాగున్నాది. పుండా కోర్" అని బస్తామీద బాదినట్లు బాత్తున్నారు జనం.

యాదగిరి కేకలు మూలుగులోకి మారాయి.

ఆకాశంలో మెరుపు మెరిసింది. తటిల్లత ర(య్యిమని ఆకాశమంతా పాకి మాయం అయింది. ఉరుము ఉరిమింది. పెద్ద ఉరుము. భయంకరం అయింది. దడదడదడమని ఏదో జారిపోతున్నట్లు ఉరుకుతూంది ఉరుము.

ఎక్కడో పిడుగు పడ్డట్లుంది.

పిడుగు పడ్డంత చప్పుడయింది.

ఇవి ఏవీ వినిపించలేదు జనానికి-కనిపించలేదు.

యాదగిరి మూలుగు మందం అవుతూంది.

గాలి విజృంభించింది. చెట్లు కొమ్మలు ఊడిపడేంత వడిగా వీస్తూంది గాలి. రొద పెడ్తున్నది గాలి. మనుషుల్నే ఎగరేసుకు పోయేట్లుంది గాలి.

యాదగిరికి ప్రాణం ఉందో లేదో తెలియడంలేదు. జనం అతన్ని వదలడం లేదు. ఎన్నిసార్లు హెచ్చరించినా కేకలు వేసినా ఫలితం లేకపోయింది.

తుపాకులు పేలాయి గాలిలోకి.

ధన్-ధన్-ధన్ ఒకటి-రెండు-మూడు.

తూటాల ధ్వని విన్నారు జనం.

"పోలీసులు-పోలీసులు" అని కేకలు వేస్తూ పారిపోతున్నారు జనం.

చీకటి.

అంధకారం.

మబ్బులు.

ఈదురు గాలి.

ఏమీ కనిపించడం లేదు.

ఉరుకుతున్నారు జనం. ఒకరిమీద ఒకరు పడుతున్నారు. కొందరు పడిపోతున్నారు. పడిపోయినవాణ్ణి తొక్కుకుంటూ ఉరుకుతున్నారు. పడిపోయినవాడు లేచి మళ్ళీ పరుగు తీస్తున్నాడు. ఇండ్లు, గుడిసెలు, గోడలు, చెట్లు, ఏది కనిపిస్తే దాని చాటున నక్కారు జనం.

"తుపాకులేసింది మేమే పోలీసులు కారు" అని హుసేను, యలమంద వేసిన కేకలు ఎవరూ వినిపించుకోలేదు. ఒక్కడూ నిలవలేదు. స్థలం నిర్మానుష్యం అయింది.

గాలికి మబ్బులు తేలిపోతున్నాయి. అక్కడక్కడా ఆకాశంలో చుక్కలు కనిపిస్తున్నాయి.

యలమంద బ్యాటరీ వెలుగులో కనిపించాడు యాదగిరి - నేలమీద పడి ఉన్నాడు. బట్టలు చిరిగి పోయాయి. ముఖం వాచింది - దుమ్ముంది ముఖంనిండా. జుట్టు చెదిరిపోయింది. నోట్లోంచి రక్తపుచార నేలమీద పడుతోంది. అది తప్ప వంటిమీద దెబ్బలెక్కడా కనిపించలేదు.

యలమంద దగ్గరికి చేరాడు. అందరూ యాదగిరి చుట్టూ చేరారు. టార్చిలైట్ల వెలుగుకు కళ్ళు తెరచాడు యాదగిరి. యలమంద కాలితోతన్ని "లే" అన్నాడు.

యాదగిరి దిగ్గున లేచాడు.

యలమంద కాళ్ళమీద పడ్డాడు.

"అన్నా! పానం తియ్యకు బాంచోణ్ణి. కాల్మొక్త గులాపోణ్ణి. నేను ఏనేరం ఎరగ. బాంచెను" బతిమిలాడాడు యాదగిరి.

"నా బిడ్డను చెరిచిం దెవురు బే?"

యాదగిరి మాట్లాడలేదు.

"పంతులమ్మను చెరిచిం దెవరు? ఆమె పానం తీసిం దెవరు?" సైదయ్య అడిగాడు.

యాదగిరి తలవంచుకున్నాడు.

"నా కొడుకును చంపిందెవరు? నిలువునా తగలపెట్టిం దెవరు? పానం తీసిం దెవరు? నా పిచ్చికి పిచ్చెక్కించిందెవరు ? నా కడుపులో కొరకంచు పెట్టిం దెవ్వరు? నా నేల చెక్క గుంజుకున్నదెవరు? నానోటి ముందరి ముద్దతొక్కేసిం దెవరు? చెప్పు యాదగిరీ చెప్పు దీన్ల నీ తప్పేం లేదంటవా?"

మల్లయ్య ప్రశ్నలకు జవాబుగా పెద్దగా ఏడ్చాడు. తలపైకెత్తి చూచాడు యాదగిరి.

చుట్టూ నుంచున్నవారు - కనిపించారు - వారి చేతుల్లో తుపాకులు కనిపించాయి. ఏవో చీకట్లు దగ్గరికి వస్తున్నట్లు. చావు పిలుస్తున్నట్లు ఉంది. యాదగిరి వణికిపోతున్నాడు. నోట మాట రావడంలేదు. వళ్ళు హూనం అయింది.

"అవు. మల్లయ్యన్నా. అవు చేసిన నిజంగనే చేసిన. చేసిన్నే పాపాలు చేసిన. చెయ్యలేదనను. చేసినంక చెయ్యలేదని ఎట్లంట? పైన ఆకాశం ఉన్నది. కింద బూదే వున్నది. చుట్టు దిక్కులున్నయి. అన్నిచూస్తుండగనే చేసిన"

"నీతులు చెప్తున్నడు. నోర్మూయ్" అని తుపాకి మడమ ఎత్తాడు యలమంద.

"చెప్పనియ్యి. ఏం చెప్పతడొ ఇందం" అన్నాడు మల్లయ్య, యలమంద ఎత్తిన తుపాకిని ఒకచేత్తో పట్టుకొని.

"పిట్ట మన చేతుల్నె ఉండె. పారిపోతదా? కుయ్యనీ:స్తు ఏం కూస్తడో?"

గాలికి మబ్బులు పూర్తిగా తేలిపోయాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి.

పోలీసులు రాలేదని నిశ్చయించుకున్న జనం ఒక్కొక్కరే చేరుకుంటున్నారు.

"చేసింది చెయ్యలేదని ఎట్లంట" యాదగిరి కూలబడే కొనసాగించాడు. "చేసింది ఎవరు? జర ఆలోచించున్రి. యాదగిరి పైసలేనప్పుడు ఇవన్ని చేసిండా? పైసొచ్చినంక, జమీనొచ్చినంకనే చేసిండా? పైసజమీనున్నది గన్కనే యాదగిరి అన్నాలాలు చేసిండు. అందుకని వాని బూములు గుంజుకోండి. పైస గుంజుకోండి. పానంతో వదులుండి. అందరోలెనే కష్టం చేస్కబతుకుత"

"బహుత్ హుషార్ హై హరామ్జాదా!" అన్నాడు హుసేన్.

"కుంటి కుర్చీకోసం నిండుపానం తీసినోడు నీతులు చెప్తాండురో?" జనంలో ఒకడు వ్యాఖ్యానించాడు.

"మారో బద్మాష్‌కో" హుసేన్ అరచాడు. అంతా యాదగిరిమీద పడబోతు

న్నప్పుడు ప్రకాశం "ఆగండి" అని కేక పెట్టాడు. అంతా ఒక్కసారి ప్రకాశం వైపు తిరిగారు.

చుక్కల వెలుగు బాగా వచ్చేసింది. అందరూ స్పష్టంగా కనిపిస్తున్నారు.

"ఇతడు ప్రజాద్రోహి" చేయెత్తి యాదగిరిని చూపుతూ అన్నాడు ప్రకాశం. "పోలీసు చర్యకు ముందు చిల్లిగవ్వ లేనివాడు ప్రజల రక్తం పీల్చి ఇంత ఆస్తి సంపాదించాడు. అంతేకాదు. మల్లయ్యమామ భూమిలాక్కోడానికి సహాయం చేశాడు. బతికి ఉండగా కోటయ్యను చావబాదాడు. కుంటి కుర్చీకోసం కిర్సనాయిలుపోసి నిండు ప్రాణాన్ని బలిగొన్నాడు. పిచ్చమ్మత్తకు పిచ్చిలేవడానికి బాధ్యత వీడిదే - అమాయకురాలైన పంతులమ్మను చెరిచి ఆమె హత్యకు కారకుడైనాడు. యలమంద కూతురు విషయంలో మహాపరాధం చేశాడు. వీణ్ణి ప్రజాన్యాయస్థానంలో విచారించాలి. విచారించి శిక్ష విధించాలి. మల్లయ్యమామ ఇంటి ముందరి చింతకింద విచారణ జరుగుతుంది. అక్కడికి వీణ్ణి తీసుకొని నడవండి."

రంగం మల్లయ్య ఇంటిముందుకు మారింది.

ఆకాశం నిర్మలంగా ఉంది.

చుక్కలు చూస్తున్నాయి.

చింతచెట్టు కింద చిక్కని చీకటి.

అర్ధవలయాకారంలో జనం—ఊరంతా అక్కడే కూడింది. కుక్కలు మొరుగుతున్నాయి.

"కోటయ్య పెళ్ళిచేస్తున్నా" పిచ్చమ్మ వచ్చి వెనక చేతులు పెట్టుకొని చుట్టూ తిరిగి, నలుగుర్నీ అడిగి, అరుగుమీద కూలబడ్డది.

చింతచెట్టు కింద గుంజపాతారు. గుంజకు యాదగిరిని కట్టేశారు పగ్గంతో.

పెట్రోమాక్స్‌లైట్లు వెలుగుతున్నాయి - అవి యాదగిరివే.

"కామ్రేడ్స్!" గీత పలుకుతున్నది. "ఈ ఊరికి ప్రజాద్రోహులు, ప్రజా పీడకులు, ప్రజాహంతకులు ఇద్దరు. ఒకడు రామయ్య, రెండోవాడు యాదగిరి. వీరిద్దరు చేసిన ఘోరాలు మీకు తెలియనివి కావు. మీరు వీరిని వారి నేరాలను విచారించి శిక్షించాలి. విచారణ జరగడానికి వీలుగా వారు చేసిన నేరాలను ఒకసారి చదువుతాను:—

మొదటి ప్రజాద్రోహి రామయ్య పోరాటంలోంచి ప్రజాధనం దొంగిలించి తెచ్చాడు. 2. ప్రజాపోరాటానికి ద్రోహం తలపెట్టాడు. 3. శత్రువులతో కలిసిపోయాడు. 4. కరణం భూములన్నీ కాజేశాడు. 5. కరణం భార్య విమలమ్మకు విషం పెట్టి చంపించాడు. 6. ప్రజాపీడకుడు జగ్గయ్య భార్య మంగమ్మను చెరచాడు. 7. కామ్రేడ్ మస్తాన్ను హత్య చేయించాడు. 8. మంగమ్మను జేలుకు పంపించాడు. 9. మల్లయ్య భూమిని గుంజుకున్నాడు. 10. రజకుల ఇనాములు కాజేయడానికి కుట్ర పన్నాడు. 11. ఆస్తికోసం పరాంకుశరావును హత్య చేయించాడు హుసేన్‌తో.

12. కామ్రేడ్ హనీన్ను జేలుకు పంపాడు. 13. ప్రజా పీడకుడై వారి రక్తం పీల్చి మేడ కట్టాడు.

ఇతన్ని ప్రజాన్యాయస్థానం విచారించి శిక్ష విధించాల్సింది" అని చదివి ఊరు కుంది గీత.

"చంపాలె"

"నరకాలె"

"ముక్కలు ముక్కలు చేయాలె"

"కాకులకు, గద్దలకు వెయ్యాలె"

"ఇంతమంది ఇలా అంటే లాభంలేదు. అతని ప్రాణం తీయాలి-అంతేనా?" గీత అడిగింది.

"కాదుండి. ముక్కలుకొట్టి కాకులకు గద్దలకు వేయాలె"

"మంచిది. ఆ శిక్ష విధించాం. అతని ఆస్తి..."

"ప్రజలకు చెందాలె" ముక్తకంఠంతో అన్నారు జనం.

"రామయ్యను నరికి కాకులకు గద్దలకు వేయడం, అతని ఆస్తి ప్రజలకు చెందడం ఇదే నాతీర్పు?"

"అవు. అవు. అదేతీర్పు" జనం ఏకగ్రీవంగా అన్నారు.

రెండో ప్రజాద్రోహి యాదగిరి ప్రజాద్రోహిగా మారి పోలీసులకు సహాయం చేశాడు. 2. ప్రజల రక్తంపీల్చి ధనవంతుడైనాడు. 3. మల్లయ్య భూమి లాక్కోడానికి సహాయపడ్డాడు. 4. వ్యవసాయ కూలీలకు కూళ్ళు తక్కువ ఇచ్చి వారిని నానా బాధలు పెట్టాడు. 5. మంగమ్మను జేలుకు పంపించాడు. 6. మరనాగళ్ళు తెచ్చి వ్యవసాయ కూలీలమీద ప్రతీకారం తీసుకున్నాడు. 7. పంతులు భార్యను చెరిచాడు. ఆమె హత్యకు కారకుడైనాడు. 8. యలమంద కూతుర్ని చెరిచాడు. 9. కుంటి కుర్చీ కోసం కోటయ్యను బలిగొన్న రాక్షసుడు. 10. పిచ్చమ్మకు పిచ్చిలేవడానికి కారకుడు అయినాడు.

ఇతన్ని ప్రజాన్యాయస్థానం విచారించి శిక్ష విధించాల్సింది.

"గ్యాస్‌నూనె పోసి తగలపెట్టుండి" మల్లయ్య తీర్పు.

"అవు. అట్లనె చెయ్యాలె" జనపదం.

"అతని ఆస్తి...." గీత.

"ప్రజలకు చెందాలె" జనవాక్యం.

ప్రజల్లో కల్లోలం ఎక్కువయింది. ఒకడు కిర్సనాయిలు తెచ్చి అక్కడ పెట్టాడు. ఒకడు దివిటీ కాల్చి పట్టుకొచ్చాడు.

గుంజకుకట్టిన యాదగిరి స్థితిని ఎవరూ కానలేకున్నారు. తలవాల్చుకొని ఉన్న యాదగిరి తల ఎత్తాడు. గట్టిగా అరచాడు "ఇది అన్యాయం"

"నాలం చెపుతాండురో" అన్న యలమంద "పొయ్యండి గ్యాసునూనె" అరచాడు.

"ఆగండి." గుంజకున్న యాదగిరి అరచాడు "నేను మీ చేతుల చిక్కిన. ఇహ ఎట్లయిన చస్త. గని నాకన్న గోరాలుచేసిన రామయ్యను మొదలు చంపాలె. అది న్యాయం. నాలుగు తుపాకులు పట్టుకొచ్చి ఊళ్ళ ఉన్న కాబట్టి నన్ను చంపుతరు. నా అసువంటోరు దేశంల ఎంతమంది ఉన్నరు? వారంత బాగనే ఉన్నరు. నా పాపమే పండినాది? పట్నంల పోలీసుల్ను పెట్టుకొని ఉన్నడు. రామయ్యను పట్టుండి. ఎందుకు పట్టరు? ఎట్లపడ్తరు? వానిది సర్కారు. వానికి పోలీసున్నది. మిలిట్రీ ఉన్నది. వాణ్ణెట్లపడ్తరు? మల్ల సోషలిజం తెస్తమంట్రనే నా అసువంటోల్లను పదిమందిని చంపుతె వస్తదా? మా ఇద్దరి ఆస్తులు దోస్తే దేశంల అందరు సమానమైతరా? చేస్తే సర్కార్‌తో యుద్ధం చెయ్యండు. సర్కార్‌ను గద్దెదించుండి. దేశం మొత్తంల మా అసువంటోళ్ళు లేకుండ చెయ్యండి. మీరు చేసేపని మంచిది కాదు. ఇది దొంగలముఠా చేసే పని"

"నోర్ముయ్" అని తుపాకి మడమతో కొట్టాడు యలమంద.

ఒకడు యాదగిరి తలమీంచి కిర్సనాయిలు గుమ్మరించాడు. ఒకడు దిపిటీ అంటించాడు.

గుప్పున అంటుకుంది మంట.

భగభగ మండుతూంది.

"మీరు బందిపోట్లు. ఇది బందిపోట్లపని" మంటల్లోనే అరుస్తున్నాడు యాదగిరి.

అది ఎవరూ గమనించలేదు. ఊరు సాంతం యాదగిరి ఇంటిమీద విరుచుకు పడింది. చేతికి అందిందల్లా పట్టుకుపోతున్నారు. నానాగొడవగా ఉంది. హంగామాగా ఉంది. జనం కొట్టుకుంటున్నారు. దొరికినవాడు కొట్టేస్తున్నాడు. లేనివాడు పోట్లాడుతున్నాడు. రణరంగంలా ఉంది యాదగిరి ఇల్లు.

చింతచెట్టు కింద యాదగిరి కాల్తున్నాడు.

"మీరు దొంగలు. చేసేది దొంగతనం" అరుస్తూనే ఉన్నాడు—ధ్వని తగ్గుతున్నా.

పిచ్చమ్మ అరుగుమీద కూర్చున్నది. ఆమె కదల్లేదు. సరిగ్గా ఆమె ఎదురుగా-చింతచెట్టు కింద-గుంజకు యాదగిరి కాల్తున్నాడు. అంటున్నాడు-"మీరు దొంగలు. చేసేది దొంగతనం"

పిచ్చమ్మ రాయిపట్టుకొని లేచింది. "ఒరే యాదగిరీ! నువ్వు దొరవా ? నువ్వు చేసిందేందిరా? ఒరే యాదగిరీ! నువ్వు దొరవా? నువ్వు చేసిందేందిరా?" చేతిలోని రాయి యాదగిరిమీదికి విస్సిరింది.

యాదగిరి నోట మాటరాలేదు.

చింతచెట్టుకింద మంట మండుతూనే ఉంది.

యాదగిరి ఇల్లు కాళీ అయింది. దానికి నిప్పుపెట్టారు. అది అంటుకొని మండుతుంటే కేరింతలు కొడ్తున్నారు జనం. ఎగురుతున్నారు. ఆడుతున్నారు. మంటలు నాల్కలు్చాచి మండుతున్నాయి. పొగమబ్బులు ఆకాశాన్నంటుతున్నాయి.

కామదహనంలా ఉంది.

జనం రామయ్య ఇంటిమీద పడ్డారు. ముందు ప్రకాశం ఉన్నాడు. పక్కన గీత ఉంది. తలుపులు బాదుతున్నారు. తలుపులు గట్టివి. అంత తేలిగ్గా రావడం లేదు. దెబ్బలు పడ్తూనే ఉన్నాయి. అయినా కదలడంలేదు. జనం అరుస్తున్నారు. కేకలు పెడ్తున్నారు. తలుపులు తెరవమంటున్నారు.

సుమతి తలుపు తెరిచింది.

ముందుకు మొగ్గి నిలదొక్కుకున్నాడు ప్రకాశం.

సుమతిని చూచాడు ప్రకాశం.

ప్రకాశాన్ని చూచింది సుమతి.

సుమతి ముఖం సౌమ్యంగా ఉంది-ఆమె కళ్ళలో వాత్సల్యం ఉంది.

ప్రకాశం ముఖంలో ఉద్రేకం తగ్గింది. వినయం కళ్ళల్లో కనిపించింది.

"తల్లీ! జరుగు. మేం రామయ్య ఇల్లు దోచుకోవడానికి వచ్చాం. ఇది ప్రజా ధనం ప్రజలకు చెందాలి"

"ప్రకాశం! బిడ్డా! నువ్వు రామయ్య కొడుకువు. నువ్వే రామయ్య కొడుకువు. గాంధీకాదు. ఇది సత్యం నాయనా!" సుమతి గొంతు జీరపోయింది. ఏదో అనంత సత్యం గుండెలోంచి పెల్లిగించుకొని వచ్చినట్లు కన్నీరు చెక్కిళ్ళమీంచి జాలువారు తున్నది. "నాయనా! ప్రకాశం! ఈ ఇల్లు నీది. ఈ ఆస్తి నీది. నీ ఆస్తిని నీవే దోచు కుంటవా? రా. ఈ ఇంట్ల ఉండు. ఇది నీహక్కు. నేను వెళ్ళిపోత ఈ ఇంట్లనుంచి. నాకేమివద్దు. నువ్వే నాలుగు కాలాలపాటు ఉండు నాయనా! రా నాయ్నా రా! నువ్వే నాకు కొడుకువు. రా. రా" అని చేతులు చాచింది.

చిత్తరువులా రెప్పవాల్చకుండా వింటున్న ప్రకాశం కనురెప్పలు కదలాయి. అతడు ముందడుగు వేయలేదు. అక్కడే నుంచోడానికి నిలదొక్కుకోవాల్సి వచ్చింది.

"తల్లీ! నీకు నమస్కారం" చేతులు జోడించి అన్నాడు ప్రకాశం.

ప్రకాశం పలుకుకోసం నోళ్ళు వెళ్ళబెట్టుకొని చూస్తున్నారు జనం.

"ఆస్తిమీద నమ్మకం ఏనాడో పోయిందమ్మా నాకు. ఈ ఆస్తులే మనుషుల్ని చీలదీసి అంతస్తులకిందా వర్గాలకిందా విభజిస్తున్నాయి. ఈ ఆస్తులు పెంచుకునే హక్కు ఉండడం వల్లనే దాన్ని పెంచుకోవడానికి హత్యలు, దురంతాలు, దౌర్జ న్యాలు, అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నాయి. ఇన్ని హత్యలకు, ఇంత రక్త పాతానికి కారణం అయిన ఈ ఆస్తికి నేను వారసుణ్ణి కాలేను. ఇది ప్రజలనుంచి

వచ్చింది. ప్రజలకే చెందాలని న్యాయస్థానం నిర్ణయించింది. జరుగు తల్లీ! ఈ ఆస్తి ఎవరిదో వారికి చెందనీ"

"ప్రకాశం! నువ్వెంత గొప్పవాడివి బిడ్డా!" అని కొడుకును కావిలించుకుంది సుమతి. అతని తలమీద కన్నీరు కార్చింది.

ఆమె అడ్డు తొలగింది.

జనం హోలో అని ఇంట్లో దూరారు.

కుర్చీలు, బల్లలు, మంచాలు, అద్దాలు, చెంబులు, తప్పాళ్ళు ఇంట్లోంచి వెళ్ళిపోతున్నాయి.

దూరంగా జీపులు, లారీలు వస్తున్న చప్పుడు వినిపించింది. పొట్టి నర్సు పరిగెత్తుకొని వచ్చి చెప్పింది పోలీసులు వచ్చేస్తున్నారని. ప్రకాశం ఆశ్చర్యపోయాడు. గీత తుపాకి సవరించుకుంది. ఎలా జరిగిందో అర్థం కాలేదు. ఉరికివస్తుంటే ఫోను కనిపించింది. బయటికి వచ్చి చూస్తే ఫోను తీగలు కనిపించాయి. వాటిని తెంచలేదు. కారకురాలు సుమతి అని గ్రహించారు. రక్షణ ఏర్పాట్లలో మునిగిపోయారు.

జనం ఇళ్ళల్లో దూరారు.

ఊరు నిర్మానుష్యం అయింది.

యాదగిరి ఇల్లు తగలబడ్తూనే ఉంది.

వీధులనిండా విరిగిన సామాను పడి ఉంది.

ప్రకాశం చుట్టూ తుపాకులవాళ్ళు కూడారు.

అందరికీ ఆదేశాలిచ్చాడు ప్రకాశం.

తుపాకుల్తో నిర్దేష్టస్థానాలకు పరిగెత్తుతున్నారు.

గీత కదిలింది.

కొన్ని అడుగులు వేసింది.

ప్రకాశం నుంచొని చూచాడు.

గీత వెళ్ళిపోతూంది - తుపాకితో తూటాల్తో.

"గీతా!" పిలిచాడు ప్రకాశం.

గీత వెనక్కు తిరిగి చూచింది.

ప్రకాశం రెండడుగులు ముందుకు వేశాడు.

గీత రెండడుగులు వెనక్కు వేసింది.

ఇద్దరూ ఎదురు బదురుగా నుంచున్నారు.

"విప్లవం వర్ధిల్లాలి" పిడికిలి బిగించి అన్నాడు ప్రకాశం.

"సాయుధ విప్లవం వర్ధిల్లాలి" గట్టిగా నినాదం ఇచ్చింది గీత.

గీత ముఖంలోకి రక్తం తన్నింది. కళ్ళు కెంపుల్లా ఉన్నాయి - కాదు - నిప్పు కణికల్లా ఉన్నాయి.

చుక్కాలి కాంతిలో జ్వాలలా ఉంది గీత ముఖం.

"గీతా! నీ ముఖం అగ్నిజ్వాలలా ఉంది. అరుణ పతాకంలా ఉంది. గీతా! విప్లవం ఎంత అందమైంది!"

గీత మాట్లాళ్ళేదు.

"గీతా! నిన్ను ముద్దు పెట్టుకోవాలని ఉంది. అగ్నిజ్వాలను, అరుణపతాకాన్ని, విప్లవ సౌందర్యాన్ని ముద్దుపెట్టుకోవాలనివుంది గీతా! ప్లీజ్!"

గీత మాట్లాళ్ళేదు.

ప్రకాశం ముద్దులవర్షం కురిపించాడు.

గీత సాగిపోతూంది.

ప్రకాశం చూస్తున్నాడు. "బతికి ఉంటే మళ్ళీ....!" చేయెత్తి అన్నాడు ప్రకాశం.

"ఒక వీరుడు మరణిస్తే.

పదివేవురు ప్రభవింతురు" పాడుతూ చకచకా సాగిపోయింది గీత.

ప్రకాశం కదిలాడు.

జీపుల చప్పుడు దగ్గరయింది.

ఆగిన చప్పుడు.

లారీలు దిగిన చప్పుడు.

తుపాకులు సవరించుకున్న చప్పుడు.

వింటున్నాడు ప్రకాశం - చూస్తున్నాడు.

బూట్ల చప్పుడు - వస్తున్నారు — ఇటే.

నీడలు - కాదు - మనుషులు కనిపిస్తున్నారు — పోలీసులు—సాయుధ పోలీసులు — వస్తున్నారు — ముందుకు ఇటే.

ప్రకాశం పొజిషన్ తీసుకున్నాడు. తుపాకిలో తూటా దూర్చాడు-ప్రేల్చాడు.

తూటా సంయ్యిమని పోలీసులవైపు ఉరికింది.

పోలీసులు అడుగు ముందుకు వేయలేదు. అక్కడే నేలమీద పడిపోయారు. తుపాకులు పేల్చారు.

తూటాలు ప్రకాశంవైపు వస్తున్నాయి.

ప్రకాశం తప్పుకుంటున్నాడు - కాలుస్తున్నాడు.

సంగ్రామం జరుగుతున్నది.

ఒక్క తుపాకి ప్రకాశంది!

వందల తుపాకులు పోలీసులవి!

పోలీసుల తూటా ప్రకాశం బుజంలోంచి దూసుకుపోయింది.

ప్రకాశం బుజంలో తూటుపడింది. ఒక చేయి విరిగిపోయింది.

రక్తం ప్రవహిస్తూంది.

ప్రకాశానికి వీరభద్రం గోచరించాడు. వీరభద్రానికి చేయి విరిగింది. పోలీసులే విరిచారు. వీరభద్రం చేయి లాఠీలతో విరిగింది. తన చేయి తుపాకిగుండుతో విరిగింది. చేతులు విరచడం పోలీసుల పని. ఉద్యమాల చేతులు నరకడం ప్రభుత్వపు ఉద్యమం.

తన చేయిపోయింది. ఒక చేయిపోయింది. రక్తం ప్రవహిస్తూంది. చేయి వేలాడుతూంది. విలవిల్లాడలేదు ప్రకాశం. కన్నీరు కార్చలేదు ప్రకాశం. రక్తం చూచాడు. అతని గుండెల్లో చిచ్చురేగింది. దెబ్బతిన్న బెబ్బులిలా విజృంభించాడు. ఒంటిచేత్తో తుపాకిలో తూటాలు కూర్చాడు. కాల్చాడు. కూరుస్తున్నాడు. కాలుస్తున్నాడు!!

వస్తున్నాయి తూటాలు ముందునుంచి. ప్రక్కలనుంచి. తలవైపునుండి. ఒకటి కాదు. రెండు కాదు. వేలు. వేనకువేలు !!

ప్రకాశం పిక్కలోంచి ఒక తూటా దూసుకుపోయింది.

ప్రకాశం మూలిగాడు.

రక్తంలో తడిసి పోతున్నాడు ప్రకాశం.

పోలీసులు వలయం కట్టారు. బంధించి వేశారు.

ప్రకాశం కష్టంగా బుల్లెటు దూరుస్తున్నాడు. ట్రిగ్గర్ నొక్కుతున్నాడు.

అటు వందలు, వేల తుపాకులు.

ఇటు ఒక్క తుపాకి.

సమరం సాగుతూంది.

యుద్ధం జరుగుతూంది.

కదనం కదను తొక్కుతూంది.

ప్రకాశం బుల్లెట్లు చూసుకున్నాడు. లేవు. అయిపోయినాయి.

అటువైపు బుల్లెట్లు అయిపోలేదు. అయిపోవు. చరిత్రలో ఆ బుల్లెట్లు ఎన్నడూ అయిపోలేదు.

ప్రకాశం లేవాలనుకున్నాడు. ఉరకాలనుకున్నాడు. విజృంభించాలనుకున్నాడు. లేవలేదు. పిక్కలో బుల్లెటు ఉంది. భుజంలో బుల్లెటుంది.

భౌతికశక్తి సన్నగిల్లింది.

మానసిక శక్తి విజృంభించింది.

కష్టంగా లేచాడు నేలమీంచి. తల పైకెత్తాడు-లేచే ప్రయత్నంలో.

ఎదురుగా గుండు దూసుకువచ్చింది.

ప్రకాశం గుండెలోంచి దూసుకుపోయింది. వెన్నులోంచి వెళ్ళిపోయింది.

ప్రకాశం గుండె చిల్లిపడ్డది. రక్తం బొళబొళా కారుతూంది.

నేల నిండా రక్తం !

నేల ఎర్రగా ఉంది.

ప్రకాశం ఎర్రనేలలో పడి ఉన్నాడు.

ప్రకాశం శక్తి క్షీణిస్తున్నది.

ప్రకాశానికి ఆకాశం ఎర్రగా కనిపించింది. నేల ఎర్రగా కనిపించింది. పొలాలు ఎర్రగా కనిపించాయి. కర్మాగారాలు ఎర్రగా కనిపించాయి.

భారతదేశం ఎర్రగా కనిపించింది.

ఎరుపు! ఎరుపు!! ఎరుపు!!!

ఎరుపు ఏమిటలా విచ్చుకుంటూంది? విడిపోతూంది?

విడడంలేదు. ఎరుపులోంచి జనం వస్తున్నారు. ఆడ, మగ, పిల్లలు-కర్షకులు.

కర్షకులు-కండలు కరిగించేవారు-పంటలు పండించేవారు-తిండిలేనివారు. డొక్కలు ఎండినవారు. గుండెల మంటలవారు. అంతా వస్తున్నారు-ఆ ఎరుపులోంచే.

కార్మికులు వస్తున్నారు-కష్టం చేసేవారు-సంపద సృష్టించేవారు-దేశానికి జీవనాడులు-వారూ వస్తున్నారు. వస్తున్నారు వారు.

ఇంకా వస్తున్నారు జనం. ఎవరువారు? డాక్టర్లు, లాయర్లు, సైంటిస్టులు, గుమాస్తాలు, టీచర్లు!!

అరే! ఎంతమంది!!

వేలు, లక్షలు, కోట్లు.

ఆకాశం ఎర్రగా ఉంది!

అరుణ పతాకాలు కురిపిస్తూంది.

జండాలు పడుతున్నాయి-ఆకాశంనుంచి - ఎర్రజండాలు! ఎంత అందంగా ఉన్నాయి!

ఎక్కడ రాలుతున్నాయి అవి!

అరే. నేలరాలనివ్వడంలేదు-ఎవరూ! అంతా పట్టుకుంటున్నారు.

అందరిచేతుల్లో జండాలు!

జండాలు రెపరెప లాడుతున్నాయి!!

జనం!

కార్మికులు.

కర్షకులు.

మేధావులు.

కదిలారు.

సాగారు. సాగిపోతున్నారు.

ముందు పెద్ద జండా పట్టుకుంది గీత. పక్కనే తాను-ప్రకాశం. తన పక్కనెవరు? మంగమ్మ! మంగమ్మ చేతిలో జండా ఉంది – ఎర్రజండా. అటుపక్కనెవరు? వీరభద్రం. వీరభద్రం చేతిలోనూ అదేజండా-ఎర్రజండా.

ఎర్రజెండాలు నాలుగు.
నలుగురు మనుషులు.
వెనక జనం-లక్షలు కోట్లు!!
సాగుతూంది జన ప్రవాహం.
ఆగబోదు జన ప్రవాహం.
ఎవరు వారు? పడిపోయారు!
రామయ్య! శేషయ్య! బలరామయ్య! సరస్వతి!
ఎందుకూ వడకిపోతున్నారు!
వడకడం ఏమిటి? చచ్చిపోతున్నారు. పడిపోయారు. జనం అడుగులకింద నలిగిపోతున్నారు!
నలిగిపోతున్నారు!
చచ్చిపోతున్నారు.
"విప్లవం వర్ధిల్లాలి" బిగ్గరగా కేక పెట్టాడు ప్రకాశం.
ఆలాపన అరిగిపోయింది!
కల చెదిరిపోయింది.
తుపాకుల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి-తాను రక్తంలో పడి ఉన్నాడు. ప్రాణం లేదు తనకు. పోతూంది.
వెళ్ళిపోతూంది ప్రాణం.
"విప్లవం వర్థిల్లాలె" గట్టిగా కేక పెట్టాలనుకున్నాడు. పెట్టలేకపోయాడు.
రక్తంలో వేలు ముంచాడు. నేలమీద రాస్తున్నాడు ప్రకాశం.
"విప్లవం వర్థి ..."
చేయి పడిపోయింది!!
తల వాలిపోయింది!
నిగతాత్మకు వీడ్కోలు చెపుతున్నట్లు తుపాకులు పేలుతున్నాయి-
పేలుతున్నాయి తుపాకులు.
పేలుతుంటాయి తుపాకులు!!

సమాప్తం.

తెలంగాణా జనజీవనం, నిజాంపాలన నాటి తదనంతర రైతాంగ పోరాటం, నాటి సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక అంశాల నేపథ్యంలో దాశరధి రంగాచార్య రూపు కట్టించినట్టు మరే రచయితా చిత్రించలేదన్నది సత్యం. చారిత్రికంగా జరిగిన సామాజిక పరిణామ దశల్లో జన శ్రేణులు ఎలా స్పందించిందీ, తమ సాంస్కృతిక స్వేచ్ఛ కోసం ఎలా నిరసన తెల్పిందీ, రాజకీయ అస్తిత్వం కోసం ఎలా ఆందోళన, తిరుగుబాటు, ప్రతిఘటనలు చేసిందీ చివరకు భూమి కోసం, భుక్తి కోసం, భాష కోసం, వెట్టిచాకిరి అంతం కోసం, నిజాం పాలనను తుదముట్టించటం కోసం ఎలా సంఘటించి పోరాడిందీ దాశరధి రంగాచార్య రచనలు నేటి తరానికి కళ్ళ ముందు కదలాడేలా చేస్తాయి.

చిల్లరదేవుళ్లు మాయజలతారు, మోదుగుపూలు, జనపదం వంటి నవలలు- చరిత్ర నిర్మాతలు జనం- అన్న సత్యాన్ని వెల్లడిస్తాయి. జనం భాషలో గుండెలను పలకరిస్తూ, మెదళ్ళను పదునుబెడ్తాయి. వీరి రచనలు అనేకం ఇతర భారతీయ భాషల్లోకి వెళ్లాయి. చలన చిత్రాలుగా కూడా వచ్చాయి.

సంప్రదాయం పునాదుల మీద ఆకాశమంత ఎత్తుగా ఎదిగిన అభ్యుదయ సారస్వత గోపురం దాశరధి రంగాచార్య సాహిత్యం.

**Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd.**